# తెలుగు సాహిత్యంలో అల్లూరి సీతారామరాజు


పరిశోధన

**పేకేటి శ్రీనివాసరావు**

ఎం.ఏ., టి.పి.టి.






ఉప పర్యవేక్షణ

**ఆచార్య జర్రా అప్పారావు**

ఎం.కామ్., ఎం.ఎ., ఎం.ఫిల్., పిహెచ్.డి.

తెలుగుశాఖ

ఆంధ్ర విశ్వవిద్యాలయం

విశాఖపట్నం - 530 003

పర్యవేక్షణ

**ఆచార్య కొండపల్లి సుదర్శనరాజు**

ఎం.ఏ., ఎమ్.ఫిల్., పిహెచ్.డి.

తెలుగుశాఖ

ఆంధ్ర విశ్వవిద్యాలయం

విశాఖపట్నం - 530 003


**పిహెచ్.డి. పట్టా కోసం ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు**

**సమర్పించిన సిద్ధాంత గ్రంథం**

**ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, విశాఖపట్నం**

**2018**

# ధ్రువీకరణ పత్రం

**"తెలుగు సాహిత్యంలో అల్లూరి సీతారామరాజు"** అనే అంశంపై పేకేటి శ్రీనివాసరావు నా పర్యవేక్షణలో పరిశోధన చేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయం, తెలుగు శాఖకు పిహెచ్.డి. పట్టా కోసం సమర్పిస్తున్న సిద్ధాంత గ్రంథం. ఇది ఇంతకు ముందు ఏ ఇతర విశ్వవిద్యాలయాలకు, విద్యా సంస్థలకు సమర్పించలేదని ధ్రువీకరిస్తున్నాను.

**(ఆచార్య కొండపల్లి సుదర్శనరాజు)**

**పర్యవేక్షకులు**

# హామీపత్రం

**"తెలుగు సాహిత్యంలో అల్లూరి సీతారామరాజు"** అనే పరిశోధనను నేను స్వయం కృషితో రూపొందించానని, ~~ఈ~~ రచన ఇదివరకు ఏ ఇతర పట్టాకోసం కానీ, డిప్లమో కోసం కానీ, బిరుదులు కోసం కానీ, మరే ఇతర విశ్వవిద్యాలయాలకు, విద్యాసంస్థలకు సమర్పించలేదని మా పర్యవేక్షకుని ఆధ్వర్యంలోనే కొనసాగించానని హామీ ఇస్తున్నాను.

**(పేకేటి శ్రీనివాసరావు)**

**పరిశోధకుడు**

# విషయ సూచిక

# కృతజ్ఞతలు

పరిశోధన చేయడానికి జె.ఆర్.ఎఫ్. ఫెలోషిఫ్ ఇచ్చిన యు.జి.సి. వారికి, ప్రవేశం కల్పించిన ఆంధ్రవిశ్వవిద్యాలయం యాజమాన్యానికి–

నాకు జన్మనిచ్చి, అనకాపల్లి వీధి బడి నుండి ఆంధ్రవిశ్వవిద్యాలయంలో పరిశోధకుని స్థాయికి వరకు, విద్యాబుద్ధులు చెప్పించిన తల్లిదండ్రులు శ్రీపేకేటి ప్రకాశరావు (లేటు), శ్రీమతి మహాలక్ష్మి గారలకు–

పరిశోధనలో చేరిన నాటి నుండి పర్యవేక్షణ బాధ్యతలు వహించి, పరిశోధనాంశం మొదలుకొని సిద్ధాంత గ్రంథం పూర్తయ్యేవరకూ తన విలువైన సూచనల్ని, సలహాల్ని ఇవ్వడమే గాక, నా కృషికి చక్కటి, సంపూర్ణ రూపాన్నందించిన నా గురువర్యులు ఆచార్య కొండపల్లి సుదర్శనరాజు గారికి–

తెలుగుశాఖ అధ్యక్షులు ఆచార్య జర్రా అప్పారావు గార్కి, బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్ ఆచార్య మద్దులపల్లి దత్తాత్రేయ శాస్త్రి గారికి, ఆచార్య గజ్జా యోహాన్‌బాబు గారికి, ఆచార్య సజ్జా మోహన్‌రావుగారికి, ఆచార్య మర్రిబోయిన జయదేవ్ గారికి బహుగ్రంథ కర్త ఆచార్య వెలమల సిమ్మన్నగారలకు–

వివాహం అయినా సరే విద్యను కొనసాగించమని, కుటుంబ బాధ్యతల్ని నిర్వహిస్తూ నా విద్యాభివృద్ధికి తోడ్పడిన నా సహధర్మచారిని శ్రీమతి తులసి పద్మాపతికి, పనికి అల్లరితో ఆటంకం కలిగించకుండా సహకరించిన మా గారాల పట్టీలు జాహ్నవి, మృధుల, హరిప్రియలకు–

ఎల్లప్పుడు నా ఉన్నతిని కోరుకునే నాతోబుట్టువు కొణతాల జ్యోతి అన్నపూర్ణ, బావ కొణతాల వెంకటరావు, బావమరిది కుదిరెళ్ల శ్రీనివాసరావు గారలకు–

నా అభివృద్ధిని కాంక్షించిన క్రీ॥శే॥ బొడ్డేడ అప్పలస్వామి నాయుడు, శ్రీమతి భాగ్యలక్ష్మి గారికి, కొణతాల రఘునాధ్ శ్రీమతి రజని గారికి, డా॥ బుద్ధ అప్పారావు, శ్రీమతి అన్నపూర్ణ గారలకు–

పరిశోధన పట్ల శ్రద్ధ కలిగించిన పెంటకోట ప్రభాకరరావు, క్రీ॥శే॥ కాంద్రేగుల జోజిబాబు, బుద్ధ బలరామ్‌నాయుడు గారలకు–

పరిశోధన చేస్తున్న సమయంలో తన సొంత బిడ్డలా ఆదరించి సకాలంలో పూర్తి చేయడానికి సహకరించిన శ్రీమతి కొండపల్లి శ్యామలదేవి గారికి, చెల్లెల్లు అక్షరీ, సుహిత, జెస్సీలకు–

నాకంటే చిన్నవారైనప్పటికి పెద్ద మనసుతో పుస్తకాల సేకరణలో, డి.టి.పి.లో అమూల్యమైన సలహాలతో, అండదండగా ఉన్న నా తమ్ముడు పోలినాటి బాలకృష్ణ, శ్రీమతి భాగ్యలత గారలకు–

పరిశోధనలో సహకరించిన మిత్రులు డా॥ మోకా ప్రతాప్, విప్పర్తి సురేష్, దబ్బాడ కన్నంనాయుడు, డి. లక్ష్మణరావు, కొండమూది అనిల్ కుమార్ గారలకు–

విషయ సేకరణకు ఉపకరించిన డాక్టర్ వి.యస్. కృష్ణా లైబ్రరి, ఆంధ్ర యూనివర్సిటీ వారికి, వేటపాలెం లైబ్రరి వారికి, గుంటూరు స్టేట్ లైబ్రరీ వారికి, ఏసి కళాశాల లైబ్రరీ– గుంటూరు వారికి, శారదా గ్రంథాలయం, గౌరి గ్రంథాలయం అనకాపల్లి వారికి –

ఈ సిద్ధాంత గ్రంధాన్ని సర్వాంగ సుందరంగా పేజి మేకప్ చేసి పెట్టిన నాయుడు డి.టి.పి., మద్దిలపాలెం గారికి–

ఇంకా ప్రత్యేక్షంగా, పరోక్షంగా, సహాయసహకారాలందించిన యావన్మందికి–

కృతజ్ఞతలు...

**(పేకేటి శ్రీనివాసరావు)**

# ముందుమాట

పరిశోధనలో ప్రవేశించాక నాకెంతో ఇష్టమైన అల్లూరి సీతారామరాజుపై పరిశోధన చేయాలని ఉందని నా పర్యవేక్షకులు ఆచార్య కొండపల్లి సుదర్శనరాజు గారికి విన్నవించాను. తెలుగు సాహిత్యంలో దాదాపు అన్ని కోణాల్లో రామరాజు చరిత్ర ఉందని తెలిపారు. అందుకు తెలుగు సాహిత్యంలో అల్లూరి సీతారామరాజు అనే అంశాన్ని నా పరిశోధనాంశంగా ఎంచుకోమన్నారు.

ఆంధ్రుల పౌరుష పరాక్రమాలకు ప్రతీక అల్లూరి సీతారామరాజు. అఖండ భారత జాతి వీర, శౌర్య, సాహస, గాంభీర్యములు రాశీభూతమై నెలకొన్న మహావీరుడు. సామాన్యమైన జీవితాన్ని అలవరుచుకొని ఆధ్యాత్మిక మార్గాన్ని నమ్ముకొని, యోగిగా జీవితాన్ని ప్రారంభించాడు. మహాజ్ఞానిగా, వైద్యుడిగా, సేవకుడిగా, సంఘసంస్కర్తగా, స్వాతంత్ర్యయోధుడుగా, ఉద్యమనాయకుడుగా, విప్లవసాధకుడిగా ఈయన జీవితం నేటి యువతకు ఆదర్శం. ఒక వ్యక్తిలో ఇన్ని లక్షణాలు ఉంటడం అరుదు. అలాంటి అరుదైన వారిలో ఒక వజ్రంలాంటి వారు అల్లూరి. అలాంటి వీరుడు ఈ భారతభూమిలో పుట్టడం, ఈ తెలుగు నేలపై పుట్టటంతో, తెలుగు ప్రజల ఖ్యాతి ప్రపంచమంతా వ్యాపించింది.

సీతారామరాజు చరిత్ర ఒక తెలుగు వీర గాథ. ఒక భారత స్వాతంత్ర్య సమరవీరుడి పోరాట కథ. అటువంటి వీరుడిపై సాహిత్య రూపాల్లో అనేక ప్రక్రియలు వెలువడ్డాయి. స్వాతంత్ర్య భావ చైతన్యము ఆంధ్ర జాతికే కాదు, అఖిల భారత జాతికి ఆదర్శప్రాయము, మార్గదర్శకము.

ఉత్తరభారతదేశంలో విప్లవ బాటలో భగత్‌సింగ్, రాజగురువులాంటి క్రాంతికారులు విజృంభించి, ఆంగ్ల ప్రభుత్వంపై మెరుపుదాడులు సాగించి నిద్రపట్టకుండా చేశారు. అదేవిధంగా దక్షిణ భారతదేశంలో జరిగిన విప్లవ పోరాటాల్లో మన్యం పితూరి 2 సంవత్సరాల్లో బ్రిటిష్ సైన్యానికి నిద్రలేకుండా చేశారు రామరాజు.

తెల్లవారి గుండెల్లో నిదురించి వలసవాద శక్తుల్ని గడగడ లాడించిన మహాఘనుడు. మన్యం ప్రాంతంలో పీడిత ప్రజల పక్షాన నిలిచి వారి విముక్తికై పెద్ద యుద్ధాన్ని నడిపిన ప్రజాయోధుడు.

ఆయన జీవితం, పోరాటం, పీడిత మానవాళికి నిరంతరం అత్యంత స్ఫూర్తిదాయకం. నవతరానికి అట్టి స్ఫూర్తి నిచ్చేందుకు తోడ్పడుతుందని అల్లూరిపై రచనలు చేసిన రచయితల నమ్మకం. బహుముఖమైన ప్రతిభాపాటవాలు, ఇంతటి ఘన చరిత్ర కలిగిన అల్లూరి వారిపై దాదాపు అన్ని ప్రక్రియల్లో విస్తృతమైన, విలక్షణమైన రచనా వ్యాసంగం జరిగింది. దీన్ని సమగ్రంగా పరిశీలించడం నా సిద్ధాంత గ్రంథ రచనా సదుద్దేశ్యం. ప్రధానంగా జీవిత చరిత్రలు, కవిత్వం, నాటకాలు, నవలలు, బుర్రకథలు, వ్యాసాలు, సినిమాలాంటి అంశాల్లో సీతారామరాజును అక్షరీకరించిన తీరుతెన్నుల్ని ఒక క్రమపద్ధతిలో విశ్లేషించాను.

నా పరిశోధనాంశాన్ని పరిశీలనా సౌలభ్యం కోసం ఏడు అధ్యాయాలుగా విభజించి విశ్లేషించాను.

| | |
|---|---|
| ఒకటో అధ్యాయం | జీవిత చరిత్ర – సమగ్ర పరిచయం |
| రెండో అధ్యాయం | కవిత్వం – పరిశీలన |
| మూడో అధ్యాయం | నాటకాలు – విశ్లేషణ |
| నాలుగో అధ్యాయం | నవలలు – అనుశీలన |
| ఐదో అధ్యాయం | బుర్ర కథలు – సంవీక్షణ |
| ఆరో అధ్యాయం | వ్యాసాలు – సమీక్ష |
| ఏడో అధ్యాయం | సినిమా – సంగ్రహ పరిచయం |

ఒకటో అధ్యాయంలో జీవిత చరిత్రల్ని సాహిత్యంలో నిక్షిప్తం చేయడమనేది అనాదిగా ప్రపంచవ్యాప్తంగా కనిపిస్తుంది. ఆదిమకాలం నుండి ఈ ధోరణి జానపద సాహిత్యంలో తొలుత వెలువడింది. నాయకులు, రాజులు, వీరులు, దేవుళ్ళ చరిత్రల్ని ఆయా కాలాల్లో చిత్రిస్తూ వచ్చారు. తెలుగులో అన్ని కవితోద్యమాల నేపథ్యంగా ప్రముఖుల్ని స్తుతించడం, స్మృత్యాంజలి ఘటించడం వారి జీవితాల్లో ఔన్నత్యాన్ని పేర్కొనడం జరిగింది. అలాగే అల్లూరి మహోన్నతమైన వ్యక్తిత్వాన్ని, జీవితాన్ని చిత్రీకరిస్తూ భుక్య చినవెంకటేశ్వర్లు, దంతులూరి వెంకట రామరాజు, కె. రాజ్యలక్ష్మి, పొన్నలూరి రాధాకృష్ణ, ఏడిద కామేశ్వరరావు లాంటి అనేమంది రచయితలు అల్లూరి జీవిత చరిత్రలు రాశారు. వాటిని ఒకటో అధ్యాయంలో విశ్లేషించాను.

రెండో అధ్యాయంలో తెలుగు సాహిత్యం ప్రారంభం నుండి నేటి వరకు అగ్రతాంబూలం కవిత్వానిదే. అందుకే చారిత్రకాంశాలైన దైవ సంబంధిత విషయాలకైనా, తాత్త్విక, మనస్తత్వ, సామాజిక లాంటి సమస్త విషయాలపై తొలుత జరిగింది కావ్యరచనే. అలాగే అల్లూరి సీతారామరాజు జీవిత ఆలంభనగా కావ్య రచన జరిగింది. ఈ రెండో అధ్యాయంలో వీరిపై వచ్చిన బండ్ల సుబ్రహ్మణ్యం, బూదరాజు రాధాకృష్ణ, కాకర్లపూడి వెంకటరాజు, మల్లెల గురవయ్య, గుర్రం ధర్మోజీరావు లాంటి వారు వ్రాసిన కావ్యాలని, ఆయా రచయితల పద్యరచన ప్రావీణ్యాన్ని, కావ్యరచనవైశిష్ట్యాన్ని, సోదాహరణంగా తెలియజేసాను. అలాగే అల్లూరి భావజాలం వర్తమాన సమాజానికి అత్యంత అవసరం. సులభశైలిలో, నూతన ఒరవడిలో వచ్చిన కవిత్వానికి సాహితీ లోకంలో ఆదరణ ఎక్కువగా ఉంది. అభ్యుదయ, దిగంబర, విప్లవ, స్త్రీవాద, దళితవాద, మైనార్టీ వాదాల్లాంటి ఉద్యమాల్లో వచన కవిత్వం అత్యుత్తమ వాహిక. అందుకే అల్లూరి విప్లవ భావాల్ని వచన కవిత్వ రూపంలో అనేక మంది రచనలు చేసారు. వారిలో కుందుర్తి ఆంజనేయులు, ముదివేడు ప్రభాకర్‌రావు, అద్దేపల్లి రామ్మోహనరావు లాంటి వారి రచనల్ని కూడా ఈ అధ్యాయంలో ప్రస్తుతించాను.

మూడో అధ్యాయంలో సాహిత్యంలో నాటక ప్రక్రియకు అత్యంత ప్రాధాన్యం ఉంది. కారణం ఇది సమాహారకళ కావడం, పండిత పామరులకు సైతం సులభంగా అర్థమయ్యే రీతిలో ఉండటమే. సమాజానికి ఉపకరించే భావజాలాన్ని సామాన్యులకు అందిస్తుంది. కాబట్టి అల్లూరి జీవిత నేపథ్యంగా రూపక రచన విస్తారంగా జరిగింది నాటిక ఏకాంకికలు ఎక్కువ భాగం అముద్రితంగా ఉండిపోయాయి. ప్రాచుర్యం పొందిన నాటకాల్లో ఖండవల్లి రాజారావు, పడాల రామారావుల నాటకాల్ని గూర్చి ఈ అధ్యాయంలో పేర్కొన్నాను.

నాలుగో అధ్యాయంలో ఆధునిక సాహిత్యంలో నవల ప్రక్రియలకున్న ప్రాధాన్యం వర్తమాన సమాజంలో ఎంతో పెరుగుతూ వస్తుంది. ఈ క్రమంలో అల్లూరి జీవితాన్ని నవలలుగా కూడా తీర్చిదిద్దడం కనిపిస్తుంది. వీరిపై వచ్చిన పడాల రామారావు, గోపరాజు నారాయణరావు వంటి వారి నవలల్ని, ఆయా నవలల్లో ఒదిగిపోయిన రామరాజులోని జాతీయోద్యమ భావజాలాన్ని వివరించిన విధానాన్ని ఈ అధ్యాయంలో తెలియపరిచాను.

ఐదో అధ్యాయంలో బుర్రకథ ప్రక్రియ కూడా సమాహార కళగానే ప్రాచుర్యం పొందింది. పౌరాణికం, జానపదం, చారిత్రకం, సాంఘీకం, విప్లవం, అభ్యుదయంలాంటి అన్ని అంశాలకు ఇది అనువైన ప్రక్రియ. అందుకే అల్లూరి వారి జీవితం బుర్రకథల రూపంలో కూడా ప్రాచుర్యం పొంది ప్రజాధారణకు పాత్రమైంది. వీరిపై వచ్చిన సుంకర సత్యనారాయణ, పడాల రామారావు, షేక్ నాజర్, బి.వి.ఎస్. శాస్త్రి లాంటి వారు రాసిన బుర్రకథల్ని ఈ అధ్యాయంలో పరిశీలించాను.

ఆరో అధ్యాయంలో వ్యాస ప్రక్రియ ఒక భావజాలాన్ని సంగ్రహంగా అందించడానికి మిక్కిలి ఉపకరిస్తుంది. అందుకే ఆధునిక సాహిత్యంలో వ్యాసానికి సముచిత స్థానం ఉంది. తెలుగు సాహిత్యాన్నే కాక భారతీయ సాహిత్యాల్లో ఎంతగానో ప్రభావితం చేసిన వ్యక్తుల్లో గాంధీ, అంబేద్కర్, మార్క్స్ లాంటి వారి వర్ధంతులకు, జయంతులకు ఎన్నో వ్యాసాలు వివిధ పత్రికల్లో వస్తూ వుంటాయి. అలాగే జాతీయోద్యమంలో ప్రముఖుడైన అల్లూరి సీతారామరాజుపై కూడా ఆయా సంధర్భాల్లో లెక్కకు మించి వ్యాసాలు వచ్చాయి. అయితే వాటిలో ప్రధానమైన వ్యాసాల్ని పత్రికా వ్యాసాల్ని, శతజయంతి సంచిక వ్యాసాల్ని, పీఠికా వ్యాసాల్ని, పరిశోధన వ్యాసాల్ని ఈ అధ్యాయంలో సమీక్షించాను.

ఆఖరిదైన ఏడో అధ్యాయంలో ఆధునిక కాలంలో సినిమా మాధ్యమనేది అత్యంత శక్తివంతమైంది. ప్రజలపై దీని ప్రభావం ఎక్కువగా ఉంటుంది. అల్లూరి ప్రభావం సమాజానికి అవసరంగా భావించి సినిమాను నిర్మించారు. ఇంకా అనేక సినిమాల్లో, పాటల్లో, సన్నివేశాల్లో ప్రస్తావించి ప్రశంసించడం కనిపిస్తుంది. అలాగే యు. వినాయకరావు రాసిన అల్లూరి సీతారామరాజు అనే సినిమా చరిత్రను, ఆనాటిఆనవాళ్ళు పున్నగం చిన్ననారాయణరావు రాసిన 75 ఏళ్ళ సినిమా చరిత్రకు సంబంధించిన అంశాల్ని ఇందులో పొందుపర్చాను.

**(పేకేటి శ్రీనివాసరావు)**

**పరిశోధకుడు**

## ఒకటో అధ్యాయం

# జీవిత చరిత్ర – సమగ్ర పరిచయం



# 1) జీవిత చరిత్రలు - సమగ్ర పరిచయం

**1.0:**

జీవిత చరిత్రల్ని సాహిత్యంలో నిక్షిప్తం చేయడమనేది అనాదిగా ప్రపంచవ్యాప్తంగా కనిపిస్తుంది. ఆదిమకాలం నుండి ఈ ధోరణి జానపద సాహిత్యంలో తొలుత వెలువడింది. నాయకులు, రాజులు, వీరులు, దేవుళ్ళ చరిత్రల్ని ఆయా కాలాల్లో చిత్రిస్తూ వచ్చారు. తెలుగులో అన్ని కవితోద్యమాల నేపథ్యంగా ప్రముఖుల్ని స్తుతించడం, స్మృత్యాంజలి ఘటించడం వారి జీవితాల్లో ఔన్నత్యాన్ని పేర్కొనడం జరిగింది. అలాగే అల్లూరి మహోన్నతమైన వ్యక్తిత్వాన్ని, జీవితాన్ని చిత్రీకరిస్తూ భుక్య చినవెంకటేశ్వర్లు, దంతులూరి వెంకట రామరాజు, కె. రాజ్యలక్ష్మి, పొన్నలూరి రాధాకృష్ణ, ఏడిద కామేశ్వరరావు లాంటి అనేకమంది రచయితలు అల్లూరి జీవిత చరిత్రలు రాశారు. వాటిని ఒకటో అధ్యాయంలో విశ్లేషించాను.

## 1.1 భుక్య చినవెంకటేశ్వర్లు:

"మన్యంవీరుడు విప్లవజ్యోతి అల్లూరి సీతారామరాజు" చరిత్రను భూక్యా చినవెంకటేశ్వర్లు రాశారు. 120 పుట గల ఈ చరిత్రలో రామరాజు సమస్త జీవితాన్ని, విప్లవ లక్ష్యాన్ని వివరించారు. దాని ప్రథమ ముద్రణ 1997 నవంబరులో ముద్రించబడింది.

### 1.1.1 మన్యం పోరాటం గత చరిత్ర - గిరిజన ఉద్యమాలు:

బ్రిటిష్ వలస పాలనా విధానం చాలా నిరంకుశంగా వుండేది. ముఖ్యంగా అమాయక గిరిజనులపై స్థానిక అధికార్లు ప్రతి క్షణం దౌర్జన్యం చేయడమే కాకుండా కష్టపడి శ్రమించి పండించిన పంటనూ పశు, పక్షి సంపదను దోచుకోవటమే కాకుండా, వాళ్ళ స్త్రీలను సైతం తమ వాంఛలకు బలి చేస్తూండేవాళ్ళు. ఏజన్సీ ప్రాంతాల్లో రోడ్లు వేసే నెపంతో వాళ్ళకు కనీస కూలి కూడా ఇవ్వకుండా, కూలీ డబ్బులు అడిగితే చావబాదేవాళ్ళు.

ఈ నిరంకుశ పాలనా విధానాన్ని ఎదర్కోవటానికి స్వాతంత్ర్యం వచ్చే నాటికి నూటయాభై సంవత్సరాల ముందు నుండే అనేక కొండ ప్రాంతాల్లో కొండజాతులు తిరుగుబాట్లు చేశాయి. అయితే అల్లూరి శ్రీరామరాజు చేసిన విప్లవ పోరాటానికి గతంలో

వాళ్ళు చేసిన తిరుగుబాట్లకు చాలా తేడా ఉంది. అయినా గత పోరాటాల చరిత్ర అధ్యయనం చేయడం ఏ విప్లవవీరుడుకైనా చాలా అవసరం అని రచయిత భావించాడు.

### 1.1.2 గిరిజన సంస్కృతి:

నాగరిక ప్రపంచానికి చాలా దూరంగా వుంటూ, అడవి తల్లిని నమ్ముకున్న అనేక గిరిజన జాతులు తమదైన ప్రత్యేక జీవన విధానంతో బ్రతుకులు వెళ్ళదీస్తున్నాయి. కోయ, చెంచు, గోండు, సవర, జాతాపు, రెల్లి, బంజారా మొదలైన తెగలు ఎప్పుడు స్వతంత్ర జీవనాన్ని కోరుకుంటాయి. వాళ్ళ ఆచారాలు సంస్కృతి. సంఘ కట్టుబాట్లలో ఓ ప్రత్యేకత కనిపిస్తుంది.

ఉదయం, సాయంత్ర వేళల్లో గూడల్లో ఎండిపోయిన చెట్టు బోదెపై వెదురు కర్రలతో కొడుతూ ప్రత్యేక శబ్ధాన్ని సృష్టిస్తారు. వాళ్ళ ఆశబ్ధ తరంగాల్లో మనకు వినిపించే పాటను అర్థం చేసుకుంటే వాళ్ళల్లో స్వాతంత్ర్య కాంక్ష ఎంత బలంగా వుంటుందో ఆశ్చర్యం కలుగక మానదు.

"చెట్టులన్నీ మావే... గుట్టలన్నీ మావే
కొండలన్నీ మావే.. కోనలన్ని మావే
అడవి తల్లి కన్నబిడ్డలం.... స్వాతంత్ర్య జీవులం
సూరీడు... చందురూడు మాకన్నులు

అగ్ని దేవుడ్ని ఆరాధిస్తాం....
వాన దేవుడ్ని కాలుస్తాం...
సమ్మక్క... సారక్క... యల్లక్క... యాదమ్మ...
కొండజాతి దైవాలు... మా కన్న తల్లులు

జాతరలే చేస్తాం... దైవాన్ని కొలుస్తాం
స్వాతంత్ర్యం మా జన్మహక్కు
అందుకోసం అలుగులు (బాణాలు) అందుకొని
పోరాడతాం – కొండ కోనల వాసులం
అడవి తల్లి బిడ్డలం
కొండలన్నీ మావే... కోలవలన్నీ మావే..."[1]

1840 ప్రాంతంలో అనగా 19వ శతాబ్ధం ప్రారంభంలో మన్యం ప్రాంతంలో జరిగిన రంప పితూరిలో "ఆనాడు ఏజన్సీలో మున్సబుదారును రాజుగా పిలిచేవారు. దానికి కారణం ఆ ప్రాంతం అతని హక్కు భుక్తములో నుండటయే. అయితే 1935లో మున్సబుదారు మరణించినప్పుడు ఆయనకు ఒక్క కూతురు మాత్రమే వున్నది. ఆమెతో బాటు వారసుడుగా గుర్తింపు లేని పెంపుడు కొడుకు కూడా వున్నాడు. ఆ ఇద్దరకూ ఆంగ్లేయ ప్రభుత్వం దుక్తికి ఏర్పాట్లు చేసింది. 1840లో ఆ ఎస్టేటు (ఏజన్సీ ప్రాంతం)ను కోర్టు ఆఫ్ వార్డ్సు ఆధీనంలో పెట్టింది. ఆ తర్వాత కూడా చాలా చోట్ల పెత్తందారీలకు వ్యతిరేకంగా పితూరీలు తేబడ్డాయి. తిరుగుబాట్లను 1845 సం॥లో అణచి వేయబడ్డాయి. అనేకమంది ముతాదార్లు నిర్బందించబడ్డారు. 1848లో జమీందారిణి ఆ గ్రామాల (ఎస్టేటు)పై తను హక్కుదారు కావడంతో ఆమెకు వరసకు తమ్ముడైన వ్యక్తికి ఆంగ్లేయ ప్రభుత్వము అధికారము అప్పగించడం జరిగింది."[2] అని రచయిత వివరించారు.

1847 సిపాయిల తిరుగుబాటుకు ముందే కలకత్తాలోను, ఆంధ్ర ప్రాంతంలోను గిరిజనులు వలసవాద పాలకులపై వాళ్ళ తాబేదార్లపై అనేక తిరుగుబాట్లు జరిగాయి. ఈ తిరుగుబాట్లన్నీ బ్రిటీష్ ప్రభుత్వం రికార్డు చేయడం జరిగింది.

అదే విధంగా 1845-48 గొలుగొండ పితూరి విప్లవం గురించి చెబుతూ "విశాఖ మండలంలో నన్ను గొలుగొండ జమీందారు ఆంగ్లేయ ప్రభుత్వానికి కప్పము బకాయి పడినందులకు ఆ జమీందారీని ఆంగ్లేయులు తమ ఆదీనంలోకి తీసుకొని దానిపై అజమాయిషికి ఒక అమీనాను నియమించడం జరిగింది. ఈ చర్యను ఏజన్సీ ప్రాంతంలో గల ముతదారులు వ్యతిరేకించి 19 సంల వయస్సు గల జమీందారు కుమారుడు చిన్న భూపతికి పట్టంగట్టి, ఆ తర్వాత ఆంగ్లేయ ప్రభుత్వాలపై తిరుగుబాటు ప్రకటించి దాదాపు మూడు సంత్సరముల పైగా బ్రిటీష్ సైనికులతో గెరిల్లా యుద్ధం చేయడం జరిగింది. ఈ యుద్ధంతో బ్రిటీష్ ప్రభుత్వం ఆందోళన చెంది, తిరుగుబాటు దారులను క్షమిస్తామని, చిన్న భూపతిని జమీందారుగా గుర్తిస్తామని రాజీకి వచ్చిన తరువాతనే ఆ పితూరి సద్దుమణిగింది."[3] అని అంటూ గొలుగొండ పితూరిని గూర్చి జరిగిన కోణాన్ని చక్కగా వర్ణించారు.

1849-1860లో జయపూర్ రాజు తన దివాణంలో ఉన్న గిరిజన తెగలపై అతి నిరంకుశంగా ప్రవర్తిస్తారు. ఆయన చర్యలను ఈసడించుకున్న గిరిజనుల్లో ఒక వర్గం తిరుగుబాటు చేసి ఆయన పెద్ద కుమారుడ్ని తమ ప్రతినిధిగా ప్రకటిస్తారు. జయపూర్

రాజు కొన్నాళ్ళు ఆంగ్లేయుల సహాయం పొంది కూడా విజయం సాధించలేక, తిరుగుబాటుదార్లతో రాజీ పడి తన పెద్ద కుమారుని రాజుగా ప్రకటించడంతో ఆ తిరుగుబాటు ఆగిపోతుంది.

అలాగే 1853 సం॥ మార్చి నుండి నవంబర్ వరకు దాదాపు 9 మాసాల పాటు పర్లాకిమిడి సమీపంలో అనేక ప్రాంతాలను సవరాలు తమ ఆధీనంలోకి తెచ్చుకుంటారు. ఆ సమయంలో జరిగిన తిరుగుబాటును సవరుల తిరుగుబాటు అనేవారు.

"ఈ విప్లవం కేవలం విల్లు అంబులతో గెరిల్లా యుద్ధం చేయడం విశేషం పర్లాకిమిడికి చెందిన జమీందారిణీ పట్ట మహాదేవి బిస్సాయిల బ్రిటీష్ పాలకుల చర్యల పట్ల అసంతృప్తి చెంది సవరలను తిరుగుబాటుకు ప్రోత్సహించారని బ్రిటీష్ దొరల అనుమానం. ఈ అనుమానంతోనే ఆంగ్లేయ సైన్యం సవర గ్రామాలలపై దాడి చేసి తగులబెట్టి పంట చేలను ధ్వంసం చేసి, పశుసంపదను దోపిడి చేసి, ఆడవారిని అవమానపరచి నానా బీభత్సం చేశారు. అయితే సవరలు తమ శాయశక్తులా పోరాటం చేసి చివరకు తమ ఓటమిని అంగీకరించడంతో ఆ తిరుగుబాటు అణిగిపోయింది"[4] అని నాటి చారిత్రక సంఘటల్ని వెల్లడించారు.

1857-58 మొదటి గొలుగొండ పితూరి భారతదేశములో జరిగిన సిపాయిల తిరుగుబాటును ప్రథమ సైన్య తిరుగుబాటుగానే కాక, స్వాతంత్ర్యోద్యమానికి అది పట్టుగొమ్మ అనడం మనకు తెలుసు సరిగ్గా అదే సమయంలో గోలుగొండ జమీందారి వారసుడిగా చిన్నభూపతికి పట్టం గట్టెందుకు తిరుగుబాటు జరుగుతుంది. దాని తర్వాత చిన్న భూపతి సోదరుడు సన్యాసి భూపతి తన సోదరునిపై తిరుగుబాటు ప్రకటించి కొంతమంది గోండుల సహాయంతో చిన్న భూపతిపైన, ఆంగ్లేయ ప్రభుత్వంపైన పోరాటం సాగిస్తాడు.

అయితే సరియైన నాయకత్వం లేక తిరుగుబాటు దారులందరు ఐక్యపరచలేక ఆ పోరాటం వెనుకంజ వేసే సమయాన్ని అసరాగా తీసుకున్న కెప్టెన్ ఓవెన్ అనే ఆంగ్లేయుడు తన సైన్యంతో ఆ విప్లవ పోరాటాన్ని నిరంకుశంగా అణచి వేసాడని రచయిత వెల్లడించారు.

స్వేచ్ఛ, స్వాతంత్ర్యాల కోసం జరుగుతున్న పోరాటంలో భాగంగా 1858 సం॥లో ఎర్నగూడెంకు ఉత్తర దిశలోవున్న పర్వత ప్రాంతంలో జరిగిన ఈ తిరుగుబాటునకు 1857 సం॥లో జరిగిన సిపాయిల తిరుగుబాటునకు పరోక్షంగా కొంత సంబంధముంది. కౌరవ-పాండవుల మధ్య యుద్ధానికి ద్రౌపది, రామరావణ యుద్ధానికి సీత, హెలెన్

వలన ట్రాయ్ యుద్ధం జరిగినట్లే ఒక స్త్రీ మూలంగా ఈ తిరుగుబాటు జరిగిందని ప్రతీతి.

అయితే ఈ పోరాటానికి నాయకత్వం వహించిన సుబ్బారెడ్డి ఖచ్చితంగా ఇది ఆంగ్లేయ ప్రభుత్వంపై చేస్తోన్న తిరుగుబాటని ప్రకటిస్తాడు.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా నానాసాహెబ్ అజేయమైన తన సైన్యంతో పోరాడడం వల్ల తాము కూడా ఆంగ్లేయ సైన్యాన్ని ఎక్కడికక్కడ ఎదరించి, వాళ్ళను చికాకు పెట్టిన అనంతరం ఈ దేశాన్ని అతి త్వరగా ఆంగ్లేయులు విడిచిపెట్టగలరనే అభిప్రాయానికి వస్తాడు.

అయితే ఆధునిక ఆయుధాలు, మరఫిరంగులు గల ఆంగ్లేయ సైన్యం ముందు సుబ్బారెడ్డి సైన్యం విలువలేదు. తెల్లదొరలు సుబ్బారెడ్డితో పాటు మరో ఏడుగురు విప్లవ నాయకులను పట్టుకొని దారుణంగా హింసించే వరకు రాజ ద్రోహనేరం మోపి ఉరి తీసారు.

రంప పితూరి విప్లవంలాగానే తమ హక్కుల కోసం పోరాటంలో భాగంగా 1865లో గోండుల తిరుగుబాటు కూడా జరుగుతుంది. ఇది 1857-58 తిరుగుబాటు, 1845-48 తిరుగుబాటుకు పూర్తిగా భిన్నమైంది. ఈ రెండు రాజకీయాలతో ముడిపడితే ఈ (1865) తిరుగుబాటు హక్కుల కోసం జరిపిన పోరాటంగా మనం భావించవలసి ఉంటుంది. ఏజన్సీ ప్రాంతం అంతా రోడ్లు వేయడానికి గోండులను కూలీలుగా నియమించిన ఆంగ్లేయులు వారికి సరైన కూలీ ఇవ్వకుండా నానా ఇబ్బందులు పెడుతూ, వాళ్ల స్త్రీలను చెరపట్టి వాళ్ళను అవమానాల పాలు చేయటం సర్వసామాన్యమై పోతుంది.

"గంజాం ప్రాంత ఏజన్సీలో రోడ్డు వేయుటకు గోండులను కూలీలుగా పెట్టి పని చేయిస్తున్న పాత్రోలు అనే ఓడ్రడు వాళ్ళపై చాలా దురుసుగా ప్రవర్తించడం. సహించలేని గోండులు రోడ్డు పనికి వెళ్ళటం మానుకున్నారు. ఇది సహించలేని పాత్రోలు వాళ్ళను తన్ని పనికి తీసుకురమ్మని ఇద్దరు సహించలేని గోండులు ఆ ఇద్దర్నీ చంపివేశారు. ఇది విప్లవానికి సంకేతంగా భావించి, మిగిలిన గోండులు, తెల్లవాళ్ళ అడుగులకు మడుగులొత్తుతున్న ఓడ్రలను తమ ప్రాంతముల నుండి పారద్రోలుటకు వారి గ్రామాలను తగులబెట్టడం, ఇళ్ళను దోచుకోవడం, తమపై తిరగబడ్డ వారిని చంపడం జరిగింది."[5] అని నాటి దారుణ విషయాల్ని రచయిత అక్షరీకరించారు.

ఈ తిరుగుబాటు సుభమగిరి, మహాసింగి, కలహండి ముఠా ప్రాంతాలకే పరిమితమౌతుంది. డీద్రులు సైతం గోంద్రుల గ్రామాలపై దాడి చేసి వాళ్ళను చిత్రవధ చెయ్యసాగారు. పరస్పర కలహాలతో గంజాం ప్రాంతం అతలాకుతలమవుతుంది. గోండుల తిరుగుబాటుతో ఆంగ్లేయులు ఒక పోలీసు పటాలాన్ని 'కురిపుంజి'కి పంపించి గోండులపై కాల్పులు జరిపి, వాళ్ళ నాయకులందర్నీ ఖైదు చేస్తారు. దాదాపు రెండు మాసాలు జరిగిన గోండుల తిరుగుబాటు ఎన్నో ప్రాణాల్ని బలిగొన్నా ముగియలేదు. అయితే ఈ తిరుగుబాటుతో ఆంగ్లేయ ప్రభుత్వం ఆనాటి నుండి కూలీల పట్ల జాగ్రత్త వహించిందని రచయిత పేర్కొన్నారు.

1840లో జరిగిన రంప పితూరిని మరువక ముందే 1879లో రెండవ రంప పితూరి జరుగుతూ. ఎనిమిది సంవత్సరాల ఆందోళన తర్వాత 1848 సం॥లో గోదావరి జిల్లాలో గల రంప జమీందారులు తమ ప్రతినిధిగా అంగీకరించిన మున్సబుదారు అతికొద్ది సమయంలోనే ఏజన్సీ ప్రాంత వాసుల్ని నానాయాతనల పాల్జేయటమే కాకుండా జమీందారుల్ని తలదన్నినట్లు నిరంకుశంగా ప్రవర్తిస్తాడు.

ఏజన్సీ ప్రజల అమాయకత్వాన్ని పిరికితనంగా భావించిన మున్సబుదారు తన మాటకు అడ్డు చెప్పిన వాళ్ళను చిత్ర హింసల పాల్జేసేవాడు. అతడి దుష్చర్యలు భరించలేని ఏజన్సీ ప్రజలు వరుసగా 1858, 1861, 1862 సం॥లలో తమ అసంతృప్తిని చిన్న చిన్న తిరుగుబాట్లు ద్వారా వ్యక్తం చేశారు. అయినా మున్సబువారు తన నిరంకుశ విధానాన్ని మానుకోలేదు. ఇంకా అతని చర్యలు హెచ్చు మీరిపోతాయి.

ఏజన్సీ ప్రాంతంలో జరుగుతున్న మున్సబుదారు అవినీతి గురించి ఏ మాత్రం ప్రభుత్వ అధికారులకు తెలియదు. ముఠాదారులకు సైతం రక్షణ కరువైంది. దీనికి తోడుగా ప్రభుత్వం అబ్కారీ చట్టాన్ని చేసి కల్లుపై కన్ను వేసి పన్ను వేస్తుంది.

"దాంతో ఏజన్సీ వాసులు కల్లు గీయటానికి, త్రాగటానికి, ఇబ్బందులు పడసాగారు. ఒక వేళ ఎవరైనా దొంగతనంగా కల్లు గీస్తే వాళ్ళకు పోలీసులతో కొరడా దెబ్బలు, లాఠీ దెబ్బలు తప్పేవి కాదు. కడుపుకు తిండి లేకపోయినా ఏజన్సీ ప్రజలు పూరుకుంటారు కానీ, కల్లు త్రాగందే వాళ్ళ ప్రాణాలు నిలువవు. ఈ కారణంగా ఏజన్సీ వాసుల్లో సహనం చచ్చింది. 1879 రంప తిరుగుబాటు అబ్కారీ చట్టం ఓ ముఖ్య కారణమైనదనేందుకు సంశయమక్కర్లేదు."[6] అని రచయిత ఆ సంఘటన్ని వివరించారు.

1879 సెప్టెంబరు మాసంలో రంప ప్రాంతంలో శాంతి భద్రతలు కాపాడటం అవసరమని భావించిన సల్లివాన్ ముఠాదారులతో ఒక సమావేశాన్ని ఏర్పరచి, ఆ ప్రాంతంలో శాంతిభద్రతలు కాపాడే బాధ్యత వాళ్ళదేనని ఒక ఒప్పందం కుదిర్చిన తర్వాత ఈ పితూరీకి కారణమైన మున్సబుదారు ముఠాను ప్రభుత్వానికి తోడ్పడ్డ ఇద్దరు వ్యక్తులకి అప్పగించి, మున్సబుదారును బరంపురంలో ఖైదు చేయిస్తాడు. ఈ పితూరిలో అనేక మంది ఏజన్సీ వాసులు మరణించడమే కాక, ఆంగ్లేయ సైన్యానికి కూడా చాలా నష్టం జరుగుతుంది.

సుమారు 22 సం॥ల సుదీర్ఘ పోరాటంలో భాగంగా రెండవ గొలుగొండ పితూరి 1886 సం॥లో జరుగుతుంది. భారతదేశంలో ఆంగ్లేయులు పరిపాలన కొనసాగనీయరాదని అనేకమంది అడుగడుగునా అనేక విధాలుగా అడ్డంకులు కల్పిస్తారు. ఎన్నో విధాలుగా పోరాటాలు జరుపుతారు. గొలుగొండ, దాని చుట్టు ప్రక్కలున్న ఆటవిక జాతులకు చెందిన కొందమంది కొండ దేవతలకు చెందిన పూజారులకు కూడా తెల్లదొరలపై ఆగ్రహం కలుగుతుంది. దాంతో వాళ్ళ ప్రతి ఆటవిక గూడేనికి వెళ్ళి “కొండదేవత ఆజ్ఞ” పితూరితో తెల్లదొరల నెదిరించి వెళ్ళగొట్టండి అనే ప్రచారం చేసి ఈ పితూరిని ఆ తల్లి చేయమందని నమ్మబలుకుతారు.

ఈ నమ్మకంతో దాదాపు కొంతమంది ఒక దళంగా ఏర్పడి గూడెంలో గల పోలీసుస్టేషన్‌పై దాడి చేసి, దానిని తగులబెడతారు. అక్కడున్న పోలీసులు, భయంతో పారిపోతారు. విజయోత్సహంతో గూడెం నుండి లమ్మసింగి వైపు ప్రయాణించే దళాన్ని సాయుధులైన పోలీసులు అడ్డగించి, అందర్ని చెల్లా చెదురు చేసి ఖైదు చేస్తారు.

రెండవ గొలుగొండ పితూరితో రగిలిపోయిన గోండులు అత్యంత ఉత్సాహంతో ఉద్వేగాలతో 1891లో మూడవ గొలుగొండ పితూరికి శ్రీకారం చుడతారు. 1845 ప్రాంతంలో జరిగిన తిరుగుబాటులో ముఖ్యుడైన చిన్న భూపతి చరిత్ర, చిన్న భూపతి కొడుకు శాంతి భూపతి. ఇతడికి ఆంగ్లేయ ప్రభుత్వం ఏటా కొంత భరణం ఇస్తూండేది. శాంతి భూపతి దానితో సంతృప్తి చెందదు. ఆంగ్లేయ ప్రభుత్వంపై పితూరి చేసి తాను స్వతంత్రునిగా ప్రకటించుకోవాలని భావిస్తాడు. ఈ సమయంలో గతంలో రంప పితూరిలో పాల్గొన్న ఒక విప్లవ కారులతో పరిచయం కలుగుతుంది.

ఆ విప్లవకారునితో కలిసి శాంతి భూపతి దాదాపు రెండు వందల మందితో ఒక సాయుధ దళాన్ని ఏర్పరచాడు. 1891 మే 22వ తేదిన వారి తిరుగుబాటుకు అంకురార్పణ

చేశాడు. 11 సం॥ క్రితం రంప పితూరిలో పాల్గొన్న ఒక విప్లవ నాయకుడ్ని చంపిన పోలీసు కానిస్టేబుల్ ఇంటిపై దాడి చేసి, ఆ పోలీసును చావబాది, అతని ఇంటిని దోచుకుంటారు.

ఆ తర్వాత కృష్ణదేవిపేట పోలీసుస్టేషన్‌పై దాడి చేసి, అక్కడ ఎదిరించిన అయిదుగురు పోలీసులను చంపి, స్టేషన్‌లో వున్న తుపాకులతో పాటు ఇతర మందుగుండు సామాను దోచుకొని స్టేషన్ భవనాన్ని కాల్చి వేస్తారు.

ఈ సంఘటన తర్వాత నెల రోజులు ఎవరికి కనిపించకుండా కొండల్లో దాకుంటారు. ఈ సమయంలో విప్లవ నాయకునికి మలేరియా జ్వరంతో పాటు, పచ్చకామెర్లతో అతను మరణించడంతో 200 మంది గల ఆ దళం ఎక్కడికక్కడ చెదిరిపోతుంది. ఆ తర్వాత పోలీసు దాడి చేసి 33 మంది పితూరి దారులు మాత్రం దొరుకుతారు. ఆ పితూరి చల్లారిపోతుంది.

అటు రంప పితూరి, ఇటు గోండుల తిరుగుబాటు ఆదర్శంగా సాలూరి తాలూకాలో కొర్రవానివలస అనే ఏజన్సీ ప్రాంతంలో జరిగిన చిత్రమైన పితూరి అది. 1900 సం॥ మే నెలలో కొర్రవాని వలసకు చెందిన కొర్రమల్లయ్య కొండదేవతకు పూజారిగా ప్రవర్తిస్తుండేవాడు. ఇంకేముంది మల్లయ్య విచిత్రంగా కేకలు పెడుతూ, శరీరమంతా వూపుతూ "అర్రెయ్ అర్రెయ్ నేను కొండదేవతను పలుకుతున్నాను" అని అంటాడు.

రామరాజు ఈ దేశానికి రాజునవుతా మీరందరు నా సైన్యం అవిగో వెదురు బొంగులు, అవే తుపాకులుగా మారుతాయి. వాటిని తుపాకులుగా చెక్కండి. నా శక్తితో వాటిని ఆయుధాలు చేస్తాను. తెల్లోడి తుపాకులు మంచుగా కరిగి నీళ్ళుగా మారిపోతాయి. అంటూ ఆవేశంతో ఊగిపోతున్నాడు.

ఏజన్సీ ప్రజలు అతని మాటలు నమ్మి వెదురు కర్రల్ని తుపాకులుగా చెక్కుతారు. మల్లయ్య మల్లయ్యగా కాక స్వామిగా మారిపోతాడు. మీరందరూ సుశిక్షితులైన సైనికులు మనం యుద్ధం చేయవలసిన సమయం ఆసన్నమైయిందని ప్రకటిస్తాడు. ముందుగా పాచిపెంట పోలీస్‌స్టేషన్‌పై దాడి చేస్తున్నామని వార్త పంపిస్తారు. ఏజన్సీకి విచారణకు వచ్చిన పోలీసులిద్దరిని మల్లయ్య మనుషులు కొట్టి కొండదేవతకు బలి ఇస్తారు.

ఈ విషయం తెలుసుకున్న జిల్లా మేజిస్ట్రేటు రిజర్వు పోలీసు బలగాల్ని తీసుకొని అక్కడకు వెళ్ళారు. అక్కడ పోలీసులకు తిరుగుబాటుదార్లకు సమరం జరుగుతుంది.

తిరుగుబాటుదార్లలో పదకొండుమంది మరణిస్తారు. అనేక మంది తుపాకి గుండ్లకు గాయపడతారు. చాలామంది పారిపోగా అరవైమంది దొరకగా వాళ్ళపై దొమ్మి కేసు పెడతారు. అది కూడా నీరుగారిపోయాయని రచయిత వివరించారు.

1853 సం॥లోను, 1856-57 సం॥లోను జరిగిన సవరల తిరుగుబాటు సంఘటనల్ని చూసిన గిరిజనులు 1912 సం॥లో మూడవ సవరల తిరుగుబాటుకు సమయాత్తమయ్యారనే విషయాన్ని "పర్లాకిమిడి ఏజన్సీ ప్రాంతంతో ఫారెస్టు రిజర్వుకు సరిహద్దులు నిర్ణయించేందుకు వచ్చిన ఒక ఫారెస్టు అధికారిని ఆటంకపరిచారు. వేరంగా గూడ గ్రామం సవరలు దానికి కారణం. మొత్తం ఏజన్సీ ప్రాంతం అంతా సరిహద్దు లేని ప్రాంతముగా తరతరాలుగా సవరలు, ఇతర ఆధునిక తెగలు పాలిస్తుండేవాళ్ళు. అయితే ఆంగ్లేయ ప్రభుత్వం ఈ ఆటంకాన్ని ముందు తీవ్రంగా భావించలేదు"[7] అని రచయిత వివరించారు.

దానికి కారణం లేరంగిగూడ సవరలు తప్ప మరి ఇతర గ్రామాలకు చెందినవారు ప్రతిఘటించకపోవటమే. అయితే రెండవసారి కూడా ఆ ఫారెస్టు అధికారికి ఆటంకం కలిగే సరికి ప్రభుత్వం ఆ వెంటనే తగుచర్యలు తీసుకొనటం జరుగుతుంది. ఈ చర్యలో గంజాం కలెక్టరు సమయస్ఫూర్తితో వ్యవహరించడం వలన ఆ తిరుగుబాటు అణిగిపోతుంది.

రంప, సవరల గోండులు తిరుగుబాట్లలో భాగంగా వివిధ గిరిజన జాతులందరూ ఐకమత్యంగా కలిసి చేసిన ఈ పితూరినే లాగరాయి పితూరి అంటారు. ఇది 1915-16 మధ్య కాలంలో జరిగిందని విశ్లేషకుల విశ్లేషణ. ఈ పితూరి దాదాపు గెరిల్లా యుద్ధంగా పరణమిస్తుంది. ఏజన్సీ ప్రాంతానికి చెందిన ఇద్దరు వ్యక్తుల్ని దొంగతనం చేశారనే నేరం మోపి పోలీసులు అరుస్టు చేస్తారు. తన మనుష్యులను విడిపించుకోటానికి లాగరాయి, కొండపల్లి ప్రాంతాల కోయలు, కమ్మరులు, ఇతర ఆటవిక తెగల వ్యక్తులులాగ రాయి పోలీసుస్టేషన్‌పై దాడి చేసి ఖైదీలను విడిపించుకొని ఎదిరించిన పోలీసులను చితకబాది వారి వద్దనున్న తుపాకులు, మందుగుండు సామాగ్రి తీసుకొని పారిపోతారు. ఆ తర్వాత తమ గూడెంపై దాడి చెయ్యటానికి వస్తున్న పోలీసు బృందాలను మాటు గాసి కాల్పులు జరుపుతారు.

"విస్తారమైన ఈ అరణ్య (ఏజన్సీ) ప్రాంతంలో ఈ గెరిల్లా పోరాటం తొమ్మిది మాసాలు జరిగింది. కోయలు పోలీసుస్టేషన్‌లపై మెరుపుదాడులు చేయటంలో మొత్తం

నలుగురు పోలీసులు మరణించారు. అంతేకాదు రాత్రి సమయంలో గ్రామాలపై దాడులు చేయటంతో గ్రామస్తులు కూడా విసుగెత్తి పోయారు"[8] అని పేర్కొన్నారు.

ఇక పితూరిని అణచి వేయాలనే ఉద్దేశ్యంతో ఆంగ్లేయ ప్రభుత్వం తీసుకున్న తీవ్రమైన పోలీసుచర్యల వలన పితూరీకి చెందిన వ్యక్తులు చెల్లాచెదురై ఒక్కొక్కరు పోలీసులకు పట్టుబడతారు. ఆ తిరుగుబాటు వక్రమార్గాలు పట్టినందున గ్రామస్తుల సహకారము లేకపోగా వ్యతిరేకత కలిగి కొంతమంది పితూరిదార్లను గ్రామస్తులు బంధించి పోలీసులకు అప్పగిస్తారు. ఈ పితూరికి గరమంధ మంగరాజు అనే వ్యక్తి నాయకత్వం వహించారని తెలియజేశారు.

ఈ చెట్టు నువ్వు పెట్టావా? ఈ విత్తు నువ్వు నాటావా? నువ్వు నారు పోశావా? నీరు నువ్వు పెట్టావా? మా గడ్డపై నీకేంటి పెత్తనం అని అంటూ 1921-22 మధ్య కాలంలో పల్నాడు తిరుగుబాటు ఆంగ్లేయ ప్రభుత్వ నిరంకుశ పాలనా విధానాలపై విశాఖ ఏజన్సీ ప్రాంతంలోనే కాక, గుంటూరు మండలంలోని పలనాటి ప్రాంతంలో కూడా అనేకసార్లు తిరుగుబాటు జరుగుతాయి. అయితే ఈ తిరుగుబాటు సామూహిక ప్రజావెల్లువ లాగాక అప్పటికప్పుడు వచ్చిన ఆవేశంతో వ్యక్తిగతంగా చేసిన తిరుగుబాటు కావడంతో తిరుగుబాటు చేసిన వ్యక్తిని అక్కడకక్కడే పోలీసు వర్గాలు చంపడంతో ఆ తిరుగుబాటు ఆక్షణంలోనే సమసిపోతుంది. అలా తిరుగుబాటు చేసిన వ్యక్తుల్లో పలనాటి కన్నెగంటి హనుమంతు, నర్సారావు పేట చిన్నపరెడ్డి ముఖ్యులు.

ఈ ఇద్దరిలో హనుమంతు భూమి శిస్తును వ్యతిరేకంగాను, చిన్నపరెడ్డి పోలీసుల నిరంకుశ చర్యలకు వ్యతిరేకంగాను తిరగబడి ప్రాణాలు కోల్పోయిన విషయాల్ని ఈ గ్రంథంలో వివరించారు.

**విప్లవ దళాల నిర్మాణం:**

"అతి ప్రశాంతంగా కనిపించే అగ్ని పర్వతం వున్నట్టుండి ఒక్కసారిగా బ్రద్దలై మిమ్మల్ని, మీ ప్రభుత్వాన్ని లావాతో మాడ్చి మసి చేయక తప్పదు" అని బ్రిటీష్ ప్రభుత్వాన్ని శ్రీరామరాజు హెచ్చరించేవాడు. మన్యంలో విప్లవానికి కారణం ఆంగ్లేయ ప్రభుత్వాధికారుల నిరంకుశ చర్యలేయన్నది యదార్థం. అయితే మన్యం ఏరియాలో వున్న అధికారులు మాత్రం వాస్తవానికి విరుద్ధంగా కేంద్ర ప్రభుత్వానికి నివేదిక పంపించారు. ఏజన్సీ ప్రాంత కమీషనరుగా నున్న హెసల్‌దొర ఆ నివేదికలో "ఏజన్సీ ప్రాంతాన్ని వశపరుచుకొని,

నెమ్మది నెమ్మదిగా మిగిలిన ప్రాంతాన్ని ఒక్కొక్కటిగా వశపర్చుకోవాలన్నదే అతని ముఖ్యోద్దేశము. ఏజన్సీ ప్రాంతానికి రామరాజు 'రాజు' కావాలనే కోర్కెతోనే ఈ యుద్ధానికి సంసిద్ధమగుచున్నాడు".[9]

ఈ అభిప్రాయం కేవలం దురుద్దేశపూరితమని చెప్పాలి. ఏసుక్రీస్తును కూడా ముద్దాయిగా శిలువ వేసే ముందు రోమన్ చక్రవర్తులు ఆయన యూదులరాజు కావలెనని కోర్కె వున్నదనే ఆరోపణ చేయడం జరుగుతుంది. రామరాజుపై కూడా ఇటువంటి నేరారోపణను ఆంగ్లేయ దొరలు చేస్తారు.

శ్రీరామరాజు భారతదేశాన్ని ఆంగ్లేయ పాలకులు నుండి విముక్తి చేసేందుకు మొదట ఏజన్సీకి విముక్తి చేసి, ఈ సమయంలోనే తగిన ఆయుధాలను, ఫిరంగులను సంపాదించి, విశాఖ, ఉభయగోదావరి జిల్లాలోని మన్యప్రాంతాలను విముక్తి చేసిన యెడల ఈ మన్య ప్రాంతాన్ని కేంద్రంగా చేసుకొని చుట్టుప్రక్కల గల తాలూకాలను కూడా విముక్తిచేయవచ్చునని ఆయన వ్యూహం అయితే విప్లవ పోరాటాలు ఏదో ఒక బలమైన కారణంతో విజయం సాధించలేవు.

శ్రీరామరాజు తలపెట్టిన విప్లవ పోరాటంలో అనేక సమస్యలు ఎదురై చివరకు ఆయనే లొంగిపోవటం జరుగుతుంది. ప్రపంచంలో రవి అస్తమించని సామ్రాజ్యంగా పేరుబడ్డ బ్రిటీష్ ప్రభుత్వాన్ని ఎదిరించి పోరాడ్డం సామాన్యమైన విషయం కాదు.

### 1.1.3 రాజు ముఖ్య అనుచరులు:

#### గాం సోదరులు:

శ్రీరామరాజుకు ప్రాణాన్ని సైతం తృణప్రాయంగా బలి పెట్టగల అనేకమంది యోధులు సహచరులుగా ఉండి ఈ స్వాతంత్ర్య విప్లవ పోరాటంలో తమ శాయశక్తులా పోరాడతారు.

అటువంటి వీరుల్లో గాం సోదరులు ముఖ్యులు. గంటందొర, మల్లుదొర. శ్రీరామరాజును బాస్టియన్ కాల్చి వేసిన తరువాత కూడా గంటందొర తన అనుచరులతో బ్రిటీష్ సైన్యంతో పోరాడి వీరమరణం పొందుతారు.

#### వీరయ్యదొర:

గూడెం ముఠాదారులో వీరయ్యదొర శ్రీరామరాజు అనుచరులలో ముఖ్యయోధుడు.

వీరయ్య తండ్రి సోబిలను దొర 'లాగరాయి' పితూరితో ప్రత్యక్ష సంబంధం కలవాడు. తండ్రిలాగే వీరయ్యదొర గెరిల్లా యుద్ధంలో బాగా ఆరితేరిన వ్యక్తి.

**ఎండు పడాలు:**

పెదవలస గ్రామ నాయకుడు ఎండుపడాలు ఇతడ్ని బొజ్జ పడాలు అని కూడా పిలుస్తారు. ఇతడు గెరిల్లా యుద్ధంలో బాగా ఆరితేరిన వ్యక్తి. తుపాకి గురి చూడ్డంలోను, విల్లు ఎక్కు పెట్టడంలోను దిట్ట.

**అగ్గిరాజు:**

అల్లూరి అనుచరుల్లో ముఖ్యుడు అగ్గిరాజు ఆయన్ని గూర్చి చెబుతూ "భీమవరం తాలూకాలోగల కుముదపల్లి, గ్రామనివాసి. ఈయన పూర్వనామం వేగిరాజు సత్యనారాయణరాజు. ఆయన్ని పరిచయం చేస్తూ రచయిత శ్రీరామరాజు విప్లవ పోరాటం సాగించిన మలిదినాల్లో ఈయన శ్రీరామరాజుతో చేయి కలిపి ఆయనకు బాసటగా నిలిచాడు. ఒక్కోసారి రామరాజు ప్రమేయం లేకుండానే విప్లవ పోరాటాన్ని వ్యూహం లేకుండానే నడిపేవాడు. ఇతను సాహసేకాని దుస్సాహసి? అగ్గిరాజు అండమాను ప్రవాసంలో మరణించాడు"[10] అని వర్ణించాడు. శత్రువుల గుడారాలకు నిప్పు పెట్టి హడలగొట్టే సాహస కార్యక్రమాలు చేయడం వల్ల అగ్గిరాజు అని పేరు గాంచి, అతి సాహసిగా పేరు పొందతాడు. ప్రభుత్వ అధికారుల్ని ముచ్చెమటలు పట్టించి ముప్పుతిప్పలు పెట్టడం వల్ల ఇతనిని అండమాన్ జైలుకి తరలిస్తారు. అక్కడే మరణిస్తాడు.

**సంకోజి ముక్కడు:**

శ్రీరామరాజుకు పెదవలస ముఠాదారైన సంకొజి ముక్కడు రామరాజుకు అండగా నిలిచిన విప్లవకారుడు ఇతడు యుద్ధ ప్రచారకుడిగా, వార్తామరునిగా పనిచేసి, చివరకు ఆంగ్లేయులకు పట్టుబడి 12 సం॥లు కారాగార శిక్ష అనుభవిస్తాడు.

**గోకిరి ఎర్రేసు:**

గవర్ల పాలేనికి చెందిన గోకిరి ఎర్రేసు విలువిద్యలోను, కత్తిసాములోను పేరెన్నిక గన్న యోధుడు, శ్రీరామరాజు పట్ల అచంచల విశ్వాసం, భక్తి శ్రద్ధలు గలవాడు. విప్లవ పోరాటంలో అతి చురుకుగా పాల్గొనేవాడు. ఇతడు పోలీసులకు పట్టుబడి 12 సం॥

రామవెల్లూరు జైల్లో శిక్ష అనుభవిస్తాడు. జైలులో నున్న రాజకీయ ఖైదీలకు శ్రీరామరాజు వీరచరిత్ర కథలుకథలుగా చెబుతూ "మా అయ్యోరు ఆకాశంలోకి ఎగిరిపోయారు" ఆయన్ను చంపటానికి ఈళ్ళవల్లెమవుద్ధి ఆయన్ను ఎవరు చంపలేరు" అనేవాడట.

**బొంకుల మోరిగాడు:**

చింతపల్లి నివాసి బొంకుల మోరిగాడు. గొప్ప విలుకాడు. ఇతడు అతి సాహస వీరుడైన ఈయన శ్రీరామరాజు అంటే ప్రాణాలు విడుస్తాడు. పోలీసుస్టేషన్‌లపై చేసే దాడిలో అతిచురుగ్గా పాల్గొనడమేకాక జన సమీకరణంలో మొనగాడు.

## 1.1.4 సైన్యం... నియమాలు... శిక్షణ:

శ్రీరామరాజు వద్ద ఇటువంటి వీరులు ఎందరో ఉన్నారు. మట్టిలో నుండి మాణాక్యాలు పుట్టినట్లే మన్యంలో నుండి మహావీరుల్ని సృష్టిస్తాడు. దాదాపు 150 మంది వీరుల నాయకత్వంలో వందలాది మంది మన్యం వాసులు సుశిక్షితులైన సైనికులుగా రూపొందుతారు. విప్లవ సైన్య నిర్మాణం చాలా పకడ్బందిగా నిర్మించబడుతుంది.

విప్లవ సైన్యంలో ఎవరు ఎప్పుడు చేరేది, వారి అనుభవం, సాహసం, ఆయన ప్రయోజనం, పాల్గొన్న సంఘటన గాయపడుట లేక మరణించుట మొదలైన వివరాలతో హిస్టరియా షీటు ప్రతి వ్యక్తికి తయారుచేసేవాడు.

శ్రీరామారాజు అనుమతి లేనిదే ఎవ్వరు సైన్యం క్యాంపును విడిచి పోరాదని, ప్రతి సైనికుడు ప్రతి క్షణం యుద్ధ సన్నద్ధుడై వుండాలని పేర్కొంటాడు.

యుద్ధ సమయంలో ప్రజల్ని ఎటువంటి ఇబ్బందులకు గురి చేయరాదు.

వృద్ధులను, స్త్రీలను, పిల్లలకు ఎటువంటి కీడు తలపెట్టరాదు.

భారతీయ ఉద్యోగులకు ఏ అపాయం కలిగించరాదు.

ప్రజల ఆస్తులను కొల్లగొట్టరాదు. ఇంకా అనేక కఠిన నియమనిబంధనల్ని విప్లవకారులకు బోధించారు.

అంతేకాదు ఎవ్వరైనా విప్లవ ద్రోహానికి పాల్పడితే వారికి మరణదండన కూడా విధించబడుతుంది అందరకూ ముందుగానే తెలియజేయబడేది. దానికి ఇష్టమైన వారినే

విప్లవ ఉద్యమంలో చేర్చుకొంటాడు. విప్లవ సైన్యంలో చేర్చుకోబడ్డ ప్రతి విప్లవకారుడు విధిగా సైనిక శిక్షణ పొందాలి. ఈ శిక్షణ గెరిల్లా యుద్ధ పద్ధతిలో ఇవ్వబడుతుంది.

### 1.1.5 విప్లవ ముహూర్తం:

శ్రీరామరాజు తన సైన్యంలో ప్రతి వ్యక్తిని ఒక్కో మహావీరునిగా తయారుచేస్తారు. రామరాజు తన సైన్యంలోని ప్రతి వ్యక్తిని పరీక్షించి చివరకు విప్లవానికి ముహూర్తం పెట్టేవారు.

విప్లవ నాయకులందర్ని ఒక మంచి రోజు శరభన్న పాకాంలో సమయాత్తపరచి, వారందరి వద్ద సంతకాలు, వేలిముద్రలు తీసుకొని, వారందరి చేత ప్రమాణాలు చేయించేవాడు.

“నా మాతృదేశ విముక్తి కోసం, పరాయి పాలకులపై ప్రతిక్షణం సాయుధుడనై యుద్ధం చేస్తాను. నాదేశ రక్షణ కోసం నా ప్రాణాల్నైనా బలిపెడతానని నా ఆత్మసాక్షిగా నన్ను కన్న వారి సాక్షిగా, నా మాతృభూమి సాక్షిగా నేను విప్లవకారునిగానే జీవిస్తాను. విప్లవకారునిగానే స్వాతంత్ర్య సమరంలో మరణిస్తాను. వందేమాతరం... వందేమాతరం.... విప్లవం వర్ధిల్లాలి...” అల్లూరి శ్రీరామరాజుకి జై అనే నినాదాలు అడవిలోయలో ప్రతిధ్వనించాయని రచయిత పేర్కొన్నారు.

ఈ విప్లవంలో విప్లవకారులు తాము దాడి చేయబోయే పోలీసుస్టేషన్‌కు ముందుగానే మిరపకాయటపా పంపుతారు. ఒక చీటికి మిరపకాయ కట్టి దానిని బాణంతో ప్రయోగించేవాళ్ళు, దాన్ని ప్రయోగించిన వారి ఆచూకీ ఏమాత్రం పోలీసులకు తెలిసేది కాదు.

### 1.1.6 మొదటి విజయం – చింతపల్లి పోలీసుస్టేషన్:

శ్రీరామరాజు మహాభక్తుడు. 1922 ఆగష్టు 19 తేదిన శ్రావణ బహుళ ఏకాదశి శనివారం మహాశివునకు రుద్రాభిషేకం చేసి “మనం చింతపల్లి పోలీసుస్టేషన్‌పై దాడి చేయబోతున్నాం సిద్ధం కండి” అని తన అనుచరులకు చెపుతాడు.

“గాం సోదరులైన గంటందొర, మల్లుదొర, ఎండుపడాలు, గోకిరి ఎర్రేసు మొదలైన వారు వారి వారి దళాలకు సారద్యం వహించారు. రామరాజు ముందు నడవగా, ఆయన

వెంట సుశిక్షితమైన సైన్యం వలె మన్యం ప్రజలు ప్రమదగణం వలె నాటు తుపాకులు, విల్లంబులు, బల్లేలు, గండ్రగోడ్డళ్ళతో విజయమో! వీరస్వర్గమో! నంటూ కదనం త్రోక్కుతూ నడిచారు”[11] అని రాజు నాయకత్వ పటిమను వివరించారు.

లంబసింగ్ ఘాట్ వద్ద చింతపల్లి స్టేషన్ యస్.ఐ. శ్రీరామరాజు బృందానికి ఎదురవుతాడు. రామరాజు అతనితో “యస్సైగారు? మీ ఆంగ్ల ప్రభుత్వాన్ని పారద్రోలేందుకు మాకు ఆయుధాలు అవసరం కాబట్టి మీ స్టేషన్‌లోని ఆయుధాల కోసం వెళ్తున్నాం” అని అనడంతో అతను మాట్లాడకుండా ప్రక్కకు తప్పుకున్నారు.

దూరంలో చింతపల్లి పోలీసుస్టేషన్ కనిపించగా “పదండి... ముందుకు... పదండి శత్రువుపైకి అంటూ నాలుగు జట్లుగా విడిపోయిన విప్లవకారులు ఒక్కసారిగా పోలీసుస్టేషన్‌ను చుట్టుముడతారు.

చింతపల్లి పోలీసుస్టేషన్‌లో ముగ్గురే ముగ్గురు కానిస్టేబుల్స్ ఉంటారు. రామరాజును చూడగానే నమస్కారం చేసి నిలబడతారు. శ్రీరామరాజు వాళ్ళను ఆయుధగారం తాళం చెవులు అడిగితే వాళ్ళు ఇచ్చేందుకు అంగీకరించరు. అప్పుడు విప్లవకారులు వాళ్ళ ముగ్గుర్ని స్థంబాలకు కట్టివేసి ఆయుధాగారపు తలుపులు తెరచి 11 తుపాకులు, 1390 తుపాకుగుళ్ళు, 5 కత్తులు 14 బాయ్‌నెట్లు వశపర్చుకుంటారు.

శ్రీరామరాజు తను స్వాధీన పర్చుకున్న ఆయుధాల లెక్క స్టేషన్ డైరీలో రాసి సంతకం చేయడం జరుగుతుంది. తిరిగి వెళ్తున్న విప్లవకారులకు దారిలో అప్పలస్వామి, మద్ది పైడియ్య అనే ఇద్దరు పోలీసులు ఎదురవుతారు. వారి వద్దవున్న ఒక తుపాకిని, కొన్ని తుపాకి గుళ్ళు విప్లవకారులు తీసుకొని వాళ్ళను వదలిపెడతారు.

ఈ పితూరి గురించి ఏజన్సీ కమీషన్ యస్.డబ్ల్యు. స్టీవర్టు 1922- సెప్టెంబరు 11వ తేదిన ప్రభుత్వానికి రిపోర్టు పంపుతూ దానిలో చింతపల్లి పోలీస్‌స్టేషన్‌పై శ్రీరామరాజు దాడి చేస్తున్నప్పుడు “మహాత్మా గాంధీజికి జై” అనే నినాదం ఇవ్వడం జరిగిందని, కాబట్టి ఈ పితూరి స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించినదేనని రాయడం జరుగుతుంది.

### 1.1.7 రెండవ విజయం - కృష్ణదేవిపేట పోలీసుస్టేషన్:

శ్రీరామరాజు రెండవ విజయం కోసం ఆ మరునాడే 1922 ఆగష్టు 23వ తేదీన కృష్ణదేవిపేట పోలీస్‌స్టేషన్‌పై దాడికి తన గెరిల్లా సైన్యంతో బయల్దేరుతాడు.

శరభన్నపాలెంలో ఆ గ్రామ ముఠాదారు యిచ్చిన విందును తన అనుచరులతో స్వీకరించి అక్కడి నుండి కృష్ణదేవిపేటకు వెళతాడు. గ్రామం సమీపించగానే విప్లవకారులు కొమ్ముబూరలు ఊదుతూ, డప్పులు మ్రోగిస్తారు. ఈ సవ్వడి విన్న కృష్ణదేవి పేట పోలీస్‌స్టేషన్‌లోని పోలీసులు తలకొకదిక్కునకు పారిపోతారని రచయిత ఆనాటి సంఘటనని కళ్ళకు కట్టినట్లు పేర్కొన్నారు.

శ్రీరామరాజుకు కృష్ణదేవిపేటలో అనేకమంది పరిచయస్తులుంటారు. వాళ్ళంతా రామరాజుకు సాదరంగా ఎదురేగి స్వాగతం పలుకుతారు. రామరాజు వారితో విప్లవోద్యమాన్ని గురించి మాట్లాడుతూ రామాలయమున విడిది చేసి గాంసోదరులను, మరియొకరిని స్టేషన్‌కు పంపి లొంగిపొమ్మని కబురు చేస్తారు. అందుకు సబ్‌ఇన్స్‌పెక్టరు మండిపడుతూ, స్టేషన్ లోపలకు ఎవరొచ్చినా కాల్చిపారేస్తానని గంతులు వేస్తాడు. ఈ విషయం తెల్సుకున్న రామరాజు సాయుధులైన ఆరుగురు విప్లవకారుల్ని స్టేషన్‌కు పంపిస్తాడు. సాయుధవీరుల్ని చూడ్డంతోనే యస్.ఐ. స్టేషన్ వదలి పారిపోతాడు. స్టేషన్‌లో వున్న 7 తుపాకులు, కొంత మందుగుండు సామాగ్రిని వశపర్చుకొని రామరాజు స్టేషన్ డైరీలో వాటి వివరాలు రాసి సంతకం చేస్తాడు.

"కృష్ణదేవిపేట పోలీస్‌స్టేషన్‌పై దాడి గురించి ఐ.జి.పి.యస్. ఆర్మిడేజ్ అనే వ్యక్తి ప్రభుత్వానికి నివేదిక పంపిస్తూ "పితూరీదారులు పగలు 11 గంటలకు కృష్ణదేవిపేటకు వచ్చిరి. "గాంధీజీ జై, మన్యంరాజు వస్తున్నాడు" అనే నినాదాలతో స్టేషన్‌లోని తుపాకులు వశపరుచుకొన్నారు. ఎవ్వరికి విప్లవకారులు కీడు తలపెట్టలేదని వ్రాసారు. కృష్ణదేవిపేట దాడి విజయవంతం కావడంతో ఆంగ్లేయ ప్రభుత్వాధికార్ల గుండెల్లో బాంబులు ప్రేలాయి[12] అని రచయిత వివరించారు.

గతంలో జరిగిన తిరుగుబాట్లకు ప్రజల సహకారం లభించేది కాదు. ఈ పోరాటంలో ప్రజల పాత్ర ఎంతో ఉంది. గ్రామ ముఠాదారులు సైతం రామరాజుకు స్వాగతం ఇస్తుంటే ఆ గ్రామంలో గల పోలీసుస్టేషన్లలో ఉండే పదుల సంఖ్యలో వున్న పోలీసులకు దిక్కు లేకుండా పోతుంది.

కాబట్టి రామరాజు చేస్తున్న ఈ తిరుగుబాటు పోరాటాన్ని గురించి బాగా ఆలోచించవలసిందేనని అధికారులందరు ఆలోచనలో పడతారు. జిల్లా మేజిస్ట్రేట్ ఈ పితూరిని అరికట్టవలసిందిగా పోలీసు అధికారులకు ఆజ్ఞలు జారీ చేస్తాడు.

### 1.1.8 మూడవ విజయం – రాజవొమ్మంగి పోలీస్‌స్టేషన్‌పై దాడి:

ఆ తర్వాత ఆగష్టు 24న రాజవొమ్మంగి స్టేషన్‌పై దాడి చేయడానికి తన విప్లవ సైన్యాన్ని సమయాత్తం చేయడంలో ఆయన ధైర్యసాహసాలు, సమయస్ఫూర్తి ప్రత్యక్షంగా కనిపిస్తాయి.

రాజవొమ్మంగి స్టేషన్‌పై విప్లవకారులు చేసే దాడి విజయవంతమైతే తమ ప్రభుత్వానికి ఎంతో నష్టం. పైగా 6 పోలీసుస్టేషన్లలో లాగరాయి పితూరి సమయంలో అరెస్టు కాబడ్డ వీరయ్యదొర ఉన్నాడనే ఆలోచనతో ప్రభుత్వం తగిన జాగ్రత్తలు తీసుకుంటుంది.

శ్రీరామరాజు ముందు జాగ్రత్తగా తన విప్లవ సైన్యాన్ని నాలుగు భాగాలుగా చేసి స్టేషన్‌కు నాలుగు దిక్కుల నుండి ముట్టడిస్తారు. అది అర్ధరాత్రి కావడంతో పోలీసు సిబ్బంది ఆదమరచి, బయట విప్లవకారుల అలజడి వినబడటంతో కంగారుగా లేచి విప్లవకారులపై 36 రౌండ్లు కాల్పులు జరుపుతారు.

నాటి సంఘటన్ని గూర్చి "అయితే గెరిల్లా యుద్ధ వ్యూహం అక్కడ ఫలించింది. విప్లవ కారులెవ్వరూ ఆ కాల్పుల్లో గాయపడలేదు. విప్లవకారులు మూకుమ్మడిగా చిరుతల దండువలె పోలీసులపై విరుచుకుపడడంతో పోలీసులు చేతులెత్తేశారు. విప్లవకారులు రాజవొమ్మంగి స్టేషన్ నుండి 8 తుపాకిలు, 825 తూటాలు, కొన్ని యూనిఫాంలు వశపర్చుకున్నారు"[13] అని పేర్కొన్నారు.

శ్రీరామరాజు స్టేషన్ ఖైదులో నిర్బంధించబడ్డ వీరయ్యదొరను విడిపిస్తాడు. అంతకుముందే రామరాజును గురించి విన్న వీరయ్యదొర ఆయనకు వందనం చేసి కౌగలించుకుంటాడు. నాటి నుండి వీరయ్యదొర రామరాజుకు ముఖ్య అనుచరుడిగా మారతాడు.

### 1.1.9 స్కాట్ కవర్టు – హైటర్‌ల మరణం:

ఆంగ్లేయ ప్రభుత్వానికి గతంలో జరిగిన పితూరి కంటే ఈ పితూరి మింగుడు పడకుండా చేస్తూ మన్యం ప్రాంతంలో పితూరి ఆదరణ పొందుతుంటే సహించలేక విప్లవాన్ని అణచడానికి ప్రభుత్వం వ్యూహాలు పన్నుతుంది.

బ్రిటీష్ సైనికుల్ని యుద్ధ వ్యూహంలో ఆరితేరిన ఈవ్‌లింక్ అడ్డతీగలలోను, డాసన్

కొయ్యూరులో, కృష్ణదేవిపేటలో ఫోర్బెస్ కీన్‌లు, గోరైడ్‌లో హ్యూమ్, పెదవలస, గూడెం, చింతపల్లి ఏజన్సీలో సాండర్స్, టాల్బట్-స్కాట్ కవర్టు, హైటర్, బాడ్విక్‌లు లమ్మసింగ్‌లో మార్జిన్‌లు మకాం వేశారని పేర్కొన్నారు.

"శ్రీరామరాజును బంధించవలెననాడి కృతనిశ్చయంతో స్కాట్ కవర్టు హైటర్‌లు నర్సీపట్నం నుండి నిగాపురం తమ సైన్యంతో చేరారు. అయితే అక్కడ నుండి ఒక గంట క్రితమే రామరాజు తన విప్లవ సైన్యంతో వెళ్ళినట్టు తెలిసింది. ఆ తరువాత వారు వరసగా డొక్కలూరు, చింతపల్లి, సంకాడ గ్రామాలకు వెళ్ళినా రామరాజు బృందం యొక్క ఆచూకీ దొరకలేదు"[14] అని రామరాజు ఉనికి తెలుసుకోలేకపోయారని వివరించారు.

24.09.1922 తేదిన విప్లవ కారులు ఆహార పదార్థముల నిమిత్తం దమనపల్లి రాగలరని కవర్టు, హైటరులకు తెలిసి తమ సైన్యంతో ప్రయాణమవుతారు. కవర్టు కంటే హైటర్ పరమ దుర్మార్గుడు. ఆటవికుల్ని లేళ్ళలా భావించి పులిలా వాళ్ళను వెంటాడి చంపటంలో సిద్ధహస్తుడు.

తమ కోసం సైన్యంతో స్కాట్ కవర్టు - హైటర్‌లు వస్తున్నారని విప్లవకారులు తెల్సుకుంటారు. అక్కడున్న గాం సోదరులు, ఎఱ్ఱేసు, పడాలు మొదలైన వాళ్ళు రామరాజుతో వుంటారు. ఆంగ్లేయ సైన్యాధికారుల్ని ఎలా ఎదుర్కొనాలో రామరాజు గాంసోదరులకు చెపుతారు.

ఆ వెంటనే గాం సోదరులు ఆ వ్యూహాన్ని ఆచరణలో పెట్టారు. ఆంగ్లేయ సైన్యం కొరకు కొండగుట్టల మాటున విప్లవకారులు పొంచి కూర్చోన్నారు. అందరి చేతుల్లోను ఆయుధాలున్నాయ్.

కవర్టు-హైటర్‌లకు ముందు వెనుకల సైనికులు నడుస్తారు. ఒక ప్రక్క కొండగట్టు, రెండవప్రక్క అగాధమైన లోయ ప్రాంతానికి ఘాట్ రోడ్డున నడుస్తూ వస్తారు. అంతకు క్రితమే కొండపై వరసగా పేర్చిన రాళ్ళను గాం సోదరులు కదలిస్తారు.

అంతే ఆ మరుక్షణంలో ఉరుములు ఉరిమినట్లు ధనాధన శబ్దంతో కొండపై పేర్చిన రాళ్ళు సైనికులపై వర్షంలా పడతాయి. సైనికుల తలలకు తగిలి హహకారాలు చేస్తూ, కాళ్ళు చేతులు విరిగి రక్తపు మడుగుల్లో దొర్లుతూ కొంతమంది ఆగాధమైన లోయలో పడతారు. ఈ హఠాత్ పరిణామానికి కవర్టు-హైటర్‌లు దిగ్భ్రాంతి చెంది, తమ ఆయుధాల్ని సర్ధుకునేంతలోనే ఢాం... ఢాం... అనే శబ్ధంతో తుపాకులు గుండ్ల

వర్షాన్ని కురిపిస్తారు.

“బ్రిటన్‌లో పుట్టి భారతదేశం వచ్చి, భారతీయులను తమ నిర్బంధ నిరంకుశ చర్యలతో అల్లాడించే ఫాసిస్టు రాక్షసుల్లో ఇద్దరు రాక్షసులు అశువులు కోల్పోవటంతో విప్లవకారుల సంతోషానికి అవధులు లేవు”[15] అని నాటి పోరాట సన్నివేశాన్ని చిత్రించారు.

నల్లవాళ్ళెంత? వాళ్ళ తిరుగుబాటెంత? మూడు క్షణాల్లో రామరాజును మట్టి కరిపిస్తాం అంటూ ప్రగల్భాలు పలికిన తెల్లదొరలిద్దరూ కెవ్వు... కెవ్వు...న కేకలు పెడుతూ నేలకూలుతారు. చావగా మిగిలిన సైనికులు పారిపోగా, విప్లవకారులు 30 రైఫిల్స్ మరికొంత మందుగుండు సామగ్రి లభ్యమవుతుంది.

ఈ సంఘటనలో ఇద్దరు రిజర్వుడు సైనికులు కూడా బందీలుగా పట్టుకుంటారు. రామరాజు ఆ సైనికుల్ని చాలా మర్యాదగా చూస్తారు. ఈ సైనికుల వద్ద నుండి శ్రీరామరాజు 303 రైఫిల్‌ను కాల్చటం నేర్చుకున్నారు.

ఆ తర్వాత ఆంగ్లేయాధికారులు కవర్టు – హైటర్ శవాలతో బాటు మరిద్దరి శవాలను తమకప్పగించమని మధ్యవర్తుల్ని పంపిస్తారు. అక్కడ శ్రీరామరాజు “ఐదు వందల రూపాయలు” జరిమానా చెల్లిస్తే నాలుగు మృతదేహాల్ని అప్పగిస్తామని జాబు ఇవ్వటంతో, ఆంగ్లేయాధికారులు అందుకు అంగీకరించి అపరాధరుసుం చెల్లించి ఆ మృతదేహాల్ని తీసుకెళతారు.

బ్రిటిష్ యుద్ధవీరులుగా పేరు గాంచిన కవర్టు – హైటర్ మృతదేహాల్ని క్రైస్తవ సాంప్రదాయం ప్రకారం నర్సీపట్నంలో సమాధి చేస్తారు. కవర్టు – హైటర్ సమాధులు శ్రీరామరాజు చేసిన విప్లవ పోరాటానికి నేటికి గుర్తులుగా నిలబడ్డాయి. కవర్టు – హైటర్‌ల మరణం, ఆర్మిబేజ్ పరాజయం – స్టీవర్డ్ వెనుకంజ ఆంగ్లేయాధికారులను కృంగదీస్తుంది.

### 1.1.10 అడ్డతీగల పోలీసుస్టేషను ముట్టడి:

శ్రీ రామరాజు అడ్డతీగల పోలీసుస్టేషన్ను ముట్టడించేందుకు వస్తున్నాడని తెలుసుకున్న ఆంగ్లేయాధికార్లు ఎంతో ఆశ్చర్యం చెందుతారు. ప్రభుత్వ బలగాలు రామరాజును గురించి ఎంతగా గాలించినా, గూఢచారులు ఎంతగా రామరాజు గురించి ప్రజలను ఆరాతీసినా, వాళ్ళకు కించిత్తు కూడా ఆధారం దొరకదు.

బ్రిటీష్ ప్రభుత్వానికి ఆంధ్రుల తడాఖా చూపించాలంటే ముందుగా తమ దాడి

గురించి వాళ్ళకు హెచ్చరిక చెయ్యాలి కాని అక్టోబరు 13 తేదిన వర్తమానం పంపిస్తాడు. ఈసారి రామరాజును ఎలాగైనా బంధించాలనే నిర్ణయంతో షెర్లాక్స్ అనే పేరుగల ఇన్స్‌పెక్టర్ అడ్డుతీగల పోలీసుస్టేషన్‌ను రక్షించే బాధ్యత తీసుకుంటాడు.

తుపాకులు గురి తప్పకుండా పేల్చడంలో పేరుగల కొంత మంది సైనికులు పోలీసుస్టేషన్ చుట్టూ వలయాకారంలో పొంచి కూర్చుంటారు. ఇంతమంది పోలీసు అధికార్లు, సాయుధులైన సైనికులు అడ్డుతీగల పోలీసు స్టేషన్‌కు కాపలా ఉండగా రామరాజు ఆ పోలీసుస్టేషనుపై దాడి చేయడం సాహసం! ఆశ్చర్యం! అని రచయిత వర్ణించారు.

"శ్రీ రామరాజు 90 మంది విప్లవ వీరులతో 16.10.1922 రాత్రి 10 గంటలకు పోలీసుస్టేషన్ ముట్టడించేందుకు వచ్చారు. ముందుగా రామరాజు పదిమంది మెరికల్లాంటి వీరులతో పోలీసు స్టేషన్ సమీపంలో గల పాత ఆసుపత్రి దగ్గర కొచ్చి ఫైర్ అని అరిచాడు. ఆ అరుపు పోలీసులకు సింహగర్జనలా వినిపించింది. ఆ మరుక్షణంలో ఢాం... ఢాం.. అంటూ తుపాకులు పైకి పేలాయి. అంతే! తుపాకులు మ్రోత వినపడ్డంతోనే షేర్లాక్ పచ్చగడ్డి మాటున ప్రాణ భయంతో నక్కాడు. మిగిలిన పోలీసు సిబ్బంది తలకొక దిక్కుగా పారిపోయారు. శ్రీరామరాజు పోలీసుస్టేషన్‌లో అడుగుపెట్టాడు. అంతకు ముందే పోలీసులు ఆయుధాలు దాచేశారు. ఆయన తుపాకులు లభించకపోవడంతో స్టేషన్‌లో ఏ వస్తువును ముట్టకోకుండా తెల్లవారుఝూమున 3 గంటల దాకా స్టేషన్‌లోనే ఉన్నారు. దాదాపు అయిదు గంటల కాలం తన పంతం నెగ్గించుకొనేందుకు పోలీసుస్టేషనులోనే కూర్చున్న రామరాజును ఎదిరించేందుకు ఒక్క ఆంగ్లేయాధికారి కాని, ఒక్క సాయుధ పోలీసు కాని ఆ ఛాయలకు రాలేదంటే వాళ్ళల్లో ఉన్న మేకపోతు గాంభీర్యం వ్యక్తమవుతుంది"[16] అని పాలకులకు ఏర్పడిన భయభ్రాంతుల్ని వివరించారు.

రామరాజు మనుషులకు ఆయుధాలు లభించవుగాని, అపూర్వ విజయం మాత్రం లభిస్తుంది. ఎంతోమంది సాయుధ బలంతో విప్లవకారుల్ని పట్టుకుతీరుతాం అని ప్రగల్భాలు పలికిన ఆరుగురు ఆంగ్లేయాధికార్లు రామరాజు నీడను సైతం తాకలేకపోతారు.

శ్రీరామరాజు మెజిస్ట్రేటుకు ఉత్తరాలు రాస్తు అందులో తను మధ్యాహ్నం 3 గంటల వరకు పైడిగుట్టలో మకాం వేస్తున్నామని సంప్రదింపులకైనా, యుద్ధం చేయటానికైనా సరే అక్కడకు రమ్మని చెపుతాడు. అయితే మెజిస్ట్రేటు గాని, ఇతర ఆంగ్లేయాధికారులు కాని పైడిపుట్ట వెళ్ళేందుకు సాహసించరు.

'మొగుడుపోతే పోయాడు గానీ, గుండు బాగా కుదిరింది' అనే సామెతగా "అడ్డతీగల పోలీసుస్టేషన్‌పై దాడి జరిగింది గాని తుపాకులు పోలేదు" అని పై అధికార్లకు, కింది అధికార్లు తంతి పంపించారని రచయిత ఎద్దేవా చేస్తారు.

## 1.1.11 రంప చోడవరం స్టేషను ముట్టడి:

శ్రీరామరాజు తన విప్లవ సైన్యంతో రంప చోడవరం వైపు పయనిస్తున్నాడని విన్న పోలీసు అధికారులు ఆ స్టేషను రక్షించుకునేందుకు అనేక ప్రయత్నాలు చేసారు. 18.10.1922 తేది రాత్రి అడ్డతీగలకు వాయువ్య దిశలో ఉన్న వంద్రపోలు గ్రామానికి విప్లవకారులు చేరుకుని ఆహారాన్వేషణలో మునిగిపోతారు.

శ్రీరామరాజు తన సైన్యాన్ని మూడు భాగాలు చేసి ఆ మూడు దళాలను విప్లవ పోరాట ప్రచారానికి గ్రామగ్రామానికి పంపిస్తారు. ప్రతి గ్రామంలోను ఆయనకు ప్రజలు ఎదురేగి భక్తి శ్రద్ధలతో పూజిస్తారు. విప్లవానికి తమ మద్ధతు తెలుపుతారు.

శ్రీరామరాజు తెల్లదొరలు తమ కోసం ఏయే చర్యలు చేపడుతుంది, ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే వుంటాడు. వాళ్ళ చర్యలకు తను ప్రతిచర్యలు జరిపేందుకు రంగం సిద్ధం చేస్తారు. "అడ్డ తీగలకు 22 మైళ్ళ దూరంలో నున్న రంపచోడవరంకు రామరాజు తన 60 మంది విప్లవ సైన్యంతో అక్టోబరు 19వ తేది సాయంత్రం నాల్గు గంటలకు చేరాడు. ఆ వెంటనే మూడు దళాలుగా చీలిన విప్లవ కారులు విజయ ధ్వనులు చేస్తూ రంప చోడవరం తాలూకా కోబేరిని చుట్టుముట్టి తుపాకులను గాలిలోకి పేల్చారు. ధాం... ధాం.... శళబ్ధంతో తుపాకి గుండ్లు ప్రేలాయి"[17] అని రచయిత వివరించారు.

ఆ ధ్వని తాలూకా ప్రాంతమంతా మార్మోగుతు చుట్టుప్రక్కలనున్న ప్రజలు తండోపతండాలుగా రామరాజు చుట్టు చేరి జయ జయ ద్వానాలు చేస్తారు. జూన్ తన అనుచరులతో అక్కడ నుండి పారిపోతారు. శ్రీ రామరాజు తహసీల్దారును, యస్.ఐ.ను పిలిపిస్తారు. వారిద్దరు రామరాజు దగ్గరకొచ్చి నమస్కరిస్తారు. రామరాజు వాళ్ళతో చాలాసేపు మాట్లాడి, ఆ ఇరువురితో ప్రజా సమస్యలతో బాటు తన విప్లవోద్యమాన్ని గురించి వివరిస్తాడు.

శ్రీరామరాజు ముందు చెప్పి కొట్టిన దెబ్బల్లో ఆయుధాలు లభించకపోయినా తెల్లవాడి గుండెలదర గొట్టించి అడ్డతీగల, రంపచోడవరం పోలీసుస్టేషను ముట్టడి చేస్తారు.

### 1.1.12 తొలి పరాజయం:

06.12.1922 అప్పుడే తెల్లవారుతుంది. విప్లవకారుల్ని బంధించడానికి ఆన్, ఛార్లిస్‌లు ముగ్గురు భారతీయ అధికారులతో 56 మంది నాన్ కమీషన్ ఆఫీసర్లుతో సాయుధ సైన్యం, మలబారు పోలీసులతో కలసి లారీలలో కృష్ణదేవిపేట నుండి రామరాజును బంధించడానికి బయలుదేరుతారు. అయితే విప్లవకారులు ఆరాత్రే నిమ్మగడ్డ వెళ్ళారని తెలిసిన సైన్యం అటువైపు వెళతారు. అక్కడి నుండి రామన్నపాలెం వైపు వెళ్ళారని తెలుసుకున్న పోలీసు బలగాలు పెద్దగడ్డ పాలెం వైపు ప్రయాణిస్తాయి.

ఈ సమయంలో రామరాజుతో వున్న విప్లవకారులు ఇరవై మంది మాత్రమే! విప్లవకారులను తమ ఆధీనంలోకి తీసుకోవాలనే అభిప్రాయంతోనే ఆంగ్లేయాధికారులు తగ్గ వ్యూహాన్ని పన్నుతారు.

ఈ విషయం శ్రీరామరాజుకు తెలిసిపోతుంది. ప్రభుత్వ సైనికులకు వరిచేలో ఉన్నట్టు గమనిస్తారు. విప్లవకారులు విశ్రాంతి తీసుకుంటారు. విశ్రాంతి తీసుకుంటున్న విప్లవవీరులపై బ్రిటీష్ సైనికులు గుండ్లవాన కురిపిస్తారు. విప్లవవీరులు తక్కువమంది ఉన్నా, ధైర్యంతో ఎదురుకాల్పులు జరుపుతారు. ఆ అర్ధరాత్రి యుద్ధం భయంకరంగా సాగిన తీరును రచయిత కళ్ళకు కట్టినట్లు చిత్రించారు.

విప్లవకారుల నుండి కాల్పులు ఆగిపోవడంతో రామరాజు తన మిగిలిన వీరులతో పర్వతారణ్యంలో మాయమవుతాడు. ప్రభుత్వ సైన్యాలు ఆ ప్రాంతంలో గాలింపు చర్యలు చేపడతాయి. ఆ గాలింపులో నలుగురు విప్లవకారుల శవాలతో పాటు తీవ్రంగా గాయపడ్డ ఒక విప్లవకారుడ్ని, సైన్నం చుట్టిముట్టడంతో పారిపోవడానికి వీలులేని ఒక విప్లవ కాయుడ్ని బందీగా పట్టుకుంటారు.

"వారితో పాటు రెండు తుపాకులు, ఒక ఆటోమెటిక్ పిస్టలు, 300 బుల్లెట్లు, నాలుగు బోయ్‌నెట్లు, ఇంకా నాణాలు, కత్తులు కాకుండా రామరాజు సంచి కూడా ప్రభుత్వ సేనలు వశపర్చుకుంటాయి. ప్రభుత్వ సైన్యం కృష్ణదేవిపేట ప్రాంతంలో మృతదేహాల్ని వీధుల్లో ఈడ్చుతూ ప్రజల్ని భయకంపితుల్ని గావిస్తారు. అప్పటి వరకు అపజయము తెలియని శ్రీరామరాజుకు ఇది తొలి ఓటమి"[18] అని రచయిత పేర్కొన్నారు.

### 1.1.13 రెండవ ఎదురు దెబ్బ:

పెదగడ్డపాలెం నుండి జాన్ తన సైన్యంతో తిరిగి వచ్చిన తరువాత స్వీనీ తన సైనిక దళంతో విప్లవకారుల్ని పట్టుకునేందుకు బయల్దేరతాడు. ఈ దళంలో స్వీనీతో బాటు కీన్, గుడ్సిల్, మరో ముగ్గురు భారతీయ అధికారులు 50 మంది సాయుధ పోలీసులు లారీలో బయల్దేరతారు.

స్వీను తన సైన్యంతో లింగాపురం, ధారకొండ ప్రాంతాలలో విప్లవకారుల కోసం గాలించి రాత్రి (07.12.1922) విప్లవకారుల్ని పట్టి తీరాలనే నిశ్చయంతో అరణ్య ప్రాంతమంతా గాలించ ప్రారంభిస్తాడు. చిట్టచివరకు విప్లవకారులు కనిపిస్తారు. అందరు గలగల పారే ఏటి ఒడ్డున ఇసుకలో నిద్రిస్తారు. కాస్తంత దూరంలో ఇద్దరు విప్లవ కారులు పహరా కాస్తుంటారు. స్వీనీ తన సైన్యంతో చేత్తో సైగ చేస్తాడు. ఆ వెంటనే విప్లవకారులు పడుకొన్న స్థావరంపై ధన్... ధన్.... ధన్.... శబ్ధంతో బుల్లెట్లు కురుస్తాయి. ఆ వెంటనే ఫిరంగులు పేల్చబడ్డాయి. శ్రీరామారాజు చివాలున లేస్తాడు. విప్లవకారులు మెరుపువేగంతో లేచి, ఆయుధాలు అందుకొని గుట్టల మాటున చెట్లబాటున నక్కుతారు.

ఆ మరుక్షణంలో పరస్పర కాల్పులు ప్రారంభమై దాదాపు గంటకు పైగా పోరాటం జరుగుతుంది. మొత్తం ఎనిమిది మంది విప్లవకారులు మరణించగా, నలుగురు సైనికులు బందీలుగా దొరుకుతారు. రామరాజు వెంటనే అక్కడి నుండి దట్టమైన అరణ్యంలోకి మెరుపులా మాయమౌతాడు.

ఆనాటి పోరాటాల్లో మరణించిన విప్లవవీరులు 12 మంది ప్రభుత్వం తరుపున ఒక్క జమీందారుకు మాత్రమే కడుపులో బుల్లెట్ దిగబడుతుంది. విప్లవకారులకు సంబంధించిన ఆయుధాలు 9 పోలీసు తుపాకులు, వాటికి సంబంధించిన తూటాలు 748, 2 త్రీనాట్ త్రీ రైఫిల్స్, వీటికి సంబంధించిన తూటాలు 162, బాయెనెట్లు 17, (6) ఆరు కత్తులు, స్కాట్ కవర్డ్ దగ్గర తీసుకున్న ఆటోమెటిక్ ఫిస్తోలు, రామరాజు సంచి, వంటిసామాగ్రి, ఆహార పదార్థాలు, ఇంకా అనేక వస్తువులు పోలీసుల వశమవుతాయి.

ఈ సంఘటన విప్లవకారులకు పెద్ద నష్టాన్ని తెచ్చిపెడుతుంది. ప్రభుత్వానికి రామరాజు కాని, అతని ముఖ్య విప్లవకారులు కాని పట్టుబడక పోడం నిరాశజనమవుతు ఎలాగైనా సరే రామరాజును పట్టి తీరాలని మరికొంత సాయుధ బలగాల్ని, ఆయుధ సామగ్రిని ఆంగ్లేయాధికారులు రప్పిస్తారు.

"శ్రీరామారాజును పట్టుకొన్ని వారికి 10,000/-, గంటదొరకు 1,000/-, మల్లుదొరకు 1,000/- బహుమతి ఇస్తామని ఏజన్సీ కమీషనరు జె.ఆర్. హగ్గిన్సు ప్రకటిస్తారు. విప్లవకారుల జాడ కొంతకాలం తెలియదు"[19] అని బహుమతులకు సంబంధించిన ప్రకటనను రచయిత స్పష్టంగా తెలియజేశారు.

## 1.1.14 బ్రిటీష్ సైన్యానికి చిక్కిన మల్లుదొర:

"శ్రీరామరాజుకు కుడిభుజం అనదగ్గ మల్లుదొర మొదటి నుండి త్రాగుడు, వ్యభిచారము ఈ రెండు దురభ్యాసములు వదలకుండా దయ్యంలా పీడిస్తున్నాయి శ్రీరామరాజు ఈ విషయంలో ఎన్నోసార్లు అతడ్ని మందలించినా మల్లుదొర దాన్ని తాత్కాలికముగ విడిచిపెట్టడమో లేక రామరాజుకు తెలియకుండా ఆ రెండు పనులు చేయడమో జరుగుచుండేది"[20] అని మల్లుదొర బలహీనతల్ని రచయిత తెల్పారు.

ఒకనాడు మల్లుదొర సరాసరి నడింపాలెం గ్రామంలో వున్న తన ఉంపుడుకత్తె సువర్ణ పింకుబుల్లి అనే చితుకులమ్మ ఇంటికి వెళ్ళి ప్రతీరోజూ తప్పత్రాగి ఆమెతో కాలం గడుపుతాడు. ఈ వార్త కృష్ణదేవిపేటలో వున్న కేరన్స్‌కు చేరుతుంది. మల్లుదొరను పట్టుకుంటే రామరాజును పట్టుకున్నట్లేనని కేరన్స్ సంతోషిస్తాడు. వెంటనే నడింపాలేనికి తన బలగాలతో బయల్దేరతాడు. 1923 సెప్టెంబరు 17వ తేదీన రాత్రి 11 గంటలు మల్లుదొర వున్న ఉంపుడు కత్తె ఇంటిని పోలీసుబలగం చుట్టుముడుతుంది. ఆయుధాలు ఎక్కుపెడతారు అధికార్లు ఈ సందడి విన్న మల్లుదొర ఇంటిలో వున్న అటక పైకెక్కుతాడు. కీరన్స్ ఇల్లంతా సోదాచేస్తూ తలెత్తి పైకి చూస్తాడు. కీరన్స్ అనుమానం కలగగా వెంటనే తన సిబ్బందిని పైకి ఎక్కి చూడమంటాడు చివరకు తుపాకులు లోడు చేసిన నలుగురు పోలీసులు అటక ఎక్కి మల్లును కాల్చి వేస్తామని బాయ్‌నెట్లతో పొడుస్తూ అతడిపై బడి బంధించారు.

ఆనాడు ఆంగ్లేయాధికార్లు ఎంతో సంతోషిస్తారు. మన్యం ప్రాంతంలో విప్లవం ప్రారంభమైన తర్వాత ఆంగ్లేయులకు లభించిన తొలి విజయం యిది.

మల్లుదొరను బంధించి కృష్ణదేవి పేటకు అక్కడి నుండి నర్సీపట్నం, విశాఖపట్టణం సెంట్రల్ జైలుకు తీసుకెళ్ళి బంధిస్తారు. మల్లుదొర నుండి విప్లవ రహస్యములు రాబట్టేందుకు అతడ్ని చిత్రహింసల పాల్జేసినా అతడు నోరు విప్పడు. దాంతో "1924 ఏప్రియల్ నెలలో మల్లుదొరపై సెషన్స్ జడ్జి విచారణ జరిపి, అతనిపై రాజద్రోహి నేరం మోపి 1924 మే 12న ఉరిశిక్ష విధించారు. దానికి మల్లుదొర అప్పీలు చేసుకోగా ఉరిశిక్ష రద్దు

చేసి 13 సం॥ల 6 మాసాల జైలు శిక్షగా విధించి అండమాన్ దీవులకు పంపించబడ్డాడు"[21] అని చారిత్రక సంఘటల్ని వివరించారు రచయిత.

ఆ తర్వాత కొంతకాలం ఇంటర్న్‌మెంటు ఆర్డర్ క్రింద జీవితం గడిపిన తరువాత 1937వ సం॥లో అవిభక్త మదరాసు రాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడినప్పుడు మల్లుదొరను విడుదల చేస్తారు.

1952 సం॥లో డా॥ లంక సుందరం ప్రోత్సహంతో పార్లమెంటుకు పోటీ చేసి గెలుస్తాడు. స్వాతంత్ర్య భారతదేశాన్ని కళ్ళారా గాంచింది రామరాజు అనుచరుల్లో ఆయన ఒక్కడేనని చెప్పవచ్చు. మల్లుదొర 1969వ సంవత్సరంలో చిట్టచివరి పితూరి యోధుడు మరణిస్తాడు.

### 1.1.15 అగ్గిరాజు – అరెస్టు:

1924వ సంవత్సరం మే నెల 6వ తేది... కొండపల్లి గ్రామంలో రామరాజు తన అనుచరులతో అక్కడున్నాడని సి.ఐ.డి. ఇన్స్‌పెక్టరు ఉపేంద్ర పట్నాయక్ అనే వ్యక్తికి తెలిసినా, నిజానికి అది వదంతి మాత్రమే!

"మలబారు పోలీసులు ఆ గ్రామాన్ని చుట్టుముట్టి విధ్వంసానికి పూనుకున్నారు. అయితే విప్లవకారులు కొండపల్లి నుండి కిర్రాబు వైపు వెళ్ళారని తెలిసి, ఉపేంద్ర పట్నాయక్ అటువైపు తన సైన్యంలో ప్రయాణించారు. కిర్రాబు దాటిన తర్వాత ఒక మైలు దూరంలో మారేడునది వెంబడి మలబారు పోలీసులు వెల్తున్న సమయంలో సమీప వాగులో ఇసుక తిన్నెల వద్ద అగ్గిరాజు 50 మంది అనుచరులతో కనిపించారు. వెంటనే ఉపేంద్ర పట్నాయక్ తన సైనికులకు ఆజ్ఞలు జారీ చేశాడు"[22] అని పేర్కొన్నారు.

బ్రిటీష్ సైనికులు, విప్లవకారులు పరస్పరం కాల్పులు జరుపుకోనారంభించగా సైన్యం వద్ద గల ఆధునిక ఆయుధాల ముందు విప్లవకారుల మజిల్ లోడర్స్ తుపాకులు ఏపాటి? కొంత సేపటికి విప్లవ సైన్యం పలుచబడుతుంది. అగ్గిరాజు తన బృందంలో వెనుకడుగు వేస్తాడు. ప్రభుత్వ సైన్యం వారిని తరమగా అగ్గిరాజు తాను శత్రువుల చేతికి చిక్కరాదనే తలంపుతో పరుగెత్తుతాడు. అదే సమయంలో ఒక సైనికుడు పేల్చిన తుపాకి గుండు అగ్గిరాజు కాలికి తగడంతో అతడు కుప్పకూలిపోతాడు. ప్రాణాలతో వాళ్ళకు దొరికరాధనే దగ్గరలో కనిపించిన బావిలోకి దూకగా పట్నాయక్ తన సైనికుల్ని బావిలో దిగి అగ్గిరాజును ప్రాణాలతో బంధించమంటాడు.

సైనికులు బావిలోకి దూకి అగ్గిరాజును బంధిస్తారు. ఆ తర్వాత అగ్గిరాజు నుండి తమకు కావలసిన ఎట్టి సమాచారం లభించకపోవడంతో అతనిపై ఎటువంటి విచారణ లేకుండానే అండమాను జైలుకు తరలిస్తారు. తెల్లదొరలు గుండెల్లో బాంబులు పేల్చిన అగ్గిరాజు చరమ జీవితం అండమానడవిలోనే ముగుస్తుంది.

చాలామంది అగ్గిరాజు ప్రభుత్వ తొత్తుగా మారాడనే అపవాదులేస్తారు. కాని అతని ద్రోహానికి వడిగట్టిన రుజువులెక్కడా కనిపించవు. అయితే అతను తొందరపాటు మనస్తత్వం గలవాడు. విప్లవకారుడెప్పుడు తన శత్రువు బలాన్ని అంచనావేయాలి. పోరాట సమయంలో ఒక అడుగు ముందుకు, రెండడుగులు వెనక్కు వేసే సిద్ధాంతంపై నడవాలి. అగ్గిరాజు ఆ సిద్ధాంతం అప్పుడూ పాటించలేదు. కాబట్టి అతడి విప్లవ జీవితం ఈ విధంగా ముగిసింది.

## 1.1.16 విప్లవ వీరుడు శ్రీరామరాజు అస్తమయం (వీరమరణం):

శ్రీరామరాజు పర్లాకిమిడి నుండి మన్యం తిరిగివచ్చిన తర్వాత మన్యం ప్రజలు ప్రభుత్వ సైన్యాలు తను పెట్టిన బాధలు చెప్పి చెప్పి రోదిస్తారు. మానాలు కోల్పోయిన ఆడపడుచులు, భర్తలను కోల్పోయిన ఇల్లాళ్ళు, బిడ్డలను కోల్పోయిన తల్లులు, సమస్త ఆస్తులూ కోల్పోయిన కుటుంబాలు... ఒక్కరేమిటి వేలాది మన్యం ప్రజల కన్నీటి బాధమయగాధలు అన్ని శ్రీరామరాజు హృదయం శోకాలతో బద్ధలవుతుంది.

మల్లుదొర తన చెడు వ్యసనాల వెల్లువలో, అగ్గిరాజు తన స్వంత నిర్ణయాలతో ప్రభుత్వ సైనాకులకు దొరకడంతోను, అనేకమంది విప్లవకారులు మరణించడం, గాయపడ్డం, బంధీలుగా చిక్కడంతో విప్లవ పురోగతి మందగిస్తుంది. దానికితోడు ఆయుధ కొరత, వీటన్నింటి కంటే అతి ముఖ్యమైంది మన్యం ప్రజలు పడే నరకయాతనలు వర్ణనాతీతం.

తను ఏ ప్రజలను తన బిడ్డలుగా భావించి వాళ్ళ స్వేచ్ఛ స్వాతంత్ర్యల కోసం భారత దేశ విముక్తి కోసం ఎవరి ప్రోత్సహం, ఏ రాజకీయ పార్టీ అండ లేకుండా చేతికందిన వస్తువులే ఆయుధంగా చేసి విప్లవోద్యమం నడిపితే ఆ ఉద్యమాన్ని ఎదురు తిరిగి తన వాళ్ళనే కబళిస్తూంటే రాజు వ్యధకు లోనవుతాడు.

"రూధర్‌ఫర్డ్ వలన అనేక గ్రామాలు, ప్రజలు నష్టపోయారు. అందు కొరకు తనను పట్టి అప్పగిస్తే రూ. 10,000/–లు బహుమతి లభిస్తుంది. ఆ డబ్బుతో నష్టపడ్డ గ్రామాల బాగు కొరకు వినియోగించవచ్చునని శ్రీరామరాజుకు ఆలోచన వచ్చింది.

అందుకు మంపర మున్సబుదారుడుకి విషయం చెప్పగానే! నమస్కరించి స్వామీ! నాదేవుడ్ని నేను రాక్షసులకు అప్పగిస్తానా? నన్ను క్షమించండి అంటూ ఆయనకు అతిథి మర్యాదలు చేశాడు"[23] అని మున్సబు స్వామిభక్తిని రచయిత వెల్లడించారు.

ఆ రాత్రి మంపలో విశ్రమించిన రామరాజు పాలు, పండ్లు తీసుకొని ఆలోచనలో పడ్డాడు. ఆయన మనో నేత్రాల్లో యందు ఆంగ్లేయ సైనికులు గ్రామాల్ని తగులబెట్టడం, స్త్రీలను చెరచడం, పసిబిడ్డల్ని, వృద్ధుల్ని నరికి చంపడం లాంటి దృశ్యాలే గోచరమవుతాయి.

1924 మే 7 తేది తెల్లవారుజామున రామరాజు కొయ్యూరు గ్రామ సమీపంలో గల ఏటిలో స్నానం చేసి జపంలో వున్న సమయంలో మంప మున్సబుదారు తన పశు వుల కాపరి ద్వారా చెంబు నిండా పాలు పంపిస్తాడు. జపం ముగిసిన తర్వాత పాలను త్రాగి పశువుల కాపరితో కొయ్యూరులో గల సైనిక శిబిరంలో తను ఇక్కడ వున్నాని చెప్పి పోవలసినదని చెప్పడంతో ఏది మంచో, ఏది చెడ్డో తెలియని ఆ అమాయకుడు, స్వామి చెప్పారు చెప్పకపోతే పాపం అనుకొని అలాగే చెప్పి వెళతాడు.

ఆ అమాయకుడు చెప్పిన వార్తను బ్రిటీష్ సైనికులకు నమ్మశక్యం కాదు. ప్రభుత్వాధికార్లకు శ్రీరామరాజును చూద్దామనే ఆలోచనతో 25 మంది మలబారు సైనికులతో ఆళ్వారు నాయుడు, రామరాజును నాలుగు బారల దూరంలో చూచి ఒక్క క్షణం కన్నులు మూసుకొని నమస్కరిస్తారు.

తను నిరాయుధుడ్ని తనేమి చెయ్యను. రమ్మని చెప్పడంతో అళ్వారునాయుడు, మలబారు సైనికులు రామరాజు దగ్గరకు వచ్చి దగ్గరలోనున్న చెట్టుకు బంధించి మొహాన్ని బట్టతో కప్పివేస్తారు. మేజర్ గుడాల్ శ్రీరామరాజు దగ్గరకు వచ్చి రామరాజూ! నీ బంధువులకు చివరిసారిగా ఏమైనా చెబుతావా? కర్కశంగా అడుగుతాడు.

"గుడాల్! నువ్వు స్వతంత్రంగా నాకు మరణదండన విధించడానికి నీకు హక్కు ఎక్కడిది? నేను నీకు స్వచ్ఛందంగా లొంగిపోయాను. నన్ను నీవు స్వచ్ఛందంగా కోర్టులో హాజరు పెట్టాలి. అది నీ బాధ్యత" అని శాంతంతో శ్రీరామరాజు అంటాడు.

"రామరాజూ! నేను నిన్ను కోర్టుకు అప్పగించినా నీకు న్యాయం జరగదు. ఆ కోర్టులు ఆ చట్టాలు మేం సృష్టించినవే! నేను ఏది చేస్తే అదే న్యాయం నువ్వు మరణానికి సిద్ధంగా ఉండు అని మేజర్ గుడాల్ పలికాడు."[24]

మేజర్ గుడాల్ తన ప్రక్కనే నిలబడ్డ జమీదారుకు సైగ చేయగా జమీదారు వణికే చేతులతో రామరాజు పైకి తుపాకి పేల్చుతాడు. గురి తప్పిన తుపాకి గుండు ఎడమచెయ్యి పైభాగంలో దిగబడుతుంది.

రామరాజు బాధతో మూలుగుతాడు తప్ప ఒక్క మాట కూడ మాట్లాడడు. తుపాకీ గురి తప్పినందుకు జమీదారుపై గుడాల్ మండిపడతాడు. కిట్ నుండి తన రివాల్వరు బయటకు తీసి రెండు అడుగులు ముందుకు వేస్తాడు. అప్పటికే రామరాజు భుజం నుండి రక్తం పారుతుంది.

మేజర్ గుడాల్ రామరాజు గుండెలకు తన రివాల్వరు గురి చూచి ట్రిగ్గర్ నొక్కుతాడు. ధన్ అనే శబ్ధంతో బుల్లెట్ ముందుకు దూసుకెళ్ళి రామరాజు గుండెల్లో దిగబడడంతో.

07.05.1924న చనిపోతాడు పరమ కిరాతకంగా రివాల్వరుతో పేల్చి చంపబడిన రాజు మృతదేహాన్ని 08.05.1924 తేదిన కృష్ణదేవిపేటలో దహనం చేస్తారు.

ఆ విధంగా ఈ విప్లవోద్యమం అరుణ భాస్కరుడు అతని 27 ఏటనే వీరమరణం పొందుతాడు. కాని ఈ సంఘటన స్వాతంత్ర్యోద్యమ వీరులకు రెట్టించిన ఉత్తేజాన్ని కలిగించి స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు సాధించేవరకు వారిని నిద్రపోకుండా చేసింది.

### 1.1.32 గంటందొర చివరి విప్లవ వీరుడి మరణం:

శ్రీరామరాజు అస్తమించిన తర్వాత గంటందొర కొరకు ఇతర విప్లవకారులు 15 సైనిక దళాలు మన్యం అంతా గాలించసాగాయి. ఈ చర్యలో భాగంగా గంటందొర మొదటి భార్యను బిడ్డలను ప్రభుత్వం బంధిస్తుంది. రెండవ భార్య పోలీసులకు చిక్కకుండా అరణ్యంలోకి పారిపోతుంది.

07.06.1924 గంటందొరతో పాటు మరో ఎనిమిది మంది విప్లవకారులు. ఒక చెట్టు మీద కూర్చోగా పొత్తూరు బంగారయ్య అనే అనుచరుడు కాపలా కాస్తుంటాడు. ఇతడి చేతిలో విల్లమ్ములు మాత్రమే వుంటాయి. వాళ్ళనే వెదుకుతున్న కొంతమంది సైనికులు విప్లవకారులను చూడడంతోనే తుపాకులు ఎక్కుపెట్టి ఇతడి మీద కాల్పులు జరపగా వెంటనే కూలిపోతాడు బంగారయ్య.[25]

ఈ శబ్ధాలకి వెంటనే సమాయత్తమైన గంటందొర అతని అనుచరులు ఎదురు కాల్పులు ప్రారంభిస్తారు. తమ తుపాకుల్లో చివరి గుండ్లు అయిపోయేంతవరకు సైనికులపై

కాల్పులు జరుపుతారు. కాని విప్లవకారుల వద్ద యుద్ధ సామాగ్రి అయిపోతుంది.

ప్రభుత్వ సైనికులకు గంటందొర అదురు, బెదురు లేకుండా తమ మధ్యలో నిలబడ్డం చూచి వాళ్ళకు చిరుచమటలు పోస్తాయి. వెంటనే గంటందొరపై అతని అనుచరులపై గుళ్ళ వర్షం కురిపిస్తారు. ఒక్కొక్క విప్లవకారుని శరీరంలో డజన్ల కొద్ది గుండ్లు దిగబడతాయి.

గంటందొరతో పాటు విప్లవకారులందరు తమ విప్లవ నేత అల్లూరి సీతారామరాజును తలచుకుంటూ ఆత్మత్యాగం చేసి ప్రాణాలు విడుస్తారు. గంటందొర మరణించిన తరువాత వరసగా గోకిరి ఎర్రెసు, జూన్ 16వ తేదిన బొంకుల మోరిగాడు ప్రభుత్వానికి పట్టుబడుతారు. దాంతో రామరాజు ప్రారంభించిన విప్లవోద్యమం పూర్తిగా అణగారిపోతుంది.

ఈ విధంగా శ్రీరామరాజు పోరాట ప్రతిభను ఈ చరిత్ర రచనలో కళ్ళకు కట్టినట్లు రసభరితంగా చిత్రించారు.

“22.08.1922 తేదిన ప్రారంభమై మన్యం పితూరి 16.06.1924 తేదితో ముగిసినది. దాదాపు రెండు సంవత్సరాల కాలం సర్వసైన్య సమేతమైన ఆధునిక ఆయుధ సంపత్తి కలిగిన ప్రపంచంలో అతి పెద్ద బ్రిటీష్ ప్రభుత్వాన్ని 27 సం॥లు నిండిన యువకుడు అతి కొద్దిమందితో సరియైన ఆయుధాలు లేకుండా, కేవలం ప్రజలను కలుపుకొని చేసిన విప్లవ పోరాటంలో చెమటలు కక్కించాడంటే ఎంతటి అసామాన్యుడో మనం అర్థం చేసుకోవచ్చు!”[26]

అల్లూరి సీతారామరాజు రగిల్చిన విప్లవజ్యోతి విశాఖపట్నం మన్యంలో వెలసిన విప్లవం. భారతదేశమంతటా వ్యాపించి బ్రిటీష్ ప్రభుత్వాన్ని కూకటి వేళ్ళతో కూల్చివేయడానికి ఒక మార్గదర్శంగా వెలసింది. భారతస్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఆంధ్రబిడ్డ పౌరుషాన్ని అల్లూరి చరిత్రను సువర్ణ అక్షరాలలో వ్రాయబడింది.

### 1.2 దంతులూరి వెంకటరామరాజు:

విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు చరిత్రను దంతులూరి వెంకటరామరాజు రాశారు. సుమారు 220 పుటల గ్రంథంలో బాల్యం నుండి మరణం వరకు వివరించారు. ఇందులో వివిధ ప్రముఖుల ప్రశంస పత్రాలు విప్లవ లక్ష్యమును పొందుపరిచారు.

అల్లూరి సీతారామరాజు బాల్యం గూర్చి వివరిస్తూ...

## 1.2.1 శ్రీరామరాజు పుట్టుక – పూర్వోత్తరాలు:

"అల్లూరి అనే ఇంటి పేరు గల క్షత్రియ వంశీయులు మొదట తూర్పుగోదావరి జిల్లా కోనసీమకు చెందినవారు. వీరి స్వస్థలం రాజోలు తాలుకాలోని కోమటిలంక గ్రామం. కొంతకాలానికి కోమటిలంక గ్రామం గోదావరి వరదలో మునిగిపోయింది. అప్పుడు అల్లూరి వంశీయులు అప్పనపల్లి గ్రామానికి వెళ్ళి స్థిరపడ్డారు. అల్లూరి వంశానికి మూల పురుషుడు అల్లూరి రామభద్రరాజు. ఈయన కొంతకాలం తర్వాత తూర్పుగోదావరి జిల్లా విడిచి గుంటూరు జిల్లాకు వలస వచ్చారు. అక్కడ నరసారావుపేట తాలూకాలోని బోప్పడి గ్రామానికి చేరి స్థిరపడ్డారు."[27]

"ఈ రామభద్రరాజుకు ఆరుగురు కుమారులు 1) వెంకట కృష్ణంరాజు 2) సీతారామరాజు 3) గోపాల కృష్ణంరాజు 4) వెంకట నరసింహారాజు 5) అప్పలరాజు 6) వెంకటరామరాజు. వీరిలో మూడోవాడు గోపాలకృష్ణం రాజు అల్లూరి సీతారామరాజుకు ముత్తాత. ఇతని ఏకైక పుత్రుడు అల్లూరి వెంకట కృష్ణంరాజు సీతారామరాజుకు తాత.

ఇతడు గుంటూరు జిల్లాను విడిచి, పశ్చిమగోదావరి జిల్లాకు వలస వచ్చారు. అక్కడ భీమవరానికి సమీపాన వున్న మోగల్లు గ్రామంలో స్థిరపడ్డారు.

భీమవరం ఇప్పుడు పశ్చిమగోదావరి జిల్లా యందు కలదు. కాని రామరాజు జననము నాటికి పశ్చిమగోదావరి జిల్లా ఏర్పడలేదు. అప్పుడు భీమవరము కృష్ణాజిల్లాలోనే ఉండేది.

అల్లూరి వెంకట కృష్ణం రాజుకు అయిదుగురు కొడకులు 1) రామచంద్రరాజు 2) వెంకట రామరాజు 3) రామకృష్ణం రాజు 4) రంగరాజు 5) రామభద్రరాజు. వీరిలో రెండోవాడు అల్లూరి వెంకటరామరాజు, సీతారామరాజు తండ్రి.

వెంకటరామరాజుని మేనమామ కూతురును వివాహము చేసుకోమని ఒత్తిడి చేస్తారు ఆ సంబంధం ఇష్టం లేక కొంత సొమ్ముతో రహస్యంగా ఒక రోజు అర్ధరాత్రి బొంబాయి వెళ్ళిపోతాడు. అక్కడ తన అభిరుచులకు అనుగుణంగా ప్రసిద్ధుల వద్ద శిష్యరికమును చేసి, ఆ చిరకాలములోనే ప్రావీణ్యత గలిగిన ఫొటోగ్రాఫర్‌గా, నైపుణ్యము గలిగిన చిత్రకారుడుగా ఆంధ్రదేశమునకు తిరిగి వస్తాడు.

# మోగల్లు వంశవృక్షం


అల్లూరి రామభద్రరాజు (బొప్పూడి)
(3)
అల్లూరి గోపాలకృష్ణంరాజు
(భార్య: సుభద్రమ్మ)
వెంకటకృష్ణరాజు (మోగల్లు)
(భార్య: సీతమ్మ)
(4)
వెంకట నరసింహరాజు
(మోగల్లు)
వెంకటరామరాజు
వెంకట కృష్ణంరాజు
నరసింహరాజు
సత్యనారాయణరాజు
బోసురాజు
గోపాలరాజు
శ్రీరామరాజు
వెంకటరామరాజు
(దెవిటిరామరాజు)
రామచంద్రరాజు
వెంకటరామరాజు
(భార్య:
సూర్యనారాయణమ్మ)
రామకృష్ణంరాజు
రామరాజు
నారాయణరాజు
రంగరాజు
వెంకటకృష్ణంరాజు
గోపాలకృష్ణంరాజు
రామభద్రరాజు
శ్రీరామరాజు
(విప్లవవీరుడు)
సీతమ్మ
(భర్త: దంతులూరి
వెంకటపతిరాజు)
దంతులూరి
వెంకటరామరాజు
(గ్రంథకర్త)
సత్యనారాయణరాజు
(జె. బూరుగుపూడి)
(చిన్నంపేట
దంతులూరివారి
అల్లుడు)
శ్రీరామరాజు
వెంకట సుబ్బరాజు
తిరుపతిరాజు

విశాఖజిల్లా, భీమునిపట్నం తాలూకా పాండ్రంకి వాస్తవ్యులైన శ్రీ మందలపాటి శ్రీరామరాజు కుమార్తె సూర్యనారాయణమ్మతో వెంకటరామరాజు వివాహం 1893 సం॥లో సింహాచలం దేవాలయంలో జరిగింది.

ఈ దంపతులకు ప్రథమ సంతానం అల్లూరి శ్రీరామరాజు. 1897వ సంవత్సరము జూలై 4వ తేది సాయంత్రం 4 గంటలకు తెలుగు పంచాంగం ప్రకారం హేవళంభినామ సంవత్సరము ఆషాడమాసంలో శుద్ధ పంచమి తిథిలో ఆదివారం నాడు మఖా నక్షత్రయుక్త వృశ్చికలగ్నమందు విశాఖజిల్లా, భీమునిపట్నం తాలూకా పాండ్రంగి గ్రామంలో అమ్మమ్మ గారింట్లో జన్మించారు. సూర్యనారాయణమ్మ తండ్రిగారి పేరు శ్రీరామరాజు. తన కుమారుడికి కూడా శ్రీరామరాజు నామకరణ చేసారు.

తర్వాత "సొంతవూరు మోగల్లులో సూర్యనారాయణమ్మ 1901 సంవత్సరంలో ఒక కుమార్తె సీతమ్మను, రాజమహేంద్రవరంలో 1906 సంవత్సరములో మరో కుమారుడు సత్యన్నారాయణరాజు ఆమెకు పుట్టారు.[28]

పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జన్మించినపుడే పుట్టదు జనులా
పుత్రుని కనుగొని పొగడగ
పుత్రోత్సాహంబు నాడు పొందురు సుమతీ!

అని సుమతీ శతకకారుడు చెప్పినట్లు ఇది సంపూర్ణ సత్యముగా భారత ప్రజలు కొనియాడదగిన రీతిలో ఆంధ్రరాజ్య కీర్తిని దశదిశల వ్యాపింపచేసినా ధన్యజీవి... పుణ్యజీవి... విప్లవ జ్యోతి.

### 1.2.2 చిన్నతనం – స్వాతంత్ర్య కాంక్ష:

"అల్లూరి సీతారామరాజును చిన్నతనంలో తల్లిదండ్రులు, బంధువులు చిట్టిబాబు" అని ముద్దుగా పిలిచేవారు. ఇతని బాల్య జీవితంలో పూర్వదశ తన స్వగ్రామమైన మోగల్లుతోనే ఎక్కువగా సాగింది. కొంతకాలం నరసాపురం, తణుకు నగరాల్లో సాగిన, ఉత్తరదశ రాజమహేంద్రవరంలో గడిచింది.

1902 సంవత్సరములో కుటుంబంతో సహ రాజమహేంద్రవరం చేరుకుంటారు. ఇన్నీస్‌పేటలో ట్రైనింగ్ కాలేజీ దగ్గర స్టూడియో పెట్టాడు రామరాజు తండ్రి. రాజమండ్రి

వాసులకు వెంకటరామరాజు యొక్క పనితనం బాగా నచ్చింది. మంచి పేరొచ్చింది. ఆదాయం కూడా పెరిగింది. దాంతో పిల్లలకు ఏలోటు లేకుండా జీవిస్తారు. రాజమండ్రి సెంట్రల్‌జైల్లోని ఫొటోల్ని కూడా ఆయనే తీసేవాడు. వాటిని ఎన్‌లార్జ్ చేసి తన స్టుడియో గోడలకు అలకరించాడు.

20వ శతాబ్ధం నాటికే దేశప్రజల్లో స్వాతంత్ర్య కాంక్ష బాగా ప్రబలింది. 1905లో బెంగాల్ విభజన జరిగింది. స్వదేశ ఉద్యమం ప్రారంభమైంది. వందేమాతరం నినాదాలు దేశమంతా మిన్నుముట్టాయి. స్వాతంత్ర్య కాంక్ష ప్రజల్లో పెరిగింది. వెంకటరామరాజు తన వృత్తి రీత్యా ఉద్యమాలలో బహిరంగంగా పాల్గోనకపోయినా తన మనస్సులో పరాయిపాలనపై అసహ్యభావం స్వాతంత్ర్యోద్యమంపై ఆకాంక్ష బలంగా ఉండేది. ఇంట్లో ఉన్నప్పుడు తన పిల్లలకు పరాయి ప్రభుత్వ రాజ్యపాలన గురించి స్వరాజ్యం గురించి విపులంగా బోధిస్తుండేవాడు. ఆ ప్రభావం బాలుడయిన సీతారామరాజు మనస్సులో తండ్రి చెప్పిన మాటలు గాఢంగా నాటుకున్నాయి.[29]

“అల్లూరి సీతారామరాజుకి బాల్యంలో ఒక సంఘటన జరిగింది. ఒక రోజు సాయంత్రం రాజమండ్రిలో సీతారామరాజు తన తండ్రితో కలసి వ్యాహ్యాళికి వెళ్తున్నారు. ఆ సమయంలో ఒక తెల్లదొర గుఱ్ఱం మీద వెళ్తున్నారు. ఆంగ్లేయుడుకి గట్టు మీద నడిచే ప్రజలు నమస్కరిస్తున్నారు. అది చూసి సీతారామరాజు కూడా నమస్కరించటానికి చేతులెత్తాడు. తక్షణం తండ్రి ఆ చేతుల మీద ఠపీమని కొట్టి “తెల్లవాడికి నమస్కరిస్తావా? వాళ్ళు నీచులు మన దేశాన్ని ఆక్రమించుకొని దోపిడి చేస్తున్న దొంగలు. వాళ్ళకి నమస్కరించడం మన ఆత్మాభిమానానికే గొడ్డలి పెట్టు” అని మందలించాడు. ప్రతి భారతీయుడు తెల్లదొరలు పాలన నుండి దేశాన్ని విముక్తి చేసేందుకు ప్రయత్నించాలి అని చెప్పాడు.

ఆనాటి తండ్రి మాటలు సీతారామరాజు పసి హృదయంలో నాటుకున్నాయి. అన్యాయాన్ని ఎదిరంచగల ధైర్యం తన మదిలో ఉదయించింది. ఆ సంఘటనతో తెల్లవాళ్ళను ఈ దేశం నుండి తరిమికొట్టాలన్న భావన ఆ చిన్న వయసులో తన నరనరాన జీర్ణించుకుపోయింది. ఈ సంఘటనతో రామరాజు జీవితములో గొప్ప మార్పు సంభవించింది”.

ఇలా ఉండగా ఒకనాడు రామరాజు బాల్యంలో మరియొక సంఘటన. అల్లూరి

మిత్రులతో కలసి గోదావరి నది తీరమునకు వెళ్ళును. వారికి ఆ పవిత్ర నదీజలమును చూచి ఈదులాడవలెనని కోరిక కలిగింది. నిజమునకు వారికెవ్వరికి యీతరాదు. నీళ్ళలో ఆటలాడుకుంటున్నారు. ఇంతలో ఒక బాలుడు నీళ్ళ లోతులోకెళ్ళి మునిగిపోతూ ఊపిరాడక ఉక్కిరి బిక్కిరయ్యాడు. అతడు ప్రమాద స్థితిలో ఉన్నట్లు రామరాజు గ్రహించెను. తన స్నేహితుని రక్షించవలెను. ఈత రాని రామరాజు ధైర్యం చేసి నీళ్ళలోకి కురికి మిత్రుణ్ణి వెలుపలికి లాక్కువచ్చాడు. జరిగిన విషయం విన్న తల్లి సూర్యనారాయణమ్మ గుండెలు బాదుకొంది. తండ్రి కొడుకు సాహసాన్ని మెచ్చుకొని ఇతరుల కోసం తన ప్రాణాల మీదకి తెచ్చుకుంటాడేమోనని మనసులో కలవరపడ్డాడు. అదే చివరకు నిజమయింది కూడా. ఆ సంఘటనలో అపాయాన్ని అధిగమించగల సాహసం అల్లూరికి వెన్నతో పెట్టిన విద్యయని ఋజువైందని కవి వివరించాడు.

"శ్రీరామరాజునకు బాల్యము నుండియే నాటకములు యందు అభిరుచి అధికముగా నుండెడిది. కలిదిండి భీమరాజును వీరి బంధువొకరితో గలసి రామరాజు నాటకములు ప్రదర్శించెడివాడు. రామరాజు శశిరేఖ పరిణయమునందు రెండు పాత్రలు ధరించెడివాడు. అందొకటి స్త్రీపాత్ర కాగా, రెండవది పురుషపాత్ర. స్త్రీ పాత్ర శశిరేఖ. చక్కని గాత్ర సౌకుమార్యము గల రామరాజు నారద పాత్ర కూడా ధరించెడివాడు."[30]

అతని నటనకు మెచ్చి ఐదవ జార్జి చక్రవర్తి బ్రిటీష్ రాజ్యమునకు నాటి సౌర్వభౌముడు వారి జన్మదిన పర్వమును పురస్కరించుకొని కాకినాడ పాఠశాలలో నాటకోత్సవము డిసెంబరు 5న జరిగింది. ఆ నాటకోత్సవ పోటీలలో ఉత్తమ నటుడుగా రామరాజుకు బంగారు పతకమొకటి బహుకరించబడినది.

"ఆ పతకము జార్జి చక్రవర్తి చిత్రముగల పతకము. దానిని రామరాజు చొక్కాకు గల జేబుపై భాగమున ధరించేవాడు. అది చూచిన తన మిత్రులు ఇట్లు ప్రశ్న వేసిరట.

"నీవు ఆంగ్లేయులకు వ్యతిరేకివి గదా! ఆంగ్ల సౌర్వభౌముని చిత్రము గల పతకమును నీ హృదయ భాగమున ఎట్లు ధరించిడివి? తడుముకొనకుండా ధైర్యంగా రామరాజు ఇలా చెప్తూ.

"నీచుడైన బ్రిటీష్‌వాడు మన గుండెలపై తిష్టవేసి కూర్చొన్నాడను విషయము క్షణక్షణము నాకు గుర్తు తెచ్చి ప్రతీకార యజ్ఞమున సమిధవలె అది గుర్తుంపవలెనని నేను దీనిని ధరించితిని" అని సమాధానమిచ్చెను.

స్నేహితులతో అనేక విషయాలు చర్చించిన, గ్రంధములు పఠించి, పెద్దలను అడిగిన ఉపాధ్యాయులను ప్రశ్నించిన, రామరాజు భారతదేశ పరిస్థితులను తెలుసుకొనేవాడు.

"సుజలాం సుఫలం సస్యశ్యామలాం మాతరం" అనే గీతం మనకు తరచు వినబడుచుండెడిది. భారతదేశమునకు వర్తకము అనే వంకతో వచ్చి ఆంగ్లేయులు ఆక్రమించినారు. పెత్తనము వహించినారు. మనవారి అమాయకత్వమును అవకాశం చేసుకొని వీరిని పన్నుల రూపమున, బానిసలుగా పీల్చి పిప్పి చేయుచున్నారు.[31]

భారతీయులు సంఘటితమై తెల్లవారిని ఈ దేశము నుండి తరిమి వేయవలెననే భావన రామరాజు మనసులో చోటు చేసుకుంటూ...

అదే సమయంలో వందేమాతరం ఉద్యమం ఊపందుకుంది. బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశంలో పర్యటించారు. రాజమహేంద్రవరంలో ఉపన్యసించారు. తెల్లదొరల ప్రభుత్వానికి వ్యతిరేకంగా కరపత్రాలు పంచారు. పెద్ద పెద్ద నాయకుల్ని చూడడం, వారి ఉపన్యాసాల్ని వినడం రామరాజకు ఈ విధంగా బాల్యం నుండే అలవాటయింది. ఆనాటి ఆ సంచలన వాతావరణం ఆబాలుడ్ని ప్రభావితం చేస్తాయి. ఆ దౌర్జన్యాలు, హింసలు మరియు జాతీయ నాయకుల ఉద్దేశ్యాలు, జాతీయోద్యమ సంభాషణలు బాలుడైన రామరాజు మనోఫలకం మీద చెరగని ముద్ర వేస్తాయి. చదువుకు స్వస్తి చెప్పి ఉత్తర భారతదేశయాత్రకు బయలుదేరుతాడు.

"విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు చరిత్ర" అను గ్రంధమును సీతారామరాజు మేనల్లుడు దంతులూరి వెంకటరామరాజు రాస్తాడు. స్వయాన మేనల్లుడు కాబట్టి వాస్తవ విషయాలను, యదార్ధ సంఘటనలను పొందుపరిచారు. 220 పుటల్లో ఆనాటి రాజకీయ పరిస్థితుల నుండి రామరాజు మరణం వరకు చారిత్రక సత్యాలను వెల్లడించారు. దీని ప్రథమ ముద్రణ జూన్ 1984లో ప్రచురించబడింది.

ఇందులో శ్రీరామరాజే? సీతారామరాజా? అన్న విషయాన్ని వివరిస్తూ...

"ఆయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు శ్రీరామరాజు. ఆయన మాతామహుడు మందపాటి శ్రీరామరాజు ఆ పేరే ఆయనకు పెట్టిరి. విప్లవవీరుని పేరు అల్లూరి సీతారామరాజుగా ఈ లోకమునకు ప్రసిద్ధి పొందినది. తెలిసినవారును అతని పేరు

సీతారామరాజుగా మారుటకు ప్రేమకథలు అల్లియు, ఊహ చిత్రములు లిఖించుచు, అతడే సీతారామరాజుని పేరు మార్చుకొనెనని చిత్రించిరి. కాని ఈ కట్టుకథలకు ఏమియు ఆధారము కనబడదు. ప్రభుత్వ రికార్డులలో సంతకం చేసినను ఇతర స్థలమునందు రాసికొనినను ఆయన శ్రీరామరాజు అనియే వ్రాసికొనెను. కాని ఎక్కడ సీతారామరాజు అని రాసుకోలేదు!![32]

ఎక్కడో అరుదుగా తప్ప ప్రభుత్వ నివేదికలందు – పత్రములందు అన్నిచోట్లను శ్రీరామరాజు అనే ఉన్నది. పత్రికల వారు మాత్రము చాలా వరకు 'సీతారామరాజు' అని వ్యవహరించారు.

కొన్ని నివేదికలను, ఆధారాలను రచయిత తెలియపరుస్తూ...

"హాపెల్ నివేదికను ప్రకటించిన 1923 జూలై 23వ తేదీ గల మద్రాసు ప్రభుత్వ పబ్లిక్ డిపార్టుమెంటు జి.ఓ. 572లో శ్రీరామరాజు అని ఉన్నది. రామరాజు మిత్రుడు పేరిచర్ల సూర్యనారాయణ రాజునకు రాయబడి ప్రభుత్వమునకు పట్టుబడిన లేఖ క్రింద "శ్రీ అల్లూరి శ్రీరామరాజు" అని సంతకం చేయబడినది. 04.02.1922 తేదిన అసిస్టెంటు కమీషనరుకు పెట్టిన ఆర్జీలోను కూడా శ్రీరామరాజు అని రాసెను. 28.08.1922న పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ ఎఫ్. ఆర్మిటెజి పంపిన నివేదికలో 'శ్రీరామరాజు' అని ఉన్నది. 13.09.1922న పైడిపుట్ట భూమిని గురించి ఎస్. ఆదినారాయణ ఇచ్చిన వాంగ్మూలములో కూడా అల్లూరి శ్రీరామరాజు అని చెప్పెను.

అడ్డతీగల, రంపచోడవరము స్టేషనులను దాడి జరిపిన తర్వాత ఆయా స్టేషను సబ్ ఇన్‌స్పెక్టరులు, ఏజెన్సీ కమీషనర్లకు 18.10.1922 తేదిన, 20.10.1922 తేదిన పంపిన తంతి వార్తలను శ్రీరామరాజు అని వ్యవహరించారు. 30.10.1922న చేసిన మద్రాసు ప్రభుత్వ పత్రికా ప్రకటనలోను శ్రీరామరాజు అని పేర్కొనబడినది.

రాజ వొమ్మంగి స్టేషను సబ్ ఇన్‌స్పెక్టర్ పంపిన 15.04.1923తేది గల తొలి సమాచార నివేదికలో కూడా 'ఎ. శ్రీరామరాజు, గాం గంటందొర మొదలగు పేర్లు రాయబడినవి.

15.06.1923 'స్వరాజ్య' పత్రిక గూడెము తహశీల్దారును విప్లవకారులు పట్టుకొన్నారని రాస్తూ శ్రీరామరాజు రంప పితూరి నాయకుడని పేర్కొంది.

"10.07.1923న మద్రాసు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి గ్రాహం భారత ప్రభుత్వమునకు పంపిన నివేదికలో 'శ్రీరామరాజు' అని రాసారు. 07.09.1923న స్వీని పంపిన నివేదికలో కూడా అల్లూరి శ్రీరామరాజు అని ఉన్నది". [33]

1926లో కాంగ్రెస్ పత్రిక మాత్రం శ్రీరామరాజు చంపబడేనా? అనుచు సందేహము వెలిబుచ్చినది. కాంగ్రెసు పత్రిక మద్దూరు అన్నపూర్ణయ్యగారి సంపాదకత్వమున ఉండుటచేత కాబోలు శ్రీరామరాజు అని వ్యవహరించారు.

"ఇది విప్లవ వీరుని వ్రాతతో వున్న సంతకములు మొదలైనవి దుచ్చర్తి ముఠాదారు శ్రీ చెక్కాలింగం దొరగారికి 14.06.1922న వ్రాసిన లేఖలో తెలుగులో సంతకం చేసారు. గూడెము డిప్యూటీ తహశీల్దారు బాస్టియనుకు 1922 జూన్‌లో రాసిన లేఖలో 1924 డిసెంబరులో స్టేషను హౌస్ డైరీలో రిమార్కు రాసి ఆ కిందను ఇంగ్లీషులోను 'అల్లూరి శ్రీరామరాజు' అని సంతకము చేయబడింది. అతనికి సంబంధించిన తెలుగు పుస్తకములు 'మనుచరిత్ర', ఆంధ్రనామ సంగ్రాహములలో నాగరి లిపిలో శ్రీ మన్మహరాజ రాజాధిరాజు, శ్రీ అల్లూరి శ్రీరామరాజు, శ్రీరామ విజయనగరము అని రాసారు.

అయితే "రెండు పేర్లను ప్రచారంలో ఉండుట చేత ప్రభుత్వము గూడ తడబడుచు రెండు పేర్లను వారుచుండుట వలనను 1922-23 సంవత్సరపు అనుబంద పద్దులలో పితూరికి సంబంధించిన పద్దును ఆమోదించు విషయములో మద్రాసు విధాన సభలో జరిగిన చర్చలో శ్రీమాన్ శశిభూషణ కథ మహాశయుడు. ఈ విధముగా ప్రభుత్వాన్ని ప్రశ్నించాడు.

ప్రభుత్వము వెలువరించిన ప్రకటనలలో విప్లవమునకు కారకుడు అల్లూరి సీతారామరాజు చివర ప్రకటనచో శ్రీరామరాజు అని ప్రకటించిరి గదా! అందుకే ఇందులో విప్లవ నాయకుడు అసలు ఎవరో నేను తెలిసికొనగోరుచున్నాను. "ఇటువంటి ప్రశ్ననే మరియొక సభ్యుడయిన దివాన్ బహుదూర్ కృష్ణ నాయర్ కూడ అడిగినాడని రచయిత తెలిపారు.

ఈ గ్రంథంలో ఎక్కడా సీతా అనే అమ్మాయి గూర్చి కాని, ప్రేమ గూర్చి చెప్పబడలేదు.. అటువంటి వ్యవహారాలు రామరాజు నిత్యజీవితంలో జరుగలేదు. పత్రికల ప్రభావము వలననే ప్రజలలో సీతారామరాజు అను నామము స్థిర పడిపోయినది. శ్రీరామారాజు అను పేరు కంటే సీతారామరాజు అను పేరు ప్రాచుర్యములో ఉండుట

వలన పలుకుటకు తేలికగా ఉండుట చేత అట్లు జరిగియుండవచ్చును. ఆనామ ప్రాచుర్యమునకు బీజమెచ్చట నుండి వచ్చినదో కాని ప్రజా హృదయములలో పాతుకుపోయిందని కవి తెలియజేసారు.

## 1.3 ఏడిద కామేశ్వరరావు:

విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజు అనే చరిత్రను ఏడిద కామేశ్వరరావు రాశారు. ఇతడు రేడియో అన్నయ్యగా ప్రసిద్ధి. ద్వితీయ ముద్రణ అక్టోబరు 1988లో ప్రచురించారు. ఈ కారణమున చరిత్రలో శ్రీరామరాజు సీతారామరాజుగా మార్పునకు కారణం తెలియపరుస్తూ...

"శ్రీరామరాజు విశాఖపట్టణం జీవితంలో అనేకములైన వెలుగునీడలు తొంగి చూచాయి. పాఠశాలలో అతడు అందరికి అభిమాన పాత్రుడుగా వుండేవాడు. సీత అను ఒక సంపన్నుని కుమార్తె అతని తరగతిలో వుండేది. ఆమెకు రామరాజు యెడల అవ్యాజమైన అనురాగం ఏర్పడింది. ఆమె చక్కని చుక్క. ఆపైన ఐశ్వర్యవంతుని బిడ్డ, తరుచుగా రామరాజుతో కల్పించుకొని, మాట్లాడుతూ పరిచయం పెంపొందించుకొని చివరకు ఒకనాడు తన మనసులోని కోర్కెను వెల్లడించింది. "పెళ్లి" విషయమైన ఆమె కోర్కెను విని రామరాజు గత్తుక్కుమన్నాడు. అంతవరకూ అతడి పెళ్లి అనే కోర్కెను గురించి ఆలోచించి ఎరుగడు. అతని ఆలోచనలు దేశ సమస్యల మీద సుడులు తిరుగుతున్నాయి. అందువల్ల ఆమె కోర్కెను మన్నించలేకపోయాడు."[34]

చివరకు కులము, ధనము మొదలగు అంశాలు కూడా ఈ సందర్భాలలో అడ్డు వచ్చి పెళ్ళిని విఘ్నం చేస్తాయి. ఆమె ఆ ఆశాభంగంతో కృంగి కృశించి చనిపోయింది. ఈ సంఘటన రామరాజు హృదయాన్ని కల్లోల పరచింది. "ఆమె మరణానికి తన మీద ఆమెకు కుదిరిన ప్రేమయే కారణమని, ఆ ప్రేమ భగ్నం కావడానికి తాను కారకుడనని ఎంతో బాధపడతారు. అయినా ఆమెకు తన యెడల వున్న ప్రేమకు చిహ్నంగా తన పేరుకు ముందు ఆమె పేరును కలుపుకున్నాడు. అందువల్ల శ్రీరామరాజు పేరు సీతారామరాజుగా మారిపోయింది. ఆ దుర్ఘటన అతనిని అమితమైన ఆవేదనకు లోను చేసింది. ఎవరితోనూ మాట్లాడక పోవడము, తరుచుగా ఏకాంతముగా వుండడము ఎక్కడికెక్కడికో వెళ్ళిపోయి, ఒక్కడుగా కాలక్షేపం చేయడము. అతనికి అకృత్యమైపోయింది. ఈ ప్రవర్తన అతనిని ఆధ్యాత్మిక పథం వైపు క్రమక్రమంగా దారికి మళ్ళించింది. అందుకే

అతడు మహాపవిత్రమైన బ్రహ్మచారిగా భాసిల్లినాడని ఈ రచయిత తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. కాని రామరాజు నిజ జీవితంలో ఈ విషయం జరుగలేదు. రచయిత కల్పితం మాత్రమే.

## 1.4 కె. రాజ్యలక్ష్మి:

"తెలుగు వెలుగు" విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు జీవికథను కె. రాజ్యలక్ష్మి రాసారు. 152 పుట గల ఈ జీవితచరిత్రలో రామరాజు జీవితాన్ని, ఉద్యమజీవితాన్ని చక్కగా ఆవిష్కరించారు. దీని పంచమ ముద్రణ 1991లో ప్రచురించారు. ఈ చరిత్రను పాఠ్యాంశాలుగా విద్యాలయాల్లో బోధించారు.

శ్రీరామరాజును సీతారామరాజుగా మార్పునకు కారణాలు చెబుతూ...

"మన కథానాయకుడు పేరు "శ్రీరామరాజు" కాని లోకం ఇతనిని సీతారామరాజుగా పిలుచుచున్నది. రాజును తదనాంతర దినములలో సీతారామరాజుగానే తన సంతకమును లిఖించెను. మరి ఈ సీత ఎవరు? అని రచయిత్రి తన అభిప్రాయంలో ప్రశ్నించింది."[35]

ఈ సీతను గురించి లోకమున రకరకముల కథలు చెప్పుచున్నారు. సీత అనే అమ్మాయి రామరాజు విశాఖపట్టణమున చదువుకున్నప్పుడు పరిచయమైనది. వారి పరిచయం ప్రేమగా మారినది. సీత ధనవంతుని ఏకైక పుత్రిక. పెంకల కులమునకు చెందినవారు. పేదవాడైన రామరాజుకు తన కుమార్తెనునిచ్చి వివాహము చేయుటకు నిరాకరించారు. చివరకు సీతను జూచుటకు సైతము రామరాజును అనుమతించలేదు. తన పవిత్ర ప్రేమకు చిహ్నముగా రామరాజు తన పేరునకు ముందు సీత పేరును చేర్చుకొని జీవితమంతయు బ్రహ్మచారిగా జీవించెను అని ఒక కథనం చెబుతుంది.

రచయిత రెండవ కథనం గూర్చి తెలుపుతూ...

"రామరాజునకు సీతయను పేరునొక స్నేహితురాలు గలదు. ఆమె విశాల భావముల గల యువతి. రామరాజు విప్లవకారుడుగా మారుటకు ఆమె బోధలే కారణము. ఆమె ఆకాల మరణము చెందినది. తనను స్వాతంత్ర్య విప్లవోద్యమమునకు పురికొల్పిన ఆ స్నేహితురాలిని గుర్తుంచుకొనుటకై రామరాజు తన పేరును సీతారామరాజుకు మార్చుకొనెను".[36]

ఏది ఒట్టిదో, ఏది గట్టిదో, ఏది నిజం, ఏది అబద్ధం తేల్చుకోలేమని రామరాజు తన నామమును సీతారామరాజుగా మార్చుకొనెను. అందుకే సమాజం అతనిని అల్లూరి సీతారామరాజుగా వ్యవహరించిరి అని రచయిత్రి అభిప్రాయాన్ని తెలియపరిచినది.

## 1.5 పొన్నలూరి రాధాకృష్ణమూర్తి:

అల్లూరి సీతారామరాజు చరిత్రను మొట్టమొదటిగా పుస్తకరూపంలో తీసుకువచ్చిన ఘనత పొన్నలూరి రాధాకృష్ణమూర్తి. ఈ పుస్తకాన్ని అప్పటి ప్రభుత్వం 1938 మే నుండి నిషేధం విధించిన మరల 1947 డిసెంబరున నిషేదం తొలగింపు చేసింది. సుమారు 200 పేజీలు గల ఈ గ్రంథంలో రామరాజు జీవితాన్ని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు. ఈ పుస్తకం ఆధారంతో మిగిలినవారు సీతారామరాజుపై అనే పుస్తకాలను సాహిత్య రూపాల్లో వెలువరించారు.[37]

శ్రీరామరాజు సీతారామరాజుగా మార్పునకు కారణాలు వివరిస్తూ..

"రామరాజు విశాఖపట్టణములో తన స్నేహితుడు అయిన శ్రీమంతుని ఇంట్లో కొంత కాలము నివసించెను. ఈ స్నేహితునకు సుందరివతి, విద్యావంతురాలయిన చెల్లెలు గలదు. ఆ సుందరి రామరాజును రామరాజు సుందరిని ప్రేమించారు. ఈ పరస్పర అనురాగోదయమునకు సౌందర్యమెంతగా కారణమో, వారిరువురి దేశభక్తి కూడా అంతే ప్రధానము. ఇతర భావములతో బాటు ఇతరులపై దయ తమ ప్రేమను గూడ స్పష్టపరుచుకొనిరి. ఇద్దరి వివాహము తన మిత్రుడుకి ఇష్టమే.

కాని ఒకరోజు రాత్రి మోహవేళముతో రామరాజు గదికి ఆ యువతి వచ్చెను. వీరునకు ఇంద్రియ నిగ్రహము గలవాడు కాబట్టి ఆమెను తన గతి నుండి బయటకు పంపివేస్తాడు. పిదప నాల్గుదినముల తర్వాత యువతి స్నేహమయియై పలుకకుండుట చూచి రాజు కోపముతో మందిరమును వీడి ఎక్కడికో వెళ్ళిపోయెను. పేదవాడు అగుటచే ఆమె చులకన జేసినదని అతని ఉద్దేశ్యము కాబోలు! ఎన్ని రోజులైన రామరాజు తన మందిరనమునకు రాకుండుటచే ఆమె దిగులుతో మంచము పట్టెను. పిదప నాసిక్ యాత్రను ముగించి రాజు స్వగ్రామమగు మోగల్లు చేరాడు. మంచము పట్టియున్న ఆమె బ్రతుకునను నాపగల్లినది. గాని పిదప రెండు మూడు దినములకే ఆమె మరణించెను.

పాపము, రాజునకు ప్రాపంచిక సుఖములన్నియు ఆ యువతి తోనే పోయినది.

ఆమె బ్రతికియున్నచో, పిదప కళ్యాణమే జరుగవచ్చును కాని జీవననావ మఱియే సముద్రమున నడచునట్టిదోయని మీరనుమానింపనేల? అని రచయిత్రి ప్రశ్నిస్తుంది. ఆమె మరణమే మనకు సాక్ష్యమిచ్చుచున్నది. ఆమె బ్రతికియున్నచో కత్తినూరి రామరాజు కిచ్చునది. ఆ కత్తితో రాజు ఆ ధర్మమును ఛేదించువాడు. కాని యతడు గాఢముగా ప్రేమించిన యువతి మరణించినది. అంతటితో రాజు విరాగాయైనాడు అని రచయిత్రి వర్ణించింది.

"ఆమె మరణించినను ఆమె నామమును స్మృతి చిహ్నముగా 'సీత' అను పేర తన నామమున జోడించెను. అప్పటి నుండి అతడు శ్రీరామరాజునకు మారు సీతారామరాజు అయ్యెను అను రచయిత పొన్నలూరి రాధాకృష్ణ రాసిరి."[38]

స్త్రీలకు పాతివ్రత్య మెంతటి ముఖ్య ధర్మమో, పురుషులకు పత్నీవ్రత మంతటి ముఖ్య ధర్మము. ఈ కవి కాలమున యిట్టి ధీరబత్తులు లేరని యెవ్వరన చెప్పగలరా? ఈ యువతి పతివ్రత, రామరాజు పత్నీవ్రతుడు. మఱియొక స్త్రీని అతడు ప్రేమించలేదు. కావున రామరాజు సన్యాసి అయ్యెను అని రచయిత వర్ణించారు.

**ముగింపు:**

ఈ విధంగా అల్లూరి సీతారామరాజుపై వచ్చిన ఐదు జీవిత చరిత్రల్ని ఆయా రచయితలు అనుసరించిన రచనా ప్రణాళికల్ని అందులో చోటు చేసుకున్న ప్రధానాంశాల్ని సోపపత్తికంగా వివరించాను.

# పాదసూచికలు

| | | | |
|---|---|---|---|
| 1. | మన్యం వీరుడు అల్లూరి సీతారామరాజు | – భుక్యా చినవెంకటేశ్వర్లు | పుట 30 |
| 2. | 〃 | 〃 | పుట 31 |
| 3. | 〃 | 〃 | పుట 32 |
| 4. | 〃 | 〃 | పుట 33 |
| 5. | 〃 | 〃 | పుట 35 |
| 6. | 〃 | 〃 | పుట 36 |
| 7. | 〃 | 〃 | పుట 40 |
| 8. | 〃 | 〃 | పుట 41 |
| 9. | 〃 | 〃 | పుట 53 |
| 10. | 〃 | 〃 | పుట 87 |
| 11. | 〃 | 〃 | పుట 56 |
| 12. | 〃 | 〃 | పుట 58 |
| 13. | 〃 | 〃 | పుట 60 |
| 14. | 〃 | 〃 | పుట 64 |
| 15. | 〃 | 〃 | పుట 65 |
| 16. | 〃 | 〃 | పుట 73 |
| 17. | 〃 | 〃 | పుట 74 |
| 18. | 〃 | 〃 | పుట 80 |
| 19. | 〃 | 〃 | పుట 83 |
| 20. | 〃 | 〃 | పుట 95 |
| 21. | 〃 | 〃 | పుట 97 |
| 22. | 〃 | 〃 | పుట 105 |
| 23. | 〃 | 〃 | పుట 108 |
| 24. | 〃 | 〃 | పుట 112 |
| 25. | 〃 | 〃 | పుట 114 |
| 26. | 〃 | 〃 | పుట 115 |

27. విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు

- దంతులూరి వెంకటరామరాజు పుట 23

28. " " పుట 36

29. " " పుట 38

30. " " పుట 195

31. " " పుట 196

32. విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజు చరిత్ర

- ఏడిద కామేశ్వరరావు పుట 18

33. " " పుట 19

34. " " పుట 20

35. తెలుగు–వెలుగు - కె. రాజ్యలక్ష్మి పుట 19

36. " " పుట 20

37. అల్లూరి సీతారామరాజు – పొన్నలూరి రాధాకృష్ణ పుట 16

38. " " పుట 18

# ౨) కవిత్వం - పరిశీలన

## 2.0:

తెలుగు సాహిత్యం ప్రారంభం నుండి నేటి వరకు అగ్రతాంబూలం కవిత్వానిదే. అందుకే చారిత్రకాంశాలైన దైవ సంబంధిత విషయాలకైనా, తాత్త్విక, మనస్తత్వ, సామాజిక లాంటి సమస్త విషయాలపై తొలుత జరిగింది కావ్యరచనే. అలాగే అల్లూరి సీతారామరాజు జీవిత ఆలంభనగా కావ్య రచన జరిగింది. ఈ రెండో అధ్యాయంలో వీరిపై వచ్చిన బండ్ల సుబ్రహ్మణ్యం, బూదరాజు రాధాకృష్ణ, కాకర్లపూడి వెంకటరాజు, మల్లెల గురవయ్య, గుర్రం ధర్మోజీరావు లాంటి వారు వ్రాసిన కావ్యాలని ఆయా రచయితల పద్యరచన ప్రావీణ్యాన్ని, కావ్యరచనవైశిష్ట్యాన్ని, సోదాహరణంగా తెలియజేసాను. అలాగే అల్లూరి భావజాలం వర్తమాన సమాజానికి అత్యంత అవసరం. సులభశైలిలో, నూతన ఒరవడిలో వచ్చిన కవిత్వానికి సాహితీ లోకంలో ఆదరణ ఎక్కువగా ఉంది. అభ్యుదయ, దిగంబర, విప్లవ, స్త్రీవాద, దళితవాద, మైనార్టీ వాదాల్లాంటి ఉద్యమాల్లో వచన కవిత్వం అత్యుత్తమ వాహిక. అందుకే అల్లూరి విప్లవ భావాల్ని వచన కవిత్వ రూపంలో అనేక మంది రచనలు చేసారు. వారిలో కుందుర్తి ఆంజనేయులు, ముదివేడు ప్రభాకర్‌రావు, అద్దేపల్లి రామ్మోహనరావు లాంటి వారి రచనల్ని కూడా ఈ అధ్యాయంలో ప్రస్తుతించాను.

## 2.1 బండ్ల సుబ్రహ్మణ్యం:

ఆంధ్రమహాభ్యుదయము కావ్యాన్ని బండ్ల సుబ్రమణ్యం 12 ప్రకరణములో రాశారు. ఇందులో అమరజీవి జీవితచరిత్ర, భారత స్వాతంత్ర్య సమరం, పొట్టి శ్రీరాములు జననంతో ప్రారంభమౌతుంది. దేశ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రల ప్రస్తావన వుంది. దేశ నాయకుల ప్రతాపాలతోపాటు వీర కిశోరం అల్లూరి సీతారామరాజు చరిత్రను 116 పుటలో 229 పద్యాలలో చతుర్థ, పంచమ ప్రకరణాల్లో రామరాజు జీవితాన్ని, విప్లవ పోరాటాన్ని, స్వాతంత్ర్య దీక్షను 24 ఉపశీర్షికలతో వివరించారు.

చతుర్థ ప్రకరణం బాల్యదశలో రామరాజు గొప్పతనం, శౌర్య పరాక్రమాల వర్ణనలతో ప్రారంభించారు. కాంగ్రెసు మహాసభలో పితూరీని హీనంగా, అపహాస్యం చేసి, వీరకిశోరమైన రామరాజు ప్రాచుర్యం పొందిన చరిత్రకు భిన్నంగా అనేక కథనాలతో

సృష్టించినారు. ఈ కావ్యంలో బాల్యదశ నుండి వీరమరణం వరకు దృశ్యామానంగా వివరించారు.

కావ్యప్రారంభంలో తెలుగు వీరుల వైశిష్ట్యాన్ని, వీరత్వాన్ని గూర్చి తెలుపుతూ.....

సీ॥ "సిద్ద నాగార్జును-బౌద్ద ధర్మజ్యోతి
యజ్ఞాన తిమిరంబు-నణ చెనచట
బ్రహ్మనాయని బత్తి-బాలచంద్రుని కత్తి
యద్వితీయఖ్యాతి-నలరెనచట
నాగమ్మ సైన్యవి-న్యాసాన నాంధ్రాకు
రుక్షేత్ర మచ్చోట-రూడికెక్కె
మోహనా గిరిపుర-పురరుద్దరణశక్తి
గణపాంబయచోటప్ర-ఖ్యాతిగాంచె"[1] అని వర్ణించారు.

తెలుగునాట బౌద్ధ ధర్మజ్యోతిగా వెలుగొందిన ఆచార్య నాగార్జునుడు ఆజ్ఞానాంధకారాన్ని రూపుమాపి జ్ఞానాన్ని వెలిగించిన పవిత్ర భూమిగా అభివర్ణించారు. ధర్మం ఒకజ్యోతిగా వెలిగి అజ్ఞానాన్ని పటాపంచలు చేసింది. ఇది ఒక ధర్మమార్గం. అంతేకాకుండా బ్రహ్మనాయుడు భక్తి, ముక్తి పరిపాలన దక్షతలను కవి చెబుతూ చిన్న వయసులో బాలచంద్రుని సాహసాల్ని, నాగమ్మ వీర సైన్యాన్ని, కురుక్షేత్ర సంగ్రామంలో ధర్మయుద్ధం మొదలైన అంశాల్ని వివరించారు.

రామరాజు మొదట ధర్మమార్గంలో, నీతి, భక్తితత్వాలతో నడుచుకున్నాడని పేర్కొన్నారు. తర్వాత బ్రహ్మనాయుడు, బాలచంద్రుల వీర సాహస విన్యాసాలు, కత్తిసాము, కర్రసాము గుఱ్ఱపుస్వారీ వంటి యుద్ధ విన్యాసాలు నేర్చుకుంటారు. బ్రహ్మనాయుడు, నాగమ్మల రాజ్యాధిపత్యం జరిగిన పల్నాటి యుద్ధాన్ని ఆంధ్రా కురుక్షేత్రంగా అభివర్ణించాడు.

రామరాజును కథానాయకుడుగా నిరూపిస్తూ పరాక్రమాన్ని దేశభక్తిని గూర్చి వర్ణిస్తూ....

"ధర్మకర్మా భరతి శౌర్య-ధైర్య మహిమ

సమద శాత్రవ భంజవ-సాహసమును
భక్తిదత్తిల సచ్ఛక్తి-వఱులుచుండ
నక్కాలంబున నల్లూరి-యవ్వయంబ"[2] అని అంటూ

క్షత్రియ వంశంలో పుట్టిన రామరాజుకు శౌర్యం సహజలక్షణం. కాని "ధర్మకర్మ భిరతిశౌర్య" అని కవి ప్రయోగం. శౌర్యంతోపాటు తెగింపు, ధర్మబద్ధంగా కర్మను అనుసరిస్తూ, న్యాయమార్గంలో ఉండడమని కవి భావన, ధైర్యగుణం, సమతావాదం, సమాజ సంక్షేమ కాంక్ష వుందన్నారు. సాహసాల్ని, శక్తియుక్తుల్ని, శాంత స్వభావాల్ని భక్తి భావనల్ని రామరాజు పూర్వీకులు కూడా అనుసరించేవారని కవి వివరించారు.

విశాఖపట్టణం జిల్లాలోని సింహాచలం పుణ్యక్షేత్ర మహిమతో పాద్రంగి గ్రామంలో అమ్మమ్మగారింట రామరాజు పుడతాడు. కవి వారి కుటుంబాన్ని విద్యావంతమైందిగా వర్ణించారు. రామరాజును కూడా ఉన్నత విద్యావంతునిగా తీర్చిదిద్దడానికి తల్లి అభిలషిస్తుంది. ఆ సమయంలో తండ్రి మరణం శరాఘాతం అవుతుంది.

దీన్ని వివరిస్తూ.....

తే॥ తండ్రి మరణిప శోకసం-తప్త హృదయ
యైజనని బిడ్డలను గొని-యరిగెదనస
హోదరి గృహంబునకు నామె-యాదరింప
నోర్పు నేర్పులనచ్చోట-నుండె తల్లి"[3] అని పేర్కొన్నాడు.

ఆ కుటుంబానికి పెద్దదిక్కు లేకపోయెటప్పటికి ఏ దిక్కు తోచక ఆర్థికంగా చితికిపోయి, శోకంతో తన బిడ్డలను ముగ్గురిని తీసుకొని తన అక్క కావ్వాడ అప్పల నరసయ్యమ్మ యింటికి బతుకు తెరువుకు వెళ్తుంది.

విద్యతోపాటు వినయ విధేయతలు, వివేకం మరియు విమల వర్తనంలతో పెరిగాడు. అక్కడే గుర్రపుస్వారీ, సాముగారడీలాంటి విద్యలు నేర్చుకుంటాడు. ధైర్యసాహసాములకు ఇతడు బాబరును గుర్తుకు తెస్తాడు. గుర్రపుస్వారీలో గుర్రాన్ని తన ఆధీనంలోకి తెచ్చి అదిరోహించడంలో మంచి నిపుణుడౌతాడు. శరీర వ్యాయామం, యోగాభ్యాసాలు మొదలైన

విద్యలు చేయటం వల్ల చదువుసన్నగిల్లుతుంది.

రామరాజు పినతండ్రి రామకృష్ణరాజుగారు కాకినాడలో డిప్యూటీసీలు దారుగా ఉద్యోగం చేస్తున్న సమయంలో పిఠాపురం రాజా కళాశాలలోన్నత పాఠశాలలో చేర్పించారు. అక్కడ మద్దూరి అన్నపూర్ణయ్య అనే స్నేహితుడు కలిసెను. అ విద్యాశాల వార్షిక సభల్లో విద్యార్థులు నాటకాలు ప్రదర్శించిరి....

"ఆంధ్రకేసరి నటయించె–నద్భుతముగ
జిత్రరేఖా ధనంజయ–పాత్రలట్ల
పొసగ శశిరేఖ నారద–భూమికలని
తడు సమర్థించె బ్రేక్షకుల్–తనివినొంద"[4]

ఇచట కవి "ఆంధ్రకేసరి నటయించె" అను పద ప్రయోగం చేశారు. నటనలోని అమితమైన శక్తి సామర్థ్యాలు ప్రదర్శించగల మహానటుడుగా వర్ణించారు. నాటక కళయన్న రామరాజుకు మిక్కిలి ఆనందం. స్త్రీ, పురుష పాత్రలలో అత్యంత అద్భుతంగా నటనను ప్రదర్శించి ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేయగల నటుడు. శశిరేఖ, నారద పాత్రలను పోషించి విశేషమైన ప్రజాదరణ సంపాదించారు. నటన మీద వ్యామోహం నాటకాలమీద ద్యాసతో చదువు సన్నగిల్లింది. తర్వాత విశాఖపట్నంలో చదువు కొరకు... పిదప విశాఖపట్టణం కళాశాలోన్నత పాఠశాలలో జదువుచున్న తండ్రి.

"నొక జమీందారు కొమరిత సీత షోడశ వర్ష ప్రాయుండగు రాజు
షోడశ కళాప్రపూర్ణుండగు చంద్రుని చందమున దన కంటికి గన బడెనే
మొయతనిం బ్రేమించె కాని యాతండా మాయా జాలమున విశ్వా
మిత్రుని వలెం జిక్కుకొనక శుక మహర్షివలెం దప్పించుకొనియె"[5]

విశాఖపట్నం ఎ.వి.యన్ పాఠశాలలో చదువుతున్న సమయంలో జమీందారికి చెందిన సీత అనే అమ్మాయి రాజు గుణాలను, ధైర్యసాహసాల్ని చూసి అందచందాల్లో పూర్ణచంద్రుడని తన మనసుకు నచ్చి ప్రేమించింది. కానీ రామరాజు భవిష్యత్ ప్రణాళిక వేయకముందే, దేశభక్తిలో మునిగిపోవక ముందే ఇటువంటి మాయజాలమైన పనులను వ్యతిరేకించాడు. కవి ఈ విషయాన్ని చాలా సున్నితముగా వచనంలో చెప్పాడు.

విశ్వామిత్రుడు మేనక మాయలో పడినట్లు కాకుండా, శుకమహర్షి వంటి త్యాగనిరతితో, నిగ్రహాశక్తితో బయటపడి, ఆమెను తిరస్కరించినట్టు కవి వర్ణించారు.

ప్రాచీన గ్రంధాల్లో పద్యాలను రాయడం, శ్రావ్యంగా వినిపించి అందులో మెలకువలు తన మిత్రులకు చెప్పడం. కవిత ధారణశక్తిని పెంపొందించుకునేవారు. శ్రీవత్సవాయి నీలాద్రి రాజు దగ్గర జ్యోతిష్య శాస్త్రాన్ని అభ్యసించడం జరిగింది. అంతేకాక కళలను నేర్చుకొని కవితకు ప్రాణం పోయడం తెలుసుకున్నాడు.

వసుచరిత్ర, మనుచరిత్ర, అష్టాదశపురాణాలు, ప్రబంధాలు మొదలైన తెలుగు సాహిత్య గ్రంధాలను, గీతాపారాయణం, సంస్కృత గ్రంథాలు, కాళిదాసు, భవభూతి మొదలైన కవుల రచనలను అవలీలగా వాటిలోని విషయాన్ని గ్రహించాడు. వాటితోపాటు అన్ని విద్యలను నేర్చుకున్నాడు. కానీ జీవన భృతికి ఆధారమైన చదువును విడిచిపెట్టి......

తే॥ "తరతరంబుల నుండి క్షా-త్రమున మెఱయు
రక్తమబ్బాలు తనువున-గ్రాలుచుంట
నతని దృష్టికి ఆంగ్ల భా-షాభ్యసనము
దొరల సేవక యని దోప-విఱిగెమనసు"[6] అని రామరాజుకి ఆంగ్ల విద్యపై ఉన్న దృక్పథాన్ని కవి వివరించారు.

రామరాజు క్షత్రియ గుణాలతో ఉండేవాడు. అతని దేహం, మనసు, శరీరం భారతమాత సేవ, దేశభక్తితో నిండి ఉండేది. ఆంగ్లభాషపై అతనికి యేవగింపు ఉండేది. ఇంగ్లీషుభాష దొరలకు సేవ చేయుటకు ఉపయోగపడుతుంది అనేవాడు. మనల్ని బానిసలుగా తీర్చుటకు అని నమ్మేవాడు. ఆంగ్లేయులను, వారి భాషను తిరస్కరిస్తూ విరక్తి భావం పెంచుకున్నాడు.

రామరాజు ఇవేమి చదువులు? పొట్టకూటికోసం, బానిసబతుకులకోసం బ్రిటిష్ వారికి తొత్తులుగా బతుకుటకు ఉపయోగపడే చదువులు మనకు వద్దని ఆనాడే చెప్పాడు. గాంధీజీ 51 సంవత్సరాల వయసులో (దక్షిణాఫ్రికా బారిష్టర్ లా చదివిన తరువాత) కళాశాలను విడిచి రమ్మని చెప్పిన మాటను రామరాజు 13 సంవత్సరాల వయసులోనే చెప్పాడు. ఈ చదువులు ఆంగ్లేయుల సేవకోసం, దాస్యంకోసం ఉపయోగపడుతున్నాయని

చదువుపై అతడికి మనసు విరిగింది.

సాహిత్య గ్రంధాలు, కావ్యాలు కాకుండా చరిత్రలు, సాహస కథలు చదివిన విధానం గూర్చి........

తే॥ "దివ్యసుందర విగ్రహ–దీప్తి మెఱయు
నతనిలో నాంధ్రతేజము–హద్దు దాటేఁ
దనివి దీఱగ రాణాప్ర–తాప సింహ
ఛత్రపతి సాహస కథలు–చదివిమెచ్చె"[7]

రామరాజు రూపమేకాదు, గుణంలోను, త్యాగంలోను, స్వాతంత్ర్యదీక్షలోను ఆరాధనభావం కనిపిస్తుందని కవి వివరించాడు. అతనిలో ఆంధ్రతేజం, ఆంధ్ర సాహసం, ఆంధ్రధైర్యం సరిహద్దులు దాటి ధీరులైన సాహసవంతులైన రాణాప్రతాపసింహ, ఛత్రపతి శివాజీ వంటి యోధుల, కథలను, వీరోచితమైన సంఘటనలను చదివి ఉత్తేజితుడైనాడు.

ఈ చదువులను, ఈ బంధాలను విడిచి వేరొక మార్గంలో ప్రవేశించుటకు.......

తే॥ "ఆత్మజుండెదొయుద్యోగ–మాచరించి
తనకుటుంబపు భారము–దా వహించి
సౌఖ్యమును గూర్చుననుకొనె–జననిగాని
దైవ నిర్ణయ మింకొక–దారిబట్టె"[8] అని కవి రామరాజు మార్గాన్ని పేర్కొన్నాడు.

తండ్రి మరణం తర్వాత కుటుంబ భారాన్ని తనభుజాలపై వేసుకొని పెద్దకొడుకు తన కర్తవ్యాన్ని నిర్వహించి తమ్ముడికి ఒక మార్గాన్ని చెల్లెలకి ఒక ఆదర్శమైన జీవితాన్ని ఇస్తాడని ఆ తల్లి కొండంత ఆశలు పెట్టకొంది. కానీ విధి, దైవం వేరొకంగా నిర్ణయించింది, దానికి తోడు రామరాజు జీవితం మరొక వైపు ప్రయాణించసాగింది.

ఈ శీర్షికలో బాల్యదశలో ఆంధ్రప్రశస్తి, రామరాజు జననం తండ్రి మరణం, విద్యా విషయాలు మొదలైన విషయాలగూర్చి కవి వివరించారు.

రెండవ ఉపశీర్షిక పరివర్తనము ప్రారంభంలో వచనంతో ప్రక్రియలో రామరాజు హరిద్వార, వృషికేశ్, హిమాలయ వంటి పుణ్యక్షేత్రాలను బాలయోగిగా దర్శించి భారతదేశాన్ని రాజకీయ పరిస్థితులను గ్రహించాడు. కనీసం తన చెల్లి సీత వివాహమును కూడా కన్నులారా చూడలేదు. వారణాసి వంటి క్షేత్రాలను భక్తి శ్రద్ధలతో పూజించి ఘోరమైన అరణ్యములను అధ్యయనం చేసి, సంచరించి లౌకిక జ్ఞానమును సంపాదించాడు. ఉత్తర భారతదేశాన్ని విడిచి ఆంధ్రప్రదేశ్‌లో అడుగు పెట్టి గోలుకొండ తాలుకా కృష్ణదేవిపేట చేరాడు. అక్కడ చిటికెల బాస్కర నాయుడు అతని తల్లి సోమమ్మ, బుచ్చిరాజు అనువారు రామరాజుకు పరిచర్యలు చేసుకొని తన వివరాలు అడిగి తెలుసుకుంటారు. తల్లి, తమ్ముడు, చెల్లెని రప్పించి వ్యవసాయాన్ని చేయాలని తలచి ముఠాదారుల నుండి ముప్పెది ఎకరాల పొలంను సేకరించి ఇస్తారు. ఆ భూమిని రామరాజు తన బావకి యిచ్చి, నీలకంఠేశ్వరాలయంలో నిత్యధ్యాన దీక్షతో ఉండి జిక్కాల గడ్డ కలిసేచోట నదీ పరివాహ ప్రాంతాన నందు చిన్న కుటీరం శ్రీరామ విజయనగరంగా నిర్మించుకుంటాడు.

ఆ ప్రాంతంలో నివసిస్తున్న ప్రజల నిరక్షరాస్యులు, కోయలు, చెంచులు, సవరలు, ఖిల్లులు, బోయలు మొదలైన వారిని బ్రిటిష్ ఉద్యోగులు చేస్తున్న ఘోరకృత్యాలను చూస్తూ ఉండాడు. వారికి రామయాణ, భారత భగవద్గీత మొదలైన గ్రంధాలను బోధించుట మన్యంలో జరిగే ప్రతి సంఘటనను రామరాజు ఆలోచింపజేశాయి.

మన్యం ప్రజలను అటవి అధికారులు పెట్టిన బాధలను వర్ణిస్తూ...

కం॥ "కుటిలాత్ములు గ్రవర్తను
లటవీ శాఖాదికారు-లందఱు నొకటై
కటకట! యి య్యాటవికుల
బటుబాధలు పెట్టుచుంట-పాపంబరయ"[9] అని వివరించాడు.

మన్యంలో అటవి శాఖాధికారుల అటవి చట్టంను ప్రవేశపెట్టి అడవితల్లి బిడ్డలకు కష్టాలు తీసుకువస్తారు. అంతేకాకుండా స్త్రీలను వివస్త్రలను చేసి, వారిపై అత్యాచారాలను చేసేడివారు. పిల్లలను, పశువులను చూడకుండా దయాదాక్షణ్యం లేకుండా ఘోర కృత్యాలు

చేస్తూ హింసలు పెట్టేవారు. వారి పాలనలో ప్రజలు బ్రతకడానికి భయంతో ఒణికిపోయేవారు. బ్రిటిష్ వారి పాపం చెట్టుకు పండు పండినట్టు పండిపోయాయి.

ఈ కావ్యం ప్రాచీన ధోరణిలో వున్న పామరులకు కూడా అర్థమయ్యే విధంగా పద్యా గద్యాత్మకంగా సాగింది. దీనికి ప్రధాన కారణం ప్రజల వ్యవహారంలో వున్న నానుడుల్ని తన రచనలో కుప్పలు తెప్పలుగా ప్రయోగించటమే........

వ॥ "పిల్లికి జెర్లాట మెలుకకు బ్రాణ సంకటము"

బ్రిటిష్‌వాళ్ళని పిల్లితో మన్యం ప్రజలను ఎలుకతో పోల్చాడు. ఆంగ్లేయుల యొక్క చేష్టలకు మన్యం ప్రజలకు ప్రాణం పోయేటట్టు బాధలు అనుభవించేవారని అర్థం.

వ॥ చెఱకు తీపని వేరుతో లాగవచ్చునా? చేతులు పొడవని మూతులు పొడవవచ్చునా నీ చేతిలో అధికార ముందికదా! అని ప్రజలను ఇలా బాధపెట్టవచ్చునా? అటవి చట్టాలు ఉన్నాయి, అధికారులున్నారని వాటితో చిత్రహింసలు చేస్తారా?"[10] అనికవి వ్యంగ్యంగా నానుడులతో ప్రశ్నిస్తున్నారు.

మన్యంలో జరుగుతున్న అక్రమాలు ప్రజలకు జిరిగే అన్యాయాలను పరిశీలిస్తూ

తే॥ "గిరిజనాభ్యుదయమ్మిక-బరమలక్ష్య
మది యసువు లొడ్డి సాధింతు-నరయనరుల
సేవ హరి సేవ యనుకొని-దైవ మహిమఁ
గర్మయోగిగ మాఱెనా-జ్ఞానయోగి"[8] అని పలుకుతూ

గాంధీజీ పిలుపు మేరకు అంటరాని వారిని హరిజనుల పేర్లతో పిలిచే వారిని, సేవచేయడం హరిసేవ అని చెప్పిరి. కానీ రామరాజు కొండల్లో, కోనల్లో, లోయల్లో నాగరికతకు దూరంగా వున్నవారిలో చైతన్యం నింది, అభ్యుదయ దృష్టితో నిజమైన సేవ చేసిన దేశభక్తుడు గిరిజనాభ్యుదయమే తన జీవితలక్ష్యంగా మార్చుకున్న ఏకైక భారత దేశ స్వాతంత్ర్యపోరాటయోధుడు. ఒకవైపు దైవానుగ్రహం అనుకుంటూ కర్మఫల సిద్ధాంతాలతో సాగుతూ జ్ఞానయోగిగా వారికి విజ్ఞాన దీపం వెలిగించాడు.

రామరాజు ఊరూరా తిరుగుతూ ప్రజల కష్టాలను, వారి బాధలను చూస్తూ

వారిని ఓదార్చేవాడు. పంచాయితీలను స్థాపించడం, గ్రంథాలయాలను ఏర్పాటు చేయడం, ఆయుర్వేద మూలికలతో వైద్యం చేయడం, జ్యోతిష్యం చూడటం, మంచి మూర్తాలను నిర్ణయించడం వంటి కార్యక్రమాలతో గిరిజనులలో దైవరూపంగా అవతరిస్తాడు. గిరిజనులు కష్టాల్లో ఉన్నప్పుడు ఓదార్పుగా ధైర్య చెప్పిన సందర్భంలో...

శా॥ ఆరాధింపుడు దైవమున్ నిరతి మా-హ్లాదంబుతో నిప్పపూ
సారాయిన్ మఱి జీల్గుకల్లు విడుఁడీ-సామ్రాజ్యపుం 'గోర్టు'లం
జేరంబోకుడు రాచలెంక లెపుడే జేడ్పాటు గల్గించినన్
వీరు త్మారు లెదుర్కొనుండు జయము-ద్వేలంబుగాఁబొందుడా"[12] అని

తెలిపాడు.

మన్యం ప్రజలు ఆ భద్రాద్రి రాముడే వచ్చాడు, మాకు ఒక దైవం ఉన్నాడు, ఏ బాధ, వ్యధ, వచ్చినా విని దానిని తీర్చుటకు మా భద్రాద్రి సీతారాముదు మా సీతారామరాజు వచ్చాడని ఆనందిస్తారు. అక్కడ మద్య నిషేధం చేయించి సారాయి, జీలుగల్లు మరియు మత్తు పదార్ధాములను విడిచి పెట్టించి గ్రామ స్వరాజ్యం, స్వాతంత్ర్యదీక్షకు పూనుకొని కోర్టులను వ్యతిరేకించి, గ్రామ పంచాయితీలను ఏర్పాటు చేసి బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను రక్షించేవాడు.

బ్రిటిష్ అధికారులు పరిస్థితిని వివరిస్తూ...

"ఈత కానికే జలగండమన్నట్టు హింసించువాడే హింసింపబడు
కాని కాలము చేరవగావలె పండనిదే రాలదుగదా"[13] అనే నానుడితో

కవి ప్రతి చిన్న విషయాన్ని పండిత పామరులకు క్లుప్తంగా వివరించారు. రామరాజు కార్యక్రమాలు బ్రిటీష్ వాళ్ళకు అడ్డంకిగా మారిపోయాయి. అప్పటివరకు మన్యం ప్రజలకు ఒక యోగిగా, శాంతమూర్తిగా వారి సమస్యలకు పరిష్కార మార్గాలను చూపించాడు. తర్వాత తిరుగుబాటు తత్వం నేర్పడం ప్రారంభించాడు.

నర్సీపట్నం నుండి 'లంబసింగి' వరకు ఘాట్‌రోడ్డు నిర్మాణంలో బ్రిటిష్ అధికారులు చేస్తున్న అక్రమాలను, అమానుషచర్యలు గురించి మూడవ ఉపశీర్షికలో విప్లవ హేతువులో వివరిస్తూ...

కం॥ "తహసీలుదారు బాస్టియ
నహరహ మొనరించినట్టి-యక్రమ చర్యల్
సహియింప నెవరితరమగు
నహహా రాక్షసుడుగాక-యతడు నరుండే"[14] అని అంటూ

మన్య ప్రాంతమునకు తహసీలుదారుగా అతిక్రూరమైన బాస్టియన్‌ను నియమించారు. బాస్టియన్ ఆదేశాలతో బ్రిటిష్ అధికారులు చేసే హింస పనులకు ప్రజలకు సహనం నశించింది. అతడు మానవుడే అన్న విషయాన్ని మరిచిపోయి రాక్షసుడుగా ప్రవర్తించి అటు బ్రిటిష్ ప్రభుత్వాన్ని దృఢంగా చేసి అధికారులతో మన్యంలో సహింపరాని పనులు చేయించేవాడు.

బాస్టియన్ ఈ పనులు చేయుటకు మన్యం ప్రజల వెనుక ఎవరులేరనే కారణం చేత...

తే॥ "దుస్సహ దరిద్ర భారాన-దూలుచున్న
యాటవికులన్న లోకువ-యగుటవలన
సమదికోత్సాహపూరిత-సాహసమున
నతడొనర్పని ఘోరకృ-త్యములు లేవు"[15]

అటవీ ప్రాంతంలో సంచరించటం చేత, పేదరికాన్ని అనుభవిస్తున్న ఆటవికులు, నాగరికత తెలియని వారి యొక్క హక్కులకై, న్యాయంకై పోరాడేవాడు లేకపోవుటచేత, అడిగేనాధుడు ఎవడు లేడు కాబట్టి బాస్టియన్ చాలా ఘోరమైన కృత్యాలను చేసేవాడు.

ఈ శీర్షికలో బాస్టియన్ దురాగతాలను భస్మాసురినితో పోల్చి కవి చెప్పెను. బాస్టియన్ తోడుగా అగ్నికి వాయువు తోడు అయినట్టు సంతాన పిళ్ళై అనే అధికారి పంచదార కంటే లంచమే తీపి అన్నట్టుగా ప్రజలను పీల్చి పిప్పి చేసేవాడు.

తే॥ అమ్మహా ఘోరకృత్యము-లాలకించి
రక్షక భటాధి కారినా-రాజు పిలిచి
కామామా పక్కణములకు-గలతగలుగఁ
బ్రభుత కార్యాలయమ్ములు-పగులుననియె[4]

ప్రజలు అనుభవిస్తున్న బాధలు, తెల్లవాళ్ళు చేస్తున్న పాపకార్యాలు రామరాజు ఆలకించి ఒక ఉన్నత పోలీసు అధికారిని పిలిపించి మీరు సాగిస్తున్న ఈ ప్రజా వ్యతిరేక పనులను ఆపి వేయాలని లేనిచో ప్రభుత్వ కార్యాలయాలన్నీ ధ్వంసం చేస్తామని హెచ్చరిస్తాడు. రామరాజు ముందు ప్రభుత్వ వైఫల్యాన్ని ఎత్తిచూపి తర్వాత తన తిరుగుబాటుతో ముందుకు సాగుతాడు.

దానితో రామరాజు మన్యంలో తిరుగుబాటు లేవనెత్తినట్టు దృఢనిశ్చయానికి వచ్చిన తెల్లవాళ్ళు రామరాజును తమకు అనుకూలంగా మలుచుటకు అక్కడ మండలాధికారి ఫజులల్లాఖాన్‌తో పైడిపుట్ట గ్రామంలో 30 ఎకరాల భూమిని, రెండు బల్లను, రెండు జతల పశువులను యిచ్చి తల్లి తమ్ముడుతో సహా అక్కడ రామరాజును వ్యవసాయదారుడుగా చేయుటకు నిర్ణయించిరి. అందులో మర్మం రామరాజును తమ ప్రభుత్వానికి సానుకూలంగా తమ వైపు త్రిప్పుకొనుట ప్రయత్నంగా కవి పేర్కొన్నాడు.

కానీ నానావిధ నరకయాతనలు మన్నెం ప్రజలు అనుభవిస్తున్న బాధలు రామరాజు ఆలకిస్తాడు. ఒకరోజు...

తే॥ అంతనొకనాడు కానన-ప్రాంతమందు
గూడెముల పెద్దలందఱు-గూడవలయు
నెల్లియపరాహ్ణమున వత్తు-నేనట కని
కబురు మన్నెమునకు బంపి-కడకజనియె[17] అని అలా వెళ్ళి

మన్య ప్రాంతంలో బ్రిటీష్‌వాళ్ళ అన్యాయాలకు, అక్రమాలకు బలైపోయిన వారందరు ఆ ప్రాంతంలో పెద్దలతో సమావేశమౌతారు. జరుగుతున్న ఘోర కృత్యాల గూర్చి ప్రభుత్వం చేస్తున్న అన్యాయాల గూర్చి చర్చిస్తారు. తదుపరి కార్యప్రణాళికను అమలు చేయుటకు పెద్దల అంగీకారంతో రామరాజు నాయకత్వంలో ప్రజలు నడుచుటకు తీర్మానిస్తారు. అప్పుడు అక్కడ ప్రజలు రామరాజును గురించి, బ్రహ్మవర్చసం కలిగిన త్యాగి, భగవంతుడురూపంలో వచ్చాడు అని జైజైలు పలుకుతారు.

ఈ కావ్యంలో తెలుగు జాతీయాలకు (నానుడులను) ప్రయోగించిన విధానం

"బంగారు గాలమునకు చేపలు పడవు.
మంచి కూటిలోనికి మంచి కూర దొరకదు
అధికార బలమున వారి తప్పులు చప్పున బయట పడవు
లావు మీద వంపు తెలియదు.
కల్లగాదు దొరా నేల చెట్టి కాల రాచు చుందురననమ్ము"[18] అని

ఈ కావ్యంలో కవి వస్తువును గ్రహించుటలో రచనారీతిలో, భావ ప్రకటనలో, ఛందస్సులో ఈ పాతకొత్తల మేలు కలయికను మేళవించారని చెప్పవచ్చు. నానుడులచే మన్య ప్రజలు రామరాజు వద్ద పలికించిన తీరు, సామాన్యులకు అర్థవంతంగా కవి వివరించారు.

కవి ప్రతి శీర్షికలో జాతులు, ఉపజాతుల పద్యాలే కాకుండా పామరులకు అర్థవంతంగా ఉండుటకు అల్పాక్షరాలతో అనల్పార్థాలను చూపిస్తూ ద్విపద ప్రక్రియలో కూడా రాయడం విశేషం.

రామరాజుకు మన్యం ప్రజలు తమ బాధలను తెలియపరుస్తూ.....

మా వెతలు గూర్చి భగవంతుడు ఎరుగు, తడిగుడ్డలతో గొంతుకోసే అధికారులు ఎఱ్ఱటోపీల వాళ్ళు దుడ్డు కఱ్ఱలతో చావ చావ బాదేవారు. కూలీ డబ్బు ఇచ్చే వారు కాదు. ఆకలితో అలమటించేవాళ్ళం అని తమస్థితి తెలియజేసేవారు.

"పండిన యడవులే-పంటపొలాలు
కొండ గుహలె మాకు-గూర్చి గృహాలు
రామన్న దొరయింతి-రత్నాలదొంతి
లేమిచే దినుటకు-లేమి జింతిల్లి
చింత యంబలి ద్రావ-జీర్ణంబుగాక
కొంత సేపటి కది-గోడ గల్లింది
యంటువ్యాదిగ మాఱ-నసువులంబాసె
గంటిరా మాతీరు-గనులారమీరు
పక్కులకంటెను-బశు జాతికంటె

దిక్కేది యుంటివమి-దేవరావింటే

భీళ్ళు గుంచెలువేసి-బిగియించుకొనిరి

రాళ్ళు హద్దుగనుంచి-రాగూడదనిరి"[19] అని గరిజనుల తమ బాధలు తెలియజేస్తారు.

పై ద్విపదలో మన్యం ప్రజల బాధలను, జీవితాన్ని చాలా సూక్ష్మ సున్నితంగా చిన్న చిన్న పదాలతో వర్ణించడం బండ్లవారి ఘనత. అడవితల్లి బిడ్డలు అడవిని నమ్ముకున్నవారు. అడవులే వారికి పంటపొలాలు, అక్కడ పండిన ఆహార దినుసుల వల్ల కొంత జీవనోపాధి కలుగుతుంది. వాటిని కూడా అటవిచట్టాలతో వారికి కాకుండా చేశారు. సరియైన వసతి, సౌకర్యాలు లేకపోవుట, కొండగుహలే వారి నివాసాలు అని కవి చెప్పడంతో వారు ఎంతటి పేదరికాన్ని అనుభవిస్తున్నారో అర్థమవుతుంది. చింత అంబలి తినుట చేత కడుపు నొప్పివచ్చి అంటు వ్యాధులు కలగడం దానివలన ఆరోగ్య సమస్యలు వస్తాయని చిన్న పదాలతో కవి హృదయాన్ని హత్తుకునేటట్టు రాశారు. ఇంక అంటూ మాకంటే పక్షులు మిన్న స్వేచ్ఛగా ఆకాశంలో విహరిస్తాయి. పక్షులు సాటి మేము చేయలేదా? పశువులు నయం స్వేచ్ఛగా అడవితల్లి ఒడిలో ఆహారం తింటూ విహరిస్తాయి. మాబ్రతుకులకు కంచి వేసి రాళ్ళువేసి హద్దులు దాటరాదని శాసనాలు చేస్తున్నారని అక్కడి ప్రజలు రామరాజుకు చెప్పడం కవి వారిలో ఆవేదనను వెల్లబుచ్చినట్లు చేశారు.

'విప్లవ హేతువు' అనే మూడవ శీర్షికలో ప్రజల కష్టాలు, వారిని హింస పెడుతున్న ప్రభుత్వ అధికారులను, ఆకలి, ఆరోగ్య బాధలను, ఎన్ని అరాచకాలు చేస్తున్న వాటిని భరించి నోరు మూసుకొని బ్రతుకుతున్న విధానాన్ని రామరాజుకు చెప్పడం ఈ శీర్షిక గొప్పతనం.

నాల్గవ ఉపశీర్షికలో జాతీయ చైతన్యముతో కులమత వర్గభేదాలను మరచి సంస్కరణాభిలష గురించి చెబుతూ............

మ॥ కుల భేదంబులు క్రుళ్ళి కంపెగయుటన్-గుర్తించి కుత్సీలముల్

జలధుల్దాటి సమస్త భారతము నా-స్వాదించి పాలించిర

న్యులు మున్ నేడును దప్పదయ్యెనది మా-న్యుల్మెత్తురే మెట్టులే

బల శౌర్యమ్ములతో స్వరాజ్య రమసం-పాదించుకే జెల్లదే"[20] అని చెప్పారు.

భారతదేశంలో తెల్లవాళ్ళు విభజించు పాలించు సూత్రంతో అరాచకాల్ని సృష్టించేవారు. కుల భేదాలతో, ప్రాంతీయతత్వంతో భారతదేశాన్ని సర్వనాశనం చేశారు. దేశ సంపదనుదోచి, ప్రజలను హరిస్తున్నారు. దేనికి మనందరం బలపరాక్రమాలను, శౌర్య ప్రతాపాలను ప్రదర్శించవలసిన అవసరం ఉంది. సంఘటితంగా పోరాడితే స్వరాజ్యం వస్తుందని జాతీయ భావంతో రామరాజు చేత కవి పలికించాడు.

గాంధీజీ శాంతి, సామరస్యము, సహాయ నిరాకరణోద్యమం గూర్చి కవి...

తే॥ "సత్య వాఙ్నిధి గాంధి ప్ర-శాంతి కంది
తానహింసా విధానంబు-బూనిc గాని
ప్రభుత యన్మదగజయది-పాటిసేయ
దంకుశంబున నద్దాని-నణచవలయు"[21] అని పేర్కొన్నారు.

గాంధీ సహాయ నిరాకరణోద్యమం లాంటి మహా మహా ఉద్యమాలు మధ్యలో ఆగిపోయి గాంధీని జైలులో బంధించారు. అయితే శాంతియుత మార్గంలో బ్రిటిష్‌వాళ్లను ఏమి చేయలేము. అహింసా మార్గంలో వెళ్ళినా బ్రిటీష్‌వారు లొంగేవారు కాదు. ఆ బ్రిటీష్ ప్రభుత్వము సంక్షేమ విషయాలు మర్చిపోయి ఘోరమైన పైశాచికమైన పనులు చేసేవారు. బ్రిటీష్ వాళ్ళను హింసా విప్లవమనే అంకుశంతో పోరాటం చేసి దానిని లొంగ తీసుకోవాలి అని కవి వర్ణించాడు.

రామరాజు విప్లవ రణభేరి మ్రోగించించిన సందర్భంలో...

తే॥ "జిగురు కండెకుc దగిలిన-ఖగమురీతిc
జిక్కి యుంటిబుదాస్య-శృంఖలముల
నాందియిది స్వరాజ్య సమర-నాటకమున
కంచురణ భేరి మ్రోగించి మించుటొప్పు"[22] అని పలికారు.

కవి మాంసపు ముక్కతో బ్రిటిష్ వారిని, మృగముతో భారతీయ ప్రజలను పోల్చడం విశేషం. మాంసపు ముక్క కొరకు మృగము దొరికిపోయినట్లు బ్రిటిష్‌వారి విదేశీ వ్యామోహం, ఆధునిక సదుపాయాల కొరకు వారి కుట్రలో యిరుక్కుపోయారు. ఆంగ్లేయులు మిత్రులుగా

నటించి మనల్ని వారిదాసీలుగా చేసుకున్నారు. ఈ భారతదేశ దాస్య శృంఖలాలను విడిచి పెట్టుటకు, స్వరాజ్య సమరం చేయుటకు సమయం వచ్చింది. విప్లవ రణభేరి మ్రోగించి వారిపై తిరుగుబాటు సాగిద్దాం అని రామరాజు పిలుపునిస్తాడు.

ఐదవ ఉపశీర్షికలో (గంటం రాజునభినందించుట) గంటందొర రామరాజును అభినందిస్తాడు. రామరాజు గొప్పతనము, ప్రజలకు చేస్తున్న సేవ, బ్రిటీష్ అధికారులపై తిరుగుబాటుతో మన్యంలో తిరుగులేని పోరాట యోధుడుగా శ్రీరామరాజు గురించి తెలుసుకొని.........

కం॥ "పురజన రక్షక భటులిట
నిరతము మముగాలఁదాచి-నిర్భీతీ మెయిం
జరియింతురు దృతిమింతురు
సరియగు మార్గంబు సూపి-సాకుము రాజా!" అని అడిగినప్పుడు అయ్యా! రామరాజుగారూ! మన్యం పరిసర ప్రాంతంలో ప్రజలను పీడించి, వారి రక్తాన్ని పీల్చి పిప్పి చేసే పోలీసులు మమ్మల్ని ఎప్పటి కప్పుడు వెంటాడుతూ వేదిస్తున్నారు. నిర్భదించి, కక్షసాధింపులు చేస్తూ హింసిస్తున్నారు. వారికి తగిన గుణపాఠం చెప్పి మాకు మార్గమును చూపుమని గంటందొర, మల్లుదొర మొదలైన వారు బ్రిటిష్ వారి నిరంకుశ వైఖరికి బలైపోయిన వారు రామరాజును కోరుకుంటారు. అంతేగాక మేము ఎన్నో బాధలను అనుభవిస్తున్నాము. అడవిలో జంతువులతో సమానంగా చూసే మమ్మల్ని మీరు ప్రేమతో మనుషులుగా గుర్తించారు. కోమలమైన మీ పాద ముద్రితలతో ఈ మన్య భూమిని పవిత్రం చేశారని అక్కడి ప్రజలు కొనియాడతారు.

మీరు న్యాయం నందు నిల్చి, నీతులతో పురోభివృద్ధికి దారి చూపి, సాహసాల్ని తెల్పి, మాకు మా మన్యం ప్రజలకు అండగా ఉండాలని కోరుతూ......

ఆవె॥ ఆచితూచి పలుకు-నభ్యాసమున్నమీ
మాట మాకు మణుల-మూటయగుట
నెట్లు త్రోతు మద్ది-యెఱింగి యౌదుల దాల్ప
కార్యబుషి సమాన-యయనిధాన"[24] అని కోరతారు.

అడవి జంతువులతో మెలగుతూ ఏది మంచి, ఏది చెడో ఎటువైపు ప్రయాణమో తెలియని మాకు న్యాయ మార్గంలో నడిపించారు. అన్యాయాన్ని ప్రతిఘటించే తత్వాన్ని నేర్పారు. ధర్మ మార్గంలో మీమాట, మీ ఆలోచనలు మాకు మార్గదర్శకాలు. ఒక యోగి పుంగవునిగా, ఒక మహర్షిగా మాకు మీరు చూపే బాట భవిష్యత్ శూచిక. అని అక్కడ ఉన్న గంటం దొరతోపాటు మిగిలినవారు పలుకుతారు.

ఈ శీర్షికలో నానుడలు కవి ప్రయోగించిన విధానము......

గంటందొర రామరాజుతో పలికిన సందర్భంలో........

"నీతిలేనివాడు కోతికన్న బీడుకదా!
నమాజు సేయబోగా మసీదు మీద బడినట్టు
మనవి సేయబోగా వాడు మాపై విఱచుకొనిపడు
దయలేని యత్తకు దండము పెట్టినను తప్పే.
దాసరి తిప్పలు దైవమున కెఱుక
మెత్తగా నున్నమో చేతితోఁ ద్రవ్వినట్టున్నది మాగతి
వజ్రమును, వజ్రముతోఁ గోసినట్టు, దుర్మార్గుని దుర్మార్గము చేతనే జయింపవలయు."[25]

ఆరవ ఉపశీర్షికలో రణప్రేరణములో తిరుగుబాటు ఉద్యమం సాగుతుంది. కొండజాతికి చెందిన గోవిందు ఎండు చెట్టును వంట చెఱకుగా ఉపయోగించుటకు గొడ్డలితో కొట్టిన వెంటనే పోలీసు అధికారులు కొరడాలతో కొట్టి హింసిస్తారు. గూడెం ముఠాధారుడు వీరయ్యదొరను జైలులో బంధిస్తారు. గంటందొర ఇల్లు కాల్చి వేస్తారు. ఇంకా ఎన్నో ఘోరకృత్యాలు చేస్తున్న వాటిని భరిస్తూ...

ఉ॥ "పెట్టని కోటనీకురణ–వీరులు గంటము మల్లుసోదరుల్
చుట్టువెలుంగు నాటవిక–శూరులు చిచ్చుఱ పిడుగులాజిలో
జెట్టివినీవు కట్టలుక–జవ్వకు నిల్చిన వైరి వర్గముల్
గుట్టలు గుట్టలై పడరె–క్రూరుల పాలన మంతరింపగ"[26] అని

ప్రజలు తమ గుండెల్లో కోటను నిర్మించి అందులో రామరాజును దైవంగా భావించారు. ఆ వీరసైన్యంను తీర్చి దాని నాయకత్వంగా గంటం సోదరులు సూర్య చంద్రులుగా వెలుగు నింపుతారు. ధైర్య సాహసవంతులైన వీరులు చిచ్చరపిడుగులై వారిలో ఉన్న రోషాన్ని, కోపాన్ని, పగప్రతీకారాలను తీర్చుటకు ఒక్కొక్కరు అగ్గిరవ్వలుగా నిప్పులు కక్కుతూ బ్రిటిష్‌వారి క్రూరపాలనపై దండయాత్ర మొదలు పెట్టుటకు నిర్ణయించుకుంటారు.

బ్రిటీష్ సైన్యం వారి అధికారాలను ఎదుర్కొనుట సామాన్య విషయం కాదు. మన్యం సైన్యం తక్కువమంది తెల్లవాళ్ళ దగ్గర తుపాకులు, ఫిరంగులు మొదలైన యుద్ధ పరికరాలు ఉన్నాయి. వారిని ఎదిరించడం కష్టమైనది అని తెలిసి కూడా వారిలో చైతన్యం కొరకు కవి ఎంత చక్కగా రామరాజు చేత పలికిస్తూ...

వ॥ హిమము సూర్యని కంటె బలహీనమైన దయ్యు నొక్కొక్కతఱిఁ దరణి
సైతము పొదివి నిర్వీర్యునట్ల కనంబఱచి నిజశక్తి విరజిమ్ముంగదా!
మనమలంతులమని తలంచి తలవంచి తపించుట లగ్గుగాను పెద్దవాఁడైన
చంద్రునకు లేని స్వయం ప్రకాశము చిన్నవైన నక్షత్రములకున్నది. పెను
బాముకొక్కప్పుడు చలి చీమల కుంజక్కిచచ్చు[27] అని బోధించి అరణ్య
వాసుల ముక్తికిక రణమే శరణ్యము" అని పలికెను.

మంచు బిందువులు సూర్యుని కాంతితో అంతమైపోతాయి. కానీ ఆకులపై ఉన్న మంచు బిందువులు అటు ప్రకృతికి, ఇటు చెట్ల జీవనానికి ఉపయోగపడి తన నిజమైన శక్తిని వెదజల్లుతాయి. మనం బలహీనులమని ఆలోచించరాదు. వారికి తలవంచి విచారించుట మంచిదికాదు. ఆకాంశంలో చంద్రుడు రాత్రిపూట కనిపిస్తాడు కానీ ఎక్కువ ప్రకాశవంతంగా ఉండడు. కానీ నక్షత్రాలు రేయిబవలు వెలుగుతూ మెరుస్తూ ఉంటాయి. పెద్దపామును చలిచీమలు బంధించవచ్చు. గడ్డితాడుతో మదించిన ఏనుగును బంధించవచ్చు అని వీరసైనికులకు రామరాజు చైతన్య దీప్తితో విప్లవం రగిలించాడు. కాళీమాతకు పూజ చేసి, మన్య వీరులకు యుద్ధమే మార్గమని విప్లవ శంఖం పూరించాడు.

రాముని వంటి రామరాజుకు హనుమంతుని వంటి గాంసోదరులు వానర సైన్యం

సమకూరుతుంది. గతంలో జరిగిన, చరిత్ర సృష్టించిన పితూరీలు ద్వారా బంధాల చంద్రయ్య, గోపన్న పితూరీ, మొదలైన వాటి గురించి అడిగి రామరాజు తెలుసుకుంటాడు. ఇది విప్లవ పోరాటమైన మొదటిదిగా స్వాతంత్ర్యపు శాంతి సమర వీరరత్నమగు మహాత్మునికి జై అని పలికి రాజకీయ ప్రధానముగ సాగింపజేస్తారు. 'స్వరాజ్యం నాజన్మహక్కు' అని పలికిన తిలక్ మహామహుని స్మరిస్తారు. వృద్ధులు, యువకులు, చిన్న, పెద్ద, స్త్రీ, పురుష అనే భేదం లేకుండా అందరూ కూడా గూఢచారులుగా శిక్షణ పొంది, ఖడ్గ, కార్ముక, శర, శరధినిక షోపలాది సంగ్రామ సామాగ్రి" రహస్య ప్రదేశమునకు తీసుకొనిపోతారు.

ఏడవ ఉపశీర్షిక ఆటవికుల ప్రతిజ్ఞతో విప్లవ చైతన్యానికి నాంది పలుకుతారు. ఇందులో మన్యవీరుల ఆత్మదీక్ష, యుద్ధనైపుణ్యత, ఖడ్గ నిపుణత, పౌరుష ప్రతాపాగ్నులను, అటవీ ప్రాంతం అంతా పరిశీలించుట మొదలైన విషయాలను రచయిత వెల్లడించారు.

విప్లవ సైన్యం రామరాజు మాటను అక్షరాల అనుసరిస్తూ...

ఉ॥ కావున రాజు సెప్పినది-గాఢముగా నెదనమ్మియాతనిం
దేవుని యట్ల గొల్చిరణ-ధీరులమై విజయేందిర ప్రభా
పావన జీవనస్థితి శు-భంకరమంచట గంట మాడమీ
భావము లెస్సయంచొగిస-భాసదులెల్లరు వల్కిరీ క్రియ"[28] అని అంటూ

గాందొరల సైన్యం రామరాజు చెప్పిన విప్లవ భావాలతో నడుచుకుంటూ అతని మాటను, బాటను అమితమైన దైవ నిర్ణయంగా భావించి అనుసరించేవారు. వీరులుగా తీర్చిదిద్ది యుద్ధవీరులుగా ఆరితేరిన సైన్యం విజయమైన వెలుగులతో కాళిమాత ఆశీస్సులను పొందుతారు. వారి జీవన శైలిని మార్చుకుంటూ, స్వాతంత్ర్య కాంక్షతో మనసులో కోరికలు ఫలించేటట్టు ప్రతిజ్ఞను చేసి కార్యప్రణాళికను సిద్ధం చేసుకుంటారు.

ఎనిమిదవ ఉపశీర్షికలో సర్వసైన్యాధిపతి ఎన్నికను కవి వివరించారు. ఈ కావ్యంను ఎక్కువగా కవి రామాయణంతో పోల్చి చెప్పి రాముడుగా రామరాజు మన్యం ప్రజలను వానరసైన్యంగా, గంటం దొరను హనుమంతుడుగా, బ్రిటిష్‌వారిని రావణాసురుడుగా పోల్చి చెప్పారు. ఈ సైన్యంనకు సైన్యాధిపతి కోసం అన్ని అర్హతలు కలిగిన వ్యక్తి కావలెనని, అతడు "గాలిని సైతం త్రాడు పెనుధీశాలి"గా ఉండాలని కవి వివరించిన విధానం...

తే॥ సర్వసైన్యాధిపతి విగా-సంగరమున
నీవు నిలువంగజంకము-నిర్జరులకు
నంచు గంటము తచ్చిహ్న-మనగ రామ
రాజు కంఠాన బూలహా-రంబులైచె[29] అని అంటూ

తెల్లదొరతనపు దౌర్జన్యాన్ని నశింపచేయశక్తి, తెల్లవాళ్ళ అధికారాన్ని అంధకారంలో తొక్కగలిగిన ధీరత్వం. మహావీర నీవు సమర రంగమును నిలిచిన బోమాకు కొండంత బలము శత్రువులు యుద్ధరంగంలో నిలువలేరు. అని పలికి రామరాజు మెడలో పూల దండను వేసి సర్వసైన్యాధికారిగా గంటందొరను ప్రకటిస్తారు. అంతట రామరాజు ఎంతో వినయంతో పరమానందంతో విజయమును ఆ పరమేశ్వరుడు ప్రసాదిస్తారని కోరుకుంటాడు. ఆంగ్ల రాజ్యానికి విశ్రాంతి లేకుండా రామరాజు విప్లవ శంఖం మ్రోగిస్తాడు.

ఈ శీర్షికలో కవి జాతీయాలతో వర్ణిస్తూ...

తే॥ తేలుమంత్రము రాకున్న-దెలిసి తెలిసి
పాము పడగపైఁజేవెట్టి-బ్రదుకఁగలడె
తడిసినంగాని కట్టదు-తగిన గుడిసె
త్రాగినంగాని మొగ్గదు-ధరణీమీద"[30] అని వివరించెను.

పై పద్యంలో జాతీయాన్ని విశేషంగా వాడారు. ఆ పుటలో తేలు కుడితే మంత్రం వేసేవారు. తేలుమంత్రము తెలియకుంటే-పాము మీద దాని పడగమీద చేయపెట్టిరి అని కవి ప్రయోగించారు. యుద్ధ విశేషాలు తెలియకున్న బ్రిటిష్ సైన్యం అనే పాముపై చేయపెట్టారు అని వర్ణించారు. కానీ ఈ వర్ణనను సహజ సిద్ధంగా ఉన్నట్లు వర్ణించడం గమనార్హం. కవి ప్రాచీన పంథాను అనుసరిస్తూ సామాన్య పాఠకులకు అందుబాటులోని భావాన్ని చెప్పడం విశేషం.

క్రింది నానుడులను చక్కగా వివరించారు.......

"కందకు లేని దురద కత్తిపీటకెందులకు?
బాలపొంగు పాల పొంగు
పిల్లకాకియే మెఱుంగు నుండేలుదెబ్బ

నక్కి వెఱుంగని బొక్కలు నాగు లెఱుంగని పుట్టలు గలవా?"[31]

పై విశేషాల్ని బాస్టయన్ పలికించిన సందర్భంలోనివి. ఏమి తెలియని అమాయక ఆటవికులు–బ్రిటిష్ అధికారులపై దండయాత్రయా? కుంటిలు, తోలు కత్తులు గొడ్డల్లతో–ఫిరంగులు, తుపాకులతో ఎదురుగా వెళ్ళి పోరాడగలరా? ప్రపంచ యుద్ధాలతో విజయం సాధించిన బ్రిటిష్ సైన్యం ఎక్కడ? శ్రీరామరాజు ఎక్కడ? అటువంటి సైన్యంతో ఎదురుగా గిరిజనులా? అని బాస్టియన్ అపహాస్యం చేస్తాడని సింగన రామరాజుకు చెబుతాడు.

ఈ ఉపశీర్షికలో ఎక్కువ జాతీయాలకు కవి ప్రాధాన్యత ఇచ్చారు. అప్పుడు శ్రీరామరాజు పలికిన మాటలు...

"దంచలేనమ్మయూఁది యూది చూచినట్లు చేయం జేతగాని వానికి విమర్శలు మెండు
తాటాకు చప్పుళ్ళకు గుందేళ్ళు బెదరునా?
యినుపగుగ్గిళ్ళుగాని మినపగుగ్గిళ్ళుకావు!
పెద్దపులి చాటునకుఁబోయిన యెలుకకు గండ బిల్లి నల్లితో సమానము
పిడునకు గొడుగడ్డమా!
నవ్విన నాపచేనె యొక–నాడు ఫలింపదె యద్భుతంబుగాఁ
తేలునకు బెత్తనం బీయ–దెల్లవార్లు కుట్టుచున్నట్లు వర్తించుఁ
అన్నము పెట్టిన యింటికిఁగన్నము వెట్టుదురు"[32]

అయితే కవి కథానాయకుడు చేత, ప్రతినాయకుడు చేత తెలుగుజాతీయ సంపదలతో సాహిత్య పరిమళాలతో కావ్యంలో యుద్ధానికి సిద్ధం చేయడం గొప్పవిశేషం.

తొమ్మిదో ఉపశీర్షికలో చింతపల్లి రక్షక భటాలయం ముట్టడితో విప్లవ సైన్యం తిరుగుబాటు ప్రారంభమౌతుంది. శ్రీ రామరాజు సైన్యంతో మొట్టమొదటి సాహసం. మిరపకాయ టపాతో తమ సమాచారాన్ని ముందుగా తెలిపేవారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో రహస్యంగా విప్లవాలు చేసేవారు. కానీ శత్రువులకు విషయం చీటి ద్వారా తెలియజేసి ఎదుర్కోమని పంపడం ఏ ఉద్యమంలో లేని ధైర్య సాహసాలు ప్రకటించడం వీరోచితం. అని మిరపకాయ చీటీలో...

తే॥ “ఈ దినాన మీ స్టేషను–మీదికేము
దాడి సల్పుచునుంటిమి–ధైర్యమున్న
నిల్చిమాతోడఁ బోరుడ–నేను రామ
రాజునని యుంటగనిశిలా–ప్రతిమవైరి”[33] అని అంటారు.

చింతపల్లి పోలీసు స్టేషన్ సమీపం నుండి బాణంతో మిరపకాయ టపాసు పంపుతాడు. ఆ చీటీలో ఈ రోజు మీ స్టేషన్‌ను కొల్లగొట్టి అందులో ఉన్న యుద్ధ సామాగ్రిని (11తుపాకులు, 1390 తుపాకీ గుండ్లు, 5 కత్తులు, 14 బాయ్‌నెట్లు) తీసుకుపోతున్నాము. మీ బ్రిటిష్ సైన్యానికి ధైర్యం ఉంటే మాతో పోరాడి యుద్ధం చేయండి అని నేను రామరాజు అని అంటూ చీటిలో పూర్తి వివరాలతో రాసి శత్రువులకు దడ పుట్టించాడు. ఈ విషయం తెలుసుకున్న తెల్లదొరలు నిర్ఘాంతపోయేవారు. శిలాఫలకంగా మరిపోయినట్టు చేసిన స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీరామరాజు. అంతే కాకుండా గాంధీజీకి జై, భారతమాతకు జై అని నినాదము చేసి మొదటి విజయంతో రామరాజు సైన్యం ఆనంద పరచుకొని రెండో సమరానికి శంఖం పూరించాడు.

పదవ ఉపశీర్షికలో కృష్ణదేవిపేట విప్లవ సైన్యం యొక్క మనుగడ ఎక్కువగా సాగింది. రామరాజు మొదటి విజయంతో ప్రజలలో ఆదరణ పెరిగి ఎక్కడికి వెళ్ళిన బ్రహ్మరథం పట్టడం విశేషం. శరభన్న పాలెంలోకి వెళ్ళి అక్కడికి ముందుగా మిరపకాయటపా తయారుచేసి మల్లుదొరతో వెళ్ళి ప్రయోగిస్తారు. బ్రిటిష్ వారి భయం పుట్టి...

“కిమ్మన కేగివారు పరి–కింప నొకడుంను లేఁడు బంటువే
గమ్మిగ వచ్చి రాజుగన–గాలము దీరిన వృద్ధయుండెనో
ఆంగ్ల సైన్యాంతర్గతాంధ్ర భటులారా!”[34]

“బ్రిటీష్ సైన్యంలో పని చేస్తున్న భారతీయులను మరియు ఆంధ్రులను గూర్చి కొన్ని నిర్ణయాలు చేసిరి. విప్లవ సైన్యం కట్టుబాట్లు గట్టిగా ఉండేవి. అవసరమైతే తెల్లవాళ్ళను చంపవచ్చు. హింసించవచ్చు. కానీ భారతీయ ఉద్యోగుల జోలికి మాత్రం పోకూడదు. ప్రజలను బాధింపకూడదు. తోటి సోదరులకు ఎటువంటి హాని కలిగించరాదు. అని

రామరాజు సైన్యంలో క్రమశిక్షణతో విజయం వైపు దూసుకుపోయినప్పుడు బ్రిటిష్ సైన్యంలో ఉన్న భారతీయుల సహకారం లభించుట అవకాశము ఉంది. ఇటువంటి నిర్ణయాలతో, కట్టుబాట్లతో బాస్టియన్ ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు. రామరాజును దెబ్బతీయుటకు వ్యూహాలు పన్నేవాడు"[35]

పన్నెండవ ఉపశీర్షికలో రాజవొమ్మంగి పోలీసుస్టేషన్‌ను దాడి చేయుట వివరించారు. మూడవ రోజున మిరపకాయ టపాతో రాజవొమ్మంగి స్టేషనును ముట్టడించారు. మిరపకాయటపాసు స్టేషన్లో బల్లమీద గ్రుద్ది రామరాజు చూపిన ధైర్యంతో ఎఱ్ఱేసు, గంటం మొదలైన వారు స్టేషనులో 8 తుపాకీలు, 825 తూటాలు కొన్ని పోలీసు బట్టలతో సైన్యం...

శా॥ "అంతం బ్రెల్చిరి గుండ్లపైకి జమచి-హ్న బ్రాంతిలోకాళివి
క్రాంతి న్మెన్చ విశిష్టవీరులం వెస్తం-గాంధీజీ జేమించు ద
త్సంతోషంబున రాజు పల్లె ప్రజలకు-త్సాహంబు గల్గించి సు
స్వాతంఉశ్రమసీమ మిత్రతతితో-సౌఖ్యంబుమైనుండగన్"[36]

విప్లవ సైన్యం తుపాకులను వాటిలో గుండ్లు వేసి స్టేషను బయటకు వచ్చి గాలిలో కాల్పులు జరుపుతారు. విజయచిహ్నంగా ప్రజలకు మేమిచ్చే స్వాతంత్ర్య కానుకలుగా వర్ణిస్తారు. 'గాంధీజీ జై' అంటూ సంతోషంతో నినాదాల చేసుకుంటూ అక్కడ ఉన్న గ్రామాలకు, అమితమైన ఆనందాన్ని కల్గిస్తూ, మన్యం సౌఖ్యసుఖాలతో ఉండాలి అంటూ విజయోత్సాహంతో అక్కడ నుండి వెళ్ళిపోతారు.

యమ్మనిటేట నిల్చితన-నాకె నినుంగను బాగ్యమబ్బునం
చిమ్మెయి నున్న దాన నని-యిమ్ముగ బల్కె నమస్కరించుచున్... అంటూ

కృష్ణదేవిపేట పోలీసుస్టేషన్లో ప్రవేశించిన వెంటనే స్టేషన్లలో ఒక్కరు కూడా లేకపోయి భయంతో పారిపోతారు. వీరసైన్యంతో ప్రవేశించి స్టేషను కలయ చూడగా ఒక ముసలి తల్లి ఉంటుంది. ఆమె రామరాజును చూసిన వెంటనే నమస్కరించి నిన్ను చూచిన భాగ్యం కలిగింది. ఇది చాలు ఈ జన్మకు అని, ఆ మహానుభావుడుని దర్శించి ఆత్మసంతృప్తి పొందుతుంది.

ఈ శీర్షికలో మరో విశేషమున్నది. ఆ స్టేషన్లలో పెద్ద పెట్టెలతో ధనము కూడా ఉంటుంది. రామరాజు గాని, అతని సైన్యంగాని ఒక్క పైసాను తీసుకోరు. ధనమును ముట్టుకోరు. వారికి కావలసినది తీసుకుంటూ...

తే॥ "యుద్ధ సామగ్రి గైకొని-యోద్ధలకిడి
విజయ చిహ్నముగా గుండ్లు-ప్రేల్చిదళము
తోడ గాంధీజీ జేయంచు-దోన తిరిగి
గిరిదటియ రాజు సింగన-పరుగు లిడచు"[37]

తెల్లవారి సైన్యంను ఎదుర్కొనుటకు మాత్రమే యుద్ధ సామాగ్రిని దోచుకున్నారు తప్ప ధనం కాదు అని కవి అంతర్గతాన్ని చెప్పడం. ఫిరంగులు, తుపాకులు, గుళ్ళు తీసుకొని విజయంతో వారి ఉనికి తెలియపరచడం కొరకు రెండు తుపాకీ గుండ్లను పేల్చి ఆ విప్లవ దళము గాంధీజీ జై అంటూ భారతమాతకు జై అంటూ నినాదాలు చేసుకుంటూ పోలీసు స్టేషను నుండి వెళ్ళిపోతారు.

పదకొండవ ఉపశీర్షికలో బాష్టియన్ పరాజయమును కవి వర్ణించారు.

రామరాజు సైన్యంతో మొదట విజయం చింతపల్లి, రెండవ విజయం కృష్ణదేవిపేట పోలీస్‌స్టేషన్లతో ఆనందోత్సవాలతో ఉంటారు. కానీ బ్రిటీష్ వారు పరాజయంతో అందులో గూడెం తహశీల్దారు బాస్టియన్ అవమానంతో కృంగిపోతాడు. రామరాజు తిరుగుబాటు సమయంలో బ్రిటిష్ ప్రభుత్వంలో పనిచేస్తున్న భారతీయ ఉద్యోగుల గురించి రామరాజు బాల్యం నుండి ఒంజేరి సంగ్రామం వరకు వివరించిన చతుర్థ ప్రకరణం పూర్తి అవుతుంది.

పంచమ ప్రకరణంలో14వ ఉపశీర్షిక కాళీమహోత్సవంతో ప్రారంభమౌతుంది. ఈ ప్రకరణంలో కాళీ మహోత్సవము ప్రక్రియను చిత్రికవితలతో కవి వర్ణించారు. చిత్ర కవితా సమీక్షను నానా వర్ణనలతోను, మనోహరార్థాలతో, చిత్ర కవిత్వాన్ని వివరించారు. ఈ చిత్ర కవిత్వానికి మూలం సంస్కృతం. ఈ ప్రకరణమును పరిశీలించిన చిత్ర కవితా స్వరూపాన్ని బట్టి చూస్తే బంద కవిత కూడా చిత్ర కవిత్వంలో భాగమేనని తెలుస్తుంది.

ఈ శీర్షికలో శ్వేతచ్ఛత్ర బంధం, నాగబంధం, ఖడ్గబంధాలు ఉన్నాయి. పద్మ,

ఖడ్గ, సర్పాదుల ఆకారాన్ని నిర్మించి అందులో పద్యాక్షరాన్ని నియత క్రమాను గతంగా కూర్చటం బంధ కవిత్వం అవుతుంది.[38]

గీసిన ఆ బొమ్మల్ని బట్టి, పద్యాల్లో ఆకృత్త పదాలని బట్టి వారికి అనుగుణంగా అక్షరాన్ని కల్పించుకొని రచన చేసిన తర్వాత ఆ అక్షరాన్ని బొమ్మల్లో కూర్చి చిత్రాకారానికి సరిపడే విధంగా అక్షరాన్ని బంధించడమే బంధ కవిత్వం అనవచ్చు.

ఈ బంధ కవిత్వాన్ని 1.మాంగళిక బంధాలు 2.ఆయుధ బంధాలు 3.ప్రకీర్ణ బంధాలు 4.ఆకార చిత్ర మిశ్రమం అని నాలుగు రకాలు.



శ్వేతచ్ఛత్ర బంధము



## నాగ బంధము

ч. కరిముఖమాత వైరిహర – కారణవిగ్రహ గౌరి శారదా
సురనుత రూప భూరినిభ – శోభ నిరస్తతమోగుణావిలా
వరహరివాహనీ రహిత – వాదన చక్రపరేఖదారయా
గిరిజ గుణైహధీర శివ – కేవల రక్షహరైత వాచకా.

# ఖడ్గ బంధము



కం. సురవర పరహర పరహర
కరుణానందైక లోల – ఘన జనవరదా
ధరణీధర సంజాతా
పరమాద్భుత శక్తి యుక్త – పావని శుభదా 7



కం. త్రినయన మానస ధనమును
ఘనభ క్తిం బొంది జగముఁ – గాతువు జననీ
వినయమున నీపదాబ్జము
లనయము భజియింతు విజయ – మందభవానీ 8



కం. ధృతి నుతి నతి యొనరించెద
సతత హత మహాసురాళి – సంగర కేళీ
ధృతశూలీ జయశీలీ
మతినమ్మితిఁగా కపాల – మాలీ కాళీ 9



కం. అహరహ మిహపర సుఖదా
మహిషాసురమర్దనీ యు – మా సతి గౌరీ
గుహుజననీ శివకామిని
కుహనాసుర రణవిహారి – కుధర కుమారీ 10



కం. కారణరణర సభరవర
ధీరజనోద్ధరణ శీల – తృప్తపరేశా
శారద నీరద భాషా
శూరజ జనార్చిత పదాబ్జ – సురవరదా 11



కం. ముదమొదవ దయం గనుమా
కదనంబున జయము నిచ్చి – కాటఱ భవానీ
హృదయాబ్జమున నీ మృదు
పదము భజియుంత మమ్ము – పార్వతి జననీ 12

ఈ కావ్యంలోని రామరాజు చరిత్రలో కాళి మహోత్సవంలో శ్వేతచ్ఛత్ర బంధం 4,5 పద్యాల్లోను, నాగబంధాన్ని 6వ పద్యంలోను, ఖడ్గ బంధాన్ని 7,12 పద్యాల్లోను రచయిత పొందుపరిచారు.

**శ్వేతఛ్ఛత్ర బంధము:**

ఈ నాగబంధంలో, పద్యం తలతో మొదలై తోకతో అంతమౌతుంది. ఇందులో 84 అక్షరాలున్న పద్యం 64 అక్షరాలున్నట్లు కనబడుతుంది. ఎందుకంటే ఇరువది నోట్ల సంది స్థలాల్లో పాము మెలికలు తిరుగుతున్నట్లుగా ఉండే స్థలమని అర్థం. ఇరువది అక్షరాలు రెండు సార్లు మరల మరల వస్తాయి. పదమూడవ ఉపశీర్షికలో ఒంజేరి సంగ్రామంలో విజయం పొందుట వర్ణించారు.

బ్రిటీష్ సైన్యం వరసగా మూడవ పరాభవంతో కృంగిపోతుంది. దానికి ప్రతీకారంగా నర్సీపట్నం నుండి చింతపల్లి, యడ్డతీగల, కోటనందురు, మల్కనగిరి, ఏలేశ్వరం, వంటి ప్రాంతాల్లో రిజర్వుదళాలను గట్టి ఏర్పాటు చేసి స్కాట్ కవర్డు హైటర్‌లను రప్పించుటకు రంగం సిద్ధం చేస్తారు. అయినా రామరాజు సైన్యంను దెబ్బతీయుటకు వారి శిబిరాలను ఎత్తులను పరిశీలించుటకు గూఢచారులను పింపిస్తారు. వారి ఉనికిని సైన్యం ఉన్న ప్రాంతాన్ని కనిపెట్టి...

కం॥ రక్షక భట వరుడొక్కం
డక్షీన పరాక్రమమున–నరి గోయ దొరన్
లక్షించి పొంచి యుండగ
దక్షుడు రాజద్దిగాంచి–ధైర్యం బెసగన్"[39] అంటూ

ఆ సమయంలో ఆంగ్ల అధికారి తన చాకచక్యంతో ఒక కోయదొరను పట్టుకొని ఉండగా అక్కడ ఉన్న రామరాజు గద్దించగా వెంటనే కోయదొర ధైర్యంతో ప్రతి ఘటిస్తాడు. అనగా రామరాజు లేకపోతే వారి ధైర్యం కూడా ఉండదు. మన్యం బలం ఒక్క రామరాజు మాత్రమే.

ఒంజేరి సంగ్రామంలో కూడా బ్రిటిష్ సైన్యాన్ని చిత్తుగా చేసి మన్యం సైన్యం

అంటే భయంతో ఒణికి పోయినట్టు చేసి, అక్కడ నుండి పరిగెత్తించేటట్టు చేసిన రామరాజు...

తే॥ "కాళిదయ విజయంబులు-గలిగెగాన
భాద్రపదశుద్ధపూర్ణిమ-భక్తిదేవిఁ
గొల్తు మీవార్తఁ దెల్పుడు-గూడెములకు
నని పలికెరాజు మేలుమే-లనియెదండు"[40] అని పలుకుతాడు.

రామరాజు ఎంతో కష్టపడి వీర సైన్యంతో కలసి విజయం పొందిన వాటి ఫలితం దైవానుగ్రహం. మనం పూజించే ఆ కాళిమాత దయతో ఆమె కృపతో యింతటి విజయాలు సాధించాం. అమ్మ అనుగ్రహం మీ అందరి సహకారం అని రామరాజు వినయంతో చెప్తాడు. కాళీదేవత పూజ చేయడం గూడెం ప్రజలకు శుభం కలుగుతుందని రామరాజు పలుకుతాడు.

కాబట్టి మొత్తం పద్యంలో ఇరువది అక్షరాలు తగ్గుతాయి. చంపకమాల, ఉత్పలమాల, మత్తేభము లాంటి వృత్తాలతో ఈ బంధాన్ని నిర్మించవచ్చు ఉదాహరణలతో పటములను పరిశీలిద్దాం.

16వ ఉపశీర్షిక వర్షర్తువర్ణనతో ప్రారంభమౌతుంది. ప్రకృతిలో ఉన్న వర్ణనను మానవ జీవితానికి ఉన్న అనుబంధాన్ని గూర్చి చెప్తూ...

తే॥ ప్రాత పూరింట బండిన-వారిపైన
నీటిదారలు పడనిండు-నిదురసెడగ
నాల బిడ్డలు తన చుట్టు-నడలగీస్తు
నిబ్బరము వీడి విడిచెగ-న్నీటిబొట్టు[41] అని వర్ణించెను.

ఈత కమ్మలతో చేసిన పాత పూరింటిలో నివసిస్తున్న వారిపైన వర్షం కురిస్తే ఆ కుంటుంబంలో వారికి నానావస్థలు, అనుభవిస్తున్న తన పిల్లలను తానుచుట్టూ తీసుకొని వారికి రక్షణ కల్పిస్తూ వారిని సంరక్షణతో తన తల్లి అక్కున చేర్చుకొని కన్నీటిని విడిచిపెడుతుంది.

ఈ పద్యాన్ని బ్రిటిష్ ప్రభుత్వానికి, భరతమాతకి, భారతప్రజలకు అన్వయిస్తూ......

భారతదేశమనే పాతపూరింటి పాకపై బానిసత్వమనే వర్షాన్ని, అధికార దాహమనే నీటి జల్లులతో ప్రజలపై పడి బాధిస్తుంటే తన బిడ్డల కష్టాల్ని చూసి భారతమాత తన దగ్గరకు చేర్చుకొని కన్నీటితో వారిని సంరక్షించుటకు ప్రయత్నిచింది అని కవి భావన చిన్న పద్యంలో వ్యక్తపరిచారు.

వర్షం అంటే పిల్లకు సరదాగా ఉంటుంది. కానీ పిడగులు పడితే ఆ స్థితిని తెలియజేస్తూ......

తే॥ "బాల బాలిక లతిభయ-భ్రాంతులగుచు
నర్జునాయర్జునాయని-యఱచిరపుడు
కొండలను బిండిసేయును-ద్దండశక్తిఁ
దనరునదిగాన లోకము-దద్ధరిల్లె"[4] అని వర్ణించెను.

చిన్న పిల్లలు వర్షంతోపాటు పిడగులు వస్తున్నప్పుడు అర్జునా, ఫాల్గునా, అనే మాటలతో తన భయాన్ని పోగొట్టుకుంటారు. ఆకాశంలో మేఘాలు ఎదురుగాలికి వణికిపోయి తర్వాత వర్షంతో చల్లని ఆ ప్రదేశమంతా జీవన ప్రధమైన నీరుగా మారుతుంది. ఈ పద్యంలో పిడుగులతో, కొండలతో బ్రిటిష్‌వారిని పోల్చి, సీతారామరాజు అనే అర్జునుడు అస్త్ర, శస్త్ర ప్రయోగం వలన ఆ పిడుగులను నీరుగా, కొండలను పిండిగా చేసి ప్రజలకు కొండంత ధైర్యాన్ని యిస్తాడని కవి వర్ణించారు.

ఈ ప్రకృతి వర్ణనలో సెలయేర్లు, పక్షులు, ఆకులు, పువ్వులు, వసంతం మొదలైన గుణాలను సూర్యరశ్మితో పాటు జీవనస్థితికి ఆధారమైనవిగా కవి వివరిస్తూ......

తే॥ "క్షణములో వర్షమును మఱు-క్షణములోన
తీవ్రతరమైన యెండయు-దేజరిల్లె
నంతలో నేడపునుమఱి-యంతలోన
యమిత కోపముజూపుగ-య్యాళివోలె"[43]

ఒక్కక్షణములో భయం, ఇంకొక్క క్షణం తీవ్రమైన తిరుగుబాటు, మరోక్షణం

సాహసం, ఇంకోక్షణం విప్లవంతో మన్యం రూపురేఖలు ఉంటాయని, ప్రకృతి కూడా ఒకసారి వర్షం కంటేనే తీవ్రమైన ఎండ మరునిమిషంలో మరిపోతూ ఉంటాయని అట్లాగే కోపంతో బ్రిటిష్ వారిపై నిప్పులు వెదజల్లెను.

ఈ శీర్షికలో వర్ష భావనలతో ప్రకృతిని బ్రిటిష్ వారి దుష్టచర్యలను ప్రజల తిరుగుబాటును చక్కగా కవి వర్ణించారు.

17వ ఉపశీర్షికలో కవర్టు హైటరులరాకతో మన్యంలో యుద్ధ వాతావరణం విప్లవ వీరుల పోరాటం వర్ణించారు. అలాగే ఈ శీర్షికలో విప్లవంను పూర్తిగా నిర్మూలించుటకు ప్రజలను మరొక దారిలో మరల్చుటకు  విప్లవ వీరులను పట్టుకొని వారికి ధనాశను చూపిస్తూ...

ఉ॥ ఈ బలమే మొనర్చెనరు-లేగతిఁ జిక్కక తప్పిపోయిరో
మీ బ్రదుకుల్ నిరర్ధకము-మిమ్మిటు పోషణ చేయనేలరా?
దేబెలు! పల్లెలంబ్రజకు-ధీరత రాజును బట్టి యిచ్చుచో
నేబది వేల రూప్యముల-నిత్తుమ నుండు ధనాశ పాశమో[44] అని

పలుకుతారు.

విప్లవ సైన్యమునకు సహాయ సహకారాలు అందిస్తున్న ప్రజలను హింసిస్తూ మిమ్మల్ని, మీ బ్రతుకుల్ని నానా హింసలు చేస్తామని లేకపోతే వారి ఆచూకీ చెప్పండి అని హెచ్చరించి భయపెడతారు. కానీ ప్రజలు ఏవిధమైన ఆచూకీ, సమాధానం చెప్పరు. వెంటనే వారు రామరాజును, వారి సైన్యంను మాకు పట్టి యిచ్చునచో 50,000 రూపాయలు బహుమతిగా ఇస్తామని తెల్లవాళ్ళు ప్రకటిస్తారు. రామరాజుపై ఉన్న అభిమానమందు ఈ డబ్బు ఒక లెక్క అని ప్రజలు ఎటువంటి సమాచారం యివ్వరు. అప్పటికే అనేక తిరుగుబాటులో పరాజయం పొందిన బ్రిటిష్‌వాళ్ళు అవమానంతో కృంగిపోతారు. ప్రతీకారం కోసం ఎదురుచూస్తూ ఉంటారు.

18వ ఉపశీర్షికలో స్కాట్ హైటర్‌ల మరణంతో విప్లవ సైన్య పోరాటం ఎంత తీవ్రమైనదో తెలుస్తుంది. యద్ధ వ్యూహంలో ఆరితేరిన చింతపల్లి ఏజన్సీలో సాండర్స్,

టాల్బట్, స్కాట్ కవర్టు, హైటర్ చాడ్విక్ లు లమ్మసింగ్‌లో మార్జిన్‌లు మకాం చేస్తారు. ఒక్కొక్క క్యాంపులో 30 నుండి 40 మంది సైనికులు, తుపాకులు, మందుగుండు సామాగ్రి ఫిరంగులతో విప్లవ ఉద్యమాన్ని అణచుటకు పూనుకున్నారు.

తమ కోసంసైన్యంతో స్కాట్ కవర్డు, హైటరులు వస్తున్నారని విప్లవకారులు తెల్సుకున్నారు. విషయాన్ని రామరాజుకు చెప్పారు. అప్పుడు వెంటనే.......

"ప్రియమైన స్కాట్ కవర్డు మీరు నా కోసం గాలిస్తున్నట్టు నాకు సమీపమున నున్నట్టు తెలియచున్నది. ఇచటికి వచ్చిమాతో పోరాడతారా! లేక మమ్ము మీ యొద్దకు రమ్మందురా? పుట్టుకతో ఇంగ్లీషు వాడవు. కావున న్యాయమున వాస్తవమును తెలుపుమని" రామరాజు కవర్టునకు మిరపకాయటపాతో కబురుపంపుతాడు.[45]

దానికి బదులుగా కవర్డు "ప్రియమైనా రాజా! నిజమైన భారతీయులైనచో మాతో పోరాటమునకు అచ్చుట ఆగవలయును. మేము రేపటి ఉదయమున అక్కడకు వత్తుము" అని సమాధానము చెప్తారు.

తే॥ హైందవ దళ ద్వయములోయ-ముందువెక్క
నడువ నిర్వురు తత్పుతుల్-నడుమ నుంట
నరయుచుఁ గవర్టు హైటరు-లని తలంచి
పొంచి యుండిరి వారల-బొరిగొనంగ"[46] అని అంటూ

ఒక పక్క కొండగుట్టు, రెండవ పక్క అగాధమైన లోయ ప్రాంతానికి ఆంగ్లేయాధికారులు తమ సైన్యంతో వరసగా కవర్టు హైటర్‌లకు ముందు వెనుకలుగా సైనికులు నడుస్తారు. కవర్టు, హైటర్‌లను విప్లవ సైన్యం గుర్తిస్తుంది.

అంతే మరుక్షణంలో ఉరుములు ఉరిమినట్లు ధనాధన శబ్ధంతో కొండపై పేర్చిన రాళ్ళు సైనికులపై వర్షంలా పడతాయి. ఆ వెంటనే హాహాకారాలు మిన్నుముడతాయి. సైనికుల తలలకు తగిలి కాళ్ళు చేతులు విరిగి రక్తపుమడుగులో దొర్లుతూ కొంతమంది అగాధమైన లోయలో పడతారు.

బ్రిటన్‌లో పుట్టి భారతదేశం వచ్చి భారతీయులను తమ నిర్బంధ నిరంకుశ చర్యలతో అల్లాడించే ఫాసిస్టు రాక్షసుల్లో ఇద్దరు అశువులు కోల్పోవడంతో విప్లవకారుల సంతోషానికి అవధులు లేవు. చావగా మిగిలిన సైనికులు పారిపోగా, విప్లవ కారులకు 303 రైఫిల్స్ మరికొంత మందు గుండు సామాగ్రిని విప్లవ సైన్యం వశపరచుకుంటుంది.

ఆంగ్లేయ సైన్యంతో పోరాడిన మన్యం సైనికుల స్థితిని తెలియజేస్తూ...

తే॥ ఆంగ్ల వీరులతో గూడి–యాసువులిడిన
భారత భటులకు గోలీల–ప్రాప్తిలేదు
రుద్ర భూమిని గూడద–ద్రౌద్రమేమొ
తెలుపు నలుపుల బేధంబు–దెలిపి రౌరా! [47] అని తెలిపాడు.

బ్రిటీష్ సైన్యంతో పోరాడిన భారతసైన్యంకు ఎటువంటి గుర్తింపు లేదని ఎక్కడా దేశ విదేశాలలో పుట్టిన ఆంగ్ల వీరులకు ఇక్కడ స్మారక చిహ్నములు, సమాధులు కట్టారు. ఆంగ్లేయులతో పోరాడిన మనవాళ్ళకు ఎటువంటి సమాధిగాని, స్మారక చిహ్నాలు లేకపోవడం విచారకరంగా ఉంది. యుద్ధభూమిలో తమ ప్రతాపాలను, పౌరుషాన్ని, ధైర్యాన్ని ప్రకటించి వీరోచితంగా పోరాడి అశువులను భారతమాతకు అర్పించిన స్వాతంత్ర్య సమరయోధులు ఆంధ్రవీరులకు ఒక్క స్మృతి చిహ్నం గాని, స్మారక చిహ్నం గాని, సమాధిగాని లేకపోవుట కవి విచారం వ్యక్తం చేశారు.

19 ఉపశీర్షిక అడ్డతీగెల ముట్టడితో విప్లవ సైన్యం ప్రతాపాన్ని మరోసారి ప్రదర్శిస్తారు. విజయంతో వీరసైన్యం అడ్డతీగల ముట్టడి గురించి ముందుగా తెలియపరుస్తారు. రామరాజు గురించి వెయ్యికళ్ళతో బ్రిటిష్ వాళ్ళు ఎదురుచూస్తుంటారు. చీకటి పడుతున్న కొద్దీ ఎక్కడ ఏమి కదిలినా అదిగో రామరాజు అనుకుంటారు. నిజంగానే రామరాజు 90మంది విప్లవ కారులతో పోలీసుస్టేషన్ ను ముట్టడించాడు. అంతకుముందు పోలీసులు ఆయుధాలు దాచేస్తారు. తెల్లవారు ఝామున 3గంటలు దాకా స్టేషన్‌లో ఏ వస్తువును ముట్టుకోకుండా, దాదాపు 5 గంటల కాలం తన పంతం నెగ్గించుకునేందుకు పోలీసుస్టేషన్‌లోనే కూర్చున్న రామరాజును ఎదిరించేందుకు ఒక్క ఆంగ్లేయాధికారి కానీ ఒక్క సాయుధ పోలీసు కానీ ఆ ఛాయాలకు రాలేదంటే వాళ్ళల్లో ఉన్న మేకపోతు గాంభీర్యం వ్యక్తమౌతుంది.

"మొగుడు పోతే పొయ్యాడుగాని, గుండు బాగా కుదిరింది" అనే సామెతగా అడ్డతీగల పోలీసుస్టేషన్‌పై దాడి జరిగింది గానీ, తుపాకీలు పోలేదని పై అధికారులకు తంతి పంపించారు. ఈ శీర్షికలో రామరాజుకు జీవితానికి పూలబాట వేసిన ఫజులల్లాఖాన్ మరణంను రామరాజుకు తెల్పుట అతని ఋణమును స్వాతంత్ర్య దీక్షగా తీర్చుకొనుటగా కవి వ్యక్తం చేయడం గొప్పగా ఉంది.

20వ ఉపశీర్షిక నిశీధిని రాజుపై దండయాత్ర బ్రిటిష్ వారిపై జరిగిన విధానము కవి వివరించారు. బ్రిటిష్ సైన్యం రామరాజు అతని సైన్యాన్ని పట్టుకోవాలని దృఢ సంకల్పంతో...

తే॥ మెల్లమెల్లగ నటబల్లె-పల్లెకేగి
ప్రజలఁ గొందఱకే వేవో-బాసలిచ్చి
యవుడ పెద్దగడ్డపాలెము-నందెరాజు
కలడ నెడు వార్త విని యాత్మ-నలరిజాను"[4] అని అంటూ

రామరాజును ఓడించి పట్టుకొని విప్లవ సైన్యాన్ని బంధించుటకు మంచి సమయం కోసం ఎదురుచూస్తున్నారు. కొద్దికొద్దిగా సమాచారాన్ని రాబట్టి పల్లెల్లో కెళ్ళి ప్రజలను బంధించి, ఏవో కోరికలను తీర్చి వారికి ఆశలను కల్పించి రామరాజు పెద్దగెడ్డపాలెం నందు ఉన్నాడనే సమాచారము తెలుసుకుంటారు. ఆనాటి రాత్రి స్కైనీ, కినీ, గుడాల్ మొదలైన బ్రిటిష్ వాళ్ళు రామరాజు సైన్యంతో కొంతసేపు కాల్పులతో యుద్ధం చేస్తారు. ఆ యుద్ధంలో విప్లవవీరులు కొంతమంది గాయపడతారు. మరికొందరు చనిపోతారు. విప్లవ సైన్యం రామరాజు నేతృత్వంలో ఖచ్చితమైన గెరిల్లా పద్ధతిలో పోరాటాన్ని సాగిస్తారు. భగ భగ మండే ఫిరంగి గుండ్ల తాకిడికి విప్లవకారులు నిలబడటం బహుకష్టమైంది. వెంటనే రామరాజు తన విప్లవ దళానికి వెనుదిరగండి అనే ఆజ్ఞనిస్తాడు. ఇది తొలి ఓటమిగా కవి వర్ణించారు.

21వ ఉపశీర్షికలో స్వామి దర్శనము అనగా రామరాజు యొక్క స్వాతంత్ర్యదీక్ష, వీరుల పోరాట సమరం గూర్చి దేశంలో వ్యాపించుట.......

తే॥ రాజు సాహస కృత్యముల్-రాష్ట్రమెల్లఁ
బత్రికలు దెల్పుచుండె ని-ర్భయముతోడ
సరగ జక్రాన విప్లవ-జ్వాలరేగు
ననెడి భీతి హూణులకాత్మ-నధికమయ్యె"[49] అని

రామరాజు యుద్ధ నిపుణత, సాహస కార్యములు, గెరిల్లా యుద్ధ తంత్రము మొదలైన విప్లవ పోరాటాలు రాష్ట్రమంతా తెలిసిపోయి వివిధ పత్రికల్లో విస్తృతంగా వార్తలు ప్రచురణ చేయడం జరుగుతుంది. ఆవార్త పత్రికల ప్రభావంతో ప్రజలు చైతన్యంతో ఉండేవారని, భయం లేకుండా విప్లవ జ్వాలను వెలిగించి, బ్రిటిష్‌వారికి ఆత్మశాంతి లేకుండా చేశారని పత్రికలు, ప్రజలు ప్రశంసించారని కవి వివరించారు.

22వ ఉపశీర్షికలో అర్థరాత్రి బ్రిటీషు శిబిరాలపై దాడి చేసిన విప్లవ సైన్యం. భగవంతుని దర్శించుకోని స్వాతంత్ర్యం రావాలని కోరుకుంటాయి. ఏ ఊరువెళ్తే అక్కడ రామరాజుకు ప్రజలలో మంచి ఆదరణ, మద్ధతు లభించేది. అన్నవరం, శంఖవరం ప్రజలు రామరాజునకు ఖద్దరు వస్త్రాలను యిచ్చి భక్తితో గౌరవించారు. ఇంతలో భారత జాతీయ మహాసభ కాకినాడలో జరగుతున్న వార్త విని అందులో విప్లవ కారులు చేస్తున్న స్వాతంత్ర్య దీక్ష గూర్చి చర్చించేవారని కవి తెలిపారు.

ఆ మహా ఉత్తేజముతో తిరుగుబాటు చర్య కది సమయమని........

తే॥ కాలరాత్రి నఠాత్తుగ-గదనమునకు
వచ్చిశరతతిఁ జిమ్మంగ-వైరి వరుల
నెదురు కొన గుండె సాలమి-జెదరి యాంగ్ల
సేన పర్వెత్తెఁ జెచ్చెర-జెమట గ్రమ్మ[50] అంటూ

విప్లవ వీరులు స్వాతంత్ర్య పోరాట ఉత్సాహంతో అర్థరాత్రి అకస్మాత్తుగా యుద్ధమునకు బ్రిటిష్ వారిపై తిరుగుబాటుకు సాహసం చేస్తారు. ఆ వీరుల యుద్ధంతో తెల్లవాళ్ళ గుండెల్లో భయం పుట్టి, తలో విధంగా చెదిరిపోతారు. గుడారాల నుండి పరుగెత్తుకుపోతారు. తెలుగువారి ధైర్యం చూసి, తెల్లవాళ్ళకు చెమటలు పోసి, మూడు చెరువుల నీళ్ళు త్రాగి ప్రాణాలను అరచేతిలో పెట్టుకొని బ్రిటిష్‌వారు వెనుదిరిగినారని

కవి వర్ణించారు.

23వ ఉపశీర్షికలో రామరాజు నిర్యాణమును అత్యంత విశాదకరంగా చిత్రీకరించారు. రామరాజును పట్టుకొనుటకు అక్కడ ప్రజలను నానాహింసలు పెడతారు. స్త్రీలు, వృద్ధులు, చిన్నపిల్లలు అనే తారతమ్యం లేకుండా నరకయాతనలు పెడతారు. అది చూసి సహించలేని రామరాజు పట్టుపడిపోతాడు. బ్రిటిష్‌వాళ్ళు రామరాజును మంచానికి కట్టి వేస్తారు. అప్పుడు రామరాజు...

ఉ॥ "పౌరుషమున్న నాకొకతు-పాకి నొసంగి మదీయ బంధమ
వ్వారిగద్రెంచి యొక్కొకడ-భండన భూమిని నిల్చిపోరుఁడీ
యేరి బలాబలంబు-డెల్లర కొక్కక్షణానఁ దెల్లమౌ
వీరులు మెచ్చు కొంద్రు పృధి-వీస్థలిఁ బ్రాకు యశఃప్రకాశముల్"[51] అని

పలుకుతాడు.

పట్టుబడి బంధింపబడిన తెలుగువాడి పౌరుషాన్ని కవి ఈ పద్యం ద్వారా తెలియజేశారు. బ్రిటిష్‌వారికి సవాల్ విసురుతూ రోషమున్న వాళ్ళయితే నాకు ఒక తుపాకీ ఇవ్వండి. నా బంధాలను, విముక్తి చేయండి. నా పోరాటంతో మీ అందరికి సమాధి చేసి, భారతభూమిని పునీతం చేస్తాను. ధైర్యం ఉంటే రండి. వీరుల రక్తంతో తడిచిన ఈ భూమిని ప్రకాశవంతం చేస్తానని హెచ్చరిస్తాడు. రామరాజు పౌరుషాన్ని కసిగా చూపినట్లు కవి నిరూపించారు.

రామరాజు మరణంతో భారతమాత శోక సముద్రంలో.......

ఉ॥ భారత మాతృ పాదముల-భక్తి భజించుచు సోదర ప్రజా
కారుణి కత్వ దృష్టిరణ-గాధకు నాయకరత్నమై మహా
వీర రసాబ్ధి వీచికల-వేయి తెఅంగులఁ దేలి శూలికిన్
మాఱన నొప్పి యిప్పగిది-మరణ హోమము నందుఁ గూలితే"[52] అని

కవి తెల్పాడు.

భరతమాత పాదమును భక్తితో పూజించు భారతీయ ప్రజలారా! ఈ విప్లవ

కార్యసాధకుడు, నాయకరత్నమైన ఈ మహావీరుడు గుణాలు, గణాలు వేయి జన్మలైన, వేయిశతాబ్ధాలైనా మన తెలుగువారి చరిత్రలో ఎప్పటికీ నిలిచిపోతాయి. ఆ మహావీరుడు చనిపోయిన తరువాత ప్రకృతి స్థంబించిపోయింది. వనదేవత కల్లు మూసుకుంటుంది. భారతమాత శోకసముద్రంలో మునిగిపోతుంది.

24వ ఉపశీర్షికలో మిత్రుల సంతాపములను గురించి కవి వివరించారు. రామరాజు మరణంతో ఆయన కీర్తిని, సాహసాన్ని...

చ॥ జనసుఖమాత్మ సౌఖ్యమని–సాహస కార్య కళాకలాపియై
మనుచు సమస్త మార్గముల–మన్యము వృద్ధిని గోరి రాజయో
యిననిభ తేజుడయ్యుగడ–కిట్టయె దైవము చిన్నచూపు చూ
చిన నతడెట్టిడైన జయ–సిద్ది సమృద్ధిగఁ బొందజాలునే[53] అని పేర్కొన్నాడు.

జనుల యొక్క సుఖమే మాతృదేశ సౌఖ్యమని సాహస, వీరోచిత, విప్లవ కార్యాలను చేస్తూ, హింస, అహింస, అతివాదుల, మిత్రవాదుల మార్గాలలో నడుచుకుంటూ ఏ మార్గమైనా అది స్వాతంత్ర్యాన్ని కోరుకోవడమే అనేవాడు. గిరిపుత్రుల, మన్యం అభివృద్ధి కొరకు తేజోనిజుడై ఉన్న రామరాజు 27 ఏళ్ళకే వీర మరణం పొందాడు. అతడి వీరోచితమైన పోరాటంతో భారతప్రజల స్వాతంత్ర్య దీక్షకు ఒక మార్గం చూపిన మహావీరుడని అతడే నిజమైన త్యాగి, దేశభక్తుడు అని ప్రశంసించారు.

## 2.2 మల్లెల గురవయ్య:

శ్రీసీతారామరాజీయము పద్యకావ్యంను మల్లెల గురవయ్య రాసిరి. ఇది రెండు వేల పద్యాల మహాకావ్యం. ద్వాదశ పరిచ్ఛేదములుగా విభజించారు. ఒక్కొక్క భాగంలో ఒక్కొక్క ఘట్టాన్ని రాశారు. పదకొండవ భావంలో రామరాజు అస్తమయంతో ముగిస్తుంది. పన్నెండవ భాగంలో ప్రశంసా నీరాజనములు, స్మారక సభలు, రామరాజు వాఙ్మలము, మిత్రుని లేఖ వంటి విశేషాలతో రామరాజు చరిత్రను, విప్లవ కీర్తిని మొదలైన చారిత్రక అంశాలతో పాటు తిరుగుబాటు, చైతన్యం మున్నగునవి ఈ కావ్యంలో కవి వివరించారు.

మొదటి భాగంలో అరుణోదయంలో 5పుటల్లో 39పద్యాలతో రామరాజును పుట్టుకను వివరించారు. వంచరిత్రను, తాత, తండ్రు ఘనతల్ని, విశిష్టతల్ని పొందు

పరిచారు. స్వాతంత్ర్యదీక్ష పరాయి పాలనపై వ్యతిరేకభావం పూరేకుల నుండి వచ్చిందనడానికి.......

సీ॥ పరదాస్య శృంకలా బర్ధజీవనయాత్ర–సాగించు టధమని సర్గవృత్తి
అందుతెల్ల దొరల నాశ్రయించుట యన్న బ్రతుకు మనకు తెల్లనారి నట్లె
స్వచ్ఛంద వృత్తితో సంసారసాగర ముత్తరించుట యుత్త మోత్తమమని
చిత్రలేఖన కళా సిద్ధ హస్తుండైన వేంకట కృష్ణుని ప్రియ కుమారు"[54]

ఫోటోగ్రఫీలో నైపుణ్యం సంపాదించిన వేంకట కృష్ణుని కుమారులు వెంటకరామరాజు తెల్లవాళ్ళకు లొంగిపోయి, బానిసలుగా జీవనం కొనసాగించడం, ఆంగ్ల విద్యతో వారివద్ద గుమాస్తా గిరి చేయడం, వారిని స్మరిస్తూ, ఆశ్రయిస్తూ బ్రతకడం మృత్యువుతో సమానమని వేంకటరామరాజు భావన. స్వతంత్రంగా జీవించడం, మన జీవితాన్ని పరోపకారం కోసం త్యాగం చేయడం, దేశంకోసం, ప్రజల కోసం స్వేచ్ఛగా జీవించడం మంచి భారతీయుడు యొక్క లక్షణంగా పేర్కొంటారు.

అల్లూరి వారి పూర్వీకులు సంస్కృతాన్ని అభ్యసిస్తూ, ఆంగ్లవిద్యను వ్యతిరేకిస్తూ అనేకమైన గ్రంధాల్నీ వాటిలోని విషయాన్ని మార్గదర్శకంగా స్వీకరిస్తూ జీవించేది మాతామహుల కుటుంబం. సీతారామరాజు తాత, సోదరి పండిత రాజయమ్మ సాహిత్యంలో గొప్ప పేరు సంపాదించారని కవి ప్రశంసించారు.

వెంకటరామరాజు స్వతంత్ర వృత్తి అయిన చిత్రలేఖనంలో శిక్షణ పొందడానికి కొంత బంగారాన్ని తీసుకొని పోయి బొంబాయిలో ఛాయా చిత్రపటాల రూపకల్పనలో శిక్షణ పొందుతాడు. శిక్షణానంతరం బొంబాయి నుండి రాజమహేంద్ర వరానికి వచ్చి ఫోటో స్టూడియోను ప్రారంభిస్తాడు. ఆ స్టూడియోలో.........

ఆ.వె॥ "బిపిని చంద్రపాలు వీరేశలింగము–భీకర కలియుగ భీముడైన
కోడె రామమూర్తి గురజాడయును తిలక్ ఆదిభట్ల దాసు నార్యులుగన"[55]

భారత స్వతంత్ర్య పోరాటంలో పాల్గొన్న బిపిని భీముడు కోడి రామమూర్తి శరీర గాంభీర్య మూర్తిమత్వాన్ని, సాహిత్యంలో అడుగుజాడగా వెలుగిందిన గురజాడను, హరికథ పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు అంటి ఫోటోలను తీసి తమ స్టూడియోలో

అలంకరించారు. సామాజిక, సాహిత్య రంగాల్లో కృషి చేసిన వారి ఫోటీలతోపాటు, ఇటు సమాజం, అటు సంస్కృతి, భాస వ్యవహారం, స్వాతంత్ర్య దీక్ష కలిగిన ఎందరో మహానుభావుల చాయా చిత్రాలను స్టూడియోలో అలంకరించిన దేశభక్తుడు వెంకటరామరాజు.

మందల పాటి వంశస్థులైన సూర్య నారాయనమ్మతో వెంకట రామరాజు వివాహం సింహాచలంలో జరగుతుంది. భర్త అడుగుజాడల్లో భార్య ప్రయాణిస్తూ నిరంతరం అన్నపూర్ణలా అతిధుల్ని అభాగ్యుల్ని ఆదరించి భారతీయ ఆధ్యాత్మిక సంప్రదాయాల్ని నెరవేరుస్తూ...

తే.గీ॥ "మగును గదయట్టి సంప్రదాయానుబద్ధ
జీతము నందెసార విశేష యుండు
కానిచో నేల సంసార కాంక్ష జగతి
ప్రగతి మార్గమ్ము కలదె స్వార్థమ్ము విడన్"[56]

భర్త గుణగణాలను అనుసరిస్తూ, కుటుంబ వ్యవస్థను పటిష్ఠ పరిచి సంసారంలో ఉత్తమ ఇల్లాలుగా ప్రశంసలు పొందడమే గాక ఆదర్శగృహిణిగా మసలుతుంది. కుటుంబాన్నేగాక దేశంలో ప్రజలకు ప్రగతి మార్గాన్ని చూపుతూ కర్తవ్యాన్ని ప్రబోధం చేస్తుంది. ఈ సుగుణాలతో వర్ధిల్లిన కుటుంబంగా మొదటి భాగంలో కవి వివరించారు.

రెండవ భాగంలో ఆరు పుటలలో 42 పద్యాలలో రామరాజు జననాన్ని వివరించాడు. విశాఖపట్టణం పాంద్రంకి గ్రామంలో తన తల్లి సూర్యనారాయణమ్మ పుట్టిన యింటిలో సాయంత్రం నాలుగు గంటల సమయంలో జన్మించాడు. సూర్యస్తమయం కాని కవి అతని జననాన్ని ఉషోదయంగా వర్ణించి తనతల్లి రామరాజును పెంచిన విధానాన్ని తెలియపరుస్తూ...

తే.గీ॥ ఉత్తమ క్షాత్ర ధర్మమునుగ్గుపాల
రంగరింపగా సూర్యనారాయణమ్మ
రాజు శ్రీరామునట్లు దర్మదులనణప
తండ్రి స్వాతంత్ర్యదీక్షకు ధ్వజమునెత్తు"[57] అని అంటూ

రాజుల యొక్క వంశ ఆచారాల్ని, మర్యాదల్ని, కర్తవ్యాల్ని గాక ధర్మం యొక్క గొప్పతనాన్ని బోధిస్తుంది. రామాయణంలో రాముడి యొక్క ధర్మనిరతిని తెలియపరుస్తూ రామాయణ, భారత గ్రంధాల సారాంశాన్ని వివరిస్తుంది. దుష్ట శిక్షణపై దండెత్తిన వారి వీరగాధల్ని, తన తండ్రి స్వాతంత్ర్య దీక్షను ఉగ్గుపాలతో తెలియపరుస్తూ పెంచుతుంది.

"గౌతమబుద్ధుని కరుణార్ద్రవృత్తి
ప్రహ్లాదుబోలిన పరమవర్తనము
వినయ వివేకముల్ వేదాంత భావ
మనుపమమ్మైనట్టి అభ్యాస బలము"[58] అని అంటూ

రామరాజుకు తల్లి సూర్యనారాయణమ్మ బుద్ధుని దయ, జాలి, కరుణ, వంటి గుణాల్ని, ప్రహ్లాద ప్రవర్తనల్ని, భక్తి వేదాంతాల్ని నూరిపోశారు. అంతేగాక వినయ విధేయతలతోపాటు సద్వివేకాన్ని, మానవ వికాస ధ్యేయంగా బోధించింది. పురాణ, యితి హాసాల్లోని నీతి చరిత, చైతన్యమైన కథల్ని రాజు పుట్టదని ఈ భాగమున కవి తెలిపిరి.

రాజమండ్రిలో తన తండ్రి సేవా నిరతిని, దేశభక్తిని రామరాజు అలవర్చుకునే సందర్భములో...

చం "జనకుని భావముందెలిసి జాతి పటిష్ఠత గాంచ దేశభ
క్తిని బ్రకటించుచున్ బ్రగతికిన్ దగు మార్గము తండ్రి తోడ మం
తనము మెయిన్ గ్రహించుచు సదాతన చిత్తము దష్టశక్తి సం
హ ననము నందె లగ్నమయి యాత్మజుడన్ ప్రధనిల్పె జ్యేష్ఠుడై"[59]

వెంకట రామరాజు యొక్క భావాలు, స్వాతంత్ర్యదీక్ష, దేశభక్తిని చూచి తాను చైతన్యం పొంది దేశప్రగతికి, దాస్య విముక్తి సరైన మార్గంలో తన తండ్రితో పాటు ప్రయాణిస్తాడు రామరాజు. తన మనస్సు, తన శరీరము బ్రిటీష్ సామ్రాజ్యాన్ని నిర్మూలించడానికి వారి దుష్టపాలనను అంతమొందించడానికి చిన్నతనం నుండే ముందుకు సాగేవాడని కవి వర్ణించాడు.

రామరాజు పుట్టిన పాండ్రంకి గ్రామంలో అతని తర్వాత 'సీతమ్మ' అనే అమ్మాయి. శ్రీ సత్యనారాయణ స్వామి ఆశీస్సులతో తమ్ముడు సత్యనారాయణ రాజు పుట్టాడని ఈ భాగములో తెలిపారు.

'సూర్యనారాయణీయం' అనే మూడవ భాగంలో శ్రీరామరాజు జీవితంలో సంభవించిన దయనీయమైన సంఘటల్ని, అత్యంత కీలకమైన విషయాల్ని కవి తెలియజేశాడు. అప్పటకి రామరాజు వయసు 11 సంవత్సరాలు. రాజమహేంద్రవరములో కలరావ్యాధి కలకలాన్ని సృష్టిస్తుంది. దానికి గురైన తండ్రి మరణాన్ని గూర్చి...

ఆ.వె॥ ఆట్లతద్దినాడె అస్తమించిన తండ్రి–ఆత్మశాంతికేమి అర్పణమ్మొ
నాదు నసువులైన నాధు కంటెను ముందు–పోవజాలవయ్యెపుత్ర! యేమొ **60**

పండగరోజే పరమపదించడాన్ని ఆ కుటుంబం తట్టుకోలేకపోతుంది. జాతీయోధ్యమంలో పాల్గొని వందేమాతరంలో దేశభక్తిని చాటుకోవడం ద్వారానే ఆయన ఆత్మకు శాంతి లభిస్తుందని తల్లి భావిస్తుంది. అంతేకాక భర్త ప్రాణాల కంటే ముందు తన ప్రాణాన్ని ఆ భగవంతుడు తీసుకుపోతే బాగుండెదని తల్లి విలపిస్తుంది.

అప్పటి సత్యనారాయణరాజుకి 2 సం॥రాలు. యింటికి పెద్ద దిక్కుగా రామరాజు తండ్రికి కార్యక్రమాలు చేస్తారు. కుటుంబ బాధ్యతల్ని కర్తవ్యాల్ని తల్లి గుర్తు చేసిన సందర్భంలో...

శా॥ ఈ వైదవ్యము కన్న దు:ఖమిలలో నేమున్నదయ్యా! యికన్
నీ విద్యాభ్యాసమున్న సీత గతియున్ నీతమ్ముబావ్యర్థమే
మౌ! నహ్వా? యిక మాకకు నన్నిటికి నిత్యాధారమివేయిదే
మీ వైచిత్రము తండ్రి! వక్రములు సుమ్మిదైవసంభావ్యముల్! **61** అని

వర్ణించారు. భర్త ఎడబాటు ఏ భార్యకైనా తీరని లోటు. కుటుంబం ఆర్థిక భారంతో ఎటువంటి దిక్కు లేక కొంత నిరాధరణకు, పేదరికానికి దారితీసింది. రామరాజు విద్యాభ్యాసం తనచెల్లి సీత భవిష్యత్, తమ్ముడి ఆలనాపాలన లాంటి బాధ్యతలు రామరాజుపై పడతాయి. ఈ చిన్న వయసులోనే కుటుంబానికి పెద్ద దిక్కుగా రామరాజు కష్టాలు

వచ్చాయని తల్లి మిక్కిలి చింతిస్తుంది.

ఈ కావ్యంలో రామరాజు జీవితాన్ని లోకంలో ప్రతి వ్యక్తికి అన్వయించవలసిన అవసరం ఉంది అంటారు కవి.

"చదువని పుత్రుడు జనకుని శత్రుడన్విబుధుల వాక్యంబు"

చదువని కుమారుడు తండ్రికి శత్రువుతో సమానమైనదని ఈ వాక్యంబుతో కవి బోధించాడు. చదువుకున్న పిల్లల్ని చూచి తల్లిదండ్రులు ఎంతో ఆనందంగా ఉంటారు. వారి జీవితం సుఖమయమౌతుంది. రామరాజు చదువుకోసం రాజమండ్రి విడిచిపెట్టి తన పినతల్లి గ్రామమైన కొవ్వాడ చేరి అక్కడ ఆరవ తరగతిలో రామరాజు చదువు ప్రారంభంపజేస్తుంది తల్లి.

ప్రతిరోజు భీమవరానికి 4మైళ్ళదూరం నడిచి బడికి వెళ్ళవలసివస్తుందని ఈ బాధ భరించలేక ఒక రోజు రామరాజు విషగుళికలు తీసుకొని ఆత్మహత్య ప్రయత్నం చేస్తాడు ఆ సందర్భంలో......

తే.గీ॥ ప్రాణమునకు ప్రాణమయిన పతి గతింప
నేల బ్రతుకుచునుంటినో మెఱుగ లేవొ
అన్ని యెఱిగిన వాడవై ఆత్మహత్య
వలన సాధింప నెంచిన ఫలితమేమి"[62] అని తల్లి వ్యధను చిత్రించారు. భౌతికంగా తాను జీవించి వున్నా, మనసంతా తన పతి చుట్టూ తిరుగుతుందని కుమిలిపోతుంది. ఎటువంటి ఇక్కట్లు లేకుండా బతికిన తమకు, వాటిల్లిన కష్టాల్ని గూర్చి చింతిస్తుంది. ఈ దుర్భర స్థితిలో వ్యతల కోర్చి జీవించాలేగాని మరణం సమస్యలకు పరిష్కారం కాదని హితవు పలుకుతుంది తల్లి. జీవితం పోరాటమయమని జీవితాన్ని జయించాలని బోధిస్తుంది. అంతేగాక తండ్రి ఆశయ సాధన కోసం పాటు పడాలని చెబుతూ...

తే.గీ॥ "తల్లి అతని తండ్రి కర్తవ్యదీక్ష
ఎట్టిదో హెచ్చరిక చేసి, తృప్తితీర

తల్లి కోర్కెను తీర్చుటే తనయుని విధి
యనుచు నీరతి నీతి ప్రీతిని వచించె"[63] అంటూ

తన కుటుంబాన్ని నడిపించిన రామరాజు తండ్రి యొక్క గుణగణాల్ని స్వాతంత్ర్య పిపాసను, దేశభక్తి ఎటువంటిదో రామరాజుకు తల్లి వివరిస్తుంది. కన్న బిడ్డలు తల్లి యొక్క మనోవాంచల్ని తీర్చడం బిడ్డల కర్తవ్యమని హితవు పలుకుతుంది.

సీ॥ "ఆంగ్ల విద్యాభ్యాస నాపేక్షన శియించి సంస్కృత భాషపై శ్రద్ధమించె
కవితా రచనపైన గాఢాభారతిజని-యించె వేదాంత మందిచ్చహెచ్చ
పొట్టకూటి చదువు గిట్టక నెట్టన-పరవిద్యపై దృష్టి పరధవిల్లె
వ్యాయామ మొకటి ప్రాణాయామ మింకొండు ఉభయ తారకరీతి ఉల్బణించె"[64]

ఇంగ్లీసు వ్యామోహంతో ఆంగ్లవిద్యను అభ్యసించేవారు మాతృభాషల్ని విడిచిపెట్టకూడదని కవి హితవుపలికారు. అవసరమైన చదువు, అనవసరమైన పరవిద్యకు దూరంగా ఉండాలి. కసరత్తు, ఆసనాలు లాంటి శరీర ఆరోగ్యానికి సంబంధించిన వాటిని చేసేవాడు. ఇవి ఆరోగ్యానికి దోహదం చేస్తుందని, పూర్వవిద్యల్ని అభ్యసించాలి పరవిద్యల్ని తిరస్కరించాలని రామరాజు భావించాడు.

శ్రీరామరాజుకు సాంస్కృతిక కార్యక్రమాలపై ఆసక్తి మెండుగా ఉండేది. నాటకాల్లో విభిన్న పాత్రల్ని ధరించేవాడు. తన బాల్యమిత్రులు మద్దూరి అన్నపూర్ణయ్య రాళ్ళపల్లి అచ్చుతరామయ్యలతో తన మనసులో అభిప్రాయాన్ని తెలుపుతూ...

తే.గీ॥ "దేశవిద్యయే విద్యగా తెలియవచ్చె
ఏను సన్యాసినై లోకహితము కొఱకు
ప్రకీతి పాఠముల్ చదివెద పాఠశాల
చదువుకిదె స్వస్తియని తన సహచరుడగు
అన్నపూర్ణయ్యకుం దెల్పె నాశయమ్ము"[65] అని

దేశీయ విద్య ఔన్నత్యాన్నీ గ్లాఘించారు. దేశీయ విద్యల్ని మాత్రమే ఆభ్యసించాలని పరవిద్యకు చోటివ్వరాదని విశ్వసించారు. పరవిద్యలవలన దేశానికి నష్టం వస్తుందని,

తాను లోక హితం కోసం సన్యాసిగా మారి సమాజోద్ధరణకోసం పాటు పడడానికి బ్రహ్మచర్యాన్ని ఆచరించడానికి పూనుకుంటాడు. పాఠ్యపుస్తక జ్ఞానానికి స్వస్తి పలికి, ప్రకృతి పరిశీలనలో వచ్చే జ్ఞానానికి శ్రీకారం చుట్టాడని కవి పేర్కొన్నారు.

కాకినాడలో చదివే రోజుల్లో పేదరికం కారణంగా పెదతల్లిపై ఆధారపడడం ఇష్టంలేక అమ్మమ్మగారి ఊరైన విశాఖలోని పాండ్రంగి గ్రామం చేరారు.

తే.గీ॥ తొమ్మిదవ తరగతి ప్రవేశమ్ము మిషను
పాఠశాల జరిగె కాని పట్టుదయ్యె
అంత ఎ.వి.యన్.కళాశాల మందు జేరె
నపుడకస్మాత్తుగ కలరా వ్యాధి పోకే" 66

మరల విద్యకోసం విశాఖపట్నం ఎ.వి.ఎన్ కళాశాలలో తొమ్మిదవ తరగతిలో చేరుతాడు. ఇష్టంలేని విద్యను కొనసాగించడానికి ఇష్టం లేని రాజు వైఖరిని వివరించారు. చదువు ఇష్టంలేని సమయంలోనే రామరాజుకు కలరా వ్యాధి శోకినట్లు కవి పేర్కొన్నారు.

బహుశా చదువుకు ఆటంకం ఏర్పడడానికి కలరా సోకడాన్ని కారణంగా కవి కల్పనగా కన్పిస్తుంది. మిగిలిన కావ్యాల్లో, చరిత్రల్లో ఎక్కడ కూడా ఈ విషయం లేదు.

మరల నరసాపురంలో తాహశీలుదారు అయిన పినతండ్రి రామకృష్ణ రాజు వద్దకు చదువుకోసం పంపుతుంది. కాని మనసు కెక్కని చదువుపై శ్రద్ధ చూపలేదు. సరికదా! టక్కరిగా తిరుగుతాడు. ఒకనాడు అంతర్వేది తిరుణాళ్ళకు వెళ్ళడం విచ్చలవిడిగా తిరగడంతో పినతండ్రి నౌకరుల ముందు కొడతాడు. అప్పుడు శ్రీరామరాజు తన ఆత్మాభిమాన పౌరుషంతో.......

ఆ.వె॥ పొత్తు కుదరనపుడు పోవెలె దూరము–పౌరుషమ్ములేని బ్రతుకు బ్రతుకె
తల్లి వీడియెంత తన వారలైనను–చెరదగటంచు చేరెతునికి 67

సక్యత లేకపోతే ఇంట్లో వారైనా, పొరుగువారైనా వారితో స్నేహ సఖ్యత ఉండదు పౌరుషంతో బతుకుతూ, రోషంతో జీవించడం జన్మత: వచ్చిన లక్షణం. పినతండ్రి చదువు సక్రమంగా చదవనందున, టక్కరిగా తిరగడం వల్ల ఒక దెబ్బ కొడతాడు. దానికి

పౌరుషం గల రామరాజు, వెంటనే తునిలో తన తల్లి దగ్గరకు వచ్చివేస్తాడు.

అప్పుడే రామరాజుకు 16ఏళ్ళు నూతన యవ్వనప్రాయంలో వుంటాడు. ఈ వయస్సులో శృంగరపరమైన కోర్కెలు ఉద్భవించడం సర్వసాధారణం. విశాఖపట్టణంలో చదువుతున్నప్పుడు రామరాజు కూడా ఓ సంపన్నులైన అమ్మాయిని తలచుకోని.....

"వెలమ కులమునుందు వెలసిన వెలది శ్రీ
మంతు కూతురు సీత మది దలంచి
పేద యగుట నామె బెండ్లాడకని యెనిల్పె
తనదు పేరు ముందు తరుణిపేరు"[68] అని అంటూ

ఆ అమ్మాయి వెలమకులానికి చెందిన సీత. కులం, ఆర్థికస్థాయి వ్యత్యాసాల వల్ల రామరాజు ప్రేమను సీత తల్లిదండ్రులు తిరస్కరిస్తారు. అందువల్ల రామరాజు ఆమె పేరును తన పేరు ముందుంచడంలో సీతారామరాజుగా వచ్చిందని కవి పేర్కొన్నారు. కానీ శ్రీరామరాజు నిత్యజీవితంలో కఠోరమైన బ్రహ్మ చర్యవ్రతాన్ని ఆచరించిన దేశభక్తుడు. ఇది కేవలం కవి కల్పితం రామరాజు జీవితంలో ఈ సంఘటన జరగలేదని ఎక్కువమంది భావిస్తారు.

ఈ కావ్యంలో కవి సీత కథను గూర్చి చెబుతూ...

ఆ.వె॥ సీతకథ నిజమ్మొ చేర్చిన ప్రక్షిప్త
మో మఱేది యైన మోదకరమో
రాగితా విరాగి కాగలుగుటకిది
చక్కనైనా సాక్షి సత్యమిద్ధి"[69] అని పలుకుతూ

సీత గూర్చి కథ కేవలం కల్పితమైన, కథానాయకుడికి కల్పితమైన కథానాయికను చేర్చారు. ఇది అబద్ధమైనా కథకు అతికినట్లు ఉంది. ఆమోదయోగ్యంగా కనబడుతుందని నిజమా! అబద్ధమా! పక్కనపెట్టి కథలో యిమిడిపోయినందుకు కవి ఈ కల్పనను పరిహరించలేదు. మరియు ఇది నిజంగా జరిగిన కథగా లోకానికి తెలియపరచడానికి కవి ప్రయత్నించాడు. శ్రీరామరాజు జీవితంలో గొప్ప మలుపు, పోరాట మార్గాన్ని

ఎన్నుకోవడం, రాజీలేని పోరాటంతో...

కం॥ చదువా! విఫలమ్మైనది
మది నిలపిన సీత తోడి మనువునటువెమైనది
రెండి జెడిన రేవడి విధము
ద్వితీయంపుటగతి విధి వక్రతయే"[70]

చదువు మీద శ్రద్ధలేదు. మనసు కోరిక సంకల్పం వేరుగ ఉంది. కనుక చదువు విఫలమైంది. ప్రాణపథంగా నిలిచిన సీతతో జీవిత ప్రయాణం సాగలేదు. ఇటు చదువు లేదు. అటు ప్రేమ దక్కలేదు. రెండింటికి దూరమైన రామరాజు మనసు కకావికలమైంది. తక్షణ కర్తవ్యం గూర్చి ఆలోచిస్తూ విధి రాతను తప్పక అనుసరించాలని నిర్ణయించుకుంటాడు.

రామరాజు తపసుతో జ్ఞానాన్ని, ఆత్మశోధన సాధించడానికి ప్రయత్నించిన సందర్భంలో......

ఆ.వె॥ "రామరాజు మనసులో మన్మధుడలేడు
రాముడున్న చోట కాముడున్నె
పరుల కతడు తనదుప్రాయమ్ము కాయమ్ము
నర్పణ మ్మొనర్చునట్టి త్యాగి"[71]

రామరాజు మదిలో ఎటువంటి ప్రేమ వ్యవహారము లేదు. రాముని యొక్క గుణగణాలను ఉన్నచో కాముడు, వేరొక పేరేపణలు కలిగించేవి ఉండజాలవు. మంచి ఉన్నచోట వెలుగు వుంటుంది. ఆ వెలుగు జీవితాన్ని పదిమందికి పంచడానికి తన జీవితాసర్వస్వాన్ని పరులకు అంకితం చేయడానికి నిర్ణయించుకున్న మహాదేశభక్తుడు అల్లూరి.

ఏకాంతాన్ని కోరుకొని జపం చేసుకొని, వనచరులతో సహచరచేస్తూ అక్కడ ప్రజల జీవనాన్ని పరిశీలిస్తూ......

తే.గీ॥ వనచరుల గూడి వారి జీవన విధాన

మరసి, యరసికులై వారి కర్ష కష్ట
ములను గలిగించు చెనటి మూకలను దునిమ
మఱు రామరాజ్యము గూర్పమది దలంచు"[72] అంటూ

అడవిలో ఉన్న అడవితల్లి బిడ్డల్ని చూసి వారి జీవన శైలిని పరిశీలించి వారి జీవితాల్ని, జీవన విధానాన్ని గమనించి వారి కష్టాలకు కారణాన్ని విశ్లేషిస్తూ వారి ఒక చైతన్యాన్ని తీసుకురావడానికి ఉద్యుక్తులయ్యాడు.

అడవుల్లో తిరుగుతూ వాటిలో నివసిస్తున్న కోయలు, బోయలు, కొండజాతి మొదలైన జనులకు అండగా నిలచి వారితో కలసిపోయి.......

ఆ.వె॥ జాతకముల్రాయు చక్రమ్ములను వేయు
వాస్తు వమ్ముకాదు వాస్తవమ్మ
టంచు లగ్నము విడయంత్ర మంత్రమ్ముల
నేర్చి నేర్మి మీర నిపుణోడయ్యె!"[73] అని

రామరాజు జాతకాలు రాస్తూ, జ్యోతిష్య చక్రాల్ని వేస్తూ, వాస్తు సిద్ధాంతాలతో నిజం ఉందని తెలియజేస్తూ, ములికా వైద్యం చేస్తూ ఉండేవాడు. అంతేకాక ప్రకృతి సంపదను వినియోగిస్తూ యంత్రములతో కూడిన వైద్యం చేసి, మంత్రములతో విషపూరితమైన సర్పల నుండి రక్షించడంలో మెళకువలు తెలిసినవాడు. ఇవేకాకుండా గోలుగొండ గ్రామంలో పెదభైరవి అనే వ్యక్తి వద్ద విద్యలు నేర్చుకున్నాడు. సుబ్బయ్య శాస్త్రి గారి వద్ద సంస్కృతాన్ని జ్యోతిష్యాన్ని నేర్చుకొని...

తే.గీ॥ "ఆసనములు ప్రాణాయామ మభ్యసించి
తత్త్వశాస్త్రము యోగ విద్యా నిరూఢ
ద్యాన సాధనలో పూర్ణతంగడింప
దలచి–అంతలో దేవయాత్రకు గంగె"[74]

తపస్సులో ధ్యానం చేస్తూ ఆసనాల్ని, ప్రాణానికి మేలు చేసే విద్యల్ని నేర్చుకున్నాడు. తత్త్వశాస్త్రం, యోగశాస్త్ర లాంటి వాటిని తెలుసుకొని ధ్యాన సాధనలో పరిపూర్ణతమైన

యోగ్యతను సాధించారు. సంపూర్ణ యోగినా మారిన రామరాజు స్వాతంత్ర్య సమర యోధుడిగా, మారిన భారతదేశంలో ఏకైన వ్యక్తి రామరాజు. రామరాజు ఉత్తర భారత దేశయాత్రకు బయలుదేరుతాడు.

నాల్గవ భాగంలో అయిన యాత్రాభిగమ్యంలో రామరాజు పాదయాత్రను గూర్చి వివరించారు కవి. యాత్రమార్గ మధ్యంలో ఉత్తమమైన విద్య లెన్నింటినో గ్రహించి వాటిని సాధన చేస్తూ ప్రతిరోజు, తనకు తెలియన విషయాన్ని తెలుసుకొని లోకసంచారం చేస్తూ...

కం॥ "కలకత్తానగరమ్మున-కలరు కవులు యోధవరులు ఘనతత్త్వజ్ఞుల్
పలువురు సమాజ సంస్కర్తలు ఠాకుర్, శరతు బిపిని, రామ సుఖసుల్"[75]

భారతదేశంలో రాజకీయంగా ప్రఖ్యాతమైన విశిష్ఠతగల నగరం. కలకత్తా అనేకమంది రాజకీయ నాయకులు, కవులు, యోధులు, వీరులు, సంస్కరణోద్యమకారులు, సాహిత్యాభిలాషకులు మొదలైన వారు ఎందరో గొప్ప తత్త్వవేత్తలకు నిలయమైన మహానగరమిది. ఆనగరంలో రవీంద్రుడు, లాల్, బాల్, పాల్ మొదలైన స్వాతంత్ర్య వీరుల నగరంలోకి రామరాజు వెళ్ళాడు.

సురేంద్రనాధుడు ఇంటిలో సహ పంక్తి బోజనాలు చేయడం సంభవిస్తుంది. కొన్ని రోజులు బెనర్జీ సహచర్యం చేసి దేశ రాజకీయ ఆర్థిక, సామాజిక పరిస్థితుల్ని అవగాహన చేసుకుంటూ.....

తే.గీ॥ ఎందరెందరో ప్రతిదిన మేగుదెంచి
దేశ భవితవ్యమును గూర్చి దీర్ఘ చర్చ
లవధి లేకుండా గావించి అ విధి తొలగి
నట్టి కార్య కలాపమ్ములాత్మ నెంత్రు"[76]

ఎందరో మహానుభావులు త్యాగధనులు ప్రతిరోజు ఉద్యమాన్ని గూర్చి, ఉపన్యాసాలు విస్తూ, దేశభవిష్యత్ కోసం సుదీర్ఘమైన చర్చలు, అరమరికలు లేకుండా మాట్లాడుతారు. ప్రణాళికల్ని తయారుచేసి, కార్యక్రమాల్లో అందరిని భాగస్వాములు చేస్తూ అద్భుతమైన ఎత్తుగడలతో రామరాజు పాల్గొనేవారు. బేలూరు మఠం, దక్షిణేశ్వరం, ఋషికేశ్‌లాంటి

పుణ్యక్షేత్రాల్ని, ఆధ్యాత్మిక కేంద్రాల్ని పవిత్ర స్థలాల్ని సందర్శిస్తూ...

చం॥ ఇరువది యేండ్ల ప్రాయమున నెక్కటి నుత్తర దేశయాత్రల
క్కరయనునట్లు కాలినడుకన్ జని వేడక పుణ్య తీర్థముల్
సరగున నొక్క టొక్కటిగ సర్వగిరుల్ వనముక నదీ నదో
త్కరములు దాటి పోవుచు ప్రధానములైన ప్రదేశమున్ గనన్" **77**

చిన్న వయస్సులోనే స్వాతంత్ర్య సమరమోధుడుగా స్వాతంత్ర్య కాంక్షతో 27 ఏళ్ళ వయస్సు నాటికి ఉత్తర భారతదేవయాత్రలు కాలినడక చేసి, పుణ్య తీర్థములు, చూస్తూ మొత్తం అడవుల్ని పరిశీలిస్తూ నదుల్ని ఏరుల్ని దాటుతూ, ముఖ్యమైన ప్రదేశాల్ని సందర్శిస్తూ మానవ స్థితిగతుల్ని పరిశీలిస్తాడు. భారతీయ సంస్కృతులను, సంప్రదాయాలను ఆచారవ్యవహారాలను తెలుసుకుంటూ సువిశాలమైన భారతదేవాన్ని సందర్శించినట్టు కవి తెలిపారు. రామరాజు జీవితానికి సాధనకు ఈ పర్యటన ఉపకరించిందని కవి అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

అప్పటికి రామరాజు తల్లి కొరకు శోకంతో తల్లడిల్లిపోతుంది. కుమార్తె సీతమ్మ వివాహం నరసాపురంలో జరగుతుంది. కుమారుడు సన్యాసి అయి లోకోద్దరణ కోసం...

శా॥ "లోకజ్ఞానము గూర్చి యాత్ర-లలెసువోకంపు సన్యాసదే
క్షా కార్యంబును దీర్చి లోక హితమే కర్తవ్య మీ జన్మకం
చా కాంక్షన్ మతి మార్చి; సాహసము ధైర్య స్థైర్యమల్ పేర్చెను
త్సేకంబైన పదార్థబావ మెలయించెన్ త్యాగమే లక్ష్యమై" **78**

దేశ సంక్షేమం కోసం సన్యాసిగా దీక్ష పూని, జ్ఞానార్జన ధ్యేయంగా పర్యటన అనంతరం స్వాతంత్ర్య కాంక్షతో బ్రిటిషు ప్రభుత్వంపై పోరును ధైర్యసాహసాలతో నడిపించిన ఘనుడు రామరాజు. స్వాతంత్ర్య దీక్షతో త్యాగజీవితాన్ని అలవరచుటకు పూనుకొని రాజమండ్రి చేరెను.

తపం-ఆతపం అనే ఐదవ భాగములో రామరాజు తపసు చేసిన తీరు తెన్నుల్ని వివరించారు. ఒక వైపు తపసు, మరొకవైపు ప్రకృతి చికిత్స చేస్తూ, ఆధ్యాత్మిక వేదాంత

విషయాల్ని ఆకళింపు చేసుకుంటాడు.

గోలుగొండ ప్రాంతంలో వున్న చిటికెల బాస్కరుడుతో రామరాజు తపసు చేసుకోవానికి వీలున్న ప్రదేశాల వివరాలన్ని అడిగి సందర్భంలో...

తే.గీ॥ "తపము గావించు కొనుటకు తగిన వనుచు
నను చరుండు సూచింపగా నది గ్రహించి
రామరాజు ధారా భూధరమ్ము నందె
తపము కొంత కాలమొనర్చి ధ్యాననిష్ఠ"[79]

లోకజ్ఞానాన్ని సంపాదించిన రామరాజు తపసుకు అనువైన ప్రదేశం కోసం వెదికే సమయంలో చిటికెల బాస్కరుడు సలహా మేరకు జల ప్రవాహం క్ర్కన పెద్ద పర్వతమైన 'ధారా' పర్వతాన్ని ఎన్నుకుంటాడు.

రామరాజుకు బాస్కరానాయుడు తల్లి పోమమ్మ తగిన సేవలు చేస్తూ తమ యింటిలో వుండేటట్లు చేసి అతి మర్యాదలతో అతన్ని గౌరవించేది.

రామరాజు వివరాలు తెలిసిన ప్రజలు కూడా...

తే.గీ॥ అనుచు ప్రజలెల్ల రాతనినను సరింప
దలతు రదె 'యధారాజా తధాప్రజా'య
టన్న సూక్తికి నాదర్శమై రహించె
అతని సన్న్యాసదీక్ష సర్వలోకైక రక్ష"[80] అని

గౌరవించేవారు. రామరాజు వాక్కు బ్రహ్మవాక్కుగా, అతని మాటలు శిలాక్షరాలుగా చెలామణి అయ్యేవి. అతడు లెక్క కట్టిన రాసిన జాతకాలకు ఆదరణ వుండేది. ప్రజలందరికి రాజు మార్గాన్ని ప్రజామార్గముగా శిరసావహించి అనుసరించేవారు. ప్రజలందరు జేజేలు పలికేవారు. ఆయన ఆదర్శమైన ధర్మాన్ని పాటిస్తూ బ్రహ్మచర్య దీక్ష చేస్తూ ఆహరనియమాలు చేస్తూ శరీరాన్ని నియంత్రణలో ఉంచుకొని చేసేదీక్ష సర్వలోక రక్షగా ఉంటుందని కవి చిత్రీకరించారు.

రామరాజు యొక్క యోగక్షేమాల్ని గూర్చి తెలిసిన తల్లి సూర్యనారాయణమ్మ.....

తే.గీ॥ ఇల్లువీడిన సుతుజాడ ఇంతవరకు
తెలియదాయె నేమయ్యెనో కలడో లేడో
అని కుమారిలు తల్లి–సోమమ్మ వార్త
కలరి తడమక చేరె బిడ్డలనుతాను" **81** అని శోకిస్తుంది.

చదువకు దూరమై కుటుంబాన్ని వీడి ఉత్తర భారతదేశయాత్ర వెళ్ళిపోయిన రామరాజు తల్లి కుమారుడు యొక్క వివరాలు తెలియక చింతిస్తుంది. తల్లి హృదయం తల్లడిల్లిపోయే తరుణంలో రామరాజును వివరాలు అడిగి తెలుసుకున్న సోమమ్మ వెంటనే రామరాజు యొక్క జాడను ఉత్తరం ద్వారా తెలియపరచగా తల్లి, చెల్లి, తమ్ముడును రామరాజు చెంతకు చేరుతాడు.

సన్యాసిగా ఉంటూ, రోగులకు వైద్యం చేస్తూ , జ్యోతిష్యశాస్త్రాన్ని తెలిపి పౌరాణిక గ్రంథ రహస్యాల్ని తెలియపరుస్తూ...

కం॥ రామాయణ భారత కథ
లామూలాగ్రమ్ము చెప్పి అలరించి మహా
ధీమతియై భగవద్గీ
తామహాత్మ్యము మూలతత్త్వము తెలుపున్" **82**

రామాయణ, మహాభారత కథలను సమగ్రంగా ధర్మాల్ని సూక్ష్మంగా వివరించెను. భగవద్గీతలో అనుసరించాల్సిన న్యాయసూత్రాల్ని వాటి యొక్క మూలార్థాల్ని తెలియజేస్తాడు. అంతేకాకుండా స్వయం కృషితో సంస్కృతం, ఉర్దూ, ఆంగ్లభాషల్ని మాట్లాడి అక్కడ ప్రజలకు లోకనీతి చెప్పేవాడు.

శ్రీరామరాజు సీతారాముడిగా, భద్రాద్రి రాముడుగా కొలిచే గిరిజనులు...

ఆ.వె॥ కొండజాతివారి కోర్కెలు తీర్పగా
రామరాజును రాఘవరాముదనిరి
రామభక్తుడైన రామరాజునవనే
చరుల చెంచె నాప్త సహచరులని" **83** అని కొలుచుచుండెను.

గిరిజనుల యొక్క (కోర్కెలు) అవసరాలను, బాధలను తీర్చుతూ వారి కష్టసుఖాలలో పాలు పంచుకొని వారి బాధలను నివారించేవాడు. నిరంతరం వారికి ఒక అండగా దైవముగా భద్రాద్రి రఘురాముడని, సీతారాముడని కొలుచుకున్నారు. రామరాజు సహచరులంద ఆ భద్రాది సీతారాముడే మాసీతారామరాజు అని భావించేవారు.

కృష్ణదేవిపేట అధికారిగా పనిచేస్తున్న మూర్తి రాజు పంతులుగారి పిల్లవాడు చావు బ్రతకుల మధ్య ఉన్న స్థితిలో బ్రతుకగలడని చివరగా రామరాజు యొక్క రక్ష-మూలిక వైద్యంతో బ్రతికినాడని శ్రీరామరాజు మనకు లభించిన శ్రీరామరక్షగా భావించారు. కాని అటవిశాఖకు చెందిన అధికారులు మన్యం ప్రజల్ని రక్షించడం పోయి భక్షకులుగా మారిపోయి వారిని నానా హింసలు చేస్తూ.......

తే.గీ॥ "అన్నిటి సహించి వస్తువులప్పగించి
పన్నులెన్నియో చెల్లించి, తన్నులు తిని
కూలినాలి డబ్బులు కూడ గొనక, సంగ
కూడ తినక, ఆల్బిడ్డల గోడ గనక
మనెడి కొండ జాతుల వారి మనుగడగని"[84] అని

అక్షర జ్ఞానం లేని గిరిజనుల్ని చిత్రహింసలు పెట్టి వారినుండి వస్తువుల్ని గ్రహించి, రోడ్ల పనుల్ని చేసిన కూలీలను డబ్బులు యివ్వకుండా ఆదివాసీల్ని వేధించారు. అర్ధాకలిలో కూడా కూడు తినక ఆలుబిడ్డలు యివ్వకుండా నానా బాధలతో కొండజాతి వారు జీవించాల్సివచ్చేది. అక్రమ పన్నులు కట్టమని వసూలు చేసేవారు. వారి చిత్రహింసలు కన్నీటి కథలుగా కవి చిత్రీకరించారు.

గిరిజనుల నానాబాధల్ని చూచి కవి రామరాజు మనస్సు....

తే.గీ॥ ఏ మహాజ్ఞాత శక్తియో రామరాజు
జ్ఞానయోగిని కర్మయోగమున నిల్పె
విప్లవజ్యోతియై తెల్గు లెల్గు నల్గ
దల ప్రసారించు మూర్తియై పోలిచె కడకు"[85] అంటూ

రామరాజు తపస్విగా, జ్ఞానయోగిగా, కర్మయోగిగా పరిణామం చెందడానికి ఎంతో శ్రమ దాగి వుంది. మన్యంలో పిల్లలు, వృద్ధులు, స్త్రీలు అనే తారతమ్యం లేకుండా అటవీచట్టాలు అనే నెపంతో ప్రజల్ని హింసిస్తుంటే విప్లవజ్యోతి అయిన అల్లూరి బ్రిటిష్ పాలకులపై తిరగబడ్డాడు.

సాయుధ సమరంతో ఉత్తర భారతదేశంలో మహోద్యమ కారులు, ధీరులు వారి కార్యక్రమాల్ని ఎప్పటికప్పుడు సేకరించి ప్రముఖ విప్లవ వీరుడు 'పృధ్వీసింగు'కు చెందిన చిట్టగాంగు ప్రేరణతో విప్లవ శంఖాన్ని పూరించి భారతమాత దాస్య విముక్తికి పాటుపడ్డాడు.

ఒకవైపు దైవభక్తి, మరొకవైపు దేశభక్తి గూర్చి కవి వర్ణిస్తూ...

తే.గీ॥ దైవభక్తికి తోడగా భావమందు
దేశ భక్తియు నెలకొన్న ధీరవరుడు
రామరాజు విప్లమార్గ గామి యగుట
సహజ సిద్ధమతండు రాజర్ధిమౌళి"[86] అని కీర్తిస్తూ

రామరాజు కాళికదేవి భక్తుడేకాదు, పరమశివుడ్ని కూడా ఆరాధించేవాడు. అందుకే కవి దైవభక్తి భావాలు ఎక్కువ వున్నా, దేశభక్తివైపే ఎక్కువ మొగ్గు చూపాడు. ప్రజల యొక్క కష్టాల్ని తీర్చడానికి బ్రిటిష్‌వారిపై తిరుగుబాటుకు విప్లవ మార్గాన్ని ఎంచుకున్నాడు. అది సహజ సిద్ధంగా ఉన్న రామరాజును కవి "రాజర్షిమౌళి"గా కీర్తించడం విశేషం.

సంఘ సంస్కరణలో భాగంగా రామరాజు సహాయ నిరాకరణోద్యమ నేపథ్యంగా పలు కార్యక్రమాల్ని నిర్వహిస్తూ........

తే.గీ॥ పాఠశాలలు స్థాపించి ప్రజలకెల్ల
చదువు నేర్పించి మిగుల సంస్కార వంతు
లనొ నరించి మేలు కొలిపె; ఘనతరమగు
భక్తి భావము నెదలందు పాదు కొలిపె[87]

ఆదివాసీలు నిరక్షరాస్యులగుటచేత వారి నందరిలో విద్యాతృష్ణ నెలకొల్పి వారికోసం పాఠశాలలను స్థాపించి తగిన పాఠాలు నేర్పి ధైర్యవంతులుగా సంస్కారవంతులుగా

సమాజాన్ని ఉద్ధరించే వీరులుగా తమరు చేయడానికి పూనుకున్నారు. వారిని చైతన్య వంతులుగా తీర్చిదిద్దుటకు కంకణబద్ధుడైనాడు.

గిరిజనోద్ధరణ కోసం రామరాజు నిర్వహించిన కార్యక్రమాలు...

తే.గీ॥ అతడు నెలకొల్పి చిన్న గ్రంథాలయమ్ము
సకల విజ్ఞాన విషయముల్ చదువజేసే
సాహితీ సంస్కృతి వికాస సరుణినచాట
గిరిజన సమద్ధరణము పంపిరి పొనర్చె"[88]

అటవి ప్రాంతాల్లో గ్రంథాలయాల్ని స్థాపించి దేశ పరిస్థితుల సమాచారాన్ని ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ వుండేవాడు. గిరిజన వికాసానాకి స్వాతంత్ర్యోద్యమ సమరంలో భాగంగా వచ్చిన మద్యపాన నిషేదం, కోర్టులు బహిష్కరించడం గ్రంథాలయ స్థాపన, విద్యాలయాలు నెలకొల్పడం, పంచాయితీల ఏర్పాటు వంటి వాటిని ఏర్పాటు చేశారు.

అన్నెం, పున్నెం ఎరుగని మన్నెం ప్రజలను ఆదుకొని వారికి ఆప్తుడుగా అన్నిటికి అండదండయై నిలిచి క్షత్రియుడన్న సార్థకతను నిలుపుకొని రాత్రి పగలు అని బేధము లేకుండా వారికి బాసగ నిలిచి.......

తే.గీ॥ దండు కారణ్యమైన ఆంధ్రప్రదేశ్
మందు దండగా నుద్దండలైన కోయ
వీరులన్ విప్లవజ్యోతి వెలుగజేసి
రామరాజప్పు భద్రాదిరాముడయ్యె!![89] అని

ఆంధ్రప్రదేశ్ అరణ్యప్రాంతంలో నివసించే కోయ వారిని ఒక్కొక్కరిని ఒక మహాశక్తిగా విప్లవ వీరులుగా ఎదిగిన రామరాజు భద్రాది రాముడుగా వెలుగొంది, త్వరలో జరగు యుద్ధంలో తెల్లదొరల్ని రుద్రమ్మకు బలిచేసి భారతమాతకు రక్తాభిషేకం చేస్తామని పలుకుతారు.

ఈ భాగంలో బ్రిటిష్ పాలనావ్యవస్థను, తెల్లవాళ్ళ స్వభావాన్ని వివరిస్తూ....

సీ॥ "రవియస్తమింపని రాజ్యంబు మాదని
వర్తకంపు మిషను వచ్చిదుష్ట
వర్తనమ్మున క్రైస్తవ మిషనీర్లేర్పాటు
చేసి మెల్లగ మనసిరులు దోచి
భాగించి పాలించు పద్ధతి పాటించి
మనలోన మనకె కాదననోనర్చి
మొదట పెద్ద నగరముల్ స్థావరములుగా
పిదప దేశమ్మెల్ల పిడికిటగొని"[90]

తమ అధికారంలో అనేక దేశాలు వున్నాయని, సూర్యడు అస్తమించని సామ్రాజ్యం తమదని అహంకారాన్ని ప్రదర్శించే ఆంగ్లేయుల్ని గూర్చి అభివర్ణించారు. వ్యాపార నిమిత్తం బతుకు తెరువుకోసం భారతదేశానికి వచ్చి, దుష్ట స్వభావాలతో, క్రైస్తవమాతాన్ని నెలకొల్పి పేదరికంలో ఉన్నవారిని ఆకట్టుకున్నారని పేర్కొన్నారు. రాజుల బలహీనతల్ని గమనించి వారిమధ్య చిచ్చు పెట్టి క్రమంగా ఆక్రమించి ఆధిపత్యాన్ని సంపాదించి సంపదలను దోచుకుపోయారన్నారు. "విభజించు పాలించు" సూత్రంలో మనలో మనకే స్పర్థలుపెట్టి, పెద్ద పెద్ద నగరాల్ని, సముద్రతీరంలో ఉన్న ప్రాంతాలలో బ్రిటిష్‌వారి కేంద్రాలుగా తయారు చేసుకోని భారతదేశాన్ని తమ ఆధీనంలోకి తీసుకొని ఇక్కడ ప్రజల్ని బానిసలుగా చేసి హింసించారని స్పష్టం చేశారు.

ఒక పద్యంలో బ్రిటిష్‌వారి సామ్రాజ్య విస్తరణ ధోరణిని యిమిడింపచేసిన విధానం గొప్పగా ఉంది. ఈ భాగంలో శాంతి స్వభావముతో ప్రయాణించిన ఎటువంటి ఫలితము లేదని భావించి విప్లవ మార్గానికి నాంది పలుకుతుందని బ్రిటిష్‌వారి దుష్టచర్యల్ని సహించలేకపోవడం కన్పిస్తుంది.

"మిత్రాగమం" అనే ఆరవ భాగంలో బ్రిటీష్ అధికారి బాస్టియన్ దుష్ట చర్యల్ని వర్ణిస్తూ.....

తే.గీ॥ ఎందఱో ముఠాదారుల నేమరించి
కాదు కూడదని యెదిర్చ గ్రామపాల

కులను భయపెట్టి బాస్టియన్ ఖలుడు స్వార్థ
పరతకున్ పరాకాష్ఠయై పరిగి కెరల్”[91] అని పేర్కొన్నారు.

బ్రిటిష్ వారి పాలనా విధానంలో విభజించి పాలించు ఒకటి. గ్రామ మునసబులు, ముఠాదారులు ఆంగ్లేయులు చెప్పిన విధంగా నడుచుకునేవారు. అనుగుణంగాలేని వారిని భయపెట్టి, బాధించి పదవుల్ని తొలగిస్తారు. మఠాదారులు, మనసబులు బ్రిటిష్ అధికారులు చెప్పిన విధంగా అనుసరిస్తే పర్వాలేదు. వారికి వ్యతిరేకంగా ఉంటే వారికి పదవి లోంచి తీసివేసి కష్టాల పాలు చేసేవారు. ముఖ్యంగా బాస్టియన్ విధేయులైన ఉండాలి. లేని పక్షంలో వారికి చిత్రహింసలు తప్పేవి కావు.

బాస్టియన్ దుష్టకార్యాలు చేయని వారి జాబితాలో చింతపల్లి తాలుక నడిమిపాలెం మనునసబులు గంటందొరలు బాస్టిన్ అన్యాయాలకు బలైపోయిన వారి గూర్చి చెబుతూ....

ఆ.వె॥ అన్నదమ్ములిర్వురన్నిట సమశుభలక్షణములు గల్గు శ్లాఘ్యణాలు
ఎంతటి అధికారినేని క్రూరుండైన–వాని ప్రతిఘటించు మానధనులు[92]

మల్లుదొర, గంటం దొర లిద్దరు అన్యాయాన్ని, అక్రమాల్ని ప్రతిఘటించే వారు ప్రజలకు నష్టకలిగితే వెంటనే ప్రశ్నించి ఎదిరించే నీతి, అన్యాయాలవైపు నిలబడే మంచి మనుషులు. చెడును ఎదిరించి మంచికి బాసటగా నిలిచేవారు. వీరితోబాటు పెదవలస గ్రామ నాయకుడు కంకిపాటి ఎండుపడాలు కూడా రోడ్లు మరమత్తు కూలీల్లో బాస్టియన్ మోసాన్ని వెల్లడిస్తాడు.

రామరాజును బ్రిటిష్ ప్రభుత్వం తిరుగుబాటు దారుగా ప్రకటిస్తూ...

తే.గీ॥ “లేనిపోని లెన్నిటినో కల్పించి రామ
రాజుపై నేరముల్ మోపి ప్రభుత్వ నిత్య
మతనిపై నిఘాయంచునట్లా చరించె
తప్పుడు ప్రచారమునె ప్రభుత్వమ్ము చెచ్చు”[93]

రామరాజుపై బ్రిటిష్ ప్రభుత్వం అనేక నేరాల్ని మోపి ప్రభుత్వ వ్యతిరేకిగా చిత్రీకరించింది. లేనిపోని ఆరోపణలు చేసి అతనిపై నిఘా పెట్టించిరి రామరాజు

కార్యక్రమాలపై బ్రిటిష్ ప్రభుత్వం గూఢాచారుల్ని నియమించిరి. అతన్ని ఒక ప్రభుత్వ తిరుగుబాటు దారుగా తప్పుడు ప్రచారం చేశారు.

రామరాజు బ్రిటిష్‌వారు లొగ తీసుకోవడానికి భూమిని ఎరగా పెట్టే సందర్భాన్ని.....

తే.గీ॥ పైడిపుట్టలో జడయేరు ప్రక్కనున్న
ముప్పది యెకరముల పొలమప్పగింప
రామరాజు కుటుంబ సంరక్షణము కయి
సాగుబడి సాగె నవ్వారి సాయమబ్బె"**94** అని వర్ణించారు.

విభజించు పాలించు సూత్రంతో బ్రిటిష్‌వారు రామరాజు తమ మద్ధతుగా ఉండడానికి పైడిపుట్టలో 30 యెకరాల పొలాన్ని ఆశచూపి రామరాజు కుటుంబ పోషణకు ప్రజా కార్యక్రమాల్లో పాల్గొనకుండా బ్రిటిష్‌వారి అదుపు, ఆజ్ఞల్లో రామరాజు ఉండేటట్లు చేసుకున్నారు.

రామరాజు వ్యసాయధారుడుగా పొలం పనులు చేసిన, కుటుంబ బాధ్యతల్ని నిర్వహించినా స్వాతంత్ర్యకాంక్ష తీరలేదని వివరిస్తూ..........

చం॥ ప్రతిదిన మడ్డతీగెలకు వచ్చిమటన్ తహశీలుదారు స్నే
హితులకు పెద్దలంగలసి యెప్పటికప్పుట గ్రహించి బా
ధ్యత హితులైన రక్షక భటాళి యెడన్ మృధురీతి నెమ్మదిన్
మితముగ మాటలాడి కడునేరిమి కూరిమి నోరిమిన్ ప్రజా
హితయె తపస్యగా మెలగునిప్పుడు నప్పుడు నెప్పడొక్కిటై"**95** అని పేర్కొన్నారు.

ప్రతిరోజు దేశంలో జరిగిన విషయాల్ని, పరిస్థితుల్ని అడ్డతీగలకు వచ్చిన తశీద్దారుడు వున్న స్నేహితుల్ని, పెద్దల్ని అడిగి ఎప్పటికప్పుడు టపాల ద్వారా గ్రహించేవారు. బాధ్యత గల భటులు యుందు మృదువుగా నెమ్మదిగా తక్కువగా మాట్లాడి తపస్విగా, యోగిగా ఉన్న విప్లవ వీరుడుగా ప్రజాసంక్షేమంగా ఎప్పుడు మెలగుతుంటాడు. దేశంలో జరిగే విషయాల్ని తెలుసుకొని వాటిని ఎప్పటికప్పుడు మెలగుతుంటాడు. దేశంలో జరిగే విషయాల్ని

తెలుసుకొని వాటిని ఎప్పటికప్పుడు తన విప్లవ సైన్యానికి తెలియపరుస్తుంటాడు.

ఈ భాగంలో రామరాజు గిరిజన వ్యధల్ని, బాధల్ని గ్రహించి వారితో కలసి బ్రిటిష్ వారిపై రహస్యంగా తిరుగుబాటు మొదలు పెడతారు. కానీ దానికి హేస్పెల్ అనే బ్రిటిష్ అధికారి తన నివేదికలో...

తే.గీ "రామరాజు విప్లవమందు రామరాజ్య
మను వినిర్మించు కాంక్షయే ముఖ్యలక్ష్య
మిది యెఱుంగని హేస్పెల్ తనదునివేది
కొనెఱుక పరచె వాస్తవమును దొరంగి"[96]

రామరాజు విప్లవాన్ని రగిలించి తిరుగుబాటుతో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతూ రామరజ్యాన్ని స్థాపనే లక్ష్యంగా ఉద్యమిస్తాడు. కాని పొరబాటుగా ఈ మన్యం రాజ్యానికి తాను రాజుగా ఉంటారని హేస్పెల్ అనే అధికారి తనపై అధికారులకు తన నివేదికలో పంపుతాడు. దానికి నిజానిజాలు తెలుసుకోలేని అతని నివేదికలు ఎంతటి అపార్థాలకు దారి తీశాయో తెలస్తుంది. రామరాజు కోరిక ప్రకారం సుభిక్షంగా, ప్రజలంతా సుఖసంతోషాలతో ఉండాలని కోరిన దానికి రామరాజు మన్యం చక్రవర్తిగా ఊహించుకుంటారు.

ఈ శీర్షికలో రామరాజు నిప్పువంటి వాడని వర్ణించారు. అలాగే "పగటిపూట సూర్యడువంటి తేజస్సు కలిగి లోకానికి వెలుగు నిచ్చాడని, రాత్రిపూట చంద్రుడై ప్రజలకు చల్లదనం యిచ్చాడని" కవి వర్ణించాడు.

ఈ ఘట్టంలో ఫజుల్లాఖాన్ అనే అధికారి కూడా రామరాజు విప్లవమార్గాన్ని గుర్తించకుండా, దేశభక్తుడుగా భావిస్తాడు.

విక్రమక్రమణం అనే ఏడవ భాగంలో అల్లూరి ప్రతాపాన్ని వివరించారు. కవి పెట్టిన శీర్షిక నామధేయంలోనే ప్రతాపాలు, వీరావేశాలు ప్రదర్శించిన ఘట్టంగా అర్థమౌతుంది.

కం॥ విల్లములమ్ముల కత్తుల
బల్లెములన్ దాల్చి యోధవరులెల్లరున
త్ర్యుల్లా సమ్మున గదవిరి
కొల్లగ నాయుధగుణమ్ముగొన లక్ష్యముతో"[97] అని అంటూ

పురాతనమైన ఆయుధాల్ని కత్తులు, బల్లాలు, ఈటెలు, బాణాల్ని ధరించి యుద్ధ వీరులు, అమితమైన ఉత్సాహంతో యుద్ధరంగంలో నిలిచేవారు. యుద్ధ పరికారలైన తుపాకీ, బాంబులు, రైఫిల్ మొదలైన వాటిని కొల్లగొట్టడమే లక్ష్యంగా పోలీసు స్టేషన్లపై దాడికి పూనుకుంది విప్లవసైన్యం.

చింతపల్లి, కృష్ణదేవిపేట, రాజవొమ్మంగి మొదలైన పోలీసుస్టేషన్లు కొల్లగొట్టి స్టేషన్లలో ఆధునిక పరికరాన్ని స్వాధీన పరుచుకున్న సన్నివేశాల్ని వర్ణిస్తూ...

తే.గీ॥ "లొంగిపోయిరి రాజవొమ్మంగి లోని
రక్షక భటులెల్లరు రామరాజు ముందు
వారు కాల్చిన కాల్పులు వమ్ములయ్యె
తలలు వాల్చిరి విప్లవ దళము చెంత"[98] అని వర్ణించారు.

రామరాజు సైన్యం ప్రాచీన ఆయుధములతో యుద్ధం చేసి తర్వాత తుపాకీ పేల్చడం బాంబులు ప్రయోగించడం. ఆధునిక యుద్ధ నైపుణ్యాన్ని నేర్చుకున్నారు. రాజవొమ్మంగి పోలీసుస్టేషన్‌కి వెళ్ళగానే అక్కడ రక్షకభటులు రామరాజు ముందు లొంగిపోతారు. వీరసైన్యం కాల్చిన తుపాకీ శబ్ధాలకు, యుద్ధ ప్రావీణ్యతను ఆధునిక యుద్ధ సామాగ్రి ప్రయోగం చూసి విప్లవ దళం ముందు పోలీసులు తలలు వంచకతప్పలేదు.

స్వాతంత్ర్యోద్యమంపై గాంధీపై ఉన్న మమకారాన్ని తెలియపరుస్తూ.......

తే.గీ॥ "చింతపల్లిపై దాడిని చేసినపుడు
జయ నినాదమ్ము గాంధీజీకి జై యటంచు
పలుకు రామరాజుకు గాంధీపైన కలుగు
భక్తి గౌరవముల కద్ది ప్రబల ఋజువు"[99] అని అంటూ

మూడు విజయాల్లో కూడా జయ జయ ధ్వానాలు చేస్తూ తమ యుద్ధ నిపుణతను తెలిపే స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా ఈ విప్లవం అని పిలుపునిస్తూ గాంధీకి జై అనే నినాదాలతో రామరాజుకు స్వాతంత్ర్యంపై ఉన్న ముక్కువ, గాంధీజీపై ఉన్న గౌరవం తెలియపరుస్తుంది. స్వాతంత్ర్య పోరాటంలో అవివాదులు, మితవాదులు విప్లవవాదులాంటి అందరి మార్గంలో ప్రయాణించిన స్వాతంత్ర్యసమరయోధుడు అల్లూరి సీతారామరాజు.

రామరాజు నిజాయితీని, ధైర్యానికి సత్యవాక్కుకు నిదర్శనంగా...

తే.గీ॥ "మూడు దాడులలో కూడా ముఖ్యవస్తు
వులెవి స్వాధీనమయ్యెనో పుస్తకమున
వ్రాసి సంతక మొనరించు పద్ధతి గన
రాజు సత్య సంధతకు నిర్ధారణమ్ము"[100]

మూడు పోలీసు స్టేషన్ల దాడిలో విలువలైన డబ్బు, వస్తువులు ఉన్నవాటిని ఏమాత్రం ముట్టుకోలేదట. తాము ఏ వస్తువుల్ని తీసుకుంటున్నారో ఆవివరాల్ని పుస్తకంలో రాసి సంతకం చేసి ధైర్యంతో ముందుకెళ్ళేవారు. అక్కడ రక్షక భటులు రామరాజుకు ఎంతో గౌరవించేవారు. లేకపోతే అక్కడి నుండి పారిపోయేవారు. మూడు విజయాల్లోనూ, ఏవరికి ఏహాని తలపెట్టేవారు కాదు. తమకు కావాల్సిన యుద్ధ సామాగ్రిని తీసుకొనిపోయి నిజాయితీగా తెలియపరిచేవారు.

ఆ విప్లవ సైన్యానికి, ఎప్పుటికప్పుడు తర్ఫీదు యిస్తూ, వారి వీరత్వాన్ని, సాహసాన్ని మెచ్చుకుంటూ వారికి అప్పగించిన విధులు సక్రమంగా చేసినవారిని అభినందించేవారు శ్రీరామరాజు. విప్లవ సైన్యానికి తోడుగా ఉంటూ విశాఖపట్టణం, నుండి కృష్ణదేవిపేట, అటు రాజమండ్రి, అడ్డతీగల, పార్వతీపురం, నర్సీపట్నం చుట్టుకొని విప్లవ సైన్యం తమ ప్రతాపాన్ని ప్రదర్శించే వారని కవి వివరించారు.

ప్రతాప ప్రదీపం అనే ఎనిమిదవ భాగంలో రామరాజు వైశిష్ట్యాన్ని ప్రశంసించారు. శత్రువలకు నిద్రలేకుండా చేసి శత్రువులకు అంతు చిక్కని ఎత్తుగడలతో యుద్ధ నైపుణ్యాన్ని ఆధునిక ప్రాచీన పద్ధతుల్ని ప్రదర్శించి, ప్రజల యొక్క అభిమానాన్ని అందుకున్నారు. అందుకే ప్రజలు జైజైలు పలుకుతారు. ఆసందర్భంలో...

తే.గీ॥ "మిరపకాయటపా లోన మెఱపుదాడి
తెలుపునుత్తరముల జూచి తెల్లబోవు
తెల్లదొరల సైన్యములు తిరుగుబాటు
తెఱ గెఱగకతత్తరము బిత్తరము చెందు"[101] అని వివరించారు.

రామరాజు తిరుగుబాటు దాడులలో ధైర్యంగా ముందుగా విప్లవ సైన్యం వస్తుందని మిరపకాయటపాను మెఋపు వేగంతో పంపించి అక్కడ బ్రిటిష్‌అధికారులు ఆ ఉత్తరాన్ని చూచి తెల్లపోయి, పారిపోతారు. బ్రిటిష్ సైన్యంతో తిరుగుబాటు చేసి వారిని ఉక్కిరి బిక్కిరి చేసి ధైర్యంతో విజయం సాధిస్తాడు.

అప్పుడప్పుడు గ్రామాల్ని సందర్శించి ప్రజల యోగక్షేమాల్ని తెలుసుకొని రిజర్వు పోలీసుల ఆటకట్టించేవాడు. విప్లవ దళాన్ని ఆచూకీ చెప్పమని ప్రజల్ని అడిగిన చెప్పకుండా విప్లవ సైన్యానికి పూర్తి మద్దతు పలికిరి ప్రజలందరు ముక్తకంఠంతో...

కం॥ "ఇదిగో వచ్చు చునున్నా
దదెయిప్పుడు పోయెననెడి అద్భుత వార్తల్
వదియుంబదివిన బడగా
నెదా నిజమెదికల్ల తెలియకేగును దళముల్"[102] అని శ్లాఘించారని

పేర్కొన్నారు. ప్రజలను రామరాజు, వారి విప్లవ సైన్యం ఆచూకీ చెప్పమని బ్రిటిష్ అధికారులు చిత్రహింసలు పెట్టిన తమకు తెలియదని కొందరు, మరికొందరు చూసినా చెప్మని, ఇంకొందరు తప్పుడు సమాచారాన్ని ఇచ్చేవారు.

బ్రిటిష్‌వారిపై భారతదేశంలో మొట్టమొదటి సారిగా విజయం సాధించాడని ప్రస్తుతిస్తూ...

తే.గీ॥ "తెల్లదొరలతో ఆంధ్ర దేవమందు
సాగినట్టియీ స్వాతంత్ర్య సమర సరణి
తొట్టతొలి విజయమ్ముగా తోచు నాంధ్ర
రాష్ట్రమునకు సీతారామరాజు నేత"[103]

భారతదేశంలో ఝాన్సీ లక్ష్మీబాయి పోరాటం, సిపాయిల తిరుగుబాటు మొదలైన

ఉద్యమాలు జరిగిన అవి ఫలితాన్ని ఇవ్వలేదు. ఆంధ్ర దేశంలో తెల్లదొరలతో నాగరికత అక్షరజ్ఞానంలేని గిరిజన ప్రజలతో సాగించినట్టి స్వాతంత్ర్య సమరం. మొట్టమొదటి తొలి విజయంగా ప్రఖ్యాతి పొందింది. ఆంధ్ర రాష్ట్రంలో రామరాజు అతని సైన్యం బ్రిటిష్ ప్రభుత్వానికి ముచ్చెమటలు పట్టించి, ముప్పుతిప్పలు పెట్టి మూడు చెఱువులు నీళ్ళు త్రాగించారు. ఈ విజయం ఆంధ్రులు ఘనతను దేశ వ్యాప్తంగా సాటిందని కవి వర్ణించాడు.

బ్రిటీష్ ప్రభుత్వం రామరాజు అతని సైన్యం పట్టుకోవడం కోసం అస్సాందళం మలచారు. దళం మొదలైన ప్రథమ ప్రపంచం యుద్ధంలో ఆరితేరిన యుద్ధ నిపుణులైన హైటర్–స్కాటు కవర్టులతో భీకరమైన పోరాటం జరుగుతుంది. ఆ పోరాటంలో బ్రిటిష్ సైన్యం ప్రాణ భయంతో పారిపోతారు. హైటర్–స్టాటు కవర్టులు చనిపోతారు.

తే.గీ॥ "తెచ్చి యిచ్చినందుకు చాలా మెచ్చితెల్ల
దొరలు బహుమతుక మద్యవర్తుల కొసంగి
పాతిపెట్టిన గోరిలపైన వారి
పేర్లు స్మృతి చిహ్నములుగా తాపించినారు"[104] అని అంటూ

ఎక్కడో విదేశాల్లో పుట్టిన బ్రిటిష్ అధికారులు మరణించగా వారి శవములును తీసుకువచ్చినందుకు బహుమతులు ఇస్తారు. వారి వీరమరణం చిహ్నముగా నర్సీపట్నంలో యిప్పటికి కూడా ఏర్పాటు చేసిన గోరీలు వున్నాయి. ఇక్కడే పుట్టి ఈ దేశం కోసం ప్రాణాలర్పించి, వీరమరణం పొందిన వీరసైన్యంలో ప్రతి ఒక్కరికి సరైన స్మృతిచిహ్నం లేకపోవడం విచారకరం. అని కవి ఆవేదన చెందాడు.

రామరాజు పోలీసుస్టేషన్ ముట్టడిలో ముందుగా సమాచారం, ధైర్యంతో మిరపకాయటపాతో చెప్పడం జరిగేది. అడ్డతీగల ముట్టడిని.......

తే.గీ॥ "అడ్డతీగెల ముట్టడి ఆయుధముల
దొరకకున్న ప్రభుత భయాందోళనములు
గడగడ వణకునట్లు విక్రయమునెఱపి
రామరాజు ఖండ విజయ ధాముడయ్యె
తెల్లవారి మొగంబులు తెల్లవారె"[105] అని వివరించారు.

అడ్డతీగెల పోలీసు స్టేషన్‌లో ముట్టడికి వెళ్ళిన రామరాజు రక్షక భటులు ఎవరు కన్పించలేదు. బ్రిటిష్ ప్రభుత్వం గజగజ మణి ఒణికిపోతుంది. భయంతో స్టేషన్ అంతా నిశ్శబ్ధమౌతుంది. రామరాజు విజయానికి ప్రజాధరణకు తెల్లవాళ్ళ ముఖం తెల్లపోతుంది. రామరాజు అక్కడే కొంతసేపు కూర్చోని, స్టేషన్ అంత కలయ చూచిన ఎక్కడ ఏ ఆయుధం కనిపించలేదు. ఆ తర్వాత గ్రామాలు తిరిగి ప్రచారములు చేసి రంపచోడవరం వెళతాడు.

రంపచోడంరం, అడ్డతీగల ముట్టడిలో అపజయం పొందిన బ్రిటిష్ వాళ్ళు రామరాజును బంధించడానికి........

తే.గీ॥ "రంప చోడవరము దాటి రాజుదళము
బండపల్లె దిశ పయనమునకు పూనె
రామ వరమున నెట్టెన రామరాజు
పట్టి బంధింప సాండర్సు పట్టుపట్టె"[106] పూనుకున్నారని

వివరించారు. విజయములతో భారతమాతకు పూజచేస్తున్న రామరాజు సైన్యం గ్రామ గ్రామమున తిరిగి ప్రజలలో చైతన్యంను తీసుకువస్తు బండపల్లె దిశగా ప్రయాణిస్తూ రామ వరమునకు చేరు సమయంలో బ్రిటిష్ ప్రభుత్వ అధికారులు రామరాజును బంధించడానికి ప్రణాళికను సిద్ధం చేసుకుంటారు. దుర్ధినం అనే సేవను భాగంలో రామరాజు ఎదుర్కొన్న పోరాట ఓటముల్ని వివరించారు. రామవరంలో రక్షక భటుల దళంతో సాండర్సు ఆధ్వర్యంలో రామరాజు వీరసైన్యంతో తుపాకి గుళ్ళతో సమాధానం.........

ఆ.వె॥ "రామవరముదాడి రామరాజు తుపాకి, గుండ్ల వర్షమట్లు కురియజేసి
దీని బట్టి తెలియుదెప్పరముగ రాజు–నొద్దముందు గుండలున్నవనచు"[107]

రామరాజు సైన్యం తుపాకుల్ని వినియోగించడంలో మంచి తర్ఫీదు పొందారు. రామవరపు యుద్ధంలో ఎడతెరపి లేకుండా తుపాకీ గుండ్లతో వర్షం కురిసినట్లు ప్రత్యర్థి సైన్యంపై విరుచుకుపడిపోతారు. దీన్ని బట్టి చూస్తే రామరాజు సైన్యం వద్ద మందుగుండు సామాగ్రి, తుపాకులు వంటి యుద్ధ సామాగ్రి ఎక్కువగా ఉందని తెలుస్తుంది. ఈ యుద్ధంలో వీర సైన్యంలో 4గురు మరణిస్తారు. చాలా మందికి క్షతగాత్రులైరి. ఈ యుద్ధంలో

అపజయం కన్పిస్తుందని రామరాజు తెలిసి తప్పించుకుంటాడు.

తే.గీ॥ "వ్యూహారచనలో రాజు మహోన్నతుండు
మెఱపుదాడి దొరికినట్లే దొరకి వెడలు
పరులు చొరరాని దుర్గమ ప్రాంతములను
స్థావరములుగ శిభిరముల్ సంతరించి
దాడి జరిగిన సులువుగా తప్పుకొనెడి
మిగులు ననులైన చోట్ల నెంపిక మొనర్చు"[108]

యుద్ధ నైపుణ్యంలో, యుద్ధ వ్యూహారచనలో రామరాజు ప్రణాళికలు గొప్పగ ఉండేవి. కానీ ఈ యుద్ధంలో రామరాజు సైన్యం పూర్తిగా దెబ్బతింది. రామరాజు దొరికినట్లే దొరికి తప్పించుకుపోతాడు. ఎన్నో స్థావరము మీద సంచార ప్రదేశాల్లో దాడులు జరిపిన రామరాజు ఆచూకీ దొరకలేదు. సురక్షితమైన చోటకు మెరపు వేగంతో మాయమైపోతాడు.

రామరాజు ఆచూకి కోసం గ్రామంలో ప్రజల్ని హింసిస్తూ మునసబుల్ని లోబరుచుకుంటారు. రామరాజు సైన్యం ఆచూకీ సింగపల్లె మునసుబు తెలియపరుస్తూ...

తే.గీ॥ "తెల్లవారికి సంగతుల్ తెలియజేసి
ముడుపులన్ మూట గట్టెడి మూఢలందు
మొదటివాడు సింగంపల్లె మునసబు కబు
రందజేసె కొయ్యూరున కరుగుసేన
గూడపల్లెలో గంట తారాడెననుచు"[109]

తెల్లవారికి ఎప్పటికప్పుడు రామరాజు సైన్యం యొక్క సమాచారాన్ని అందిస్తూ బ్రిటిష్ వారి దగ్గర నుండి మూటాలు తీసుకునే వారిలో మొట్టమొదటి వాడు సింగపల్లి మునసబు. వారికి కబురు అందజేసి కొయ్యూరు సమీపాన రామరాజు సైన్యం గూడపల్లెలో సుమారుగా ఒక గంట అక్కడే ఉందని బ్రిటిష్ అధికారులకు అచూకీ తెలస్తుంది.

రామరాజు గమనాన్ని గూర్చి గందరగోళ వదంతులు వ్యాప్తిస్తాయి. అతడు దళం నుండి వెళ్ళిపోయామని, దారి మార్చి తెప్పించుకుపోయాడని జ్వరం వచ్చిందని

మారువేషాల్లో తిరుగుతన్నాడని బ్రిటిష్ వారికి భిన్నరీతులు సమాచారం అందుతుంది. విశేషమైన పూజలో సైన్యం నిమగ్నమైందని కూడా వార్తలు వ్యాపిస్తాయి. కానీ ఎప్పటికప్పుడు అనుచరులు యొక్క క్షేమాన్ని కాంక్షిస్తూ దేశ రక్షణలో నిమగ్నమౌతాడు.

తే.గీ|| "ప్రకృతి వైపరీత్యములెన్ని ప్రాప్తమైన
మిన్ను విరిగి మీద పడిన నెన్నుకొన్న
లక్ష్యమున కెన్ని అడ్డంకుల లముకొన్న
పట్టు విడక సాధింతురు ప్రాజ్ఞు లెపుడు"[110] అని

వాతావరణంలో ఎన్ని మార్పులు సంభవించినా ఇటు సూర్యుడు అటుపొడిచినా ఆకాశం విరిగిపడి మీద పడిపోయిన విజ్ఞాన వంతులు లక్ష్యానికి ఎన్ని అడ్డంకులు వచ్చినా, వచ్చినా, తమ విజయసాధన కోసం, ప్రతిభావంతంగా పోరాడుతుంటారని రామరాజు సైన్యాన్ని ప్రశంసించారు కవి. మనిషి అనుకున్న లక్ష్యాన్ని చేరుకోవాడానికి ఎన్ని అడ్డంకులు వచ్చినా వాటిని ఎదించి పోరాడి తమ లక్ష్యసాధన కోసం ప్రయత్నంచాలని కవి యువతకు పిలుపునిస్తాడు.

ఈ భాగంలో రామరాజు తన సైన్యంతో జోగంపేటకు వెళ్ళి అక్కడ నాటకంను చూచిన తర్వాత రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ శ్రీ నారాయణరావుతో మంతనాలు జరుపుతాడు. అనంతరం గ్రామ కరణం పణతుల లక్ష్మినారాయణతో మాట్లాడతాడు. ప్రతి గ్రామము తిరిగి ఆ గ్రామ మునసబుతో అన్ని విషయాలు సమస్యలు వాటి పరిష్కార మార్గాన్ని గూర్చి మాట్లాడి వెళ్ళతారని, గ్రామ స్వరాజ్య స్థాపనకు నాంది పలికారని కవి వివరించారు.

తే.గీ|| "ఎందఱో ప్రభుత్యోదోగు విట్లుసాను
భూతితో వలయు సహాయముల తమినొన
రించి రామరాజు పనులగ్గించినారు
సహకరింత్రు మంచి గ్రహించి సజ్జనాళి"[111]

బ్రిటిష్ ప్రభుత్వంలో చేస్తున్న భారతీయ ఉద్యోగులకు ఎటువంటి హాని తలపెట్టలేదు. ఆ ఉద్యోగులందరు దేశమాగ బానిస సంకెళ్ళు తెరచడం కోసం పోరాటంలో వారి యొక్క సహాయ సహకారాలు రామరాజు ఎప్పటికప్పుడు ప్రత్యూపకారంతో సహకరిస్తూ

మంచిన ప్రోత్సహించారు. సహకరించే మహనీయులు అతిస్వల్పంగా ఉంటారు.

తిరుగుబాటులో భాగంగా తంతి, తపాల సౌకర్యాల్ని నాశనం చేయడం సమాచారాన్ని సాధనాన్ని ముందు నిలువరిస్తే బాగుంటుందని మల్లుపేట, గోలుకొండ ప్రాంతాల్లో సమాచార వ్యవస్థను ధ్వంసం చేస్తారు.

దీనికి బ్రిటీష్ వారు అతిశయించిన ఆవేశముతో...

తే.గీ॥ "అవల విప్లవ దళము రామన్నపాళె
ముందు రాత్రి విడిది చేసి ముందు దినయె
నిమ్మగడ్డ కేగె ననచునివ్చయముగ
తెలిసె వరిపొలాలందు కాల్పులు జరిగెను"[112]

రామన్నపాలెంలో ముంద్రు రాత్రి సమస్త సమాచారాన్ని విప్లవసైన్యం సమకూర్చుకొని మరుసటి రోజు ఉదయాన్నే నిమ్మగడ్డ వెళ్ళే సమయంలో బ్రిటిష్‌వారు పసిగడతారు. వీరసైన్యం బ్రిటిష్ వారిని తప్పుత్రోవ పట్టించడానికి పొలంలో ఏర్పాటు చేసిన టోపీల్ని సైన్యంగా వరిపొలాల్లో కాల్పులు జరుపుతారు.

ఆ హోరా హోరా కాల్పులతో రామరాజు సైన్యం ఓటమికి దగ్గరైన సమయంలో

తే.గీ॥ "మఱియు రామరాజుకు సంబంధమైన
వస్తువులు కొన్ని దొరకె నప్పట్టునందు
అయిన వేళల అడగ కన్నియును కలుగు
కాని వేళల చెప్పక కదలితొలగు"[113]

జాన్, ఛార్ల్స్ అనే బ్రిటీష్ అధికారుల ఆధ్వర్యంలో కాల్పులు జరగుతాయి. రామరాజు, అతని అనుచరులు బలం చాలక వెనుదిరుగుతారు. కొందరు కొండగుహల్లో, తలదాచుకుంటారు. ఆ యుద్ధ సమయంలో రామరాజు సంబంధమైన కొన్ని వస్తువులు మాత్రమే బ్రిటిష్ వారికి దొరకుతాయి. అతని ఉనికినిగాని, అతని సమాచారం ఏమీ తెలియదు.

రామరాజు సమాచారం, ఆచూకీ చెప్పమని ప్రజల్ని హింసపెట్టిన విధానాన్ని...

తే.గీ॥ "వచ్చుకున్నారు రక్షక భటులనివిని
తక్కు పల్లెల ప్రజలను తరలి రెటకో
ఉన్నచో కొండ దళములు ఉనికి తెలుపు
దనుచు చిత్రహింసలకు ప్రజలచియుంద్రు"[114] అని వర్ణించారు.

రామరాజు అతని సైన్యంకోసం పల్లెలోకి వెళ్ళి ప్రజల్ని నానా హింసలకు గురిచేస్తూ బ్రిటిష్ పోలీసులు పిల్లలు, ఆడవాళ్ళు అనే బేధం లేకుండా వారి ఆచూకీ చెప్పుమని, కొండల్లో దాక్కున్న విప్లవ దళా సభ్యులు ఎక్కడ ఉన్నారో చెప్పమని, నానాబాధలు పెట్టేవారు. ఆ బాధలు భరించినా రామరాజు, అతని అనుచరుల ఆచూకీ చెప్పువారు కాదు.

పోలీసుల పోరులో విప్లవ దళం చాలా కష్టనష్టాఇ్న ఎదుర్కొన్నారు. పోరాటంలో క్షతగాత్రులు, మరియు కొందరు మరణిస్తారు. ఆయుధాలు, యుద్ధ సామాగ్రి బ్రిటిష్ వారికి దొరికిపోతాయి. దానికి తోడు విప్లవ సైన్యం సమాచారం అందించిన వారికి బ్రిటిష్ వారు బహుమతులు ప్రకటించే సందర్భంలో...

తే.గీ॥ "ప్రభుత ప్రకటించె నెవ్వరెవ్వరినిపట్టి
తమకు నప్పగించిన యోగ్యతలను బట్టి
తగు విధమున బహుమతులోసగెద మనుచు
ఆసలకు దాసులీ ప్రజలని తలంచి"[115] అని వర్ణించారు.

బ్రిటీష్ ప్రభుత్వం మన్య విప్లవం అణచడానికి ఒక్కొక్క విప్లవ వీరుడికి ఒక్కొక్క బహుమతిని ప్రకటించింది. అది విప్లవ వీరుడిని బట్టి బహుమతులు ఉంటాయి. మొదటగా రామరాజు పట్టిన వారికి 1500/–నగదు, గంటందొరకి 1000/– మల్లుదొరకు 1000 రు॥ మిగిలిన విప్లవ కారులకు 50/–రు॥ చొప్పున వీరుడు యోగ్యలతను బట్టి బహుమతులను ప్రకటిస్తారు. చివరకు రామరాజుకు 10,000/–రు బహుమతులు ప్రకటించింది. ఎంత పెద్ద బహుమతి అయిన రామరాజు ఆచూకీ చెప్పమని దేశభక్తులు ఆదివాసులు. ప్రభుత్వ బహుమతుల ఆశలకు మన్యం ప్రజలు మబ్యపడతారని భావించిరి. కానీ ప్రజలు రామరాజు పక్షం ఉన్నారని చెప్పుటకు గొప్ప ఉదాహరణ.

యుద్ధ వీరులు కొందరు మరణం, మిగిలిన వీరుల క్షతగాత్రలు అవ్వడంతో...

కం॥ "తొలి అపజయమున మిక్కిలి
కలవరపడి రామరాజు కార్య క్రమముల్
తెలియక అవమానించిన
పలువురు గ్రహించి రన్నవరము కలయికన్!"[116]

రామరాజు లేకపోవుటచే వీరులలో చైతన్యం సన్నగిల్లింది. మొదటి ఓటమి కలవరపాటు కలిగించింది. ఎద్దగడ్డపాలెంలో పోరులో నామరూపులు లేకుండా ఎక్కడ వీరులు అక్కడ సన్నగిల్లిపోతారు. అందరిని చైతన్యపరిచి అన్నవరములో మరల అందరు కలుసుకుందాం అని చైతన్యంతో మేల్కొలుతాడు.

ఏజెన్సీ అన్నవరంలో తపాల కార్యాలయంలోకి ప్రవేశించగానే పోస్టుమాస్టరు గౌరవంగా లేచివచ్చి నమస్కరిస్తాడు. ఆ కార్యలయంలో తన వారిని ఉంచి, గాంసోదరులను పోలీస్‌స్టేషనకు పంపిస్తాడు. అక్కడ ఇన్‌స్పెక్టర్ ఉండడు. రక్షక భటుటు మద్యం మత్తులో మునిగిపోతారు.

అక్కడ డిప్యూటీ తహశీల్దారు కుటుంబసమేతంగా రామరాజు ఆశీస్సులు తీసుకొనుట.....

తే.గీ॥ "అన్నవరమున కలసిన ఉన్నతాధి
కారులగు ముప్వరును మహావీరుడైన
రామరాజు సాక్షాత్తు శ్రీరామచంద్రు
డనిరి భవభూతి గతి చరిత్రను పొగడిరి"[117] అని

ఏజెన్సీ అన్నవరంలో ఉన్నతాధికారులు ముగ్గురు మహావీరుడైన రామరాజును చూస్తూ గౌరవిస్తూ ఆశీర్వాదములు పొందిరి. సంస్కృత మహాకవి భావభూతి రాసిన చరిత్రలను రామయణాన్ని ఒక్కసారి మననం చేసుకొని రామరాజు సాక్షాత్తు శ్రీరామచంద్రునిగా కీర్తించసాగారు.

ఒక్క అన్నవరంలోనే కాదు, చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలందరు రామరాజును రామచంద్రుడుగా భావించి, రాజుకు పూజలు చేసి వారి పవిత్రమైన ప్రేమను, భక్తిని ప్రకటిస్తారు.

గ్రామ గ్రామాలలో ప్రజలను కలుసుకొని వారి సమస్యలను అడిగి తెలుసుకొనే సందర్భంలో...

తే.గీ॥ "ప్రముఖ జాతీయ కాంగ్రెసు నాది ఆంధ్ర
పత్రిక విలేకరి మహాత్మ పధిసదాను
వర్తి చెరుకూరు నరసింహమూర్తి రామ
రాజు నడగగా విప్లవ లక్ష్యమతడు"[118] అంటూ

జాతీయ కాంగ్రెసువాది, ఆంధ్రపత్రిక విలేకరి. గాంధీజీ మార్గాన్ని అనుసరించే చేరుకూరు నరసింహమూర్తి రామరాజును అడగగా ఇది విప్లవ లక్ష్యమని సమాధానం చెప్పాడు. బ్రిటీష్ వారిపై తిరుగుబాటుతో స్వరాజ్య వస్తుందని నమ్మకంతో విప్లవ బాటను అనుసరిస్తూ లక్ష్యం కోసం పోరాడతామని సమాధానం చెప్పెను. మాతృదేవ దాస్య విముక్తి కే స్వరాజ్యస్థానమునకు యుద్ధమే ప్రధానమని విప్లవ చైతన్యం పూరించుటకు యుద్ధ సామాగ్రి బలమును ఏర్పాటు చేసుకొన్నామని అందుకోసమే పోలీసు స్టేషన్లు ద్వంస చేశామని ఇంటర్వ్యూలో రామరాజు పలికి సాగేడు.

కానీ "ఈ పద్య కావ్యంలో రచయిత ఎక్కువ నిజాలకు ప్రాధాన్యమిచ్చారు. కాకినాడ నుండి చుట్టపు చూపుగా అన్నవరం వెళ్ళిన చెరుకూరు నరసింహమూర్తి అనే యువ సహాయ నిరాకరణవాది ఆరోజున రామరాజును కలిసి ముచ్చటించిన వారిలో ఉన్నారు. విన్నది, విన్నట్టు చూసింది చూసినట్టు ఆయన కాకినాడ తిరిగి వెళ్ళి అక్కడ పత్రికా విలేఖరి చెవిన వేశాడు. ఆ విలేఖరి ఆంధ్రపత్రిక 1923 ఏప్రిల్ 21 తేదీన సంచిక ఆరవ పేజీలో "రంప పితూరీ నాయకుడు అల్లూరి సీతారామరాజు "అన్న శీర్షిక" ప్రచురణచేశారు.

కొంతమంది విప్లవవీరులు ఒకవైపు, మరికొంతమంది ఇంకొకవైపు, ఇలా ఒక్కొక్క గ్రూపుగా విడిపోయి పోలీసులకు విప్లవదళం ఎక్కడ ఉన్నారు అనే విషయాన్ని తెలియక

కోపంతో...

కం॥ "రక్షకభట బృందమ్ములు
కక్షకొలది దళము పట్టి కొరింపమదిన్
లక్షించి పెక్కు చోట్లని రీక్షిణ గాలించె జాడలెల్ల వెదుకుచున్"[119]

బ్రిటీష్ పోలీసు అధికారులు కూడా గ్రూపులుగా విడిపోయి వారిపై పగకొలది విప్లవ సైన్యాన్ని నిర్మూలించాలన్న కోపంతో, ఒకలక్ష్యంగా పెట్టుకొని చాలా చోట్ల వారి గూర్చి ఎదురుచూచి పట్టుకోవడానికి పన్నాగం పన్నేవారు.

సుబ్బరాయుడు అనే మిత్రుడి సహాయంతో పత్రికా సమాచారం, దేశ పరిస్థితులు ఎప్పటికప్పుడు తెలుసుకొనుటకు...

చం॥ "అనుదిన యాంధ్రాపత్రికకు నప్పటికప్పడె సుబ్బరాయుడు
దిన, దిన వార్తలన్ దెలుపు తీవ్ర తరంబగు రక్తపాతమే
ఘన తరరాజ్య సాధనకు కారణమై రణమై ఫలించురా
ముని వలె రామరాజు తన మూకలు సామయునన్ జయించుతన్"[120]

సుబ్బురాయుడు ప్రతిరోజు దిన పత్రికల్లో వార్తలను చేరవేస్తు ఉండేవాడు. విప్లవ తీవ్రత యొక్క విషయాన్ని లోకానికి తెలియపరుస్తూ ఉండేవాడు. విప్లవ పోరాటంతో స్వాతంత్ర్యసాధన జరుగుతుంది. యుద్ధం వలన స్వరాజ్యం వచ్చునని తన సైన్య సహకారంతో లక్ష్యాన్ని చేరుకొని, బ్రిటిష్ వారిని తరిమికొడతామని సుబ్బరాయుడుచే పత్రికల ద్వారా ప్రకటించేవారు రామరాజు.

రామరాజు ఆచూకీ పోలీసులు గట్టి బందోబస్తు ఏర్పాటు చేసి మర్రిపాలెం, డౌనూరు, యాలమాకవరం, మొదలైన గ్రామాలలో తిరుగుచు విప్లవ చైతన్యం చేస్తూ రామరాజు గూర్చి తెలుపవెదని మునుసబులను పదవి నుండి తొలగిస్తారు. అంతేగాకుండా గ్రామ గ్రామాలకు రామరాజు వస్తున్నాడన్న నెపంతో గ్రామ ప్రజలకు...

తే.గీ॥ "రాత్రి కొమ్మిక గ్రామము రాజు పౌజు
వచ్చి పోయిన దని విని రెచ్చిపోయి

ప్రభుత్వ రెట్టింపు సుంకిమా గ్రామమున వ
సూల చేయునాజ్ఞ విధించే స్రుక్కగప్రజ"[121]

రామరాజు కామ్మిక గ్రామంలోకి విప్లవ సైన్యంతో వెళ్ళి ప్రజలకు స్వాతంత్ర్య చైతన్యం నూరిపోసి, వారి కష్ట సుఖాలను విని వెళ్ళి పోయారని బ్రిటిష్ అధికారులు తెలుసుకొని ప్రజా విధానాలు ఉల్లంఘించి వారికి ఇష్టవచ్చినట్లు పన్నులు విధించి ఆ గ్రామ ప్రజలను నానా హింసలు పెట్టేవారు.

రామరాజును ఎదుర్కొనుటకు మేజర్ గుడాల్ 300మంది తూర్పుతీరమునకు చెందిన ప్రత్యేక దళము. మలబారు దళము 200మంది, కోరాపుట్టు దళం 65 మంది అస్సాము రైఫిల్సు దళము 430 మందిని సిద్ధం చేస్తాడు. కాని గుడాల్ నివేదిక ప్రకారం రాజు దగ్గర వంద రైఫిల్సు మాత్రమే ఉన్నట్టు సమాచారం. విప్లవమును అనుచుటకు అనేక ప్రయత్నాలు చేస్తారు. కానీ శ్రీరామరాజు అనే మంది ప్రముఖులు గ్రామ పెద్దలు, ప్రజల సహాయ సహకారాలతో ముందుకు సాగుతూ...

తే.గీ॥ "అటుల గొల్కొండ నుండి వీరయ్య దొరయు
మఱియు పాత మల్లంపేట మహితులు కన
కయ్య అతని సుతుడు సన్యాసియు బడి
పంతులైన లక్ష్మయ్య తోడ్పడిరి మిగులు"[122] అని

విప్లవ ఉద్యమానికి గోల్కొండ ప్రాంతానికి చెందిన వీరయ్య దొర, పాతమల్లంపేటలో పేరు ప్రఖ్యాతులు కలిగిన కనకయ్య అతని కుమారులు సన్యాసి మరియు బడిపంతులైన లక్ష్మయ్య కాకుండా మాడుగుల నుండి వెంకయ్య, బాకులూరి నుండి లక్ష్మడు, మేరచెరవు నుండి ఎర్రయ్య వంటి ప్రముఖులందరు విప్లవ బాటలో నిలిచి, రామరాజు ఉద్యమానికి మద్ధత్తుగా నిలుస్తారు.

తే.గీ॥ "అప్పడొక సమాచారశాఖాధికారి
తూర్పుకోస్తా దళమ్మే బరుగురు తోడ
రాజు చింతపల్లి పిడుగురాయి నడమ
కలడటంచు వెదికె గాని ఫలము సున్న"[123] అని

బ్రిటీష్ అధికారికి రామరాజు తూర్పుకోస్తా ప్రాంతంలో విప్లవ దళం చింతపల్లి పిడుగురాయి ప్రాంతంలో సంచరిస్తున్నట్టు సమాచారం తెలుసుకున్నారు. కానీ ఆ ప్రాంతాన్నంత బ్రిటిష్ పోలీసులు వెతికి విసిగిపోయి. రామరాజు అచూకీ తెలియక పోవడంతో వెనుదిరుగుతారు. ఎక్కడ దళము ఉన్నది అనే మాట వినగానే వెంటనే బ్రిటిష్ అధికారులు వెదుకుటకు ప్రయత్నించేవారు.

బ్రిటిష్ అధికారులు మన్యం ప్రాంతమంతా గాలిస్తూ ఉండగా...

తే.గీ॥ "బృందమప్పుడ ప్రాంతము వెదుక నందు
శిభిర మొక్కటి కన్పించె చెంత చిన్న
చుట్టు గుడిసెలో వ్యక్తి – ఆ చుట్టు ప్రక్క
లను తుపాకులు దాలిచి చనిరి నలువు
రందు గలడు గంటందొర అని తెలిసెను"[124] అంటూ

అటవి ప్రాంతాన్ని గాలిస్తుండగా బ్రిటిష్ అధికారులకు ఒక శిభిరం కన్పిస్తుంది. ఆ శిభిరం నందు ఒక చిన్న గుడిసెలో ఒక వ్యక్తి ఉన్నాడు. దాని చుట్టు నలుగురు తుపాకులు పట్టుకొని సహర కాస్తున్నారు. ఆ వ్యక్తి రామరాజు కాదని, గంటందొర అని బ్రిటిష్ అదికారులు గుర్తించిరి.

బ్రిటిష్ వాళ్ళ ప్రయత్నాలు విఫలమౌతున్నాయని కోపంతో...

మ॥ "తమ యత్నమ్ముల వ్యర్థమైనను దయాదాక్షిణ్యముల్ వీడిగ్రా
మములన్ దూరి కసాయి వారి వలె దుర్మార్గంబుతో స్త్రీల మా
నములన్ నెట్టన కొల్లగొట్టిరిక పిన్నల్ వృద్ధులంచున్ విచా
రము లేకుండా మహోద్ధతిం జెలగిరౌరా! కర్మశుల్ రక్కసుల్"[125]

బ్రిటీష్ వాళ్ళ ప్రయత్నాలు అన్ని వ్యర్థమైనవని గ్రామాలలోకి వెళ్ళి దౌర్జన్యంగా క్రూరమైన హింసలతో ప్రజలను బాధించేవారు. ముఖ్యంగా స్త్రీలను నానా సింహలు చేస్తూ పిల్లలు వృద్ధులు అనే బేధం లేకుండా చాలా కర్కశంగా రాక్షసులుగా ప్రవర్తించేవారు. ప్రజలను హింసలకు గురిచేస్తూ విప్లవ సైన్యం ఆచూకీ చెప్పమని నానా బాధలు పెట్టేవారు.

గ్రసవ్యసనము అనే పదవ భాగంలో రూధర్ పర్డ్ ఆకృత్యాలను కవి తెలియజేసారు. ఈ భాగంలో కవి పద ప్రయోగాలు కనిపిస్తాయి.

కం॥ "అక్కసుతో రాజును మీ
రెక్కడనో చూపరేని యిదె గ్రామములన్
కక్కసులన్ గావించెద
మొక్కతృటిల్ గూల్చి కాలు, మురవడి చెపుడీ"[126] అంటూ

అక్కసు–కక్కసుల ప్రయోగము అక్కను అంటే ప్రేమతో కక్కసు–ద్వేషంతో పూరించే విధంగా చమత్కరములతో వర్ణించారు. రామరాజుపై ఉన్న మమకారంతో అతని ఆ చూకీ చెప్పలేదు. గ్రామాలలో నివసిస్తున్న ప్రజలను (కక్కసుతో) దేవషంతో నానాచిత్రహింసలు చేస్తామని తెల్లవాళ్ళు పలుకుతారు. ప్రజలను దమననీతితో దౌష్ట్యముల చేసి కష్టాలు పలు చేస్తామని ప్రకటిస్తారు.

పితూరీని అణచుటకు ప్రత్యాధికారి రూధర్పర్డ్ను నియమిస్తూ...

తే.గీ॥ "అతడు చండశాసనుడు ప్రభుతకతడన
గొప్పగుఱి ఎంత పనియైన చప్పుననొక
రించు దక్షత గలవాడటంచు గట్టి
నమ్మకము కావున కమీషనరు పదవిడె"[127] అని వర్ణించాడు.

రూధర్ పర్డ్ చండశాసనుడు అనే పద ప్రయోగాన్ని చేశారు. నీచుడని, కిరాతకుడని, రాక్షసుడుగా ప్రజల భయం చెందేవారు. సహాయ నిరాకరణోద్యమంంలో గుంటూరులో పూర్తిగా అణచి వేశాడు. డొక్కలు నిండని బీదవాళ్ళ నోళ్ళు కొట్టిగొట్టి గొంతులను నొక్కి పన్నులను వాసులు చేయగల పరమక్రూరుడు. అతడు ఎటువంటి పనినైనా చేయగలడు. రామరాజును అతని పితూరీని అణచడానికి ఏజెన్సీగా నియమించాడు.

రూధర్ఫర్డ్ వచ్చిన వెంటనే పోలీసుస్టేషన్లలను కట్టుదిట్టముగా చేసెను. రంప చోడవరం, రాజవొమ్మంగి, అడ్డతీగెల, తుని, అన్నవరము, పత్తిపాడు, నర్సీపట్నం, మొదలైన ప్రాంతాలలో పోలీసు పహరాలను ఏర్పాటు చేస్తాడు. ప్రజలను హింసిస్తూ పలువురును

చెరసాలలో బందిస్తూ స్త్రీలు, పిల్లలు, వృద్ధులు అనే తారతమ్యం లేకుండా నానా హింసలు చేస్తున్న సందర్భంలో...

కం॥ "ఊరక జాన్ లూథర్‌పర్డ్–కారించె కడు శిశు వృద్ధ కాంతా జనముల్
వారలు రాజును దంతము–నారీతినయిన తెలుపుదని యెంచియటుల్"[128]

రామరాజు విషయాలు చెప్పమని నానా హింసలు చేసేవారు. రోజురోజుకు బ్రిటిష్ వాళ్ళ హింసలు ఎక్కువ ఉండేవి. బ్రిటిష్ చైన్యం ఒక చిన్న ఉద్యమయోధులను ఎదుర్కొనలేకపోయినదని కవి వివరించాడు.

తనకు తానుగా భాతమాతకు ప్రాణాలు అర్పించిన అగ్గిరాజు గూర్చి వివరిస్తూ...

ఆ.వె॥ "అగ్గిసెగలు గ్రక్కునట్టి మహావీరు
దగ్గిరాజు శత్రు హస్తగతుడ
హతుడు కాక యెట్టులైనను తప్పించు
కొని స్వయముగ మృతిని గనదలంచె"[129] అని వర్ణిస్తూ

విప్లవ సైన్యంలో అగ్గిరాజు అగ్గినిప్పులు లాంటి విప్లవ యుద్ధ సైనికుడు. అగ్గిరాజు బ్రిటిష్ సైన్యానికి దొరకిపోతాడు. శత్రువు చేతిలో చిక్కిపోయినను బ్రిటిష్ వారు తనను చంపుట యిష్టపడక, తనకుతానే స్వయంగా మృతి చెంది తన ప్రాణాన్ని భారతమాతకు అర్పించిన మహావీరుడు అగ్గిరాజు. ఈ భాగంలో గంటందొర, గోకిరి ఎఱ్ఱేసు, అగ్గిరాజు మొదలైన వీరుల వీర సాహసాలను ప్రదర్శించినట్టు కవి వివరించారు.

"అస్తమయం" అనే భాగంలో రామరాజు చివరదశను వర్ణించారు. మలబారు పోలీసుదళములు అడవి అంతము అలుపుసొలుపు లేకుండా విప్లవ సైన్యం కోసం తిరగుతారు. కానీ కొంత నిరాశపరిచిన యుద్ధవీరులను ఒక్కొక్కరిని నాశనం చేస్తున్న సమయంలో...

చం॥ "తలచిన దొక్కటైన మఱిదైవము వేరొకరీతిగా సమ
స్యల జిటిలమ్మొనర్చినది, సాధనలో కొదవలేదు, సాధ్యమి

ట్లలము తరమ్ముగా నలవి యౌనెయటంచని పించునాత్మలో
కలత వచించు మాటయును, కల్లము దొల్లయుకాదు చూడగన్" 130

మనము అనుకున్నది ఒక్కటి, దేవుడు మరొక రీతిలో అనుగ్రహిస్తుంటాడని విప్లవ సైన్యం భావిస్తుంది. చిన్న సైన్యం బ్రిటిష్ వాళ్ళతో తలపడుతుంది. యుద్ధ నిపుణతలో ఎటువంటి కొరతలేదు. అన్ని సదుపాయాలు ఉన్న తెల్లవాళ్ల సైన్యంతో పోరాడుతూ అలసిపోయి, తరిగిపోయి మనస్సులో కలత చెందుతుంటారు. ప్రజలను కష్టాలపాలు చేస్తున్నామని బాధపడుతూ, ఆప్తులను, మిత్రులను ప్రాణదాతలను కోల్పోతున్నామని వ్యధ చెందుతారు. తమ ప్రయాణానికి ఎటువైపు వెళ్ళాలో ధర్మంవైపు మొగుగటకు ఆత్మలో తలచుకొనెను రామరాజు.

ఆంగ్లేయుల చేతికి చిక్కిన మన్యం వీరులు, క్షతగాత్రులు కొందరు అంతకంటే మరణమే మేలు అని ఆత్మత్యాగాలకు అర్పణం చేస్తున్నారు. రామరాజు మనసులో బాధపడెను. సమయం బట్టి మెలగవలయును. సముచితమైనది సాధ్యమగునచో సమయమే సమాధానం చెప్పెను. చేతకాక కాదు, చేతికి చిక్కిన సమయం కూర్చి ఎదురుచుస్తూన్నడట.

కం॥ "అస్తగిరికి జనుసూర్యుడె-ప్రస్తుత కార్యమును గూర్చి ప్రత్యక్షముగా
ప్రస్తావించిన గతి మఱి-నిస్తరణోపాయ యొకటి నేడు స్ఫురించెన్" 131

కవి ఈ భాగంలో "అస్తమయము" అనే శీర్షిక పెట్టారు. అందులో అసురసంధ్య లేక అపరసంధ్య. సూర్యుడు పశ్చిమ కనుమలలోకి వెళ్ళి పోచున్నాడు అని అర్థం.

మన్యమునకు గిరిజన సూర్యుడు రామరాజు ప్రస్తుతం జరగవలసిన కార్యక్రమమును గూర్చి ఆలోచించినప్పుడు ప్రత్యక్షముగా పోరాటానికి బలం చాలదు. వీరులు ఒక్కొక్కరు రాలిపోతున్నారు. దాని నివరణోపాయము ఏమిటి అని అనుకునే సమమయంలో ఒక ఆలోచన స్ఫురిస్తుంది.

రూథర్‌ఫర్డ్ మనసుబులు, ముఠాదార్లు మొదలైన ముఖ్యలతో సమావేశ ఏర్పాటు చేసి రామరాజును పట్టుకొనుటకు వ్యూహం పన్నిరి. ఆ సమావేశ విషయం తెలిసిన రామరాజు మంప మునసబుతో.......

తే.గీ॥ "గ్రామ మునసబు నుండి వార్తలను దెలిసి
విప్లవము తాను మానెడి విధము తెలిపి
తన్ను పట్టుట కనువైన దారిని ఎవ
రించి ప్రభుత బహుమతి వరించుమనియె"[132] అని

మునసబుతో తాను విప్లవము మనేవేసి, తిరుగుబాటు నుండి తప్పుకుంటానని తనను పట్టుకొని బ్రిటిష్ ప్రభుత్వానికి అప్పజెప్పితే బహుమతి వస్తుందని దానిని నీవు తీసుకోమని చెప్పాను. అప్పుడు మునసబు స్వామి? ఏమిటిది? మీకు తగునా! స్వాతంత్రయే మా మార్గం. అటువంటి మీరు మారిపోవడానికి వీలులేదు. నేను ఈ పని చేయలేనని బాధపడతాడు.

ఏటి ఒడ్డున స్నానము చేసి ద్యాన నిష్ఠలో మునిగిపోయి మనసుతో మాట్లాడేను. కనువిప్పి పాలు తెచ్చిన ఆ కోయ బాలును జూచి...

కం॥ "బాబూ! యిట రమ్మని యొక
జాబూను వెంటనెలిఖించి సైనికులకుని
మ్మే బాలు త్రావ జాలను
పోబడియిది నన్ను గూర్చి-పోవడి నటకున్"[133] అని

పాలు తెచ్చిన ఆ బాలుడను పిలిచి నేను ఇక్కడ ఉన్నానని చెప్పిఒక ఉత్తరాన్ని వ్రాసి తన ఉనికిని తెలియపరుచుటకు సైనికులకు ఇవ్వవలసినదిగా చెబుతాడు. అప్పుడే నేను పాలు తాగుతానని ఆ బాలుడు చెపుతాడు. నీవు పోయి కబురు చెప్పిరా అని పంపెను.

రామరాజు జాడ చెప్పిన వారికి బహుమతి ప్రకటించింది. కానీ దేశభక్తి ఉన్న రామరాజును ఎక్కడ ఉన్నది ఏవరు చెప్పలేదు. సరి కదా! రామరాజు ధైర్యంతో...

తే.గీ॥ "తనకు తానుగా వచ్చి బంధములజిక్కె
చివర కనువార్త కప్పి పుచ్చిరి కుమతులు
పట్టి తెచ్చిన ఘనత స్వర్ధానువీల

తమదెయని తమిగొనరాజు తరణి పగిది
మిన్నకుందెను వారెంత మిట్టి పడిన"[134] అని పలుకుతూ

రామరాజు కబురు పంపి బ్రిటిష్ అధికారులకు తనకు తానుగా వచ్చి లొంగిపోయి బంధిగా చిక్కెను. అసలు విషయాన్ని కప్పిపుచ్చి చివరకు రామరాజును పట్టిన ఘనత మాదే అని ప్రగల్భిలు పలికిరి. పట్టుకొని రాజును రక్షక భటులపై ప్రతి ఘటించని రాజు లొంగిపోవుటకు సమ్మతిని తెలిపెను వెంటనే రామరాజును...

తే.గీ॥ "మహిమలున్నట్టి వాడని మంచమున బ
రుండ బట్టి పిమ్మట త్రాళ్ళ నుండి చుట్టి
నట్లు కట్టి కొయ్యూరు మధ్యాహ్నమునకు
చేరి రది మంప కారైళ్ళ దూరభూమి"[135]

మహాయోగి, తపస్వీ మహిమలు కలిగిన రామరాజును మంచమునకు పడుకోబట్టి పిమ్మట తాళ్ళతో చుట్టు కట్టి వేయబడినారు. కొయ్యూరు మధ్యాహ్నమునకు చేరి గుధాల్ సమక్షమునకు తీసుకువస్తారు.

గుడాల్‌తో రామరాజు సంభాషణలతోవారి దుష్టచర్యలు వర్ణన...

శా॥ "మీ దౌష్ట్యంబును మీకు తంత్రములు మీమీ నీచకార్యంబులే
మా దౌర్భాగ్యము కష్టనష్టములకున్ ప్రత్యక్ష సాక్ష్యంబులై
పేదల్ సాదలు పిల్ల జిల్లయిటువే వృద్ధులే సమస్త ప్రజలే
బాధల్ కూడగ నాపదల్ జలముగా ప్రాణంబులన్ బోయరే"[136]

ఆంగ్లేయులు చేసిన అరాచకములు, "విభజించు-పాలించు", నీచమైన బుద్ధులు, స్త్రీ, పిల్లలు, వృద్ధులు అనే బేధం లేకుండా దౌర్జన్యం, వారి కష్టాలకు, నష్టాలకు మీ అధికారులు, మీ చట్టాలు కారణం. ఈ మొత్తం మన్య ప్రాంతాన్ని ఆ పదలను తలపెట్టి అమాయక గిరిజన ప్రజల ప్రాణాలతో చలగాటం ఆడడం ఒక ఆటగా భావించేవారు. చివరకు వారి ప్రాణాలతో రక్త తర్పణం చేసారు.

మన్యం ప్రజల బాధలను చివరగా రామరాజు పలికిన దానికి బదులులేదు. సరికదా....

తే.గీ "రామరాజు మాటలోని రాజధర్మ
మించు కేనియు వినకుండా మంచి చెడ్డ
లందుపై వారి జోక్య మావంతలేక
ఒకడి పాల్పడినన్న ప్రశ్నకు బదులెది?"**137** అని

రామరాజు తనకు తానుగ లొంగిపోయాడు కోర్టులో హాజరు పరచి న్యాయాన్యాయాలు విచారించాలి? కానీ అతని మాటలో మంచి చెడు వినకుండా పై అధికారులకు తెలియపరచకుండా తన ఒక్కడే నియంతగ గుడాల్ స్వంత నిర్ణయాలతో రామరాజు ప్రశ్నలకు బదులు చెప్పలేకపోయాడు. ఆయన కక్ష సాధింపుగా తన ప్రక్కనున్న జమేదారుకు సైగ చేస్తాడు. జమీదారుడు వణికే చేతులతో రామరాజు పై తుపాకీ పేల్చాడు గురితప్పిన తుపాకీ గుండు ఎడమ చేయ్యి భాగంలో దిగబడింది. రామరాజు బాధగా మూలిగాడు తప్ప ఒక్కమాట కూడా మాట్లాడలేదు. మేజర్ గుడాల్ మండి పడి తుపాకీ తీసుకొని కుండపోత వానవలె క్రమ్మరించి ఆ! నీచుడు కింది నుండి వరస చూసి పైకి కాల్చుచూ...

కం॥ "మోకాళ్ళ దాటి తోడలన్
పాకుచులోలోన తొలచి ప్రవహించెనటన్
వాన వలెన్ నెత్తురు లేని
వోక గుడాల్ కాల్చె దానవుని మెంచె ముతావ్"**138** అని

పాదముల నుండి తుపాకితో గుళ్ళను కాల్చుతూ తోడలు, ఉదరము, గుండెల్లో శరీరమంతా గుళ్ళతో నింపి రామరాజు శరీరాన్ని తుపాకి గుండెలతో నింపవేశారు. అంత కిరాతంగా రాక్షసుడుగా కొల్చిన గుడాల్ యడమ మోదలు కడుపు వరకు చివరకు తలలో కూడా కాల్చి చంపేశాడు.కడపు తొడలు యడమలందు శరీరమంత రక్త ప్రవాహముగా మారిపోయినది.

కం॥ "పందొమ్మిది యిరువదినా-ల్గందున్ మే మాస మేడ ప్రాణములటులన్
పొందికగ పంచ భూతము-లందు గలిసె-రాజు కీర్తి సమరుండయ్యేన్"**139**

1924 మే నెల 7 తారీఖున రామరాజు ప్రాణములు పంచభూతములలో కలిసిపోయెను. అందు కలసిన వెంటనే రామరాజు ఘనకీర్తితో అమరడయ్యెను.

భారతమున అభిమన్యుడు పోరాడినట్టుగానే మన్య విప్లవములో బ్రిటిష్ వారితో ప్రజా సారధియై అభిమన్యుడు వలె పోరాడి స్వాతంత్ర్యపోరాటంలో విప్లవ శౌర్యమును ఎలుగెత్తి చాటిన మమా స్వాతంత్ర్య సమరయోధుడు అల్లూరి శ్రీరామరాజు.

అదేవిధంగా పన్నెండవ భాగంలో అల్లూరి సీతారామరాజుపై కురిపించిన ప్రశంసానీరాజనాలని, అతని మృతికి జరిపిన సంతాప సభల గురించి వివరించారు. అలాగే రామరాజు యిచ్చిన వాఙ్మలన్నీ, ఆయన మిత్రలకు రాసిన లేఖలన్ని, తన సహోదరుడైన సత్యనారాయణరాజు అనుభవించిన స్వానుభవాలను, తన మిత్రుడు మద్దూరి అన్నపూర్ణయ్య యిచ్చిన నివేదికను గూర్చి విశదీకరించారు.

అంతేకాకుండా అల్లూరి విప్లవ ధ్యేయాలు, ఆశయాలు, గూర్చి జన్మదిన సంస్మరణ సబలు, స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సందర్భ సంస్మరణలు విపులంగా చర్చించారు. ఈ విధంగా శ్రీరామరాజీయం కావ్యాన్ని అమూలాగ్రం. సీతారామరాజు జీవిత ఘట్టాల్ని, విజయాలన్ని, త్యాగనిరతిని, ఆశయ సాధనలను, దేశభక్తిని కళ్ళకు కట్టినట్టుగా కవి ఆవిష్కరించారు.

**2.3 బూదరాజు రాధాకృష్ణ:**

అశ్రుధారల అనే కావ్యంను బూదరాజు రాధాకృష్ణ రాసారు. ఈ కావ్యాన్ని 1) అశ్రుధారలు 2) గతస్మృతి 3) అతడు – ఆమె అనే శీర్షికలుగా విభజించారు. ఇందులో అశ్రుధారలు అనే శీర్షికలో "ఆటు పోట్లు – మన్య విప్లవం" అనే ఉపశీర్షిక పూర్తిగా అల్లూరి నేలే రామరాజు చరిత్రను, విప్లవ ఉద్యమాన్ని చక్కగా వర్ణించారు. ఈ ఉపశీర్షికలో మొత్తం 290 పద్యములతో 60 పుటలలో రామరాజు విప్లవ పోరాటాన్ని వర్ణించారు.

కావ్య ప్రారంభంలో గోదావరి ప్రాంత ప్రజల మనోభావాలను వర్ణిస్తూ...

"అది అఖండ గోదావరీ నది, తదీయ
సైకతములన్ విదేశ రాక్షస కుతంత్ర

రీత జర్చించుచున్నారు మాతృదేశ
రక్షణాదక్షులాంధ్ర హర్యక్షులెల్ల"[140]... అని అంటూ

నిత్యశోభతో ఉప్పొంగే గోదావరినది పరిసర ప్రాంతమైన రాజమండ్రి సమీపంలో ఉన్న శ్రామిక్, కర్షక్, రైతులు మొదలైన జనులందరు బ్రిటిష్‌వారి దుష్టచర్యలకు, కుతంత్రాలకు ప్రజలు అనుభవిస్తున్న బానిస బ్రతుకులను గూర్చి చర్చించుకున్న విషయాన్ని తెలియజేశారు. మాతృదేశ రక్షణకు ఆంధ్ర వీరులు పోరాడవలసిన సమయం ఆసన్నమైనదని వారు ముందుకు రావాలని కవి పిలుపునిచ్చారు.

రామరాజు బాల్యంలో జరిగిన సంఘటనను చెబుతూ తన తండ్రి వేంకట రామరాజు బ్రిటిష్ వారి గురించి ప్రస్తావించిన సందర్భంలో...

"బాల్య చాపల్యమున ఒక్క బాలకుండు
రాజకీయాధికారికి ప్రణత సేయు
దండ్రి యొక చెంప దెబ్బతో తప్పుదిద్దె
అతడు వెంకటరామరాజేంద్ర మౌళి"![141]

రాజమండ్రిలో ఒక ఆంగ్లేయుడు గుర్రంపై వెళ్తుండగా అతనికెదురైన ప్రజలు నమస్కరించడం చూచిన రామరాజు తనూ నమస్కరించేందుకు చేతులెత్తబోగా తండ్రి వెంకటరామరాజు అతడ్ని వారించి, చెంపమీద ఒక దెబ్బ కొట్టి, బ్రిటిష్‌వాళ్ళు మనల్నీ మన దేశాన్నీ దోపిడీ చేస్తున్న తెల్లవాడు ఇంకెప్పుడు వాళ్ళకు నమస్కరించే భావన మనస్సులోకి రానివ్వకు ప్రతి వ్యక్తి తెల్లవాళ్ళ పాలన నుండి దేశాన్ని విముక్తి చేసేందుకు ప్రయత్నించాలి అని తండ్రి బోధన మనసులో నాటుకుంది.

"శ్రీ రామరాజతండ
ల్లూరి కులీ నుండు చదువులో మునుగక" మ
ద్దూరిన్నపూర్ణయా" దుల
లో రాజ్యాంగాది చర్యలను కావించున్"[142]... అని అంటూ

రామరాజు మనస్సులో చదువులోని మర్మమును గ్రహించాడు. కాని ఇవి నిజమైన చదువులు కావు. ఇంత చిన్న వయస్సులో అంతటి లోకజ్ఞానం ఉన్నట్టు కవి వర్ణించడం విశేషం. కాకినాడలో పాఠశాల స్నేహితుడైన మద్దూరి అన్నపూర్ణయ్యతో తరచు స్వాతంత్ర్యం

కొరకు, స్వరాజ్య స్వేచ్ఛ భావాలు, రాజ్యాంగాది విషయాలు దేశంలో జరుగుతున్న స్వాతంత్ర్య కార్యకలాపాల గురించి మిత్రులతో ఎక్కువ మాట్లాడేవాడని, రామరాజుకు చిన్నప్పటి నుండి స్వాతంత్ర్య స్ఫూర్తి కలిగినవాడనే విషయం అర్ధమౌతుంది.

"రాచకరిమ్ముపై పగ, నిరాదరణమ్ము నిరంకుశ ప్రభు
త్వాచరణమ్ము లన్న, పరితాపము పీడిత జాతి మీద, ఏ
వో చదువుల్ పరీక్షలు – అయోమయమై నలువైపులన్ మహా
వీచులు లేచి నా హృదయ వీధులలో సుడిగాడ్పులయ్యె నా"[143]... అని

బ్రిటిష్ అధికారాలపై, వారు చేసిన చట్టాలపై (అడవి చట్టం) వారి వ్యవస్థపైన ద్వేషం, బానిసత్వంగా, నిజమైన ప్రభుత్వ విధానాలపైన స్వార్ధమైన పద్ధతులతో సర్వము దోచుకొని, ప్రజలను, మనదేశ సంపదలను కొల్లగొట్టి. పీడిత జనంపై పెత్తనం చెలాయించడం ఒక వైపు, మరోక వైపు చదువులు, ఈ చదువుల బ్రిటిష్ వారి వద్ద గుమస్తా గిరి చేయుటకు గాని దేశ పరిస్థితులను మార్చేవి కావు అని మనసు మరోక వైపు తీసుకుపోతున్నదని, మనసు ఈ ఈ మనిషి చదువు దృష్టి నిల్పక స్వాతంత్ర్య దీక్ష వైపు ప్రయాణించేటట్టుగా ముందుగా కవి వివరించడం విశేషం.

"తండ్రి మృతింప దన్ను పిన తండ్రి దయన్ జరిలింపు చుండనే
మండ్రు జనంబు లీత డిసుమంత గ్రహింపక తప్పిపోవుచున్
గండ్ర తనమ్ములేక నుడికారము నేర్వక నేవి యేలియో
తీండ్రిలతో ప్రపంచ నృపతీజనులన్ విదళింప జూచినన్"[144]అని పలుకుతూ

రాజమండ్రిలో కలరా వ్యాధి సోకి తండ్రి వెంకట రామరాజు మరణంతో తన పిన తండ్రి రామకృష్ణం రాజుపై చదువుకు రామరాజు ఆధారపడవలసి వచ్చిందని, కుటుంబ ఆర్ధిక భారం గాని, చదువుపై శ్రద్ధ గాని చూపకపోవుట. ఈ కావ్యంలో శ్రామికులను, కర్షకుల కష్టాలను, శ్రమ దోపిడిని, రామరాజు తండ్రి స్వాతంత్ర్య దీక్ష, దేశభక్తిపై ఎక్కువగా నిమగ్నమైన సంఘటనలతో ఉండేవాడని వివరించాడు. కుటుంబ బాధ్యతలను విస్మరించి, జనుల కష్టాలపై బ్రిటిష్ వారి చర్యలపై దృష్టి పెట్టారు.

"అణుమాత్రమ్ము బఠింపలేమని ఉపాధ్యాయుడు దండింపగా
జననీ భ్రాతృపితృవ్యులుం గఠిన భాషల్ వల్కి, తన్నంపగా

"తుని" కబ్బోనయినన్ బఠింపక విరుక్తుండై మహాయోగ వ
ర్తనుడై క్రుమ్మరుచుండు దత్వరి సరారణ్యమ్ము లందొంటియై"[145] అని చెబుతూ

చదువుపై శ్రద్ధ వహింపలేదని తరగతి ఉపాధ్యాయులు శిక్షించి చదువు చెప్పుటకు ప్రయత్నించిరి, క్రమశిక్షణతో తల్లి సూర్యనారాయణమ్మ, పినతండ్రి రామకృష్ణం రాజు తీవ్రమైన పదజాలంతో దూషించి చదువుపై మరులుటకు ప్రయత్నించి చివరగా రామరాజును దండించిన చదువుపై ఫలితం లేకుండా పోయింది. చదువుపై ఆసక్తి చూపలేదు సరిగదా! యోగ ప్రక్రియలలో, గుఱ్ఱపు స్వారీ వంటివి నేర్చుకొని అరణ్యాలపై, ప్రకృతిపై ఆరాధన భావంపై వెళ్ళాడు అని వర్ణించిరి.

ఈ కావ్యంలో రామరాజు ఉత్తర భారతదేశ యాత్రను చాలా సున్నితంగా, హత్తుకునేటట్టు ప్రతిఘట్టమును వర్ణిస్తూ...

"నాసిక్" కొక్క మాఱుతుహి నాద్రికి కొండొక మాఱు కాల్నడం
జేసి పరిభ్రమించునెడ స్నేహితుడై తగు "పృధ్విసింగు" పే
ర్మోసిన తీవ్రవాది, ప్రియముండి తనుంగొని పోవ రామరా
జు సమయాన పాల్గొనె రహస్యపు విప్లవవాది చర్యలన్"[146] అని

ఈ పద్యం కావ్యంచే ఒక్కక్క సన్నివేశాన్ని ఒక్కొక్క పద్యంలో చెప్పడం కవియొక్క ప్రతిభకు నిదర్శనం. నాసిక, బదరినాద్, హృషికేష్ వంటి పుణ్యక్షేత్రాలను దర్శించి, హిమలయాలు, కాంచనగంగ మొదలైన పర్వత శిఖరాలను చూచి, లక్నోలో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభకు హాజరైనా, నాటి దేశ పరిస్థితులపై అవగాహన చేసుకొని, ప్రియమిత్రుడైన పృద్విసింగును కలుసుకొని విప్లవ మార్గములో ప్రయాణానికి కార్యకలాపాలు చర్చించిరి. విప్లవ సమావేశములలో పాల్గొనుటకు చిట్టగాంగ్ తీసుకొని పోయెను అని చరిత్ర చెబుతోంది. ఆ తర్వాత...

"అంతట స్వీయ దేశమునకై పయనించి "విశాఖపట్టణం"
ప్రాంతమునందు మున్న తనపై ప్రియభావము సూపియున్న శ్రీ
మంతు సహుదరిన్ దీనసమాగమనమ్మునుగోరి కంతుపెన్
జింతల గూరియున్న గుణశలను సీతను చూడవోయినన్"[147]–అని అంటూ

ఉత్తర భారతదేశ యాత్ర ముగించుకొని రామరాజు విశాఖపట్టణము చేరుకున్నారు.

స్వాతంత్ర్య పోరాట దీక్షకు, బానిసత్వంపై తిరుగుబాటు, స్వేచ్ఛ సమానత్వాలతో రామరాజు భావనలతో కలిసిపోయిన ఆమె పేరు సీత అని ఆమె ధనవంతుల అమ్మాయి అని, ఆమెను చూడటానికి రాజు వచ్చినట్లు, రాజు వచ్చిన మూడు రోజులకే ఆమె ఒక రోగంతో మరణించినట్లు ఈ కావ్యకర్త రాశారు. వాస్తవానికి 'సీత' అనే ప్రేమికురాలు లేదు. సీత అనే చెల్లెలు రామరాజుకు ఉండేదని చరిత్ర చెబుతుంది. కాని కవి వివరణార్ధం....

"సీతాసతి స్మృత్యర్థము
'సీతారాముండు'గా బ్రసిద్ధుండై ఇం
కేతరుణి బెండ్లియాడక
నీతిపరుడు సన్యసించె నిశ్చిలబుద్ధిన్..."[148] అని వర్ణిస్తూ

అది వాస్తవం కాదు. తాను ప్రేమించిన సీత జ్ఞాపకార్ధమై రామరాజు వివాహం చేసుకోలేదు. కాబట్టి హిందూ ధర్మం ప్రకారం మరియొక వివాహం చేసుకోకుండా సన్యాసం తీసుకున్నాడని ఈ కావ్యంలో కవి వర్ణించారు. వాస్తవానికి రాజు సన్యాసం పుచ్చుకోలేదు. నిరాడంబరమైన జీవితం గడపాడనేది వాస్తవం.

అయితే రామరాజు చరిత్రలో ఎక్కడ "సీతారామరాజు" అనే ప్రయోగం చేయలేదు. శ్రీ రామరాజు అనే పేరు వాస్తవం. ఎక్కడ సంభాషణ., ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగిన రామరాజు సంతకం శ్రీరామరాజు చేశారు. సీతారామరాజు పేరుకు ఒక కథనం.

"భక్తి విశ్వాసములు రామభద్రునందు
తెనుగు మాటాడెదరు కాని తీరు వేరు
నాగరికతా మహత్వ హీనము సమాజ
మా అమాయిక మూర్తుల కతడు గురువు"[149] అని అంటూ

మన్యంలో రాజు పాపికొండల నడుమ ద్యానం, యోగ, గీతా రహస్యములు, యోగ మహిమల్, శాంత స్వభావుడై మన్యం ప్రజలకు అనే ఆధ్యాత్మిక కార్యకృతులు. స్వాతంత్ర్య కాంక్షలపై తీసుకువచ్చి చైతన్యం తీసుకువచ్చాడు.

శ్రీరామరాజుపై నమ్మకంతో అమాయకమైన గిరిజనులు, అడవి తల్లి బిడ్డలు. నాగరికత తెలియని ప్రజల మధ్య, నాగరికతను, భక్తిని, జ్ఞానాన్ని తెలియపరిచి, అనేక

విధములుగా అక్కడ వారికి ఒక అండగా నిలబడిన రామరాజును ఒక దైవ స్వరూపుడుగా భావించి మన్యానికి దగ్గరగా ఉన్న రాముడుగా భావించి శ్రీరామ రాజును మా సీతారాముడు, మా దైవం సీతారామరాజుగా పరిణితి చెందాడు. మన్యం ప్రజల గుండెలలో భద్రాది రాముడుగా సీతారామరాజుగా ఒక గురువుగా జ్ఞానాన్ని కలిగించిన వాడుగా కవి వర్ణించాడు.

"ప్రజకు స్వేచ్ఛా నిరోధక ప్రభువులొక్క
ప్రక్క భూస్వాములొక ప్రక్క 'ఫాదరీ'మ
త ప్రచారకుల్ వేఱొకతట్టు బాధ
వెట్ట విప్లవ భావముల్ పెనుచురాజు"[150] అని చెబుతూ...

మన్యంలో పరిస్థితిని ఒక్క పద్యంలో విపులంగా వివరించారు. ప్రజల సమస్యలను పరిష్కరించుటకై రామరాజు విప్లవ భావములను, విప్లవ చైతన్యమును తీసుకువచ్చాడు. బ్రిటిష్ ప్రభుత్వంము పూర్తిగా ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించడం ఒకవైపు, భూస్వాములు, కర్షకులను, ప్రజలను పీడించడం మరోవైపు, తెల్లవాళ్ళ మతంను ప్రచారం చేసి తమ మతస్థులుగా చేసి వారి బానిసలుగా తీర్చుదిద్దుటకు ఇంకొకవైపు ఇలా ఎటువైపు మార్గాలు ఉంటే అటువైపు దుష్టచర్యలను అమలుపరుచుచున్నారు. వాటిని ఎదుర్కొనుటకు రామరాజు పూనుకున్నారు.

"బాష్టియ" నా ప్రదేశ పరిపాలకుడై సనుదెంచి మార్చె "ఫా
రెష్టు రిజర్వుయాక్టు" వ్యతిరేకులికన్ "దహసీలుదారు" కా
మేష్టికి యజ్ఞ జంతువు, లికే మన వచ్చును పీడిత ప్రజా
కష్ట పరంపరల్ – పనులు కాలెను రాజుల కోప వహ్నికిన్!"[151] అని అంటూ

ఏజన్సీ ప్రాంతమైన గుడెం తహశీల్‌దారుగా ఉన్న బాస్టియన్ అతిక్రూర మనస్తత్వము కలవాడు. ఇతడు అనేక క్రూరమైన పనులతో ప్రజలను పీడించుకుతినేవాడు. అడవి చట్టాన్ని (ఫారెష్టు రిజర్వు యాక్ట్) ప్రవేశపెట్టడం.

అడవి తల్లికి, అడవి బిడ్డలకు అనుబంధం లేకుండా చేయడం, చింతపల్లి రోడ్డు నిర్మాణంలో కూలీలుగా తీసుకువెళ్ళి వారి శ్రమను దోచుకోవడం, వాళ్ళ అమాయకత్వాన్ని గ్రహించి, తెల్లదొరలంటే భయం పుట్టేటట్టు చేశాడు. అతడి రాకతో మన్యం ప్రజలు కష్టాలులో మునిగిపోయారు. దానితో రామరాజులో కోపాగ్ని చెలరేగింది. అంతేకాకుండా

గాంసోదరులు (మల్లుదొర, గంటందొర) మరియు "ఎండుపరాలు" బాస్టయన్ మోసాలకు చనిపోయారు.

"అంతర్యుద్ధము కర్షక ప్రజయందానాడు సంతోషవి
శ్రాంతుల్ బాస్టియ నాది దుష్టుల పిశాచ స్వార్ధభావాల కీ
తంతుల్ రాజు రహస్య విప్లవ నినాద శ్రేణికిన్ వీరవి
క్రాంత క్రీడకు సైన్యసేకరణకున్ గల్పించె నావాసముల్!"[152] అని అంటూ

బ్రిటిష్ వారికి మన్యం ప్రజలకే కాకుండా భారతదేశ ప్రజలకు బ్రిటిష్ ప్రభుత్వంపై ఉన్న వ్యతిరేకతను కవి అంతర్యుద్ధముగా ప్రకటించాడు. శ్రామికులు, కర్షకులు, కూలీలు ప్రజల ఆనంద, అనుబంధాలను తహసీలుదరు బాస్టియన్ దుష్చర్యలతో అక్కడ జనులకు స్వేచ్ఛ స్వాతంత్ర్యాలను పూర్తిగా హరించివేశాడు. నానాకష్టాలకు గురి చేశాడు. అటువంటి దుష్టచర్యలకు బుద్ధి చెప్పుటకు రామరాజు విప్లవ చైతన్యంతో, స్వాతంత్ర్య భావాలతో, త్యాగనీరతతో ఒక సైన్యమును తయారుచేసి వారికి కత్తిసాము, కర్రసాము, మొదలైన పాతవిద్యలతో పాటు, తుపాకిలను గురి చూసి పేల్చడం, యుద్ధ నైపుణ్యత మొదలైన ఆధునిక పరికరాలతో అనేక విధములుగా తర్ఫీదు యిచ్చి విప్లవ సైన్యంను రహస్యంగా తయారుచేసెను.

"గ్రామ పంచాయితీ ప్రచారమ్మొనర్చి
పూని నిర్మించె నామన్యభూమి ఎటుల
నో "సహాయ నిరాకరణోద్యమమ్ము"
తెలుగునాటకు వచ్చినదని తలంచి"[153] అని చెబుతూ

భారతదేశానికి గ్రామాలు పట్టుకొమ్మలని, గ్రామాలు సుభిక్షంగా ఉంటే దేశ అభివృద్ధి చెందినట్టేనని శ్రీరామరాజు. గ్రామ పంచాయితీలను ఏర్పాటు చేసి బ్రిటిష్ వారి కోరుటకు ఎవరు వెళ్ళకుండా, తమ సమస్యల్ని గ్రామాలలో పంచాయితీల ద్వారా పరిష్కరించే మార్గంతో పాటు గ్రామ స్వరాజ్యాన్ని స్థాపించారు. నాగరిక ప్రజలలో గ్రామ పంచాయితీలు ఏర్పాటు చేయడం విశేషమేమీ లేదు. కాని "నాగరిక ప్రపంచం తేనియని, అక్షరజ్ఞానం లేని మన్యంలో గ్రామ పంచాయితీలు ఏర్పాటు చేయడం" సాహస కార్యంగా కవి వర్ణించారు. గ్రంథాలయాలను, పాఠశాలలను నిర్మించడం, అంటరానితనము రూపుమాపడం, మద్యపాన నిషేధం, విదేశీ వస్తు బహిష్కరణ వంటి సహాయ

నిరాకరణోద్యమంలో తెలుగునాట అందులో మన్యం ప్రజలను శ్రీరామరాజు భాగస్వాములను చేసిరి.

"హైందవయోగిగా బ్రజల యందలి తప్పుల జక్కదిద్దజూ,
తుం దెవితోలు వంగడపు దోపిడి కాంద్రకు నోరు లేని వీ
రిందయ మాలి యిచ్చుచు – హరించెడు వారి నుతింపుచుండగా
పందనుగాను నామనసు పట్టున వోయెద నెవ్వరడ్డినన్"[154] అని అంటూ

ఈ కావ్యంలో శ్రీరామరాజును అనేక విధాలుగా వర్ణించారు. ఆధ్యాత్మిక గురువుగా, యోగిగా, లేపస్వీగా, స్వాతంత్ర్య పోరాట యోధుడు, శాంతి కాముకిడిగా, మన్యం ప్రజలలో ఒక దైవ స్వరూపుడుగా ఉంటూ అక్కడి ప్రజలలో ఉన్న తప్పులను, సమస్యలను పరిష్కరించేవారు. తెల్లవాళ్ళు మన్యం ప్రజల శ్రమను, సంపదను, జీవితాలను దోచుకొనేవారు. నోరు లేని అమాయక గిరిజనులు బ్రిటిష్‌వారు పెట్టే బాధలను భరించేవారు. ఆ బాధలను, అవ్యధలను శ్రీరామరాజు మనసుపెట్టి వాటిపై సుదీర్ఘమైన పోరాటానికి సిద్ధపడేను.

మన్యంలో మత ప్రచారంను, మద్యపానంను అనుమతించడం వలన మన్యం ప్రజలు "ప్రభు దాసులు"గా వారి చెప్పు చేతలలో ఉంచుకునేవారు. తెల్లవాళ్ళ ప్రభుత్వంలో మాయాశీలురు, లంచగొండులు, దుర్మార్గులు అయిన ఉద్యోగులు కోయలు, కోందు మొదలైన గిరిజన జాతి జనులకు కన్నీరు పెట్టించేవారు.

శ్రీరామరాజుపై బ్రిటిష్ ప్రభుత్వంనకు అనుమతి వచ్చి...

"పాలకజాతి కింకరుల పాలిటికిన్ యమకింకరుండనన్
హేళన ఎయు రాజుగని యెంతయు జంతనసేసి" చూడగా
బాలుడువీడు పల్కుబడి బల్లెపుబోటిటువంటి వానిపై
జాలివహింపరాదు చెఱసాలకు జేర్పగ రాదికెట్లగున్"[155] అని అంటూ

బ్రిటిష్ సూపరిండెంటు స్టైను, మన్యం మండ అధికారి "ఫజుల్లులా" మన్య మన్య భాగాధికారాలతో రాజును విచారించుటకు నర్సీపట్నం తీసుకువచ్చిరి. విచారణలో, విద్రోహచర్యల ప్రచారం చేస్తున్నావా? త్రాగుడు మన్పించడం ఎందుకు? న్యాయస్థానాలకు వెళ్ళరాదు అని ప్రచారం చేస్తున్నందుకు రామరాజును కఠినంగా చిన్నవయస్సు అని

కూడా చూడకుండా జైలుశిక్ష అమలుపరిచేందుకు ప్రయత్నించిరి. కాని ఇది అంత అనుమానముతో తీసుకువస్తారు.

రాజును నర్సీపట్నం విడచి ఎక్కడికి వెళ్ళరాదు అని పైడపుట్టిలో కొంత భూమిని యిచ్చి వ్యవసాయం చేసుకొని జీవించమని అజ్ఞాపించిరి.

ఫజుల్లులా రామరాజుకు సహకారము చేస్తూ...

"రాజు మంతనమున బహిరంగవిప్ల
వప్రచారము వలదన్న వాదము విని
ఫజులులా తోడి రాజ సేవకుల కనులు
మూసినాడిట్లు రాజునామోదమంది"[156]

పై పద్యములో ఫజుల్లులా రాజు ఇక నుండి బహిరంగమైన ప్రజలలో విప్లవ ప్రచారకులు, ప్రభుత్వ వ్యతిరేక నినాదములు చేయకుండా ఉండాలి అని చెప్పి. తోటి బ్రిటిష్ అధికారులను, ప్రభుత్వ సేవకులను కన్ను కప్పినట్లు రాజుతో ఆమోదము తెలిపించినాడు.

కాని రామరాజు మనస్సు స్వాతంత్ర్య కాంక్షపై విప్లవ బాటలో ఉన్నట్లు ఈ పద్యం చెబుతుంది...

మీరలు మారణాయుధ సమీకరణ స్మృతిలేక బాణతూ
ణీర కృపాణ కౌశలము నేర్చినచో సరికాదు – విప్లవా
ధారము శక్తిమంతమగు తంత్రము, దానికితోడు శస్త్రలి
స్తారత సైన్య సంపదలు సర్వము బిమ్మిటివే తలంపగన్"[157]

మన్యంలో సైన్యంను ఉద్దేశించి కత్తి, కొడవలి, సుత్తి, కర్ర మొదలైన ఆయుధములతో బాణముతో మన యుద్ధ ప్రవిణ్యమును, పాత నైపుణ్యతను చూపితే సరిపోదు. శత్రువు బలవంతుడైన వారు, వాడి దగ్గర ఆధునిక యుద్ధ పరికరాలు ఉన్నాయి. దానిని మనము సంపాదించాలి. విప్లవ సైన్యమును నడిపించుకు యుద్ధ తంత్రములు, దానికి తోడుగా ఆధునిక యుద్ధ సైన్య పరికరములు మరియు మంచి వీరోచితమైన యువకులతో నిండిన సైన్య సంపద మొదలైనవి సమకూర్చుటకు శ్రీరామరాజు తలచినాడు.

రామరాజు వ్యవసాయం చేసుకంటున్నట్టు, తన జీవితానికి ఆద్యాత్మికమైనదని. కవి బ్రిటిష్ వారిని నమ్మించినట్టు, దానికి ఫజుల్లులా సహకరించిన విధానం కవి వర్ణించారు.

"ఈ అరాజకభూమిలో నెంతయోగి
పుంగవులకైన భీతి కల్గంగవచ్చు
దైవచింతన మాని బాధలు పడంగ
నేల? "నేపాలు" వోదు నాకేమివలదు"[158]

అని బ్రిటిష్ దొరలకు తెలిపినట్లు ఈ బానిస భూమిలో ఎంతటివారైన, యోగి, ఋషులైన బ్రతకడానికి భయం కలుగుతుంది. ఆధ్యాత్మిక కార్యక్రమములు, తపస్సు, యోగ ప్రక్రియలు మానివేసి, ఈ బానిస బ్రతుకులు, బానిస బాధలు పడుట నాకెందుకు? నేను "నేపాలు" హృషికేష్, బదరీనాద్ వంటి పుణ్యక్షేత్రాలకు వెళ్ళిపోదునని బ్రిటిష్ దొరలకు తెలియపరిచాడు.

కాని యిందులో మర్మం యుద్ధం నైపుణ్యత, గెరిల్లా యుద్ధ విన్యాసాలు, ఆధునిక పరికరాల వినియోగం, భారతీయ స్వాతంత్ర్య పోరాట వివరణలు తెలుసుకొనుటకు రామరాజు చేసిన మరొక తంత్రం.

రామరాజు ఉత్తర భారతదేశ యాత్ర వెళ్ళుట వలన, నాయకుడు లేరు. కాబట్టి బాస్టియన్ మన్యం ప్రజలను మరింత భయభ్రాంతులను చేసినాడు. "విభజించు–పాలించు" అన్న తెల్లవాళ్ళ సూక్తికి ఆ పద్యం...

"సవరనులు" 'ఖాండు' లని కోయ జాతియందు
రెండు తెగలుండె; ఉభయు లుద్దండులే! ప్ర
భుత్వ భేదనోపాయ విస్ఫూర్తి వీరి
జీల దీయుటలో ముందు కాలువెట్టె!"[159]

మన్యంలో అనేక జాతుల జనులు నివసిస్తూ ఉండేవారు. వారిలో ఎటువంటి భేదభావాలు లేకుండా అడవి తల్లి బిడ్డలుగా జీవించేవారు. ఆ జాతులలో రెండు తెగలవాళ్ళు "సవరులు, ఖాండులు" వీరు మహా భుజశాలీలు. ధైర్యవంతులు. వీరోచితముగా పోరాడేవారు. అటువంటి వీరి తెగలలో భేద అభిప్రాయాలు, విరోధములు సృష్టించి,

వారి మధ్య తగాదాలు పెట్టి వారిని విడదీయుటకు ముందుగా ప్రణాళిక వేసుకున్నారు బ్రిటిష్‌వారు.

"విసగి వేసారి దారిద్ర్యవిధికి బాష్టి
యను దురాచార దుష్ప్రవర్తనలు తోడు
గాగ నాకలి మంటల కాగ లేక
సమ్మెచేసెను శ్రామికజాతి యెల్ల"[160]

బ్రిటిష్ ప్రభుత్వముపై విసిగిపోయి, బాస్టియన్ దుష్ట చర్యలకు నలిగిపోయి తమ రాజ్యాభుదయానికి ముఠాదార్లు, మునసబులు, ప్రజలు, అందరు కూడా ముక్తకంఠంతో మహావిప్లవ చైతన్యంతో అసలే పేదరికపు బ్రతుకులతో జీవితాన్ని సాగిస్తున్న ఆ గిరిజనులకు బ్రిటిష్ వారి చిత్రహింసలుతో పాటు ఆకలి బాధలతో పుట్టుకొచ్చింది విప్లవం... మహా విప్లవం... సామాన్య ప్రజలు, శ్రామికులు, కర్షకులు, అందరు కూడా సమ్మెకు పిలుపునిచ్చారు అనగా తెల్లవాళ్ళు ప్రభుత్వంపై తిరుగుబాటు ప్రారంభమైంది అని కవి భావన.

అందులో బాష్టియన్ కోప ఉద్రేకుడై...

"చేయునది వేఱులేక బాష్టియను మిగుల
నీసు వహియించి తెచ్చె "పోలీసు" దళము,
ప్రాణభంగ భయమ్మును లేనికూలి
వారిసమ్మె భగ్నము చేయవచ్చు నేమి?"[161] అని అంటూ

సమ్మె చేసే ప్రజలను ఏదో విధంగా తమ వైపు తిప్పుకోవడానికి, వారిని భయపెట్టి పోలీసు దళములతో అనేక విధములైన చిత్రహింసలు చేయించి అక్కడ ప్రజలకు ప్రశాంతత లేకుండా, వారిని లొంగదీసుకోవడానికి ఎన్నో అకృత్యపు పనులు పోలీసుచే చేయించాడు. ఆ విధంగా చేస్తే సమ్మె విరమించి తన దారికి వస్తారని బాష్టియన్ ఆలోచనతో ఉన్నాడు.

అంతేకాకుండా బాష్టియన్‌కు తోడుగా సంతానపిళ్ళై అనే గుమాస్త చేత చెప్పించి సంభాషణ అక్కడ ప్రజలను ఎంత అరాచకమైన నీచమైన మాటలతో హింసించేవారు దుష్ట చర్యలకు ఉదాహరణలు...

"పోలీసుం" బిలిపించి వారలను తాపుల్‌దన్ని బంధించి" కూ
లీ లేపాటి సుగమ్ము లిచ్చెదరు మేలే సమ్మెసేయంగా మీ

కేలా యిట్టి దరిద్రబాధ లిక నన్నే కోరి నా తోడ గే
ళీలోలాత్మలు కందు లేనియెడలన్ లేకుండు బ్రాణమ్ములన్"[162] అని

మన్యంలో స్త్రీలను, చిన్న పిల్లలను, నోరు లేని జీవులను ఎంతో హింసం పెట్టేవారు. పోలీసుల చేత స్త్రీలను ఎక్కడ పడితే అక్కడ కొట్టించడం మరియు మానసికమైన హింసలు చేస్తూ మీవాళ్ళు మీ ఏమి ...... ఇవ్వగలరు అనే సూటిపోటి మాటలతో మరియు సమ్మె విరమించండి. మీ ఆకలి బాధ పోతుంది.

నను, నా అల్లరి చేష్టలను కోరుకోండి. నాతో సరదాలు, పరోక్షంగా శారీరక సంబంధాలు పెట్టుకోమని లేకపోతే మీ ప్రాణాలు, మీ పిల్లల ప్రాణాలు మన్యంలో ఎవరి ప్రాణాలు ఉండవని సంతాన పిళ్ళై హెచ్చరించాడు.

"అని దుర్వాక్యములాడ దుస్సహ భయాయాసమ్ముతో కాంతలా
తని దూషింపగ దుష్టకర్ము డతడంతన్ కూడి పోలీసు 'పే
రెను బోతుంగమితో, వివస్త్రలనానర్చెన్, మర్మభాగమ్ములం
దున చెల్లెన్ గటువస్తువుల్ హృదయసంధుల్ తూలదన్నెందుదన్"[163]

పై పద్యంలో ఎంతటి ఘోర కృతమో మనకు అర్థమౌతుంది. సంతాన పిళ్ళై ఎంత భయపెట్టిన భయం లేకుండా, వారు మాట్లాడిన ఆ మాటలకు వెంటనే అక్కడ స్త్రీలు అతనిపై తిరుగుబాటు చేసిరి. వెంటనే వాడు పోలీసులతో కలిసి స్త్రీలపై అత్యాచారం చేసి వారి అవయవములను విరిచి, స్త్రీలను వివస్త్రగా చేసి, వారి శరీరంపై కారం పూయించేవాడు. అసలే ఆడవారు వారి శరీరం సున్నితమైన వాటిపై .... భయంకరమైన పదార్థాలను వేయించేవాడు. వారి దుష్టచర్యలు పరాకాష్ఠ చేరుకున్నాయి.

"మన్యంలో స్త్రీకి జరిగిన అవమానాన్ని కవి భారతమాతకు జరిగిన అవమానం వర్ణించడం" గొప్ప సాహసం. రామరాజు సైన్యం సిద్ధం చేసి కాళిమాతకు శంభినాధాలతో, గంభీరమైన వాద్యడప్పులతో పూజ ప్రారంభించిన విధానం...

"రక్త చందన ధారులా ముక్త సకల
మారణాయుధుల్ జాజ్వల్యమాన నేత్ర
విస్ఫులింగ ప్రకార గంభేరు లైన
వన్యసైనికు లారాత్రి వనము గడిచి"[164]

సైన్యంలో ప్రతి ఒక్కరు తమ ప్రాణాలను లెక్క చేయండి. తుది వరకు రక్తపు బొట్టు చిందించి ఈ మహా విప్లవ సైన్యంకు మారణాయుధాలు చేత కాళీ పూజ చేయించి ఆయుధాలకు అమ్మవారి అనుగ్రహం కలిగే చెట్టుకు పూజ చేసి ఆరాత్రి సైన్యం అక్కడే విశ్రాంతి తీసుకొని యుద్ధానికి సంసిద్ధంగా ఉన్నారు.

మన్యంలో ఎన్నడు లేని విధంగా ఆ శబ్ధాలు, ఆ నినాదాలు, ఆ ఆవేశాలు, ఆ విప్లవ శంఖానాదాలు అన్ని బ్రిటిష్ సైన్యానికి, అధికారులకు దడ పుట్టించాయి. బ్రిటిష్ వాళ్ళ నాశనమును కోరుకోవడమే మన్య విప్లవ ప్రథమ లక్ష్యంగా రామరాజు చెప్పారు.

"జేయని బొబ్బరిల్లు తనసేనల రాజుమరల్చె "చింతప
ల్లీయుల" రక్షణార్ధము, పోలీసులు గుండెలు బీటవారనా
కోయలు మారణాస్త్రముల గుప్పలు నోసిరి దోచి వెంటనే
పోయెను దండులా గహన భూములకున్ దెలవారు నంతలో"[165]

సైన్యంనకు శ్రీరామరాజు యిచ్చిన యుద్ధ నైపుణ్యత ఈ పద్యంలో కనిపిస్తుంది. మన్యం విప్లవంలో మొదటగా చింతపల్లి పోలీసుస్టేషన్‌పై దాడి చేసిరి. చింతపల్లి ప్రజల క్షేమం గురించి అక్కడ పీడించే పోలీసు అధికారులపై రామరాజు మొదటి అస్త్రమును ప్రయోగించాడు. కొంపలు, కొండ దొరల బాణాలు ప్రయోగముతో కర్రలతో, కత్తులతో, పోలీసులను హడలెత్తించి అందులో ఆధునిక తుపాకులను తీసుకొనిపోయిరి.

ఆ విప్లవ సైన్యాలు మరునాడు కృష్ణదేవి పేట పోలీసుస్టేషన్‌పై దాడి చేసిరి. ఆ స్టేషన్‌లో ద్వారబంధాల చంద్రయ్య మరియు లాగరాయి పితూరికి సంబంధించిన వీరయ్యరెడ్డి, మొదలైన వారి జైలు నుండి విడిపించి విప్లవ చైతన్యమును మరింత బలం చేశాను. ఆ తరువాత రాజవొమ్మంగి పోలీసు స్టేషనుపై దాడి చేసి తుపాకి, గుళ్ళు, ఆధునిక యుద్ధ సామగ్రిని తీసుకొని స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా చీటి రాసి విప్లవ సైన్యం పేరు వ్రాసి ధైర్యంతో మూడు విజయాలను సొంతం చేసుకున్నారు.

"తమమున్ముందట భారతీయ రణవిద్యావంతుల న్నిల్పి స్వీ
య మహావీరులు చాటుచాటులను వృక్షాగ్రమ్ములన్ దాగి శౌ
ర్యముతో "బారు ఫిరంగి" గుండులమహాస్త్రముల్ ప్రసాదించి రా
జ్యము సంపాదితమన్న మేలుబిరుదం బందెన్ ప్రభు ప్రౌఢిమల్"[166]

భారత మాత ముద్దు బిడ్డలు ఎందరో మహా విద్యావంతులు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని శాంతి సాపర్యలు బాట ఒక వైపు విప్లవ బాటలో నడిచిన మహావీరులు మరొకవైపు. పోరాడుతూ బారు పిరంగులు, గుళ్ళ తుపాకులు వంటి వాటితో మహా భీకరమైన పోరాటాల ద్వారా భారతజాతికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రసాదించాలో రాజ్యాధికారము నుండి బ్రిటిష్ వారి తరిమి కొట్టాలను ఉద్దేశ్యంతో పోలీసుల స్టేషన్‌లను దోచుకునేవారు.

ఈ కావ్యంలో ఆంగ్ల విద్య గూర్చి కవి వివరిస్తూ...

"ఆంగ్ల మభ్యసనీయమైన ఆర్షజాతి
భాషలకు దైన్యగతి వచ్చె ప్రభుల వలన
స్వీయగౌరవ వైభవ శ్రీలు లేని
భారతీయులు ప్రభుదాస్య పరులు నేడు!"[167]

ఆంగ్లేయులు తమ పరిపాలన కొరకు భారతీయ సంపద దోచుకోవడం కొరకు ప్రజలను నానా హింస పెట్టుటకు తమ ఆదీనంలో భారతీయులకు గుమస్తా ఉద్యోగాలు యిచ్చుటకు ఆంగ్లభాషను పెంచి పోషించిరి. ఆంగ్లభాషను పోషించడం వల్ల ద్రావిడ భాషలను దీనస్థితి కలిగినదని కవి ఆవేదన వెలిబుచ్చాడు. ఆంగ్ల విద్య నేర్చుకోవడం బ్రిటిష్ ప్రభువులకు దాస్యులుగా, బానిసలుగా వారి చెప్పుచేతలలో ఉన్నారు. ఇతర భాషల మనుగడ, ఎక్కడ కనిపించకుండా మాతృభాషలు, భారతీయుల భాషలకు గౌరవం లేకుండా పోయిందని కవి విచారించాడు.

ఆంగ్లేయులు భారత ప్రజలను తమవైపు తిప్పుకునే మార్గంను కవి ఈ విధంగా సూచించాడు...

"జనులెల్లందన క్రీస్తుమార్గము; మోక్షప్రాప్తి జెందన్ వలెన్
తనకున్ దాస్యము సేయుచున్ ధనము ధాన్యంబిచ్చిసేవించి కో
రినచో బ్రాణములైన నీయవలె దారిద్ర్యంబులోనున్న దీ
రని తద్దాహము తీర్పగా వలయు సామ్రాజ్యప్రజాసర్వముల్"[168]

మన్యంలో ఉన్న ప్రజలందరు క్రైస్తవ మతమును ఆశ్రయించినచో మీకు సర్వ శుభములు కలుగునని, ఆంగ్లేయులకు సేవచేస్తే మీకు అన్ని సౌకర్యాలను సమకూరుస్తామని, లేదంటే ప్రాణములను తీయుటకు కూడా వెనుకాడరు. మన్యం ప్రజల ఆకలికేకలను,

పేదరికమును చూచి మీరు అన్ని విధములుగా మేము ప్రోత్సహిస్తామని మన్యం ప్రజలకు బ్రిటిష్ ప్రభుత్వం చెప్పింది.

ఎన్ని విధాల ప్రజలను కష్టపెట్టిన, వారికి ఆశలు చూపిన ఎవరు ఉద్యమాన్ని విడిపోలేదు సరికదా! రామరాజు సైన్యం ధైర్యంగా మిరపకాయ టపాలతో ముందు సమాచారం గూర్చి కవి ఇలా...

"అదను దలంచి విప్లవ మహా దళనాధుడు రామరాజు త
త్కదన విలగ్నులన్ "మిరపకాయ టపా" గల బాణ వృష్టులన్
సెదురగ నేసి సైనికులు బేరి యెదుర్ప దలంచు నంతలో
పాదవికొనెన్ తదాయుధ విభూతిని భోజన భాజనమ్ములన్"[169]

మన్యం వీరుల గుండె ధైర్యం మిరపకాయ టపాతోనే వ్యక్తమౌతుంది. ముందుగా తన అనుచరులతో కూడిన రామరాజు తాము ముట్టడించవలసిన స్టేషన్‌లకు ముందుగానే సమాచారం అందించి తాము దాడి చేయబోయే సమయం వివరంగా రాసి మరీ పంపేవారు. భారతీయ స్వాతంత్ర్య పోరాటంలో బ్రిటిష్ వారికి తెలయపరిచి ఉద్యమాన్ని, దాడి చేయబోయే విధానాన్ని తెలియపరిచి దాడి చేయడం బహుశా దేశంలో ఇదే మొట్టమొదటి సాహసంగా చెప్పవచ్చు. దాడి చేస్తున్న సమయంలో మన్యం వీరులు సాహసోపేత యుద్ధ నైపుణ్యతను ప్రదర్శించి బ్రిటిష్ వారికి కళ్ళ మీద కునుకు లేకుండా చేసారు.

"లావుంజూపిరి కోయదొరలు 'గెరిల్లాదాడిలో' హుణులో
చావుందప్పి తొలంగిపోయి రఖిలాస్త్రంబుల్ ప్రజాసైనిక
ప్రావీణ్యమ్మున నేతజిక్కినవి ధర్మమున్నచో దైవర
క్షాతివి స్తారత యుండదా? ప్రజలలో శక్త్యుక్తులే యుండవా?"[170]

బ్రిటిష్ వారి సైన్యముతో చిన్న చిన్న పోరాట యోధులు, పితూరీలు చేసారు. కాని శ్రీరామరాజు అంతగా పోరాటం చేయలేకపోయారు. రామరాజు మన్యం ప్రజలందరిని వీర సైనికులుగా తీర్చిదిద్ది 'గెరిల్లా' అనే యుద్ధ నైపుణ్యతతో బ్రిటిష్ సైన్యంను ఎదుర్కొని విజయం సాధించారు. ఆయన ఈ విజయం ప్రజల విజయంగా, దర్మమార్గంలో భారతమాతను విడిపించాలనే సంకల్పంతో ప్రజల వక్తులను, సైనిక యుక్తులను గమనించి పోరాటం సాగించారు.

మన్యంలో విప్లవ తిరుగుబాటును అణచలేక బ్రిటిష్ వారు కొంత మందిని యుద్ధ నైపుణ్యత కలిగిన ఆంగ్లేయులను రప్పించినప్పుడు...

"స్పాటు కవర్డు" "హైటరులు" సర్వసమర్థు లరణ్యయుద్ధమం
దోటమి లేని వారని యెవో కడుపెద్దలు సేసి "కేంద్ర" మా
పోటవిజంట బొమ్మలిన పొంపిరివోయిన నిగ్గుతో వదే
పాటున వారలున్ "దమనపల్లి"కి చేరిరి మూడు నాళ్ళలో"[171]

ఏ రోజుకారోజు సమాచారం, యుద్ధ ప్రావీణ్యులను రప్పించి రామరాజు ఉద్యమాన్ని ఆపుటకు ప్రయత్నించిరి. కాని వారు కేంద్రం నుండి వచ్చిన బృందం దమనపల్లి గ్రామంలో మూడు రోజు నుండి రామరాజు సైనికులను, వారి సమాచారాన్ని తెలుసుకొనుటకు ఏర్పట్లు చేసిరి. కాని (గ్రామ దళమ్ము) గంటందొర, మల్లుదొర బృందం వీరు అక్కడ యుద్ధ ప్రణాళికలను వేసి అడవి మధ్యలోనే తుపాకి గుళ్ళతో, యుద్ధ తంత్రాలతో గ్రామ దళము వారు వారి ఇద్దరిని భూమిపై దొర్లించి హతమార్చిరి. వారి సమాధులు ఈనాటికి నర్సీపట్నంలో ఉన్నాయి.

"చేతంజిక్కిన శత్రుజాతుల "శివాజీ" చించి చెండాడినన్
లాతంజూచిన చంపమానని "మహారాణా ప్రతాప్ సింగు" వి
ఖ్యాతిన్ గాదన లేని భారత రణవ్యాపార పారీణతా
జీతానందము బూదిలోగలిసె రాజా! నేడు నీ పట్టునన్"[172]

శ్రీ రామరాజుకు శివాజీ వంటి  పౌరుషనితో కూడి దేశభక్తి ఉంది. రాణా ప్రతాప్ సింగ్ వంటి ధైర్యసాహసాలు ఉన్నాయి. శత్రువుల వ్యూహాల్ని, రహస్యాలను విభేదించడం తెలుసు, వీరోచితమైన పోరాట యోదుల కీర్తి, వారి ఆదర్శమార్గాలను అనుసరించడం, భారత యుద్ధ నిపుణతలను వీరుల యుద్ధ ధర్మాలను పాటించడమే కాకుండా, కౌటిల్యుడిని ధర్మశాస్త్రములో ధర్మనియమాలను గీతాపారాయణంలో సమస్త జ్ఞానాన్ని సైనికులకు, అక్కడ ప్రజలకు  ఎల్లప్పుడు బోధిస్తున్నాడు రామరాజు.

కవి ఈ విభాగంలో రామరాజును జాతీయ స్వాతంత్ర్య సమరయోధులు శివాజీ, ప్రతాప్‌సింగ్, బోస్, అజాద్ వంటి మహావీరుల కోవకు చెందినవారుగా వర్ణించడం కవి గొప్పతనం. రామరాజును జాతీయ స్వాతంత్ర్యోద్యమ నాయకుడు కీర్తించడం విశేషం.

రామరాజు అక్కడ ప్రజలకు ఎటువంటి విధంగా చైతన్యం నేర్పాడో పరిశీలిద్దాం.

"రాజు తెల్పిన యుద్ధశాస్త్ర ప్రవృత్తి
ఆర్య కౌటిల్యు నర్ధ శాస్త్రాభియుక్తి
నేర్చికూలంకష జ్ఞాన మేర్చియుంట
కోమిదళమప్ప దరినున్న కొండనెక్క"**173**

శ్రీరామరాజు మన్యంలోని వారికి యుద్ధ శాస్త్రములోని మర్మాలు. కోయదళాలకు యుద్ధంలో గెరిల్లా పద్ధతి, తుపాకి గుళ్ళు కాల్చడం, ఆధునిక, ప్రోటీన్ పద్ధతులలో వీరిని యుద్ధ నైపుణ్యంగా తీర్చిదిద్దారు. అంతేకాకుండా కౌటిల్యుని అర్ధశాస్త్రములోని నీతిని, నియమాలను భగవద్గీతలోని ధర్మ శాస్త్ర నిపుణతను, ఆధ్యాత్మికమైన కాళికాదేవి పూజా మొదలైన జ్ఞాన సంపదను, భక్తి వైరాగ్యాలను, యుద్ధ నైపుణ్యాన్ని ధర్మ నిపుణత అన్న విషయాలను యుద్ధ వీరులకు నేర్పించి, స్వాతంత్ర్య దీక్షను సాగించారు రామరాజు.

ఇంతటి మహత్ స్వాతంత్ర్యా దీక్ష చేస్తున్న రామరాజును కాంగ్రెసు పెద్దలు ఏవిధంగా విమర్శించారో కవి వివరించారు...

"ఎవరికి గౌరవంబు ఘటియించుట వీరకులైక ధర్మమే
మదమున గన్నుమిన్ను వణుమాత్రము కానని దుష్టకర్ములన్
పొదిగొనివారి జిత్రవధనో మఱియేరియొ సేయ బోలదా?
ఇది విని 'బందిపోటు' లను హీనుల నేమనవచ్చు లోకమా?"**174**

రామరాజు ఈ విధంగా చిత్రీకరించడం విచారకరం. వీరులకు వీరమరణం వస్తుంది. రామరాజు మహావీరుడు. బందిపోటు అయితే అక్కడ ప్రజల సంపదలను, అడవి ఉత్పత్తులను కూడబెట్టుకొనేవారు కాని ప్రభుత్వం యిచ్చిన స్థలాన్ని, కుటుంబాన్ని, జీవితాన్ని, జీవనాన్ని అన్నింటిని భారతమాతకు అర్పించిన మహాధీరుడు. గాంధీ అంటే రాజుకు ఎంతో అభిమానం, గౌరవం. మద్యపానం మాన్పించడం, కోర్టుల బహిష్కరణ, పంచాయితీల నిర్వహణకు గట్టి కృషి చేశాడు. గాంధీగారి నిర్మాణ కార్యక్రమాన్ని గాంధీ భక్తుల కంటే గొప్పగా ఆచరణలో పెట్టిన వాడినా, మనవాళ్ళు బందిపోటుగా చిత్రీకరించడం విచారించదగ్గ విషయం. రామరాజుకి రావలసిన కీర్తిని జాతీయస్థాయి గుర్తింపును అడ్డుకున్నారు అని కవి లోకాన్ని ప్రశ్నిస్తున్నాడు.

మన్యం వీరుల త్యాగం గుర్తించకపోయినా పర్వాలేదు. వారిని వారి నాయకుడిని దోపిడి దొంగలుగా చెప్పడం విడ్డూరంగా ఉంది అని కవి....

"ధర్మ పథమ్ము దప్పక యదార్థముగా కదనమ్ము సల్పు స
త్కర్ములు కోయలో సితముఖ ప్రభుదాసులొ తేలిపోయెనే
నిర్మల తచ్చరిత్రముగణింపక "దోపిడి దొంగ" లన్నదు
ష్కర్ముల నేమి సేయవలె సజ్జము లేనియు నిర్ణయింపదా?"175

రామరాజు పోలీసుస్టేషన్లను దోచుకుని తుపాకులను, తూటాలను తీసుకుపోవుట తప్ప, ఏ ఇతర సంపదలను దోచుకోలేదు. ఆయనకి పదవి కాంక్ష లేదు. పోలీసుస్టేషనులో పేల్చో, బాంబులు వేసి విచక్షణా రహితంగా ప్రవర్తించలేదు. రాజరికంతో ముందుగా తెలియపరిచి స్వాతంత్ర్య ఉద్యమంలో భాగంగా చెప్పి మరి చేసేవాడు.

చేతిలో ఆయుధం ఉంది గదా అని ఎలా పడితే అలా ప్రవర్తించలేదు. అల్లూరి సేనకు కట్టుబాట్లు గట్టిగా ఉండేవి. అవసరమైతే తెల్లవాళ్ళను చంపవచ్చు. హింసించవచ్చు. కాని భారతీయ ఉద్యోగుల జోలికి మాత్రం పోకూడదు. ప్రజలను బాధింపకూడదు. అన్ని నియమాలతో ఉండే స్వాతంత్ర్య వీరుని దోపిడి దొంగగా సూచించడం కవి మానసికంగా బాధను వ్యక్తం చేస్తున్నాడు. ఈ విషయాన్ని మంచివారికి విడిచిపెట్టుచున్నాడు.

గాం సోదరులలో మల్లుదొర గూఢచారులకు దొరికిపోయిన వైనం...

"మల్లుడు యుద్ధమల్లుడని మానవకాయక సేవకాధము
డొల్లడు వాడు జీవములనుండుట; మూడుదినాలక్రిందటన్
కల్లును ద్రావినాడని పొకాల్మనె రాజు – అది కారణంబుగా
మెల్లన లోవునాతని సమీపము జేరిరి గూఢచారిణుల్"176

మల్లుదొర మంచి యుద్ధ నిపుణుడు. ధనుర్విద్య, గుర్రపు స్వారీ, తుపాకి కాల్చటంలో రామరాజు వద్ద తర్ఫీదు పొంది మంచి విప్లవ సైనికుడుగా మన్ననలు పొందాడు. కాని మద్యపానం, వ్యభిచారానికి లోనై పూర్తిగా ఉద్యమానికి ద్రోహం చేశాడు. తప్పతాగి ఉన్న మల్లుదొరను గూఢాచారులు అనుసరించి మూడు రోజుల నుండి త్రాగుతూ తన ప్రేయసి ఇంట్లో బ్రిటిష్ అధికారులకు దొరికిపోయి విప్లవ సైన్యం సమాచారాన్ని, అనుచరుల యొక్క గుట్టును చెప్పుకొని బ్రిటిష్ వారికి దొరికిపోయాడు.

అగ్గిరాజు కూడా బ్రిటిష్ అధికారులతో సమరం చేసి, అలసి పోయి, తన ప్రాణాలను విడిచి విధానం...

"పగర గుండియల్ చీల్చిన పందెకాడు
ప్రజలకై పోరుసల్పిన పరమయొద్ద
పాడు బావిలో దుమికి కోల్పడగ వచ్చె
నక్కటా! అగ్గిరా జనుట్టి బిరుదు"[177]

అస్సాం రైఫిల్స్ దళానికి అగ్గిరాజు అంటే భయం. దూకుడు స్వభావం కలిగినవాడు. బ్రిటిష్ సైన్యంతో పోరాడి, స్వాతంత్రం గూర్చి, ప్రజల గూర్చి యుద్ధం చేసి, బ్రిటిష్ వారి చేతిలో మరణించడం యిష్టం లేక, తమకు తానుగా బావిలో పడి మరణించాడు. కాని అతని సాహసం గొప్పది. విప్లవానికి ద్రోహం చేసిన వాళ్ళ బ్రిటిష్ ప్రభుత్వ సైనికులైనా, మన్యం ప్రజలైనా ఒక్కటే అని గ్రహించిన కల్లకపటం లేని నిస్వార్ధమైన దేశభక్తుడు.

ఒక్కొక్కరు విప్లవ వీరులు బ్రిటిష్‌వాళ్ళకు పట్టుబడుట వలన పెదగడ్డపాలెంలో స్వీనీ అనే ఆంగ్ల అధికారి సైనిక దళంతో విప్లవకారులను పట్టుకునేందుకు బయల్దేరారు ఆ యుద్ధంలో రామరాజుకు చాలా నష్టం చేకూర్చినది. ఎనిమిది మంది విప్లవకారులు ప్రాణం విడవగా, నలుగురు బందీలుగా దొరికారు. చాలా మంది గాయపడ్డారు.

"పూచిన తమ్మివంటి తమపూర్వ దళమ్ములు రాలగా ప్రభు
త్వాచరణమ్ములు గఠిన వత్తమమై దిగ మ్రింగు చుండగా
నేచిన శోక నమ్రుల కాకింత సహాపాము సేయలని ఆం
ధ్రీ చరణాలపై బరిహరించిరి కోయలు విప్లవ క్రియల్"[178]

విప్లవ సైన్యంను బ్రిటిష్ వారు కఠినమైన అస్సాం సైన్యంతో అణచివేత చేసిరి. విప్లవకారులను పట్టుకుంటే బహుమతులు అని శాసనం చేసిరి. తెల్లవాళ్ళు చెలరేగిపోయి పితూరిని తగ్గించేటట్టు చేస్తే ఆంధ్రులు అయిన కొందరు ఈ పితూరి చూచి నవ్వసాగేరు. కొందరు బందిపోట్లుకి దోపిడిదారులుగా చిత్రీకరించి అపహాస్యం చేసిరి. బ్రిటిష్ వారు చేసిన ద్రోహం కంటే మన వాళ్ళే ఎటువంటి సహాయసహకారాలు అందించడం పోయి అనరాని మాటలతో చిత్రవధ చేశారని కవి వివరించాడు.

రామరాజును పట్టుకొనుట అనేక మార్గాలుగా బ్రిటిష్ ప్రభుత్వ ప్రజలను

చిత్రహింసలకు గురి చేసిన సందర్భంలో

"ఎవరికై రక్తబలినిచ్చి అంతమంది
వారు వలదన్న రక్షణోపాయమేల?
మాతృరక్షణ మఱచిన జాలికొఱకు
ప్రాణబలు లేలకని విప్లవమును మాని"[179]

రామరాజు కొరకు ఎందరో రక్తంతో తమ ప్రాణాలని త్యాగం చేశారో, వారి త్యాగ ఫలితము, మిగిలిన వారికి రక్షణ కల్పించాలని, భారత మాత దాస్యశృంఖను విడిచి తనకంట ముందు ఉన్న మన్యం ప్రజల సుఖం కొరకు, క్షేమం కొరకు వారిని మరింత హింసిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వానికి లొంగిపోయి విప్లవమును విరమించుటకు నిశ్చయించుకొనెను రామరాజు. అనేక మంది విప్లవ కారులు మరణించడం గాయపడ్డం, బందీలుగా చిక్కడంతో విప్లవ పురోగతి మందగించినది. దానికితోడు ఆయుధ కొరత ఏర్పడింది. వీటన్నింటి కంటే మన్యం ప్రజలుపడే నరకయాతనలు వర్ణనాతీము రామరాజుకి ప్రభుత్వ సైన్యాలు తమను పెట్టే బాధలు చెప్పి చెప్పి రోదించారు.

తను ఏ ప్రజలను తన బిడ్డలుగా భావించి వాళ్ళ స్వేచ్ఛ స్వాతంత్ర్యాల కోసం భారతదేశ విముక్తి కోసం ఎవరి ప్రోత్సాహమూ, ఏ రాజకీయ పార్టీ అండ లేకుండానే చేతికందిన వస్తువే ఆయుధంగా చేసి విప్లవోద్యమం నడిపితే, ఆ ఉద్యమాన్ని ఎదురు తిరిగి తన రాళ్ళనే కబళిస్తుంటే తన కర్తవ్యం ఏమిటి? బ్రిటిష్ సైన్యానికి లొంగిపోవడం తన ముందు ఉన్న మార్గంగా భావించాడు.

రామరాజు మంప సమీపములో మలబారు సైనికులు దగ్గరకు వెళ్ళి స్వచ్ఛందంగా లొంగిపోయాడు.

"సచ్ఛాత్రులైన కోయలు
"స్వచ్ఛంద్ర మరణము" బొందసాగిరి; మఱునా
డిచ్ఛామరణ వ్రతుడై
స్వచ్ఛగతిన్ రాజు "మంప" వద్దకు వోయెన్"[180]

స్వచ్ఛమైన, నిర్మలమైన మనస్సు కలిగిన గిరిజనులు భారతమాతకు తమ జీవితాల స్వచ్ఛందంగా అర్పించారు. వారి కోసమే ఈ పోరాటం, వారి జీవితాల కొరకే ఈ

మహావిప్లవం, అలాంటి వాళ్ళే మరణిస్తూంటే ఇక లాభం లేదని మరునాడు ఉదయం సూర్యోదయం నమస్కారం చేసి స్వచ్ఛందంగా రామరాజు రంప సమీప ప్రాంతంలో లొంగిపోయారు.

"తనకాగర్భవిరోధి సిక్కెనను ఉత్సాహమ్ముతో విఙ్ఞవీ
గిన "సార్జెంటు గుడాలు" రాజునెక సక్కెమ్ముల్ కదుంబల్కి చె
ట్టునకున్ గట్టి పరాభవించె మృతనష్టుల్ కీకటుల్; కానిచో
దన శత్రుండగు గాక నిట్లతని ధూర్లక్రీడ వేధింతురా?" 181

ఈ ఒక్క పద్యములోని గూడాల్ సంతోషాన్ని, రాజు న్యాయమైన మనసులో మాట అంతర్భగంగా కవి వినిపిస్తున్నాడు. తన ప్రతాపాలతో, సాహసాలతో బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని దాదాపు రెండు సంవత్సరాల నిద్రపోనివ్వకుండా అల్లాడించిన రామరాజు, బ్రిటిష్ వాళ్ళకి ఆగర్భ శత్రువుగా ఉన్న రామరాజును చూచి విర్రవీగే ఆనందంతో ఉన్న సమయంలో రామరాజు శాంతంతో గుడాల్! నువ్వు స్వతంత్రంగా నాకు మరణ దండన విధించడానికి నీకు హక్కు ఎక్కడిది? నేను నీకు స్వచ్ఛందంగా లొంగిపోయాను. నన్ను నీవు కోర్టులో హాజరు పెట్టాలి అది నీ బాధ్యత అని పలికెను. వెంటనే రామరాజును దగ్గరలో ఉన్న చెట్టుకు బంధించి, పరాభవించి, హింసించి పరివిధముల రామరాజు మనస్సును, శరీరాన్ని కట్టి పెట్టిరి.

మేజర్ గుడాల్ తన ప్రక్కనే ఉన్న జమేదారుకు సైగ చేశాడు. జమిదారు వణుకుతున్న చేతులతో తుపాకి పేల్చాడు. గురితప్పి గుండు ఎడమ చేయి పైభాగంలో దిగబడింది. గురి తప్పినందుకు గుడాల్ మండిపడి తన రివాల్వరు బయటకు తీసి రెండు అడుగులు ముందుకు వేసి...

ఎవనికి ధర్మ బుద్ధులుదయించిన బ్రాణము లుండువంచు శా
త్రవులు తలంచిరో, అతని ధర్మ గుణమ్ములనా గుడాలు నే
దవితథవృత్తి మూడు పదులైన బులెట్ల దహించినాడు? భూ
ధవుల కసాయికత్తికి హతంబు కదా రణ ధర్మ రూపమే! 182

ధర్మాన్ని కాపాడుతూ, ధర్మాన్ని అనుసరిస్తూ ధర్మపదంలో జీవిస్తూ ఉన్నవారిని ధర్మం ఎప్పుడు కాపాడుతుంది. అది ఎల్లకాలం మానవలోకంతో జీవిస్తూ ఉంటుంది. శత్రువులైన గుడాల్ కూడా రామరాజు సుగుణాలను, ధర్మ మార్గాలను ఒక్కసారి

స్ఫురించుకున్నాడు. అతని సాహసము, దయ, కరుణ, జాలి గుణగణములను నెమరు వేసుకున్నారు. నేను చేస్తున్న పని అధర్మం అని కవి కోపాలు కత్తికి బలిస్తున్నానని గుడాల్ మనస్సు చేత పలికించిన మాటలు వెంటనే రామరాజు శరీరంలోకి 30 బుల్లెట్లతో తన ప్రాణాన్ని తీసాడు. బహుశ ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్య పోరాటంలో జరిగిన మొట్టమొదటి ఎన్‌కౌంటర్‌గా చెప్పవచ్చు.

ఈ హత్య జరిగిన తరువాత మన కాంగ్రెసు వాదులను కవి బౌద్ధభిక్షుకులుగా వర్ణిస్తూ ఏమి పట్టనట్టు వ్యవహరించిన తీరు...

"ఈ నరహత్యగాంచి తమ కేమియు బట్టని యట్లు దూరదూ
రాన పరిభ్రమించిరి నిరాదరణన్ మన బౌద్ధ భిక్షుకుల్
మానవ జన్మమెత్తి గుణమార్ధవతన్ విడినాడ సోదర
ప్రాణములన్ తృణక్రియ నిరాకృతి జేసెదు నల్పులుందురా?"[183]

బ్రిటిష్ ప్రభుత్వం చేసిన ఈ నరహత్య గురించి తమకు, తమ కాంగ్రెసు పార్టీకి ఏమి పట్టనట్టు వారిని బందిపోట్లుగా, దోపిడిదార్లుగా చిత్రించిన మన ప్రబుద్ధులను కవి ఒక్కసారి మననం చేసుకుంటాడు. మరణించే ముందు రామరాజు సుగుణాలను, రామరాజు కీర్తిని, సాహసాన్ని ఒక్కసారి శత్రువులు స్ఫురించుకున్నారు. కాని మరణించిన తరువాత ఆ మహావీరుడు గురించి, అతని హత్య గురించి ఒక్క మాట మాట్లాడలేదు. ఆంధ్ర సోదరుడుగా, స్వాతంత్ర్యా పోరాట యోధుడుగా, ఒక్కసారి మాట్లాడకపోవడం కవి విచారం వ్యక్తం చేశాడు.

"కడుపు తీపని ఆంధ్ర భూఖండ మెల్ల
గంటనీ ర్వెట్టి గర్భ శోకమ్ము జూపె
కడుపు వెంచిన తెల్ల మొగాల కట్లు
కడుపు నిండెను "సాత్వాకాకారు" లకును!"[184]

ఆంధ్రమాత రామరాజు మరణాన్ని జీర్ణించుకోలేకపోయింది. ఈ ఆంధ్రభూమి అడవితల్లి కన్నీటి సముద్రమై దు:ఖములలో మునిగిపోయింది. ఆంధ్రమాతకి గర్భశోకం కలిగింది. ఇటువంటి మహావీరుడ్ని పోగొట్టుకున్న మనం శోకంతో, రగిలిపోయారు. బ్రిటిష్ వారికి ఆనందం ఎరిసింది మరియు అహింసవాదులు అనే చెప్పుకున్న కాంగ్రెసు వాదులకు ఆనందమే.

రామరాజు తూరుపు దిక్కున ఉదయించిన బాల భాస్కరునిగా జన్మించి, మధ్యాహ్న వేల మార్తాండునివలె నేలపై విప్లవాన్ని సృష్టించి, అరుణారుణ వర్ణంతో పడమటి దిక్కున తలవాల్చిన సూరీడువలె తన విప్లవ జీవితాన్ని ముగించాడు.

రామరాజు ధర్మ పథములలో ప్రయాణించారని కవి స్ఫురిస్తూ...

"దేశ పురోభివృద్ధికి గతించిన ఈకులవర్దనుండు వై
దేశిక ఖడ్గధారలకు డ్రెళ్ళి పరంపడి స్వర్గలోక భూ
మీశుని చెల్మి గైకొని జయించున కీకట జాతి వారలన్?
నాశముకాని ఆత్మ ఒక నాటికి ధర్మ పథమ్ము సూపదా?"[185]

నిరంతరం భారతదేశ బానిసత్వాన్ని రూపుమాపి, దేశపు రోగాభివృద్ధి తన జీవితాన్ని, జీవనాన్ని సాహసోపేతంగా భారతమాతకు రక్తదర్పణం చేసిన ఈ విప్లవవీరుడు ఇతరులు చేసిన సాహసం, భూమి, ఆవేశంలను జయించినట్టుగా ఉంది. శరీరం నాశనం ఉంటుంది. కాని ఆత్మకు నాశనము లేదు. రామరాజు ఆత్మ ఈనాడుకి ఇక్కడే ఉంది. ఆ ఆత్మ ఈ సమాజానికి ధర్మపదం చూపిస్తూ ఆదర్శ మార్గాలకు దారి సూచిస్తుంది అని కవి రామరాజు ధర్మ మార్గంలో బోధ చేసాడు.

"తెలుగు పౌజుల కత్తిపోటులకు త్రిళ్ళి
నెత్తు రోడ్చిన తెల్లమన్నాలు నేడు
మఱచిపోలేదు నీబల మహిమ లొకటి
తెలుగు వారలు మఱచిరా లేరు తెల్ల!"[186]

తెలుగు జాతి పౌరుషాన్ని ఎర్రటి కాళికాదేవి నాలుకతో విప్లవాన్ని చూపి, తెల్లవాళ్ళకు ముచ్చమటలు పోయించి, మూడు చెరువుల నీరు త్రాగించి తెలుగుజాతి బలాన్ని, బలగాన్ని, వీరత్వాన్ని చరిత్రపుటలలో, బ్రిటిష్ వారు గుండెలలో నిలిచేటట్టు చేసిన ఘనుడు.

"ప్రజలను రక్షించుటకు కత్తి పట్టినావు
వారు వలదన్న నాడది వదలినావు
నీ తను త్యాగ మఖిలాంధ్ర బౌతి కిపుడు
సీమమిచ్చిన యట్టిన శ్రీరామరక్ష!"[187]

భారతీయ స్వాతంత్రోద్యమం గురించి, భారత ప్రజల సంక్షేమం గురించి వీరుడిగా విల్లు పట్టినవి. ఆ ప్రజలే విప్లవం వీడవద్దు అన్న మన్యం ప్రజల కొరకు విప్లవాన్ని విడిచిపెట్టి, స్వచ్ఛందంగా లొంగిపోయి. తన ప్రాణాలను భారతమాతకి అర్పించారు. సమాజం కోసం తన ప్రాణాన్ని దారపోసిన త్యాగధనుడు. అటువంటి రామరాజు జీవితం అఖిలాంధ్ర ప్రదేశ్‌కు, తెలుగు జాతికి ఆయన కీర్తి, త్యాగం, శ్రీరామరక్షగా ఉంటూ అతని ఆదర్శ మార్గాలను అనుసరించాలని కవి తెలుగు జాతికి బోధించాడు.

## 2.4 ఉదయశ్రీ కావ్యం-జంధ్యాల పాపయ్యశాస్త్రి:

జంధ్యాల పాపయ్య శాస్త్రి ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ, అనే కావ్యాలు రాశారు. ఈ మూడు కావ్యాల్ని ఉదయశ్రీ, తన హృదయంగా, విజయశ్రీ తన శిరస్సుగా, కరుణశ్రీ తన జీవితంగా వర్ణించాడు.

జంధ్యాల హృదయమైన ఉదయశ్రీ ద్వితీయ భాగంలో 34వ ఖండికలు కలవు. భారత స్వాతంత్ర్యోద్యమ పోరాట యోధుల్ని గూర్చి తెలిపిన ఈ కావ్యంలో అల్లూరి సీతారామరాజు గూర్చి, ఆయన ఉద్యమ జీవితాన్ని మూడు పుటల్లో తొమ్మిది పద్యాల్లో ప్రస్ఫుటించారు.

అల్లూరి సీతారామరాజు శక్తి సామర్థ్యాన్ని, చైతన్యస్ఫూర్తిని వివరిస్తూ...

పాశవశక్తితో ప్రజలపై బడు నీచ నిరంకుశత్వము
నాశమొనర్చ దీక్ష గొని నా వటె! భారత భూమి విప్లవా
వేశము పొంగు లెత్త ప్రభవించిన రోచిరుదాత్త వీచికా
రాశి వటే! తెలుంగు కజరామరణంబులు నీ చరిత్రముల్! [188] అని

భారతీయ ప్రజలపై బ్రిటిష్ ప్రభుత్వ అధికారులు బానిసత్వపు రూపురేఖలతో ప్రజల్ని హింసిస్తుంటారు. ప్రజల కష్టాలను తీర్చుటలో ధర్మబుద్ధితో, ధనుర్విద్య శక్తితో, మంత్ర మహిమలతో, యోగిలా ప్రభుత్వ ప్రజా వ్యతిరేక పాలన అంతము చేయడానికి కంకణ బద్ధుడుగా వెలిశాడు. సువిశాల భారతదేశంలో ప్రజలకు విప్లవావేశాన్ని, చైతన్యాన్ని, పెంపొందించిన తీరుని వ్యక్తం చేశారు. దీనిని బట్టి అల్లూరిని భారతదేశ స్వాతంత్ర్య సమరయోధుడుగా, విప్లవవీరుడుగా, బ్రిటిష్ ప్రభుత్వంపై ప్రదర్శించిన ధీరత్వాన్ని

అభివర్ణించిన తీసారు వ్యక్తమౌతుంది.

అలాగే అల్లూరి సీతారామరాజు రాజ ధర్మాన్ని, సాహసాన్ని తెలుగు పౌరుషాన్ని తెలుపుతూ...

"క్షాత్రము రూపుగై కొనిన సాహసికుఁనిను గాంచి భారత
క్షేత్రమునందు పొంగి పులకించినదోయి త్రిలింగజాతి;సు
క్షత్రియవీర! నీ విజయ శంఖము బ్రద్దలుసేసె శాత్రవ
శ్రోత్రముల్ భవత్పదము సోకుట మన్యము ధన్యమయ్యెరా!"[189]

రామరాజు క్షత్రియ వంశంలో పుట్టడం వల్ల పోరాట పటిమ ఉంటుంది. ఆ గుణాలే బ్రిటిష్‌వాళ్ళపై తిరుగుబాటు చేయడానికి ఉపకరించాయని స్పష్టమౌతుంది. భారత దేవ వ్యాప్తంగా అల్లూరి సాహసోపేత ఉద్యమానికి ఆంధ్రజాతి పులకించిపోతుంది. అలాంటి క్షత్రియ వీరునికి జన్మనిచ్చిన తెలుగుభూమి ధన్యమైందని పేర్కొన్నారు. అతని విజయ శంఖనాదం శత్రువుల గుండెల్లో ఫిరంగులు మోగాయని ప్రశంసించారు. అదేవిధంగా తెల్లవాళ్ళ అరాచకాలని, అన్యాయాల్ని, దోపిడి విధానాల్ని వ్యతిరేకిస్తూ చిన్న వయసు గల రామరాజు చూపిన పరాక్రమాన్ని విశ్లేషిస్తూ...

రాచరికంపు రక్కసి కరమ్ములు సాచి అమాయిక ప్రజ
దోచుపర ప్రభుత్వమును దోచిన రాజుల చిన్నవాడ! వీ
రోచితమైన తావకమహోద్యమ మాంధ్ర పురా పరాక్రమ
శ్రీ చరణమ్ములందు విరజమ్మె నవారుణ విప్లవాంజలుల్![190]

ఆంగ్లేయులు రాజ్యకాంక్షతో అమాయక ప్రజల్ని అరాచకాలతో బానిసలుగా చేసి చిత్రహింసలు పెట్టేవారు. ఈ పరాయి ప్రభుత్వంపై చిన్నవయసులోనే రామరాజు ధ్వజమెత్తిన తీరుని తెల్పారు. స్వాతంత్ర్యమహోద్యమంలో ఆయన చూపిన ధైర్యసాహసాలకి, ఆంధ్రుల పరాక్రమానికి, భారతమాత విప్లవ నీరాజనాలందించిందని తెలియజేశారు.

అలాగు బ్రిటిష్‌వారిని ఎదిరించడంలో రామరాజుకి సహకరించిన సైన్యాన్ని తెల్పుతూ....

గామ దొరలిర్వు రంగరక్షకులు గాగ
విండ్లు గొని భిల్ల సైన్యాలు వెంబడింప
ధర్మ కౌక్షేయకమ్ము హస్తమున దాల్చి
దుమికితివి తల్లి దాస్య బంధములు ద్రెంప![191]

ఆంగ్లేయులతో పోరాటంలో అల్లూరికి గంటందొర, మల్లుదొరలు అంగరక్షకులు కాగా, అశేషజనం విల్లులు ధరించి శ్రీరామరాజును అనుసరిస్తారు. గాంసోదరుల ధీరత్వం నీతి, ధర్మాన్ని పాటిస్తూ విప్లవ సైన్యంతో కలసి బ్రిటిష్ వారి చేతిలో బానిసగా ఉన్న భారతమాత దాశ్య శృంకాలని తెంచడానికి విజృంభించాడనే విషయాన్ని వెల్లడించారు.

అప్పటి కాంగ్రెసు పెద్దలు ఉద్యమాన్ని దోపిడి దారుల తిరుగుబాటుగా చిత్రీకరించిన సంర్భాన్ని ప్రస్తావిస్తూ...

దోపిడీక సేయు 'దొంగలదొర'వటంచు
ప్రేలుకొనుగాక తెల్లమొగాలు నిన్ను
దేనిపై దోపిడీ చేసితివి? దురాగ్ర
హమ్ముపైన –నిరంకుశత్వమ్ముపైన[192]

రామరాజు విప్లవ సైన్యం, ధైర్యంతో ముందుగా చీటి రాసి విషయాన్ని తెలియపరిచి బ్రిటిష్ అధికారులపై, పోలీసు స్టేషన్లలపై దాడి చేసేవారు. దాడి చేసిన స్టేషన్లలో తుపాకీలు, మందుగుండ్లు, ఆయుధములను మాత్రమే తీసుకువెళ్ళేవారు. ధనం, సంపదను ఎక్కడ దోచుకోలేదు. వీరు చేస్తుంది స్వాతంత్ర్యపోరాటమని వీరు ఉద్యమిస్తుంది బ్రిటిష్ నిరంకుశత్వం మీదని, బ్రిటిష్ అధికారులపై, వారు చేసే దుష్టచర్యలపైనని కవి స్పష్టం చేశారు.

అదేవిధంగా శ్రీరామరాజు సీతారామరాజుగా మారిన పరిస్థితుల్ని గూర్చి తెలుపుతూ........

జీవితేశ్వరు నిన్ను దర్శింపలేక
ప్రణయవతి ప్రాణమే సమర్పణమొనర్చె

ఆమెతోడ సమైక్యమ్మునంది రామ
రాజు 'వెల్ల' 'సీతారామరాజు' వైతి![193]

విశాఖపట్నంలో చదువుకున్న రోజుల్లో సీత అనే సంపన్నుల అమ్మాయిని ప్రేమించెను. ఆమె కూడా రాజును ప్రాణంగా ప్రేమించెను. కాని వేరు వేరు కులాలు కావడం, రామరాజు పేదవాడు అని తెలియడంతో సీత తండ్రి అభ్యంతరం చెప్పడం జరుగుతుంది. కాని సీత కూడా స్వాతంత్ర్య కాంక్ష, స్వరాజ్య పోరాట దీక్ష కలిగిన దేశభక్తురాలు. అందుకే రామరాజు ఆమెను ఎంతో మనసులో భద్రపరచుకున్నాడు. స్వాతంత్ర్య పోరాటంలో ఉన్న రామరాజు మరల వస్తాడని ఆశతో ఎదురుచూసి ప్రాణాన్ని విడుస్తుంది. నాటి నుండి ఆమె జ్ఞాపకార్థంగా తన పేరును సీతారామరాజుగా మార్చుకున్నాడని కవి వర్ణించాడు.

రామరాజుని ప్రశంసిస్తూ......

పౌరుషము, పట్టుదల, దేశభక్తి, ధైర్య
సాహసమ్ము లనన్యాదృశ్యములు గాగ
తెలుగుగుండెలు వెలిగించితివి, స్వతంత్ర
యజ్ఞమున నిందుబ్రతుకు 'స్వాహా' మొనర్చి![194]

క్షత్రియుడైన రామరాజు పట్టువీడని విక్రమార్కుడిలా, ప్రజలకు జరిగిన అన్యాయాన్ని, అవమానాన్ని, గుర్చు చేసుకుంటూ ఆంగ్లేయులపై ఉద్యమానికి పూనుకుంటాడు. అల్పసంఖ్య కలిగిన మన్యసైన్యంతో దేశభక్తిని, విప్లవ భావాల్ని నింపి ధైర్యసాహసాలతో వారిపై తిరుగుబాటు చేస్తాడు. ప్రజల్లో ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించిన రామారాజు తెలుగువారి గుండెల్లో విప్లవ జ్వాలలు సైతం వెలిగిస్తాడు. బ్రిటిష్‌వారితో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామంలో తన ప్రాణాన్ని త్యాగం చేసిన అమర వీరుడుగా అభివర్ణించాడు.

స్వాతంత్ర్య పోరాట చరిత్రలలో ఝాన్సీలక్ష్మీభాయి, భగత్‌సింగ్, ఆజాద్ వంటి వారిని పరిశీలిస్తే... రామరాజు యుద్ధం సుమారుగా 2 సంవత్సరాలు విప్లవ పోరాటంగా సాగింది. బ్రిటిస్ ప్రభుత్వానికి కునుకు లేకుండా చేసి ఎంతో నష్టాన్ని భయాన్ని కలిగించిన

ధీరుడు. అలాంటి మహావీరుడ్ని కన్నతల్లి తెలుగుతల్లి. అందుకే రామరాజు తెలుగువారు మార్గదర్శకుడిగా తీసుకుని అతని ఆశయాలను వారసత్వంగా తీసుకోవాలని కవి ప్రభోదించాడు.

రామరాజును భద్రాద్రిరాముడుగా కొలుచుట వారిని చిరునవ్వుతో విడిచిపెట్టుట కవి చెబుతూ...

దోసిలి యొగ్గి ప్రార్థనలతో నినుదోడ్కొనిపోయిరంటపో
లీసులు-దేవదేవునివలెన్ పరిచర్య లొనర్చిరంట, నీ
దాసుల మంచు తావక పద్మముల సన్నిధి నాయుధమ్ములన్
రాసుల పోసిరంట, బళిరా! భవదీయ మహాప్రభావముల్! 195

రామరాజు వీరోచితంగా ముందు సమాచారంతో పోలీసు స్టేషన్లు అడగు పెట్టగానే భయంతో పోలీసులు హడలిపోయేవారు. కొందరు భక్తితో రామరాజుకు ప్రార్థన చేసి దైవరూపంగా కొలుస్తూ భక్తి ప్రదర్శించే వారిపై ప్రేమ అనురాగాలు కురిపిస్తుండేవారు. వారు వెంటనే స్టేషనులో ఉన్న ఆయుధాలన్ని రామరాజు పాదాలపై ధనరాసులుగా పోసే వారనే విషయాన్ని తెలియజేశారు.

అలాగే వివరిస్తూ భారత స్వాతంత్ర్య పోరాటంలో తెలుగు వీరుడి "మిరపకాయ టపా" ప్రాధాన్యతను ప్రస్తావిస్తూ......

కళవళమందె నీ 'మిరపకాయ టపా'కు ప్రభుత్వ మిల్టరీ
దళములు; నీ విజృంభణకు తల్లడిలెన్ పశుశక్తి; సర్వదా
తళతళలాడు నీ సుచరితమ్ములు భారతభారతీ మహో
జ్జ్వల మకుటాగ్రమందు విలసద్రుచి రంజిత రత్నపుంజమై!! 196

గెరిల్లా యుద్ధం ఎంతటి శక్తివంతమైనదో మిరపకాయటపా కూడా అంతకంటే ఎక్కువ శక్తి వంతమైనది. రామరాజు ఉపయోగించిన మిరపకాయటపా కూడా అంత కంటే ఎక్కువ శక్తివంతమైనది. రామరాజు ఉపయోగించిన మిరపకాయటపా వలన బ్రిటిష్‌వాళ్ళు తల్లడిల్లిపోతారు. వారి మిల్టరీ దళాలకు కలవరం మొదలవుతుంది. రామరాజు

యుద్ధ నిపుణతకు వారు హడలవుతారు. రామరాజు విల్లునుండి వెలువడే బాణాల వర్షాన్ని ఎవరు అడ్డుకోలేక పోయేవారు. అంతేకాకుండా తుపాకీ కాల్చుటలో కూడా గొప్ప నైపుణ్యం కలవాడు. రామరాజు యొక్క ప్రతి ఘనతలు భారత మాత కంఠంలో అలంకరించిన పువ్వుల హారాలు. అవి ఏనాటికైన పరిమళిస్తూ సువాసనలు వెదజల్లుతూనే ఉంటాయని విశదపరిచారు.

## 2.6 గుజ్జం ధర్మోజీ:

అల్లూరి సీతారామరాజు ఉదహరణ కావ్యంను గుజ్జం ధర్మోజిరావు రాశారు. సాహిత్యంలో ఉదాహరణ కావ్యానికి ప్రత్యేక స్థానముంది. ఈ కావ్యం మొదటి ముద్రణ జూలై 4న 2015లో అచ్చయింది. రచయిత రాసిన నాలుగు ఉదాహరణ కావ్యాలలో అల్లూరి సీతరామరాజు 4వ ఉదాహరణ కావ్యం. ఇందులో 35 పుటల్లో, 28 పద్యాల్లో రామరాజు విప్లవ చరిత్రను వివరించారు.

ఈ ఉదాహరణ కావ్యంలో ఏడు విభక్తుల మీద ఏడు పద్యాలు సంబోధనా ప్రథమా విభక్తిపై ఒక పద్యం ఉన్నాయి. ఇవి కాకుండా ప్రతి విభక్తి పద్యాలలో ఒక వృత్తము. ఒక కళిక, ఒక ఉత్కళిక పద్యాలున్నాయి.

కావ్యం గూర్చి రచయిత ముందు మాటలలో...

విప్లవ జ్యోతి అల్లూరి సీతారామరాజు గురించి తెలియని వారు ఉండరు. కానీ ఆయన కావ్యంలోకి ఎక్కేసరికి సరికొత్తగా కొత్త కొత్త విషయాలతో దర్శనమిస్తాడు. ఆయన గురించి విషయాలు చదివిన వారు స్ఫూర్తిని పొందుతారు. అలా స్ఫూర్తిని పొందాలని నేను ఈ వాక్యాన్ని వ్రాసాను. అందువల్ల మహాపురుషుల జీవితాలను ఉదాహరణ ప్రక్రియలో వ్రాయడం ప్రారంభించెను. ఇంతవరకు శ్రీ భీమరాజు ఉదాహరణ కావ్యం, ఆర్థర్ కాటన్ ఉదాహరణ కావ్యం, ఆంధ్రకేసరి ఉదాహరణ కావ్యం రాశాను. ఇప్పుడు అల్లూరి సీతారామరాజు ఉదాహరణ కావ్యంతో మీ ముందుకు వస్తున్నాను" అని కవి వినయంగా తెలియపరుస్తున్నాడు.

ఉదాహరణ కావ్య నియమాలలో లేకున్నా సంస్కృత శ్లోకంతో ప్రారంభించడం

ద్వారా రామరాజుని ప్రస్తుతిస్తూ.....

శ్లో॥ "శ్రీశ్రీ విప్లవ కారణం బలయుతం శ్రీ మన్య సంచారిణం
అల్లూర్యాఖ సువంశజాత కిరణం సత్ క్షాత్ర శౌర్యాంచితం
సీతాయుక్త సునాయ భూషిత తనుం శ్రీరామరాజం శుభం
వందే సాయుధ యోదినం శుభాయశం శ్రీ సాంద్రరోషాకృతం[197] అంటూ

క్షాత్ర ధర్మంతో నిర్వహించిన మన్యపోరాటం, విప్లవ చైతన్యంతో స్వాతంత్ర్య దీక్షతో సాగించిన మహావీరుడు అల్లూరి సీతారామరాజు. అటువంటి మహా విప్లవ వీరుడి అడుగుజాడల్లో ఆదరణ, స్ఫూర్తితో తెలుగసాహిత్యంలో విప్లవ సాహిత్యాన్ని, నవ చైతన్యానికి కొత్త ఒరవడిని సృష్టించిన మహాకవి శ్రీశ్రీ విప్లవ బాట కూడా అల్లూరి సీతారామరాజు మార్గంను అనుసరించాడు. రామరాజు రాజవంశంలో వెలసిన జాతి వెలుగుగా వర్ణించాడు. ఆయన అసలు పేరు శ్రీ రామరాజు కాని సీతా అనే శుభనామంతో సీతారామరాజుగా ప్రసిద్ధికెక్కాడు. ఆయన సాయుధపోరాటానికి వందనాలు తెల్పుతూ ఆ వీరుడి ఉద్యమానికి విప్లవ తిరుగుబాటుకు శుభకరం చెబుతూ ఆంధ్రుల పౌరుషా ప్రతాపాన్ని రగిలించిన మహా నాయకుడుగా రామరాజును కవి కీర్తించాడు.

ప్రథమా విభక్తిలో ఉత్పలమాల చంధస్సులో రామరాజు పరాక్రమాలను వివరిస్తూ.....

ఉ॥ "శ్రీగురు పౌరుషంబితడశేష పరాక్రమ విక్రముండు తా
సాగిన విప్లవోద్యమము, సాహసవంతుడు దేశ భక్తుడున్
మూగిన తెల్లమూకలను ముప్పది చుఋ్వల నీళ్ళు తాపియున్
రేగిన దుండగీండ్లనెడు ఊచుల పేచ మణంచు వీరుడన్"[198]

శ్రీరామరాజు విజయంతో కూడిన జ్ఞానవంతుడు. అతడు పౌరుషంతో, విశేషమైన పరాక్రమంతో విప్లవ ఉద్యమాన్ని సాహసంతో నడిపిన దేశభక్తుడు. ఆంగ్లేయుల దుష్టచర్యలకు ఎప్పటికప్పుడు ప్రతీకారం తీర్చుకొనేవాడు. సీతారామరాజుకు మొదట్లో కొంత యిబ్బందిపడిన తర్వాత యుద్ధశాస్త్ర పరిజ్ఞానం గాని, సంపూర్ణ విప్లవ వ్యూహ

అవగాహనలతో పోరాటంలోనే అనుభవాలు గడించాడు. యుద్ధ నైపుణ్యంలో సైనికాధికారుల కంటే తనదే పైచేయి అనిపించాడు. పోలీసు బలగాలను ముప్పుతిప్పలు పెట్టి మూడు చుఱువుల నీళ్ళు త్రాగించి, వాళ్ళను పాదాక్రాతం చేసుకున్నాడని కవి వివరించాడు.

ప్రథమా విభక్తిలో కళిక పద్యంలో మన్య ప్రజలు రామరాజును దైవంగా వర్ణిస్తూ...

"అడవి పుత్ర తతి కవితారాధ్యుడు
గుడి ఇతడేయగు గురుతర బాధ్యుడు
అభము శుభము తమకన్నియు నాతడు
అభయ మిచ్చు పరమాప్తుడు నాతడు
ఆంధ్ర పౌరుషత కగ్నియు నాతడు
సాంధ్ర గబేరత సాక్షియు నాతడు"
పోరాట నేర్పరి పురుషుండాతడు
వీరుల కరముల విల్లుయు నాతడు[199]

మన్యం వారు కల్లా కపటం లేని నిజాయితీపరులు గిరిజనులు, నమ్మితే ప్రాణమిచ్చి మొండి ధైర్యం గలవారు. అవినీతికి ఆలవాలమై, లోపభూయిష్టమైన పర ప్రభుత్వ పరిపాలనలో గర్భదరిద్ర్యాన్ని అనుభవించేవారు. వారి కష్టాలను చూపిన రామరాజు మన్య ప్రజలకు ఆరాధ్యుడుగా ఉండేవాడు. రామరాజే తిరుగుబాటు చైతన్యానికి మార్గదర్శకుడు. మన్య విప్లవానికి యిట్టి మహనీయుని నాయకత్వం లభించటం వారి అదృష్టంగా కవి భావించాడు.

ప్రథమా విభక్తిలో "ఉత్కళిక" పద్యంలో రామరాజు సౌశీల్యాన్ని వివరిస్తూ......

"శ్రీ మగధీరుడు
భూమి ప్రేమికుడు
పౌరుష సింహుడు
గౌరవ రూపుడు
అభిమానధనుడు

శుభనామయుతుడు

రామరాజితుడు

భీమ బలుడితడు"[200] అంటూ

కవి కావ్యంలో అనేక చోట్ల శ్రీ అనే పదాన్ని ప్రయోగించాడు. ఇక్కడ శ్రీ అనగా విజయం అని అర్థం. విజయంతో ధీరత్వాన్ని ప్రదర్శించాడు అని కవి వర్ణించాడు. రామరాజు ప్రకృతిని ఆరాధించే వాడు. ఆంగ్లేయులపై సింహంవలె పౌరుషాన్ని, ప్రతాపాన్ని చూపేవాడు. కుల మత వర్ణ వర్గ బేదం లేకుండా అందరిని సమానంగా చూసేవాడు. త్యాగాన్ని మనస్సులో నింపుకున్న త్యాగవీరుడు. సుందరమైన రూపం కలవాడు. యిచ్చిన మాటను నిలబెట్టుకొనేవాడు. ఏ పనినైనా దిగ్విజయం చేయగలవాడు. ఆయనే రామరాజు శక్తిలో భీముడు వంటివాడు అని కవి వర్ణించాడు.

ద్వితీయా విభక్తిలోని ఉత్పలమాల వృత్తపద్యంలో ఆదివాసుల కష్టాల గూర్చి వివరిస్తూ...

"అన్యుల పాలనన్ నలుగు యాదిమ కోయల కండదండలన్
ధన్యత చెందువాని ఘన ధార్మిక ధీరుని దేశ భక్తునిన్
వన్యజనాళి రక్షకుని వారిజ నేత్రుని సూర్య తేజునిన్
మన్యపు విప్లవోజ్జ్వలుని మాన్యువ దాన్యుని సన్నుతించెదన్"[201]

ఆంగ్లేయుల పాలనలో అటవి చట్టాలతో, పన్నులతో అనేక కష్టాలు అనుభవిస్తూ ఆదివాసులు, కోయ కొండ మొదలైన మన్య ప్రజలు చిత్రహింసలు పడుతుంటారు. వారిని విముక్తి చేయుటకు రామరాజు రక్షకుడిగా, గిరిజనులు కంటికి వెలుగుగా ఉంటూ రక్షిస్తాడు. పరాయి పాలనను అంతం చేసి దాస్య విముక్తి చేయుటకు కంకణ బద్ధుడైనాడని కవి కీర్తించాడు.

ద్వితీయా విభక్తిలో కళిక పద్యంలో జలియను వాలాబాగ్ విషాదాన్ని చిత్రీకరిస్తూ...

"ఖలులు "జలియనువాలబాగు"న

కండకావర దుష్ట చేష్టల

చెలగి జనులను కర్కశంబుగ
 చెదరగొట్టుచు ఘోర కాల్చుభ్రష్టుల
ఘన కిరాతపు ఘోర కర్మను
 ఖండితంబుగ నాపు వానిని
మనసు తుక తుక మఱగు వానిని
మహిత వ్యగ్రత ధునుము వానిని
శ్వేత జాతుల ఘాతుకాలను
చీల్చి వపథము చేయువానిని
హోతయై స్వరాజ్యమనియెదు
 హోమకీల రగుల్చువానిని
నరనరంబున దేశ భక్తియె
 "నయాగరౌచు" దూకు వానిని
పరమ కీచక దుష్టజాతికి
 పాశుపతయై పరగువానిని"[202] అంటూ

జలియన్ వాలాబాగ్ సంఘటనలో వేలాది మంది ప్రజలు, మహిళలు, పిల్లలు, కనీవినీ ఎరుగని రీతిలో ఘోరంగా చనిపోతారు. భారతదేశ స్వాతంత్ర్యచరిత్రలో ఇదొక విషాదకరమైన సంఘటన. ఎక్కడో జరిగినా ఈ విషయం రామరాజు చెవిలో పడింది. అతని హృదయం భగ్గుమంది. ప్రతీకారం రగిలింది. బ్రిటిష్‌వారు చేస్తున్న ఘోరచర్యలకు రూపుమాపుటకు రామరాజు స్వరాజ్యమనే విప్లవ అస్త్రాన్ని ప్రయోగించుటకు పాశు పతమై వారిపై తిరుగుబాటుకు పూనుకొనెను అని కవి వివరించాదు.

అంతేకాకుండా కళికలో ద్వితీయా విభక్తిలో "వృషభగతి రగడలో" పదాలకు పౌరుషాన్ని పట్టించి, వీరత్వాన్ని దట్టించి కవితా విల్లు ఎక్కు పెట్టించిన తీరుని కవి మనకు కన్నులకు కట్టినట్లుగా చిత్రీకరించాడు.

ద్వితీయా విభక్తిలోని "ఉత్కలిక" పద్యంలో రామరాజు దేశభక్తిని కీర్తిస్తూ...

"దేశభక్తియె దేహమంతను ఆశయంబదె ఆత్మనంతను

స్వేచ్ఛముక్తిగ నెంచు వానిని స్వచ్ఛతన్ ప్రేమించు వానిని
భిల్లులను దరి చేర్చు వానిని, వెల్లువైజృంభించు వానిని
అండగా నలరించువానిని కొండదొర గుండెయగు వానిని"[203] అంటూ

రామరాజు శరీరమంతా స్వాతంత్ర్య దీక్షతో నిండి యున్నది. తన మనస్సులో స్వేచ్ఛా, సమానత్వాన్ని కోరుకుంటాడు. గ్రామ స్వరాజ్యాన్ని ఆశిస్తాడు. మన్య ప్రాంతంలో ఆధ్యాత్మిక, నైతిక, విప్లవానికి రాచబాట వేశాడు. ఆటవిక జాతులలో ఉత్తేజం, ఉద్రేకం తీసుకువచ్చి తన వెంట విప్లవ బాటలోతీసుకువెళ్ళి విల్లులను ప్రయోగించి యుద్ధ నైపుణ్యతను నేర్పించేవాడు. కొండంత ధైర్యంగా గిరిజనులకు అండగా ఉండేవాడని కవి వివరించారు.

తృతీయా విభక్తిలో శార్ధూలం ఛందస్సులో రామరాజు బాల్యంలో దేశభక్తి వివరిస్తూ......

శా॥ "వందేమాతరం గీతికా శ్రవణతో బాల్యంబునే శ్రద్ధతో
ముందే మానస మందిరాంతరమునన్ మోదంబుతో భక్తితో
సందర్శించెను దేశమంతయు మహ సంభ్రాంతితో నద్కతోన్
పొందెన్నూతన తేజమున్ మనసునన్ పొంగారు స్వాతంత్ర్యమునన్"[204]

రామరాజు చిన్నతనం నుండి జాతీయా భావాలతో ఉండేవాడు. వందేమాతరం గీతం ఆలపించిన, ఆగీతం విన్న ఉత్తేజముతో దేశభక్తి పొంగిపోయేది. కొత్త ఉత్సాహంతో స్వాతంత్ర్య ఉత్తర భారతదేశ యాత్ర కాలినడకతో 1916 ఏప్రియల్ 16న ప్రారంభించాడు. మొదట కలకత్తా చేరుకొని దేవ రాజకీయ పరిస్థితులను గమనించి అక్కడ రాజకీయ చర్య గోష్ఠిలో పాల్గొన్నాడు. ఆధ్యాత్మికమైన భావనలతో ఋషికేశ, బదరీ, హిమాలయ వంటి పుణ్యక్షేత్రాలను దర్శించి, భారతదేశంలో దేశ, కాల పరిస్థితులను అవగాహన చేసుకున్నాడని కవి విశ్లేషించాడు, నూతన ఉత్తేజంతో విప్లవ మార్గంలోకి అడుగుపెట్టాడు.

తృతీయా విభక్తిలో కళిక పద్యంలో రామరాజును యోగిగా, త్యాగిగా కీర్తించిన విధానం వర్ణిస్తూ...

"సజ్జనుండైనట్టి సహజంపు యోగిచే
మజ్జనుండైనట్టి మహనీయ త్యాగిచే

దమన నీతుల పైన దండెత్తు వానిచే
విమల భారతి గన్న వీరడగు వానిచే
యుద్ధమని వార్యమను యోచనుండగుటచే
సిద్ధిపొందగ తాను సేన నెదురుటలచే
పరపీడనము త్రుంచ పరశువగు వానిచే
మెరపులను కురిపించ మేఘుడగువానిచే”[205] అని అంటూ

బరోడా, ఉజ్జయినీ, అమృత్‌సర్, హిమలాయాలు వంటి ప్రదేశాలు చూసి సన్యాసి దీక్ష స్వీకరించి యోగిగా మారిపోయాడు. తెల్లవాడితో అహింసాయుత పోరాటం పనికిరాదని, సాయుధ పోరాటమే మార్గమని తన కుటుంబం కంటే దేవ సంక్షేమమే ముఖ్యమని గ్రహించిన త్యాగశీలి. దుష్టచర్యలు చేస్తున్న బ్రిటిష్‌వారిపై తిరుగుబాటు చేశాడు. భరతమాత కన్న వీరుడుగా పోరు తప్పదని విప్లవ చైతన్యంను మన్యంలో లేవనెత్తాడు. యుద్ధమునకు మన్యవీరులను వీరసైనికులుగా తయారుచేసి పరాయి ప్రభుత్వం మెరపులు వలె యుద్ధ భీభత్సాన్ని సృష్టించాడని కవి వర్ణించాడు.

తృతీయ విభక్తిలో ఉత్కళిక పద్యములో రామరాజు మన్యంపై అభిమానాన్ని చూపుతూ…

“బ్రిటిషు బాధలచేత
పటిమ నాపుట చేత
నేలపై ప్రేమచే
గాలిపై ప్రేమచే
చెలగె తాచెలిమిచే
వెలిగె తాబలిమిచే
దృఢమైన శక్తిచే
పుడమిపై భక్తిచే”[206] అంటూ

బ్రిటిష్ వారు మన్యం ప్రజలను అటవీ చట్టాల పేరుతో అడవితల్లి నుండి మన్యం బిడ్డలను వేరు చేసి అనేక చిత్రహింసలు చేస్తూ హింసించేవారు.

ఆంగ్లేయుల పెట్టి బాధలకు అడవితల్లి ఆక్రోశించేది. కొండగాలి మౌనాన్ని వహించేది, నేలతల్లి కన్నీరు కార్చింది. వారి అన్యాయాలను ఎదిరించడానికి సంకల్ప బలమైన శక్తితో, ధరణిమీద ఉన్న భక్తితో రామరాజు బ్రిటిష్‌వారిపై ద్వజమెత్తేవాడు.

చతుర్థీ విభక్తి ఉత్పలమాల పద్యంలో విప్లవ సైన్యాన్ని సిద్ధం చేసిన సందర్భంలో....

ఉ॥ "తెల్లపిశాచముల్ జరుపు తీవ్రయ రాచక వారణంబుకై
విల్లుల నెక్కుపెట్టగను విప్లవ వీరుడు "తా" రణంబుకై
మల్లు, పడాలు, గంటమను మన్నెపుయోధుల మర్గదర్శియై
భిల్లు నెల్ల విప్లవపు వెల్లువ జేసెను పోరుబాటకై"[207] అంటూ

కవి ఈ వృత్త పద్యంలో ఆంగ్లేయుని పిశాచాలతో పోల్చడం విశేషం. అధికార దాహంతో అరాచకాలతో మన్య ప్రజల రక్తాన్ని పీల్చి పిప్పిచేసేవారు. పోలీసులు, అధికారులు చేసే అత్యాచారాలు, పన్నులభారాలు, ప్రజావ్యతిరేక చట్టాలు మొదలైన బాధలకు గిరిజనులు ప్రతీకార చర్యల వాంఛతో రగులుతున్నారు. వారిని ఎదిరించడానికి విప్లవ వీరుడు రామరాజు సైన్యమును ఏర్పాటు చేసెను. మన్యంలో వీరత్వం గలిగిన గంటం దొర మల్లుదొరలను చేరదీశాడు. వీరయ్య, పడాల్, అగ్గిరాజు మున్నగువారు. నాయకులుగా పరిణితిచెంది, మన్యప్రాంత ప్రజలను సంఘటితగా చేసి యుద్ధానికి సన్నద్దం చేసిరి అని కవి వివరించాడు.

చతుర్థీ విభక్తిలోని కళిక పద్యములోని గంటం, మల్లుదొరల సాహసాన్ని, మిరపకాయటపా ప్రత్యేకతను, రత్తి, గోవిందుల ప్రేమను విరించిన సందర్భం.....

"మగటిమి వెలయగ మల్లుగంటముల
మమతను జేర్చ సమానత కొఱకై
తెగువగ నెగడుచు బ్రిటిషు మృగములను
తెగటార్చెను గిరిపుత్రుల కొఱకై
ఎన్నడు వెన్నెల వెఱగని బ్రతుకుల
ఎన్నియు కాంతుల నెదనింపుటకై
కన్నతల్లి వలె కాయుచు గిరిజన

కష్టములన్నియు తా కాచుటకై
ముట్టడింతునని "మిరపటపా"లను
ముందే పంపును తర్జనంబుకై
రట్టడి చేయగ రక్షక భటులకు
రయమున ధీరత కొల్లగింతకై
గురి నెర్రేసుని గుణములన్ మెచ్చి
గోవిందు రత్తి చిత్తముల్ నచ్చి
గురుతుగ గిరిజన గుండెల నిలువగ
కోరెను స్వేచ్ఛను "కోయల" కొఱకై"[208] అని అంటూ

మల్లుదొర, గంటందొర ధైర్యంతో బ్రిటిషు అధికారులపై తిరగబడేవారు. గిరిపుత్రులలో సుఖాన్ని కలగజేయాలనే లక్ష్యంతో వారి బ్రతుకులలో వెలుగును నిలుపుటకు వారి కష్టాలను తీర్చుటకు విప్లవ తిరుగుబాటులో భాగంగా మిరపకాయ టపాలను ప్రయోగించేవారు పట్టపగలు పోలీసుస్టేషను ముట్టడి చేసి రక్షక భటులకు సమాచారం యిచ్చి ఆయుధాలతో వెళ్ళిపోయేవారు. ఈ కావ్యంలో రత్తి అనే స్త్రీ పాత్ర ఉంది. గోవిందు కోయవాళ్ళ కుర్రాడు. రత్తి చెంచులోల పిల్ల వీళ్ళిద్దరి ప్రేమ కులాంతర వివాహంతో గిరిజనుల ఐక్యతను సమకూర్చినట్లు కవి తెలియజేవారు.

చతుర్ధీ విభక్తిలోని ఉత్కళిక పద్యములో పోలీసుస్టేషన్లు ఏర్పాటు విధానం వివరిస్తూ...

"మన్య ప్రాంతమున మారుమూలగా వన్య ప్రాణులే మన్యమేలగా
దోమలు కుట్టని దొరయే లేడుగా పాములు ప్రాకని గ్రామము లేదుగ
నీరు పారెడు వాగువంకకై క్రూరమృగాల్ చను దాహము కొఱకై
మన్నెము నంతా దోచుట కొఱకై ఉన్నది పోలీస్ స్టేషను దొరకై"[209] అని అంటూ

అటవీ ప్రాంతాన దట్టమైన ప్రదేశంలో వన్యమృగాలు మాత్రమే ఉంటాయి. అభం, శుభం తెలియని అమాయక గిరిజనుల ఉంటారు. వాగులు, వంకలు సరస్సులు లతో మృగాలు, అక్కడ ప్రజల దాహం తీర్చుకుంటారు

కాని ఆంగ్లేయులు క్రూరమృగాలు కంటే క్రూరంగా అడవి సంపదనంతా తరళించుకుపోవడానికి, అకృత్యాలు చేయడానికి, తమ అధికారాన్ని కాపాడుకోవడానికి పోలీస్‌స్టేషను ఏర్పాటు చేసుకున్నారని కవి విశ్లేషించారు.

పంచమీ విభక్తిలో ఉత్పతమాల పద్యంలో రామరాజు శౌర్యాన్ని వర్ణిస్తూ...

ఉ॥ కంటిమి నిన్ను బట్టియను కంపము నిండిన నిండు గుండియన్
కంటిమి నిన్ను బట్టి నయగారము మించిన రాచ బిడ్డడిన్
వింటివి నిన్ను బట్టి కడ వీనుల విందుగ నీదు శౌర్యమున్
కంటిమి నిన్ను బట్టి ఘన కార్ముకమున్ ధరియించు ధీరునిన్”[210]

ఈ పద్యంలో ‘కంటె’ విభక్తి, పంచమీ విభక్తి ప్రత్యయం ఆర్ ప్రయోగించడం విశేషం. రామరాజు లక్ష్య సాధన బాణం కొనలాగా సూటిగా దూసుకుపోయేది అతని ఆత్మ, శరీరము కూడా మనోజ్ఞతతో, మృధుత్వంతో నిండి ఉండేది. క్షత్రియ వంశంలోని ధైర్య సాహసాలు గలవాడు. ఆయన కీర్తిని, త్యాగాన్ని, శౌర్యాన్ని స్వాతంత్ర్య పోరాటంలో ప్రదర్శించిన విధానము చక్కగా కవి వర్ణించారు. రామరాజు ఘన కార్యాలన్ని విప్లవ వీరులకు, విప్లవ చైతన్య మార్గంగా ఉంటాయని కవి భావించాడు.

పంచమీ విభక్తిలో కళికలో విప్లవ సైన్యంలోని వీరుల సాహసం విరిస్తూ...

ధారకాండమీద తాను తాపసిగా నగుట వలన
ఊరు వార్కి నోషధువిడి ఉపకాగ నగుట వలన
అహము రేయి వారి కెప్డు నండ దండలగుట వలన
గంటదొర మల్లుదొరల గండర గండరల వలన
కంటి రెప్పవలె రాజును కాయుచు నండగుట వలన
వీరసింగమై దూకెడు వీరపడాల్ తోడు వలన
వీరన్న బాలన్న పడాల్ వీరికి తోడగుట వలన[211] అంటూ

రామరాజు ఉత్తరాభారత దేవయాత్ర తర్వాత ధారపర్వత మీద తపస్సు చేసి యోగి మారాడు. అక్కడ ఉన్న ప్రజలను ఔషద మూలికలతో వైద్యుడుగా పేరుగాంచాడు.

రేయిపగలు మన్యం ప్రజలకు కష్టసుఖాల్లో తోడునీడగా ఉండేవాడు. గంటందొర, మల్లుదొరలు విప్లవసైన్యానికి, రామరాజుకు అంగరక్షకుడుగా ఉంటూ కంటికి రెప్పలా కాపాడుకొనేవారు. వారే కాకుండా విప్లవ సైన్యంలో సింగన్న, పడాల్, వీరన్న, బాలన్న వంటి వారు సైన్యంలో ఉక్కు పిడుగులుగా ఉండేవారని కవి వెల్లడించాడు.

షష్ఠీ విభక్తిలో శార్దూలమనే వృత్త పద్యంలో గెరిల్లా యుద్ధ నిపుణత నేర్పు సందర్భంలో....

శా॥ వీరాగ్రేసరుడైన మల్లుదొరకున్ వల్లంబుకున్ తోడగా
రారా రమ్మని గాము గంటము దొరన్ రప్పించి మెప్పించగా
ఆరాటంబులు నేర్పినాడు ప్రజకున్ స్ఫూర్తిన్ సదా తేజమై
ఆరాటంబున విల్లుబట్టి విభుడే అల్లెన్ "గెరిల్లా" సవాల్... **212** అంటూ

రామరాజు విప్లవ సైన్యంలో రక్షక దళంగా ఉన్న మల్లుదొర, గంటందొరలకు బాణాలు ప్రయోగించడంలో శిక్షణ యిచ్చేవాడు. అంతేగాక విప్లవ సైన్యంలో ఉన్న వీరులకు యుద్ధ నైపుణ్యమైన మెలకువలు నేర్పుతూ ఉండేవాడు. బ్రిటిష్ వారిని ముప్పుతిప్పలు పెట్టిన గెరిల్లా యుద్ధ తంత్రాలను వీర సైనికులకు తర్ఫీదు యిస్తూ గెరిల్లా యుద్ధ నిపుణులుగా తయారుచేసాడు. అక్కడ ఉన్న జనులలో రామరాజు తుపాకీ కాల్చడంలో మంచి నిపుణుడు. అతని స్ఫూర్తిదాయకంగా తీసుకొని యద్ధ పరిణితిలో ఆరితేరిన విప్లవ వీరులుగా మారిపోయారని కవి వర్ణించారు.

షష్ఠీ విభక్తిలో కళిక పద్యంలో రామరాజు పౌరుషాన్ని వర్ణించిన సందర్భంలో...

నిద్రముద్ర తొలగించగ నిప్పుకమైరగులు వాన్కి
రుద్రునిగా ప్రజ్వరిల్లు రోషము మెండైన వాన్కి
పట్టుపట్టి వదలనట్టి పరమ విక్రమోన్నతునకు
భట్టి విక్రమార్కునంటి భండన కదనోన్నతునకు
కత్తిసాము కర్రసాము కదనరంగ ప్రవీణనకు
ఉత్తరించు కత్తిరీతి ఉగ్రుడు దొరప్ర కాండులకు

ఊపిరి తడు గిరిజనులకు ఉతమితడు నాంధ్రులకు
రాపిడితడు తెల్లవార్కి రాజు నితడు వేజములకు[213] అని అంటూ

రామరాజు మన్య సీమను బానిస నిద్ర నుండి మేల్కొని విప్లవమనే నిప్పును రగిలించాడు. మూడవ కన్ను తెరచిన శివుడు వలె వీరావేశముతో తిరుగుబాటు బాట వేశాడు. తిరుగుబాటు, విప్లవమనే కర్రసాము వంటి యుద్ధ విద్యల్ని నేర్పించి వారిలో యుద్ధమనే బీజం వేశాడు. మన్య ప్రజలకు ఊపిరి రామరాజు. ఆంధ్రులకు మార్గవవుతాడు. తెల్లవారి గుండెల్లో తెలుగు వీరత్వాన్ని వెలిగించిన మన్య మహావిప్లవ వీరుడుగా కవి కీర్తించాడు.

షష్ఠీ విభక్తిలో ఉత్కళిక పద్యంలో రామరాజు యుద్ధ సమాచారాన్ని వివరిస్తూ.........

ముందు చెప్పి ముంట్టడించె
అందు సంతకంబునుంచె
ఆహవపు బహు నిరతునకు
వేయి వెల్గులు వేకువకు
రేయిని వెల్గు తారలకు
శక్తినాడు నెత్తుటికి
ముక్తినాడు భారతికి[214] అని పలుకుతూ

విప్లవ తిరుగుబాటులో బ్రిటిష్ సైన్యంనకు ఒక చీటి ద్వారా ముందుగా సమాచారం చెప్పి పంపేవారు. దానిని మిరపకాయటపాగా బ్రిటిష్ వారికి భయం పుట్టించేది. పోలీసు స్టేషన్లు ముట్టడించి రిజిస్టర్ సంతకం చేసి ఎన్ని ఏవేని పట్టుకెళుతున్నాడో రాసి సంతకం పెట్టేవాడు.

నెత్తురుంటేనే శక్తి వస్తుంది అలాంటిది నెత్తుటికే శక్తిగా మారాడంటే ఎంత తీవ్రంగా ఉంటుందో, మరియు ఊ... ఉంటే చాలు మన్య ప్రజలలో విప్లవ ఆవేశం, వారి నెత్తుటిలో పౌరుషం రగలడం అదీ భారతికి ముక్తి, స్వేచ్ఛను ప్రసాదించడానికి కవి చిన్న పదాలతో అంత ఉన్నత భావాలని వర్ణించడం విశేషం.

సప్తమా విభక్తిలో ఉత్పలమాల పద్యంలో రామరాజు పోరులో సన్నగిల్లిన వీడని ధైర్యం గూర్చి వివరిస్తూ.........

ఉ॥ భారతమాత యందమిత భక్తిని గల్లిన భారతీయుడై
పోర పటాలమైన సరిపోవని దుస్థితి నందుకూడ, గం
భీరత వీరడాయె గిరి వీర కుమారుల దండు తోడనే
వీర పరాక్రమోన్నతుడు వెన్నును చూపునె యుద్ధ మందునన్[215] అంటూ

భారతమాత దాస్య విముక్తికి పోరాటం చేసిన దేశభక్తుడు. యుద్ధంలో బ్రిటిష్ సైన్యంలో సరిపోవేమోనని, వారి ఎదిరించలేమని తెలిసిన వారిపై తిరుగుబాటు లేవదీసిన భారతీయ వీరసైనికుడు. ఎంతో ధైర్యంతో, గంభీరతతో చిరునవ్వు చెదిరి పోకుండా మన్య ప్రజల వీరత్వముతో పోలీసు బలగాన్ని సంఘటిత శక్తితో ఎదుర్కొనగలమనే ఆత్మవిశ్వాసం గిరిజన ప్రజల్లో కలిగించాడు. ఆ చిన్న విప్లవ సైన్యం అతిపెద్ద సైన్యమైన బ్రిటిష్ వారితో సాహసోపేతమైన యుద్ధం చేసిన మహావీరుడుగా కవి విశ్లేషించాడు.

సప్తమీ విభక్తిలో కళిక పద్యంలో బ్రిటిష్ సైన్యంతో పోరును వివరిస్తూ...

కోగొండు చెంచు భిల్లు ప్రజలె దండు మెండు
హాయిగ మన రామరాజు హమమునెక్కి కొండ నుండె
లక్షల బలగాల దొరల లక్ష్యం లాభించదాయె
లక్షణముగ లక్ష్యమున్న లక్షల బలమాగదాయె
మన్య ప్రజలె రామరాజు మహిత బలము సైన్యమందు
ధన్యుడాయె రామరాజు తా గిరిజన బలగమందు
సాహనాంగ చక్రవర్తి సమర పౌరుషాగ్ని నందు
సాహచర్యమందు నంత సహజ తేజులాజినందు[216] అంటూ

మన్యంలో జీవించు అనేక జాతుల ప్రజలందరు రామరాజు వెనుక సైన్యంగా కొండలలో నదీ పరివాహ ప్రాంతంలో వెళ్ళుచుండేవారు. ఒక రోజు బ్రిటిష్ బలగాలు విప్లవ సైన్యం కంటబడినారు. బ్రిటిష్‌వారికి, విప్లవ సైన్యానికి భీకరమైన పోరాటం జరిగింది. ఆ పోరాటంలో రామరాజు సైన్యం ప్రదర్శించిన సాహసోపేతమైన యుద్ధ

తంత్రలతో ఆంగ్లేయులను మట్టి కరిపించాడు అని కవి తెలిపారు.

సప్తమీ విభక్తిలో ఉత్కళిక పద్యంలో కవర్టు,హైటర్ల మరనాల గూర్చి...

ధామ్మనియెను శబ్ధమంతా
కిమ్మనెడె "కవర్టు" వింతా
ఎర్రేసు తూటా పేలె
సఱ్రున "హైటరు" రాలె
దోపిడి కొనసాగె నందు
ఆపదందు రేగె నందు
"మొగలిదొడ్డి" ఘూటునందు
రగిలె పోరు నుభయులందు...**217** అంటూ

ఆంగ్లేయుల విప్లవ సైన్యంను అణచుటకు హైటర్, కవర్టు అనే బ్రిటిష్ సైనికులు రప్పించిరి. వారికి విప్లవ సైన్యానికి యుద్ధం జరుగుతుంది. కవర్టును ఎర్రేసు తుపాకి తూటాతో పేల్చినాడు. అదే ప్రతాపం హైటర్ పై తలపడినారు. ఈ పోరాటంలో బ్రిటిష్ సైనికులు చనిపోయారు. ఆంగ్లేయులు దు:ఖముతో, విప్లవ సైన్యం విజయంతో ఉన్నట్లుగా కవి వర్ణించారు.

సంబోధనా ప్రథమా విభక్తిలో చంపకమాల పద్యంలో రామరాజును కీర్తిస్తూ...

గిరిజన వందితుండ! నిజ కీరితి దాల్చిన రాజ సింహ! భీ
తెరుగని గుండె నిండుగ తదేకత ధీరత మోసులెత్తగా
తరుముచు ముష్కరాధముల దౌష్ట్యము బాపిన భాను తేజ! యో
గురుతర పౌరుషోజ్జ్వల! "కోయల" గుండెల నిండు చంద్రమా**218** అంటూ

మన్యంలో ప్రజల కష్టాలు తీర్చువాడు. భారతమాతకు సేవచేసిన రాజవంశంలో సింహంలాగా నిలిచేవాడు. భయమెరుగని ధైర్యంతో గుండె నిండగ వీరత్వాన్ని ప్రదర్శించి దుష్టులైన బ్రిటిష్‌వారి చర్యలను ఎదిరించిన సూర్యని వెలుగువంటివాడు. నిజమైన దేశభక్తిని ప్రదర్శించి పౌరుష జ్వాలల్లో మన్య ప్రజలకు చల్లని వెన్నెలగా చందమామగా వెలసినాడని రామరాజును కవి వర్ణించాడు.

మరియు ప్రథమా విభక్తిలో కళిక పద్యంలో రామరాజును వర్ణిస్తూ

వీరవిప్లవ యోధుడా వేయి వెల్గుల సూర్యుడా!
వీరుడా! మా భారత ఖండ విప్లవోద్యమకారుడా!
తల్లడిల్ల తెల్లదొరల తరిమి కొట్టిన ధీరుడా!
ఉల్లమందు తెలుగునేల పల్లవించిన శూరుడా!
నిర్జించక "సితారణ్య" నిఖిల లోక సంహారా!
గర్జించుచు పీచమణచు కంఠీరవ ప్రహారా!
దెబ్బకు దెబ్బను గొట్టిన తెనుగు జబ్బ నిబ్బరమా!
మబ్బున పిడుగై కరిసెడి మహితాంబరయబ్బురమా![219]

ఈ కావ్యంలో ప్రతి పద్యంలో కవి రామరాజును స్తుతిస్తున్నట్లుగా కనిపిస్తుంది. కావ్యం ప్రారంభం నుండి చివరివరకు కూడా బ్రిటిష్ వారిపై ప్రదర్శించిన వీరత్వంను వర్ణిస్తున్నాడు. ఈ కావ్యంలో రామరాజుకు మరణంలేదు. బహుశ కళా దృష్టిలో విప్లవజ్యోతిలా వెలుగుతున్నట్లు చెపుతున్నాడు. తెలుగువారి పౌరుషాన్ని, శక్తిసామర్థ్యాల్ని పాఠకలోకానికి కవి కన్నులకు కట్టినట్లు చూపించారు.

అంతేగాక సార్వ విభక్తికములో, కవి నామాంకిత పద్యంలోని మంగళ మహశ్రీ పద్యంలోని రామరాజును కథానాయకుడిగా, విప్లవ వీరుడుగా, యోగిగా, మహర్షిగా, అనేక రూపాలలో చూపించాడు. ఆంధ్రవీరుడు, శ్రీరామరాజు వీరోచితగాథ, ఆచంద్ర తారార్కం చిరస్థాయిగా నిలిచివుంటుంది. ఆయన దేశభక్తి, త్యాగదీక్షలు ఆదర్శప్రాయమైనవి. రామారాజు ఆంధ్రుడై జన్మించడం ఆంధ్రులకు గర్వ కారణమని కవి విశ్లేషించాడు.

## 2.5 ఆంధ్రవీర – పద్యకావ్యం:

"పలికెడిది వీర చరితము
పలికించును భరత శౌర్యభావోద్ధతులే
పలికిన జన్మము ధన్యము
పలికెద మన యాంధ్రజాతి పౌరుష గాథన్"[220] అని అంటూ

చిన్నతనం నుండే అల్లూరి వీరాభిమాని అయిన కాకర్లపూడి వెంకటరాజు తన ఆరవ ఏట నుండి అల్లూరి జీవితాన్ని వర్తించే వివిధ పాత్రల్లో నటిస్తూ ఆయన ఉద్యమ జీవితాన్ని సమాజానికి తెలియజేశారు. ఆ కోణంలోనే ఆయన సమస్త జీవిత విశేషాల్ని తెల్పుతూ "ఆంధ్రవీర" అనే శృతిబద్ధమైన పద్యకావ్యాన్ని రాసి సాహితీ లోకానికందించారు. 135 పుటలు గల ఈ కావ్యంలో అల్లూరి జీవిత చరిత్రని ఆయన పోరాట పటిమను, విప్లవ పోరాటానికి అండగా నిలచిన అగ్గిరాజు, గంటం దొర, మల్లుదొర లాంటి ప్రముఖుల ప్రస్తావన గాలించారు. తెలుగు తల్లి తన పుణ్య గర్భమున ధైర్యసాహసాలు అధికంగా దివ్య తేజోమూర్తియైన వీరుడు జన్మించాడంటూ–

"శ్రీగల గౌతమీసతి పయోధరధారల గ్రోలి ఏవునన్
బంగరు పంటచేలు సిరిపూర్ణములై పరిచర్య సేయమా
తెన్గుల తల్లి కన్నదొక బాలుని, ధీరుని, క్షాత్ర తేజునిన్
పొంగిన శౌర్య ధైర్యముల ప్రోవును వీరుని రామరాజునిన్"[221]

ఆంధ్రదేశాన్ని సిరిసంపదలతో, పచ్చని పైరులతో వెలసిల్లజేసే గౌతమినది ప్రవహించే ఆంధ్ర లోకంలో తెలుగుతల్లి రుణం తీర్చుకోవడానికి ధైర్య సాహసాలకు మారుపేరైన తేజస్సు గల యుద్ధవీరుడు పుట్టాడనే విషయాన్ని తెలియజేశారు.

అల్లూరి సీతారామరాజు పూర్వీకులు గుంటూరు జిల్లా బొప్పూడి గ్రామం వారు, అక్కడ నుండి ఒక కుటుంబం గోదావరి జిల్లాలో మొగల్లు ప్రాంతానికి వలస వచ్చారని, ఆ గ్రామంలో వారంతా క్షత్రియ వర్గానికి చెందినవారని వారంతా కలసి స్వాతంత్ర్య సాధనకు భారతదేశాన్ని బానిస సంకెళ్ళ నుండి విముక్తి చేయడానికి పరితపించేవారనే విషయాన్ని తెల్పారు. అలాంటి కుటుంబంలో అమ్మమ్మ, తాతయ్యల ఇంట పాండ్రంగి గ్రామంలో తేది 04.07.1897న అల్లూరి సీతారామరాజు జన్మించాడని తెలియజేశారు. వారి వంశంలోని స్త్రీ పురుషులందరు వేద, సంస్కృత విద్యల్ని అభ్యసించేవారనే విషయాన్ని వివరించారు. అలాగే అల్లూరి సీతారామరాజుకి చిన్నతనం నుండి నాయకత్వం లక్షణాలు ఉన్నాయంటూ–

"తోటి బాలురగూడి ఆటలాడెడువేళ
తనమాట నెగ్గనారాటపడును
చిన్నారి స్నేహితుల చేర్చి నాయకువోలె

నడిపించి వారినానంద పరచు
తన తండ్రి జెప్పిన ఉత్తమ గాథల
నేస్తులమనసు నాటంగ చెప్పు
తలచిన పనియెంత వెతలబెట్టెడిదై
పూనిక విడువక బూర్తి చేయు
తనకు బుద్ధిపుట్ట పని ఎంతదయినను
చేసి చూచిగాని చింతవిడదు
చిన్ననాటి నుండి శ్రీరామరాజుకు
కార్యశీలము ఉగ్గుపాలగలిగె"[222] అని అంటూ

బాల్యదశ నుండి తండ్రి చెప్పిన వీరగాథల్ని తన స్నేహితులకు తెలియజేశేవాడు. వారికి నాయత్వం వహించి అనుకున్న పనిని సాధించేవరకు పట్టు విక్రమార్కుడులా ప్రయత్నించే వాడని వివరించారు. అల్లూరిలోని పట్టుదల, కార్యశీలదక్షతను వ్యక్తపరిచిన తీరు ద్యోతకమౌతోంది. రామరాజు తండ్రి వేంకటరామరాజు రాజమండ్రిలో ప్రముఖ ఛాయచిత్రగ్రాహకుడుగా పేర్గాంచాడు. ఆయన తన సంపాదనంతటిని ధర్మకార్యాలకే వెచ్చించేవాడని, వారి ఇళ్ళు నిత్యం బంధుమిత్ర పరివారంలో కళకళలాడుతూ ఉండేదని, అలా ఎంతమందికైనా కాదనక ఆతిథ్యమిచ్చే వారంటారు. అంతేకాకుండా దేశభక్తికి మారుపేరు అల్లూరి కుటుంబమంటారు. అలాగే సీతారామ రాజు తల్లి స్వార్ధచింతన లేని స్ఫూర్తివంతురాలని, నాటి సమాజంలో మహిళలకు ఆమె ఎంతో ఆదర్శప్రాయంగా ఉండేదనే విషయం కూడా తెలియపరిచారు.

ఒక రోజున సీతారామరాజు తన తండ్రి చెప్పే రామగాథల్ని వింటూ, మననం చేసుకుంటూ వెళ్ళే సమయంలో ఆంగ్ల అధికారి ఒకరు గుర్రంపై ఆ మార్గంలో వెళ్తుంటాడు. అందరు అతనిని నమస్కరిస్తుండగా రామరాజు కూడా వందనమర్పిస్తాడు. అది చూసిన తండ్రి వేంకటరామరాజు–

"అదియుగాంచిన తండ్రి ఆగ్రహమున
చేతిపైకొట్టి ఇట్లనిచెప్పె మరల
మనకు శత్రువువాడు మన స్వేచ్ఛహరియించె
వానికి మ్రొక్కంగ వలదు తండ్రి"

"స్వేచ్ఛకై పోరాడు క్షాత్రశక్తి మనది
పరులకు మ్రొక్కుట పాడిగాదు
చేతనైనయంత చేవగలిగినయంత
పోరాడవలె స్వేచ్ఛ పొందువరకు"[223]

బ్రిటీషువారికి మొక్కుతూ తలవంచిన రామరాజును గర్ధిస్తాడు. పట్టరాని కోపంతో ఆవేదనతో ఆయన చేయిపై కొట్టి, బ్రిటీషువారు మన దేశీయుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని హరించి బానిసలుగా చేశారని, కుమారునికి తెలియపరిచిన విధానాన్ని వ్యక్తపరిచారు. అంతేకాకుండా ఆంగ్లేయులు వ్యాపారరీత్యా వచ్చి మనల్ని మభ్యపెట్టి, మనలో మనకి తగవులు పెట్టి దేశాన్ని ఆక్రమించారనే విషయాన్ని కూడా తెల్పిన తీరును వెల్లడించారు.

సీతారామరాజుకి తన తండ్రి అనువణువునా దేశభక్తిని నూరుపోసిన సంగతిని కూడా గుర్తు చేశారు. కొంతకాలానికి కలరా వ్యాధి సోకి తండ్రి మరణించగా, బిడ్డల బాధ్యత తల్లిపై పడింది. తదనంతరం తన పినతల్లి రామరాజుని భీమవరంలో గల క్రిష్టియన్ స్కూల్లో చేర్పిస్తుంది. బ్రిటీషు వారన్నా, వారి విద్యాసంస్థలన్న, ఆగ్ల భాషన్న విముకత వ్యక్తపరిచే రామరాజుకు బంధువుల్ని బాధించడం ఇష్టం లేక తగని పరిస్థితుల్లో ఆత్మహత్యకు పాల్పడతాడు. ఆ సమయంలో ఆయన–

గరళ మాత్రల నెట్టులో సంగ్రహించి
రెండువందల మాత్రల మ్రింగె నమలి
చావురాలేదు తీవ్రమౌ జ్వరము వచ్చె
మూడు మాసాలు మంచాన మ్రగ్గిపోయె

అంటూ నిద్రమాత్రలు సేవించి ప్రాణాలు తీసుకోవడానికి ప్రయత్నించగా తీవ్రమైన జ్వరం వచ్చి మూడు నెలల పాటు బాధపడ్డాడనే విషయాన్ని వ్యక్తపరిచారు. బిడ్డ మనసును గమనించిన ఆ మాతృమూర్తి మరల ఆయన్నే రాజమండ్రి స్కూల్లో చేర్పించడం జరుగుతుంది. అక్కడ రామరాజు ఎంతో పట్టుదలతో విద్యనభ్యసించడం, యోగా విద్యను నేర్చుకున్న తీరుని తెల్పుతూ–

"పతంజలి యోగసూత్రాల బఠియించి
హఠయోగమును శ్రద్ధ నాచరించె
ఎల్లవేళల గురుని తావిడువలేక
అతడు చెప్పెడు మాటలాలకించు"[224]

గురువులు బోధించే అమూల్యమైన మాటల్ని ఆలకిస్తూ, యోగా విద్యలో గల అనేక పద్ధతుల్ని ఎంతో కఠోర దీక్షతో అభ్యసించాడనే విషయాన్ని వెల్లడి చేశారు. అంతేకాకుండా–

"తెనుగున కావ్యముల్ చదివి దీటుగ పద్యములల్ల నేర్చె తా
వినయము మీర నొజ్జకడ వేదము భాష్యము తోడవించు పా
వనమగు దేశ సంస్కృతుల భావములన్ మదికెక్క నేర్చెనా
ఘన గురు రామరాజు కడ కాలగతిన్ పరిచర్య సేయుచున్"[225]

తెలుగు సాహిత్యంలో వచ్చిన అనేక పద్య గద్య కావ్యాల్ని పఠించి గొప్ప గొప్ప పద్యాల్ని కంఠస్థం చేసి, వినయ, విధేయతలతో దేశ సంస్కృతి సాంప్రదాయాల్ని గూర్చి పూర్తిగా తెలుసుకున్న సంగతిని, గురుసేవా తత్పరుడైన తీరుని తెలియజేశారు. కాని ఆ తర్వాత పినతండ్రి రామకృష్ణం రాజు రామరాజును రామచంద్రాపురం స్కూలులో చేర్పిస్తారు. అనంతరం పినతండ్రి ఉద్యోగ రీత్యా కాకినాడకు బదిలీ కావడంతో తిరిగి రామరాజును పిఠాపురం రాజా హైస్కూల్లో మూడో ఫారంలో చేర్పిస్తాడు. అక్కడా ఆయనకి అనేకమంది

"దేశభక్తులైన విద్యార్థులెందరో
కాకినాడ స్కూలునందు కలరు
అందు ముఖ్యుడైన మద్దూరి పూర్ణయ్య
నేస్తమాయె తగదు నైజమెరిగి"[226]

రామరాజుకి కాకినాడలో ఎంతోమంది దేశభక్తులు పరిచయం కావడం, అందులోనూ తన మనసెరిగిన మద్దూరి పూర్ణయ్య ఆయనకు ముఖ్య స్నేహితుడయిన విషయాన్ని తెల్పారు.

కాకినాడలో చదివే కాలంలో నాటకాలు వేయడం, వ్యాయామం చేయడం, కుస్తీలు పట్టడం, బండల నెత్తడం లాంటి విద్యల్ని నేర్చుకోడంలో ఎంతో నేర్పుతో ఉండేవాడని, అన్నింటికన్నా నాటకాలు వేయడానికి ఎక్కువ సమయాన్ని అత్యంత ఉత్సాహాన్ని చూపేవాడంటారు.

ఆ సమయంలోనే మద్దూరి అన్నపూర్ణయ్య ఆంగ్ల విద్యా విధానాన్ని నిరసిస్తూ–

"పర విద్యల సమ్మోహపు
మరపున నాంగ్లేయ విద్య మరిమరి నేర్వన్
స్థిరమగు నీ బానిస బ్రతుకులు
కరమరుదగు దేశ స్వేచ్ఛ కలకాలమ్మున్"[227] అని

పలకగా ఆశ్చర్యంతో ఆయన మనసును గ్రహించి దేశభక్తి నరనరాల్లో నిండి ఉన్న అతనిలో స్నేహం ఎంతో ఉపయోగకరమని భావిస్తాడు. కాకినాడలో నాటకాలు వేసే రోజుల్లో అన్నపూర్ణయ్యతో పరిచయమేర్పడటమే కాకుండా శశిరేఖ, నారధుని పాత్రలు వేసి ఎందరో ఆశీస్సుల్ని పొందడమే కాకుండా ఎన్నో బిరుదుల్ని కూడా పొందారనే విషయాన్ని తెలియజేశారు.

"కళలతోడజెప్పు కావ్యనీతులెల్ల
ప్రజల హృదయాలలో పాదుకొనును
చెప్పుమాటకన్న చేయుచు జూపెడు
నీతి గాధరీతి నాటుగాదె"[228]

కళల్ని ప్రదర్శిస్తూ వాటిలో పద్యగద్య కావ్యాల్లోగల నీతుల్ని మేళవించి, నాటి సమాజంలో భారతీయులు అనుభవిస్తున్న వివిధ గాధల్ని వ్యక్తపరచడం వల్ల ప్రజల్లో మార్పును తీసుకురావడానికి వీలుంటుందని చెప్పగానే అన్నపూర్ణయ్య ఎంతగానో మెచ్చుకుని, హత్తుకుని మనల్ని బానిసలుగా చేసే విద్యల్ని అభ్యసించడం కంటే దేశీయ విద్యల వల్ల తెలివితేటలు రావా మన విద్యా విధానంలో గల నీతుల్ని బోధించుట వల్ల మనకెంతో శ్రేయస్కారం. పరవిద్యా విధానం మనల్ని పాడుచేస్తుందని హితవు పలుకుతాడు. ఆ సందర్భంలో సిరిసంపదలతో తులతూగ భారతావని స్థితిగతుల్ని గూర్చి చెప్తూ–

"ఎన్నివరాల భూములు మరెన్నివర్గపు రత్న రాసులె
న్నెన్ని వనాలు పూత జల పూర్ణము లైన నదీనదాలు ము
న్నెన్నిక గన్న వేద మధురోక్తుల కావ్యము లర్ధశాస్త్రముల్
అన్నియు గల్గి నేటికిటు భారతి బానిస యెట్టులాయెనో!"[229]

అని అంటూ పాడిపంటలతో, నిత్యం జల జల పారె, నదీనదాలతో, రత్నరాశులతో వెలుగొందింది భారతభూమి. అంతేకాకుండా వేదపారాయనాలో, జ్ఞానసంపద, ఆర్థిక ఎదుగుదలలో తులతూగే భారతావనికి ఎంతటి ఘోర బానిసత్వంలో

సతమతమౌతోందని వాపోయిన తీరుని వ్యక్తపరిచారు.

అంతేకాకుండా వారిరువురు కలసి దేశ దీనస్థితిని గూర్చి పరిపరివిధాల ఆలోచిస్తూ ఉండేవారని, పిల్లలమైపోయాంగాని దేశప్రజలు మెచ్చే విధంగా బ్రిటీష్ వారిని ఎదుర్కునే వారమని చింతిస్తూ ఉండే స్థితిని గూర్చి తెలియజేశారు. ఆ సమయంలో అన్నపూర్ణయ్య–

"అంతట నొకనాడు అన్నపూర్ణయ దెచ్చి
రాజుకిచ్చెను జార్జిరాజు బొమ్మ
ఉన్న పతకమ్ములను విసరికొట్టెనురాజు
ఒక్కటి తన గుండెపైన నుంచె"[230]

బ్రిటీష్ అధికారి జార్జి ఫోటోను తెచ్చి ఇవ్వగా, తను సాధించిన పతాకాలన్నింటిని విసిరిగొట్టి జార్జి బొమ్మను మాత్రం తన గుండెలపై పెట్టుకుంటాడు. ఇదేమిటని మిత్రుడు ప్రశ్నించగా మనల్ని బానిసలుగా చేస్తూ మన గుండెలపై నిలబడ్డాడని నిరంతరం గుర్తుకు వచ్చేల చేస్తుందని అంటాడు. అంతేకాకుండా మన హృదయ భారాన్ని, తీర్చుకోమని గుర్తు చేస్తూనే ఉంటుందని పల్కుతాడు. అంతట స్నేహితుడు ఈ స్కూల్లో ఎందుకు చేరావు అని ప్రశ్నిస్తాడు? తన పినతండ్రి ఉద్యోగరీత్యా బదిలీలు అవడం వల్ల ఇక్కడ చేరాను అని సమాధానమిస్తాడు. మరల తన చిన్నాన్నకు విశాఖపట్నం తర్వాత తుని బదిలి కావడంతో తన విద్యాబ్యాసనం సాగిందని వివరించారు. తూర్పుగోదావరి జిల్లా తునిలో చదువుతుండగా అక్కడ–

తునిలోన నొక్కడు తోడాయె తనకును
పేరిచర్ల సూర్యనారాయణుండు
దేశభక్తిలోన తనకు ధీటగువాడు
చదువున కుశాగ్ర బుద్ధియతడు
సీతమ్మ కొండపై చేరి సాయంత్రాలు
చర్చచేతురు దేశ చరితలెల్ల
దేశమెల్ల జూచి తిరిగి వచ్చినకాని
తేటపడదు త్రోవ దొరకదనుచు
అనుచు నిశ్చయించిరా మిత్రులిద్దరు
పయనమైరి దేశ పర్యటనకు

బస్తరు మన్యమ్ము జయపుర ప్రాంతమ్ము
తిరిగి చూచి వచ్చిరి తునికి మరల"[231] అని తెల్పారు.

తునిలో పరిచయమైన పేరిచర్ల సూర్యనారాయణ మరికొందరు స్నేహితులతో ఆ ప్రాంతంలో గల సీతమ్మ కొండపైకి వెళ్ళి దేశాన్ని బానిసత్వం నుండి విడిపించడమెలా అని చర్చించుకుంటారు. ఆ మాటల సందర్భంలో దేశంలో గల వివిధ ప్రాంతాల్ని దర్శించి వస్తేగాని విముక్తి మార్గం దొరకదని నిశ్చయించుకుని, ఆ స్నేహితులిద్దరూ బయల్దేరి బస్తరు, జయపుర ప్రాంతాల్ని పరిశీలించి తిరిగి తునికి చేరుకున్న విషయాన్ని తెలియజేశారు.

తరగతి గదిలో ఎప్పుడూ ఏదో ఒక ఆలోచనతో ఉండే రామరాజుని గమనించిన ఉపాధ్యాయుడు ప్రతి క్షణమూ ఏదో ఒక ఆలోచనలో ఉంటున్నావు సన్యాసివవుతావా అని ప్రశ్నించగా దానికి ఆయన అవునని సమాధానమిస్తాడు. దీన్ని బట్టి సీతారామరాజు పాఠశాల స్థాయిలో దేశ రక్షణ కోసం ఎంతగా ఆలోచించేవాడో అర్థమౌతోంది.

ఆ కాలంలో తుని ఆస్థాన కవి వత్సవాలు నీలాద్రి రాజు దగ్గర జోతిష్య, హఠయోగ విద్యల్ని, రాత్రి వేళల్లో మూతబడిన దేవాలయాల్లో, స్మశానం, మరియు కొండలపై ధ్యానం చేసేవాడనే విషయాన్ని వివరించారు. అంతేకాకుంగా, చించినాడలో మునసబు దగ్గర గుఱ్ఱపు స్వారీని, గ్రంథాలయాలకెళ్ళి గజశాస్త్రాన్ని, సంస్కృతాన్ని అధ్యయనం చేస్తాడు.

"పట్టిన దేదైన పట్టువిడువక నేర్చు
తృప్తి గొనడు అతని తత్వమేమొ?
నేర్చినదేదైన నెరవేర్చితీరును
వెనుక జూడడింత విసుగుపడడు"[232] అని అంటూ

సీతారామరాజు ఏదైనా ఒక కార్యాన్ని తలపెడితే అది పూర్తయ్యేవరకు నిద్రపోయేవాడు కాదనే విషయం వ్యక్తపరిచారు. అదే విధంగా సూర్యనారాయణ రామరాజు కలసి ధ్యానమాచరించడం, దేవాలయాలకెళ్ళి పూజలు చేయం చేస్తుండగా వారికి దాట్ల కృష్ణవర్మతో స్నేహమేర్పడుతుంది. మిత్ర బృందానికి తానే నాయకుడౌతాడు. దేశ బానిస సంకెళ్ళు పోగొట్టడానికి ఎన్ని రోజులు ఇలా పడిగాపులు కాయాలని ఆలోచించి దేశాన్నంతటా చూడాలని నిశ్చయించుకుంటాడు. ఆ విషయాన్ని మిత్రులతో తెల్పగా వారు వెనుకడుగు వేశారు. దానితో తాను తల్లికి కూడా చెప్పకుండా బయల్దేరి నేటి

బందరు, మహారాష్ట్ర, అజంతా గుహల్ని దర్శిస్తాడు. అనంతరం బౌద్ధరామాల్ని చూసి బుద్ధుని కార్యకారణ సిద్ధాంతాల సారాన్ని గ్రహిస్తాడు. కాని దుష్టుల్ని శిక్షించడానికి శాంతం అంతగా ఉపయోగపడదని మనసులో ఆలోచించారు. కాని భగవద్గీత తనకు ఆదర్శమని తలచిన విధానాన్ని తెలియజేశారు. అంతేకాకుండా–

"గోదారి పుట్టిన కొండశిఖరము గాంచి
నాసికాత్రయంబకు నర్చజేసి
పంచవటిని జేరి శ్రీరామ పాదముల్
తాకిన శిలపైన దలను బెట్టి
కన్నుల బాష్పముల్ క్రమ్ముచుండగ మ్రొక్కి
సీతమ్మ చెరబడ్డ చోటు జూచి
చుప్పనాతికి ముక్కు చెవులు కోసిన చోటు
సౌమిత్రియాశ్రమ స్థలము జూచి
మాయా మృగమ్మయిన మారీచునిన్‌జంపి
రామయ్య నిలిచిన రాయిజూచి
ఇచ్చటనె జటాయు జీవములు బాసె
నంచు దలవంచి భక్తితో తాను మ్రొక్కె
పులకితుండాయె జన్మ పావనముగాగ
రామగాథలు మనసున రాజ్యమేల"[233] అని

అంటూ రామరాజు భద్రాచలం పరివాన్ ప్రాంతంలో శ్రీరాముడు సంచరించిన ప్రదేశాలన్నింటిని తిలకించి రామగాథల్ని విని పులకించిపోయిన విధానాన్ని తెలియపరిచారు. తర్వాత పంజాబ్ చేరి లాలాలజపతిరాయ్ లాంటి స్వాతంత్ర్యోద్యమ వీరుల్ని కలిసి వారితో చర్చిస్తాడు. తదనంతరం కౌరవ పాండవులకు యుద్ధం జరిగిన యుద్ధం భూమికి చేరతాడు. ఆ ప్రదేశంలో జరిగిన హితోపదేశాల్ని గూర్చి వర్ణిస్తూ–

"ఇచ్చోటనే శౌరి ఇచ్చెను క్రీడికి
భగవద్గీత పరమార్ధ బోధ
ఇచ్చోటనే భీష్ముడంప శయ్యను జేరి
భరతనీతిని జెప్పె పాండవులకు
ఇచ్చోటనే పద్మవ్యూహమ్మునుం జీల్చి

సౌభద్రుడంత స్వర్గస్తుడాయె
ఇచ్చోటనే యధర్మమ్ము పై ధర్మ
మఖండ విజయమ్మునొందె
ధర్మనిర్ణయ తులాభారమిచట
వీసమైనను తప్పని వేదికిద్ది
ధన్యమయినది జన్మ ఈ ధరణి జూచి
అనుచు నానందపడె తన యాత్మలోన"[234] అంటూ

అర్జునుడు, బీష్ముడు, సౌభద్రుడు లాంటి వారికి జరిగిన హితబోధల్ని, శ్రీకృష్ణ తులభారం జరిగిన విధానాల్ని ప్రస్ఫుటించారు. ఆ తర్వాత వారణాసి చేరతాడు. అక్కడ అంబికా రమణుడు తారక మంత్రాన్ని ఉపదేశిస్తాడు. అలాగే కాశీ ప్రాంత విశిష్టతల్ని అవగాహన చేసుకుంటాడు.

"ఆదిశక్తియైన అన్నపూర్ణదేవి
ఆది భిక్షువు కిచ్చె శక్త్యాన్నమిచట
పాప పంకిలముల ప్రక్షాళణమొనర్చు
పావనగంగ ప్రవహించు నిచట
వేద గానమ్ములను వినువీధులను నింపు
ఉద్గాతలెందరో యుందురిచట
ఆది యంతము లేని యాత్మ లింగము జూడ
మహర్షులెందరో మనుదురిచట"[235]

అని కాశీలో వెలిసిన అన్నపూర్ణదేవి, జనుల పాపాల్ని పోగొట్టే గంగానది, వేదవేదాంగాల్ని పఠించిన ఋషులు అక్కడ వెలసిన ఆత్మలింగాన్ని తిలకిస్తూ, స్మరిస్తూ, ఇక్కడే ఉన్నారనే విషయాన్ని తెల్పారు.

అక్కడ వెలసిన కాశీవిశ్వేశ్వరుని, అన్నపూర్ణదేవిని, కాశీవిశాలాక్షికి, వ్యాసకాశీని, చూసి వారికి అర్చణమొనర్చాడనే విషయాన్ని తెలియజేశారు. అదే విధంగా అక్కడ బ్రాహ్మణులకి, రామరాజుకి మద్య తలెత్తిన తగాద గూర్చి తెల్పుతూ-

"వటుజందెమును జూచి వాక్కును బరికించి
బ్రాహ్మణుడని వారు భ్రమను పడిరి

సహపంక్తి భోజనము సంస్కృతాధ్యయనమ్ము
చాలకాలమిట్లు జరిగిపోవ
కొంతకాలమున కితడు క్షత్రియుడంచు
దెలిసి శిక్షింపంగ దలచి వారు
నేరమ్ము మోపగా నా నేరమేమి యని
నిలిచివాదము జేసె నేర్పుతోడ
బ్రహ్మ క్షత్రియులకు సహఫంక్తినేరమా
చరితలన్నిగాంచి చెప్పుడయ్య
పృధు చక్రవర్తితో భోజనము చేయడే
బ్రహ్మర్షి వశిష్ట బ్రాహ్మణుండు
కుంతి భోజుని ఇంటగుడువడే దూర్వాస
సంయమీంద్రుడు కుంతి సేయు వంట
అడవిలో ద్రౌపది అతిధి బ్రాహ్మణులకు
సిద్ధాన్నమిడి తృప్తి సేయలేదే
సత్రయజ్ఞనములోన సహఫంక్తి భోజనము
చేయరే చతుర్వర్ణ జాతులంత

వారికి లేనట్టి వర్ణ వివక్షత
పాటింప ధర్మమే పండితులకు
నేడు నేరమ్ము నాపైన మోపదగునె
చరిత మరచిన ధర్మమే రీతి నిలుచు”[236] అని

బ్రాహ్మణ పండితుల ద్వారా రామరాజుకి ఎదురైన కుల వివక్షతని, దానికి సమాధానంగా వారికి వివరించిన చారిత్రక ధర్మనీతిని గూర్చి, గొప్ప గొప్ప దాన వీరులకే కాని వర్ణవివక్షత బ్రాహ్మణియులకు తగదని ఆవేదన చెందిన తీరుని వ్యక్తం చేశారు. ఆ తర్వాత అక్కడ నుండి అయోధ్య, చేరి సరయు నదిలో స్నానమాచరిస్తాడు. అలాగే కేదారనాధుని దర్శించి, మందాకిని నదిలో తన తండ్రి తాతలకు పిండాలు పెట్టి వారి ఆత్మశాంతి కలగాలని ఆశిస్తాడు. ఆ సంగతిని తన తల్లికి లేఖ రూపంలో తెలియజేసాడంటారు. అనంతరం, గంగోత్రి, యమునోత్రి, అలకనాంద, మజ్జనమాడి, భగీరథ నదులని తిలకిస్తాడు. అలాగే నేపాల్, కాశ్మీర్‌లకు వెళ్ళాలని నిశ్చయించుకున్న

రామరాజు ధైర్యసాహసాల్ని గూర్చి చెబుతూ–

"ఎట్లెగనో తెలియదెంత సాహసమది
క్రూర శార్ధుల ఖడ్గమృగాల దాటి
వాంగ్మాతీ నది జేరి నారాయణని దాటి
ఖాట్మాండు నగరాన కాలుమోపి
గండకీ నదిలోన నుండు సాలగ్రామ
విష్ణుప్రతిమల నేరి వేడ్కతోడ
ముక్తి ధామము జేరి మోక్షదాతను గొలచి
ఖాట్మాండు పశుపతిని గనుల జూచి
తిరిగిపోయెను కాశ్మీరదేశమునకు
అబ్బ ఎన్నెన్ని సాహసాలెంత శ్రద్ధ
ఎవ్వరైనను జేసిరే ఇంతదనుక
ఆది శంకరు వారసుడీతడాయె"[237]

అని అంటూ రామరాజులోని ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రస్ఫుటించారు. అలాగే ఆదిశంకరుడని వారుడిగా పోల్చడంలో రామరాజుకి గల భక్తితత్పరత స్పష్టమౌతోంది. అలా దేశంలో అన్ని ప్రాంతాల్లో సంచరించి తిరిగి–

"దేశమంతయు దీక్షతో తిరిగి దిరిగి
కడకు చేరెను కృష్ణదేవిపేట
దప్పిగొని ఒక ఇంట దాహ్మనడుగ
మజ్జిగను దాహమందించినారు"[238]

అని పుణ్యక్షేత్రాలు దర్శించి చివరికి కృష్ణదేవి పేటకు వచ్చిన విధానాన్ని వ్యక్తమౌతోంది. అక్కవరంలో ఎవరు మీరు? ఎక్కడ నుండి వచ్చారని ప్రశ్నించగా నాకొక చోటంటు లేదు. తపస్సు చేసుకుంటూ, సన్యసించడానికి ఇక్కడకొచ్చానని తెల్పుతాడు. ఆ మాటలు విన్న వెంటనే ఆ యింటి యజమాని తపస్సు తగిన స్థలం ధారకొండని అది అన్ని సదుపాయాలకు నిలయమంటాడు. అంతేకాకుండా ఆ ప్రదేశాన్ని చూపించి అక్కడ రామరాజుకి నివాసమేర్పరుస్తామని హామీ ఇస్తూ–

“అని బల్కివారంత నాత్మీయతనుజూప
అంగీకరించెనా ఆత్మధనుడు
ధారకొండపైన తగినచోటుజూచి
ఇల్లొకటి నిర్మించి ఇచ్చినారు
అందులో తానుండి అహోరాత్రముల్
దీక్షతో తపము తానాచరించె
కఠిన దీక్షలతోడ కాళినుపాసించి
ఎన్నో శక్తుల పొందెనందురచట”[239] అని

అంటూ రామరాజు ధారకొండపై కఠోరమైన ధ్యానసాధన గావించి అద్భుత శక్తుల్ని పొందాడనే విషయాన్ని తెలియజేశారు. అంతేకాకుండా తపస్శక్తి వల్ల కుండలినీ చలనశక్తుల్ని పొందాడని ఒక్కొక్కసారి అదృశ్యమౌతుండేవాడని, అతనికి అన్ని విషయాల్లోను ప్రావీణ్యముందని ప్రజల్లో ప్రగాఢ నమ్మకమేర్పడుతుంది. ఒక రోజు శరీరంలో ముళ్ళు గుచ్చుకున్న శరీరంలో చిటెకెల భాస్కరుడనే వారింటికి వెళ్తాడు. అతన్ని ఆ స్థితిలో చూసిన భాస్కరుని తల్లి సోమయమ్మ ప్రేమతో అతనికి పరిచర్యలు చేస్తుంది. అంతేకాకుండా రామరాజుకి బంధుమిత్రుల గూర్చి తెలుసుకుంటుంది. తన కుమారునితో లేఖ రామరాజు తల్లికి రాయిస్తుంది. ఆ వార్త విన్న సీతారామరాజు తల్లి, తన కుమారుడు, కుమార్తె, అల్లుడ్ని చెంత పెట్టుకొని కృష్ణదేవిపేటకు వస్తారు. వారిని చూసిన రామరాజు క్షేమ సమాచారాన్ని తెలుసుకుంటాడు. వారిని తన దగ్గరే ఉంచుకొని–

“నీలకంఠేశ్వరు నాలయము నెలవుగా
కాపురముంచెనా కన్నవారి
అచటనే తానుండి అర్థించువారికి
హస్త సముద్రికములమర జెప్పు
వాస్తవును జెప్పును వైద్యమ్ము జేయును
జాతక గ్రహగతుల జెప్పునతడు
భూత ప్రేతమ్ముల పిశాచ బాధల
గోలలకు రక్ష రేకులను గట్టి
శుభ ముహూర్తమ్ముల బెట్టు చోద్యమేమొ
తప్పదాతడు జెప్పిన చొప్పు జరుగు

అతడు దేవుడంచు అడివియంతయు మ్రోగె
కానుకల కాపురము గడపుచుండె"[240]

అని అంటూ అల్లూరి సీతారామరాజులో గల వివిధ నైపుణ్యాల్ని, విద్యల్ని గూర్చి ప్రస్ఫుటించారు.

అలా జీవనం సాగిస్తున్న సమయంలో బ్రిటీష్ అధికారియైన బాస్టియన్ అనే అక్కడి ప్రజలతో నానా పనులు చేయించుకుని కూలి ఇవ్వకుండా కూలీ అడిగిన వారికి చిత్రహింసలు పెడుతుంటాడు అని తెలుసుకున్న రామరాజు ఆ అధికారి దగ్గరకెళ్ళి ఇది తగదని వారిస్తాడు.

"జనుల బాధలు జూచి తాచక్కజేయ
బూని గ్రామాల దిరిగి బోధించ సాగె
అన్నిటికి మూలముల దెలుప నడవి జనులు
అతని బోధల నాసక్తితోడ వినిరి"[241]

నాటి సమాజంలో దోపిడి దారులు భూకబ్జాదారుల చేతుల్లో ప్రజలు ఏ విధంగా మోసపోతున్నారో తెలియజేస్తాడు రామరాజు ఆ మన్యం ప్రజల్ని నూతన మార్గాలవైపు పయనింపజేస్తాడు, వారి చీకటి బ్రతుకుల్లో వెలుగును చూపుతాడు. వారి మధ్య తగాదాల్ని వారి తీర్పుకానీల పంచాయితీలు పెట్టి, మద్యం మాన్పించి, వారిలో సామాజిక స్పృహను కల్గిస్తాడు.

మన్యం ప్రజలంతా రామరాజుని ఒక దేవుడిలా ఆరాధిస్తుంటారు. వారికి రామరాజు చెప్పిందే వేదంలా స్ఫురించేది. ఆ విషయాన్నే తెలుసుకున్న ఆంగ్లేయాధికారులు రామరాజుని ఎలాగైన అరికట్టాలని కుట్ర పన్నుతారు. ఆయన్ని అరెస్టు చేసి నర్శీపట్నం జైల్లో పెడతారు. బ్రిటీషు అధికారులంతా ఆయన వద్దకెళ్ళి–

మన్యము నందు నీవు మముఖాతరుసేయుట మానినావు నీవెందును
మన్యము నందు జోక్యమును మానుము నీకునుమాకు సేమమౌ!
మన్యమునందు నీకు తగు మాన్యమునిత్తుము కోరుకొమ్ము మా
కన్నిట తోడునిల్చి మనసిచ్చిన మాన్యత జెందుదు వన్ని వేళలన్"[242]

అని అంటూ రామరాజు మన్యం ప్రజల విషయంలో గాని, అక్కడ జరిగే వ్యవహారాల్లో జోక్యం చేసుకోవద్దని తెల్లవాళ్ళు లంచిమిచ్చి మభ్యపెట్టడానికి ప్రయత్నించిన తీరుని తేటతెల్లం జేశారు.

బ్రిటీష్ వారి కుటిల బుద్ధిని గమనించిన రామరాజు వారి మాటలకంగీకరించినట్లు చెబుతాడు. వెంటనే వారు పైడిపుత్రి దగ్గర ఏభై ఎకరాల పంటభూమినిస్తారు.

"దొరల ఎత్తుగడల సరివీరులకు దెల్ప,
సమ్మతించి వారు సాయపడిరి
ఇచ్చిన భూమిలో ఇండ్లు సాలలుగట్టె,
శ్రీరామ విజయ నగరమ్ము పేర" 243

ఆంగ్లేయుల నీచత్వపు దుర్మార్గాన్ని అక్కడి ప్రజలకు విన్నవిస్తాడు. దానికి వారు రామరాజుకి సహకరిస్తారు. ఆ ఐదు ఎకరాల భూమిలో ప్రజలకి ఇళ్ళు, పశుల శాలలు కట్టించి "విజయనగరమనే" నామాన్ని ఏర్పాటు చేసిన తీరుని వ్యక్తపరిచారు. అలా నిర్మించిన ఇంటిలో తల్లిని, చెల్లిని, పిలిపించి అక్కడ కాపురంమెడతాడు. బ్రిటిష్ అధికారులు అతన్ని నమ్మసఖ్యం కాదని ఇంటి దగ్గర వారి అనుచరుల్ని కాపలా పెడతారు. అయినప్పటికి రామరాజు వారి కనులు గప్పి రాత్రి సమయంలో దళాల్ని ఏర్పాటుచేయడానికి ప్రయత్నిస్తాడు. ఆ కాపలాదారుల కంటపడకుండా వ్యవహరిస్తాడు.

రామరాజు ధారకొండపై తపస్సు చేస్తూ ఆయుధపూజ చేయడాన్ని గమనించిన తల్లి గుండె తల్లడిల్లిపోతుంది. రాజు వంశంలో పుట్టి ఒకడికి తలవంచి బతకడం కంటే ప్రజల స్వేచ్ఛ కోరుకుని చావుటమేలంటాడు. ఆయన మాటల్ని విన్నవారికి మనస్సులో ప్రగాఢంగా నాటుకుపోతాయి.

"రాత్రులు దిరుగుచు నిద్దపు
పాత్రత గల వీరయోధ మిత్రుల నేరెన్
చిత్రముగా యధికారులతో
మిత్రత్వము నెరపుచుండె మేటిగ బవలన్" 244

అలా రాత్రి సమయాల్లో బ్రిటీష్ కాపలాదారుల చేత జిక్కకుండా వారికి వ్యతిరేకంగా పోరాడడానికి యుద్ధంలో సహకరించుకోవడానికి మిత్రులను ఏర్పరుచుకుంటూ,

ఆంగ్లేయులతో సఖ్యత చూపుతున్నట్లు చేయడంలో రామరాజులోని విప్లవ సన్నద్ధతేంటో అర్ధమౌతోంది. అంతేకాకుండా యుద్ధ వ్యూహ రచన చేయడంలో విప్లవ నిపుణతని వ్యక్తం చేసిన తీరు ద్యోతకమౌతోంది.

రామరాజుకి వివాహం చేయదలచిన తల్లి తన మనసులోని మాటను తెల్పగా–

"అని పల్కెడు తల్లిని గని
నన్నేమని తలచినావు నయముగనమ్మా
మనమున సన్యాసినినే
ననయము వివాహమెట్లు నాడంగలనే"[245]

అంటూ తన విముఖతని చూపడంలో రామరాజుకి తన సుఖాల కంటే సమాజశ్రేయస్సే ముఖ్యమనే విషయాన్ని విశదపరిచారు. ఆయన మాటలు వినగానే తన ఆశల అడియాశలైపోయాయంటూ వాపోయిన మాతృహృదయాన్ని ఆవిష్కరించాడు కవి. సొమ్మసిల్లిపోయిన తల్లికి నచ్చజెప్పి, సపరిచర్యలు చేసి, ధైర్యము జెప్పి పంపుతాడు. నాటి బ్రిటీష్ అధికారుల్లో మంచి, మనస్సున్న వాడు ఫజులుల్లఖాన్. రామారాజు చిన్నాన్నకు స్నేహితుడు కూడా. ఆయన ఒక రోజు అల్లూరిని పిలిపించి తన జాతక చెప్పమనడుగుతాడు. అంతేకాకుండా రామరాజు చేయబోయే పితూరీల్ని గూర్చి చెప్పమంటాడు. కాని అల్లూరి ఆయనతో మీరు బ్రతికేది కేవలం పది మాసాలు మాత్రమే. కాబట్టి మీరు ఉన్నంతకాలం పితూరీలేమి జరగవంటాడు. ముందు మీరు మా కుటుంబానికి ఏర్పాటు చేయాల్సినవి చేసుకోండని విన్నవిస్తాడు. రామరాజు చెప్పిట్లుగానే ఖాన్ మరణిస్తాడు. దీన్ని బట్టి రామరాజు జాతక విద్యలో ఎంతటి నేర్పు కలవాడో తెలుస్తుంది. అనంతరం–

"ఆంగ్లేయ పాలకుల అధర్మ చర్యలకు
కడగండ్ల పాలాయె కాననమ్ము
వందేళ్ళ చరితలో ఎందరో బలి యయిరి
చిన్న చిన్న పితూరీలెన్నో జరిగె
గొలుగొండ పితూరి గోండుల పితూరి
సాలూరి పితూరి సవరపోరు
జయపుర పితూరి లాగరాయి పితూరి
ద్వార బంధాల చంద్రయ్యపోరు

వ్యక్తి గతములకును వారసత్వములకు
మున్నబు దారుల మార్పులకును
జరిగిన వెన్నియో చిన్న పితూరీలు
ఒకటి రెండు నాళ్ళ ముగిసి పోయె"[246] అని అంటూ

నాడు జరిగిన చిన్న చిన్న ఉద్యమాల చరిత్రని సంక్షిప్తంగా వర్ణించారు.

ఇలాంటి చిన్న చిన్న పితూరీలు స్వాతంత్ర్యోద్యమం వరకూ కొనసాగుతూనే ఉంటాయి. తన తమ్ముడ్ని తనలో ఉంచమని తల్లినడగగా వాళ్ళు కూడా నీ చేతుల్తో చంపుతావా అని అనగానే రామరాజు మనసు వికలమౌతోంది. దానికి విధి నిర్ణయం ఎలాగుందో అలాగే జరుగుతుందంటూ–

"వీరుడొక్కసారె వీర మరణము నొందు
    పిరికివాడు జచ్చు పెక్కు మార్లు
తినుట కనుట తప్ప తెలియని మనుజుండు
    పుట్టనేల యతడు గిట్టనేల
ఎందరో పుట్టిరి ఎందరో పోయిరి
    వారి చరితలైన వసుధగలవె
మనుజధర్మము నెరపి మహనీయులెందరో
    కీర్తి పుటల నిలచిఖ్యాతి గొనిరి
మనకు మన వంశమున కొక్క మనుజుడైన
కీర్తి వెలయించి వారిలో జేరదలచి
నిశ్చయించితి నీసమర నిరతిసేయ
అడ్డు చెప్పకు మమ్మ! ఆశీసులిమ్మ!"[247]

అని అంటూ కన్నతల్లికి, పుట్టిన భూమికి సేవ చేయలేని జన్మ జన్మయే కాదంటాడు. మనసులో ఎలాంటి కలత చెందకుండా యుద్ధరంగానికి నను పంపు వీరమాతవై అంటూ తల్లిని అర్థిస్తాడు. అంతేకాకుండా–

"పద్మవ్యూహము జీల్చి పోరాడ నభిమన్యు
    దీవించి పంపదే దేవీసుభద్ర
పలనాటి యుద్ధాన శ్రీ బాల చంద్రుని

దీవించి పంపదే దేవి ఐతాంబ

పసుపు ముద్దను బెట్టి పాలు వినరిగినవంచు

ఖడ్గ తిక్కనను గేలి చేసెతల్లి

అరులపై బోరాడ నరిగెడు బిడ్డల

కాశీస్సు లివ్వదే ఆంధ్రమాత

వారిగాథలు చరితలో వాసికెక్కె

దేశదాస్యపు సంకెలల్ త్రెంచి వేయ

నన్ను బంపుము స్వేచ్ఛకై రణము సేతు,

వీరమాతవటంచు కీర్తింత్రు జనులు"[248]

అని చరిత్రలో ఎందరో తల్లులు తమ బిడ్డల్ని ప్రోత్సాహించిన తీరుని తెలియజేయడమే కాకుండా, భారతమాత బానిస సంకెళ్ళని తెంచడానికి, దేశానికి స్వేచ్ఛని కల్గించడానికి, యుద్ధరంగానికి పంపమనే విధానాన్ని, స్పష్టం చేశారు. అలా చేయడం వల్ల చరిత్ర పుటల్లో గొప్ప త్యాగమూర్తిగా మిగిలిపోతానని హితబోధ చేయడాన్ని వ్యక్తికరించారు.

అలాగే అల్లూరి తనక, బ్రిటీష్ ప్రభుత్వం ఇచ్చిన భూమిని తిరిగి వారికిచ్చేస్తానని లేఖ రూపంలో తెలియజేస్తాడు. దానిలో వారి ఆనందానికి అంతులేకుండా పోతుంది. తర్వాత సీతారామరాజు తన మనసులో తదుపరి సమరానికి ఆలోచనలు చేస్తూ పాపికొండలు చేరుకుంటాడు.

పరాయిదేశం నుండి వచ్చి మన దేశాన్ని, మన ప్రజల ధన, మాన, సంపదల్ని దోచుకుంటున్న ఆంగ్లేయుల దురాక్రమణలకి అడ్డుకట్ట వేయాలని సైన్యానికి కితాబునిస్తాడు. రామరాజుకి అండదండగా నిలబడి దేశ స్వాతంత్ర్యం కోసం ప్రాణ త్యాగానికైన సిద్ధపడిన యుద్ధదళము గూర్చి వర్ణిస్తూ-

"విల్లును చేబూని వైరి దళముల జీల్చి

చెండాడ గలిగిన చెంచు దళము

కొండ బండల దాగి కదనమ్ము సేయగా

క్రోల్పలుల చందాన కోయ దళము

వడిసెలల చేపట్టి వడిగ రాలను గొట్టు

మన్యంపు యువతుల మాటు దళము
పరిచారకుల వోలె దారులు మళ్లించి
శత్రుల చీకాకు సేయు దళము
వైరి వార్తల నందించు వేగు దళము
మిరప డొల్లల వుత్తరాల్ మాటు బెట్టి
వైరి సేనల కందించు మెరుపు దళము
తీరు తీరున దళముల తీర్చి దిద్దె!"[249]

అని అంటూ సీతారామరాజు అనుచరుల యొక్క శక్తి సామర్థ్యాన్ని వెల్లడి చేశారు. అంతేకాకుండా వారికి రామరాజు తెల్పిన యుద్ధనీతిని, నడవడికల్ని గూర్చి అలాగే వారు సీతారామరాజు మాటకు కట్టుబడిన విధానాన్ని వ్యక్తం చేశారు.

రామరాజు దళంలో గంటందొర, మల్లు, గోవిరి ఎఱ్ఱేసు, పడాల లాంటి వారిని ధైర్య సాహసాలకు మారుపేరుగా గుర్తు చేశారు. వారిని ఏ విధంగా ఒకరికి ఒకరు సహకరించుకోవాలో తెల్పి వారి యుద్ధోన్మాదుల్ని చేసి–

"చింతపల్లి పోలీసుస్టేషనునకు
వార్తనంపుడు రేపునే వత్తునంచు
సూర్యుడభిజిత్తు లగ్నాన జొచ్చువేళ
చేర వచ్చెద నిలువుడని చీటి వ్రాసి"[250]

మన్య ప్రాంతమైన చింతపల్లి పోలీసుస్టేషను ముట్టడిని ముందుగానే వార్తనందించిన పద్ధతిని ప్రస్ఫుటించారు. రామరాజు పంపిన వార్తను లెక్కచేయని పోలీసులు అల్లూరి వస్తే తిరిగి వెళ్ళడనే ధీమాతో ఉండగా, సీతారామరాజు వచ్చిన తర్వాత ఆయన్ని ఎదిరించలేక, ఎక్కడివారక్కడే నిర్ఘాంతపోయి, ఆయన్ని శరణు వేడుతారు. అంతేకాకుండా సీతారామరాజు నిరపరాదులైన అమాయక ప్రజల్ని పోలీసులు హింసించి జైళ్ళలో పెట్టడాన్ని తీవ్రంగా ఖండించి బంధీలుగా ఉన్న అమాయకుల్ని విడుదల చేయడం, పోలీసులు ఆయన ధాటికి ఎటు వెళ్ళాలో తెలియక పడుతూ లేస్తూ పరుగులు తీసిన విధానాన్ని తెలియపరిచారు.

అలాగే ధారకొండ ప్రాంతంలో బ్రిటీషు వారికి రామరాజు సైన్యానికి మధ్య జరిగిన యుద్ధంలో ఆంగ్లేయ అధికారులపై విరుచుకుపడిన తీరును తెల్పుతూ–

"కవర్టు గుండెలో కసిగ దూరెను గుండు
హైటరు కణతలో నాటె గుండు
పడిపోవు దొరలను పట్టు గొనగవచ్చె
బళ్లారి హెడ్డొకడు భయము లేక"[251]

సీతారామరాజుపై దండెత్తి వచ్చిన కవర్టు, ఫైటరు, బళ్ళారి హెడ్ లాంటి వారు ధారకొండ యుద్ధంలో అశువులు బాసిన కథనాన్ని చక్కగా చిత్రించారు. కవి దీనిని బట్టి రామరాజు సైన్యం ఎంతటి పగడ్భందిగా, యుద్ధ ప్రణాళికను సిద్ధం చేసుకుందో వ్యక్తమౌతోంది.

ధారకొండ రణంలో చనిపోయిన బ్రిటీష్ అధికారుల మృతుదేహాల కోసం ప్రభుత్వం ఎంత ప్రయత్నించిన ఫలితం లేకుండా పోతుందీ చివరికి వారు ఒక వర్తమానం రామరాజుకి పంపగా–

"హద్దు మీరి వచ్చి అపరాధమును జేసి
శిక్షింపబడి వారు శవములైరి
అపరాధ రుసుముగా ఐదు వందలు గట్టి
తోడ్కొని పొందు మీ దొర శవాల"[252]

అంటూ బ్రిటిష్ వారికి సమాధానం పంపుతాడూ ఆ వార్త బ్రిటీష్ పార్లమెంట్ వరకూ చేరుతుంది. ఆ విషయం ఆంగ్లేయుల సభలోని వారి ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది. దీన్ని బట్టి రామరాజు ఎంతటి ధైర్య సాహసాల్ని చేసాడో తెలుస్తుంది.

దానిలో బ్రిటీష్ వారు కోపాగ్రితులై ఎలాగైనా రామరాజుని అతని సైన్యాన్ని అంతమొందించాలని నిశ్చయించుకుంటారు. అదనపు సైన్యాన్ని రప్పించి హోపిల్ అనే అధికారిని ఏజెన్సీ ఆపరేషన్ కమెండర్గా నియమిస్తుంది. ఎలాగైనా సీతారామరాజు విప్లవాన్ని నిలిపేయాలని సైన్యాన్ని మార్టీను, చాండ్వేకుడు, హ్యూము, కీన్, ఫోర్బెస్, కీరన్సు అనే ఐదు విభాగాలుగా సైన్యాన్ని విభజించి రామరాజు యుద్ధాన్ని అదుపు చేయడానికి ప్రయత్నిస్తారు.

"పైన ఘాటులకెల్ల సాండర్సు దొర పెద్ద
దిగువ ఘాటల స్పీని దొరయు పెద్ద

నర్సీ పట్టణమున జాన్ దొర కేంద్రమై
మలబారు దళములు మాటు బెట్టె"[253]

రామరాజుని బంధించాలని ప్రయత్నిస్తారు. కాని వారి ఆశ అడియాశలౌతుంది.

అదే విధంగా రామరాజుని పట్టుకోవడానికి అనేక విధాలుగా ప్రయత్నిస్తున్న వారందరికి తాను అన్నవరం వస్తున్న సంగతిని ముందుగానే తెలియజేయడం, వారు అక్కడ నుండి ఏమి చేయలేని స్థితిలో పారిపోవడం జరుగుతుంది. అంతేకాకుండా అన్నవరంలోని అధికారులంతా తమను రక్షించమని రామరాజుని వేడుకుంటారు. అంతటితో రామరాజు వారిని క్షమించి వారి దగ్గర ఉన్న ఆయుధాల్ని ఇవ్వమంటాడు. దానికి వారు తమ దగ్గరగా ఆయుధాలేమి లేవని, బ్రిటిష్ అధికారులు స్వాధీనం చేసుకున్నారనే విషయాన్ని చెబుతారు. దానికి సీతారామరాజు వారికి న్యాయబద్ధంగా విధిని నిర్వహించమని కితాబునిస్తాడు. ఆ తర్వాత–

"శ్రీ సత్యదేవునికి జేసే సాష్టాంగమ్ము
వ్రతము జేయగ బూనె వీర జోదు
అన్నవరములోని ఆ బాల గోపాల
మతని వెంట నుండి రాదరమున

అన్నవరములోన అన్న సంతర్పణ
జేసి జనుల కెల్ల చెప్పసాగె
స్వేచ్ఛ గోరి నేను చేయుచుంటిని పోరు
సహకరించి మాకు సాయపడుడు"[254]

రామరాజు అన్నవరంలో సత్యన్నారాయణ స్వామిని దర్శించుకోడం, అక్కడ ప్రజలకి అన్న సంతర్పణ చేయడం లాంటి విషయాల్ని చక్కగా వర్ణించారు. అంతేకాకుండా ఆయన చేసే యుద్ధం దేశంలోని ప్రజల ధన, మాన, ప్రాణాల శ్రేయస్సు చేస్తున్నాయని చెప్పిన తీరును స్పష్టం చేశారు. అలాగే అక్కడ ప్రజలు రామరాజుని దీవించి పంపిన విధానాన్ని కూడా తెలియజేశారు. దీనిని బట్టి రామరాజులోని దానగుణం, దృఢ సంకల్పం మనకు తెలుస్తుంది.

అదే విధంగా ఈ కావ్యంలో అల్లూరికి ఉద్యమ జీవితంలో సహకరించిన వారిలో

ముఖ్యులైన అగ్గిరాజు, గంటందొర, మల్లుదొరల గూర్చి, వారి జీవితాల్ని, వారు ప్రదర్శించిన ధైర్య సాహసాల్ని సుమారు 273 పద్యాల్లో చక్కగా చిత్రీకరించారు. అగ్గిరాజుని గూర్చి చెబుతూ–

"అతడు ధర్మనిష్టుడు మహాబలశాలి అనంత ధైర్య సాహ
సొత్తీర్ణుడు దేశభక్తి యుతుడన్నిట కాంగ్రెసు సేవకుండు లే
దెంతయు స్వార్థ చింతనము ఆతడు గాంధికి భక్తుడాయె స్వా
తంత్ర్యము గోరి సేవలను జేసె సహాయ నిరాకరణోద్యమ కార్యకర్తయై"[255]

అని అంటూ అంతేకాకుండా అగ్గిరాజు ధైర్యసాహసాలకే మారుపేంటాడు. మహాశక్తివంతుడు కూడా, దేశభక్తే మనస్సు నిండా నిండి, ఎలాంటి స్వలాభాలకు పోనివాడని, కాంగ్రెస్ సేవకుడని, గాంధీజీ అభిమానుడిగా ఆయన నడిపిన సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని బ్రిటీష్ వారికి వ్యతిరేకంగా ఉద్యమించాడనే విషయాన్ని తెలియజేశారు. అగ్గిరాజు అసలు పేరు సత్యనారాయణ అని, వారిది విశాఖజిల్లా వెలియాన్ గ్రామం అని చిన్నతనంలోనే తండ్రి వెంకట నరసింహరాజు చనిపోవడంతో అత్యంత దుర్భర దారిద్ర్య జీవితాన్ని అనుభవించాక విషయాన్ని వెల్లడించారు.

అలాగే అహింసా వ్రతాన్ని అవలంభించే బ్రిటీష్‌వారు చిత్రహింసలు చేస్తున్నారని వారిపై తిరుగుబాటు చేయాలని నిశ్చయించుకుంటాడు. కాంగ్రెసును వదిలి కలకత్తా వచ్చే సందర్భంలో రైల్లో అల్లూరి చేసే ఉద్యమాన్ని గూర్చి కథలు కథలుగా చెప్పుకోడాన్ని గ్రహించి ఎలాగైన ఆ ఉద్యమ వీరుడ్ని కలుసుకోవాలనే తపన చెందుతాడు. వెంటనే అన్నవరంలో ఉన్న విషయాన్ని తెలుసుకుని అక్కడికి బయల్దేరి వెళ్తాడు. కాని ఆయన అక్కడి నుండి వెళ్ళిపోయారనే విషయాన్ని తెలుసుకుని వెతికి వెతికి చివరికి అల్లూరిని కలుసుకుంటాడు రామరాజు. అగ్గిరాజు సాహసోపేతమైన ధైర్యసాహసాల్ని తెలుసుకుని అతనికి తన విప్లవ సోదరుల్ని పరిచయం చేసి–

"అందరి ముందర నాతని
అందముగా కౌగలించి యాదరమొప్పన్
ఉందువు నా అనుజుడవై
కుందకు మని పల్కె రాజు గౌరవరీతిన్"[256]

అని పలుకుతాడు. తన సైన్యంలో ఒకడిగా ఉండమని అగ్గిరాజుకు చెబుతాడు.

అంతేకాకుండా అగ్గిరాజు దూకుడు స్వభావం కలవాడని ఒక కంట కనిపెట్టి ఉండమని తన ముఖ్య అనుచరులకు రామరాజు చెబుతాడు. దీన్ని బట్టి అగ్గిరాజు ఎంతటి ధైర్యవంతుడో తెలుస్తుంది.

తన మనసులో ఏదైతే చేయాలని నిశ్చయించుకుంటాడో అదే చేయగల దృఢ సంకల్పం కలవాడుగా, గొప్ప సాహసిగా అగ్గిరాజును వర్ణించారు. అలాగే అగ్గిరాజు పోరాట పటిమను గూర్చి చెబుతూ–

"అతడనేక వ్యూహముల నారియు దేరిన వీరమూర్తి లే
దాతనికెన్నడున్ వెరపు యుద్ధమునందు మహోగ్రమూర్తి యై
శత్రులనుగ్గుజేసి జయకేతన మెత్తును సాహసమ్ముతో రా
జాతని జూచిరమ్మనిన కాల్చుక వచ్చును పావనాత్ముడై"[257]

యుద్ధ వ్యూహాల్ని పన్నడంలో అగ్గిరాజుకి సాటి లేరని విప్లవ రంగంలో ఎంతో సాహసోపేతంగా శత్రువుల్ని జయించే శక్తి సామర్థ్యాలు కలవాడుగా అగ్గిరాజుని కొనియాడిన తీరు ద్యోతకమౌతోంది.

అదే విధంగా పంజాబ్ రాష్ట్రంలో 'గదర్' పార్టీని స్థాపించి, విప్లవ పోరాట బాటలో పయనించిన పృధ్వీసింగ్ అనే వీరుడ్ని బంధించి రాజమండ్రి కేంద్ర కారాగారంలో బంధీగా ఉంటాడు. అతన్ని విడిపించనించి, పృధ్వీసింగ్‌తో మాట్లాడడానికి నిశ్చయించుకుని ఆ వార్తను లేఖ ద్వారా తెలియజేయగా వారు అక్కడ నుండి ఖైదీలను–

"చెరసాలలో నున్న జీవిత ఖైదీల
తరలించి వేసిరి త్వరితగతిని
మదరాసు జైలుకు పృధ్వి సింగ్‌ను మార్చి
జైలు ఖాళీ చేసి చనిరియెటకొ
రాజువచ్చి చూచె రాజమండ్రి జైలు
పురుగైన లేదచట బోసి పోయె
అగ్ని వాయువు గూడ ఆగునా ప్రళయమ్ము
రాజు సింగు గలియ రగులు కొనదె
పేరునకు దొరలు నిజముగా పిరికివారు
వంచనయై గాని వీరత్వమింత లేదు

అనుచు దలపోసి రాజంత నవ్వుకొనుచు
రాజ వీధిని సింహమై రాజు నడిచె"[258]

బంధీగా ఉన్న పృధ్వీసింగ్‌ను విడిపించడానికి ముందుగా వార్త పంపడంలో అధికారులు సింగ్‌ను అక్కడ నుండి మద్రాసు జైలుకి తరలిస్తారు. దానితో ఆంగ్లేయులు పిరికివారని కనీసం ధైర్యం లేదని అనుకుని నవ్వుకుంటూ సింహంలా గర్జించిన తీరుని తెలియపరిచారు.

అంతటితో బ్రిటీష్‌వారి అపజయాల్ని, అగ్గిరాజుకి జరుగు జయవాదాల్ని, ప్రజల సృజనల్ని ప్రభుత్వానికి తెల్పగా–

"పైకి వ్రాసిన యంత ప్రభుత్వ పెద్దలు
రాజ తంత్రమ్మున రాటు దేలి
పెద్ద పేరు గొన్న రూదర్‌ఫర్డును
అడవి కమీషనరుగా అంపినారు"[259]

బ్రిటీష్ ప్రభుత్వం క్రూర స్వభావుడు, రాజనీతి తెలిసిన రూథర్‌ఫర్డ్ అనే వ్యక్తిని అటవీశాఖాధికారిగా నియమిస్తుంది. ఆయన నక్కజిత్తులవంటివాడు, హింసాత్మక చర్యనవలంభించే మోసగాడు. ఆ కోణంలోనే అగ్గిరాజును బంధించ నెరచి సంధి పేరుతో ఉత్తరమొకటి రాసి పంపిస్తాడు. ఆ వార్తను చదివిన రాజు తన మిత్రులతో సంప్రదించి, తాను కూడా తన సమ్మతిని తెలుపుతూ ప్రత్యుత్తరాన్ని పంపుతారు.

"మీరెక్కడ గోరిన నక్కడ
నారాకను దెలుప మీకు వ్రాయగలాడన్
మీ రాకను దెలుపుచునిక
నా రాకను గోర నెలవు దెలుపుడు నాకున్"[260]

అని చెప్పగా, వారు అడవిలో ఒక చోటును చెప్పి అక్కడికి పిలుస్తారు రాజు సిద్ధమైన తీరుని తెల్పుతూ–

"మొన బాణముల కట్ట కుడి మూపు పై గట్టి
ఎడమ చేతను వెదురు విల్లు బట్టి
మొలనూలు పై నుండి మీ గాళ్ళ పై నాడ

కాషాయ వస్త్రంబుకాసెగట్టి
నడుముపై పచ్చటి నడికట్టు బిగియించి
మొముపై తిరుమణి తీర్చి దిద్ది
ఎడమ భుజమ్ముపై వ్రేలాడు వస్త్రమ్ము
జంధ్యమై కుడికటిని చేరి యాడ
వచ్చుచున్నటి రాజును వారుగాంచి
స్వామియా లేక రామయ్య వచ్చె నేమొ
నంచు దలపోచి లేచి నిలుచుండివారు
స్వాగతమ్ము జెప్పి సెల్యూటు జేసినారు"[261]

అని అంటూ రాజును చూడగానే స్వామీజియా లేక శ్రీరామచంద్రుడా అన్నట్లు భ్రమపడతారు. ఆహ్వానాన్ని చెప్పి వందనమాచరిస్తారు. అక్కడ రూథర్‌ఫర్డ్‌కి, రాజుకి మధ్య జరిగిన సంభాషణను కడు రసాత్మకంగా అణువనువున దేశభక్తి వెలువడుతుంది.

ఈ రాజ్యం, సొత్తు మాది అలాంటి మా దొరతనాన్ని సంకిస్తావా అని రూదర్‌ఫర్డ్ పలకగా దానికి రాజు–

"యుగయుగమ్ముల నుండి ఈ తల్లి యొడిలోన
సేదదీరుచు నున్న జాతి మాది
అతిథులనే వేళనా దరింతుము మేము
అది సాకుగా గొని ఆశ్రయించి
వ్యాపారమున బ్రతుకవచ్చితిమి మేమంచు
దొంగ జపమును జేయు కొంగలట్లు
అన్నదమ్ముల మధ్య ఆరడి సృష్టించి
సాయపడుదు మంచు సందు జూచి"[262]

అని అంటూ మోసపూరిత విధానాలలో దేశాన్ని మోసం చేస్తున్నారని బ్రిటీష్ వారిపై విరుచుకుపడతాడు. దానికి బ్రిటీష్ అధికారి ఆగ్రహించి రవి అస్తమించిన ఘన చరిత్ర గల రాజ్యం మాది, మీకు బానిసత్వం తప్ప మరొకటి లేదని హేళన చేస్తాడు. దాన్ని రాజు –

"అతిథి యభ్యాగతుల నాదరమ్మున బిలిచి
సిద్ధాన్నమిడినట్టి జాతి మాది
మహార్ణవమ్మున మధ్యలో నొకచిన్న
మరుభూమిగాదె మీ జన్మభూమి
సస్యశ్యామలమైన సువిశాల క్షేత్రమై
బంగారు పండెడు భూమి మాది
ఆయుధమ్ములపైన నాధారపడి బ్రతుకు
మృగతత్వ జీవనమతులు మీరు
శాంత్య హింసలతోడ సమత మమతలు నింపి
జ్యోతులు వెలిగించు నీతి మాది
అధర్మ రాజ్యమ్ము నిలుచు పదమూడేండ్లు
ధర్మ రాజ్యము వేలయేండ్లు నిలుచు
మీదు రాజ్యము నిలుచుమించి యిరువది యేండ్లు
ఆ పైన మా రాజ్యమ వతరించు"[263]

భారతదేశం సువిశాలమైన, ఎంతో ఆరోగ్యకరమైన వాతావరణం గలదని, సుగంధ మూళికలతో వన ఫలాలతో వర్ధిల్లే సశ్యశ్యామలమైన భూమి కొనియాడిన విధానాన్ని తెలియజేశారు. అంతేకాకుండా శాంతి, అహింసలకి మారుపేరు భరత భూమని, ఏనాటికైనా ధర్మ మార్గమే నిలబడుతుందని పల్కిన తీరుని వ్యక్తం జేశారు. అలా అనేక విధాలుగా వీరిరువురి మధ్య వాగ్వివాదం జరుగుతుంది. అనంతరం వీరిద్దరి మధ్య సంధి కుదరక రూధర్‌ఫర్డ్ కుటిల బుద్ధి బయటపడుతుంది. దానికి సమాధానంగా రాజు ప్రదర్శించిన యుద్ధనీతిని చక్కగా వర్ణించారు కవి.

అలాగే మల్లు, గాము దొరల గూర్చి చక్కగా చిత్రించారు.

ఈ విధంగా ఈ కావ్యంలో ఆమూలాగ్రం రామరాజు జీవితం, యుద్ధ నైపుణ్యం ఆయనకి సహకరించిన మన్యవీరులు మరియు విప్లవ వీరుల ధైర్య సాహసాల్ని చిత్రీకరించిన విధానం మనకు స్ఫురిస్తుంది. కవి ఈ కావ్యంలో అల్లూరి జీవిత పర్యాంతం జరిగిన ప్రతీ సంఘటనను తెలియపరిచిన తీరు పాఠకులకు సీతారామరాజు స్వాతంత్ర్య పోరాట పటిమను తెలుసుకునేందుకు ఎంతగానో దోహదం చేస్తుంది.

## 2.7 ముదివేడు ప్రభాకరరావు:

'రక్తాక్షికి రారాజు అల్లూరి సీతారామరాజు' అనే కవిత 1985 జూన్ నెలలో భారతి పత్రికలో ప్రచురితమైంది. దీన్ని శ్రీరామరాజు 07.05.1924న రక్తాక్షి సంవత్సరం కీర్తిశేషుడౌతాడు. ఆయన మరణించి 1984 నాటికి 60 సంవత్సరాలు పూర్తైన సందర్భంగా రచయిత ముదివేడు ప్రభాకరరావు ఈ వ్యాసాన్ని రాసారు.

శ్రీరామరాజు జీవిత చరిత్రను చదవగానే ఆయనకు ఏనుగంతబలం వచ్చిందని, కొండంత ఆత్మవిశ్వాసం ఏర్పడిందని, అంకురిత ఆత్మవిశాసంతోనే ఆవేశపూరిత హృదయంతోనే ఈ కవిత రాసి భారతి మాసపత్రికకు సమర్పించుకున్నారు. ఈ కవితను 10 విభాగాలలో పాఠక లోకానికందించారు.

"రక్తాక్షరాలతో లిఖించాడు రాజు
ఈ రక్తాక్షి సంవత్సరాన్ని!
రక్తతర్పణం చేశాడు, దేశ
విముక్తి కోసం నిండుప్రాణాన్ని!!
ఈ తిరుగుబాటు ఉదంతాన్ని
సువర్ణాక్షరాలతో లిఖించుకోలేని
చరిత్ర హీనులం మనం
ఇప్పటికీ శేష ప్రశ్నగానే మిగిలిపోయాం!
చరిత్ర పుటల్ని షరాబు ఖాతాలా
ఖరాబు చేసుకొన్నాం!!
ఆ అమర వీరుని జ్ఞాపకార్థం
అశ్రుతర్పణ మాచరించని మనం
భావి భారత భాగ్య విధాతలం!
ఆ జాతిపితనైనా అనుసరించక
ఆధోగతిలో అఘోరిస్తున్నా!!"[264]

ఈ కవితలో రక్తాక్షరాలతో లిఖించాడు రాజు అనే పాదంలో విప్లవ శంఖాన్ని పూరించాడనే అర్థం స్ఫురిస్తుంది. ఆ సంవత్సరం రక్తాక్షి సంవత్సరం కాబట్టి (1924) రక్త తర్పణం చేశాడు. ఎర్రదనాన్ని, తిరుగుబాటుతనాన్ని చరిత్రలో నిలిపాడు.

1924 రక్తాక్షి సంవత్సరంలో భారతమాతకు రక్త తర్పణం చేశాడు. ప్రాణాలను దేశం కోసం విడిచిన త్యాగధనుడు, దేశభక్తుడుగా కవి కీర్తించారు. కాని ఆ మహావీరుని గొప్పతనాన్ని మనం గుర్తించలేకపోయిన, చరిత్ర హీనులం, ఇప్పటికి శేష ప్రశ్నగా మిగిలిపోయాం అని రచయిత మనల్ని దుమ్మెత్తి పోస్తున్నాడు.

అమరవీరుల వీరత్వంవైపు వెళ్ళలేక, అహింసా మార్గాన్ని చూడలేక ఏ మార్గానికి చెందని బలిపశువులుగా మారుతున్నామని అధోగతిలో కొట్టుమిట్టులాడుతున్నామని కవి హెచ్చరిస్తున్నారు.

రక్తాక్షికి రాజెవరని యడిగితె
సీతారామరాజునుటకు భయపడకు!
అల్లూరి సీతారామరాజు!
అతడే రక్తాక్షికి రాజు!!
రాజంటే యింద్రుడా?
అమృతం గూడ కట్టిన దొర ఆ చంద్రుడా!
శత్రుల పాలిటి రారాజు!
ఆర్తుల పాలిటి రేరాజు!!
కూడు, గూడు, గుడ్డలేని
గూడెంలోని మన్య ప్రజలు
కరుడు గట్టిన 'బ్యాష్టియన్'
కరాళ దౌష్ట్యానికి రోజూ
బలి పశువులు కావడం
కళ్లారా జూచిన రాజు...
కళ్లెట్ల జేసిన రాజు...
తెల్లదొరల ఎట్టటి రక్తం
కళ్ల జూచి మహకాళికి
బలి యిచ్చిన రాజు....
అతడే రక్తాక్షికి రారాజు
అల్లూరి సీతారామరాజు!!
రక్తాక్షికి రాజెవరని యడిగితే
సీతారామరాజనుటకు భయపడకు!!

రెండవ భాగంలో చైతన్యం వైపు ప్రయాణించమంటాడు, విప్లవ వీరుని బాటవైపు నడవమంటున్నారు. విప్లవవీరుడు రక్షాక్షి రాజు ఎవరని అడిగితే ధైర్యంతో, చైతన్యంతో అల్లూరి సీతారామరాజు అని విప్లవ పిలుపుతో చెప్పమంటున్నాడు. కూడు, గూడ, గుడ్డ లేని గూడెంలోని మన్య ప్రజలకు అండగా నిలిచాడు.

"శత్రువుల పాలిట రారాజు" అనే పదంలో బలవంతుడైన శత్రువును గెలవలేమని తెలిసినా దేశం కోసం ధైర్యంగా తిరగబడి, పరాయిపాలనలో మగ్గుతున్న ప్రజలను సమీకరించి, ప్రాణాలు కడబట్టేదాకా పౌరుషంతో పోరాడి, వీరోచితంగా నేలకొరగటంలో మార్గదర్శి, విప్లవ వైతాళికుడు మన రామరాజు అని రచయిత వర్ణించారు.

'తెల్లదొరల ఎఱ్ఱటి రక్తం' మహకాళికి బలియిచ్చిన రాజు అనే పాదంలో విప్లవం ఎరుపుతో ముడిపడినది అని, దేశచరిత్ర నిండా ఎంతో మంది దేశభక్తులు కనిపిస్తారు. గాఢమైన దేశభక్తితో, అవక్ర విక్రమంతో అద్భుత ధైర్యసాహసాలతో బెబ్బులిలా పోరాడి ధీరాదాత్తంగా ఆత్మార్పణం కావించిన మహావీరుడు స్వాతంత్ర్య పోరాటంలో యోగిగా, విప్లవవీరుడుగా, ప్రసిద్ధమైన వాడు సీతారామరాజు.

ఈ కవిత్వంలో చిన్నచిన్న పదాలతో సామాన్యమైన వాడుక భాషతో సులభంగా అర్థమైన రీతిలో రచయిత చక్కగా వర్ణించారు. భయపడకుండా, ధైర్యంగా చైతన్యంతో ఉండమని ప్రబోధం చేస్తున్నాడు.

సీత కోసం పరితపించి
శత్రు సంహారం చేసిన
శ్రీరామచంద్రుని కంటే
ప్రేమించిన "సీత" మరణించగా
తన పేరుతో ప్రియురాలిని శాశ్వతం చేసిన
'సీతా' రామరాజెంత అమృత హృదయుడో!
ఎంతటి సహృదయ ప్రేమికుడో!
మూడు పాదాలా ధర్మధేనువు
ముచ్చటగా నడిచే యుగంలో
రాముడు నరుడైన దేవుడై
ధర్మాన్ని ఉద్ధరించడంలో గొప్పలేదు

'ఒంటి కాలిమేక' వంటి
కుంటి కాలి కలియుగంలో
ఒంటరిగాడైన రాజు–
ఆంగ్లేయులు మన్య ప్రజకు చేస్తున్న అన్యాయం
ఆ సహాయ శూరుడుగా ఆనాడే ఎదిరించీ,
న్యాయం కోసం సాయుధ పోరాటం సాగించీ
తెల్లదొరల కసికీ,
రక్తాక్షి రక్కసికీ
అమానుషంగా హతం కావడం
అది ఆయన తప్పుకాదు
కలిసిరాని కాలానిది
తెలివిలేని ప్రజలది!![266]

3వ భాగంలో సీతారామరాజును శ్రీరామ చంద్రునితో పోల్చడం కథానాయకుడ్ని రచయిత ఊహలోకంలోకి తీసుకొనిపోయాడు. (చరిత్ర)లో లేని విషయాన్ని సీత కొరకు అడవిలో తిరిగి శత్రు సంహారం చేశాడు ఆనాడు రాముడు. కాని ఈ రామరాజు అజన్మాంతం బ్రహ్మచారిగా కఠోరమైన దీక్షను చేశాడు. బ్రిటిష్ శత్రు సంహారంపై పోరాటం చేశాడు.

న్యాయం కోసం పోరాటం చేశారు. భారతమాత విముక్తికి ప్రాణాలను బలి యిచ్చారు. ఇటువంటి కవి యుగంలో కూడా ధర్మాన్ని అనుసరించిన ధర్మమూర్తిగా కీర్తించాడు. అసహయశూరుడుగా ఆనాడే ఎదిరించీ, అనే పాదంలో సీతరామరాజుకు పెద్దగా సైన్యం లేదు, ఆధునికమైన పోరాట సామాగ్రి లేదు. అయినా విల్లు, బాణాలు, కత్తులు మొదలైన ఆయుధాలతో ఎదిరించాడు. తన ప్రాణాలను రక్త తర్పణం చేశాడు. అది ఆయన తప్పుకాదు. కలసి రాని కాలానిది. తెలివి లేని ప్రజలది! యింత జరిగిన రామరాజు కొరకు ప్రజలకు, దేశానికి తెలియకపోవటం. రామరాజుకు నిజమైన వారసులుగా ఎదగకపోవడం రచయిత ఆవేదనకు కారణం.

గతంలో–
అరవై సంవత్సరాల క్రితం
తన విలక్షణ వ్యక్తిత్వంతో

విప్లవ శంఖారావం పూరించినవాడు
అరక్తాంత నేత్రుడు
అన్యాయంపై తిరుగుబాటు
ఆనాడే కాదు
ఏనాడూ వుంది
ఎప్పటికీ కొనసాగుతూనే వుంటుందని
చెప్పిన మూడు పదులు దాటని యువకుడు
విప్లవ వైతాళికుడు
రవి అస్తమించని శ్వేత సామ్రాజ్యానికి
సింహ స్వప్నమై గడగడలాడించిన వాడు
ముప్పు తిప్పలు పెట్టి మూడు చెఱువుల నీళ్ళు
తప్పక తాగింపజేసిన మొనగాడు
వట్టి రాజెలా అవుతాడు?
కోటి సూర్య సమప్రభుడు!
రక్తారులు విప్లవ శేఖరుడు!![267]

4వ భాగంలో 1924 నుండి 1984 వరకు అరవై సంవత్సరాల చరిత్రను ఆంధ్రుడి ఘనకీర్తిని రచయిత వివరించారు. 1922లో పూరించిన విప్లవ శంఖం ఈనాటికి అన్యాయంపై తిరుగుబాటు వినబడుతుంది.

"సీతారామరాజు విప్లవం ఇందుకు భిన్నం, విప్లవ దళాలు నిర్ణీత లక్ష్యాలుపై దాడులు చేసినప్పుడల్లా ఆయా ప్రాంత ప్రజలు కూడా దళాలతో కలసి ఉండి ప్రత్యక్షంగా పాల్గొనేవారు. తర్వాత తమ తమ గ్రామాలకు చేరుకునేవారు. అందుచేతనే విప్లవ సభ్యుల సంఖ్య ఎప్పుడూ ఒకే తీరుగా ఉండేది కాదు. ఊరి జనాన్ని వెంటబెట్టుకుని రాజు నడిపించిన సాహసిక చర్యల్లో ముఖ్యమైనది". 1923 అక్టోబరు 26న గూడెం సైనిక శిబిరం మీద దాడి రాజు సాహసచర్యలలో ఒకటి.

సీతారామరాజు పూరించిన చైతన్యం ఎప్పటికి కొనసాగుతూనే ఉంటుందని ముఖ్యంగా యువకులు, భావిప్రదాతలు దేశ అభివృద్ధికి, మానవ మనుగడకు చైతన్యవంతమైన కృషి చేయాలని రచయిత భావన.

మూడు పదులు దాటని యువకుడు, విప్లవ వైతాళికుడు "బలవంతుడైన శత్రువును గెలవలేమని తెలిసినా దేశం కోసం ధైర్యంగా తిరగబడి, పరాయి పాలనలో మగ్గుతున్న ప్రజలను సమీకరించి, ప్రాణాలు కడబట్టేదాకా పౌరుషంతో పోరాడి... వీరోచితంగా నేలకొరగటం" దేశభక్తులకు మార్గదర్శకుడు శ్రీ రామరాజు.

"ఒకటిన్నర శతాబ్దలకు పైగా సాగిన బ్రిటిష్ దురాక్రమణలో తెల్లవాడి దుష్ట దార్ష్టీకాన్ని ఎదిరించి నిర్ధిష్ట ప్రణాళికతో ప్రజల తోడ్పాటుతో పటిష్టంగా నడిచిన విప్లవ పోరాటం, సీతారామరాజు మన్యవిప్లవం"

ఈ విభాగంలో రామరాజును "విప్లవ వైతాళికుడు" అని సంబోధించడం మరింత ఉన్నతాన్ని సూచించింది. శ్రీరామరాజు కోటి సూర్యుల తేజస్సుతో సరిపోల్చడం, విప్లవ శేఖరుడుగా వర్ణించడం అద్భుతం.

"ఈ షష్టి సంవత్సరాల చరిత్రగతి
ఒకే స్థితిలో వున్నదంటే...
మన మెంతటి దుస్థితిలో వున్నామో
ఎంతగా దిగజారిన పరిస్థితులకు వారసులమయ్యామో
ఊహించుకోలేమా?
పునారావృతం కావడమే చరిత్రగతి అయితే
ఈ విశాల భారతదేశ చరిత్రలో
అరవై సంవత్సరాలొక పెద్దకాల పరిమాణమా?
అసలు పరిణామమే లేని చరిత్ర మనది!
ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వుంది!
అందుకే అంతం లేని ఈ కథ నడుస్తూనే వుంది!
ఫలితం లేని పోరాటం వల్ల ప్రయోజనం లేదు!
ఈ సామాజిక రుగ్మతకు సాయుధ పోరాటమే
"సరైన శస్త్ర చికిత్స" అని ఆనాడే చేసి చూపాడు రాజు!
నిన్న మొన్నటిదాకా శ్రీశ్రీ గొంతు చించుకొన్నాడు రోజూ!
పోరాటానికింకా పూర్తిగా సమాయత్తం కాని
ప్రజలతో విసుగెత్తిన కవుల కంఠాలు

క్రమంగా వినబడక పోతున్నాయ్!
కలాలు వ్రాయడం మానుకొంటున్నాయ్!!
నేటి సామాన్య మానవుని అనుక్షణ నిరీక్షణ
నిత్యావసర వస్తువుల కోసమా? కాదూ
నిత్య జీవిత మహాసంగ్రామ రంగంలో
భూన బోంతరాళాలు దద్దరిల్లే విప్లవ ధనుష్టం కారం కోసం!
ఈ సామాజిక సమస్యకు శాశ్వత పరిష్కారం కోసం!![268]

ఈ విభాగంలో "60 సంవత్సరాల చరిత్ర యింక అదే స్థితిలో ఉన్నదంటే మన పరిస్థితిని, ఈ దుస్థితిని గమనించమని కవి హెచ్చరిస్తున్నాడు. ప్రస్తుత కాలంలో దిగజారిన పరిస్థితులకు వారసులమైన మనం మరో చరిత్రను రాసే ధీరులెవరు? అని ప్రశ్నిస్తున్నాడు.

"కదిలేది – కదిలించేది, మారేది – మార్పించేది" నవకవిత్వమని శ్రీశ్రీ చెప్పిన మాటలకి ఎక్కడుంది విలువా? కుక్కపిల్ల – సబ్బుబిళ్ళ ఏదైనా కవితార్హం అంటూ "ఉండాలోయ్ కవితాదేశం, కానివోయ్ రసనిర్దేశం" అని ఆయన యిచ్చిన ప్రేరణ వెనకపట్టు పట్టిందా? తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవరని ఆయన వేసిన ప్రశ్న, సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుని సాహసంపై ఆయన చేసిన ప్రబోధం ఎవరి కోసం అని కవి నిలదీస్తున్నాడు.

"కవిత కోసం నేను పుట్టాను. కాంతి కోసం కలం పట్టాను అని ఆరుద్ర గారి మాటలు వినిపించలేదా! అని ప్రశ్నిస్తున్నాడు. ఎందరో కవుల కంఠలు వినపడలేదా! వాటికి సమాధానం మనం అని హెచ్చరిస్తున్నాడు.

ఈ 60 ఏళ్ల చరిత్రలో పోరాడేతత్వం ఎంతవరకు వచ్చింది. మన హక్కులను, మన స్వాతంత్ర్యానికి పూర్తిగా కంకణబద్ధులై ఉండాలి. శ్రీశ్రీ అన్నట్లు పోరాడితే పోయేదేమి లేదు బానిస సంకెళ్ళ తప్ప" అంటారు. నేటి సామాన్య మానవుని అనుక్షణ నిరీక్షణ, నిత్య జీవిత మహాసంగ్రామ రంగంలో భూన బొంతరాళాలు దద్దరిల్లే విప్లవ చైతన్యాగ్నిలో సామాజిక సమస్యకు శాశ్వత పరిష్కారం కోసం విప్లవ చైతన్యం, విప్లవ శంఖారావం, పూరించమని కవి ప్రబోధిస్తున్నాడు.

సంఘర్షణ! సంఘర్షణ!!
సంఘంలో శాశ్వత ఘర్షణ!!

ఈ సంవత్సర లక్షణ లక్షితం!
రక్తాక్షికి రక్తారుణ తిలకం!!
ఈ సంవత్సర దేవికి లేదు పారాణి!
ఆమె విప్లవ మంత్ర పరాయణి!
రక్తాక్షరాలతో లిఖించాడు రాజు
ఈ రక్తాక్షి సంవత్సరాన్ని!
రక్త తర్పణం చేశారు దీనుల
విముక్తి కోసం నిండు ప్రాణాన్ని
మహాయోగి పుంగవుడు!
మహకాళి భక్తుడు
మహామంత్ర జాపకుడు
విప్లవ మంత్ర పరాయణుడుగా
ఎలా పరిణమించాడు?
అదే అదే ఆశ్చర్యం!
అందరికీ పరమాశ్చర్యం![269]

ఈ విభాగంలో ప్రజలు స్వాతంత్ర్యము కొరకై, ప్రబల శక్తులనన్నిటిని ఎదుర్కొని బ్రిటిష్ వారితో రెండేండ్లు సుదీర్ఘ యుద్ధం చేశారు. బ్రిటిష్ సైనిక అరాచకముతో మన్యమంతా అల్లకల్లోలమైంది. వృద్ధులకు, స్త్రీలకు, పసికందువులకు రక్షణ లేదు. స్త్రీ మానహానిని రాజు సహించుచు. కొండ గుహలలో దాగుండగలడా! రక్తాక్షి సంవత్సరంలో భారతమాతకు రక్తార్పణం చేసిన మహాభక్తుడు. ఆసభ్యులై, అసహాయులై బానిసలై పడియున్న ప్రజలలో మహాచైతన్యం పూరించిన త్యాగమూర్తి. దీనుల విముక్తి కోసం నిండు ప్రాణాన్ని త్యాగం చేసిన మహాయోగి పుంగవుడు.

"ఈ సంవత్సరానికి దేవికి లేదు పారాణి" అనే పాదంలో ఎరుపుదనాన్ని కోరుకుంటుంది. అందుకే రక్త తర్పణం చేసి మహావీరుడు ప్రాణాలను త్యాగం చేశాడు. దేశమాత విముక్తి కోసం, ప్రాణాలర్పించిన మహావీరుడు సీతారామరాజు కంటే ఎవరు లేరు? అని కవి వర్ణన.

సాదురేగితే తలపొలాన
నిలవదురా' యని

తెల్లవాడి గుండెల్లో
నిద్దురపోయిన వాడు
వాడిప్రక్కలోన బల్లెంగా
బైఠాయించిన వాడు
మన్య విప్లవ విరూపాక్షుడు!
మన్యు ప్రేరిత వీరభద్రుడు!!
అభిమన్యునిలా–
సామాన్యులకు సైదోడై నిల్చిన
మాన్యుడు! మన నాయకుడు
రారా! ఆంధ్ర సోదరా!
రక్తాక్షికి రారాజురా!
అల్లూరి సీతారామరాజు
అన్యాయం జరిగే చోటల్లా
అరుణ కమలాక్షుడై
రక్తాక్షుడై విజృంభించే వీరుడురా!
వాడి మయూఖుని
వేయి కిరణాల వేడిరా!!
రక్తాక్షికి రక్షాకవచంలా!
ఆంధ్రులకే శ్రీరామరక్షరా!
అల్లూరి సీతారామరాజు![270]

పై విభాగంలో ప్రజా సమస్యలతో తన వలస వ్యతిరేక తిరుగుబాటును ముడిపెట్టడంలో రాజుకు గొప్ప సామర్థ్యముంది. ఆయన కేవలం కొండ ప్రజల ప్రయోజనాలకు, వలస దోపిడీ అవసరాలకు మధ్య ఉన్న ప్రధాన వైరుధ్యాన్ని మాత్రమే గాక వలస పాలన చట్రంలోని గిరిజనుల సమస్యలను గుర్తించాడు. మరో మాటలో చెప్పాలంటే తన ప్రాథమిక వలస పాలన వ్యతిరేక సిద్ధాంతాన్ని తన అనుచరులు అలాగే గిరిజన ప్రజల మనస్సులో నాటుకునేలా బోధించడం లేదా అంతరీకరించడంలోనూ విజయం సాధించాడు. తద్వారా ఆ ప్రజలకు ఒక ర్యాడికల్ శక్తిగా తన జాతీయ తిరుగుబాటు రూపంలో తేగలిగాడు.

ఈ కవితలో సహజశైలి ఉంది. ఎందుకంటే పదాలను ఏర్చి కూర్చి శిల్ప ప్రయత్నానికి పూనినట్లయితే శైలికి మరింత చిక్కదనం, చక్కదనం వచ్చునేమో కాని ఈ సహజ ప్రవాహగతి మాత్రం రాదు. “మన్యవిప్లవ విరూపాక్షుడు, మన్యు ప్రేరిత వీరభద్రుడు” అనే పాఠాలు ఇందుకు నిదర్శనం.

ఈ పద్యపాదంలో రాజును అభిమన్యుడుతో పోల్చడం విశేషం. భారతంలో మహావీరుడు, యుద్ధనిపుణుడు. కాని కొన్ని దుష్టశక్తుల వల్ల వీరుడుగా మరణించాడు. భారత స్వాతంత్ర్య సంగ్రామంలో రామరాజు కూడా మహాయుద్ధ నిపుణుడు, మహావీరుడు. బ్రిటిష్ వారి దుష్టశక్తుల వలన వీరుడుగా మరణించాడు.

“అన్యాయం జరిగే చోటల్లా అరుణకమలాక్షుడై” అనే పాదంలో ధర్మాన్ని నాలుగు పాదాల ఆచరించేవాడు. అందుకు న్యాయం కోసం పోరాటం, ఆరాటం చేసేవాడు. ఆంధ్రులకే శ్రీరామరక్షరా! మన అల్లూరి అని రచయిత వర్ణించాడు.

సోదరా
ఒక్క రక్తాక్షికే కాదురా!!
రుధిరం లావాద్రవంలా కరిగించే ‘రుధిరోద్గారి’కీ
రక్తాన్ని బడబాగ్నిగా మార్చే ‘రక్తాక్షి’కీ
క్రోధం సుడిగుండమై కోసే ‘క్రోధన’ కీ
అక్షయంగా న్యాయం జయించే ‘అక్షయ’కీ
ఈ సంవత్సర చతుష్టయానికి
చతుర్ముఖ బ్రహ్మగా
మరలా ప్రభలిస్తాడురా మనరాజు
సంకల్ప సూర్యోదయుడై
సిద్ధిని సాధిస్తాడురా మహారాజు!!
అందుకేనోయ్! ఆంధ్ర సోదరా!
రక్తాక్షికి రాజెవరని యడిగితే
సీతారామరాజనుటకు భయపడకోయ్!![271]

ఈ గేయంలో నడిచిన కవిత విప్లవ సైన్య ప్రగతికి విజయ దుందుభి. ఈ కవితలో గతినాశ్రయించి ఆవేశం ఉరకలెత్తింది. అంతర్లయతో నిండిన భావోద్వేగం దీనికి ప్రాణం.

దేశం, ప్రజలు ఈ రెండింటి అవినాభావ సంబంధాలు కవి తీవ్రంగా పరిశీలించారు. స్వతంత్ర జీవనం ప్రాతిపదికగా ప్రజలు పురోగమించిన నాడే దేశం భవిష్యత్తు, ఉజ్వలంగా ఉంటుంది అని ఈ సంబంధాలు అణచిపెట్టే సంకెళ్ళు త్రెంచి నిరాఘాటంగా పయనించమని కవి ఉద్బోదిస్తున్నారు.

రామరాజు మరణించలేదని విప్లవం బ్రతికున్నంతవరకు రామరాజు బ్రతికే ఉంటాడని, ఎక్కడ అన్యాయం జరిగిన, ఎక్కడ భారతమాత బిడ్డలు దు:ఖించిన తలరాత రాసే బ్రహ్మగా, నాలుగువైపుల ధర్మాన్ని రక్షించే అపరబ్రహ్మగా మరలా వస్తాడని, సంకల్పబలంతో సూర్యుని వంటి వెలుగులతో ప్రకాశవంతంగా, చైతన్యపూర్ణుడైన సిద్ధిని సాధిస్తాడని, రక్తాక్షిరాజు అని ఎవరైన అడిగితే ఒక్క సీతారామరాజు అని ధైర్యం చెప్పమని ప్రజలకు రచయిత చైతన్యమైన విప్లవ హేతువైన భావాలను వివరించాడు.

"రక్తాక్షికి రారాజురా! – సై –
ఆర్తులకూ రేరాజురా! – సై –
కొంపలు కాల్చిన ఆంగ్లేయుల్నీ
'రంపం'లా కోసాడురా – సై –
'దమనపల్లీ ఘాటు'లో – సై –
దానవుల్ని దహించాడురా! – సై –
కానీ.....................
ఎదురులేని ఏకైక వీరులు
రామరాజు పితూరిదారులు
ఒక్కరొక్కరె కన్ను మూశేరా.... అయ్యో....
దారిలోనే ఒక్కరొక్కరు కన్ను మూశారా!
కొండపల్లీ రెండు సార్లూ
కాలిపోవుట చూడలేకా
మంప దగ్గర తనకుతానే
లొంగి పోయెర రామరాజూ – ... అయ్యయ్యో...
లొంగిపోయెర రాజరాజూ....[272]

9వ విభాగంలో ఆంగ్ల సైన్యాధికారి జాన్ నాయకత్వములో బ్రిటిష్ సైన్యం సెప్టెంబరు 19న కొండపల్లి వద్ద గెరిల్లా దళాలతో పోరాటానికి తలపడింది. ఈ పోరాటంలో

కూడా ప్రభుత్వ సైనికులు పరాజయం పొందవలసి వచ్చింది. కడుపు మంటతో ప్రభుత్వ సైనికులు కొండపల్లి, నడిమిపాలెం గ్రామాలను తగులబెట్టారు.

బ్రిటిష్ వారిపై ఐదుసార్లు విజయం విప్లవ చైతన్యం తీసుకువచ్చారు. ఎదురులేని ఏకైక వీరులు రామరాజు పితూరిదారులు. అక్షరజ్ఞానం లేక, నాగరిక ప్రపంచం తెలియనివాళ్ళు, ఆధునిక యుద్ధ సామాగ్రి తెలియక పోయిన వాటితో పోరాడిన విప్లవ వీరులు. వీరు ఒక్కక్కరు కన్ను మూశారు. మంప దగ్గర తనకుతానే లొంగిపోయారు రాజు. రాజు స్వయంగా పట్టుబడ్డాడు కాని, ఆయన్ను స్వయంగా బంధించడం ఎవరి తరం కాదు.

“రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్య పునాదులను 1922–1924 మద్యకాలంలో ఆంధ్రప్రదేశ్‌లోని రెండు ప్రాంతాల ప్రజలు కుదిపివేశారని చెప్పవచ్చు.

గుంటూరు జిల్లా పెదనందిపాడు ప్రాంతంలో పర్వతనేని వీరయ్యచౌదరి నాయకత్వాన సాగిన పన్నుల సహాయనిరాకరణోద్యమం, మన్యం ప్రాంతంలోని సీతారామరాజు సారద్యంలో సాగిన సాయుధ విప్లవం రెండు అపజయం పొందాయి.

దీనికి కారణం ఈ రెండు ఉద్యమాలకు కాంగ్రెసు నాయకత్వం చేయూత నివ్వకపోగా, ఆ రెండు ఉద్యమాలను దెబ్బతీసే వైఖరినే అవలంబించింది. ఈ రెండు ఉద్యమాలకు చరిత్రలో రావలసినంత ప్రాచుర్యం కూడా లభించలేదు. ఇది ఆంధ్రజాతి దురదృష్టం.

అయితే గాంధీజీ సూచించిన శాంతియుత సత్యాగ్రహ పోరాటంలోను పెదనందిపాడు లెనిన్ సూచించిన సాయుధ విప్లవ పోరాటంలోను మన్యం విప్లవం ఆంధ్రులు ఉన్నత స్థాయినందుకున్నారన్న అంశం ఈ రెండు ఉద్యమాల ద్వారా నిరూపితమైంది.

మండుటెండా...
ఎండు గుండే ...
పచ్చి గూండా “గుడాల్”
బ్రిటిష్ గుండెలు తీసిన
రాజు గుండెనే

గురి చూచి కొట్టాడురా!
ఆరెరే! గుండ్లు పేల్చి చంపాడురా!!
ఆది శిక్ష కాదు – ఉరిశిక్ష కాదురా – గుడాల్....
నీవు చేసినది హత్యరా!
అమానుష హత్యరా!
నీవొక పైశాచిక నృత్యం చేసిన కృత్యవురా!!
మారాజుకు మృత్యువు లేదురా!
రారా!! రారా!! ఆంధ్రసోదరా!
రక్తతర్పణం చేసిన రాజుకు
అశ్రుతర్పణం ఆచరించరా!
'వందేమాతరం' కీర్తి తోరణం
దిగంతాల వ్యాపించెరా!!
అన్యాయం నశించాలి! విప్లవం వర్ధిల్లాలి!![273]

"1924 సంవత్సరం మేనెల 7వ తేది ఒక మహావీరుడు నేలకొరిగిన రోజు ధర్మయోధుడిని అధర్మం బలిగొన్న రోజు. శౌర్యాన్ని క్రౌర్యం మట్టు పెట్టిన రోజు. ఒక మహా దేశభక్తుడు మరణించిన రోజు"

దురదృష్టం ఏమిటంటే... ఆ దారుణ హత్య గురించే... అది దారుణ హత్య అన్న సంగతే దేశానికి సరిగా తెలియదు. ఆ మాటకొస్తే అల్లూరి సీతారామరాజును దేవుడిలా పూజించిన పోరుగడ్డకే ఆయన మరణం వెనుక మర్మం ఈనాటికీ తెలీదు.

## 2.8 కుందుర్తి ఆంజనేయులు చిత్రించిన అల్లూరి సీతారామరాజు:

1943 ఏప్రిల్ నెలలో రామదాస్, కుందుర్తి ఆంజనేయులు, సుబ్రహ్మణ్యం కలసి నవ్యసాహిత్యంలో నయాగరాను సృష్టించారు. మొదటగా రామదాస్ నా గీతం, ఈ రోజున చెరసాలు అనేక వచన కవితలను 6వ పుట నుండి 22 పుట వరకు రాశారు. రెండవది కుందుర్తి 'మన్యంలో', 'జయిస్తుంది', 'తరువాత' అనే 3 వచన కవితలను 23 పుట నుండి 44 వరకు రాసారు. మూడవది సుబ్రహ్మణ్యం ఠాకూర్ చంద్రసింగ్, ప్రజాశక్తి, విజయముద్ర అనే 3 వచన కవితలను 45 పుట నుండి 60 పుట వరకు రాసారు. 9 వచన కవితలు 60 పుటలలో ఉన్న ఈ కావ్యం తెలుగు సాహిత్యంలో నూతన ఒరవడి

సృష్టించింది. అప్పటి నుండి ఈ ముగ్గురు కవులు నయాగరా కవులుగా ప్రసిద్ధి చెందారు. మొదట ముద్రణ 1944లో జరిగింది.

కుందుర్తి ఆంజనేయులు రాసిన 'మన్యంలో' అనే వచన కవితలో అల్లూరి సీతారామరాజు ధైర్య, సాహసం, మన్యవిప్లవం, బ్రిటిష్ వాళ్ళపై తిరుగుబాటు, స్వాతంత్ర్య దీక్ష మొదలైన విషయాల్ని పుట 23 నుండి 28 వరకు సమగ్రంగా వివరించారు.

అభ్యుదయ ప్రస్థానంలో తొలి మజలీ నయగరా డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం అభిప్రాయాన్ని తెలుపుతూ...

"నయగరాలో ఆంజనేయులుగారి మొదట కావ్యం "మన్యంలో" ఇందులో వస్తువు అల్లూరి సీతారామరాజు విప్లవం. దాన్ని కథగా రాస్తే నవల రాయవచ్చు. పేరాలు రాస్తే ప్రబందం కావచ్చు. కుందుర్తి దాని కథను చెప్పటానికి రాయలేదా కావ్యం? విప్లవతత్వాన్ని చెప్పటానికి రాశారు.

"సమిష్టి సత్యాగ్రహం దేశాన్ని సకలం ముంచెత్తిన రోజులు" అంటూ పూర్వరంగాన్ని మాత్రబద్ధం చేశారు. మన్యంలో తిరుగుబాటు, ప్రభుత్వం తిరుగుబాటు అణిచేసిన, గొడ్డలిపెట్టు అని ప్రస్తావనను నిర్వహిస్తూ కథాతత్వాన్ని సూచ్యార్థ సూచకంగా అందించారు.

మదరాసు నుండి, మలబారు నుండి తోలుక వచ్చిన సైన్యంలో కమాండరిన్ చీపులు, శివాలయం గోడ మీద చెక్కించిన విగ్రహాలు. ఇందులో కథ ఉంది. శిల్పమూ ఉంది. కమాండరిన్ చీపుల కథ చివరి మూడు ముక్కల్లో, అలంకార ధ్వని నాశ్రయించి అద్భుత శిల్పాన్ని ప్రదర్శించింది. ఇటువంటి సంగ్రహ సమీక్షలో కుందుర్తి కవితాశక్తి అణుశక్తిలా ప్రత్యక్షమౌతుంది.

బంధించిన, బానిసత్వ, విచ్ఛేధిక వీరమూర్తి, విప్లవ శరదాకాశం, వెలిగించిన విద్యుద్దీపం, రామరాజు హృదయంలో రగిలిన స్వాతంత్ర్యేచ్ఛ అనే భాగంలో ఆవేశం ఉంది. వర్ణన ఉంది. వీరుణ్ణి ఆశ్రయించి కథా స్మృతి ఉంది. మన్య విప్లవం మా చరిత్రలో 'వీచిన జంఝూనిల వీచిక" అనటంలో సమీక్షాత్మకమైన ప్రబోధం ఉంది.

మొత్తానికి 'మన్యంలో' కుందుర్తి కవితలో ఉన్న కథాత్మక, వర్ణానాత్మక, ప్రబోధాత్మక చైతన్యానికి సూక్ష్మదర్శిని, ముప్పేటగా సాగిన కవితా గుణ స్రవంతులకు సంగమ తీర్థం" అని ప్రశంసించారు.

– భారతీ పత్రిక – పుట 35 వ్యాసం

"మన్యంలో" వచన కవితలో కుందుర్తి సత్యగ్రహాన్ని వివరిస్తూ...

"సమిష్టి సత్యాగ్రహం దేశాన్ని
సకలం ముంచెత్తిన రోజులు
మన్యంలో తిరుగుబాటు
ప్రభుత్వం విరగబాటు అణచేసిన
గొడ్డలిపెట్టు!"[274]

భారతదేశ స్వాతంత్ర్యం కొరకు సత్యాగ్రహం దేశమంతా పాటిస్తున్న రోజులవి మన్యంలో అటవీ చట్టాలతో పోడు వ్యవసాయం రద్దు చేశారు. స్వేచ్ఛగా అనుభవించే అడవుల్ని సర్వే చేయించడం. సాగు చేసే భూముల్ని ముఠాదార్లకు అప్పగించడం వంటి కారణాలతో మన్నెంలో విప్లవం రగిలింది.

"రాచరికపు బాటల్లో రాజుకున్న కారుచిచ్చు
మన్ను తిన్న పాముల్లాంటి మన్యం వీరుల గుండెల్లో
రాజుకున్నవి ప్రభుత్వ భవనాల్
రాజధాని నగరంలో!
రేగినై ప్రళయ ప్రళయంగా తుపాను నగస్రాలు
అమాయక హృదయాల్లో రగిలి విప్లవ జ్యోతులు
మన్య సముద్రంలో చెలరేగిన
అవమాన బడుబాగ్ని జ్వాలకు
రాజుకున్నవి ప్రభుత్వ భవనాల్
రాజధాని నగరంలో![275]

క్షత్రియుల వంశలో పుట్టిన రామరాజు పేదవారి కష్టాలన్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకోగలిగాడు. చిన్ననాటి నుండి కష్టాలతో పెరిగినవాడు కావడంతో ప్రజలంతా తన వలె కష్టాల్లో మునిగిపోకుండా వుండాలని మనసారా కోరుకున్నాడు. ఎన్నో సంఘటనలను కళ్ళారా చూశాడు. కష్టపడే వాడొకడైతే, ఫలితం దక్కించుకునే వాడు మరొకడు. శ్రమ ఒకడికైతే సుఖం ఒకడిదయ్యేదని ఆవేదన వ్యక్తం చేశాడు.

రాచరికపు బాటల్లో రాజుకున్న కారుచిచ్చు. ఈ వాక్యంలో పదాల అన్యాయం మీద ఆధారపడి వెంటనే స్ఫురించే భావం వాచ్యర్థం. తుఫాను సహస్రాలు అనే

ప్రయోగంలో తుఫాను భయంకరంగా ఉంటుంది. అటువంటిది 100 తుఫానులు కలిస్తే ఎంత భయానకంగా ఉంటుందో ఈ ఉద్యమం అలా ఉంది అని కవి వర్ణించారు.

అమాయక హృదయాల్లో రగిలిన విప్లవ జ్యోతులు, ఎటువంటి నాగరికతా, తెలియని గిరిజన అటవిక ప్రజల్లో విప్లవం వచ్చింది. ఆ బడబాగ్ని జ్వాలలకు రాజుకున్నవి రాజధాని నగరంలో ప్రభుత్వ భవనాలే. ఈ ప్రయోగంలో ఉద్యమం జరుగుతుంది. విప్లవ పోరాటం వెలుగుతుంది అని బ్రిటిష్ ప్రభుత్వానికి తెలియజేయడం విశేషం.

"మా చేసిన మన్య విప్లవం
దేశానికి మార్గదర్శి!
దిగివచ్చిన వెలుగు బాట!
సెంటుజార్జి కోట చెవుల్ బెదిరించిన
విప్లవ దుందుభి! భి!"[276] అని అంటూ

ఈ వచన కవిత 1943 సం॥లో వ్రాసింది. మన్య విప్లవం దేశానికి మార్గదర్శి అని ఆనాడే వర్ణించాడు. మరి కాంగ్రెసు వాదులకు కనిపించలేదు. మాకు స్వాతంత్ర్యం కావాలి అని గర్జించిన మహావీరుడు. పిలుపు బ్రిటిష్ వారి సెంటుజార్జి కోట చెవుల్ బెదరించి విప్లవ శంఖం పూరించాడు.

మిరపకాయ తపాలాకు
మిలిటరీ తుపాకి బారులు
సమాధానం చెప్పలేక సగం చచ్చి కూచుంటే
తెనుగు రాజు కరకుదనం తెలిసింది ప్రభుత్వానికి!
న్యాయం బురఖా తగిలించిన
ప్రభుత్వానికి పట్టు గొమ్మలు
విప్లవాన్ని విరిచెయ్యాను
ముఠాదార్ల శపథం!
ముఠాదారీ ముసుగుల్లో జరిగే అక్రమాలకు
విరుగుడు మన్య విప్లవం!"[277] అని వివరిస్తూ

మిరపకాయ టపాతో ముందుగా బ్రిటిష్ వారికి సమాచారాన్ని యిచ్చి ఎదర్కోమన్న విప్లవవీరుడు. చింతపల్లి పోలీసుస్టేషనులో రికార్డులను పరిశీలించాడు. ప్రజల మీద

ఉన్న నేరారోపణ పత్రాలను చించివేశాడు. అక్కడున్న ఆయుధాలన్నింటినీ లెక్కించి ఆ వివరాలను రికార్డు పుస్తకంలో రాసి తాను వశపరుచుకొంటున్నట్లుగా శ్రీరామరాజు స్వదస్తూరితో రాసి సంతకం చేసిన ధైర్యశాలి.

"ముఠాదారి ముసుగుల్లో జరిగే అక్రమాలకు విరుగుడు మన్య విప్లవం"

వచన కవితలో శైలి మీద శిల్పం మీదా కుందుర్తికి ప్రత్యేకమైన దృష్టి ఉంది. ఛందోబంధాలన ఉండి భాషా భేషజాల్నుండి బయటపడ్డ వచన కవిత. వాడుక భాషలో సూటిగా భావాన్ని చెప్పేసి ఊరుకుంటే తేలిపోయే ప్రమాదం ఉంది. అందుకే దానికి శిల్పశక్తి ఉండాలి. ప్రాచీన కవిత్వంలో ఉన్న శిల్పరీతుల్ని బాగా అవగాహన చేసుకున్నవాడు. ఆ శిల్పరీతుల్లో భావోత్తేజానికి ఉపయోగపడేవాటిని, వచన కవితలో సరళ విధానంలో ప్రయోగించి ఒప్పించడం కనిపిస్తుంది. అంటే ప్రాచీన శిల్పరీతుల్ని ప్రజాపదం చెయ్యడంలో కుందుర్తికి ప్రత్యేక దృష్టి ఉంది.

పై పంక్తుల్లో ముఠాదారులకు, బ్రిటిష్ ప్రభుత్వంపై ఒక విరుగుడు, రోచితం, విరోధం... ఈ మన్యవిప్లవం. సాహిత్యం ఒక ఆయుధంలా, ఔషదంలా తయారు అయింది అనటానికి ఉదాహరణ మన్యవిప్లవం.

"మన్యంలో ప్రభుత్వానికి
మలేరియా జ్వరం పట్టుకొని బాధిస్తే
విజృంభించి నిప్పుల కంఠం
వినిపించిన విప్లవ గీతం
వినేసరికి బెదిరిపోయి
ప్రభుత్వానికి తెల్లగుడ్డు పడినై
మదరాసు నుండి, మలబారు నుండి
తోలుకు వచ్చిన సైన్యంలో
కమాండరన్ చీపులు
శివాలయం గోడ మీద చెక్కించిన విగ్రహాలు![278]

కుందుర్తి వారి నయాగరాలోని కవితా ఖండికలు వారి కవితాగ్ని సాక్షాత్కారంలోని విస్ఫులింగాలు. శ్రీశ్రీ అడుగుల్లో అడుగులేసి నడిపించిన వైఖరి అందులో కనబడుతుంది. పరపీడన పరాయణత్వంలో పడరాని పాట్లు పడ్డ మానవత ఘోషించిన మూగరోదనలకు

కవితా సమీక్ష ఈ కావ్యం. తెలుగువాడి సాహసం, శౌర్యం చూసి ఆలయంలో గోడ మీద చెక్కించిన శిలావిగ్రహాలుగా బ్రిటిష్ వాడిని వ్యంగ్యంగా వర్ణించడం. ఈ కావ్యంలో గొప్పతనం కనబడుతుంది.

"మన్యంలో పురుకున్న మత్రంతా విడిపించిన
మా హృదయాలను కదలించిన,
దింతాలు మండించిన దీపికలై శౌర్యాగ్నులు
ప్రచండమైన మన్యవిప్లవం
అనామకంగా వీచిన ఒక చిరుగాలి తరంగంగా
చేసింది ప్రభుత్వం! రాసింది రికార్డుల్లో
మూసేద్దామని లోకం కండ్లు
రాజద్రోహంగా, నేరంగా, దోపిడిగా, దొమ్మీగా
చరిత్రలో రాసుకున్న
చాదస్తపు రాతలకేం
మన్య విప్లవం మా చరిత్రలో
వీచిన ఝంఝానికల వీచిక!"[279] అని శ్లాఘిస్తూ...

అమాయక ప్రజలైన గిరిజనుల్లో నూతన ఉత్తేజం, స్వాతంత్ర్య కాంక్షను కలిగించేవాడు. వారిలో ఉన్న మత్తంతా వదిలించాడు. రామరాజుకు పూర్వం పితూరు నడిపిన మహావీరులు 1916 లాగరాయి పితూరీ, కన్నెగంటి హన్మంతు మొదలైనవారు శౌర్యాగ్నులు, వీరత్వంతో నిండిన అగ్నిని కణాలను వెలిగించిన మన్యవిప్లవం" కవిత్వంలో గతం పితూరీల ఆదర్శమార్గం కనిపిస్తుంది.

ఆధునిక కవుల్లో ప్రధానంగా రెండు మార్గాలున్నాయి. ఒకరు తీవ్రమైన కోపంతో, కసితో చెప్పి పాఠకుడి భావాన్ని ఉత్తేజింపజేయడానికి ప్రయత్నిస్తారు. మరొకరు వక్రోక్తితో, పరిహాస దృష్టితో చెప్పి పాఠకుని హేతువుకి వచ్చేటట్లు చెప్పడానికి ప్రయత్నిస్తారు. రెండు కోవలను అనుసరించిన సవ్యసాచి కుందుర్తి. చరిత్రలో రాసుకున్న చాదస్తపు రాతలకే' కాదు. చరిత్రలో చారిత్రక వాస్తవంలో మన్య విప్లవం చెరగని ముద్రగా వర్ణించారు.

"విదిలించిన వీరుని ఖడ్గం
పసిగట్టిన పాము బుసా

చూపించిన విప్లవ మార్గం
సామ్రాజ్యపు కత్తుల వానకు
పట్టించిన స్వర్ణ చ్ఛత్రం
అధికారపు అన్యాయమ్ములు
అడ్డుకున్నది రక్షా కవచం!"[280]

శ్రీశ్రీకి అభ్యుదయమ్ ఒక నిషా. కాని కుందుర్తికి ప్రజా చైతన్యమే, అసలైన నిషా. విదిలించిన వీరుని ఖడ్గం అనడంలో కవి యొక్క అంతర్గతం పతాకస్థాయికి చేరుకుంది. శైలి అంతా విసురుకి, ఒక ప్రవాహ రూపమైన భావోద్విగ్నతకీ నిదర్శనంగా సాగి విప్లవ తీవ్రతకి పదాల నడక ప్రతిబింబంగా కనిపిస్తుంది.

"సామ్రాజ్యపు కత్తుల వానకు" అనే ప్రయోగంలో విప్లవ నిషా కనిపిస్తుంది. అధికారపు అన్యాయమ్ములు – విప్లవకారుల కోసం పోలీసులు గాలిస్తున్నారు. ఎక్కణ్ణించి కబురు వస్తే అక్కడికిపోయి, వారి వార్తను చెప్పమని ప్రజల్ని చిత్రహింసలు చేస్తున్నారు. స్త్రీలని మానభంగం చేస్తున్నారు. విప్లవకారులకి రహస్యంగా సహాయపడే ప్రజలు దేనికైనా తెగించి రక్షా కవచమైన నాయకున్ని కాపాడుకుంటారు.

"మన్య విప్లవం మా చరిత్రలో
వీచిన ఝంఝానిల వీచిక
బంధించిన బానిసత్వ విచ్ఛేదక వీరమూర్తి!
విప్లవ శరదాకాశం వెలిగించిన విద్యుద్దీపం
రామరాజు హృదయంలో
రగిలిన స్వాతంత్ర్యేచ్ఛ
మన్య విప్లవం మా చరిత్రలో
వీచిన ఝంఝానిల వీచిక!"[281]

మన్యంలో బానిసత్వాన్ని, అగ్రహారికులు, ఇనాందార్లు, మొకాసాదార్లు, కిల్లరాజుల, పేర్లతో వుండే భూస్వాములు, పెత్తందార్లు సాగించే అక్రమాలను చూశాడు. మరో ప్రక్క ఏజెన్సీ ప్రాంతాలలో ఫారెస్టు అధికారుల దౌర్జన్యాలు చూశాడు. మన్య ప్రజల చరిత్ర తెలుసుకున్నాడు. మన్యంలో స్వాతంత్ర్య కాంక్ష రగిలించాడు.

## 2.9 అద్దేపల్లి రామమోహనరావు:

"అల్లూరి సీతారామరాజు" వచన కవితా విప్లవ వీర కథాకావ్యంను అద్దేపల్లి రామమోహనరావు రాశారు. జనవరి 2017 సంవత్సరంలో వచ్చిన ఈగ్రంథం వచన కవితా కావ్యాలలో నూతన ఒరవడి. 256 పుటలు గల ఈ వచన కవితా విప్లవ వీర కథలో ఉత్సాహం, చైతన్యం ఉరకలు, పరుగులు, ప్రకృతి వర్ణన, దేశభక్తి, ఉద్యమాలు, పోరాటాలు, కరుణ, రౌద్ర, భయానక బీభత్స ప్రణయ లాంటి నవరసాల్ని కవి కళ్ళకు కట్టినట్లు చూపించాడు.

వచన కవిత్వానికి పరుగులు నేర్పింది కుందుర్తి –కాలంతోపాటు ప్రక్రియ, కవితా వస్తువు, స్వరూప స్వభావాలు, మార్పు చెందుతూ ఉంటాయి. పోనుపోను ఊటగా బయల్దేరిన ఈ ప్రక్రియ ఘరివేగం, వైశాల్యం, గంభీరత సంతరించుకుంది. అన్ని రసాత్మకమైన భావనలు వ్యక్తం చేసేందుకు సానుకూలమైన ప్రక్రియగా ఈనాడిది పరిణమించింది. అందుకే అద్ధేపల్లి కుందుర్తి వైపు మొగ్గాడు. ఈ కుందుర్తి వాదాన్ని వేదంగా భావించి కావ్యంలో "మొదలు" అనే పీఠికా ప్రాయమైన ఖండికలో వివరించారు.

అల్లూరి సీతారామరాజు ఎంతో నేర్పుతో ఆంగ్లేయుల గుండెల్లో గుబులు పుట్టిస్తుండేవాడు. ఆయన మూడు సంవత్సరాల పాటు సుధీర్ఘంగా జరిగిన మన్యం మహావిప్లవాన్ని అద్దేపల్లి సమగ్రంగా, సూక్ష్మాతి సూక్ష్మంగా, చారిత్రక సంఘటనలకు భంగం కలగకుండా సంవత్సరాలు, నెలలు, తేదీలతో సహా పాఠకులకు మనసును ఆకట్టుకునేటట్టుగా వర్ణించాడు. చదువరులను ఆ కాలానికి, ఆ కీకారణ్యంలోకి తీసుకొని పోయాడు కవి అనడంలో అతిశయోక్తిలేదు.

చక్కటి వర్ణనలతో నేటి యువతరం దేశభక్తితో ఏత్తేజితం కావాలని కోరుకుంటున్న విధానం తెలుస్తుంది. అల్లూరి వంటి ఎందరో స్వాతంత్ర్య పోరాట త్యాగ గాధలు ఆత్మబలిదానాల వల్ల ఈనాడు మనం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో ఆనందిస్తున్నామని అందరూ గుర్తించాలని కవి ఆశించాడు.

### విప్లవ వీర కథాకావ్యం విభజన:

ఈ వచనా కథా కావ్యాల్ని అద్ధేపల్లి చిత్ర విచిత్రంగా విభజించాడు. మల్లేల

గురవయ్య "శ్రీరామరాజీయము" అనే పద్యకావ్యం వలే వర్గీకరించాడు. మూడేళ్ళ పాటు తీవ్రంగా జరిగిన రామరాజు విప్లవాన్ని అద్దేపల్లి ఒక (అహస్సు) పగలుతో పోల్చాడు. 1.ప్రాత:కాలం, 2.ఉదయం, 3.మధ్యాహ్నం, 4.సాయంత్రం అని నాలు అధ్యాయాలుగా విభజించి కావ్యరచన గాలించాడు. కావ్యాన్ని కొనసాగించేటప్పుడు ముందుగా తన ప్రస్తావనలో "మొదలు" అనే రెండు పుటల ఖండికలో సూచించాడు. నిజానికి ఇది కావ్యంలో భాగం కాదు. కవి రాసుకున్న పీఠిక మాత్రమే. ఈ పీఠికలో కథా కావ్యాలను గురించిన కుందుర్తి వాదాన్ని సూచించాడు.

ప్రాత:కాలం అనే విభాగాన్ని వేకువకి ముందు... వేకువ అనే రెండు ఉపశీర్షికలుగా సూచించాడు.

వేకువ ముందు అనే శీర్షికలో...

సముద్రం ఒడ్డున
నిలబడ్డాను
గుప్పెడు తడిమట్టిని
చేతిలోకి తీసుకున్నాను
ఆ మట్టిలో
సముద్ర ఘోష వినిపిస్తోంది
ఈ మట్టినాది
ఈ సముద్రం నాది
తలెత్తి ఆకాశం వైపు చూశాను[282]

పై కవితలో సముద్రఘోష అనే శబ్దం. స్వాతంత్ర్యఘోష, స్వేచ్ఛసమరం అనే భావాలు ప్రతి ధ్వనించేలా కవి స్వాతంత్ర్యకాంక్షను తెలియజేస్తున్నాడు. ఆకాశం వైపు చూస్తున్నాడని అనడంలో కథానాయకుడి ఆత్మ విశ్వాసాల్ని, దృఢ సంకల్పాన్ని లక్ష్యాన్ని కవి వర్ణిస్తున్నాడు.

అదేవిధంగా కథానాయకుడి దేహాన్ని దేశంతో పోల్చుతూ...

"నాదేశమంటే నా దేహమే
నాదేహంలో
ఎన్ని రోగాలున్నా
నాదేహం నాకు గొప్పది
నాదేశంలో ఎన్ని లోపాలున్నా
నాదేశం నాకు స్వర్గతుల్యం"[283] అని అంటూ

(శరీరానికి) దేహానికి రోగం వస్తే చికిత్స చేసుకొని మందులు వేసుకుంటాము. అలాగే దేశానికి పరాయి ప్రభుత్వమనే రోగం సంభవిస్తే, తిరుగుబాటు, విప్లవము అనే చికిత్సలో స్వాతంత్ర్యమనే మందులు వేసి ఇటు దేశాన్ని, అటు దేహాన్ని రక్షించుకునే బాధ్యతను కవి వివరించాడు.

"దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అన్న గురజాడ కవితావేశం గోచరిస్తుంది. దేశభక్తి మనిషి దేహంలోకి వెళ్ళగలిగేలా చేసే శక్తి ఒక్క కవితా స్వరూపానికి మాత్రమే ఉందనే విషయాన్ని వెల్లడించాడు. అదేవిధంగా అంతటి ప్రతిభ ఈ వచన కవితలో కూడా దర్శనమిస్తుందని స్పష్టం చేశారు.

తెల్లవాళ్ళు మన దేశానికి ఎలా వచ్చారు. ఎందు వచ్చారు. అనే విషయాన్ని చాలా సూక్ష్మంగా, సున్నితంగా, అల్పాక్షరాలతో అనంతమైన భావనలతో కూడా అర్థవంతమైన మాటలతో తెల్పుతూ.....

స్వాతంత్ర్యాన్ని
పరతంత్రంతో చెరబెట్టి
తెల్లదొర దుకాణం తెరిచాడు
వస్తువ్యామోహపు నల్లముసుగు కప్పి
అంతులేని దోపిడీతో
ప్రజలందర్నీ
బానిసలు చేశాడు[284] అని చెబుతూ

ఆంగ్లేయులు భారత దేశానికి వ్యాపార రీత్యా వచ్చి, విదేశవస్తు వ్యామోహం

చూపించి లేనిపోని ఆశలు కల్పించి భారతీయుల్ని, వారి విలువైన సందల్ని దోచుకుని బానిసలుగా చేసిన విధానాన్ని వ్యక్తం చేసారు.

ఈ శీర్షికలో కథానాయకున్ని చాలా గొప్పగా ఆవిష్కరిస్తూ...

ఒక ప్రజాయోధుడు
ఒక మహో విప్లవకారుడు
ఒక శాత్రవ సంహారి
ఈ నేలపై అవతరిస్తాడు
అతడే అల్లూరి సీతారామరాజు[285] అని అంటూ

రామరాజును ప్రజల సంక్షేమం కోరే వీరుడుగా, బ్రిటిష్ వారిపై తిరుగుబాటు దారుడుగా చిత్రీకరించాడు. అంతే కాకుండా ఆంగ్లేయులను అంతమొందించుటకు, భారతీయుల దాస్య విముక్తిని సంహరించడానికి అవతరించాడని కవి ముందుగా కీర్తించడం విశేషం.

2. వేకువ అనే మరో శీర్షికలో...

పై ఉపశీర్షికలో నామధేయంలో ఉంది వేకువ (వెలుగు). ఈ వచనా కవితకి సూర్యోదయం. శ్రీరామరాజు కథకు ఉషోదయం. ఈ విభజనలో అంతరార్థమిది. వీరుడు యుద్ధభూమిలో మరణించిన తర్వాత సూర్యమండలాన్ని ఛేదించుకొని స్వర్గానికి వెళతాడని భారతీయ సంప్రదాయం. కాబట్టి సూర్యుడికి, వీరుడికి సంబంధం ఉంది. ఇద్దరికి ప్రతాపం సమానం ఈ సామాన్యాన్ని పురష్కరించుకొని ఈ రకమైన కావ్య విభజన కవి చేశాడు.

బ్రిటిష్ వారు వ్యాపర నిమిత్తం వచ్చి వారు చేస్తున్న దురాక్రమణాల్ని వివరిస్తూ...

"ముడిపదార్థాలు
సముద్రాలు దాటించడం
అక్కడి తయారీలన్నీ
ఓడల్లో
ఇక్కడికి తరలించడం

ఇక్కడ అమ్మిన సొమ్మలన్నీ
దాటించడం –తరలించడం–పోగులు పెట్టడం"[286]

భారతదేశంలో లభించే విలువైన సుగంధ ద్రవ్యాల్ని, వేదాల్ని, సంస్కృతుల్ని మొదలైన సంపదలను బ్రిటిష్ వారి దేశానికి ఎగుమతి చేస్తూ ఉండేవారు. అక్కడ తయారైన విదేశీ వస్తువుల్ని దిగుమతి చేసి ప్రజలకు విక్రయించి సొమ్ము చేసుకున్న తీరును, వారి ఆకృత్యాల్ని తెలియజేశారు.

ఆంగ్లేయుల విధానాల వల్ల, వారి చట్టాల వల్ల భారతీయులు, మరియు చేతి వృత్తుల వారు తీవ్ర నష్టాల్ని చవిచూశాయంటూ...

"చేనేత వారి
బొటనవేళ్ళు కోసెయ్యడం
ఇక్కడ
రైతుకి పొలానికి వున్న
బంధాన్ని తెంచెయ్యడం
తమ
గుమస్తా చదువుల్ని నేర్పి
కఠినంగా దండించడం
ఖండించడం – తెంచెయ్యడం – దండించడం"[287] అని అంటూ

చేనేత వస్త్రాలను తయారు చేయుటలో ప్రపంచంలోనే భారతదేశం అగ్రస్థానం చేనేత కార్మికుల హస్తకళలను నాశనం చేసేవారు. చేనేత వృత్తుల్ని, వ్యవసాయాన్ని పూర్తిగా కోలుకో లేని విధంగా బ్రిటిష్ వారి విధానాలు ఉన్నాయని, అలాగే భారతీయుల్ని వారి గుమాస్తాలుగా చేసుకొని వారిని హింసలకు గురి చేయడం లాంటి విషయాల్ని చర్చించారు.

సంస్కృతి సంప్రదాయాలకు మట్టి పెట్టి, గ్రామీణతను ముక్కలు, చెక్కలుగా చేస్తుంటే నేలతల్లి కన్నీరుతో రోధిస్తుందంటారు. వారి దుష్ట పరిపాలనను వర్ణనలో చూపుతూ

పాఠకులకు చైతన్య దీప్తి కలిగించే పదజాలంతో రాయడంలో అద్దేపల్లి వారి కవితా దృష్టి వెల్లడౌతుంది.

ఆంగ్లేయులు అడవితల్లిని, అడవి బిడ్డలకు శోకం కలిగించిన తీరును వెల్లడిస్తూ...

"అడవికి కన్న వెయ్యాలనిపించింది
అడవి బిడ్డల కడపు
కొట్టేద్దామని పించింది
ఈదోపిడి
ఇలాగే సాగితే
ఒకప్పటికి నాదేశమాత
రక్తమాంసాలు హరించుకుపోతాయి"[288] అని పలుకుతూ

బ్రిటిష్‌వారు భారతదేశంలో అటవిచట్టాలు ఏర్పాటు చేసిరి. భారత అటవీ భూముల్లో లభించే విలువైన సంపదల్ని దోచుకుని, అడవి పుత్రులైన గిరిజనుల్ని హింసించి వారి ప్రాణాల్ని హరిస్తున్నారని తెలిపారు. ఇదే కొనసాగితే దేశ వనరులు, సంపదదతో పాటు, ధన, మాన ప్రాణ నష్టాన్ని చవిచూడాల్సిన పరిస్థితులు ఏర్పడతాయని కవి హెచ్చరించాడు.

భవిష్యత్‌లో జరిగే అన్యాయాన్ని ముందుగా కనిపెట్టి వాటిని ఎదుర్కోనేందుకు ప్రజల్ని చైతన్య పరచడం లాంటి విషయాల్ని ఈ కవిత ద్వారా తెలియపరిచాడు.

దేశంలోని భాషా సంస్కృతులు, ఆంగ్లేయుల అరాచకత్వానికి బానిసలౌతున్నాయని అంటూ...

"బ్రిటిష్ వారు భారతీయుల భాషా సంస్కృతులపైన, వారి జీవన విధానాన్ని కోలుకోలేని విధంగా దెబ్బతీశారని, అంతేకాకుండా, దేశంలోని యాంత్రిక శక్తిని ప్రవేశపెట్టి చేతి వృత్తులు చేసేవారికి మనుగడ లేకుండా చేశారని వాపోయారు.

**రెండవ భాగం ఉదయం:**

రెండో భగమైన "ఉదయం"లో వివిధ ఘట్టాలన్నీ పేరాగ్రాపులుగా సూచించారు.

కవి కూడా మనుషుల్లో ఒకడు. కాబట్టి సహజంగా మనిషి, మనసుకు, సంఘానికి వ్యక్తిగత విలువలకు, సామాజిక కట్టుబాట్లకు మధ్య జరిగే పోరాటాన్ని చిత్రీకరించారు. బ్రిటిష్ వారు సృష్టిస్తున్న తీవ్ర అలజడులకి, అల్లర్లు అడ్డకట్ట వేయాలనే ఉద్ధేశంలో వార్ని దేశం నుండి తరిమి కొట్టాలంటూ...

శత్రువుల్ని సరిహద్దులు దాటించి
తరిమి కొట్టేదాకా
మాపోరాటం ఆగదు
చెదిరిపోయిన వ్యవస్థ
కుదురుకునే దాకా
మా సమరం సాగుతుంది
వందేమాతరం, వందేమాతరం[289] అని

భారతీయులకు ఆంగ్లేయులకు తలపెట్టిన కీడు ఎదురు తిరిగి సమాజంలో స్వాతంత్ర్య కాంక్షను నింపాలనే ఉద్దేశ్యంతో పరాయి దేశ సత్వాన్ని దేశం నుండి తిరిగి పంపేవరకు ఉద్యమం విరమించేది లేదని ప్రతిజ్ఞ చేసిన తీరుని వ్యక్తపరిచారు.

శీర్షిక ప్రారంభంలో ప్రకృతివర్ణన, అడవి గురించి ఇంత చక్కగా చెప్పడం కవికే సాధ్యం. అడవికి ప్రజలకి ఉన్న సంబంధం, దేశానికి అడవికి ఉన్న సంబంధం అడవి లేనిదే ఈ దేశానికి మనుగడ లేదు అని నిరూపించే సందర్భంలో...

మట్టికి మనిషికి సందాత–అడవి
భారతీయ సంస్కృత ప్రదాత–అడవి
ప్రపంచాన్ని కమ్ముకున్న
కొండలెన్నిటినైనా
ఒక గుండె
ప్రక్కలు చెయ్యగల దాని
ఆచరించి
చూపించిన

అంతులేని సాహసానికి కడలి–అడవి
అడవి స్వేచ్ఛకి ప్రతీక
అడవి దేశానికి ప్రతీక"[290] అని అంటూ

ప్రకృతి మనిషికి ఆరోగ్యాన్ని ఇస్తుందని లోకాన్ని కాపాడుతుందని ఈ కవిత స్పష్టం చేస్తుంది. అడవులు, సముద్రం, ప్రకృతి మొదలైన అంశాలు మానవ జీవన ఔన్నత్యానికి ప్రతీకలుగా కవి పేర్కొన్నారు.

అల్లూరి సీతారామరాజు పుట్టుక. వివిధ ప్రదేశాల విద్యాభ్యాసం, బాల్యంలోనే తండ్రి వలన దేశభక్తి బీజాలు నాటుకోవడం, యుక్త వయసులో ప్రేమకథ, యోగాభ్యాసం, చదువు మీద ఆసక్తి లేకపోవడం, ఇంట్లోంచి పారిపోయి పుణ్యక్షేత్రాలు దర్శించడం, తన గమ్యాన్ని గూర్చి దిశ నిర్ధేశాల్ని వేసుకోవడం లాంటి విషయాన్ని చెర్చించారు.

సూర్యనారాయణమ్మ పుట్టిల్లు విశాఖపట్నం జిల్లా పాండ్రంకి గ్రామం సాగర సమీపము అత్తవారిల్లు మోగల్లు–దోదావరి పరీవాహం అందువల్ల ఆ రెండు ప్రాంతాల పరిస్థితుల ప్రబావం అల్లూరిపై ఉన్నాయంటూ...

"రాజుకి
గోదావరి వరద స్వభావము వచ్చింది
ముద్రపు గాంభీర్యము వచ్చింది.
రాజులో సాగర వైశాల్యము ఉంది
గోదావరి స్వచ్ఛతా ఉంది
విశాఖ అటవీ వాయు తరంగాలు
గోదావరి అడవుల్లోని గాలికెరటాలు కలసి
రామరాజుకి
ప్రాణాయామ ప్రసారం చెయ్యడానికి
ఈ క్షణం నుండే
సంప్రదింపులు ప్రారంభింపబడినవి"[291] అని పలుకుతూ

గోదావరి నీటి మాధుర్యం, సాగరం తీరంలో కెరటాలు, అటవి ప్రాంతంలో ప్రకృతి పచ్చదనం కథానాయకుడి జీవితాన్ని మార్పు చేస్తాయని కవి చెబుతున్నాడు. ఒక వ్యక్తి పుట్టుక ఆపుట్టిన పరిసర ప్రాంతాలనుండి, ఆ వాతావరణం ఎంతో ప్రభావాన్ని చూపుతాయి. రామరాజు కూడా ఆ ప్రాంత ప్రకృతి శక్తి సామర్థ్యాలు ఆయన్ని ఒక సమరయోధుడుగా నిలుచుటకు కారణమయ్యాయని కవి భావన.

అలాగే రామరాజు కుటుంబీకులు దేశభక్తి గలవారని సంస్కరణాభిలాష కలిగినవారని వివరిస్తూ...

భీమవరంలో
ఖద్దరు పరిశ్రమనూ
ప్రకృతి ఆశ్రమాన్నీ స్థాపించినవారు
కందుకూరి మార్గాన్ని అనుసరించిన
వితంతు వివాహాలు జరిపించిన
సంఘ సంస్కరణాభిలాషులు
వారు దక్షిణాఫ్రికా ఉద్యమానికి
భారీనిధులు
వసూలు చేసి పంపినవారు"[292] అనివ్యాఖ్యానిస్తూ

శ్రీరామరాజు తండ్రి వెంకట రామరాజుకి ఒక అన్నగారు ముగ్గురు తమ్ముళ్ళు అన్న రామచంద్రరాజు. సంస్కృత భాషలో మంచి పండితుడు తమ్ముడు రామకృష్ణంరాజు డిప్యూటీ కలెక్టర్‌గా పదవి విరమించి ఖద్దురు పరిశ్రమను స్థాపించారు. రెండవ తమ్ముడు రంగరాజు మహాత్మాగాంధీ భక్తుడు దక్షిణాఫ్రికా ఉద్యమానికి భారీగా నిధులు వసూలు చేసి పంపించాడు. మూడవ తమ్ముడు రామభద్రరాజు భాషానైపుణ్యం గలవాడు. ఏ భాషల్లో ఎంత నైపుణ్యం ఉన్న తెలుగు భాషకే ప్రాధాన్యత యిచ్చేవాడు. ఇలా వీరి పూర్వీకులు దేశభక్తి, సమాజసేవా, భాషాసేవా సంస్కృతి సంప్రదాయాలకు చిరునామాగా జీవించేవారని కవి తెలియజేశారు.

రామరాజు తండ్రి వెంకటరామరాజు బొంబాయిలో చిత్రలేఖనం, ఛాయాచిత్ర

ప్రతిఫలనం నేర్చుకొని మొదట సర్పాపురంలో, తర్వాత తణుకులో, ఆ తర్వాత రాజమండ్రిలో ఫోటోస్టూడియోని నడిపారు. జాతీయ నాయకుల స్వాతంత్ర్యపోరాట సమరయోధుల ఛాయాచిత్రాన్ని వచ్చిన వారందరికీ చూపి ప్రబోధాలు చేసేవారు. ఆ విషయం రామరాజు గుండెల్లో ఏనాడో నాటకుపోయాయి.

రామరాజు బాల్యంలో గుణగణాలను తెలియజేస్తూ...

"ప్రాణాలకు తెగించి పోరాడ్డం
ప్రాణాలిచ్చి యితరుల్ని రక్షించడం
ఈ రెండు గుణాలు
రామరాజులో బాల్యం నుండి
రక్తంలో నిక్షిప్తమై ఉన్నవి"[293] అని వివరిస్తూ

అన్యాయం జరుగుతుంది అనే విషయం తెలిసిన వెంటనే రామరాజు న్యాయం కొరకు ప్రాణాలను యిస్తాడు. దాని గురించి పోరాడతాడు. పరోపకారం కోసం తన సర్వస్వాన్ని ధారపోస్తాడు. ఇతరులను రక్షిస్తాడు. బాల్యం నుండి పూర్వీకులు ఇచ్చిన దేశభక్తి, తండ్రి నుండి తెలుసుకున్న జాతీయ నాయకుల ధైర్య సాహసాల ప్రభావం కన్పిస్తుంది.

నాటి సమాజంలో బ్రిటిషువారు ప్రవేశపెట్టిన ఆంగ్ల బాషా విధానం భారతీయ భాషల్ని ప్రజల్ని ఇబ్బందులకు గురి చేశాయంటూ...

"ఆనాడు భారతీయుల్ని
మేకాలుగా చేసి
అందరి నాలుకల మీద
ఆంగ్ల బీజాక్షరాలు రాశారు
ఇంగ్లీషు భాషనే
వస్త్రాలుగా చుట్టి నడక మార్చేశారు
ఆంగ్లభాష

టోపీలో ఈక అయింది

ఆంగ్లబాష

దోసిట్లో రూక అయింది

"నమస్కారం"

చేతులు విరచేశారు

గుడ్‌మార్నింగ్

ఒంటి చేత్తో మిగిలింది"[294]

ఈ కావ్యంలో దేశభక్తితోపాటు అనుసరించవలసిన సంస్కరణలు కూడా కవి తెలియపరచడం విశేషం. ఆంగ్లేయుల ఆంగ్లవిద్యావిధానము వలన భారతీయ భాషా సంస్కృతులకు, ఆచార సాంప్రదాయాలకు తీవ్రనష్టం ఏర్పడిందంటారు. నమస్కారం రెండు చేతులతో సంస్కరణాన్ని తెలియజేస్తుంది. అని కవి వర్ణించారు. కేవలం ఆంగ్ల భాషను బ్రతుకు తెరువు కొరకు మాత్రమే పనికి వస్తుందన్న భావన కవి వ్యక్తం చేశారు. బ్రిటిష్ వారి మనుగడకు ఉపయోగం కోసం ఆంగ్లభాషను భారతీయులపై రుద్దారు అని కవి భావన.

రామరాజుకు బ్రిటిష్ వారి గూర్చి తండ్రి చెప్పిన సందర్భాన్ని వర్ణిస్తూ...

"ఇంగ్లీషు వాడంటే ఎవరో తెలుసా

వ్యాపారం చేసుకుంటామని

రాజుల్ని బతిమాలి, భామాలి

ఈ దేవంలో అడుగుపెట్టి

క్రమంగా

విభజించి పాలించే రాజకీయంతో

వారిని

సింహాసనాల మీద నుండి పడగొట్టి

దేశమంతటినీ తమ గుప్పిట్లో పట్టి

మూడు వందల ఏళ్ళగా

ఈ దేశాన్ని

ఒక చెరసాలగా మార్చి
స్వేచ్ఛను బంధించి తాళాలు పెట్టినవాడు"[295] అని వ్యాఖ్యానిస్తూ

వాణిజ్య వ్యాపార నిమిత్తం వచ్చి భారతీయుల్ని, రాజుల్ని, నాయకుల్ని మోసపూరిత విధానాలతో అణగద్రొక్కి వారి రాజ్యాన్ని రాజ్యాధికారాన్ని చేజెక్కించుకుని ప్రజల్ని బానిసలు చేసిన తీరుని తెలియ పరిచారు. "విభజించు-పాలించు" అనే సూత్రంతో భారతదేశాన్ని చిన్నాభిన్నంగా తయారు చేసి సుమారుగా 300 సంవత్సరాలు బారతీయుల్ని అణగత్రొక్కారు అని కవి విచారం వ్యక్తం చేశారు.

1908 సంవత్సరంలో గోదావరి పరివాహక ప్రాంతాలో వచ్చిన పుష్కరాలకి ఏర్పడిన కాలుష్యం వల్ల భయంకరమైన కలరా వ్యాధి ప్రబలి అనేక మంది తనువు చాలిస్తారు. అలాంటి వారిలో రామరాజు తండ్రి ఒకరు.

వెంకటరామరాజు మరణం వల్ల కుటుంబానికి పెద్దదిక్కు లేకుండా పోతుంది. తల్లికి, చెల్లికి, తమ్ముడికి దిక్కు చూపించవలసిన బాధ్యత రామరాజుపై పడింది. నాలుగు రకాలుగా ఆలోచిస్తుంటాడని కుటుంబమా, స్వాతంత్ర్యమా, శాంతి లేక విప్లవమా అనుకుంటూ అంతర్గతంగా తర్జన భర్జన పడతాడు. రామరాజు ఆలోచన విధానాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించారు. తర్వాత రామరాజుని పిన్నమ్మ తన ఊరు భీమవరం దగ్గర కొవ్వాడ కి తీసుకు వెళుతుంది. అక్కడ మొదటిఫారంలో చేర్పించింది. ఆ పాఠశాలలో చదవడం రామరాజుకి ఇష్టం ఉందదు. ప్రతిరోజూ 2 మైళ్ళు వెళ్ళి మరల తిరిగి రావడంలో ఉన్న ఆసక్తి కూడా తోవలో ఎక్కడో జారిపోయింది. తర్వాత కొంత కాలానికి తన చిన్నాన్న ఇంటి నుండి చదువు కొనసాగిస్తాడు. అక్కడ యోగాబ్యాసాన్ని సాధన చేస్తాడు. అయినను చదువు వంటబట్టలేదు. ఉద్యోగరీత్య చిన్నాన్నకు బదిలీ అవుతుంది. మరలా విశాఖలో ఎ.వి.యన్ మిషనరీ స్కూల్‌లో చేరుతాడు.

అప్పటికి రామరాజు వయస్సు పదహారేళ్ళు. మనసు వలపు గాలిలో మెలికలు తిరగడం ప్రారంభిస్తుంది. అని కవి ప్రయోగం చూస్తుంటే ప్రేమ వైపు మళ్ళినట్టు కనిపిస్తుంది. రామరాజు యుక్త వయస్సులో జరిగిన ప్రేమ వ్యవహారాన్ని సుమారు 18 పుటల్లో వర్ణించారు.

ఈ కావ్యంలో ప్రేమ వ్యవహారంలో కులం! డబ్బు! మొదలైన ఆర్థిక పరమైన విషయాలలో సాగుంతి. రామరాజు కులం కన్న మంచి గుణం కలవాడు. ఆర్థిక స్థోమత లేని కారణంగా ప్రియురాలి తండ్రి నిరాకరిస్తాడు. నాటి నుండి విశాఖ విడిచిపెట్టి పినతండ్రి ఇంటికి వెళ్ళిపోతాడు.

కుటుంబ ఆర్థిక పరిస్థితుల వల్ల రామరాజుని నర్సాపురం టెలర్‌స్కూల్‌లో చేర్పిస్తాడు. అక్కడ కూడా విద్యను కొనసాగించకుండా, చించినాడ మునసబు కొడుకుతో గుర్రపుస్వారీ నేర్చుకుంటాడు. పాఠశాలకు వెళ్ళకుండా గుర్రపుస్వారీ నేర్చుకుంటూ మూడు రోజుల పాటు ఇంటికి కూడా వెళ్ళక పోవడంతో పిన తండ్రి రామకృష్ణంరాజు కోపంతో చేయి జేసుకుంటాడు. దానితో...

"పుస్తకాల్ని నలుమూలలా విసిరేసి
క్లాసు విద్యకు వీడ్కొలు చెప్పి
అసలైన విద్యను వెతుక్కుంటూ
గుమ్మం అవతల అడుగుపెట్టాడు
సీతమ్మ కొండమీద
తపస్సులో మునిగిపోయాడు"**296** అని

చదువుపై శ్రద్ధలేని రామరాజు దానికి స్వస్తి పలికి ఆధ్యాత్మికతని చేకూర్చే యోగ, గుఱ్ఱపుస్వారీ లాంటి విషయాల్ని ఆసక్తి చూపిన విధానాన్ని వ్యక్తపరిచారు. సీతమ్మ కొండ అనే ధారా పర్వతంపై తపస్సులో మునిగిపోయాడనే విషయాన్ని కూడా స్పష్టం చేశారు.

ఆ కావ్యంలో రచయిత పుస్తకాలు విసిరేసిన తర్వాత రామచంద్రాపురంలో రెండోఫారంలో చేర్పించాడు. ఇక్కడ ఉన్నప్పుడు రామరాజు విషయం, విశాఖపట్నంలో చదువుకొనేటప్పుడు ప్రేమ వ్యవహారంలో ఉన్నప్పుడు రామరాజు వయస్సు 16 సంవత్సరాలు అన్నారు. రామచంద్రాపురం చదువుకొనేటప్పుడు వయస్సు 14 సంవత్సరాలు అంటున్నారు. తర్వాత కాకినాడకు బాబాయి బదిలీ పిఠాపురం రాజా హైస్కూలులో మూడోఫారంలో చదువునప్పుడు 15 సంవత్సరాలు వయసు అని కవి వివరించారు.

రామరాజుకి నాటకాలు వేయడమన్న పాటల పాడటమన్న ఎంతో మక్కువ. ఆ ఇష్టంతోనే నాటక ప్రవేశం చేసి శశిరేక, నారద పాత్రలో నటించి అందరి మెప్పు పొందేవాడు. పోటీల్లో గెలుపొందినందుకు రామరాజుకి ఐదవ జార్జి చక్రవర్తి బొమ్మతో బంగారు పతకం బహుకరించారు.

ఆ బంగారు బహుమతిని తన గుండెలపైనే పెట్టుకునేవాడు. ఎందుకు అని తన మిత్రులు ప్రశ్నించగా దానికి రామరాజు...

"ఇది నాచొక్కాకి అలంకారం కాదురా!
ఇది నాగుండె మీద కుంపటి
ఆసెగ నాకు వదలకుండా
తగులుతూనే ఉండాలి
నాలో ఉన్న కసిని
రగులుస్తూనే ఉండాలి
నా రక్తాన్ని వెచ్చగా
ఉడికిస్తూనే ఉండాలి"[297] అని

బ్రిటిష్ వారిపై ఆయనకు గల కోపాన్ని, ద్వేషాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించారు. మద్దూరి అన్నపూర్ణయ్య రామరాజులో జాతీయతా భావాన్ని కలిగించిన మంచి మిత్రుడు. రామరాజు గూర్చి అనేక వ్యాసాలు రాసి, స్వాతంత్ర్య సమరయోధుడుగా భారతమాత ముద్దుబిడ్డగా యంగ్ ఇండియా పత్రికలో ప్రచురించిన విధానాన్ని ఈ సందర్భంగా గుర్తు చేస్తాడు.

రామరాజు తన మిత్రుడు అన్నపూర్ణయ్యతో పలికిన మాట గూర్చి...

"ఏ విద్య దేశాన్ని
ఉద్ధరించగలదో అదే విద్య
అలా కానిది
అసలెప్పుడు విద్యకానే కాదు
ఆకాశంలో ఎగురుతున్న

పక్షుల కెంత స్వేచ్ఛ ఉంది!
తెల్లదొరల బానిసత్వంలో
అది మన కెక్కడ ఉంది?
వాళ్ళ కింద ఉద్యోగాలకు
ఈ చదువు కావాలిగాని
దేశసేవకు అవసరం ఏముంది?"[298] అంటూ

రామరాజు ప్రతిమాట భవిష్యత్ తరాల వారికి మార్గదర్శకమౌతాయంటారు. గాంధీజీ కళాశాలలు బహిష్కరణకు తన 51వ ఏట పిలుపునిస్తే, రామరాజు తన 15వ ఏట హైస్కూలు దశలోనే ఇంగ్లీషు చదువుల బహిష్కరణకు పిలుపునిచ్చారు. ఇది స్వయాన తన మిత్రుడు అన్నపూర్ణయ్య నోట వెలువడిన మాట అని చెప్పడం కవి నిశిత పరిశీలనా దృష్టికి నిదర్శనం.

తునిలో కొన్ని రోజులు అమ్మ, తమ్ముడు, చెల్లెలతో కలసి ఉన్న రామరాజు కడు పేదరికాన్ని అనుభవిస్తాడు. "ఏదో ఒక పని చూసుకోరాదు" అని తల్లిమాటకు రామరాజు మౌనం వహిస్తాడు. కుటుంబ బంధాలు విడిచిపెట్టి పేరిచర్ల సత్యనారాయణ రాజుతో కలసి బస్తర్, జయపూర్ దాక ఉన్న అడవుల్ని, అటవీ గ్రంథాల్ని అధ్యయనం చేస్తాడు. తల్లి త్యాగమూర్తి కానీ, భారతమాత ముందు మనమందరం త్యాగ ధనులు కావాలనే లక్ష్యంతో స్వాతంత్ర్య పోరాటంలోకి దిగాడనే విషయాన్ని తెల్పారు.

సూర్యనారాయణమ్మకి రామరాజు బాగా చదివి మంచి ఉద్యోగం సంపాదిస్తాడనే ఆసక్తి ఉండేది. కానీ ఆయన పరీక్ష పేరు చెప్పి తల్లికి చెప్పకుండా ఇల్లు విడిచిపెట్టి నడక సాగించాడంటారు.

అలా బయలు దేరిన రామరాజు పయనం ఎంతవరకు సాగిందో తెల్పుతూ...

"చిన్ననాటి నుండి రాజుకి
కొండలన్నా, అడవులన్నా ఇష్టం
కొండ అతనికి

మౌనంగా కూర్చొన తపస్సు చేస్తున్న
మహర్షిలా కనిపించేది
అడవి అతనికి
తాను నిజం చెయ్యదలచిన
కలలా అనిపించేది"[299] అని అంటూ

అడవులపై రామరాజు కున్న ప్రీతిని వ్యక్తపరిచారు. తర్వాత హృశీకేశం, బదరి, కేదారం లాంటి పుణ్యక్షేత్రాన్ని దర్శిస్తాడు. అలాగే గంగోత్రి, యమున, నదుల్ని తిలకించి హిమాలయ గుహల్లో కొంత కాలం జీవనం సాగించి అక్కడ ఋషుల యోగా తత్పరతని అవగాహన చేసుకుంటాడు. అనంతరం కాశీ, గయా, ప్రయాగ, అస్సాం, నేపాల్, కాశ్మీర్ అలాంటి ఎన్నో ప్రదేశాల్ని సంచరించాడనే విషయాన్ని విశద పరిచారు అలా ప్రయాణించగా రామరాజులో స్వాతంత్ర్య కాంక్ష అధికమై, దాని సాధనకు నడుం కట్టాడనే విషయాన్ని తెలియజేశారు.

ఉదయం శీర్షికలో రామరాజు గమ్యాన్ని భవిష్యత్ ప్రణాళిక నిర్ధారణకోసం కవి సూచించిన మార్గంగా కనిపిస్తుంది.

**3.మధ్యాహ్నం:**

మూడవ విభాగమైన మధ్యాహ్నం కూడా సుధీర్ఘమైన విప్లవ చరిత్ర. ఇది 99వ పేజీ నుండి 212 పుట వరకు 56వ పుటలుగా సాగుతుంది. ఈ శీర్షికలో రామరాజు తల్లిమాట కాదని ప్రజల ఆక్రందనల్ని తీర్చడానికి సిద్ధపడతాయి.

నాటి బ్రిటిష్ అధికారి బాస్టియన్ దురాగతాన్ని గూర్చి వర్ణిస్తూ...

"రోడ్డు మరమ్మత్తు చేయించాడు
పైకం ఇమ్మంటే
నీకు ఘన సంపాదన పదవియిస్తానని
ముఠాదారు చేస్తానని
నోరూరించాడు

ఊరిన నోట్లో
దుమ్ము కుమ్మరించాడు
వాడు బాస్టియన్"[300] అంటూ

మన్యం ప్రజలకు కూలీసుగా ఉపయోగించు కుంటూ రోడ్డు నిర్మాణంలో వారి కూలీ డబ్బులు యివ్వకుండా దుర్మార్గుడైన బాస్టియన్ నిరంకుశత్వ వైఖరికి ఎంతోమంది బలైపోయారు. వాటిని అడ్డుకోవడానికి రామరాజు నడుంబిగించాడని స్పష్టంచేశారు.

కావ్యంలో ప్రతి చిన్న విషయాన్ని అతిసూక్ష్మంగా, క్షుణ్ణంగా వివరించారు. అంతే కాకుండా అడవి మౌనం వివరిస్తూ...

మన్యం ప్రజలంతా మౌనంగానే ఉంటారు
కానీ ఆ మౌనం
ఏదో మాట్లాడుతున్నట్లు
అధికారులు
ఉలిక్కిపడుతుంటారు[301] అని అంటూ నిశ్శబ్దం ఎంత భయంకరమైనదో వ్యక్తపరిచారు. ఆ మౌనం మాట్లాడుతున్నట్లు దానికి బ్రిటిష్ అధికారులు భయపడుతున్నట్టు తెలియపరిచారు. సముద్రం ఎంత ప్రశాంతంగా, నిర్మలంగా ఉంటుందో అది సృష్టించే అలజడి కూడా అంతే ఉదృతని సృష్టిస్తుందని ఆ విధంగానే రామరాజు ఎత్తుగడలు, ఊహాతీతంగా వుంటాయని కవి భావన.

అలాగే రామరాజు ఉద్యమ రహస్యాలు, విప్లవ మంతనాలు, రాజకీయ చర్చలు జరుపుతుంటాడు. ఆ సంగతి బ్రిటిష్ వారికి తెలిసినప్పటికీ...

"మన్యంలో ఆకు కూడా
రాజుకు వ్యతిరేకంగా చెప్పదు
సాక్ష్యం లేకపోతే
న్యాయం ఎవడి మాటా వినదు"[302] అంటూ

రామరాజు చేస్తున్నది బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకమైనప్పటికీ అవి మన్యం ప్రజల

కష్టాలను తీర్చడం కోసం అని స్పష్టమౌతుంది. బ్రిటిష్ సైన్యంపై తిరుగుబాటుకు ప్రజల్ని సన్నద్ధం చేస్తున్నాడనే భయంతో రామరాజుతో స్నేహబంధమంతనాలకి ప్రయత్నిస్తారు. బ్రిటిష్ వారు కానీ...

"రామరాజు
వజ్రాయుధానికి కూడా
తలవంచడు
అమ్మ ప్రేమ ముందు మాత్రం
తల ఎత్తడు
అమ్మ గుండెలోనే
తన ప్రాణాలను దాచుకున్నాడు
అమ్మ ప్రేమ బంధంతో కట్టేస్తే మాత్రమే
అతడు అటూ ఇటూ కదలడు"[303] అని అనుకుని

మాతృప్రేమతో రామరాజుని కట్టడి చేయగలమని ఉద్దేశంతో ఆంగ్లేయులు కుట్ర పన్నుతారు. దానితో రామరాజు బ్రిటిష్‌వారి మార్గంలోకి వస్తాడని ఆశపడతారు. రామరాజు తల్లిని, కుటుంబ సభ్యుల్ని తీసుకువచ్చి అడ్డతీగల దగ్గర పైడి పుట్టలో పెడతాడు. కొంత వ్యవసాయ భూమిని, అవసరమైన పశుసంపదను బ్రిటిష్ అధికారులు సమకూర్చుతాడు. వారిని అడ్డంగా పెట్టుకొని రామరాజుని ఉద్యమబాట నుండి తప్పించుటకు బ్రిటిష్ వారు ప్రయత్నించిన విధానాన్ని తెల్పారు.

కానీ వారి ఎత్తుగడల్ని కనిపెట్టిన రామరాజు...

"నా ఊపిరి ఆగేలోగా
మన్యాన్ని స్వర్గం చేస్తా"[304] అని పలకడంలో రామరాజు స్వాతంత్ర్యదీక్ష, త్యాగమయ జీవితం, ధైర్య సాహసాలు స్పష్టమౌతున్నాయి.

ఒకవైపు అధికారుల నిఘా, మరోవైపు కుటుంబం, ఎక్కడికి కదలనివ్వని అమ్మ, తన లక్ష్యం కళ్ళముందు కనిపిస్తున్న రామరాజుకు...

"ప్రభుత్వ నిఘా తమ మీద
అందమైన ముళ్ళు బేరలు కప్పుతోంది
అక్కడ ఇక ఉండలేక
రామరాజుని ఆపలేక
అమ్మా, తమ్ముడూ
చెల్లిలి ఊరికి నరసాపురానికి
తరలిపోయాడు"[305] అంటూ

బ్రిటిష్ ప్రభుత్వం తమ కుటుంబానికి హాని చేసేదిగా తయారౌతుందని తెలుసుకున్న రామరాజు. అతనిపై ప్రభుత్వం గూఢాచారిని నియమించింది. రామరాజు దిన చర్యలను గమనిస్తూ ఉండేవాడు. ఒకవైపు రామరాజు అదుపు చేయలేమని భావించి కుటుంబ సభ్యులు నరసాపురానికి వెళ్ళిపోయారని తెలుస్తుంది.

భారతదేశంలో బ్రిటిష్ వారు సృష్టిస్తున్న అలజడులకి ప్రతిస్పందనగా జరిగిన వ్యతిరేఖ చర్యల్ని గూర్చి తెలుపుతూ...

"పల్లెల్లో పట్టణాల్లో
నగరాల్లో, అటవీ ప్రాంతాల్లో
ఎక్కడ
తెల్లవాడి ధన దాహంలోంచి
పీడన చర్యలు
హింసాత్మకంగా చెలరేగిపోయాయో
ప్రతిహింసాత్మక చర్యలు –విజృంభించిపోయాయి"[306] అంటూ

మన్యం ప్రజలు తిరగుబాటుతో ఆంగ్లేయులపై విరుచుకుపడ్డారని స్పష్టించేశారు. అంతేకాదు పట్టణాలు, గ్రామాలు అనే తేడా చూపకుండా పిల్లలు, స్త్రీలు, వృద్ధులు అనే బేధం లేకుండా, పన్నులతో, డబ్బు ఆశతో ప్రజలను పీడించేవారని కవి హింసాత్మక చర్యలను వర్ణించారు.

రామరాజు కంటే కృష్ణందొర, ఉయ్యాలవాడ నరసింహారెడ్డి, ద్వారబంధం చంద్రయ్య,

కన్నెగంటి హనుమంతు, తెలంగాణా సాయుధ పోరాటం మొదలైన ఉద్యమాలు 1840 రంప పితూరి నుండి ప్రారంభమైన విప్లవాలు 1922 పల్నాటి తిరుగుబాటు వరకు సాగమనే విషయాన్ని వ్యక్తం చేశారు.

రామరాజు అడగుల్లో అడుగువేసి విప్లవ సైన్యాలుకీ విప్లవ చైతన్యం పూరించిన సందర్భంలో...

“విప్లవ భీజం
నాటిన తర్వాత
సిద్ధాంతాలే మానుగా గట్టిపడి
కొమ్మలు చాచి
చిగుళ్ళు వేచి
పూలు పూచి
కాయలు కాచి
ఫలితాలు
మధుర ఫలలౌతాయని”[307] కవి స్పష్టంజేశారు.

విప్లవమనే విత్తనాన్ని నాటి, చైతన్య సిద్ధాంతాలు అనే భూమిలో వేర్లు గట్టిపడి చిగురించి, స్వాతంత్ర్యమనే కొమ్మలు, చిగుళ్ళు వచ్చి స్వేచ్ఛ అనే పువ్వులు ఫలితాలు మధురమైన ఫలాలు ఇస్తాయని కవి వర్ణించారు.

రామరాజు చిన్నతనం నుండి సంస్కరణాభిలాష స్వాతంత్ర్య కాంక్ష, అధికంగా ఉ న్నాయంటే అది కేవలం ఆయన పెరిగిన వాతావరణం, సంస్కృతి, సాహిత్యాల ప్రభావమంటారు కవి. అందుకే గరిమెళ్ళ సత్యనారాయణ “మాకొద్దీ తెల్లదొరతనం” అనే గేయం ఆంధ్రుల స్వాతంత్రోద్యమంలో ఒక పెద్ద పెనుమార్పుగా చెప్పొచ్చు. బ్రిటిష్ వారిపై తిరగుబాటుకు ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడంలో ఈ గీతం ఎంతో ప్రభావితం చూపించిందనేది అక్షరసత్యం.

గురజాడలో సంస్కరణాభిలాష, స్త్రీల జనోద్ధరణ, వ్యవహారిభాష కర్త గిడుగు

ఉద్యమ స్ఫూర్తి, కార్మిక వీరుల్ని సైతం కదలించిన శ్రీశ్రీ లాంటి విప్లవ కారుల భావజాలం అల్లూరిలో అణువనువునా వ్యక్తమౌతాయంటారు. అంతేకాకుండా తాను పెరిగిన వాతావరణమైన గోదావరి ప్రాంత పౌరుషం నిరంతరం జ్వలిస్తూ విప్లవ బీజం ఏర్పడిందని విశ్లేషించారు. అలాంటి విశిష్ఠ ప్రాంతంలో నడయాడిన రామరాజు తిరుగులేని ఉద్యమ వీరుడుగా ఎదగడాన్ని కవి చక్కగా వర్ణించారు.

రామరాజు అధ్యయనం చేసిన అనేక విద్యల్ని, శాస్త్రాల్ని గూర్చి వివరిస్తూ...

"అసంఖ్యాకమైన శాస్త్రాలన్నీ
తమ తమ రహస్యాలతో
అతని అస్త్ర శాస్త్రాలగా మారిపోయినై
ఆశ్వ శాస్త్రాన్ని
సువిశాల మేథావీథుల మైదానాల్లో
కదం తొక్కించాడు
గజశాస్త్రాన్ని
నిగ్రహపా శాంకుశ ఖడ్గహస్తుడై
లొంగ దీశాడు
మూలికా వైద్య శాస్త్రాన్ని
మూలాల్లోంచి తవ్వి తీశాడు
ధనుర్విద్య
అతని ముందు వినయంతో వంగిపోయి
అతని గుప్పిట్లో ఇమిడిపోయింది"[308] అంటూ

రామరాజు జ్యోతిష్య, సంఖ్యాక, గణిత, వైద్య, తత్వశాస్త్రాలను క్షుణ్ణంగా పరిశీలించాడు. అస్త్ర విన్యాసాలను నేర్చుకున్నాడు. శాస్త్రాలలోని రహస్యాలను కనుగొన్నాడు. గుఱ్ఱపుస్వారీ విలువిద్యల్లో రామరాజు నైపుణ్యాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించాడు.

అల్లూరి తన చిన్ననాటి మిత్రుడైన మద్దూరి అన్నపూర్ణయ్యకు మధ్య జరిగిన

సంభాషణలో చక్కని చాతుర్యం కనిపిస్తుంది. ఒక రోజు రామరాజుని చూసిన మద్దూరి దగ్గరకువెళ్ళి అడగుతాడు. వారిద్ధరి మధ్య హాస్యపూరకమైన మాటల్లో రామరాజు తాను నేర్చిన విద్యల్ని గూర్చి వివరిస్తాడు.

అలాగే వారి జీవితంలో జరిగిన ఆనాటి జ్ఞాపకాల్ని, దేశభక్తి, ఉరకలేసిన వారి యుక్తవయసు స్ఫురింపజేశారు.

రామరాజుకు ముగ్గురు తల్లులు సూర్యనారాయణమ్మ, భారతమాత, అడవితల్లి. ఈ ముగ్గురు కన్నీటి శోకాన్ని తీర్చాలి. కన్నతల్లి అతని కుటుంబానికి మాత్రమే భారతమాత భారతీయులకు మాత్రమే. కానీ అడవితల్లి ఈ విశ్వానికి తల్లి ఈ ప్రకృతి జీవనం. మానవ జీవితానికి కల్పవల్లి అడవి యొక్క ప్రాముఖ్యత వర్ణిస్తూ....

"అడవిబిడ్డకి అడవి అమ్మ
అడవి అమ్మ కడపులో పెట్టుకొని
కడుపులో పెట్టుకొని కాపాడే దేవత
కాపాడే దేవత
పుట్టతేనె పట్టి
పట్టుతేనె పెట్టి
అతణ్ణి పెంచి
పెద్దవాణ్ణి చేస్తుంది
పోడకొట్టి,
పొలందున్ని
అన్నంపెట్టి
ఆకలి తీరుస్తుంది
వనమూలికల్ని ఔషదముగా చేసి
వ్యాధులన్నింటి నుండి రక్షిస్తుంది
కొండలమీద నుండి దుకే
జలపాతం వంటి ప్రేమలో
కావలసిన వన్నీ ఇస్తుంది"[309] అడవితల్లి అంటూ

అడవితల్లిని కాపాడుకోవాలి. అమాయక గిరిజన ప్రజల్ని అనేక బాధలకు గురిచేస్తున్నారు. అటవీ చట్టాల్ని రూపొందించి, తల్లి, బిడ్డల్ని వేరుచేస్తున్నారని, అన్నీ ఉన్నా ఏమీ లేనివాడిగా మిగిలిపోతున్నారని, బ్రిటిష్ వారి నిరంకుశత్వ ధోరణికి కవి తీవ్ర ఆందోళన వ్యక్తం చేశాడు.

రామరాజు మన్యాన్నే తన విప్లవ స్థావరంగా చేసుకున్నాడని చెప్తూ...

"రామరాజు మనస్సు
ఆకాశం నించి నేలకు వచ్చింది
అడవి చెట్ల నీడలోనే
తన పీఠం నిర్మించుకుంది.
చెట్టే చెట్ట పట్టాలు పట్టే స్నేహితులుగా
పిట్టలే పిలిస్తే పలికే స్వరబంధువులుగా
తేనె పట్టులాంటి గిరిజన జీవన మాధుర్యం
అమ్మ ఒడిలాంటి అడవితోడి అనుబంధం"[310] తో రామరాజు విప్లవ శంఖారావాన్ని పూరించాడు.

తెల్లవాణ్ణి వెళ్ళగొట్టడమే తన ప్రథమ కర్తవ్యంగా భావించి, అడవితల్లి బిడ్డలకు రాజయోగం చేయడమే తన యోగంగా ఉద్యమిస్తాడు. అయినప్పటికి మన్యానికి రాజవ్వాలని, నాయకులుగా ఉండాలనే కోరిక లేదు. గిరిజనులకు అభివృద్ధి చేయడంలో రామరాజు ఆశ కనబడుతుంది.

రామరాజు మొదట యోగిగా, తపస్వీగా, సత్యమార్గంలో ప్రయాణించాడని వర్ణిస్తూ...

"పరమహంస లాంటి రామరాజు
మొదట్లో హింసావాది కానేకాదు
మహాత్ముని మార్గంలో
అహింస వల్లమాత్రమే
తెల్లవారి

చీకటి వల చీల్చుకుని
తెల్లవారితే పావురాలు
స్వేచ్ఛగా రెక్కలు విప్పితే
అని నమ్మినవాడు, కానీ
ఆయుధాలే తన అనుయాయుల్ని
బలి తీసుకుంటున్నప్పుడు
రాజు తప్పక ఆ యుద్ధాలే చెయ్యాలని
మనస్సుని సిద్ధం చేసుకున్నవాడు"[311] అని అంటూ

రామరాజు మన్యంపలో మద్యనిషేధం కోసం కృషి చేస్తాడు. కళ్ళు మానండి, కళ్ళు తెరవండనే గాంధీ నినాదంతో సాగిపొమ్మంటాడు. మత్తులో ఉన్నవారికి జరిమానాలు, మందును విడిచినవారికి బహుమానాలు ఏర్పాటు చేశాడు. భక్తి, బోధనల్ని, ఆధ్యాత్మికత, సాహిత్యంలాంటి గ్రంథాల్ని చదివి వారికి ప్రపంచ జ్ఞానాన్ని బోదించేవాడు. గ్రంథాలయాలు స్థాపన, పంచాయితీ వ్యవస్థలో న్యాయస్థానం, మొదలైన సంఘసంస్కరణలను ఏర్పాటు చేస్తాడు. కానీ తర్వాత హింస మార్గంలో ప్రయాణిస్తే తప్ప స్వరాజ్య స్థాపన జరగదనే విషయాన్ని గ్రహించి విప్లవ పోరాటానికి నాంది పలుకుతాడు.

కానీ గాంధీ నిర్ణయం ప్రచారం కాంగ్రెసు కార్యవర్గం సహాయనిరాకరణోద్యమాన్ని 1922 ఫిబ్రవరి 12న విరమిస్తుంది. ఇంచుమించు అదే సమయంలో 1922 జూన్‌లో ఆంధ్రప్రదేశ్ మన్య ప్రాంతంలో రామరాజు సారధ్యంలో బ్రిటిష్ వారిపై సాయుధ పోరాటం ప్రారంభిస్తాడు. ఇదే మన్యం విప్లవంగా పిలవబడింది.

విప్లవ సైన్యానికి చైతన్యం కలిగించే సందర్భంలో...

"రామరాజు వారికి
జరగుతున్న రాజకీయాలు బోధించాడు
ప్రతి ఘటన పాఠాలతో వాళ్ళని ప్రబోధించాడు
పోరాటాల వ్యూహాల గురించిన
అవగాహన కలిగించాడు

వారి మనోరణ్యాల నిండా
దావాగ్ని కీలలు రగిలించాడు
వందేమాతరం నినాదాలతో
అడవిలోని అణువణువు ప్రతిధ్వనించింది"[312] అంటూ

అహింస మార్గాలేకాదు, హింసాత్మక ప్రతి చర్యల్ని బోధిస్తాడు. కవి రచనలో "బోధించాడు" "ప్రబోధించాడు" అన్న పద ప్రయోగంలో హింస, అహింస, పదాలను అంతర్గతంగా మన పాఠకులకు చెప్పాడు.

తెల్లవాళ్ళ అసమర్థతను తెలియజేస్తూ...

"ఒకదేశంలో
ఒక రాష్ట్రంలో
ఒక అడవిలో
ఒక ఉద్యమాన్ని
అణచలేని అసమర్థత
తెల్లదొరల్ని
తల్లకిందులు చేసింది"[313] అని అంటూ

రామరాజు ఉద్యమాన్ని అణచడానికి బ్రిటిష్‌వారు ఎన్ని విధాలుగా ప్రయత్నిస్తారు. ఎందరినో చిత్రహింసలకు గురిచేస్తారు. ప్రతిఫలంగా అడవిలో ఆకు కూడా సమాధానం చెప్పదు. చివరకు రామరాజును పట్టుకున్న వారికి, అతని సమాచారాన్ని అందించేవారికి బహుమానాన్ని ప్రకటిస్తారు.

రామాయణంలో ఒక్కడే రావణాసురుడు కానీ ఈమన్య రామాయణంలో ఇద్దరు రావణాసురులు మేజర్ గుడాల్, రూథర్‌పర్డ్‌లు వారి గుగించి వర్ణిస్తూ...

"రూథర్‌ఫర్డ్
రూథ్‌లెస్ కిల్లర్
ఏజెన్సీలో స్పెషల్ కమీషనర్

గుడాల్ నిప్పు

రూథర్ పర్డ్ కత్తి

గుడాల్ పిస్టల్

రూథర్ పర్డ్ ట్రిగ్గర్

ఇద్దరు చేతులు కలిపితే

ఆ కలయికలోంచి

వందలమంది కర్కోటకులు పుట్టి

లోకం మీదకి దూకుతారు"[314] అంటూ వారి క్రూర స్వభావాన్ని నిరంకుశత్వ విధానాన్ని వ్యక్త పరిచారు.

శ్రీరామరాజు గొప్ప తపస్వీ, మహాయోగి, ఆధ్యాత్మిక కోవిదుడు, సత్యవాది నిత్య బ్రహ్మచర్య వత్రుడు, ఆ తర్వాత మహా విప్లవకారుడు అనే అంశాన్ని అద్దేపల్లి వివరిస్తూ...

ప్రజలే సర్వస్వమైనారు

తపస్సే అతనికి ఐశ్వర్యమయింది

ప్రజలందరికి రామరాజు మహాయోగి

ప్రజల కోసమే జీవించే బాలయోగి

ప్రవచనాలు, ముహూర్తాలు

రక్షరేకులు, జ్యోతిష్యాలు

వ్యాధుల్ని తరిమికొట్టి

ప్రాణాలు పోసే మూలికా వైద్యులు

చెక్కుచెదరని మనోధైర్యం

పట్టుసడలని బ్రహ్మచర్యం"[315] అని రామరాజుకి మన్య ప్రజలలో గల సాహిత్యాన్ని విశదపరిచారు. మన్యం ప్రజలతో ఏకమై, అందరిలో ఒక్కడుగా ఉంటూ ఏ సహాయం కావాలన్న, ఏ ఉపాయం చెప్పాలన్న రామరాజు మాట వేదవాక్కు ప్రజల కాష్టాల్లో బాధల్లో కూడా పాలుపంచుకుంటాడంటారు.

భారతదేశంలో స్వాతంత్ర్య సమరవీరులు చాలామంది ఉన్నారు. కానీ వారు కేవలం స్వాతంత్ర్యం గురించి పోరాడి ఉంటారు. శ్రీరామరాజు అన్ని రంగాలలో మన్యం

ప్రజలకు సేవ చేస్తూ, స్వాతంత్ర్యం కోసం పోరాడిన మహావీరుడుగా కవి అభివర్ణించారు.

వచన కవితా కావ్యంలో కవి ప్రతివిషయాన్ని చారిత్రక అంశాలతో కలిపి చెప్పడం మనకు కనిపిస్తుంది. భారతదేశంలో ఏ ఉద్యమంలో ప్రస్తావన రాని "మిరపకాయటపా" అనేది ఒక రామరాజు విప్లవంలో మాత్రమే కనిపిస్తుందంటూ...

"మన విప్లవ ప్రతీక
అది మన మిరపకాయటపా"[316] అంటూ బ్రిటిష్ వారికి తాను చేస్తున్న పోరాటం గూర్చి ముందుగా తెలియపరచడం, రామరాజు ధైర్యసాహసాలకి నిదర్శనం. ఆవార్త తెలుసుకున్న బ్రిటిష్ ప్రభుత్వం చెదిరిపోవడం. ప్రభుత్వ ఉద్యోగుల్ని అప్రమత్తం కావడం లాంటి ఎన్నో విషయాల్ని చర్చించారు. ప్రజలకెలాంటి హాని కలుగకుండా ఒక్క బ్రిటిష్ అధికారులపై, బ్రిటిష్ ప్రభుత్వం పైనా విప్లవ శంఖం మోగించాలని రామరాజు గొప్పతనాన్ని వ్యక్తపరిచారు.

మన్యపోరాటం భారత స్వాతంత్ర్యంలో భాగంగా పేర్కొంటూ...

"మన విప్లవ పవిత్ర కార్యానికి
శ్రీకారం చింతపల్లి పోలీస్ స్టేషన్
వందేమాతరం! వందేమాతరం!
జై మహాత్మా! జై బాపూజీ
వింటినారి మోగించాడు
సీతారామరాజు"[317] అంటూ

స్వాతంత్ర్య పోరాటంలో అతివాదుల, మితవాదులు, విప్లవ కారులు ఈ ముగ్గురు కోవకి చెందినవాడుగా రామరాజుని వర్ణిస్తారు. ఎందుకంటే మొదటగా శాంతి, సామరస్య మార్గాలలో వెళ్ళి, తర్వాత ఉత్తర భారతదేవమంతా పయనించి మితవాదుల బృందంతో సహచర్యం చేసి, చివరికి విప్లవ బాటలో పయనించిన ఏకైన స్వాతంత్ర్య వీరునిగా శ్రీరామరాజును అభివర్ణిస్తారు.

విప్లవ భావాలతో స్వాతంత్ర్యపోరాటం చేస్తున్నప్పుడు కూడా వందేమాతరం

నినాదంతో మహాత్మను స్మరిస్తూ ఉద్యమాన్ని ఆరంభించడంలో ఆయనకి గల దేశభక్తి స్ఫురిస్తుంది. అలాగే పోలీస్ స్టేషన్లు కొల్లగొట్టిన, స్కాట్ కవర్డుని మట్టుపెట్టిన బ్రిటిష్ సైన్యాన్ని ఎదిరించి నిలవడంలో రామరాజు ఉద్యమం ఎంత తీవ్రమైందో తెలుస్తుంది.

నిరంతరం మన్యం ప్రజల శ్రేయస్సుని దేశ బానిసత్వ విముక్తి కోసం పోరాడతానంటూ...

"దేశమాత ఆశీస్సులు
అనుక్షణం అందుతుంటే
ప్రాణాలు పణం పెట్టి పోరాడుతున్నాను
మన్య ప్రజల్ని దొర నించి విముక్తి చేస్తాను
దేశానికి స్వాతంత్ర్యం సాధిస్తాను
వందేమాతరం... వందేమాతరం..."[318] అని అంటూ

తెలిపిన రామరాజు శపథాన్ని తెలియజేశారు. అనుక్షణం స్వాతంత్ర్య సాధనకై రామరాజు పోరాటం, బ్రిటిష్ ప్రభుత్వాన్ని, సర్వనాశనం చేసి, మన్యాన్ని, దేశాన్ని బానిస సంకెళ్ళ నుండి విముక్తి కలిగిస్తానని చెప్పడంలో రామరాజు ధృడ సంకల్పం స్పష్టమౌతుంది. గిరిజనుల్ని హింసించి, అటవీ చట్టాల్ని చేయడాన్ని పూర్తిగా వ్యతిరేకించి, వారికి స్వేచ్ఛ స్వాతంత్ర్యం కలిగిస్తాననడంలో సీతారామరాజు అంకుఠిత దీక్ష పటిమ వెల్లడౌతుంది.

కవి స్వాతంత్ర్య పిపాసతోపాటు ఉద్యమ వర్ణన మరియు పవిత్రమైన ఆశయాన్ని గూర్చి వివరిస్తూ అలాగే...

"కొండలపైన మబ్బులుంటె
కొండలపైన గిరిజనులుంటారు
కొండలపైన విప్లవ కారులుంటారు
కొండల మీదనే దేవుళ్ళు కూడా
కొలువు దీరి ఉంటారు"[319] అని అంటూ

ఆకాశంలో మేఘాలు ఎంతటి నిర్మలత్వాన్ని ప్రదర్శిస్తాయి. అలాగే గిరిజనులు

మనస్తత్వం కూడా నిర్మలత్వాన్ని తెలుపుతుంది. ఆకాశంలో మేఘాలు, ఆదివాసీలు ఉద్యమాలు దైవాంశ సంభూతులు సైతం కూడా కొండ కోనల్లోన కొలువుదీరి ఉంటారు.

ఈ విభాగంలో అల్లూరి విప్లవ పోరాటాన్ని చక్కగా వర్ణించారు కవి. బ్రిటిష్ వారు పోలీస్‌స్టేషన్లలో ఆయుధాలు లేకుండా కాళీగా ఉంచారు. ఆ సంగతి తెలుసుకున్న రామరాజు పర్లాకిమిడి, జయపురం వంటి ప్రాంతాలకు వెళ్ళి పోయాడు.

అది 1924 మే నెల నాలుగవ తారీఖు రామరాజు కొండపల్లిలో ఉన్నాడని గాలివార్త బ్రిటిష్ వారికి అందుతుంది. వారు సైనికులతో రామరాజు సైన్యం పోరాటం జరుపుతారు. చివరకి అగ్గిరాజు బ్రిటిష్‌వారికి దొరికిపోయి అండమాను జైళ్ళో, జీవితఖైదు అనుభవిస్తాడు. దీంతో ఈ శీర్షిక ముగుస్తుంది. "సాయంకాలం" అనే శీర్షికను కవి 12వ పుటలో వివరించారు.

శ్రీరామరాజు ఉద్యమం తీవ్రత సన్నగిల్లుతూ ఉంటుంది. ముఖ్య అనుచరులంతా బ్రిటిష్ వారి చేతుల్లో చిక్కుకుంటారు. శ్రీరామరాజు అచూకీ చెప్పమని నానాహింసలు పెడుతుంటారు. అంగేకాకుండా...

"మలబారు పోలీసు
క్షణాలు మల్లుదొరని
బంధీగా పట్టి ఇచ్చినై
విశాఖ సెంట్రల్ జెయిల్లో
విచారణ అతని చర్మాన్ని చీల్చింది
అది ద్వీపాంతరమై
అండమానుకి పంపించింది
పదమూడున్నర ఏళ్ళ
ప్రవాస శిక్షముగిసింది"[320] అని అంటూ

ఈ విప్లవ సైన్యంలో మల్లుదొర రామరాజు చెప్పిన జ్యోతిష్యం చెప్పినట్లుగానే జరుగుతుంది. స్వాతంత్ర్యాన్ని మనలో మల్లుదొర చూస్తాడని, రాజ్యాధికారం చేపడతాడని ఆనాడే చెప్పడంలో రామరాజు ముందుచూపు తెలుస్తుంది. స్వాతంత్ర్య దినోత్సవాన్ని

చూసి, 1952వ సంవత్సరంలో పార్లమెంటు మెంబరుగా కూర్చుంటాడు. కొంత కాలానికి చాలా బాధలు అనుభవించి మరణిస్తాడు.

అలాగే రామరాజు సమాచారాన్ని అందించిన వారికి బహుమతిని తెలియజేస్తూ...

"రూథర్‌పర్డ్
భయాంకరాతి భయంకర భయంకరుడు
రామరాజు ఆచూకీ చెప్తే వదిలేస్తాడు
చెప్పకపోతే
అధికారుల ప్రాణాలు తీస్తాడు
రామరాజు మంప మునసబుగారింటికి
వెళ్ళాడు. తన ఆచూకీ చెప్పి
పదివేలు తీసుకున్నాడు
మంప మునసబు
తననొక ద్రోహిగా చెయ్యవద్దన్నాడు"[321] అని అంటూ

రామరాజు సమాచారం చెబితే 10,000/- రూపాయలు బహుమానం ప్రకటించింది. అతని అచూకీ చెప్తే బందీవైన వారిని వదిలేస్తామని, లేకపోతే చిత్రహింసలు పెట్టి ప్రాణాలన్ని తీస్తామని రూథర్‌ఫర్డ్ బెదిరిస్తాడు. ఏ ఒక్కరు ఆయన ఆచూకీ చెప్పరు. అంగేకాకుండా అడవిలో గాలిగాని, గాలికి ఊగే ఆకుగాని ఎక్కడ సవ్వడి చెయ్యలేదు. అంతే ప్రజల్ని తీవ్ర చిత్రహింసలకు గురిచేస్తాడు.

ఈ సాయంకాలం శీర్షికలో సూర్యడు పశ్చిమ దిశలోకి తల్లి గర్భంలోకి వెళ్ళి పోయినట్టు ఉద్యమాన్ని పశ్చిమ దిశలో ముగించి భారతమాత ఒడిలోకి వెళ్ళిపోయే వరకు సాగుతుంది.

రామరాజు ఒక బాలుడుతో తన ఆచూకీ చెప్పమని చెప్పిన సందర్భంలో...

"మంప మునుసబు పంపిన పాలతో
పశువుల కాపరి బాలుడు

రాజును పాలు తీసుకొమ్మన్నాడు
రాజు కొయ్యూరు సైనిక శిభిరంలో
తానిక్కడున్న వార్త తెలియజేయమన్నాడు
బాలుడుకది పరవశం కలిగించే ఆట
ఉరుకుల మీద ఉరకులు
పరుగుల మీద పరుగు"**322** అంటూ ఆనంద పరవశుడైన ఆ బాలుడు తెలియపరచడం ఆశ్చర్యం. కవి తీదీలతో సహా 7-5-1924 అత్యంత హృదయ కరమైన సంఘటనలగా తీర్చిదిద్దాడు.

ఏమీ తెలియని పసివాడు చేత రామరాజు సమాచారం చెప్పించడం, మరణం ఆసన్నమైనది అని తెలిసికూడా ఆచారవ్యవహారాన్ని, సంప్రదాయాల్ని, ఆరోగ్యపరమైన సూత్రాల్ని విడిచిపెట్టకుండా నదిలో స్నానం చేసి, జపంతోపాటు ఆత్మజ్ఞానాన్ని అలవరుచుకోవడం, యోగా పక్రియలను ముగించుకోడం లాంటి విషయాల్ని చర్చించారు. చివరిక్షణంలో కూడా ఆత్మ బలిదానానికి కంకణం కట్టుకున్న యుద్ధవీరుడుగా అల్లూరిని కవి చిత్రీకరించాడు.

ఈ గ్రంథంలో ఎక్కువభాగం అడవి నేపథ్యంలోనే సాగుతుంది. కనుక అద్దేపల్లి అతి సుందరమైన ప్రకృతి వర్ణనలు చేస్తూ ప్రకృతిలో లీనమైపోయాడు. మరియు కరుణ రసభరితమైన సన్నివేశాలతో పాఠకులకు ముగ్ధుల్ని చేశారు. యుద్ధ వాతావరణంలో వీరరసాన్ని, సీత-రామరాజు ప్రేమ వ్యవహారంలో ప్రణయ వర్ణన కనిపిస్తుంది.

"అస్తమయం" ఖండికలో అడుగడుగునా దేశభక్తి నేపధ్యంగా వీరరసం, రౌద్రరసం, భయం, భీభత్స వాతావరణాలు ప్రధానంగా సాగుతుంది. దాన్ని 14వ పుటలలో పాఠక హృదయాన్ని దేవభక్తి, త్యాగ నిరతివైపు తీసుకుపోతాయి. ఈ వీర మహాకావ్యానికి పరాకాష్ఠ శ్రీరామరాజు ఆత్మబలిదానం.

శత్రువులు కూడా రామరాజు ని చూడగానే ప్రేమ, శాంతి, దయ గుణాలు కలిగే విధంగా ప్రవర్తించేవారని కవి వర్ణన చేస్తూ...

"సీతారామరాజుని

సంకెళ్ళతో చూడగానే
సైన్యాధిపతుల మీద
ఆగ్రహతుపాకి గుండు పేల్చాడు
తల నాండా మట్టి కూరుకున్న
పరమ మూర్ఖులారా!
సీతారామరాజు మహాయోగి
వీరాధివీరుడు
పరమ దేశభక్తుడు
ఆయనకు సంకెళ్ళు వేస్త్రారా?
వెంటనే విప్పెయ్యండి!"[323] అని అంటూ

ప్రపంచ ప్రఖ్యాతి యుద్ధోన్మాది అయిన గుడాల్ చేత చెప్పించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. క్రూరత్వానికి మరోపేరయిన గుడాల్ లాంటి వ్యక్తి రామరాజుపై గల అభిమానంతో తన మనస్సులోని అభిప్రాయాన్ని వెలిబుచ్చిన తీరుని కవి చాలా చక్కగా వివరించారు.

రామరాజును ఏదో విధంగా బ్రిటిష్ వారి వైపు తిప్పుకోవడం కోసం గుడాల్ ప్రయత్నించడంలో వారిద్దరి మధ్య జపరిగిన సంభాషణల్ని గూర్చి వివరిస్తూ...

"నీశక్తి అపారం, నీ సామర్థ్య అమేయం
నీవేగం అసమానం, నీవ్యూహం అవిచ్ఛేదం
నువ్వు నడిచిన బాటలో మరొకరు నడవడం అనూహ్యం
నువ్వు వేసిన బాటమీద ఎవరైన నడిచిపోవడం అతిసులభం
ఈ మన్యం నీకొక ఇరుకుసందు
నీకు స్వేచ్ఛ నిస్తాను రా!
నీకు బంగారు మేడలిస్తాను
నువ్వు అడవిలాంటి వాడివి
నిన్ను రంగు రంగుల పూలతోట చేస్తాను

నాతో చెయ్యి కలుపు, తిరుగు లేని స్నేహం చేద్దాం
నాతో కత్తి కలుపు, ఓటమి లేని యుద్ధం చేద్దాం!"[324] అని అంటూ

రామరాజును పొగడ్తతో ఆశచూపి లొంగదీసుకోవడానికి ప్రయత్నం చేస్తాడు. శత్రువును శత్రువుగా కంటే మిత్రుడని చేసుకోవడం మంచిదని నీవు మాతో కలిస్తే ఈ అటవీ సామ్రాజ్యానికి రాజును చేస్తామంటాడు. విభజించి, పాలించు సూక్తిని అనుసరిస్తూ రామరాజును తమలో కలుపుకోవడం, ఎత్తుగడల్ని కవి గుడాల్ పన్నిన పన్నాగాన్ని వెల్లడించారు.

దానికి సమాధానంగా రామరాజు ఇలా పలుకుతూ...

"మాదేశ శ్రామికశక్తిని
పెట్టబడిగా పెట్టి
నీదేశ యాంత్రి శక్తితో
రాబడిగా మార్చుకున్నారు"[325] అని పలుకుతూ

భారతదేశంలో ఉన్న సహజ సంపదల్ని, అపారమైన నిధుల్ని, శాస్త్రాల్ని దోచుకుపోయి బానిసల్ని చేశారంటాడు. చివరికి శ్రామికుల శక్తిని, కర్షకుల శ్రమను పెట్టబడిగా చేసుకొని వారి సంపదను తీసుకోవడానికి ప్రతిఘటించిన తీరుని వ్యక్తం చేశారు.

భాష గూర్చి రామరాజు పలికిన సంభాషణలు చెబుతూ...

"నువ్వు ఆదేశ భాషని
మాదేవ భాషలకి
ఆదేశం చెయ్యాలని పట్టు పట్టావు
నీ అక్షరాలు ఎప్పటికైనా
ఈ మట్టిలో చెరిగిపోక తప్పదు
గుర్తుంచుకో గుడాల్"[326] అంటూ

గుడాల్‌కి సవాల్ విసిరిన విధానాన్ని తెలియజేవారు. కవి కల్పన చాతుర్యం కనిపిస్తుంది. గుడాల్‌తో రామరాజు సంభాషణలో అనేక విషయాల్ని చిత్రీకరించారు.

బ్రిటిష్‌వారి దోపిడి విధానాన్ని, భాష విధానాన్ని రామరాజు ఖండించడాన్ని కనులకు కట్టినట్లు చూపించారు కవి.

వీరిద్దరి మధ్య సంభాషనలతో మైత్రీ ఫలించక పోవడంతో శ్రీరామరాజును బంధిస్తారు. దానితో రామరాజు వారిపై విరుచుకుపడుతూ..

"నన్ను కట్టెయ్యక పోతే
ఈపాటికి కట్టివైపోయే వాడివిరా!"[327] అని అంటూ

గుడాల్‌ని భయాందోళనకు గురిచేశాడు. కానీ ఆ మాటలకు గుడాల్ వినపడని వినపడినట్టు "ఊ కాల్చెయ్" అని ఆర్డరు వేస్తాడు. కానీ జమీదారునికి రామరాజుపై ఉన్న ప్రేమ, భక్తి, భయం కలిపిన ఒక దైవంగా అనిపించడంతో ఆ జమీదారు తుపాకీ గుండుతో రామరాజును కాల్చలేక గురి తప్పిస్తాడు. అప్పుడు గుడాల్ పిస్తోల్ తీసుకొని....

"సీతారామరాజు ముఖం వంక చూశాడు
కొండలా నిలబడ్డ
రామరాజు ముఖం
మానస సరోవరంలా ఉంది
హంసలు పరమనిర్మలంగా ఈదుతూ ఉన్నాయి
నీయిష్ట దైవాన్ని తలుచుకో
రామరాజు కళ్ళు మూసుకున్నాడు
అతని ధ్యానం మనో రథ చక్రాలమీద
శిరస్సు నుండి పోయింది
రామరాజుకు కళ్ళు తెరిచాడు
గుడాల్ క్రూరత్వం
పిస్తోలు గొట్టంలోకి కోరలు దించింది"[328] అని అంటూ

పై వర్ణనలో రామరాజుకి మరణం తనకళ్ళముందు కనిపిస్తున్నా చలించకుండా మనోనిబ్బరంతో నిలబడతాడు. ఇక్కడ మరనానికి కూడా లెక్కచేయని రామరాజు

మన్యంలోని ధైర్య సాహసాల్ని ప్రదర్శించడాన్ని కవి చక్కగా వర్ణించాడు. రామరాజు ముఖాన్ని సరస్సుతో పోల్చడంతో ఆయన తేజోమయన విశాల హృదయాన్ని ఆవిష్కరించారు.

అలాగే రామరాజుని గుడాల్ కోర్టులో హాజరు పెట్టకుండా ఒక చెట్టుకు కట్టేసి తన తుపాకీ గుళ్ళతో కాల్చుతున్న సమయంలో మౌనధ్యానంలో ఉన్న రామరాజు కళ్ళు తెరచి...

"మా పోరాటం ఫలిస్తుంది
స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది"[329]

అని రెండు సార్లు కళ్ళు తెరచి పలుకుతాడు. చివరిక్షణంలో కూడా స్వాతంత్ర్య కాంక్షతో కళ్ళు మూస్తాడు. ఆ సందర్భంలో ఆ మన్యం విప్లవ మహావీరుని మరణానికి అడవితల్లి ఎలా కృషించిపోయి, శోకించిందో తెలుపుతూ...

"ఒక్కసారిగా వీచె గాలి స్తంభించింది
పారే నీరు గడ్డ కట్టింది
ఆకాశంలో ఎగిరే పక్షులు అలాగే ఆగిపోయాయి
నింగిలో నడిచే మబ్బులు
రక్త సంధ్యను పులుముకుని
అలాగే ఉండిపోయాయి
దిక్కులన్నీ దిక్కులేని అడవి దోవల్లో
స్పృహ తప్పి వాలిపోయాయి
మట్టి అదేపనిగా ధ్వనించింది
మాపోరాటం ఫలిస్తుంది
స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది
సీతారామరాజుకీ జై
భారతమాతాకీ జై
వందేమాతరం! వందేమాతరం!
సెలయేటి పాట అరుణ సంధ్యలో కరిగిపోయింది
పూలతోట వేడిగాలి కన్నీటిలో వాడిపోయింది

చెట్లన్నీ మౌణ సమాధిలో నిలబడి పోయాయి
చెట్టమీద పిట్టలు
రెక్కల్లోకి నిశ్శబ్ధంగా ముడుచుకుపోయాయి
ఆకాశం అదే పనిగా మోగుతోంది"[330] అని అంటూ

అమరవీరుని మృతిని ప్రకృతిలో ప్రతీజీవి కూడా తీవ్ర ఆందోళనకి గురి కావడాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించారు. ఆ మహావీరుని మరణం, భారతదేశమే కాకుండా, ఆంధ్రప్రదేశ్ మన్యం ప్రజలే కాకుండా, ప్రకృతితో ఆయనకున్న అనుబంధాన్ని, అడవితల్లి అనురాగాన్ని గుర్తు చేసారు. ఒక్కొక్క వాక్యం ఒక్కొక్క స్ఫురణ చేస్తుంది. గాలి ఆగిపోతే ప్రపంచం లేదు. నీరు లేకపోతే జీవనాధారం లేద. పక్షులు తిరగకపోతే స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు లేవు. ఈ ఉద్యమం స్వాతంత్ర్యమనే దిక్కుని చూపిస్తుండేది. ఇలా ఎప్పుడైయితే జరిగిందో దిక్కులన్నీ స్పృహ కోల్పోయాయని చెప్పడం కవికి మాత్రమే సాధ్యం. అప్పటి వరకు ఉన్న ఆశలు, ఆశయాలు అన్నీ కన్నీటిలో కరిగిపోయాయని నింగి, నేల, నీరు కూడా ప్రకృతికి సహకిరించకుండా పోయాయని కవి విస్తుపోయారు.

ఆ విప్లవ వీరుని త్యాగాన్ని స్మరిస్తూ...

"ఓడిపోతానని తెలిసికూడా
కడదాకా పోరి
నెత్తురోడి పడిపోవడం
సాధారణ యోధ కథ
ప్రజల మీది ప్రేమతో
ప్రజల్ని గట్టెక్కించాలని
ఆత్మార్పణ చెయ్యడం
అసాధారణ వీరగాధ"[331] అని అంటూ

సీతారామరాజుని అమరవీరునిగా కీర్తించారు కవి.

ప్రజల్ని మమకారంతో, దేశానికి స్వాతంత్ర్య సిద్ధికోసం ఒక యువకుడు తన జీవితాన్ని, త్యాగం చేయడం గొప్ప విషయం. అలా దేశం కోసం, ప్రజల కోసం, తన

ప్రాణాన్ని సైనం అడ్డుపెట్టిన అల్లూరి ప్రపంచ చరిత్రలో చిరస్మరణీయుడే అలాగే దేశసేవలో త్యాగం, పోరాట పటిమలో, ధైర్య సాహసాల్లో రామరాజుని ఆదర్శంగా తీసుకొని దేశ ప్రజలు సాగిపోవాలని కవి భావన.

ఈ విధంగా ఈ కావ్యంలో అల్లూరి సీతారామరాజు జననం నుండి ఆయన వీరమరణం వరకు ఆంగ్లేయులపై ఆయన సల్పిన ఉద్యమభరిత పోరాటాన్ని త్యాగ నిరతిని, దేశభక్తిని ఈ వచన కావ్యం ద్వారా చక్కగా ఆవిష్కరించారు.

**ముగింపు:**

ఈ విధంగా అల్లూరి విశ్వరూపాన్ని ఆయా కవులు కవిత్వంలో మిక్కిలి మనోహరంగా, ఉత్తేజభరితంగా చిత్రీకరించారు.

# పాదసూచికలు

| | | | |
|---|---|---|---|
| 1. | ఆంధ్రమహాభ్యుదయం | – బండ్ల సుబ్రహ్మణ్యం | పుట 324 |
| 2. | " | " | పుట 324 |
| 3. | " | " | పుట 325 |
| 4. | " | " | పుట 326 |
| 5. | " | " | పుట 327 |
| 6. | " | " | పుట 327 |
| 7. | " | " | పుట 328 |
| 8. | " | " | పుట 329 |
| 9. | " | " | పుట 331 |
| 10. | " | " | పుట 331 |
| 11. | " | " | పుట 332 |
| 12. | " | " | పుట 333 |
| 13. | " | " | పుట 333 |
| 14. | " | " | పుట 335 |
| 15. | " | " | పుట 336 |
| 16. | " | " | పుట 337 |
| 17. | " | " | పుట 338 |
| 18. | " | " | పుట 341 |
| 19. | " | " | పుట 342 |
| 20. | " | " | పుట 345 |
| 21. | " | " | పుట 347 |
| 22. | " | " | పుట 347 |
| 23. | " | " | పుట 353 |
| 24. | " | " | పుట 354 |
| 25. | " | " | పుట 354 |
| 26. | " | " | పుట 356 |
| 27. | " | " | పుట 358 |

| | | | |
|---|---|---|---|
| 28. | " | " | పుట 365 |
| 29. | " | " | పుట 368 |
| 30. | " | " | పుట 370 |
| 31. | " | " | పుట 370 |
| 32. | " | " | పుట 372 |
| 33. | " | " | పుట 377 |
| 34. | " | " | పుట 378 |
| 35. | " | " | పుట 380 |
| 36. | " | " | పుట 383 |
| 37. | " | " | పుట 379 |
| 38. | " | " | పుట బొమ్మ 389 |
| 39. | " | " | పుట 385 |
| 40. | " | " | పుట 387 |
| 41. | " | " | పుట 399 |
| 42. | " | " | పుట 400 |
| 43. | " | " | పుట 404 |
| 44. | " | " | పుట 404 |
| 45. | " | " | పుట 407 |
| 46. | " | " | పుట 409 |
| 47. | " | " | పుట 411 |
| 48. | " | " | పుట 129 |
| 49. | " | " | పుట 419 |
| 50. | " | " | పుట 427 |
| 51. | " | " | పుట 432 |
| 52. | " | " | పుట 434 |
| 53. | " | " | పుట 435 |
| 54. శ్రీ సీతారామరాజీయం | | – మల్లెల గురవయ్య | పుట 13 |
| 55. | " | " | పుట 14 |
| 56. | " | " | పుట 16 |

| | | | |
|---|---|---|---|
| 57. | 〃 | 〃 | పుట 17 |
| 58. | 〃 | 〃 | పుట 20 |
| 59. | 〃 | 〃 | పుట 22 |
| 60. | 〃 | 〃 | పుట 23 |
| 61. | 〃 | 〃 | పుట 23 |
| 62. | 〃 | 〃 | పుట 25 |
| 63. | 〃 | 〃 | పుట 26 |
| 64. | 〃 | 〃 | పుట 27 |
| 65. | 〃 | 〃 | పుట 32 |
| 66. | 〃 | 〃 | పుట 33 |
| 67. | 〃 | 〃 | పుట 34 |
| 68. | 〃 | 〃 | పుట 36 |
| 69. | 〃 | 〃 | పుట 37 |
| 70. | 〃 | 〃 | పుట 36 |
| 71. | 〃 | 〃 | పుట 37 |
| 72. | 〃 | 〃 | పుట 37 |
| 73. | 〃 | 〃 | పుట 38 |
| 74. | 〃 | 〃 | పుట 39 |
| 75. | 〃 | 〃 | పుట 40 |
| 76. | 〃 | 〃 | పుట 41 |
| 77. | 〃 | 〃 | పుట 42 |
| 78. | 〃 | 〃 | పుట 43 |
| 79. | 〃 | 〃 | పుట 44 |
| 80. | 〃 | 〃 | పుట 45 |
| 81. | 〃 | 〃 | పుట 46 |
| 82. | 〃 | 〃 | పుట 48 |
| 83. | 〃 | 〃 | పుట 48 |
| 84. | 〃 | 〃 | పుట 49 |
| 85. | 〃 | 〃 | పుట 50 |

| | | | |
|---|---|---|---|
| 86. | " | " | పుట 51 |
| 87. | " | " | పుట 51 |
| 88. | " | " | పుట 52 |
| 89. | " | " | పుట 58 |
| 90. | " | " | పుట 59 |
| 91. | " | " | పుట 60 |
| 92. | " | " | పుట 61 |
| 93. | " | " | పుట 62 |
| 94. | " | " | పుట 64 |
| 95. | " | " | పుట 64 |
| 96. | " | " | పుట 66 |
| 97. | " | " | పుట 71 |
| 98. | " | " | పుట 73 |
| 99. | " | " | పుట 75 |
| 100. | " | " | పుట 76 |
| 101. | " | " | పుట 77 |
| 102. | " | " | పుట 77 |
| 103. | " | " | పుట 80 |
| 104. | " | " | పుట 84 |
| 105. | " | " | పుట 88 |
| 106. | " | " | పుట 90 |
| 107. | " | " | పుట 91 |
| 108. | " | " | పుట 94 |
| 109. | " | " | పుట 97 |
| 110. | " | " | పుట 98 |
| 111. | " | " | పుట 99 |
| 112. | " | " | పుట 100 |
| 113. | " | " | పుట 101 |
| 114. | " | " | పుట 101 |

| | | | |
|---|---|---|---|
| 115. | ,, | ,, | పుట 105 |
| 116. | ,, | ,, | పుట 106 |
| 117. | ,, | ,, | పుట 107 |
| 118. | ,, | ,, | పుట 108 |
| 119. | ,, | ,, | పుట 113 |
| 120. | ,, | ,, | పుట 114 |
| 121. | ,, | ,, | పుట 121 |
| 122. | ,, | ,, | పుట 130 |
| 123. | ,, | ,, | పుట 146 |
| 124. | ,, | ,, | పుట 148 |
| 125. | ,, | ,, | పుట 149 |
| 126. | ,, | ,, | పుట 150 |
| 127. | ,, | ,, | పుట 152 |
| 128. | ,, | ,, | పుట 154 |
| 129. | ,, | ,, | పుట 157 |
| 130. | ,, | ,, | పుట 159 |
| 131. | ,, | ,, | పుట 161 |
| 132. | ,, | ,, | పుట 163 |
| 133. | ,, | ,, | పుట 163 |
| 134. | ,, | ,, | పుట 164 |
| 135. | ,, | ,, | పుట 165 |
| 136. | ,, | ,, | పుట 165 |
| 137. | ,, | ,, | పుట 166 |
| 138. | ,, | ,, | పుట 167 |
| 139. | ,, | ,, | పుట 167 |
| 140. | అశ్రుధారలు | – బూదరాజు రాధాకృష్ణ | పుట 1 |
| 141. | ,, | ,, | పుట 2 |
| 142. | ,, | ,, | పుట 4 |
| 143. | ,, | ,, | పుట 5 |

| | | | |
|---|---|---|---|
| 144. | " | " | పుట 6 |
| 145. | " | " | పుట 7 |
| 146. | " | " | పుట 7 |
| 147. | " | " | పుట 7 |
| 148. | " | " | పుట 7 |
| 149. | " | " | పుట 8 |
| 150. | " | " | పుట 9 |
| 151. | " | " | పుట 10 |
| 152. | " | " | పుట 11 |
| 153. | " | " | పుట 13 |
| 154. | " | " | పుట 15 |
| 155. | " | " | పుట 16 |
| 156. | " | " | పుట 18 |
| 157. | " | " | పుట 18 |
| 158. | " | " | పుట 19 |
| 159. | " | " | పుట 20 |
| 160. | " | " | పుట 23 |
| 161. | " | " | పుట 24 |
| 162. | " | " | పుట 25 |
| 163. | " | " | పుట 25 |
| 164. | " | " | పుట 26 |
| 165. | " | " | పుట 27 |
| 166. | " | " | పుట 30 |
| 167. | " | " | పుట 31 |
| 168. | " | " | పుట 31 |
| 169. | " | " | పుట 36 |
| 170. | " | " | పుట 38 |
| 171. | " | " | పుట 39 |
| 172. | " | " | పుట 43 |

| | | | |
|---|---|---|---|
| 173. | ıı | ıı | పుట 45 |
| 174. | ıı | ıı | పుట 47 |
| 175. | ıı | ıı | పుట 47 |
| 176. | ıı | ıı | పుట 49 |
| 177. | ıı | ıı | పుట 53 |
| 178. | ıı | ıı | పుట 55 |
| 179. | ıı | ıı | పుట 56 |
| 180. | ıı | ıı | పుట 57 |
| 181. | ıı | ıı | పుట 57 |
| 182. | ıı | ıı | పుట 57 |
| 183. | ıı | ıı | పుట 58 |
| 184. | ıı | ıı | పుట 58 |
| 185. | ıı | ıı | పుట 59 |
| 186. | ıı | ıı | పుట 60 |
| 187. | ıı | ıı | పుట 60 |
| 188. | ఉదయశ్రీ | – పాపయ్య శాస్త్రి | పుట 15 |
| 189. | ıı | ıı | పుట 15 |
| 190. | ıı | ıı | పుట 15 |
| 191. | ıı | ıı | పుట 16 |
| 192. | ıı | ıı | పుట 16 |
| 193. | ıı | ıı | పుట 16 |
| 194. | ıı | ıı | పుట 16 |
| 195. | ıı | ıı | పుట 17 |
| 196. | ıı | ıı | పుట 17 |
| 197. | గుఱ్ఱం ధర్మోజీ | – అ.సీ.రా.ఉదాహరణ కావ్యం | పుట 17 |
| 198. | ıı | ıı | పుట 18 |
| 199. | ıı | ıı | పుట 18 |
| 200. | ıı | ıı | పుట 19 |

| | | | |
|---|---|---|---|
| 201. | ॥ | ॥ | పుట 20 |
| 202. | ॥ | ॥ | పుట 21 |
| 203. | ॥ | ॥ | పుట 21 |
| 204. | ॥ | ॥ | పుట 22 |
| 205. | ॥ | ॥ | పుట 23 |
| 206. | ॥ | ॥ | పుట 23 |
| 207. | ॥ | ॥ | పుట 24 |
| 208. | ॥ | ॥ | పుట 25 |
| 209. | ॥ | ॥ | పుట 25 |
| 210. | ॥ | ॥ | పుట 26 |
| 211. | ॥ | ॥ | పుట 27 |
| 212. | ॥ | ॥ | పుట 28 |
| 213. | ॥ | ॥ | పుట 29 |
| 214. | ॥ | ॥ | పుట 29 |
| 215. | ॥ | ॥ | పుట 30 |
| 216. | ॥ | ॥ | పుట 31 |
| 217. | ॥ | ॥ | పుట 31 |
| 218. | ॥ | ॥ | పుట 32 |
| 219. | ॥ | ॥ | పుట 33 |
| 220. | ఆంధ్రవీర పద్యకావ్యం | – డా॥ కాకర్లపూడి వేంకటరాజు | పుట 17 |
| 221. | ॥ | ॥ | పుట 18,19 |
| 222. | ॥ | ॥ | పుట 20 |
| 223. | ॥ | ॥ | పుట 21 |
| 224. | ॥ | ॥ | పుట 22 |
| 225. | ॥ | ॥ | పుట 22 |
| 226. | ॥ | ॥ | పుట 23 |
| 227. | ॥ | ॥ | పుట 24 |
| 228. | ॥ | ॥ | పుట 24 |
| 229. | ॥ | ॥ | పుట 25 |

| | | | |
|---|---|---|---|
| 230. | " | " | పుట 25 |
| 231. | " | " | పుట 26 |
| 232. | " | " | పుట 27 |
| 233. | " | " | పుట 28 |
| 234. | " | " | పుట 29 |
| 235. | " | " | పుట 31 |
| 236. | " | " | పుట 32 |
| 237. | " | " | పుట 35 |
| 238. | " | " | పుట 36 |
| 239. | " | " | పుట 37 |
| 240. | " | " | పుట 38,39 |
| 241. | " | " | పుట 40 |
| 242. | " | " | పుట 42 |
| 243. | " | " | పుట 43 |
| 244. | " | " | పుట 45 |
| 245. | " | " | పుట 47 |
| 246. | " | " | పుట 48 |
| 247. | " | " | పుట 50 |
| 248. | " | " | పుట 52 |
| 249. | " | " | పుట 54 |
| 250. | " | " | పుట 64 |
| 251. | " | " | పుట 66 |
| 252. | " | " | పుట 68 |
| 253. | " | " | పుట 71 |
| 254. | " | " | పుట 72 |
| 255. | " | " | పుట 73 |
| 256. | " | " | పుట 79 |
| 257. | " | " | పుట 80 |
| 258. | " | " | పుట 81 |

| | | | |
|---|---|---|---|
| 259. | " | " | పుట 82 |
| 260. | " | " | పుట 82 |
| 261. | " | " | పుట 84 |
| 262. | " | " | పుట 85 |
| 263. | " | " | పుట |
| 264. | ముదివేడు ప్రభాకర్ | – రక్తాక్షి రారాజు | పుట 8 |
| 265. | " | " | పుట 8 |
| 266. | " | " | పుట 8 |
| 267. | " | " | పుట 8 |
| 268. | " | " | పుట 9 |
| 269. | " | " | పుట 9 |
| 270. | " | " | పుట 9 |
| 271. | " | " | పుట 9 |
| 272. | " | " | పుట 9 |
| 273. | " | " | పుట 10 |
| 274. | కుందుర్తి ఆంజనేయులు | – నయగార | పుట 24 |
| 275. | " | " | పుట 24 |
| 276. | " | " | పుట 25 |
| 277. | " | " | పుట 25 |
| 278. | " | " | పుట 26 |
| 279. | " | " | పుట 27 |
| 280. | " | " | పుట 27 |
| 281. | " | " | పుట 28 |
| 282. | అ.సీ. వచన కవిత | – అద్దేపల్లి రామ్మోహన్‌రావు | పుట 35 |
| 283. | " | " | పుట 36 |
| 284. | " | " | పుట 37 |
| 285. | " | " | పుట 37 |
| 286. | " | " | పుట 42 |
| 287. | " | " | పుట 43 |

| | | | |
|---|---|---|---|
| 288. | 〃 | 〃 | పుట 45 |
| 289. | 〃 | 〃 | పుట 48 |
| 290. | 〃 | 〃 | పుట 52 |
| 291. | 〃 | 〃 | పుట 55 |
| 292. | 〃 | 〃 | పుట 55 |
| 293. | 〃 | 〃 | పుట 57 |
| 294. | 〃 | 〃 | పుట 59 |
| 295. | 〃 | 〃 | పుట 61 |
| 296. | 〃 | 〃 | పుట 86 |
| 297. | 〃 | 〃 | పుట 89 |
| 298. | 〃 | 〃 | పుట 91 |
| 299. | 〃 | 〃 | పుట 97 |
| 300. | 〃 | 〃 | పుట 100 |
| 301. | 〃 | 〃 | పుట 101 |
| 302. | 〃 | 〃 | పుట 102 |
| 303. | 〃 | 〃 | పుట 104 |
| 304. | 〃 | 〃 | పుట 106 |
| 305. | 〃 | 〃 | పుట 108 |
| 306. | 〃 | 〃 | పుట 114 |
| 307. | 〃 | 〃 | పుట 119 |
| 308. | 〃 | 〃 | పుట 124 |
| 309. | 〃 | 〃 | పుట 131 |
| 310. | 〃 | 〃 | పుట 144 |
| 311. | 〃 | 〃 | పుట 149 |
| 312. | 〃 | 〃 | పుట 147 |
| 313. | 〃 | 〃 | పుట 154 |
| 314. | 〃 | 〃 | పుట 155 |
| 315. | 〃 | 〃 | పుట 159 |
| 316. | 〃 | 〃 | పుట 166 |

| | | | |
|---|---|---|---|
| 317. | 〃 | 〃 | పుట 167 |
| 318. | 〃 | 〃 | పుట 192 |
| 319. | 〃 | 〃 | పుట 198 |
| 320. | 〃 | 〃 | పుట 218 |
| 321. | 〃 | 〃 | పుట 237 |
| 322. | 〃 | 〃 | పుట 238 |
| 323. | 〃 | 〃 | పుట 242 |
| 324. | 〃 | 〃 | పుట 244 |
| 325. | 〃 | 〃 | పుట 246 |
| 326. | 〃 | 〃 | పుట 247 |
| 327. | 〃 | 〃 | పుట 248 |
| 328. | 〃 | 〃 | పుట 251 |
| 329. | 〃 | 〃 | పుట 253 |
| 330. | 〃 | 〃 | పుట 253 |
| 331. | 〃 | 〃 | పుట 255 |

# 3) నాటకాలు - విశ్లేషణ

**3.0:**

సాహిత్యంలో నాటక ప్రక్రియకు అత్యంత ప్రాధాన్యం ఉంది. కారణం ఇది సమాహారకళ కావడం, పండిత పామరులకు సైతం సులభంగా అర్థమయ్యే రీతిలో ఉండటమే. సమాజానికి ఉపకరించే భావజాలాన్ని సామాన్యులకు అందిస్తుంది. కాబట్టి అల్లూరి జీవిత నేపథ్యంగా రూపక రచన విస్తారంగా జరిగింది నాటిక ఏకాంకికలు ఎక్కువ భాగం అముద్రితంగా ఉండిపోయాయి. ప్రాచుర్యం పొందిన నాటకాల్లో ఖండవల్లి రాజారావు, పడాల రామారావుల నాటకాల్ని గూర్చి ఈ అధ్యాయంలో పేర్కొన్నాను.

**3.1 ఖండవల్లి రాజారావు:**

ఖండవల్లి రాజారావు రాసిన "సీతారామరాజు మరణకారణము"నే ఈ నాటకం 5 రంగాలు గల విమర్శనాత్మకమైన నాటకం. దీని మొదట ముద్రణ 1935 సంవత్సరంలో ముద్రించబడినది. రామరాజు పై వచ్చిన పుస్తకాల్లో ప్రాచీనమైందిగా దీన్ని చెప్పవచ్చును.

స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో బ్రిటిష్‌వారు చేసిన మొట్టమొదటి "ఎన్‌కౌంటర్"గా పేర్కొన్నారు. రామరాజు మరణం ఏ విధంగా జరిగింది. న్యాయమా! అన్యాయమా అన్న విషయాన్ని నాటక రూపంలో కవి వివరించారు.

రచయిత "దండోరా"లో ముందుమాటలు పలుకుతూ..........

"శ్రీరామరాజు పట్టుబడినాడు. పారిపో ప్రయత్నింపగా అతనిని చంపివైసితిమి"[4]

అని ప్రభుత్వము ప్రకటించింది. పై రెండు వాక్యములు నిజమైనవే. ఈ రెండు వాక్యములను మొత్తముగా అర్థమగుట లేదు. ఆబోతును కట్టివైసితిమి. దూడ పుట్టినది అను వాక్యము మొత్తముగా అర్థము కాగలవా? మధ్యనే ఎదో సంగతి లోపించినది. శ్రీరామరాజు పట్టుబడి మిలిటరీ పోలీసు సైన్యము మధ్య కట్టబడిన ఖైదీగా ఉండగా పారిపో ప్రయత్నించుటకు అవకాశమెట్లు కలుగుతుంది? బరువెక్కిన చేతి సంకెళ్ళు విదల్చుకొనలేడు! అతని పేల్చివేసిరో! మరేమో! ఆ సంగతి కూడా తెలియక పోయినచో ఏమి అర్థము కాదు అని

కవి మనసులో మటను అక్షర రూపంలో తెలియపరిచాడు.

అంతేకాక ఇట్లు మాకు మాత్రమే తట్టలేదు. గౌరవనీయులగు శాసన సభ్యులకు కూడా అట్లే అనిపించింది. వారిలో కొందరు రామలింగారెడ్డిగారు, సత్యమూర్తిగారు ఇద్దరు కలసి ప్రభుత్వమును ప్రశ్నించి ఈ వాక్యములు సరిగా అర్థమగుటలేదని దేని మధ్య లోపించినది అది చెప్పవలెను అని అడిగిరి. దానికి ప్రభుత్వం అర్థము కాకపోవుటే ముంది? ఆ వాక్యములు సరిగానే ఉన్నవి. ఏమీ లోపించలేదు. అని ప్రభుత్వ న్యాయ సభ్యుడు ప్రత్యుత్తరమిచ్చెను. అవును కాబోలు అనుకొని పాపం ఆ శాసన సభ్యులు కుర్చీలపై చదికిలపడ్డారు. మాకు (కవి) మాత్రం అలా అనిపించలేదు. ఇక ఎవ్వరికి కూడ అట్లా అనిపించలేదని మా(కవి) అభిప్రాయం. అంతట లోపించిన సంగతి ఏమి అని మేము ఊహించాము మాకు తట్టినది. అని రచయిత కుండబద్ధలు కొట్టినట్లు తన అభిప్రాయాన్ని "దండోరా"లో తెలియపరిచాడు.

ఈ విమర్శనాత్మక కావ్యం 27 పుటలలో ఉన్నది. అందు మొదట పుటలో ప్రస్తావనతో ప్రారంభమౌతుంది. నారద, తుంబురులు ఆకాశంలో విహరిస్తూ భూలోకంలో జరిగిన ఈ విషయాన్ని గూర్చి మాట్లాడు సందర్భంలో వారి సంభాషణ.........

"నారదుడు : శ్రీరామరాజును చంపివైసిరి సుమా! ఖైదీ అనియైన ఆలోచించలేదు.

తుంబురుడు : హర హర! స్వాతంత్ర్య పోరాట నాయకుడనియైన జూడలేదా! భే భే! పోనీ సామాన్య మనవుడని జూడలేదా! అంతర్జాతీయ న్యాయానుసారము పితూరీ దారుని చూడవలసినట్లేనా జూడలేదు?

నారదుడు : చూడకేమి సామాన్య మానవులు ప్రాణ శత్రువును చూచినట్లు చూచిరి.

తుంబురుడు : దొంగకంటెను హత్యకారును కంటెను నీచుడా రామరాజు

నారదుడు : నీవింకను దేవ లోకమును విడిచి రాలేనట్లున్నది. ఈ భూలోకమున మంచి గుణము ఎక్కడ కానరాలేదు. ప్రజల కేర్పరచిన న్యాయము ప్రభువులకెట్లు ఉపయోగపడును? సొరకాయ నిషేధము చెప్పిన

శాస్త్రులుగారికే వర్తించన యెడల అతడి నోట మట్టి గొట్టుకొని పోవలసినదే.

తుంబురుడు : అన్నిటికంటె ఈ ఆంధ్రులు శ్రీరామరాజు చనిపోలేదని మొండి వాదము చేయుచు గూర్చుడుట విచిత్రముగా నున్నదే. పోయెనని వారెరుగరందువా?

నారదుడు : ఎరుగకేమి? ఈ మరణము దారుణముగా నున్నదని ప్రభుత్వమును అడుగుటకు వారికి ధైర్యం చాలదు."[2] అందుకే శ్రీరామరాజు చనిపోలేదని ఒకరికి ఒకరు జోకొట్టుకొని నిద్రపోవుకంటే చేసేది ఏముంది? పదా పోదాము...... ఓయ్ సీతారాం అంటూ అక్కడ నుండి నిష్క్రమిస్తారు.

ఈ ప్రస్తావనలో రామరాజు మరణం గూర్చి ఆంధ్రులు గట్టిగా ప్రభుత్వాన్ని నిలదీసే ధైర్యం లేదని కవి బాధపడ్డాడు. ఇంతకి రామరాజు చనిపోయాడా! అన్న విషయాన్ని జీర్ణించుకోలేక ఆత్మ సంతృప్తి కొరకు ఇంక బ్రతికే ఉన్నాడనే ఊహతో ఉన్నారని ఆంధ్రులు రామరాజు మరణ విషయంలో ఎటు తేల్చుకోలేకపోయారని కలవి విచారించాడు.

రామరాజును మేజర్ గుడాల్ బంధించిన తర్వాత అతడు పారిపోతాడనే భయంతో ఒక మంచానికి కట్టి వేసి కాల్చి చంపేస్తాడు.... ఇక్కడ నుండి ఈ నాటకంలో మొదటి రంగం ప్రారంభమౌతుంది. అరణ్యపరిసరమున గుడారముల మధ్య అంతటి బ్రిటిష్ సైనికులు, అధికారులు, పోలీసులు కంగారుపడుతూ వారిలో వారి సంభాషించిన సందర్భంలో

"మొదటి సిపాయి : అక్కడ రక్తం కడిగెయ్యాలా?

రెండవ సిపాయి : మంచం తీసివేశారా లేదా?

ఏడిచినట్టే ఉంది. ఇంకా మంచము నుంచి విప్పలేదేమి?

| | | |
|---|---|---|
| మూడవ ఉద్యోగి | : | వాళ్ళ అవతలకి తోసి మంచం విప్పు |
| ఒక పోలీసు | : | కట్లు బిగువుగా కట్టేరండయ్యా! |
| మూడవ సిపాయి | : | కోసేయరా! అంత తెలివిలేదా? |
| మొదట ఉద్యోగి | : | ఇంతట్లోకే ఇంత కంగారెందుకయ్యా! మళ్ళ ఏమి దాపరించింది..."[3] అంటూ ఉండగా |

కలెక్టరుగారు వస్తున్నారని తెలిసింది. గట్టి బందోబస్తు ఏర్పాటు చేశారు. జరిగిన ఘనకార్యం చూసారు. అగ్గైపోయారు. నోరునెత్తి మొత్తుకున్నాడు. కలెక్టరు కూడా బ్రిటిష్‌వాడు కావడంతో విలేఖరులను ఎక్కడ ఈ విషయాన్ని బయట పడనివ్వకుండా చూడమని ఆర్డరు వేశాడు. అంతటితో ఆగక....... రామరాజు గుండెల్లో తుపాకి గుళ్ళు ఉన్నాయి. వాటి గూర్చి మాట్లాడుతూ.............

| | | |
|---|---|---|
| "రెండవ సిపాయి | : | గుండెల్లో నుండి గుళ్ళూడబీకెయ్యాలాండి? |
| మూడవ ఉద్యోగి | : | ఆ ! ఏమండి రామయ్యగారు! గుండెల్లో నుండి గుళ్ళు ఊడదీయాలా? |
| నాల్గవ ఉద్యోగి | : | ఏమండోయి పట్నాయక్‌గారు! గూళ్ళూడదీయాలా? |
| ఐదవ ఉద్యోగి | : | పరుగెత్తు, మేజరుగారిని కనుక్కోనిరావోయి. గుండెలలో నుండి గుళ్ళ తీసి వేయాలేమో? కనుక్కురా! జల్దీగా...[4] |

అంటూ ఈ సంభాషణలలో మొదటి రంగం పూర్తి అవుతుంది. రెండవ రంగంలో అత్యంత కీలకమైన నిజాన్ని దాచిపెట్టి సాక్ష్యం లేకుండా బ్రిటిష్ ప్రభుత్వం చేస్తున్న అరాచకాన్ని ఈ రంగంలో రచయిత విన్నవించారు.

దండోరా వేయుటకు డప్పులవాడు డప్పుతో ప్రవేశిస్తాడు. దండోరా వేస్తూ.....

"మొన్న ఏడవ తారీఖునాడు గవర్నమెంటోరి పటాలాలతో పోరాడినవాడు అగ్గిరాజుని, అతని యుద్ధములో గవర్నమెంటుకి ఓడిపోయి పట్టుబడినాడని ఇందు మూలముగా అందరు తెలిసుకోవలసిందో హోయ్"[5] అని చెబితే అప్పటి వరకు రామరాజు

మరణించిన విషయాన్ని దాచిపెట్టి అగ్గిరాజు మాత్రమే పట్టుబడ్డాడని తెలియపరిచాడు.

వెంటనే అక్కడ ఉన్న అధికారులు ఆ దండోరా వాడిని పిలిచి, అలాకాదు. ఇలా అని..... "గవర్నమెంటుతో పోరాడి ఓడిపోయి పట్టుబడినది శ్రీరామరాజుని అగ్గిరాజు కాదని మన్నెపు పితూరీ యీ విధముగా గవర్నమెంటు అణగద్రొక్కినారని ప్రజలందరు సంతోషించండో"[6] అని చెప్పబోతుండగా అక్కడ ఉన్న అధికారులు ఆగు, ఆగు... ఆపేయి... ఆపేయి ఇలా రా అని పిలిచి మరల దండోరా వాడికి చెబుతూ.... గవర్నమెంటురి పటాలాలకి పట్టుబడ్డ రామరాజు సమయము బిక్కించుకొని పారిపోయినాడో హోయి" అని ఉప్పు మ్రోగించాడు. ఆ డప్పులవాడిని మరల పిలిచి కలెక్టరు గారు ఈ విధంగా చెప్పమన్నారు అని చెప్పి..... "ఏడవతేదీ ఉదయం సోదన జట్టోరు సీతారామరాజు తానే అని సెప్పిన ఒక మనిషిని పట్టుకొని ఆసామునుంచోచ్చిన పోలీసు సేనాని గుడాలు దొర గారి దగ్గరకు తీసుకు రాగా ఆ మనిషి ఆ మధ్యాహ్నము నందు తప్పించుకొని పారిపోడానకి ప్రయత్నించగా అతనిని పోలీసోరు గుళ్ళుబారుపెట్టి కాల్చేశారని సీతారామరాజు సచ్చిపోయాడనీ, పారిపోతుంటే గుళ్ళు తగిలి సచ్చిపోయాడనీ అందరు జనం ఆబాల గోపాలం సందేహమే మాత్రము లేకుండా నమ్మవలసిందో హోయి! డప్పులు వాయిస్తూ మరల అందరు సందేహం ఏ మాత్రం లేకుండా నమ్మవలసిందోహోయి!"[7] అని దండోరా వేసినాడు. దీనితో రెండవ రంగం పూర్తి అయింది.

మూడవ రంగంలో గోదావరి ఒడ్డున మహాసభ. ఆ సభలో సభ్యులు రామరాజు మరణం గూర్చి స్పందిస్తూ......

అధ్యక్షుడు మాట్లాడుతూ "సీతారామరాజు చనిపోయెనని చెప్పుచున్న వార్త చాలా దారుణముగా ఉన్నది. అతని విషయమున స్వవచన వ్యాఘాతములతో ప్రభుత్వము బహు ఆలస్యముగా పలు వార్తలు ప్రకటించినది. ఏది ఏమైనా ఒక మహానుభావుడు హస్తంగతుడైనాడని చెప్పవలయును"[8] అని పలికి తర్వాత సభ్యుడైన వెంకట్రావు తన అభిప్రాయాన్ని వినిపిస్తాడని అధ్యక్షడు చెబుతాడు.

ఆ మహాసభలో వెంకట్రావు అనే సభ్యుడు మాట్లాడుతూ "అధ్యక్షా! సోదరులారా! ఏ మహామహుడు ముప్పది సంవత్సరాలు నిండని సుకుమారరాజు కుమారుడై ఉండి,

బాల సన్యాసియై జీవమును ప్రజలకై వినియోగింపడానికి నిశ్చయించాడో, ఏ మహానుభావుడు సన్యాసియై ఉండి కూడా స్వరాజ్య సంపాదన కొరకు ప్రయత్నింపగ దాస్యమున మునిగియున్న తోటి ప్రజలందరి స్వాతంత్ర్యము కొరకును తన తపమును వదలి యుద్ధ వీరుడయ్యెనో, సోదరులారా! అట్టి త్యాగము త్యాగములలోని కెల్ల మహాత్యాగము. రెండేండ్ల బ్రిటీషు సేనా సముద్రమునకు తెలియకట్టవలె అడ్డు నిలచెనో, ఏ మహా ప్రతాప శాలి చివరకు ప్రజలు బాధపడుట చూడలేక.... సోదరులారా మన మందరమును తాను కారణముగా బాధకు గురియగుచున్నామని ఓర్వలేక ప్రజా క్షేమము కొరకు సులభముగా ప్రభుత్వమునకు చిక్కెను. ఆ మహావీరుడు మరణించిన రోజు మన దేశమునకు మహదుర్దినము. రామరాజు ఆత్మకు శాంతియగుగాక!"[9] అని నిండు సభలో తన తీర్మానాల్ని చదివెను.

మరల రెండ సభ్యుడు జగ్గన్నశాస్త్రి మహా సభలో మాట్లాడుతూ "ఎవరో అడవిలో తిరుగుతుంటే, ఎవరో వారిని పట్టుకొంటే, ఎవరో వారిని తుపాకితో కాల్చితే, ఎవరో ఆ శవము సీతారామరాజని ప్రకటిస్తే, ఆ శవము ఫలానవారి శవమని చెపితే మనమందరము అవును పాపమని కన్నీరు పెట్టవలసినదేనా? ఆలోచింపనక్కరలేదా? రామరాజు కొరకు తన అనుచరుడు ప్రాణం వదిలేశాడు. అంతేగాని సీతారామరాజు ప్రాణం మాత్రం కాదు."[10] అని జగ్గన్నశాస్త్రి చేత ఒక రకమైన కారణం చెప్పించాడు రచయిత చెప్పించారు.

మూడవ సభ్యుడు సాంబమూర్తి అభిప్రాయాన్ని సభలో చెబుతూ

సీతారామరాజు జాతకం జ్యోతిష్యునికి చూపించారు. అది సిద్ధ జాతకము. మృత్యువునకు ఇప్పుడు అవకాశమేమాత్రము లేదని చెప్పాడు. "సీతారామరాజు చనిపోయెనని ప్రభుత్వము ప్రకటించినను మాకెవ్వరికిని నమ్మకము లేదు"[11] అని ఒక కారణం రచయిత తెలియజేశారు.

ఈ తృతీయ రంగంలో సీతారామరాజును యుద్ధవీరుడుగా నిర్ణయిస్తూ అతనికి చావులేదని, వివిధ కారణాలను విచారణలో అధ్యక్షుడను నలుగురు సభ్యులు విచారణ జరుపుచుండగా సాక్ష్యమిచ్చు మేజరు గుడాలుని ప్రశ్నిస్తున్న సందర్భంలో

"అధ్యక్షుడు : ప్రభుత్వము వారు శ్రీరామరాజు అవకాశము చిక్కించుకొని

పారిపోవుటకు ప్రయత్నింపగా తుపాకి పేల్చవలసి వచ్చినదని ప్రకటించినారు. దొరకక దొరికిన రామరాజు అట్టి అవకాశము మీరెందులకిచ్చినారు? సంకెలూడదీసి వేసిరా? అని ప్రశ్నించెను దానికి సమాధానముగా.....

గుడాలు : లేదు. అతడు సంకెలలతో నట్లే యుండేను.

అధ్యక్షుడు : అట్లయినచో పారిపోవుటకెట్లవకాశమయ్యెను?

గుడాలు : అవకాశము చిక్కలేదు. మేము పారిపోవుచున్నాడని భ్రమపడితిమి.

అధ్యక్షడు : ప్రభుత్వ ప్రకటన తప్పన్నమాట.

గుడాలు : అవును, పొరబడినది ప్రభుత్వం.

అధ్యక్షుడు : అతడు పారిపోవుచుండెనని పేల్చితిమంటారు గదా! పారిపోవుచున్నాడనుకున్నప్పుడు మీకతడు వెనుదిరిగి యుండవలసి ఉండగా రామరాజు గుండెలపైన గుండెట్లు తలినవి?" [12] అని కోర్టు విచారణలో రచయిత సంశయాన్ని పాఠకులకు వివరించాడు.

అంతేకాకుండా సాధారణముగా ప్రభుత్వము శవములను పాతిపెట్టుటయే ఆచారమై ఉండగా మీరు దహనము ఎందుకు చేసితిరి? అయిన హిందు సాంప్రదాయంలో సన్యాసులను దాహనము చేయరే సమాధి చేస్తారు. అని అనేక ప్రశ్నలతో పాఠకులకు రామరాజు మరణంపై అనేక అనుమానాలు కలిగేటట్లు రచయిత నాటకీయత ప్రదర్శించారు. నాల్గవ రంగంలో కోర్టు తీర్పుపై ఎదురు చూస్తున్న ప్రజలకు తీర్పురేపు చెప్పెదనని అధ్యక్షుడు పలకడంతో ప్రజా తీర్పుపై కవికి కలిగిన గౌరవం వ్యక్తమౌతుంది.

పంచమ రంగంలో కోర్టులో విచారణ జరిగే తీర్పును అధ్యక్షుడు చదువుతూ..... "అధ్యక్షుడు : (కాగితము చూస్తూ చదువుచున్నాడు...) శ్రీరామరాజు మృతి చాలా దురదృష్ట పరిస్థితులలో జరిగింది. అతడు తన పితూరీ పరిపూర్ణముగా నెరవేర్చి ఏ అభిప్రాయంతో ఆంగ్లేయులకు లొంగిపోయాడు. అటువంటి వ్యక్తి మరల ఎట్లా

పారిపోవుటకు ప్రయత్నిస్తాడు? తన సంకెలలో బిగువుగా మంచమునకు కట్టబడి ఉండెను. అట్టి విధముగా ఉన్న అతడు పారిపోవుట అసాధ్యం."[13] మేజర్ గుడాల్ సాక్ష్యమంతయు అతి వినయంగా చెప్పాడు. శ్రీరామరాజు తప్పించుకొనే ప్రయత్నం చేయలేదని, తాము అలా అని అనుకొని భ్రమపడితిమని చెప్పిన విషయమును విశదపరిచినాడు. కానీ రామరాజుని భూతము ఎత్తుకొని పోవుచున్నట్లు అద్భుతముగా కండ్లకు గట్టినట్లుగా వర్ణించిన వర్ణన ఈ రోజుల్లో ఎవరు నమ్ముతారు చెప్పండి. ఇదంతా ఒట్టి కల్పన, కట్టుకథగా కవి వివరించాడు.

ఈ విచారణకై నియమింపబడిన కమిటీలో కొంతమంది సభ్యులు భూతాల అందు నమ్మకముండి మేజర్ గుడాల్ రామరాజును పేల్చి వేయుటకు చెప్పిన సమాధానము సరియైనదని స్వీకరించిరి. కానీ మరి కొంతమంది సభ్యులు భూతములున్నాయన్న నమ్మకము లేక గుడాల్ సాక్ష్యమును నిరాకరించిరి. ఈ సభ్యులు అందరు ఏకగ్రీవ తీర్పు కొరకు మదరాసు ప్రభుత్వం వారి అభిప్రాయమునకు రిపోర్టులు పంపించారు.

గౌరవనీయులైన లా మెంబరుగారి ప్రత్యుత్తరము కొరకు ఎదురు చూస్తున్నాము. అది రాగానే తీర్పు విషయమై మేమో నిర్ణయానికి వస్తామని తుది తీర్పును చెప్పకుండా ప్రజల తీర్పు కొరకు ఎదరుచూస్తునట్లు కవి విశ్లేషించాడు.

అల్లూరి సీతారామరాజు మరణం తర్వాత జరిగిన సంఘటలని రచయిత యదార్థంగా రాశారు. రామరాజు మరణానికి సంబంధించిన వివరాల్ని రెండవ రంగంలో చర్చించడమైంది. రామరాజు నాటకాలకు ఈనాటకానికి చాలా బేధం ఉంది. ఎందుకంటే అన్ని నాటకాలు రామరాజు ఉద్యమ పోరాటాన్ని అతని చరిత్రను ఇతివృత్తంగా తీసుకున్నారు. కాబట్టి అందులో రామరాజు అతని అనుచరుల పాత్రలుంటాయి. కానీ ఈ నాటకం అల్లూరి సీతారామరాజు మరణం తర్వాత తర్కబద్ధంగా సాగిన నాటకం కాబట్టి ఉద్యమకారుల పాత్రలకు అవకాశం లేదు.

రామరాజును కాల్చిన తరువాత సైనికుల శిభిరాన్ని, మరణాన్ని గూర్చి ఆకాశంలో నారదుడు, తుంబురుడు కలసి మాట్లాడుకున్నారు.

దండోరా వేసే కార్యక్రమాల్లో ఎన్నో రకాలుగా వారి మనసుల్లో మాటలను చెప్పారు.

గోదావరినది ఒడ్డున రామరాజు మృతిపై జరిగిన మహాసభావేదికలో చర్చలు, సమావేశాలు వారి అభిప్రాయాలు తెలియపరిచారు. కోర్టు విచారణలో మేజర్ గుడాల్ తో వాదన లాంటి విషయాలు పత్రికా రంగంలో రామరాజుకు అన్యాయం జరిగింది అన్న అభిప్రాయాన్ని ఈ నాటకంలో కళ్ళకు కట్టినట్లు కవి వివరించారు. ఈ నాటకంలో పాత్రలన్నీ కవి కల్పించి, ఈపాత్రల ద్వారా అల్లూరి సీతారామరాజు మరణంపై వచ్చిన వివాదాల్ని కవి తన అభిప్రాయం ద్వారా పూసగుచ్చినట్లు వివరించారు.

అల్లూరి సీతారామరాజు అనే నాటకాన్ని పడాల రామారావు రాశాడు. 1950 వ సంవత్సరంలో ప్రారంభించిన ఈ నాటకం 1991 నాటకి 21వ ముద్రణలకు నోచుకుంది. ఈ నాటకం మొత్తం 105 పుటల్లో 12 పాత్రలతో, ఐదు రంగాలతో రామరాజు విప్లవ పోరాటాన్ని, స్వాతంత్ర్యదీక్ష, దేశభక్తి, త్యాగ నిరతిని చాలా సుదీర్ఘంగా వర్ణించారు.

అల్లూరి సీతారామరాజు చరిత్రను సంపూర్ణంగా అధ్యయనం చేసిన వారిలో పడాల రామారావు ముందు స్థానంలో ఉంటారు. వీరి పరిశోధన తర్వాత రచయితలకు మార్గ దర్శకమైందనటంలో సందేహం లేదు. అల్లూరి సీతారామరాజు సంప్రదాయ పాత్రోచిత నాటకాలకు ఇతడు ఆధ్యక్షుడని చెప్పవచ్చు.

**3.2 పడాల రామారావు:**

పడాల రామారావు "కృతజ్ఞత" అనే ముందు మాటలు పలుకుతూ ఈ నాటకం గూర్చి ప్రముఖుల ప్రశంసలను వివరిస్తూ...

తెలుగు పత్రికలన్నీ దీన్ని ఉత్తమ నాటకంగా ప్రశంసించాయి, రాష్ట్రపతి శ్రీ.వి.వి.గిరి "ఇటువంటి ఉత్తమ నాటకాన్ని చూడగలుగుతున్నందుకు నిజంగా ఎంతో సంతోషిస్తున్నాను"[14] అని ప్రశంసించారు.

ప్రముఖ మలయాళ దినపత్రిక "మాతృభూమి"లో ఇది తెలుగునాటకమే అయినా హృదయ స్పందనమైన సన్నివేశాలతో, అద్భుత దర్శక ప్రతిభతో మలయాళ ప్రేక్షకులను ఎంతగానో ఆకర్షించింది" అని రాసింది.

కేరళ దినపత్రిక "మలయాళ మనోరమ" అనే పత్రికలో "వేలుతంపి, భగత్సింగ్ వంటి తలవంచని స్వాతంత్ర్యయోధులకు తలమానికమై పోయిన అల్లూరి సీతారామరాజు వీరచరిత్ర ఈ నాటకంలో అత్యద్భుతంగా చిత్రీకరించారు"[15] అని వక్కాణించింది.

"40 సంవత్సరముల అనుభవమున్న నటుడైన నాకే ఈ నాటకం చివరి ఘట్టాల్లో ఎంతో భయాందోళలనలు కల్గించిందని, ప్రేక్షకులు కరుణ రసాన్ని ఎక్కువగా పొంది అల్లూరి సీతారామరాజు ఆత్మత్యాగానికి కళ్ళనీరు కార్పించేంతగా బాగా రచన చేశారని"[16] పద్మశ్రీ స్థానం నరసింహారావుగారు ఆరవ ముద్రణ 1963లో తన అభిప్రాయాన్ని తెలియజేశారు.

అంతే కాకుండా విద్యార్థులలో స్వాతంత్రోద్యమం నాటి స్ఫూర్తిని గుర్తుకు తేవడానికి దోహదం చేస్తుందన్న మంచి ఆశయంతో ఈ నాటకాన్ని పాఠ్యాంశంగా ప్రచురించారు. ఈ నాటకం ఆంధ్రప్రదేశ్‌లోనే కాక కేరళ రాష్ట్రంలో 5 కేంద్రాల్లోను, మైసూరు 5 కేంద్రాల్లోను, ఒరిస్సాలో 2 కేంద్రాల్లోను, బర్మాదేశంలో 2 కేంద్రాల్లోను ప్రదర్శింపబడి బంగారు, రజిత పథకాల్ని గెల్చుకోందని, దేశ విదేశాల్లో ప్రదర్శింపబడి ప్రేక్షకుల, పీడితుల, ప్రశంసలను అందుకోందని రచయిత వివరించారు.

అలాగే పదో ముద్రణ నుండి సీతపాత్రను తగ్గించారు. భారరహితం చేయడానికి వీరయ్యదొర, భాస్కరరావు పాత్రలను కూడా తగ్గించారు. రామరాజును వాస్తవంగా కాల్చి చంపినవాడు గుడాల్ కావడం వల్ల ఆపాత్రను రూధర్‌ఫర్డ్ స్థానంలో ప్రవేశపెట్టారు. కొన్ని సన్నివేశాలను నాటకీయం చేశానని రచయిత ముందుమాటలో తెలియజేశారు.

ఈ నాటకంలో మొదటి రంగం రత్తి గోవిందుల పాత్రలతో ప్రారంభమౌతుంది. రత్తి చెంచు కులస్థుల పిల్లా. గోవిందు కోయదొర కులస్థుల కుర్రాడు. వీరు ప్రేమించి వివాహము చేసుకుంటారు. ఈ పాత్రలు కేవలం కల్పితం. చరిత్రలో లేవు. ఈ నాటకంలో ఏకైక స్త్రీపాత్ర రత్తి. ధైర్యసాహసాలతో దేశభక్తి ప్రదర్శించిన తీరును కవి చక్కగా వర్ణించాడు.

సూర్యోదయం, దూరంగా కొండలు, దిగువ సర్వే నెంబరున్న మద్ది చెట్టు గొడ్డలి నాట్లు వినబడుతున్నాయి.

"గోవిందు : (వొల్లంతా చెమట, కొడుతున్న గొడ్డలిని ప్రక్కకు నెట్టి, వొల్లు విరుచుకొని చెమట విదల్చి నోటికి ఏటవాలుగా అరచెయ్యి పెట్టి పిలిచాడు) రత్తీ....! ఆకలావురావురుమంటోంటే ఇంకా ఎక్కడుంటిదే? (మూడు వైపుల చూచి గట్టిగా పిలిచాడు.) రత్తీ.... రత్తీ.... రత్తీ.... అని వెంటనే

రత్తీ : లోపలి నుండి వోత్తుంటి మామోయ్ వోత్తుంటి నానోయ్ చద్ది-తెత్తుంటినోయ్ (అందెల రవళితో వచ్చి చద్దిముంత గల తట్టను దించింది) చద్దిలోనూ నామనసంతా పిండి పోసినానోయ్ మామా పిండి పోసినానోయ్!

గోవిందు : ఇంకేం పోస్తివీ!

రత్తీ : వలను మీరిన నా వయసంతా పోసినానోయి- మామా వొలకపోయినానోయ్..."[17] అని అంటూ

రత్తి గోవిందుల సంసార జీవితాన్ని వర్ణిస్తూ కులాంతర వివాహమైనా వారిలో ప్రేమ అనురాగాలను కురిపిస్తూ కవి నాటకంలో ప్రేమరసాన్ని కూడా చూపించారు. ఒకరి గొప్ప మరొకరు చెప్పుకుంటారు. గిరిజనుల్లో కోమా కులం పెద్దకులం, అటువంటి గోవిందు తక్కువ కులమైన చెంచులోళ్ళ పిల్లను పెండ్లి చేసుకుంటాడు. నాకు జీవితాన్ని ఇచ్చారు అని రత్తి పలుకుతుంది. వారి మంచి మనసులను కల్ల కపటంలేని అమాయక ప్రేమికులని పై గీతంలోనే పాఠకులకు కవి తెలియజేశాడు. ఇంతలో పడాలు ప్రవేశం. పాత్ర ప్రవేశంతో పాటే ఆపాత్ర అలంకరణ కూడా కవి తెలియపరచడం విశేషం. (ఓరతలపాగా, కాసుల గుండీలున్న లాల్చీ, చేతిలో కఱ్ఱ. తటాలున కోపంగా వచ్చాడు.)

ఈ సన్నివేశంలో హాస్యాన్ని జోడిస్తూ నాటకీయతను చూపిన విధానం....

"పడాలు : ఆపండి; మీ నవ్వులూ, నాటకాలు!

(రత్తి గోవిందులు విరగబడి నవ్వారు) ఏంటే పకపకలు?

గోవిందు : నిన్ను చూస్తే నవ్వు ఉండబట్టడంలే పడాలు!

| | | |
|---|---|---|
| రత్తి | : | ఊహూ! నాకు ఏడుపు ఉండబట్టడంలే! |
| పడాలు | : | మీకు కూటి పురుగు తలకెక్కింది.......... |
| గోవిందు | : | అవును నీ అబ్బ కూడు పెడుతుంటివి కదూ |
| పడాలు | : | కాకపోతే ఊళ్ళు ఊళ్ళన్నీ కదిలి రోడ్డు పనికి వస్తుంటే మీరెందుకు రాక పోవాలి? |
| గోవిందు | : | ఓయబ్బో, మనుషుల్ని కొనెస్తి వనుకొంటినే! |
| పడాలు | : | అవును, మొలతాడు కట్టిన మగోడూ, తాళికట్టిన ఆడవాళ్లూ రోడ్డు పనికి రావాల్సిందే...... |
| గోవిందు | : | మా రెక్కల కష్టం; ఆకలి పోట్టా; కట్టానికి తగ్గ దుడ్డు ముట్టందే పనికి పోగూడదంటిమే? |
| రత్తి | : | (పకాలున నవ్వింది) |
| పడాలు | : | జాగర్త! దొరతనం మాట జవదాటారా! కొంపలూడ బీకుతారు. |
| గోవిందు | : | అడవిలో వుంటే అడవినే ఊడబీకిస్తురా ఏంటి?...”[18] అని అంటూ |

రత్తి, గోవిందు, పడాలు సంభాషణలో మొదట హస్యరసం కనిపిస్తుంది. తర్వాత ఎదిరించే తత్వం వినిపిస్తుంది. రోడ్డు పనికి వస్తాం కష్టానికి తగిన డబ్బు ఇవ్వాలి అని హక్కును ప్రదర్శించడం జరిగింది. అంతే కాకుండా కొంపలూడ బీకుతాడనే పడాలు మాటలకు గోవిందు అడవినే ఊడ బీకిస్తాడా! అని పోరాట తత్వం, తిరుగుబాటు ధోరణితో పలుకుతాడు. సంభాషణలతోపాటు నాటకీయతను పాఠకులకు కళ్ళకుకట్టినట్లు చెప్పడం విశేషం.

పడాలులో మార్పు తీసుకురావడానికి గంటం దొర న్యాయ దర్మమార్గాల గూర్చి స్వేచ్ఛ స్వాతంత్ర్యాల గూర్చి శ్రామికుల శ్రమను, కర్షకుల కష్టాన్ని దోపిడీ చేస్తున్న విధానం తెలియజేస్తూ......

| | | |
|---|---|---|
| "పడాలు | : | ఇది దొరతనం హుకుం |
| గంటం | : | అని వీళ్ళచే బలవంతపు పని చేయిస్తావా? |
| పడాలు | : | బలవంతమెలా అవుతుంది. కూలి యిస్తుంటే. |
| గంటం | : | ముష్టికూలి, ఇస్తే ఆరుకాసులు, అంతేనా, అందులో వీళ్ళ కండలు కరిగించే, చిందించే నెత్తుటి ఖరీదెంత? నడి ఎండకు మెదడు కరిగి ములుకుల్లాంటి రాళ్ళకు కాళ్ళు పగిలి బండలను బ్రద్ధలుగొట్టి భూగర్భాలను దొలచడంలో రాల్చిన చెమట బిందువుల కిరాయి ఎంత?<br><br>పిచ్చోడా! ఎప్పుడైనా ఆలోచించావా? |
| పడాలు | : | గంటం మామా! |
| గంటం | : | అవును మనిషంటే ఎవడనుకున్నావు? ఎదుటివాడికి అన్యాయం, అపకారం తలపెట్టనంత వరకు వాడికి స్వేచ్ఛ వుంది. వాడి మాటకు తిరుగులేదు. వాడి ఉనికికి వాడే మహాప్రభువు. కానీ యిప్పటికీ ఆ స్వేచ్ఛనంతా దోచుకున్నారు ఆంగ్లేయులు ఇక మిగిలిన స్వేచ్ఛ- వారికిష్టం లేని పనికి రాననే హక్కు ఆమాత్రానికైనా నోచుకోలేదా యీ దీనులు, పడాలూ? |
| పడాలు | : | స్వేచ్ఛంటూ విధిని దిక్కరిస్తే ఊరుకోమంటావా? |
| గంటం | : | విధి? ఏది విధి? మన పశువులు హాయిగా మేసే బీళ్ళకు కంచె వేయించడం మనం స్వేచ్ఛగా అనుభవించే అడవులను సర్వే చేయించడం మనం సాగుచేసే భూముల్ని ముఠాదార్ల కప్పగించడం దొరల విధంటావా?"[19] అని పలుకుతూ |

శ్రమజీవుల కష్టాన్ని దోచుకుంటూ తగిన ఫలితం లేకుండా చేశారు. అటవి చట్టాలను ప్రవేశపెట్టి పశువుల మేసే బీళ్ళకు అడ్డుకట్ట వేశారు. పశువులకు స్వేచ్ఛ

లేదు. ఇక మనుషులకు బానిసలుగా చిత్రీకరించారు. మనిషి స్వేచ్ఛ, విధి అనే పదాలతో కవి బాగా క్లుప్తంగా గంటం ద్వారా చెప్పడం కవి నిశిత పరిశీలనకు ఉదాహరణ. అడవి తల్లి, అతని బిడ్డల సంపదను ఆంగ్లేయులు దోచుకుంటున్నారు. ఈ సంభాషణలో బ్రిటిష్ వ్యవస్థ లోపాలను గిరిజనులకు జరగుతున్న అన్యాయాలను పడాలుకు తెలియజేస్తున్నాడు.

విభజించు పాలించు సూత్రాన్ని అనుసరిస్తున్న బ్రిటిష్ వ్యవస్థను వారి లోపాలను చూపుతూ.....

"గంటం : మరేం కంగారు లేదు పడాలు. మనలో మనకే చీలికలు పెట్టి మనలో అండబలం గల వారికి మేస్త్రీ పనులిచ్చి మన చేతనే మన కోయలపై దౌర్జన్యాలు చేయించేయా ఆంగ్లేయుల కుట్రలను లోతుగా ఆలోచించు దొరక్కపోదు దాని అంతు? నే వెడలే..... అని పడాలు ఉన్న విషయాన్ని వివరించాడు. కొంపలంటుకున్నాక నూతులు తవ్వి ప్రయోజనం లేదు. ఇప్పటికే దొరలు దుష్కృత్యాలు పెచ్చు పెరిగాయ్. తెలివైన వాడవి ఒకప్పుడు పొలం పుట్రా వున్న కామందువు? ఆలోచించు ఇప్పుడా పొలం పుట్రా ఏమైందో ఆలోచించు? ఎందుకే మేస్త్రీ పని? మనలో మనకు తగాదాలు, చిచ్చులు పెట్టి విభజిస్తున్నారని"[20] గంటం ద్వారా జ్ఞానోదయం కలిగేటట్లు కవి వివరించాడు. గంటం ద్వారా ఉత్తేజమైన మాటలతో పడాలులో మార్పు రావడానికి కారణం తెలియపరుస్తూ.....

"మల్లుదొర : ఏమందన్నా, ఘోరన్నేయం చేస్తిరి. కూలెక్కు విస్తమని పని చేయించు కుంట్రి. పనికాస్తా తేరినాక నాలుగు కానులాళ్ళ ముఖాన కొట్టింట్రు. ఏంటి దొరా! అంటే వీపులు చిట్ల గొడ్తిరి. దొంగనాయాళ్ళు..."[21] అని దొర పలికిన వెంటనే అక్కడ ఉన్న గోవిందు, రత్తి, గంటం, పడాలు ఒక్కసారిగా నిర్ఘాంతపోతారు. ఈ సంఘటనలో పడాలలో మార్పు చెంది ఆంగ్లేయుల దురంతాలను ఇక ముందు సాగనివ్వనని గర్జిస్తాడు పడాలు.

పడాలులో మార్పును చెప్పుటకు కవి ఒక సన్నివేశాన్ని ఇలా...33

"ప.ఇ : (తటాలున వచ్చాడు పోలీసులతో...) ఆహ్వాహ్వాహ్వా బేక కూఫ్

కత్తిపై సాము కర్నాచాహ్తే?

| | | |
|---|---|---|
| పడాలు | : | కత్తిపై కారు – మీ కుత్తుకలపై |
| స.ఇ | : | క్యాబోలా? శరభయ్యా! పకడో ఉన్కో! |
| పోలీసు | : | అచ్ఛాసాబ్ |
| పడాలు | : | ఊ.రమ్మను. |
| స.ఇ | : | (రివాల్వర్ చూపుతూ, పైకి కాల్చాడు) లేజాకీ లాకప్ కేరో<br>(చోరో జబ్బా పట్టుకొని లాక్కెడుతున్నారు) |
| పడాలు | : | ఓరి నీచుల్లారా! మిమ్మల్ని మన్యం రక్షకులని భ్రమించాను–కాదు భక్షకులు.... అనే నిజాన్ని గ్రహించేట్టు పడాలులో మార్పులేసుకు వచ్చారు. బ్రిటీష్ వాళ్ళ అన్యాయాలను కళ్ళకు కట్టినట్టు చూపించాడు. అప్పటి వరకు తిరుగుబాటు, దురాక్రమణ చిత్రీకరించిన కవి వెంటనే రత్తి, గోవిందుల హాస్య, ప్రేమానురాగాలను చూపించాడు.)”[22] |

ఈ నాటకంలో యితివృత్తం–పాత్రచిత్రణ సన్నివేశ కల్పన సంభాషణలతో పాటు రసవంతమైన పాటలు, జానపద గీతాలు కూడా అవసరం అని చెప్పడంలో కవి ఎక్కడ వెనకడుగు వేయలేదు. రత్తి గోవిందుల ఏకాంత సమయంలో పాఠకుల్ని రంజింపజేశాడు.

అటవి చట్టం తీరుపై బ్రిటిష్‌వాళ్ళ అనుసరించిన విధానం వివరిస్తూ.....

| | | |
|---|---|---|
| “స.ఇ | : | (తటాలున వచ్చి కొరడాతో వీపుపై బాదారు) ఠైరో! |
| గోవిందు | : | అమ్మో! |
| స.ఇ | : | నీకి కనబడ్డం లేదుబే చెట్టు కా సర్వే నెంబర్? |
| గోవింద్ | : | (ఎదుటకు తిరుగుతూ) ఓరూ? |
| స.ఇ | : | హెవరా? పొగరు తలకెక్కిన కోయ బద్మాష్! తీవ్రంగా బోలో సర్వే |

నెంబరున్న చెట్టుపై గోడ్డ లెందుకేసావ్!

గోవిందు : నెంబరేంటి దొరా?

స.ఇ : మాలూం నహీ! సర్కారు కా స్వాధీనంలో వున్న చెట్టు, యీ చెట్టుకి హెవడు ముట్టిన వాడి పని కూడా ఖతం హవుతుందని మాలూంనై?..."[23]

గిరిజనులు తాత ముత్తాతలనుండి అడవి తల్లి ఒడిలో పెరుగుతు స్వేచ్ఛగా జీవించేవారు. అటవి చట్టం గిరిజనుల జీవన స్థితిని దెబ్బతీసి, కష్టాలకు కారణంగా మారింది. ఈ సంభాషణలో బ్రిటిష్‌వారు మన్యం ప్రజలను తమ అనుకూలంగా మార్చుకొని హింసకు గురి చేశారు. మన్నెంలో ఎప్పుడైనా ఓ చెట్టు కొట్టుకున్నా ఓ పంట పండించుకున్నా, ఓర్నైనా అడిగితిమా, ఓర్నైనా అడ్డు పెట్రింద్రా సోప్పు దొరా!"[24] అని గోవిందు పలికిన మాటలలో అచ్చం జానపదం ఉట్టిపడుతుంది.

ఈ నాటకంలో సబ్ ఇన్‌స్పెక్టర్ పాత్ర బ్రిటిష్ వారి అధికారిగా ఉన్నాడు. అతడు భారతీయ ముస్లిమ్ కనుక అతని సంభాషణ మాటల చాతుర్యాన్ని చూపిస్తూ......

"కుత్తా (మరల కొట్టి పోలీసులతో)" దేఖా? మీరు హిచ్చిన లోకు వహిది. ఎఱ్రటోపిని చూసి వొణక వలసిన వొక కోయ బద్మాష్ ఆ ఎఱ్రటోపికే ఎదురు తిరుగుతాడ్. నహీ నహీ! ఇక ముందు కుక్కల్ని కాలి క్రింద అణచిపెట్టి మరీ అధికారం చెలాయిస్తాం. యాద్‌రొఖో..."[25] అని పలుకుతూ ముస్లిమ్ పోలీసు పలికిన సంభాషణలతోపాటు అధికార దాహం కూడా కవి వ్యక్తీకరించాడు. భారతీయుడైన బ్రిటిష్ వాళ్ళకొరకు, తోటి సోదరులను హింసపెట్టుట బాధకర విషయంగా చిత్రీకరించాడు.

బాస్టియన్ చేసిన దురాగతాలకు గంటం, మల్లు ప్రశ్నిస్తున్న సమయంలో అక్కడకు ప్రత్యక్షమైన కథానాయకుడు ధీరత్వాన్ని పరిచయం చేస్తూ.....

"గంటం : నీ అంగ అర్థబలాన్ని అంగలార్పించే కండశక్తి మాకుందని మరిచిపోకు

బాస్టియన్ : నా అంగబలానికి ఆయుధాలున్నాయ్ తెల్సా?

(పెళపెళార్భటులు, ఓ పెద్దపులి ఘాం(డింపు వినిపించింది. ముల్లు తన వొరనున్న బాకు దూసి ధైర్యంగా ముందు కొచ్చి నిలిచాడు. హడలెత్తిన బాస్టియన్ వొణకుతూ తుపాకీ గురి పెట్టాడు.)

రామరాజు : చేతిలో చెత్తముంది, పిడగులా వారి మధ్య పడి వాడి చేతిలోని తుపాకి లాక్కొని, అహ్హహ్హహ&. ఎక్కడ నీ ఆయుధాలు?

(అంత ఒక్కసారిగా ఫక్కున నవ్వారు)

బాస్టియన్ : నువ్వెవడవ్?

రామరాజు : నేనా? నాపేరు అల్లూరి సీతారామరాజు. తలుచుకుంటే నిన్నూ నీ అధికారాన్ని త్రుటిలో తృణంగా మార్చగల ఈ మహా మానవుల మనిషిని, జాగ్రత్త, వీళ్ళ కండ శక్తికి అభేద్యమైన ధైర్యసాహసాలు కంచు కవచాలని తెలుసుకో. వీళ్ళు గర్జించే సింహాలైతే"[26] అని

పలుకుతూ కథానాయకుని ప్రవేశం ఒక పెద్ద పెనుమార్పు తీసుకు రావడం జరిగింది. బ్రిటిష్ వాళ్ళ అధికారాన్ని అణచగలిగే శక్తి మన్యం ప్రజలకు మాత్రమే ఉంది అని రామరాజు చెప్పడం. ముందు చూపుకు నిదర్శనం. మన్యం ప్రజలకు సింహంలాంటి నాయకుడు దొరికాడని సంబరపడిపోయారు. మన్యం వీరులు గర్జించే సింహాలుగా వర్ణిస్తే, బ్రిటిష్ వాళ్ళను మొరిగే కుక్కలతో పోల్చారు. బాస్టియన్ వంటి జిత్తులమారి నక్క, దిక్కులేని పక్షులను పొడుచుకు తినే ఒక గుడ్లగూబ అని విరుచుకుపడుతూ ఎదిరించాడు. అంతేకాదు తెల్లవాళ్ళ రోడ్లు సౌకర్యం గూర్చి కవి భారతీయ ఉద్యోగులను ఎటువంటి హానిచేయని పరిస్థితి గూర్చి వివరించిన విధానం.

"స.ఇ : యీ దొరల్కి అలా భరించబట్టే యీ మన్నెపోళ్ళు ఎర్రటి ఏగాడికి చూస్తున్నావ్ పెద్ద పెద్ద రోడ్లు వేయించి, రెండు చేతులా పనికే కడుపు నిండా తిండ్కి పెట్ట బట్టే వీళ్ళకు పొగరూ హెచ్చింద్.

రామరాజు : ఆవేశంతో చేతికర్ర విరిగిపోయింది. స్వదేశయుడవైపోయావ్. యీ దొరలు రోడ్లేయిస్తున్నది మనకోసం కాదురా..... మన్యం సంపదనంతా గతుకుల్లేని రోడ్లుపై దొలించుకు పోవడానికి మూర్ఖుడా! ఏ తల్లి కడుపున పుట్టావో ఆ తల్లి కడుపునే చేయి పెడుతున్నావా దుష్టుడా!...[27] అని

ఈ సంభాషణలో బ్రిటిష్ బాస్టియన్‌ను ఎదిరించడమే కాకుండా, భారతీయ ఉద్యోగి అయిన ముస్లిమ్ సబ్ ఇన్‌స్పెక్టర్‌ని మందలించి, భారతీయులకు చేస్తున్న అన్యాయాన్ని ప్రశ్నించాడు. మన్య సంపదను దోచుకుపోతున్నారని ప్రజలకు తెలియజేశారు.

రామరాజుకు మంత్రశక్తి, మహిమలు, ఆత్మశక్తి యోగా మొదలైన విద్యలు తెలుసునని చెప్పుటకు కవి ఈ సన్నివేశాన్ని చిత్రీకరించిన విధానం గూర్చి......

"రత్తి : రామదూతలా వచ్చింద్రు సోమీ!

రాజు : (లెవనెత్తుతూ) కాదు మీ దూతనేనమ్మా (గోవిందుచూచి) అయ్యో ముందీకట్లు విప్పండి.

గోవిందు : రచ్చిత్తిరి సోమీ

రాజు : ఒకరు రక్షించేదేమిటి? దౌష్ట్యానికి లోబడని ధైర్యం అన్యాయాన్ని ఎదిరించగల సాహసమే ప్రతి మనిషిని రక్షిస్తాయ్. మీ ఆత్మశక్తి సంఘటన శక్తే మీకు శ్రీరామరక్ష. శిక్షరక్షణకు దుష్ట శిక్షణకు ఆరాముడెపుడూ పుడతుంటాడు నాయనా.

"పవిత్రానాయ సాధూనాం
వినాశాయి చదుషకర్పతాం
ధర్మ సాంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే..."[28] అని అంటూ ప్రజలకు కష్టాలు వచ్చినప్పుడు ఆ కష్టాలను తీర్చుటకు ఏదే ఒక రూపంలో ఆ భగవంతుడు అవతరిస్తాడని రామరాజు పలికి అందరు కనులు మూసుకొని ఒక్కసారి తెరిచాడు. అందరు 'సోమి' అని ముందు కెళ్ళారు. రాజు కనబడలేదు. మెరుపులా మాయమైపోయాడు. అక్కట జనులంత బాస్టియన్

అంతటోడ్ని పరాభవించగలిగిన ఆయనకు ఎంత ధైర్యం! అదె పులిలా అరచి భేక్ భేక లెత్తించాండూ? ఆయనెవరో సామాన్య వ్యక్తి కాదు. మన మన్యం పాలిటి మరో శ్రీరామచంద్రమూర్తిలా ఉన్నాడని దైవసమానుడుగా కీర్తించారు.

రామరాజు స్వాముల వారుగా, జ్యోతిష్యుడగా, సంఘసంస్కరణోద్యమ నాయకుడుగా చిత్రీకరించిన కవి రత్తి పాత్రతో పాఠకులకు తెలియుజే..........

“గోవిందు : ఓరు రత్తే!

రత్తి : ఈ సోములవారే

మల్లు : జ్యోతిషం చెప్పింద్రో

రత్తి : నిక్కం మామా. నీ మొగుడు మొనగాడై పోతడనగానే దాన్ని పట్టలేకుంటిమి మామా

అంతా : నవ్వారు

మల్లు : రాత్రిళ్ళు గూడేలు తిరుగుతూ కల్లు మాన్పిస్తుంటరీ సోములు వారేనహే.

రత్తి : నిక్కం

మల్లు : నిక్కం రత్తే. అబద్ధమాడే గాచ్చారం నాకెందుకంట “వొల్లు ఇల్లూ గుల్ల చేస్తది కల్లు”[29] అంటూ దాని నిషా యొక్క మనిషి రాచ్చసుడైపోతడని చెప్పింద్రు.

పై సన్నివేశాన్ని పరిశీలిస్తే రామరాజు సంఘ సంస్కరణోద్యమ బాటలో ప్రయాణించి మన్య ప్రాంతంలో మార్పు కోరుకున్నాడు. గ్రంథాలయాలు స్థాపించుట, గ్రామయ పంచాయితీలు ఏర్పాటు చేయుట, మద్య నిషేదం అమలు చేయుట మొదలైన సంస్కరణోద్యమం, సంస్కరణోద్యమ భాగంలో కార్యక్రమాలను మన్యంలో ఏర్పాటు చేసి, మన్యాన్ని స్వర్గంగా మార్చేస్తానని స్వాములు చెప్పినట్లుగా కవి వివరించాడు.

మన్యంలో గతంలో జరిగిన పితూరి గూర్చి రామరాజు తెలుసుకొను....

"శింగన్న : ఏ చేస్తాను సామీ! నాపేనం–నా కొడుకు తాగరాయ పితూరీలో చచ్చిపోనాక......

రామరాజు : ఇంతకు ముందు పితూరీ జరిగిందా?

గంటం : ఒకటా? మూడు జరిగాయ్. నలభై ఎండ్ల కిత్రం తెల్లోళ్ళపై దండెత్తడం ద్వారా బంధాల చంద్రయ్య పితూరీ, తర్వాత కనబడిన అధికారినల్లా నరికి వేసిన కోయరాముడు పితూరీ, దాని తర్వాత సరిగ్గా ఆరేళ్ళ క్రితం పొలం పుట్రా మందేనన్న లాగరాయ పితూరీ!

రాజు : ఓహో మన్యమే ఓ అగ్ని పర్వతమన్న మాట..."[30] అని పలుకుతూ గంటం దొర మన్యంలో పితూరిల గూర్చి వివరించెను. అప్పుడు రామరాజు మన్యాన్ని విప్లవంతో రగలు తున్న అగ్ని పర్వతంతో పోల్చాడు. ఆ తర్వాత శింగన్న బాధను చెప్పుకుంటాడు. శింగన్నను విప్లవానికి సహాయంగా ఉండమని రామరాజు కోరుతాడు.

బ్రిటిష్ సైన్యం మన్యంలో చేసే అరాచకాలను వివరిస్తూ......

"శింగన్న : ఇంతకు ముందే ఎదురు తిరిగిండని పడాలు మామాను ఖైదులో కుక్కింద్రు.

గంటం : పడాలునే?

శింగన్న : అవును మామా! ఇప్పుడిప్పుడెర్రబట్టలోళ్ళ ఊళ్లో ఇళ్ళన్నీ కూల్చేసింద్రు.

మల్లు : ఎంతఘోరం, ముందు సెప్పకపోతివే?

శింగన్న : ఇంకా ఘోరం చేసింద్రు మామా! పాపం ఆవీరిగాడి పెళ్ళాన్ని నడివీధిలో చెరిబింద్రు

రామరాజు : అమానుషం

మల్లు : రాచ్చసులు

రత్తి : నెలలు నిండకున్న సీతమ్మనే?

శింగన్న : అవునమ్మా పేనాలు కూడా విడిసింది..."[31] అని అంటూ ఆంగ్లేయులు చేస్తున్న దుష్ట చర్యలకు మన్యమంత ఒక్కటై ప్రతీకారం తీర్చుకోవాలని కంకణ బద్ధులైరి. పదండు ముందుకు అంటూ ప్రతి గ్రామంలోను తిరుగుబాటు లేవదీశారు. దానికి నాయకత్వం వహిస్తున్న రామరాజును "భద్రంసోమీ! మందుమార్బలమూ వున్నోడు. కుంఫిణీవోడు" శింగన్న చేత ముందుగా రచయిత హెచ్చరించాడు.

రామరాజు విప్లవ చైతన్య తీసుకురావడానికి మార్గం చూపుతూ.......

"ఈ తుపాకీ ఎలా వచ్చింది? అలాగే అంతే త్రుటిలో యీ దొరలకు గతులు, మతులు లేకుండా చేయగలం. మూపున బిడ్డను కట్టుకొని స్వతంత్ర సమరం చేసిన ఝాన్సీ నకో విప్లవజ్యోతి. ప్రాణాన్ని తృణంగా త్యజించి వతపోరుసల్పిన చంద్రయ్య మనకు వెలుగుబాట, ఆ జ్యోతి కాంతిలో ఆ వెలుగుబాటలో సాగిన వానికి సాధ్యం గానిది లేదు. పదండి పోదాం. శింగన్నా నువు ముందెళ్ళిపో ఎప్పటి సంగతులు అప్పుడు మాకందించు చాలు"[32] అని రామరాజు తిరుగుబాటుకు సైన్యంతో సమరచైతన్యాన్ని వినిపించాడు.

ఈ నాటకంలో పాటలు జానపదగీతాలే కాకుండా దేశభక్తి గీతాలను వర్ణిస్తూ....

"ఉప్పొంగి పొంగరా ఓ తెలుగుబిడ్డా
భారత స్వాతంత్ర్య సమర రంగానా
పలనాటి చంద్రుని తెలుగు విక్రమదాటి
నాగులేటి నాగభుగభుగల పగఘాట
రాణి రుద్రమ రౌద్ర రోషానల జ్వాల
నీ మహశక్తిరా.... శ్రీరామరక్షరా.....!
గోదావరి పరుగు –కృష్ణవేణీ ఉరక

పర్వతగాలే రగులు మన్య తేజముతో
దిశలెల్ల దుందుభులు రంఢణాజైకొట్ట
తొడగొట్టి చేచట్టు జయము మొనగాడా..."[33] ॥ఉ॥

పిడికిలి బిగించి జయము మొనగాడా అంటూ ప్రతీ ఒక్కరు వెళ్ళిపోయారు. రత్తి గోవిందులు అక్కడే నిలిచి జయము మొనగాడా అని అల పిలుస్తుంటారు. మన్యంలో ప్రతి చెట్టు, పుట్టకూడా తిరుగుబాటు విప్లచైతన్యంతో నిండిపోయింది. మొదట రంగంలో రత్తి గోవిందు పాత్రలు చరిత్రలో లేవు. ఇవి కల్పిత పాత్రలైనా కథ ప్రారంభంలో వీరితో రక్తి కడుతుంది. ప్రేమ రసాన్ని వివరించాడు. ఒకవైపు హక్కులు, పోరాటాలు, ఎదిరించే తత్వాన్ని విప్లవ శంఖం పూరించి దేశభక్తి గీతంతో మొదటి రంగం ముగుస్తుంది. సీతారామరాజు, గాంసోదరులు. వీరన్నపడాలు, శింగన్న, గోవిందురత్తి బాస్టియన్, పిళ్ళై, మేజర్ గుడాల్ ఇందులో ప్రధాన పాత్రలు. ఇన్‌స్పెక్టర్, పోలీసు లాంటి వారు ఉన్న ఇది కేవలం సహాయ పాత్రలు మాత్రమే అయిన మొదట రంగంలో అన్ని రసాల్ని కవి పొందు పరిచాడు.

రెండవ రంగంలో పడాల్ రాజవొమ్మంగి పోలీసు స్టేషన్ నుండి విడిపించుట నుండి ప్రారంభమౌతుంది. పడాల్‌ను విడిపించుటలో రత్తి గోవిందుల సాహసాన్ని వివరిస్తూ...

పోలీసు స్టేషన్‌లో ఉన్న పోలీసు శరభయ్యకు రత్తి చేత మత్తుగా తాగించి అలరించేటట్టు కవి వినోదంతో, హాస్యాన్ని వేళవించిన సన్నివేశ గీతంతో.....

"రత్తి : అయితే పట్టు (కొద్దిగా నాలుకపై పోసి, వాడు చప్పరిస్తూంటే
దూరంగా వెళ్ళి ఊరిస్తూ)
అదుష్టమంటే నీదెరా
అదెట్టులంటే ఓదొరా
చింతపులా చీరకట్టి
మధువు నింపిన బుంగపట్టి
మోహినీ అవతారమెత్తి

వచ్చి నిలుమందిర రత్తి...... అ॥
మత్తుగా మధువు గోల
గమ్మత్తుగ ఉండరవొల్లు
గిర్రున తిరిగి కనుల ముందర
వచ్చి నిలుచుండర సోర్గం..... అ॥
చుక్కవేయ లంకాసురుడు
కైలాస మెత్తి నాడంటర
గుక్క లేయ హిరల్నుచ్చుడు
నేలను చూపగ చుట్టునంటర... అ॥

ఉ॥పట్టుదొరా! ఓ అమృతం.... అ...మృ...తం"[34] అంటూ పోలీసు దానిని తాగుడు మైకంలోకి వెళ్ళిపోతాడు. రత్తి తాళాల గుత్తికై వాడి మొలను వెదికింది. కనబడలేదు. గోవిందు టేబులు సొరుగులో చూశాడు. దొరికింది, వెంటనే తాళాలు తెరచి పడాలను బయటకు లాగి మరల తాళం వేసి సొరగులో పడేశాడు.

పై సన్నివేశంలో హస్యం, నృత్యం సన్నివేశాలు కనబతాయి ఆ వెంటనే త్యాగనీరతి, దేశభక్తిని ప్రదర్శించడం విశేషం. పడాలు ఆ మాటలను పలుకుతూ.....

పడాలు! గోవిందును కావలించుకోని "గోవిందూ! ఆహా మీరెంత ఉదాతులయ్యా! అపకారికి ఉపకారమన్న మాటను నేనింత వరకూ విన్నానే గాని, ఇప్పుడు కళ్ళారా చూశాను. ఎంత సాహసానికి సిద్ధమై నన్ను విముక్తి చేశారు? కాలు కాలుతుందని తెలిసికూడ నిప్పులో దుకారే! నిజంగా మీరు త్యాగజీవులు. నేనేమి చేసి మీ ఋణం తీర్చుకోగలను?"[35]

అని పడాలు పలికిన మాటలు చూస్తే త్యాగం, ఉపకారం చేసే తత్వం ఎక్కువగా రత్తి గోవిందు పాత్రలను ఉదాత్తంగా కవి తీర్చిదిద్దాడు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో మన్యం పితూరిలో మిరపకాయ టపాకు ఒక ప్రత్యేకత ఉంది. దాని గురించి పడాల్‌ను విడిపించుకొని పోలీసు స్టేషన్ నుండి వెళ్ళే సమయంలో రత్తి ప్రయోగించిన విధానం......

అవును మామెయ్ బోద్దులో దాచిన అమ్మును తీసింది. దాని కొనను ఓ చీటి మిరపకాయతో కట్టి వుంది. దాన్ని టేబుల్‌పై గుచ్చింది. ఇప్పుడదిరిపోతదు దొర ముగ్గురూ పకపక నవ్వుతూ ఛర్రున వెళ్ళిపోయారు. ఇన్‌స్పెక్టర్ తాపీగా వచ్చి బల్లకు గుచ్చిన వున్న అమ్మును చూచాడు. మిరపకాయ టపాసు చూచిన తెల్లవాళ్ళు హడలెత్తిపోయారు. భయంతో వణికిపోయారు. ఇన్‌స్పెక్టర్ మాట్లాడుతూ క్యా.... బాణం బహుత్ బొద్దెంగా వుందేం? దాన్ని లాగాడు. ఏక్యా మిరపకాయ! అదే మిరపకాయకి చిట్టి చీటి చదివాడు నోటీస్.... పట్టపగలు యీస్టేషను మీదే దాడి చేస్తున్నాం. ధైర్యముంటే ఎదుర్కోండి ఇట్లు అల్లూరి సీతారామరాజు[36] అని సమయం చెప్పి సాహసంతో తిరుగుబాటు చేస్తాం అని చెప్పిన దేశభక్తుడుగా కవి వర్ణించాడు.

ఈ రంగంలో సీతారామరాజుకు గొల్లవాని వేషంతో వినోదాత్మకమైన సన్నివేశం కథా అనుసందానం చేసిన నాటకాన్ని రక్తి కట్టించారు. కథానాయకుడు చేత హాస్యాన్ని పలికించి ప్రత్యేర్థున్ని బోల్తా కొట్టించాడు.

పోలీసుస్టేషన్ పట్టపగలు లూటీ చేస్తున్నా సమయంలో రామరాజుకి ఇన్‌స్పెక్టర్‌కి జరిగిన సంభాషణలో భారతీయ ఉద్యోగులకు ఎటువంటి హాని తలపెట్టనని రామరాజు వాగ్ధానాన్ని చూపుతూ....

“ముల్లు : ముందు వీడ్ని పొడిస్తే? (బల్లెంఎత్తాడు)

రాజు : ముల్లు మరిచిపోయావా? మన శత్రువు తెల్లవాడు, ఈ తుపాకులు, తూటాలు లేకపోతే వాళ్ళు మన దేవాన్నొక్క క్షణం పాలించ గలరంటావా? పిచ్చోడా. ఎవడు తిండి పెడితే వాడి పక్షాన పనిచేసే ఈ పోలీసు లేం చేసారోయ్.

స.ఇ : ఠీక్ కహాహుజూర్!

రామరాజు : హూ, నిజం ఏది నిజం? నీవాంధ్రుడివై యుండి కూడా అధికార మదంతో అవరికలేని ఈ అమాయక అనాది జాతిని అణగద్రొక్కు తున్నది. నిజం బానిసగా అమ్ముడపోయి, వసమైనా జాలిలేని

కసాయి తెల్లవాళ్ళకు తెలుగు సంపదను ధారాదత్తం చేస్తున్నది నిజం. గద్దించి కాదంటావా?"[37] అని

రామరాజు సంభాషణలో మనవాళ్లే మనకు ద్రోహం చేస్తున్నారని నల్లవాడివై పోయాక లేకపోతేనా... అని హెచ్చరించి విడిచిపెట్టెను. ఇలాంటి వాళ్ళు దొరల చేతిలో కీలుబొమ్మలు, అసలు మనం దొరల్ని వేరెయ్యాలి అని తన మనసులో మాటను భయటపెట్టెను.

ఈ నాటకంలో శింగన్న పాత్రను చాలా గొప్పగా మలిచారు. ఇటు బ్రిటిష్‌వారి మనిషిగా ఉంటూ మన్యానికి ఎప్పటికప్పుడు వార్తలను చేర వేసే వ్యక్తిగా తిరుగుబాటు విప్లవానికి ఒక ఆధారంగా సమాచారంగా కవి తీర్చిదిద్దాడు. రామారాజుతోపాటు చాలా ప్రియమైన పాత్రగా కనిపిస్తుంది. "సరే శింగన్నా నువ్వెళ్ళు భద్రం, మన్యమే నీగుప్పిట వుంది సుమా! అని ఓదార్పుతో రామరాజు కూడా శింగన్నపై మమకారాన్ని కురిపిస్తాడు.

రామరాజు నాయకత్వాన్ని, సాహసాల్ని మన్యవిప్లవానికి కావాలనీ కోరుకుంటూ అక్కడ జనులు జై జై నాదాల చేస్తారు. అప్పుడు రామరాజు విప్లవ పోరాటంలో భాగంగా ఆయుధాలు సేకరణకు పిలుపునిస్తూ.......

"నాయనలారా! (బయట అల్లూరి సీతారామరాజుకీ జై! నినాదాలు)"[38] మనకిప్పుడు కావలసినవి నినాదాలు కాదు, చేతలు మనల్ని అధ:పాతాళానికి అణగద్రొక్కి నెత్తికెక్కి నాట్యం చేసే దొరల పరిపాలన నంతం చేయాలి. మూడు పువ్వలారుకాయలుగా నున్న మన కుటుంబాన్ని కూల్చి చీటికీ మాటికీ లంచాలివ్వలేదని చీకటి కొట్టులో క్రుక్కి చావబాది బాధించే సీమ దొరల పీడ వొదిలించుకోవాలి.

నరుడు తలచుకుంటే నల్లరాళ్ళే కాదు–ఉక్కు పర్వతాలైనా చెక్కముక్కలై తీరుతాయ్. దొరలకాయువు పట్టులైన పోలీసుస్టేషన్లను చుట్టుముట్టండి! తుపాకులను కొల్లగొట్టండి! పదండి–మరో స్టేషను పైకి! గంటం! రేపేపాటికి మరో స్టేషన్ కొట్టాలి. పదండి.... అని పలుకుతూ మన్యం ప్రజలలో చైతన్య జ్యోలలాను, దేశభక్తి పెంపొందించెను. మనిషి తలచుకుంటే సాధించలేనిది ఏది లేదు. అని గిరిజన ప్రజలకు విప్లవ తిరుగుబాటును బోధించెను.

ముందు పదండి! అని ప్రోత్సహిస్తూ ముందుగా చింతపల్లి పోలీసుస్టేషనుపై దాడి జరిపిరి. తర్వాత పడాలు, మల్లు, గోవిందు ఒక దళంతో వెళ్ళి క్రిష్ణ దేవిపేట స్టేషన్ను కొట్టిరి. రామరాజు, గంటందొర, మరో దళంతో వెళ్ళి అడ్డతీగలపై దాడి చేస్తారు. మీరు అక్కడ జనంతో గాముకొండ చేరే సరికి మేము అడ్డగా వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాం. అని రామరాజుతో కలసి ప్రణాళికను సిద్ధం చేస్తారు. మన్యం పితూరికి జై....... స్వతంత్ర భారత్‌కి .. జై అంటూ నినాదాలతో దేశభక్తి గీతం పాడుతూ....

"బాధితులగు జీవులార
బానిసలగు దీనులార
దాస్య బంధానాల త్రెంచ
ఏకమై పదండిరా
పదండి? పదండిరా, పదండిరా...... ॥బా॥
తరతరాల దాస్యముతో
కరిగిపోయె మనతనువులు
యుగయుగాల పీడనచే
ఉడిగిపోయె మనశక్తులు....... ॥బా॥
మూగ జీవితమును వీడి
ముమ్ముందుకు సాగిరండి
గాండీవము చేత బట్టి
కదనానికి కదలిరండి...... ॥బా॥
దౌర్జన్యం సాగదని
దారిద్ర్యం పోసగదని
దిగ్దికులు కంపించగ
ఐక్యకంఠ నినాదాల
జై జై అని సాగరా... ॥బా॥"[39] అని అంటూ

ఉత్తేజంతో, నూతన చైతన్యంతో దేశభక్తితో సాగిపోతుంటారు. మూడు విజయాలతో విప్లవ సైన్యం ఆనందంగా ఉంటారు. పరాజయంతో బ్రిటిష్‌వారు ఎత్తులు వేస్తూ ఆస్సాం

పోలీసులు, మలబారు పోలీసులను రప్పించి, మన్యం తిరుగుబాటును అణచుటకు ప్రయత్నించిరి.

ఈ రెండో రంగంలో విప్లవ సైన్యంను ఏర్పాటుచేసి, తిరుగుబాటు చైతన్యంను మన్య ప్రజలకు నూరిపోసేను. దేశభక్తితో బ్రిటిష్ వ్యవస్థను ఎదిరించుటకు పోలీసుస్టేషన్లు కొల్లగొడతారు. అందున ఆయుధాలను సమకూర్చుకుంటారు. ఈ రంగంలో ఎక్కువ యుద్ధ వాతావరణం, బయ భీభత్సాలను ప్రదర్శించారు. స్వరాజ్య కాంక్షతో వీరోచితమైన పోరాటాలు కూడా కవి వర్ణించారు.

మూడోరంగం కాళికాదేవి పూజతో ప్రారంభమౌతుంది. మరల దేశభక్తి గీతంతో వీరులు జూలు విదళించిన సింహాల్లా గర్జిస్తే, రవి గ్రుంకని బ్రిటిష్ సామ్రాజ్యమే కాదు రవి ఏలే నభోంతరాళం కూడా దద్ధరిల్లిపోవలసిందే! ఆహా! స్వతంత్ర బారత్‌కీ జై అనే నినాదాలతో అక్కడ కొండగుహలు ప్రతిధ్వనించాయి. అంతేకాక రామరాజు గంటదొరను పిలిచి అగ్గిరాజు కనబడేడెం అని అడుగుతాడు. చోడవరం దాచి చేసి వస్తుంటే కొండపల్లిని శత్రువులు ముట్టడించి జనాన్ని హింసిస్తూన్నారని తెలిసి, ఎర్రేశు ఎనకేసుకొని వెళ్ళడు అని గంటం చెబుతారు. దానికి సమాధానంగా రామరాజు అగ్గిరాజు స్వభావాన్ని వివరిస్తూ…

అతడిది దుందుడుకు మనిషి తెలుసా? అతడు మన పితూరీలో కెలా వచ్చి కలిసాడో గుర్తుందా? సహాయ నిరాకరణోద్యమమే అతనికి సంకుచితమై తెల్లవాడునే వాడితలే నరకాలను తత్వంతో మనలో చేరాడు. తలలు నరికితే విప్లవాలు వర్ధిల్లుతాయా? వొట్టి దుందుటకు తనం గాక అతని చర్యవల్ల మన పితూరీ అరాచకం పాలు కాకూడదు. ఇంటి దీపమని ముద్దు పెట్టుకుంటే మూతికాలుతుంది గంటం” అని రామరాజు పలికెను.

అగ్గిరాజు స్వభావాన్ని మరియు ప్రతిచర్య హింసాత్మకంగా ఉన్న విప్లవం కాదు అని విప్లవం అంటే ఎదుటివారిలో మార్పు తీసుకురావడం అని విప్లవం అనగా ప్రతీది హింసామార్గం వైపు వెళ్ళడంకాదు. దుష్టచర్యలను, అన్యాయాలను ఎదిరించడం, పోరాటం చేయడం అని రామరాజుతో కవి పలికించాడు. మన కర్తవ్యం బ్రిటిష్ వారి చంపడం కాదు. స్వాతంత్ర్యోద్యమ పోరాటంలో దేవ బానిస సంకెళ్ళను విడిపించడం అనే సూక్ష్మమైన

అర్థాన్ని కవి వివరించాడు.

ఈ రంగంలో కూడా రత్తితో కాళికాదేవి ముందు దేవభక్తితో ఒక విప్లవ గీతంలో నృత్యం చేస్తుంది. రచయిత కల్పించిన రత్తి పాత్ర ప్రతి రంగంలో కీలకమైన భూమిని పోషిస్తుంది. నాటకానికి రక్తి కట్టించే పాత్రగా రూపుదిద్దారు.

బ్రిటిష్‌వారితో యుద్ధానికి సిద్ధమైన రామరాజును పడాలు వర్ణిస్తూ......

గంటం : అబ్బ మీ ముఖం చూస్తేనే నెత్తురుజృంభిస్తోంది రాజా

పడాలు : నెత్తురు కాదు, హరణ్యకశిపుని వధించిన నాటి నారసింహుడు జరసంధుని చెండాడిన నాటి బీమసేనుడు సైంధవుని తలత్రుంచిన నాటి అర్జునుడు..... అని రామరాజును పొగడ్తలతో ముంచుతుంటే వెంటనే రామరాజును చాలు చాలు అని ఇంకెన్నుడు స్తుతించకు మనిషిని నిలువునా పూడ్చగలదీ ముఖస్తుతి" అని హెచ్చరించాడు.

ఇంతలో ఆ కొండ గుహల చుట్టూ బ్రిటిష్ సైన్యం చుట్టుముట్టింది. రామరాజు విషయం తెలిసి ఎక్కడివారక్కడే చెదిరిపోయి ప్రతి గుట్టకీ, పుట్టకీ, చెట్టుకీ ఒక్కొక్కడగ అవాహించండని రామరాజు వ్యూహం పన్నేడు. మీకు శీంగనాదాలు వినిపించగనే కాల్చండి అని ఆజ్ఞాపించాడు.

కవర్టు, హైటరులతో యుద్ధం చేస్తూ గెరిల్లా దళంగా యుద్ధ నిపుణవ గూర్చి చెబుతూ......

పడాలు : పాదలకు పాగాలు

మల్లు : ఎందుకంట.

రాజు : సెబాష్ పడాలు, మొనగాడనని పెంచుకున్నావ్. చతురతో శివాజీని మరిపిస్తున్నావ్. అనాడు శివాజీ కూడా యిలాగే పోదలకు పాగాలు చుట్టి ఒక గెరిల్లా దళంగా శత్రువును మచ్చపెట్టి దెబ్బకొట్టాడు.

మల్లు : భలే పన్నాగం పన్నింటవే!

రాజు : ఇప్పుడర్థమైందా మల్లూ! వాటిని చూడగానే ఆ సైన్యాలు కంగారుగా వెనక్కి వస్తాయ్. అవచ్చిన సైన్యాలను నేనా ప్రక్కవాగులోకి మళ్ళిస్తా అరుగో శింగన్న చెప్పిన కవర్టు, హైటర్ వాళ్ళు అయివుంటారు. వాళ్ళ పని నీవు గంటం పట్టండి..."[42] అని రామరాజు ప్రణాళికను సిద్ధం చేస్తాడు.

ఈ రంగంలో కూడ యుద్ధ సమయంలో శృంగనాధం చేయగా ఒక దేశభక్తి గీతంతో విప్లవ సైన్యంలో చైతన్య తీసుకురావడానికి, పాఠకులకు ఉత్తేజపరచడానికి కవి అలరించాడు. ఆ ఉత్తేజముతో రామరావణ యుద్ధం మించి పోయింది. కవర్టు, హైటర్‌లు చనిపోయారు. ఆ వెంటనే ఒక ఉత్సాహ భరితమైన గీతంతో విజయోత్సవం చేసుకుంటారు.

శత్రువులైన బ్రిటిష్ వాళ్ళు వీరసైన్యంను, వారి సాహసమును కీర్తిస్తూ......

"గుడాల్ : వాట్‌ల కరేజ్? వాట్ఏన్ ఎడ్వంచర్? హేనుగుల్లాంటి కవర్టు, హైటర్‌లను కూల్చివేసినారు. ఇంతటి పరాక్రమవంతులను ఎందునూ మేము చూచి వుండలేదు.... బాస్టియన్.

బాస్టియన్ : ........ సార్.

గుడాల్ : నీకు తెలియదు పితూరి దారుల సాహసంలో వీసమెత్తు మీలో ఉన్న యెడల ఏనాడో యీ పితూరీని స్మాష్ చేసి వుండెడివారము తెలిసినదా?"[43] అని గుడాలు మన్యం సైన్య పౌరుషాన్ని, ప్రతాపాన్ని కీర్తించెను. రామరాజు సైన్యాన్ని, అతని యుద్ధ నైపుణ్యాన్ని ఎదుర్కొనలేక బ్రిటిష్ వారు ఒక పథకం ప్రకారం రామరాజును బెదిరించుటకు గుడాలు సిద్ధమైన సందర్భంలో...

"ఆ బాస్కర్రావు గాదా సీతారాంరాజుకు మొదట ఆశ్రయమిచ్చానాడట. అతను జంటిల్‌మెన్ ఆటగాదా! అతడి మాటకు సీతారాంరాజు అడ్డుచెప్పడని కూడా తెలిసినది. మనము ఓడిపోయితిమని సీతారంరాజుకు స్వయంగా ఎక్స్యూజ్ చేప్పుకొనెదమని ఇతడిని నమ్మించినచో ఇతడే అతడిని ఒప్పించి మన వద్దకు పంపును... వాడు వచ్చును...

చచ్చును..."[44] అని గుడాల్, బాస్టియన్‌ల పథకం ప్రకారం బందించుటకు నిర్ణయించడంతో మూడవ అంకం ముగుస్తుంది.

ఈ రంగంలో యుద్ధ వాతావరణం ఎక్కువ కనిపిస్తుంది. కవర్ట్, హైటర్‌లు మరణిస్తారు. విప్లవ సైన్యం మరింతగా బలపడి, బ్రిటిష్ వ్యవస్థను నాశనం చేయుటకు నడుంబిగిస్తారు. అక్కడక్కడ దేశభక్తి గీతాలతో, కాళిక ప్రజలతో రత్తి గోవిందుల హాస్య సన్నివేశాలతో కవి పాఠకుల్ని రజింపజేశాడు.

నాల్గవ రంగంలో రత్తి జానపద గీతంతో ప్రారంభమౌతుంది. రత్తి, గోవిందుల సంసార జీవితం, ప్రణయ కలహాలు చక్కగా వర్ణించాడు. గంటం దొర వీరి ప్రేమ వ్యవహారాన్ని చూసి "మన్యమంతా వుడికెత్తిపోతుంటే శత్రువు సైన్యాలలో వూళ్ళవూళ్ళన్నా ముంచెత్తుతుంటే, నీ కిక్కడ ప్రేమ కలాపాలా? పిచ్చివాడా! స్వేచ్ఛ స్వతంత్ర మున్నప్పుడే పేమకు సుఖం. రాజుగారి సంగతి నీకు తెలీదు. నీకంటే అందరికంటే ఘనంగా పంచప్రాణాలతో ప్రమించారొక అమ్మాయిని..."[45] అంటూ రామరాజు ప్రేమించిన కథ కూర్చి తెలుపుతూ......

"అవును అదో రహస్యం. ఆయన చదువుకుంటున్నప్పుడే విశాఖపట్నణంలో ఒక ధనవంతుల అమ్మాయిని ప్రేమించారు. కానీ దేశంలో స్వతంత్ర జ్వాలలు అలుముకుటుంన్నాయి. స్వతంత్ర పోరాటంలో ఒక స్త్రీ ప్రేమ ప్రధానం కాకూడదను కున్నారు.... రంగంలో కురికారు. మరెన్నడూ ఆమాటే తలపెట్టలేదు". ఐతే గుర్తుకు ఆమె పేరును తనలో కలుపుకుని రామరాజు "సీతారామరాజు" అయ్యారు.. అని రత్తి గోవిందులకు గంటం దొర వివరించెను.

అయితే సీత పాత్ర కూడా కేవలం కల్పితం. చరిత్ర లేదు. స్వాతంత్ర్యపోరాటాన్ని విప్లవ సైన్యాన్ని, రామరాజు సాహసాన్ని ఎక్కువగా నాటకంలో చూపించారు. సీత పాత్రను గాని, వారి ప్రేమ వ్యవహారాన్ని గాని ఎక్కడ చూపలేదు. అందుచే కవికి ఉన్న స్వరాజ్య కాంక్ష, దేశభక్తి అర్థమౌతుంది. సీత పాత్ర లేకపోయిన రామరాజు యొక్క స్వాతంత్రధారణకు మూలంగా పేర్కొన్నాడు. అంతే కాకుండా వీరవనిత రత్తి సాహసం గూర్చి రామరాజు పలుకుతూ.....

"మట్టిలోంచి మాణిక్యాలు పుడతాయ్. పంక నుండే పువ్వు పుట్టింది. ప్రజల్లోంచే మహావీరులు పుడతారు. వొట్టి నిరక్షరాస్యులలో చరిత్ర ప్రసిద్ధికెక్కిన వీరవనిత వెందరు లేరోయ్. ఎక్కడి వరకో ఎందుకు మన రత్తి ఏమంటావ్! మట్టిలోంచి పుట్టిన మాణిక్యం కాదంటావా?..."[46] అని రత్తిపై ప్రశంసల జల్లు కరిపించాడు.

కొండపల్లి, నడింపాలెం గ్రామాల్లో అల్లకల్లోలం సృష్టింటి, రత్తియింటిపై పడి విప్లవ సైన్యం అచూకి చెప్పమని నానాహింసలుచేసి, బట్టలు విప్పి, వికట్టాహాసం చేసిన బ్రిటిష్ అధికారులు. అప్పుడు రత్తి దండెంపై లంగా లాగి కట్టుకొని పైట లేకుండా గంద్రుగొడ్డలితో పిళ్ళై తలపై వేసింది. ఆ దెబ్బ జారి వాడి భుజంపై పడింది. వాడు వెంటనే పెద్ద కేకలు వేయడంతో బాస్టియన్ కాల్చాడు రత్తికి తగలవలసిన గుండు గోవిందు ఆ తుపాకి గుండుకు అడ్డువచ్చాడు. ఆ గుండు అతడి శిరస్సులో దూసుకుపోయింది. రత్తీ.... రత్తీ.... అంటూ మరణిస్తాడు. ఈ మరణంలో కూడా కవి ఒక విషాద గీతాన్ని వినిపించి పాఠకుల హృదయానికి విషాద రసాన్ని కూడా రుచి చూపించాడు.

గోవిందు మరణాన్ని వీరమరణంగా రామరాజు కీర్తిస్తూ......

"ఏడవకు రత్తి! గోవిందు ఎక్కడకీ విడిచిపోలేదు. దీపాన్ని కాంతీ, పుష్పాన్ని పరిమళం విడిచిపోతాయా? పోవు. ఈ మన్యం బ్రతికున్నంత వరకు గోవిందు పేరు చెరగదు. ఇకముందు ప్రతీ పనికే మన కుద్రేకం, ఉత్తేజం గోవిందేనమ్మా"[47] అని అతని జ్ఞాపకాన్ని, అతని వీరత్వాన్ని గుర్తుచేసుకుంటారు.

గోవిందు మరణించాడు. అగ్గిరాజు దొరికిపోయాడు. ఎర్రెశు చనిపోయాడు. ఇలా సైన్యంలో ఒక్కొక్కరు రాలిపోతున్నారు. అప్పుడు శింగన్న వచ్చి రామరాజుతో మిమ్మల్ని బాస్కరావుగారు కలమన్నరని కబురు చెబుతాడు. ఒక్కొక్క యోధుడు ఒరిగిపోతున్నారు. పితూరీ రథ చక్రం గతుకుల్లో దిగబడిపోతుంది. గ్రహించి రామరాజు. ఈ రంగంలో రత్తీ సాహసం, గోవిందు మరణం, సైన్యంపలో వీరులు రాలిపోవడం, రామరాజు బ్రిటిష్‌వారితో మంతనాలకు వెళ్ళడంతో ఈ రంగం ముగుస్తుంది.

ఐదవ రంగంలో విప్లవ సైన్యానికి సమాచారం అందిస్తున్న శింగన్నను గుడాలు

చంపుతాడు. తర్వాత గంటం దొరను కాల్చుతాడు. గంటం కొన ఊపిరితో పడాలును పిలుస్తాడు. వారి మధ్య సంభాషణ....

"గంటం : పడాలు నేనింక బ్రతకను

పడాలు : కాదు బ్రతకాలి, నా నెత్తురిచ్చి నిన్ను బ్రతికించుకుంటాను

గంటం : కాదు పడాలు, నీ నెత్తురు రాజు కియ్, ఆయన బ్రతకాలి. మన్యం కోసం ఆయన బ్రతికి తీరాలి. ఆయన్ని మాత్రం కంటికి రెప్పలా కాపాడుకో... నా... ప్రాణం"[48] అంటూ మరణిస్తాడు.

పై సంభాషణలో నీ స్వార్థంతో తమ ప్రాణాలను త్యాగం చేస్తూ రామరాజుకు అండగా నిలవమని దేశభక్తిని ప్రదర్శించిన పాత్ర గంటందొర. ఇక మన్యం దీపం ఆరిపోయినట్టే, మన్యం బాధల్ని హాలహలంగా మ్రింగిన ఒక మధురకంఠం మూగ పోయినట్టే, మన్యం మానవత్వం మానసం, సత్యం, ధర్మ ఆకళింపుకున్న ఓ మహాకాండ కూలిపోయినట్టే అని కవి వర్ణించిన తీరు విషాదకరమైనది.

ఆ వెంటనే పడాలు బ్రిటిష్ వారిపై విరుచుకుపడి తుపాకి తీసి కాల్చడం మొదలు పెట్టాడు. రెండు నిముషాలు భీకర కాల్పులు జరిగాయి. తమ తుపాకిలో గుళ్ళు అయిపోయాయి. నా కండబల మింకా చావలేదు. మీ మరణ హోమం ఇకపై సాగదు అని గండ్రగొడ్డలితో లేచాడు లోనికి వెళ్ళాడు. చాటునుండి గుడాల్, బాస్టియన్ ఒక్కసారిగా అతనిపై కాల్పులు జరిపారు. గట్టి దెబ్బతగిలింది. అమ్మా... రాజా అని కుప్పకూలిపోయాడు. ఈ విధంగా పడాలుని దొంగ దెబ్బతో చంపడం ఈ అంకంలో విషాదఛాయలు అలుముకొన్నట్లు కవి వివరించాడు.

గుడాలు, బాస్టియన్, పిళ్ళై మొదలైన వారి ప్లాన్ ప్రకారం రామరాజు సంధి కొరకు వచ్చిన సందర్భంలో గుడాలు పలికిన మాటలు....

సీతారామరాజు ఆంధ్రా టైగర్ అని వినియుండ లేదా! టైగర్ సింగల్‌గా ఎదుటకే

వచ్చి పోరాడును... శత్రువు చేత కథానాయకున్ని పొగడ్తలతో కీర్తించు విధానం

పాఠకులను రంజింపచేయుటకు కవి వర్ణించాడు.

ఈ నాటకంలో చివరి ఘట్టం అద్భుత సన్నివేశాలతో కవి అలరించిన విధానం.....

“రామరాజు : రాజీకని పిలిచి బయట ఫిరంగులెందుకు?

గుడాలు : రాజీకని వచ్చిన నీ చేతిలో కత్తి ఎందుకు?

రాజు : సరి ఇప్పుడే చూడగలను– నీ నిజాయితీ యిదిగో ముందుగానే నేనే అస్త్ర సన్యాసం చేసున్నా (ఖడ్గాన్ని ఎదుట పారవేశాడు) ఇక మీ రివాల్వర్లు క్రింద పారేయండి. బయట మర ఫిరంగుల్ని తొలగించండి...”[49] అని పలికిన రామరాజును బందించండి అని గుడాలు ఆజ్ఞాపించడంతో ఒకవైపు బాస్టియన్ మరొక వైపు పిళ్ళై వచ్చి బిగించి పట్టుకుంటారు.

రామరాజు ఎంతమోసం ఓటమి నొప్పుకొని, క్షమాపన చెప్పుకుంటానని రప్పించి ఒక నిరాయాధుడ్ని బంధిస్తావురా! నీచుడా! అని పలికిన వెంటనే గుడాలు నీవు బందిపోటువు కాబట్టి అందుకే బందించాం అన్న గుడాలు మాటలకు రామరాజు ఏమన్నావ్. దేశం కాని దేశంలో పుట్టి దేశం కాని దేశం మెట్టి దేశదేశాన్ని కొల్లగొట్టే గజ బందిపోట్లు మీరూ! అని దుమ్మెత్తిపోస్తూ ఆంధ్రపౌరుషాన్ని ప్రతాపాన్ని తెలుపుతూ......

“ఏమిటి కూసావ్ గుడాల్, పారిపోయే పిరికి వాళ్ళం మేమా? రాజీకని రప్పించి కాల్చడానికి తయారవుతున్నవే ఇది పిరికితనం కాదా!” మీ కలెక్టరు రూథర్ మా పల్నాటి వీరహనుమంతును రాజీకని పిలిచి చంపినది పిరికి తనంతో కాదంటారా! ఓ నరరూప రాక్షసుడా! అటులనే నన్ను వొంటరివాడ్ని చేసి కాల్చాలని చూస్తున్నావేమో జాగ్రత్త. నీవు కాల్చే ఆ కాల్పులకు నా గుండోల్లోంచి చిందే ప్రతి రక్తపు బిందువు మృత్యువును కోరే కోటాను కోట్ల అల్లూరి సీతారామరాజులై వెలుస్తారు. ఆ వెలసిన వీరుల కత్తి దెబ్బలకు సిద్ధపడితే కాల్చురా, ఇదేరా తెలుగుబిడ్డ గుండె ఇదేరా సీతారామరాజు గుండె, నీరాజకీయాలలో ధర్మమే వుంటే రారా కాల్చు...”[50] అని ధైర్యంతో గుడాల్‌ని హెచ్చరించాడు.

వారిద్దరి మధ్య జరిగిన మాటల పోరాటంలో తెలుగుతేజాన్ని, వీరుల్ని మాతృదేశం

కోసం చేసిన దేవభక్తులను గూర్చి రామరాజు తెలుపుతూ........

"అడుగడుక్కీ రుధిర తర్పణ చేసి శతపోరు సాగించిన మాకట్టబొమ్మ నాయకుని కత్తివ్రేటులు అప్పుడే పాతబడిపోయాయా? మొక్కవాని క్షాత్ర తేజంతో రణంచేసి కనబడిన మీసీమ దొరనల్లా తెగనరికిన మాకోయ రాముని మరిచిపోయారా? మీ ముప్పేట దాడుల నుండి మూడు రోజుల హోరా హోరీ పోరు సల్పి మీ చివరి నెత్తుటి చక్కని కూడా చవిచూచిన మా ద్వారా బంధాల చందయ్య మీ స్మృతి పథంలో మెలగడం లేదా! మీ శిరస్సులను త్రుంచి నిజాం నవాబుకు కానుకగా బట్టి పంపిన మా తెలంగానా వెంకటయ్యను మీ కళముందు నుండి అప్పుడే తుడిచేసుకున్నరా?..."[51] అని ఒక్కొక్క వీరుడు గూర్చి చెబుతుంటే గుడాల్‌కి చెప్పలేని కోపం వచ్చి తుపాకితో కాల్చివేసిరి.

ఆ తూటాల వర్షంలో రామరాజు శరీరం రక్తమడుగులో తడిసి కొన ఊపిరితో...." రేపు ముక్కోటి సీతారామరాజు తమ నలభై కోట్లు తమ్ములతో మీపై పగ సాధిస్తారు. భరత గడ్డ నుండి సమూలంగా మిమ్ము తుడిచేస్తారు. అప్పుడు నా దేశం స్వతంత్ర మవుతుంది... వందేమాతరం... ప్రాణాలు అంటూ ప్రాణాలు విడిచాడు. ఆ తర్వాత ప్రకృతి కూడా సహకరించకుండా పెళపెళార్బటులతో భూమి దద్ధరిల్లింది. మేఘాలు ఉరిమాయి. వెంటనే రత్తి వచ్చి రామరాజు మృత దేహంపై పడి రోదిస్తుంది. ఆ సన్నివేశంలో ఒక విషాద గీతం......

"రాలి పోయెనుగదా సీతారామరాజు
తళ తళ మెరసి రాలిన తారకను బోలి
మ్రింగివేసెను గదా వెలుగు వెదజల్లిన
పున్నమి చంద్రునే గరళ ఫణీంద్ర మొకటి
మునిగిపోయెను గదా నీ పతనము కేతన
దేశమే ఒక దు:ఖార్ణవమున..."[52] అంటూ యావత్తు ఆంధ్ర దేశమంతా శోక సముద్రంలో మునిగిపోయింది.

ఈ నాటకంలో ఇతివృత్తం చరిత్రకు చాలా దగ్గరగా ఉంది. సీతారామరాజు ఏజెన్సీ ప్రాంతానికి రావడం గాం సోదరులు, పడాలు, సింగన్నలతో పరిచయం

పెంచుకోవటం తన ఉద్యమ లక్ష్యాన్ని వారితో చర్చించి వారిని ఉద్యమానికి ఒప్పిస్తాడు. రాజు అనుచరవర్గంలో ఆంగ్లేయులపై దాడి ప్రారంభిస్తాడు. ఈ దాడిలో కవర్ట్, హైటర్‌లు మరణిస్తారు. వీరి మరణంతో మేజర్ గుడాల్ బ్రిటిష్ బలగాన్ని అప్రమత్తం చేసి రాజు అనుచరుల్ని ఒక్కొక్కరినే దెబ్బ తీస్తూ చివరకు రాజును కాల్చి చంపుతాడు.

కానీ ఈ నాటకంలో ఐదవ రంగంలో అల్లూరి సీతారామరాజు తనంతట తానుగా మేజర్ గుడాల్ దగ్గరకి పోయి పోరుకు సిద్ధమవ్వడం చరిత్రకు దూరంగా ఉంది.

ఎలాగంటే మంప ప్రాంతంలో సీతారామరాజు స్నానం చేస్తుండగా ఆంగ్లేయులు పట్టి బందించారనడం చరిత్రక సత్యం. అంతేగాక అక్కడ స్థానికుల కథనం కూడాను మరి చరిత్ర తెలిసిన రచయిత రామరాజే స్వయంగా గుడాల్ దగ్గరికి ఖడ్గ ధారియై పోవటం అతను అదే అదునుగా తలచుకుని కాల్చి చంపడమనే విషయాన్ని గమనిస్తే బహువా ఈ రచయిత అల్లూరి సీతారామరాజు పాత్రను ధీరోధాత్తయైన పాత్రగా మలచాలనే ఉద్దేశ్యంతో ఇలాంటి సంఘటనను చెప్పించి ఉండవచ్చు. అల్లూరి సీతారామరాజు అంతట మహా వీరుణ్ణి త్యాగిని, తేజో చల సంపన్నుని ఆంగ్లేయుల చేత బంధింపనీకుండా తనకు తానుగా పట్టుబడే విధంగా చిత్రించి రామరాజు పాత్రకు వన్నె తెచ్చారని భావించుకోవాలి.

నాటకంలో స్త్రీ పాత్ర రత్తి. ప్రతి అంకంలోని ఆమెతో ప్రారంభమయింది. నాటకం. చివరిఘట్టం కూడా ఆమెతో మగుస్తుంది. సీతారామరాజు మరిణించిన తర్వాత కూడా ఆ పాత్రతో నాటకం ముగింపు చేశాడు. పోరుకు, ప్రతీకగా, కథా గమనాన్ని సూచించడమే కాక నాటక శిల్పానికి జీవం పోశాడు.

“తరతరాల దాస్యంతో తనువుల కరిగిపోతున్నాయి. ఇకనైనా మేలకొంటే రేపుమీది” అనే సిద్ధాంతిక పునాది గల చరిత్ర అల్లూరి సీతారామరాజు జీవితం. అందుకే యౌవనం విరిసి విరియక ముందే స్వార్థ పూరిత ఆంగ్ల కర్కశ తుపాకీ గుండ్లకు బలైన, ధీరుడు అల్లూరి సీతారామరాజు యొక్క స్వీయ దేశాభిమానం, త్యాగ రీతులు ఆంధ్రులందరికీ ఆదర్శమార్గాలు, యువతకు అనుసరణీయాలు, భావితరాలకు బోధనలు, జాతీయతకు చిహ్నాలు.

**ముగింపు:**

ఈ విధంగా అల్లూరిపై వచ్చిన నాటకాల్ని, ప్రదర్శన యోగ్యతల్ని, సంభాషణ శైలిని, నాటకరచన ఔన్నత్యాన్ని ఉదాహరణలతో సహా సమీక్షించాను.

# పాదసూచికలు

| | | | |
|---|---|---|---|
| 1. | సీతారామరాజు మరణం కారణం | – ఖండవల్లి రాజారాం | పుట I |
| 2. | ॥ | ॥ | పుట 1,2 |
| 3. | ॥ | ॥ | పుట 4 |
| 4. | ॥ | ॥ | పుట 5 |
| 5. | ॥ | ॥ | పుట 6 |
| 6. | ॥ | ॥ | పుట 6 |
| 7. | ॥ | ॥ | పుట 7,8 |
| 8. | ॥ | ॥ | పుట 9 |
| 9. | ॥ | ॥ | పుట 9,10 |
| 10. | ॥ | ॥ | పుట 11 |
| 11. | ॥ | ॥ | పుట 13 |
| 12. | ॥ | ॥ | పుట 19 |
| 13. | ॥ | ॥ | పుట 24 |
| 14. | పడాల రామారావు | – నాటకం | పుట III |
| 15. | ॥ | ॥ | పుట III |
| 16. | ॥ | ॥ | పుట IV |
| 17. | ॥ | ॥ | పుట 1 |
| 18. | ॥ | ॥ | పుట 9 |
| 19. | ॥ | ॥ | పుట 11 |
| 20. | ॥ | ॥ | పుట 12 |
| 21. | ॥ | ॥ | పుట 13 |
| 22. | ॥ | ॥ | పుట 15 |
| 23. | ॥ | ॥ | పుట 17 |
| 24. | ॥ | ॥ | పుట 18 |
| 25. | ॥ | ॥ | పుట 19 |
| 26. | ॥ | ॥ | పుట 27,28 |
| 27. | ॥ | ॥ | పుట 28 |

| | | | |
|---|---|---|---|
| 28. | 〃 | 〃 | పుట 29,30 |
| 29. | 〃 | 〃 | పుట 30,31 |
| 30. | 〃 | 〃 | పుట 32 |
| 31. | 〃 | 〃 | పుట 33 |
| 32. | 〃 | 〃 | పుట 34 |
| 33. | 〃 | 〃 | పుట 35 |
| 34. | 〃 | 〃 | పుట 37,38 |
| 35. | 〃 | 〃 | పుట 38 |
| 36. | 〃 | 〃 | పుట 40 |
| 37. | 〃 | 〃 | పుట 45 |
| 38. | 〃 | 〃 | పుట 45 |
| 39. | 〃 | 〃 | పుట 48 |
| 40. | 〃 | 〃 | పుట 59 |
| 41. | 〃 | 〃 | పుట 64 |
| 42. | 〃 | 〃 | పుట 68 |
| 43. | 〃 | 〃 | పుట 73 |
| 44. | 〃 | 〃 | పుట 76 |
| 45. | 〃 | 〃 | పుట 80 |
| 46. | 〃 | 〃 | పుట 83 |
| 47. | 〃 | 〃 | పుట 88 |
| 48. | 〃 | 〃 | పుట 98 |
| 49. | 〃 | 〃 | పుట 101 |
| 50. | 〃 | 〃 | పుట 102 |
| 51. | 〃 | 〃 | పుట 103 |
| 52. | 〃 | 〃 | పుట 104 |

# 4) నవలలు - అనుశీలన

## 4.0:

ఆధునిక సాహిత్యంలో నవల ప్రక్రియలకున్న ప్రాధాన్యం వర్తమాన సమాజంలో ఎంతో పెరుగుతూ వస్తుంది. ఈ క్రమంలో అల్లూరి జీవితాన్ని నవలలుగా కూడా తీర్చిదిద్దడం కనిపిస్తుంది. వీరిపై వచ్చిన పడాల రామారావు, గోపరాజు నారాయణరావు వంటి వారి నవలల్ని, ఆయా నవలల్లో ఒదిగిపోయిన రామరాజులోని జాతీయోద్యమ భావజాలాన్ని వివరించిన విధానాన్ని ఈ అధ్యాయంలో తెలియపరిచాను.

## 4.1 పడాల రామారావు:

పడాల రామారావుగారు ఈ చారిత్రక నవలను 1946వ సంవత్సరంలో మొదలుపెట్టి 1949వ సంవత్సరానికి జైలులో పూర్తి చేశారు. 1957వ సంవత్సరంలో ప్రథమ ముద్రణ పొందింది. 1983వ సంవత్సరం నాటికి ఎనిమిది ముద్రణలు వెలువడ్డాయి. 9వ ముద్రణ 7-5-1987వ తేదీన జరిగింది. ఈ చారిత్రక నవలలో 38 అధ్యాయాలు వున్నాయి.

### 4.1.1 అల్లూరి సీతారామరాజు కథా సంగ్రహం:

"అల్లూరి సీతారామరాజు 04.07.1897వ తేదీ సాయంత్రం భీమునిపట్టణానికి సమీపంలో వున్న పాండ్రంగి గ్రామంలో అమ్మమ్మగారి ఇంట్లో జన్మించారు. అల్లూరికి తమ్ముడు, చెల్లెలు వున్నారు. సాధుశీలముగల సూర్యనారాయణమ్మ, వెంకటరామరాజు వీరి తల్లిదండ్రులు. ఈయన ఫొటోగ్రాఫర్ వృత్తిని చేపట్టాడు. రాజమహేంద్రవరంలో స్థిరపడ్డారు. సీతారామరాజు బాల్యం ఆనందంగా గడిచింది. వీరి తండ్రి కరలాసోకి ఆకస్మికంగా మరణించారు. రాజు తండ్రి మరణించినపుడు నాన్నయ్యా! మాకు చదువులు ఎవరు చెప్పించెదరు అని విలపించాడు. చదువు కోసం సీతారామరాజు తల్లి దగ్గర, పినతండ్రి వద్ద ఉండి భీమవరం, రామచంద్రపురం, కాకినాడ, విశాఖపట్నం, తుని పట్టణాల్లో చదువుకున్నాడు. సీతారామరాజు బాల్యంలోనే దేశభక్తి భావాలు గలిగివుండేవాడు. ఇతడు ఆంగ్ల విద్యను బానిస విద్యగా భావించాడు. సంప్రదాయ విద్యలపైనే ఎక్కువ మక్కువ చూపేవాడు. ఆయుర్వేదం, జ్యోతిషం, గుర్రపు స్వారీ, ధనుర్విద్య, యోగాభ్యాసం మొదలయిన విద్యలు నేర్చుకొన్నాడు."[1]

సీతారామరాజుకు ఈ దేశం నుంచి తెల్లదొరల్ని పారద్రోలాలన్న కోరిక బలంగా వుండేది. అల్లూరి 1914వ సంవత్సరంలోనే ఉత్తర దేశాటన చేశాడు. సీతారామరాజు మీద సుభాష్ చంద్రబోస్ ప్రభావం గాఢంగా పడింది. వీరసావర్కర్ విప్లవ చరిత్రకు ఆకర్షింపబడ్డాడు. విప్లవవీరుడు కర్తార్ సింగ్ చరిత్రకు ఉత్తేజితుడైనాడు. జతీంద్రనాథ ముఖర్జీనీ ఆదర్శంగా తీసుకున్నాడు. తండ్రి లేని ఇంట్లో పెద్ద కొడుకునే సోదరీసోదరులు తండ్రిగా భావిస్తారు. కుటుంబ బాధ్యతల్ని స్వీకరించవలసిన సీతరామరాజు దేశమాత స్వేచ్ఛ కోసం వలసవాదుల్ని ముప్పతిప్పలు పెట్టించాడు. దానికి "శ్రీరామ విజయనగరము" అని పేరు పెట్టారు. రాజుకు తల్లిపై అపారమైన భక్తి విశ్వాసాలుండేవి. ఆమె ఆనందం కోసం, తన మనశ్శాంతి కొరకు ఆమెను తన సన్నిధికి రప్పించుకొని కుటుంబానికి సకల వసతులు కల్పించాడు. తల్లి ఇతనికి వివాహం చేయాలని ప్రయత్నించింది గాని అందుకు రాజు అంగీకరించలేదు. ఆశయ సిద్ధికి ఆటంకం లేకుండా జీవితాంతం బ్రహ్మచారిగానే వుండదలచాడు.

అమాయకులైన ఆటవికుల జీవితాలపై రాజు దృష్టి క్రమంగా మరల సాగింది. వాళ్ల సమస్యల్ని చక్కదిద్దేవాడు. వాళ్ళ కష్టనష్టాల్ని తొలగించడానికి ప్రయత్నించేవాడు. అల్లూరి విశాఖమన్నెంలో పంచాయితీ కోర్టులు స్థాపించాడు. త్రాగుడు మాన్పించాడు. అడవిలో అందరూ ఐకమత్యంగా జీవించాలని చెప్పాడు. గిరిజన గ్రామాల్లో అల్లూరి తీర్పును శిరసావహిస్తు ఇతనిని గౌరవించేవారు. అనారోగ్యంతో బాధపడే గిరిజనులకు మూలికా వైద్యం చేసేవాడు. తెల్లదొరల నిరంకుశ పాలన గురించి గ్రామగ్రామానికి తిరిగి బోధించేవాడు. బ్రిటీష్ అధికార్లు, ముఠాదార్లు, మున్సబులు మన్నెం ప్రజల్ని నానాబాధలు పెట్టేవారు.

"చింతపల్లి ఘాట్‌రోడ్ నిర్మాణపనుల్లో విశాఖ ఏజన్సీ ప్రజలు కండలు కరిగించి రాల్చిన చెమట బిందువులకు తగిన కూలీ ముట్టేదికాదు. గిరిజనుల పశువులు మేసే చీళ్లకు కంచె వేయించారు. గిరిజనులు స్వేచ్ఛగా అనుభవించే అడవుల్ని సర్వే చేయించారు. గిరిజనులు సాగుచేసే భూముల్ని ముఠాదార్లకప్పగించారు. కొండల మీద పోడు వ్యవసాయం చేసినా, బీడులో పశువుల్ని మేపించినా, అడవిలో చెట్లు నరికినా సంకెళ్లు వేసి లాకప్‌లో పడేసి క్రూరంగా శిక్షించేవారు. గిరిజన స్త్రీలపై బలవంతంగా అత్యాచారాలు జరిపేవారు. మన్నెం ప్రజలు తాము పడే బాధలు గురించి రాజుకు చెప్పేవారు."[2]

మన్నెంలో తహశీల్‌దార్‌గా పనిచేసే బాస్టియన్, ఘాట్‌రోడ్ ఓవర్సీయర్‌గా పనిచేసే

పితూరీల అకృత్యాల్ని అల్లూరి మీద బాస్టియన్ పంపిన రిపోర్టులను బట్టి పై అధికార్లు రాజును అనుమానించి అతనిపై సెక్యూరిటీ కేసు పెట్టారు. ఆ ప్రాంతపు రోడ్ల మరమ్మత్తును గుత్తకు తీసుకొన్న పెదవలస మున్సబు ఎండుపడాలును బాస్టియన్ మోసగించాడు. నడింపాలెం మొఖాసాదారులగు గాంసోదరులు గంటందొర, మల్లుదొరల భూములను బాస్టియన్ స్వాధీనం చేసుకొన్నాడు. గూడెం ముఠాదారుడు వీరయ్య దొరను అరెస్టు చేయించాడు. అట్టి అధికారుల క్రూరకృత్యాలవల్ల గిరిజనుల హృదయాలు కుతకుత ఉడికాయి. మన్నెం ప్రజల్లో నానాటికీ అశాంతి, అసంతృప్తి పెరిగాయి. వారి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకై రాజు దీక్షకంకణధారి అయ్యాడు. వారికి దేశభక్తిని ప్రబోధించాడు. అన్యాయాల్ని, అక్రమాల్ని, అధికారుల దోపిడీ విధానాన్ని ఎదిరించాలని చెప్పేవాడు. సీతారామరాజు అక్కడ వుంటే మన్యంలో విప్లవం వస్తుందని అనుమానించి ఇతని మకాము అచ్చట నుండి మార్చాలని పై అధికారులు నిశ్చయించుకున్నారు.

అధికారులు ఎంత ప్రయత్నించినా ప్రజల నుంచి అల్లూరికి వ్యతిరేకంగా సాక్ష్యాలు లభించలేదు. వారి నిర్ణయాన్ని అనుసరించి తన తల్లిని తమ్ముని తునిలో బంధువుల ఇంటికి పంపి రాజు వేరొక బండిపై నర్సీపట్నం వెళ్లాడు. అక్కడ తహశీల్దార్ ఇంటి వద్దనే ఇతనిని వారం రోజులు నిర్బంధంలో వుంచారు. ఒక రోజు తుని వెళ్లి తల్లిని, తమ్ముడిని ఇతర బంధువులను చూచి వచ్చాడు. మన్నెపు ప్రజల తిరుగుబాటు తప్పించుటకై ఏజన్సీ కమీషనరు ఇతని నిర్బంధాన్ని తొలగించి మకాం అడ్డతీగల ప్రాంతానికి మార్పించారు. రాజు పినతండ్రి రామకృష్ణంరాజుగారి స్నేహితుడు పోలవరం డిప్యూటీ కలెక్టరు అయిన ఫజులుల్లాఖాను రాజు ఆదర్శాలను మెచ్చుకొని తహశీల్దారుతో చెప్పి అడ్డతీగలకు దగ్గరగా జడేరు ఒడ్డున వున్న పైడిపుట్ట అను గ్రామంలో 50 ఎకరాల భూమిని ఇతనికి ఇప్పించాడు. అక్కడ రెండు పాకలు వేయించి తల్లిని తమ్ముని అక్కడకు రప్పించాడు. ఆ ప్రాంతపు తహశీల్దారు యతిరాజులు నాయుడు ఇతని కుటుంబానికి కావలసిన ఆహారపదార్థాలు పంపేవాడు. పాడికి రెండు ఆవులను వ్యవసాయానికి రెండు ఎడ్ల జతలను పంపి కావలసినవి ఏర్పాటు చేశాడు. ఇతని చర్యలను రహస్యంగా పోలీసులు తెలుసుకొనేవారు. డిప్యూటీ కలెక్టరు అయిన ఫజులుల్లాఖాను ఈయనకు అభిమానించేవాడు. ఆ అభిమానాన్ని బట్టి నేపాల్ వెళ్లి గండకీ నది నుండి సాలగ్రామాన్ని, శివలింగాన్ని తెచ్చుకోవడానికి కలెక్టరు అనుమతి పొంది పోలీసుల నిఘా తప్పించుకున్నాడు. ఆనాటి నుండి సీతారామరాజు మన్యం ప్రజల సంక్షేమానికి తెల్లదొరల అధికారాన్ని అంతమొందించడానికి తిరుగుబాటుకు శంఖం పూరించాడు. గెరిల్లా యుద్ధ ప్రయత్నాలు

చేయడం మొదలుపెట్టాడు. 1922వ సంవత్సరం జూన్ నెలలో తల్లిని తమ్ముని నరసాపురం పంపించాడు ఆ సమయంలోనే విప్లవాన్ని ప్రారంభించాడు. మన్యం ప్రజలు విప్లవవీరులై ధైర్యసాహసాలతో ఈ వీరాగ్రగణ్యుని అనుసరించారు.

కార్యరంగంలో అవసరమైతే ప్రాణాలు అర్పించటానికైనా సిద్ధపడి పోరాడే వీరవరులైన సాహసికులు అనేకులు రాజుకు అండగా నిలిచారు. రాజుకు అండగా నిలిచిన వారిలో గంటందొర, మల్లుదొరలు ముఖ్యులు. మన్నెంలో మహావీరులను తయారుచేసి సీతారామరాజు తెల్లదొరల ఆధిపత్యాన్ని అంతమొందించడానికి సమరానికి సంసిద్ధుడయ్యాడు. రాజు సర్వదళ అధ్యక్షుడుగా వుండి దళ సభ్యులకు, దళ నాయకులకు గెరిల్లా యుద్ధ విద్యల్లో శిక్షణ ఇచ్చి, మహావీరులుగా వారిని తయారు చేశాడు. వీరిలో కొంతమంది తుపాకీ కాల్పుల్లో నేర్పరులు. ధనుర్విద్యయందు కొంతమంది నేర్పరులు. కత్తియుద్ధంలో మరొకొందరు నేర్పరులై వుండేవారు. వీరు తెలుపు, ఎరుపు రంగుల లాగులు, చొక్కాలు ధరించేవారు. కొందరు గూఢచారులుగా విశ్వాసంతో శత్రు సమాచారాలు అందచేయుచుండేవారు కొంతమంది స్త్రీలు ఆహారపదార్థాలు సేకరించి అందిస్తూ వుండేవారు. రాజు అతని అనుచరులు లక్ష్యసాధన కొరకు రాత్రి సమయాల్లో కూడా అరణ్యాల్లో తిరుగుచుండేవారు. వ్యూహాలు పన్నుటలో, ఎత్తులకు పై ఎత్తులు వేయుటలో రాజనీతిలో, కార్యసాధనలోను రాజుకువున్న చాతుర్యం అసమానమైంది. అధర్మాన్ని, అన్యాయాన్ని, అక్రమాన్ని రూపుమాపి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సాధించుటకై మన్నెం ప్రజల్ని మేలుకొల్పాడు గంటందొర మల్లుదొర మొదలగు నాయకులతో చర్చించి విప్లవ ఆరంభానికి సుముహూర్తం నిర్ణయించాడు.

“19.08.1922వ తేదీన చింతపల్లి పోలీసుస్టేషను ముట్టడికి నిశ్చయించుకున్నారు. విప్లవవీరులు తాము దాడి చేయడానికి వచ్చే సమయాన్ని తెలుపుచు ఒక చీటీలో రాసి, దానిని ఒక మిరపకాయతో కలిపి బాణమునకు కట్టి చేరవలసిన చోటికి పంపించేవారు. అది ఎక్కడ నుండి ఎలా వచ్చిందో తెలియక అధికారులు ఆశ్చర్యపడేవారు. ఆ టపా చూసి ప్రభుత్వాధికారులు చాలా భయపడేవారు. అదే సీతారామరాజు మిరపకాయ టపాగా పేరుగాంచింది. అపారమైన సైనికశక్తి గల బ్రిటీష్ ప్రభుత్వానికి ఎదిరించి పోరాడుటకై అవసరమైన తుపాకులు సేకరించడానికి సీతారామరాజు పూనుకున్నాడు.”[3]

22.08.1922వ తేదీన బయలుదేరి మొట్టమొదటి చింతపల్లి పోలీసు స్టేషనుపై గంటందొర, మల్లుదొర, పడాలు, వీరయ్య, ఎర్రేసు మొదలగు విప్లవవీరులతో కలిసి

సీతారామరాజు దాడి చేశాడు. ఆయుధాగారంలో వున్న తుపాకులు సేకరించుకొన్నాడు. 23.08.1922వ తేదీన విప్లవ వీరులతో కలిసి కృష్ణదేవిపేట పోలీసు స్టేషనుపై దాడి చేశాడు. అక్కడ కూడా ఆధునిక ఆయుధాల్ని సేకరించుకున్నాడు. తర్వాత 24.08.1922వ తేదీన అర్ధరాత్రి సమయంలో రాజవొమ్మంగి పోలీసుస్టేషనుపై విప్లవ వీరులు ముట్టడించారు. ఆ స్టేషను నుండి కూడా ఆయుధాలను సేకరించాడు. విప్లవవీరులు విజయోత్సాహంతో గూడెం కొండలు చేరుకున్నారు. అపజయాలను ఎంతో అవమానంగా భావించి రెట్టించిన పట్టుదలతో బ్రిటీష్ సేనానులు విప్లవ వీరులను పట్టుకోవడానికి ప్రణాళికలు వేశారు. డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ చింతపల్లిలో వుండి ప్రభుత్వ సేనానులకు తగిన సూచనలు ఇస్తుండేవాడు. ఏజన్సీ కమీషనర్ నర్సీపట్నంలో మకాం వేసి సైనిక కార్యకలాపాలు పర్యవేక్షించేవాడు. సాండర్సు చాడ్విక్, టాల్బట్, కవర్టు హైటరులను సేనానులుగా నియమించారు. ఒక్కొక్క సేనాని యొక్క ఆధీనంలో 40 మంది సుశిక్షితులైన సైనికులను వుంచారు.

అడ్డతీగలకు ఈవేవింగ్‌ను, కొయ్యూరుకు డాసన్‌ను, కృష్ణాదేవిపేటకు ఫోర్బెస్ కీవ్‌లను, గొర్తేడుకు హ్యూమ్‌ను లమ్మసింగుకు మార్టిన్‌నూ నియమించి పంపారు. విప్లవకారులు 24.09.1922వ తేదీన ఆహార పదార్థాల కొరకు దమనపల్లి గ్రామం వస్తారని బ్రిటీష్ సైనికాధికారులకు తెలిసింది. వారిని తుదముట్టించడానికి కవర్టు, హైటరులు సైన్య సమేతంగా బయలుదేరి ఘాట్ మార్గంలో చేతుల్లో పిస్తోళ్లు పట్టుకొని మధ్యాహ్న సమయంలో నడిచి వెళ్తున్నారు. విప్లవ వీరులు తుపాకులతో పొదలమాటున పొంచియున్నారు. గాముకొండ, ధారకొండల మధ్యనున్న లోయలోకి వచ్చేసరికి అకస్మాత్తుగా బ్రిటీష్ సైన్యంపై భయంకర ధ్వనులతో పైనుండి బండరాళ్లు పడ్డాయి. ప్రక్కల నుండి తుపాకులు పేలాయి. గోకిరి ఎర్రేసు గురిచూచి కాల్చిన తుపాకీ గుండ్లకు కవర్టు, హైటర్లు కూలాపోయి వాగులోకి దొర్లి మరణించారు. విప్లవ వీరులను హతమార్చడానికి ధీరులుగా బయలుదేరిన కవర్టు హైటర్లు 24.09.1922వ తేదీన ఆ విప్లవవీరుల తుపాకీ గుండ్లకు గురియై ఈ విధంగా నేలకొరిగారు. మరణించిన కవర్టు హైటర్లకు నర్సీపట్నంలో నాటి బ్రిటిష్ ప్రభుత్వం కట్టించిన సమాధులు విప్లవ వీరుల సాహసకృత్యాలకు సాక్ష్యాలుగా నేటికీ నిలిచి వున్నాయి.

బ్రిటిష్ అధికారులకు ముందే తెలియజేసి సీతారామరాజు విప్లవ వీరులతో కలిసి 15.10.1922వ తేదీన అడ్డతీగల పోలీసుస్టేషనుపై రాత్రి 10 గంటలకు దాడి చేశారు.

19.10.1922వ తేదీన సాయంత్రం 4 గంటలకు విప్లవకారులు రంపచోడవరం స్టేషనును ముట్టడించారు. ఈ ముట్టడి తర్వాత రాజు తన అనుచరులతో కలిసి సాయంత్రం 5 గంటలకు రంప చోడవరం నుండి వెళ్ళిపోయాడు. స్వజాతీయులైన అధికారులు పట్టుబడినపుడు అనుకూల భావాలున్న వారికి గౌరవించి విడిచిపెట్టేవాడు. 06.12.1922వ తేదీన జాన్‌చార్స్ ముగ్గురు భారతీయ అధికార్లు, 56 మంది పోలీసు ఆఫీసర్లూ సైన్యాన్ని వెంటబెట్టుకొని కృష్ణదేవిపేట నుండి బయలుదేరి గొలుగొండ చేరుకొన్నారు. ప్రభుత్వ సైన్యం తమ దగ్గరకు వచ్చినట్లు విప్లవకారులు తెలుసుకొని వరి చేలలో దాక్కొన్నారు. తమను చూడకుండా ముందుకు సాగిన సైన్యంపై వీరు హఠాత్తుగా చేల నుండి కాల్పులు జరిపారు. విప్లవ వీరులపై సైనికులు కాల్పులు సాగించారు. ఆ యుద్ధంలో విప్లవ వీరులు నలుగురు మరణించారు. మరికొందరు గాయపడ్డారు. ఇది విప్లవవీరులకు మొదటి అపజయం. ప్రభుత్వ సైన్యానికి తొలివిజయం.

స్వీనీ సైన్యాన్ని వెంటబెట్టుకొని వెన్నెలరాత్రిలో భయంకరమైన అరణ్యంలో పట్టుదలతో ప్రయాణం చేసి వెదకి చివరకి అర్ధరాత్రి సమయంలో ఒక ఏరు దగ్గర బండరాళ్ల మధ్య వున్న విప్లవవీరుల స్థావరాన్ని సైనికులు కనుగొని ఆకస్మికంగా తుపాకులు పేల్చి గుండ్లవాన కురిపించారు. అంతవరకూ విశ్రాంతి తీసుకొంటున్న విప్లవవీరులు కూడా సన్నద్ధమై ఎదురుకాల్పులు జరిపారు. ఆ అర్ధరాత్రి యుద్ధం ఒక గంటసేపు భయంకరంగా సాగింది. గుండ్ల దెబ్బలకు సీతారామరాజు శయ్యకూడా తూట్లు పడింది మిగిలిన సహచరులతో తప్పించుకొన్నాడు. ఆ భీకర సంగ్రామంలో ఎనమండుగురు విప్లవ వీరులు ప్రాణత్యాగం చేశారు. చాలామంది గాయపడ్డారు. నిద్రపోతున్న సమయంలో విప్లవవీరులకు గట్టి దెబ్బ తగిలింది. అప్పటి వరకు అజేయులుగా వున్న విప్లవవీరులు పరాజయాన్ని చవిచూచారు. ఏజన్సీ కమీషనరు హిగ్గిన్స్ సీతారామరాజును పట్టుకొన్న వారికి పదివేల రూపాయలు, మల్లుదొరను పట్టుకొన్న వారికి వేయి రూపాయలు, ఇతర విప్లవ వీరులలో ఎవరిని పట్టుకున్నా ఏబది రూపాయలు బహుమతిగా ఇస్తామని ప్రకటించాడు.

బ్రిటీష్ సైనికాధికార్లు పన్నిన వ్యూహాలు విప్లవకారులు ఏవైపునకూ వెళ్లడానికి వీలుకాకుండా చేశాయి. విప్లవ వీరుల జాడ కొంతకాలం తెలియలేదు. 17.03.1923వ తేదీన సీతారామరాజు నలుగురు అనుచరులతో కలిసి అన్నవరం పోలీసుస్టేషనుకు వచ్చాడు. విప్లవవీరులకు ఆ పోలీసు స్టేషనులో ఎట్టి ఆయుధాలు దొరకలేదు. రాజు

అన్నవరం సత్రపు నూతి వద్ద స్నానం చేసి అన్నవరం సత్యనారాయణస్వామిని దర్శించుకొన్నారు. ఆ మహాధీరుడు వచ్చినట్లు ప్రజలకు తెలిసింది. లెక్కకు మిక్కిలిగా ప్రజలు వచ్చి రాజును గౌరవించారు. అన్నవరంలో చెరుకూరి నరసింహమూర్తిగారు రాజుతో జరిపిన సంభాషణ 21.04.1923వ తేదీన ఆంధ్రపత్రికలో ప్రకటించబడింది. అన్నవరం ప్రజలు రాజుకి ఖద్దరు వస్త్రాలు, ధనం, పండ్లు ఇచ్చి సత్కరించుకొన్నారు. యుద్ధంలో చెదిరిపోయిన విప్లవవీరులు కొందరు తిరిగివచ్చి అక్కడ రాజును కలుసుకొన్నారు. అల్లూరిని అన్నవరం, శంఖవరం ప్రజలు ఆదరించిన సంగతి తెలిసి జిల్లా కలెక్టరు కోపించి వారికి నాలుగు వేలు రూపాయలు జరిమానా విధించారు.

"ఈ విషయం తెలుసుకున్న రాజు కలెక్టరుకు మిరపకాయ టపా పంపాడు. ఈ వార్త 19.04.1923వ తేదీన హిందూపత్రికలో ప్రకటింపబడింది. 03.05.1923వ తేదీన విప్లవకారులు ఒక గూఢచారి జవానును పట్టుకొన్నారు. తమ శిబిరానికి తీసుకుపోయి కొన్ని ప్రశ్నలు అడిగి అతనిని విడిచిపెట్టారు. వీరు ఒక గ్రామం నుండి మరొక గ్రామానికి తిరుగుతూ వున్నారు పోలీసు దళాలు వీరిని పట్టుకోవడానికి వెదకుతూ వున్నారు. స్వీనీ ఏజన్సీ చర్యల అధికారిగా జూన్ ప్రారంభంలో బాధ్యతలు స్వీకరించి విప్లవకారుల కొరకు గాలింపజేశారు."[4]

విప్లవవీరులు 10.06.1923వ తేదీన ధారకొండ వచ్చి అక్కడ నుండి కొండ కంబేరుమీదుగా మల్కనగిరి వెళ్లాడు. రాజు సాయుధులైన 100 మంది అనుచరులతో 07.07.1923వ తేదీన దుచ్చర్తి వెళ్ళాడు. దుచ్చర్తి నుండి బూదరాళ్ల, దొడ్డవరం, బందమామిడి మొదలగు గ్రామాల్లో తిరిగి కావలసిన ఆహార సామాగ్రి సేకరించుకొన్నారు. 09.07.1923వ తేదీన కింగ్ కొంతమంది పోలీసులతో బయలుదేరి చోడవరం వెళ్ళి అక్కడ కనిపించిన విప్లవకారులపై కాల్పులు జరిపాడు. విప్లవకారులు అడవిలో కనిపించకుండా పోయారు. ప్రభుత్వ సైన్యాలకు ఆహారపదార్ధాలను తీసుకొని వెళ్లుతున్న బండ్లను 29.07.1923వ తేదీన 80 మంది విప్లవకారులతో అగ్గిరాజు అడ్డగించి 600 శేర్ల బియ్యం పట్టుకుపోయారు. తర్వాత యడ్లమామిడి దగ్గర 8 మంది అనుచరులతో కనిపించిన రాజుపై పోలీసులు కాల్పులు జరిపారు. కాని వారు పట్టుబడకుండా అదృశ్యులయ్యారు. అగ్గిరాజు ఉద్యమ కార్యక్రమాల్లో అల్లూరికి ఎంతో చేదోడువాదోడుగా వుండేవాడు. మహా సాహిసియైన మల్లుదొర సీతారామరాజు అనుచరుల్లో ముఖ్యుడు. మల్లుదొరను నడింపాలెంలో 17.09.1923న తేదీ రాత్రి 11 గంటలకు పట్టుకున్నారు.

అతనిని విశాఖపట్నం సెంట్రల్ జైల్లో పెట్టి హింసించి విప్లవ రహస్యాలు తెలుసుకోవడానికి అధికార్లు విశ్వ ప్రయత్నం చేశారుగాని లాభం లేకపోయింది. 12.05.1924వ తేదీన ఉరిశిక్ష విధించారు. అతను అప్పీలు చేసుకోగా ఆ ఉరిశిక్షను ద్వీపాంతవాస శిక్షగా మార్చి అతనిని అండమాను పంపారు.

రత్తి గోవిందులు ఉద్యమానికి బాసటగా నిలిచారు. ఉద్యమంలో గంటందొరకు కుడిభుజంగా నిలిచాడు గోవిందు. గంటందొర ఆస్తిని స్వాధీనం చేసుకున్నారు. భార్యనూ, కూతుర్నీ అడవుల పాల్జేశారు. అయినప్పటికీ మన్నెం స్వేచ్ఛ కోసం పరితపించాడు. లక్ష్యసాధనలో నిమగ్నమయినాడు. గోదిందు గుడిసెలో సీతారామరాజు వున్నట్లు తెలుసుకున్న సైనికులు గోవిందు ఇంటిని ముట్టడించారు. ఇంట్లో వున్న గంటం, గోవిందులు సాయుధులై సైనికులతో పోరాడుతూ నేలకొరిగారు. మన్యం మానసాన్ని మూర్తీభవించుకున్న ఆ ఇరువురి యోధుల మరణంతో సీతారామరాజు బలగం బలహీనపడింది.

విప్లవకారులు పాడేరు పోలీసుస్టేషనుపై 22.09.1923వ తేదీన దాడి చేశారు. తర్వాత విప్లవ వీరులు 26.10.1923వ తేదీన గూడెం సైనిక స్థావరంపై దాడి చేశారు. విప్లవాన్ని అణచివేయడానికి ప్రభుత్వం 17.04.1924వ తేదీన మన్య ప్రాంతానికి స్పెషల్ కమీషనరుగా రూథర్ ఫర్డును నియమించింది.

"బ్రిటీష్ అధికార్లు విశాఖ మన్నెంలో సైనిక చర్య జరపడానికి నిశ్చయించారు. 27.01.1924వ తేదీన అస్సాం రైఫిల్స్ నర్సీపట్నంచేరింది. మలబారు పోలీసు దళం, అస్సాం రైఫిల్స్ పదఘట్టనలతో మన్యం గ్రామాలు కంపించిపోయాయి. ఇన్‌స్పెక్టర్ ఉపేంద్ర పట్నాయక్ మలబారు స్పెషల్ పోలీసుల్ని వెంటబెట్టుకొని 06.05.1924వ తేదీన విప్లవకారుల్ని పట్టుకోవడానికి పూనుకొన్నాడు."[5]

విప్లవవీరులు కంఠారం దగ్గర ఏనుకులోని కొలికల బాలయ్య ఇంట్లో సమావేశమయ్యారు. ఉద్యమానికి ప్రతికూలురయినప్పటికీ భారతీయుల్ని చంపకూడదని ఆ సమావేశంలో నిర్ణయించారు. వీరయ్యదొర వయసులో ఉద్యమకారులందరి కంటే పెద్దవాడు. ఆ వయస్సులో కూడా అల్లూరిని అనుసరిస్తూ వున్నాడు.

అస్సాం రైఫిల్స్‌కు సైనిక అధికారి గుడాల్. ఇతడు విప్లవవీరుల్ని మట్టు బెట్టడానికి అస్సాం రైఫిల్స్‌ను వెంటబెట్టుకొని విశాఖ మన్నెంలో వున్న కొండపల్లి వద్దకు చేరుకున్నాడు. సిపాయిల్ని ఉద్యమకారులు చూశారు. సిపాయిల చేతుల్లో ఆధునిక మారణాయుధాలున్నాయి.

విప్లవవీరులు కాల్పులు జరుపుకుంటూ వెనక్కి తగ్గుతున్నారు. అస్సాం సిపాయిలు కాల్పులు జరుపుకుంటూ ముందుకు సాగుతున్నారు. ఉద్యమకార్లు సెలయేటిని దాటుకుంటూ అడవిలో ప్రవేశించారు.

సీతారామరాజు మంపలో వున్నట్లు తెలుసుకొని సైనికులతో గుడాలు మంప చేరుకొన్నాడు. ఏటిలో స్నానం చేసి సంధ్యార్కునికి అర్ఘ్యంపడుతున్నాడు సరిగ్గా ఆ సమయంలోనే గుడాలు సైనికులతో వచ్చి బంధించి సీతారామరాజుపై కాల్పులు జరిపాడు. మన్నెం స్వేచ్ఛ కోసం అవతరించిన మహనీయుడు 'వందేమాతరం' అని పలవరించి పరమపదించాడు.

## 4.1.2 సమీక్ష:

ఆధునికాంధ్ర సాహిత్యంలో జాతీయోద్యమ ప్రభావంతో ఈ నవల 20వ శతాబ్ది ద్వితీయ పాదంలో వచ్చింది. ఉద్యమ నేపథ్యంలో వచ్చిన నవలా సాహిత్యంలో పేరెన్నికగన్న నవలగా సాహిత్యలోకం మన్ననలు పొందింది. ఈ నవల్లో ఇతివృత్తం ఉత్తరాంధ్రలోని విశాఖ మన్నెంలో జరిగిన రంప ఉద్యమానికి సంబంధించింది. జాతీయోద్యమంలో భాగంగా 20వ శతాబ్ది తొలిపాదంలో జరిగిన సహాయ నిరాకరణోద్యమానికి సమాంతరంగా ఈ ఉద్యమం జరిగింది. ఈ ఉద్యమం మొదట సహాయ నిరాకరణతోనే ఆరంభమైనట్లు స్పష్టంగా నవల్లో కన్పిస్తుంది. మన్నెంలో గిరిజనులు కల్లునిచ్చే జీలుగుచెట్టుకు సుంకం, పల్లపునేల్లో చేసే సేద్యానికి భూమిశిస్తు బ్రిటీష్ ప్రభుత్వానికి చెల్లించకుండా ఉద్యమిస్తారు. గిరిజన తిరుగుబాటు నేపథ్యంలో వచ్చిన ఈ నవల్లో దానికి ఏమాత్రం తీసిపోని జాతీయోద్యమం కూడా చోటు చేసుకుంది.

స్వాతంత్ర్యానికి పూర్వం రచించబడిన ఈ నవలపై జాతీయోద్యమ ప్రభావం ప్రత్యక్షంగా ఉందని స్పష్టమవుతుంది. సాహిత్యం సమాజానికి దర్పణం వంటిది. సాహిత్యంపై ఉద్యమాల ప్రభావం గురించి మొదలి నాగభూషణ శర్మగారు "ఏ ఉద్యమమైనా సాహిత్యం మీద తన ప్రభావాన్ని రెండు విధాలుగా ప్రభావితం చేస్తుంది. ఒకటి ప్రత్యక్ష ప్రభావం. ఉద్యమం జరుగుతూ ఉండగా ఆ ఉద్యమ విశేషాలను, దాని ప్రాముఖ్యాన్ని ఎప్పటికపుడు ప్రజలకు చూపుతూ వ్రాయడం, ఉద్యమ నాయకులను తమ రచనలలో పాత్రలుగా స్వీకరించడం ప్రత్యక్ష ప్రభావ లక్షణాలు. ఆ ఉద్యమం ఆనాటి సంఘం మీద లేదా కొందరి వ్యక్తుల మీద ఎట్టి ప్రభావాన్ని కలుగచేసిందో చూపడం

పరోక్ష ప్రభావానికి నిదర్శనం అని చెప్పారు. ఈ నవల్లో ఉద్యమం జరిగిన తీరుకంటే ఆ ఉద్యమం నాటి యువతీయువకుల్ని ఆకర్షించినట్లు చిత్రించిన తీరు హృద్యంగా వుంది.

నవల చారిత్రకమైనప్పటికీ నవలా రచయిత చారిత్రక సత్యాలకు కొంత దూరంగా కల్పనలకు మరీ దగ్గరగా రచన సాగింది. నవల్లో సీతారామరాజు తన తల్లికి రాసిన లేఖలో "అమ్మా! మన్య సోదరులు కృష్ణదేవిపేట రెండేర్ల మొగలో నాకో ఆశ్రమాన్ని నిర్మించి పెడుతున్నారు. అక్కా, తమ్ముడు, నీవు వచ్చి నన్నాశీర్వదించాలి" అని రచయిత రాశారు పొన్నలూరి రాధాకృష్ణమూర్తిగారు రాసిన అల్లూరి సీతారామరాజు జీవిత చరిత్రలో వెంకటరామరాజు, సూర్యనారాయణమ్మ దంపతులకు ప్రథమ సంతానంగా అల్లూరి, ద్వితీయ సంతానంగా చెల్లెలు సీతమ్మ, తృతీయ సంతానంగా తమ్ముడు సత్యనారాయణలని రాశారు. సీతారామరాజు పినతండ్రి, తల్లి తమ్ముడు జీవించి వుండగా పొన్నలూరి వారి వద్దకు వెళ్ళి సీతారామరాజు బాల్య విశేషాల్ని తెలుసుకొని రాసిన గ్రంథాన్ని ప్రామాణికంగా భావించాలి కాబట్టి సీతారామరాజుకు అక్కలేదు. అల్లూరి సీతారామరాజు చారిత్రక నవల రాసిన పడాల రామారావుగారు అల్లూరి జీవిత చరిత్రను సమగ్రంగా పరిశీలించలేదని చెప్పవచ్చు.

ఉద్యమంలో సీతారామరాజుకు కుడిభుజంగా వున్న గంటందొర అల్లూరి కంటే ముందు మరణించినట్లు ఈ నవల్లో పడాల రామారావుగారు రాశారు. వాస్తవానికి సీతారామరాజు 7.5.1924వ తేదీన అస్తమించాడు. సరిగ్గా అల్లూరి అస్తమించిన నెలరోజులకు అనగా 7.6.1924వ తేదీన ఉద్యమంలో సైనికులతో పోరాడి గంటందొర వీరమరణం చెందాడు. సీతారామరాజు తర్వాత ఉద్యమంలో ప్రముఖవీరుడు గంటందొర. దీనివల్ల పడాలవారు కల్పనలకు ఇచ్చిన ప్రాధాన్యత వాస్తవాలకు ఇవ్వలేదని చెప్పవచ్చు.

నాటి ఆర్యుల నుంచి నేటి ఆంగ్లేయుల వరకు విదేశీలయుల క్రింద భారతీయులమైన మనం బానిసలుగా బతకడానికి అలవాటు పడ్డాం. మనలో వున్న విభేదాలు విడిచి ఐకమత్యంతో అందరం కలిసి వున్నప్పుడే తెల్లదొరల్ని పారద్రోలగలమన్న ఆలోచనల్ని నవల్లో నాయకుడైన సీతారామరాజు పాత్ర ద్వారా వ్యక్తపర్చడం వల్ల రచయిత రాజకీయావగాహన మనకు స్పష్టమవుతుంది.

ఈ నవల్లో అల్లూరిని అతివాద నాయకుల ఆలోచనల్ని ఆదర్శంగా తీసుకొని పోరాటంతోనే స్వాతంత్ర్యం సిద్ధిస్తుందని విశ్వసించిన వీరుడుగా పడాల వారు చిత్రించారు. అంతేగాకుండా అల్లూరి ముఖ్య అనుచరులైన గంటందొర, మల్లుదొర, పడాలు, వీరయ్య,

ఎర్రేసు, అగ్గిరాజులను ఎంతో అభిమానంగా చిత్రించడంలో విప్లవ వీరులపై నవలా రచయితకు వున్న గౌరవభావం విదితమవుతున్నాయి.

నవల్లో రత్తీగోవిందుల పాత్రల్ని ప్రణయానికి, దేశభక్తికి ప్రతీకలుగా రచయిత చిత్రించారు. రత్తీ, గోవిందులు కల్పిత పాత్రలు. వీరు ప్రేమమూర్తులే కాక త్యాగశీలురు. ఆ త్యాగం కూడి మన్నెం స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసమేనని ఆ పాత్రల్ని రచయిత సృష్టించడం ప్రశంసించదగ్గ విషయం.

ఈ నవల్లో కుటుంబ బాంధవ్యాలు వ్యక్తుల ప్రవృత్తులు చిత్రిస్తూనే, మరోవైపు వ్యక్తుల్ని, సంఘంపట్ల వాళ్లకు గల బాధ్యతలను రచయిత చక్కగా చిత్రించాడు. కథా కథనం పరిశ్రమ పద్ధతిలోనే సాగింది. జాతీయోద్యమానికి సంబంధించిన విషయాలు, రంప ఉద్యమ ఘట్టాలు స్పష్టంగా చెప్పడం కుదరలేదు. భారతదేశ ఔన్నత్యంతో కథ మొదలై అల్లూరి అస్తమయంతో ముగిసింది. నవల్లో నాయకుడైన సీతారామరాజు పాత్రకు అధిక ప్రాధాన్యం ఇవ్వబడింది. అందువల్లనే నాయకుని పేరు నవలకు నామకరణం చేయడం సముచితంగా వుంది.

### 4.1.3 రచనా శిల్పం:

**ప్రవేశిక:**

రచయిత భావాలకు రూపకల్పన 'రచన' అయినపుడు దానిని సంపూర్ణమైన కళాఖండంగా తయారుచెయ్యడానికి రచయిత ప్రదర్శించే ప్రతిభా, నేర్పరితనం చాకచక్యం వీటన్నింటి సమాహార స్వరూపాన్నే శిల్పం అనవచ్చు. శిల్పి శిలను మలచి అద్భుతమైన శిల్పాన్ని చెక్కినట్లుగానే రచయిత కూడా తాను తీసుకున్న ఇతివృత్తాన్ని తన కథాకథన సామర్థ్యంలోను, వర్ణనా కౌశలంతోను, పాత్రచిత్రణా నైపుణ్యంతోనూ, లోకానుభవంతోను ప్రతిభాచేతను ఓ కళాఖండంగా తీర్చిదిద్దడాన్నే స్థూలంగా 'రచనా శిల్పం' అనవచ్చు.

**కథాకథనం:**

రచయిత రచనకు ఆధారం కథ అయితే దాన్ని చెప్పే పద్ధతిని కథనం అని చెప్పవచ్చు. రచయితకు గల ప్రజ్ఞను, అనుభవాన్ని అనుసరించి ఈ కథనం వుంటుంది. నవలలోని కథాకథన పద్ధతి ఆయా రచయితల అభిప్రాయాల్ని అనుసరించి వైవిధ్యవిలసితమవుతుంది. రచయిత తనకుతానుగా కథను నడిపించాడా? లేక తాను ఊహించిన భావాన్ని పాత్రల ద్వారా చెప్పించాడా అన్నది కథన శిల్పం. ఈ కథన

శిల్పంలోనే రచయిత కూర్పు నేర్పులు ప్రస్ఫుటమవుతాయి. ఒక రచయిత ప్రతిభను కొలవడానికి సరయిన కొలబద్ద కథాకథన శిల్పం అనవచ్చు.

కథాకథన పద్ధతి రెండు విధాలుగా వుంటుంది. మొదటిది పరాశ్రయ పద్ధతి. రచయిత ప్రథమ పురుషలో కథను నడిపించడం రచయిత తాను ప్రచ్ఛన్నంగా వుండి చెప్పదలచుకొన్న కథను పాత్రల ద్వారా సూటిగా, సాఫీగా చెబుతూ అవసమని తోచినపుడు ఆయా పాత్రల గురించి కాని సంఘటనల్ని గురించిగాని, సన్నివేశాన్ని గురించి కాని పాఠకులకు తెలియచేస్తుంటాడు. అంటే రచయిత ఎక్కువగా సంబంధం పెట్టుకోకుండా పాత్రల చేతనే కథను నడిపిస్తాడన్నమాట ఈ పద్ధతి ఎక్కువగా చారిత్రక నవలల్లో కనిపిస్తుంది.

రెండోది ఆత్మాశ్రయ పద్ధతి. ఈ పద్ధతిలో ప్రధాన పాత్ర చేతనే కథ చెప్పించడం జరుగుతుంది. ఇది ఉత్తమ పురుషలో సాగుతుంది. ఆత్మాశ్రయ నవలల్లో రచయిత కూడా అప్పుడప్పుడు ప్రవేశించి ప్రధాన పాత్రను వర్ణించడం కద్దు. కానీ రచయిత ప్రవేశానికి ఇందులో అవకాశం తక్కువ. అయితే పరాశ్రయ పద్ధతిలో రచయితకు వున్న సౌలభ్యం ఆత్మాశ్రయ పద్ధతిలో కనిపించదు.

పై పద్ధతుల్లో ఏ పద్ధతిని ఆధారంగా చేసుకొని పడాల రామరావుగారి నవల సాగిందో పరిశీలిద్దాం.

"నడపదాటినరాజు కల్లోలిత రాజకీయ మహాసాగరంలో తెరచాపా చుక్కానీ లేని నావలా ప్రయాణం చేయసాగాడు."[6]

ఆనాడు రాజకీయాకాశంలో కారుమేఘాలు క్రమ్ముకున్నాయి. ఏ నిముషంలోనైనా కుంభవృష్టితో భీకర తుఫాను చెలరేగేలా వుంది. ఆ మేఘాలు తెల్లదొరల్ని తరిమివేయాలని గర్జిస్నుణ్నాయి. "స్వతంత్రం" కావాలని ఘోషిస్తున్నాయి. పైన ఉదహరించిన విషయాన్ని చదివిన మీదట రచయిత కథను పాత్ర ద్వారా నడిపిస్తున్నట్లు తెలియవస్తోంది. రామారావుగారు తన నవల్లో పరాశ్రయపద్ధతిని పాటించారు.

### 4.1.4 పాత్రచిత్రణ:

రచనలో ఇతివృత్తానికీ, సన్నివేశ చిత్రీకరణకీ ఎంత ప్రాధాన్యం వుందో పాత్ర చిత్రణకు కూడా అంతే ప్రాముఖ్యం వుంటుంది. నవలలో కథకు మానవ జీవితం

ఆధారమైనట్లే పాత్ర చిత్రణకు వ్యక్తులే ఆధారం. కథా గమనానికి వ్యక్తీకరణకు పాత్రలే సాధనాలు. నవలలో పాత్రను బట్టి కథనం వుంటుంది. ఆ పాత్రల ప్రవర్తనలకు అనుగుణంగానే సన్నివేశ కల్పనలు కూడా చేయబడతాయి. మొత్తం మీద నవలకు ఒక రూపాన్ని, సార్థక్యాన్ని చేకూర్చేది పాత్రలే. అయితే రచయిత పాత్రలను సజీవంగా, వర్ణనాత్మకంగా చిత్రించగల సమర్థుడయితే అవి పాఠకుల హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిపోతాయి. ఇపుడు పడాలవారి నవల్లో పాత్రల్లో పరిశీలిద్దాం.

రత్తీ గోవిందులు అభ్యుదయ భావాలు కలిగిన ఆదర్శ దంపతులుగా కన్పిస్తారు. కులాలకు అతీతంగా పెళ్ళి చేసుకోవడం మొదటి ఆదర్శమయితే పెళ్లి తర్వాత ఉద్యమానికి బాసటగా నిలిచి ఉద్యమం కోసం జీవితాన్ని త్యాగం చేయడం రెండో ఆదర్శంగా చెప్పవచ్చు. ఈ విధంగా ఈ ఇరువురు ఆదర్శపాత్రలుగా కన్పిస్తారు.

మన్నెం స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం నిస్వార్థంగా తమ జీవితాల్ని త్యాగం చేసిన అల్లూరి సీతారామరాజు, గంటందొరలు ఉదాత్త పాత్రలుగా కన్పిస్తారు.

### 4.1.5 వర్ణనలు:

నవల్లో కథతో పాటు వర్ణనలకు కూడా ప్రాధాన్యం వుంది. వర్ణన అంటే వివరించి చెప్పడం. ఏదైనా ఒక విషయాన్ని తీసుకొని రచయిత దానిని సర్వాంగ సుందరంగా మనోరంజికంగా వివరించి చెబితే అది వర్ణన అని చెప్పవచ్చు. వర్ణన వస్తు స్వభావం, స్వభావాలను స్పష్టం చేయడం కోసం ఉద్దేశించబడాలి. ఈ వర్ణన గురించి "ఒక వస్తువు యొక్క సమగ్రస్ఫూర్తిని తత్సంబంధి బహ్వంశములు చేత కలుగజేయు ప్రయత్నమేదికలదో అది వర్ణన" అవుతుందని రామకోటిశాస్త్రి గారు వివరణ ఇచ్చారు. వర్ణనల వల్లనే నవలకు సహజత్వం సిద్ధిస్తుంది. ఏ విషయమైన వర్ణనాత్మకంగా వున్నపుడే ఆ విషయం పాఠకుని హృదయానికి హత్తుకుపోతుంది. "శివుని జటఝూటంలా నడినెత్తిన కొప్పు, మౌళి చుట్టిన మల్లెదండలా ఆ కొప్పుచుట్టూ గవ్వలు! బంగారం ఎచట పుట్టి ఆ పసిడి ఛాయను సంతరించుకుందో, అట్టి మేనిఛాయ! ముఖం మొద్దుగా కనబడుతున్నా, వెన్నముద్దే! పార్వతీదేవిలా ముక్కుననత్తు"![7] అని రచయిత వర్ణిస్తూ ఆ కోయమగువ అందచందాల్ని కళ్ల ముందు రూపుకట్టించారు.

"పక్షులు... రాజును చూసి కలకలారవంతో మంగళగీతికల నాలపిస్తున్నాయి. కొండల కొనల పైని నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి. ఆ ప్రక్క నుంచే... యిసుక తిన్నెలను

కోస్తూ సెలయేరు ప్రవహిస్తోంది. చిన్న చిన్న గులకరాళ్ళు ఆ ప్రవాహంలో దొర్లుతూ... కేరింతలు కొడుతున్నాయి... ఆ సెలయేటి స్వచ్ఛమైన సంగీతాన్ని గ్రోలుతూ రాజు... స్నానం చేస్తున్నాడు" అని ప్రకృతిని హృద్యంగా వర్ణించాడు రచయిత. పక్షుల కిలకిల ధ్వనులు మధురమంగళ గీతాలతోను, నిర్మలమైన నీటితో ప్రవహించే సెలయేటి పాట స్వచ్ఛమైన సంగీతంగాను భావించటం రచయిత వర్ణనా నైపుణ్యానికి మచ్చుతునకగా భావించవచ్చు.

## 4.2 ఆకుపచ్చ సూర్యోదయం:

మన్యం వీరుడుగా బ్రిటీష్ వారి దోపిడీ విధానాన్ని వ్యతిరేఖించిన వారిలో అల్లూరి సీతారామరాజు అగ్రగణ్యుడు. అలాంటి విప్లవ యోధుని జీవితాన్ని పోరాట పటిమను వర్ణిస్తూ "మన్యం వీరుడు అల్లూరి" గాథ ఆకుపచ్చ సూర్యోదయం అనే ఒక నవలను రాశారు. డా॥ గోపరాజు నారాయణరావు దీన్ని 2017 నవంబర్‌లో మొదటి ముద్రణగా, సాహితీ లోకానికందించారు. రెండు వందల తొంభై ఆరు పుటలు గల ఈ సుదీర్ఘ నవలను పద్నాల్గు అధ్యాయాలుగా విభజించారు. దీనికి కొండభట్ల రామచంద్రమూర్తి, పొన్నపల్లి శ్రీరామరావు వకుళాభరణం రామకృష్ణ లాంటి ప్రముఖుల అభినందన ఫిక్షనల్ హిస్టరీ మాన్య చైతన్యం లాంటి శీర్షికలతో పీఠికలనందించారు. ఈ నవల ఆకుపచ్చ సూర్యోదయం పేరుతో సాక్షి దినపత్రికతో, ఆదివారం అనుబంధం 'ఫన్ డే'లో సుమారు ముప్పై మూడు వారాలు ధారావాహికంగా ప్రచురించబడిన చారిత్రక నవల.

ఈ నవలకి "మాన్య చైతన్యం" అనే పీఠిక రాస్తూ పొన్నపల్లి శ్రీ రామరావు.

''నేడు నవలలు వస్తున్నాయి. జీవిత చరిత్రలూ పుంఖానుపుంఖాలే. నారాయణరావుగారి 'ఆకుపచ్చ సూర్యోదయం' రెండింటి లక్షనాల్ని గర్భీకరించుకుంది. సూర్యోదయం ఎర్రని దంటే అందరికీ అర్ధమౌతుంది. ఓహో! ఇదొక విప్లవ నినాదాల పట్టిక అన్నమాట అని! అంతగా అరగదీసేసిన మాట అది! మళ్ళీ తిరగదీసేడంతే! అనేయగలరు కూడా కాని ఇది అది కాదే! మరి ఇది ఆకుపచ్చ సూర్యోదయం! అదిగో ఇక్కడే మేల్కొన్నది. మా నారాయణరావు తాజాకలం నిప్పులు చిమ్ముకుంటూ నింగికెగసి నేలకు పడి ఉసూరుమంటూ ఊరుకోదు. విప్లవంలో ఉన్న నిజాయితీని నిక్కచ్చిగ నిబద్ధీకరిస్తుంది"[8] అని అంటూ ఈ నవల యొక్క గొప్పతనాన్ని కొనియాడిన తీరు తెలుస్తుంది. అల్లూరి జీవితం ఆయన ఆధ్యాత్మిక జీవితాన్ని ఆయన జరిపిన పోరాటాన్ని

వివరించడమే కాకుండా ఆ విప్లవం వెనుక ఉన్న నిజాల్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించారనే విషయాన్ని వెల్లడి చేసిన విధం జ్యోతకమౌతోంది. బ్రిటీష్ సాయుధ దళం వారు అల్లూరి చనిపోయాడని, ఇకపై మీ ఆటలు సాగవని కృష్ణదేవిపేట గ్రామస్తుల్ని హెచ్చరించడంతో ఈ నవలని ప్రారంభమవుతుంది.

## 4.2.1 నవల దృక్పథ ప్రాధాన్యం:

పద్నాలుగు అధ్యాయాలుగల ఈ చారిత్రక నవల్లో సీతారామరాజు జీవితాన్ని ఆయన బ్రిటీష్ వారిపై తిరుగుబాటు బావుట ఎగరేసిన తీరుని, వారి గుండెల్లో గుబులు కలిగించిన విధానాన్ని వివరించారు. అంతేకాకుండా తాను వివిధ ప్రదేశాల్లో పర్యటించి ప్రజల్ని అప్రమత్తం జేసి అనుచరులుగా మార్చుకుని ఆంగ్లేయులపై విరుచుకుపడిన సంగతిని ఈ నవల ద్వారా అందించారు రచయిత.

ఒకటో అధ్యాయంలో విశాఖపట్నం జిల్లా గొలుగొండ తాలూకా కృష్ణదేవి పేటలోని ప్రజల ఆత్మీయ అనుబంధాల్ని గూర్చి తెల్పారు. ఆ గ్రామానికి గొప్ప దానశీలి, పరుల సేవకే తమ కుటుంబం మొత్తాన్ని అంకితం చేసిన గొప్ప వ్యక్తి చిటికెల భాస్కరనాయుడు. ఆయన ఆ ఊరికి పెద్ద దిక్కుగా ఉంటూ ప్రజలకి విద్యాబుద్ధుల్ని, సమాజ హితాన్ని గూర్చి చెబుతుంటాడు. అదే క్రమంలో ఒక రోజు ఆగ్రామానికి ఒక అగంతకుడు నడుచుకుంటూ వస్తూ ఊరి చివరికి వెళ్తుంటాడు. అది గమనించిన భాస్కరనాయుడు. అతన్ని ఒక ఋషిగా, స్వాములోరుగా భావించి తన పినతండ్రి కొడుకు నారాయణమూర్తిని పంపి అతన్ని పిలుచుకురమ్మంటాడు. అలా పిలవడం ఆయన్ని స్వామీజీ అనుకుని భాస్కరనాయుడు తల్లి సోమమ్మ ఎంతో ప్రేమతో ఆదరించడమే కాకుండా అతిథి మర్యాదలు చేస్తుంది. ఈలోపు చిటికెల భాస్కరుడు రావడం. తనను తానుగా పరిచయం చేసుకోడం జరుగుతుంది. భోజనం చేయమంటే తాను అన్నం తిననంటున్నారని సోమమ్మ కుమారునితో చెబుతుంది. ఆ విషయాన్ని అక్కడతో ఆగకుండా దానికి ఆగంతకుడు పాలు, పిళ్లై నా భోజనం ఇది కొన్నాళ్ళుగా నేను పాటిస్తున్న నియమం, బాధపడాల్సిన అవసరం లేదన్నయ్యగారు అని సమాధానమిస్తాడు. కొంతసేపు విశ్రమించమని పలుకుతుంది సోమమ్మ. అదే విధంగా భాస్కర నాయుడు కూడా బయటికి వెళ్తాడు. అలా విశ్రాంతి తీసుకుంటూ ఏవేవో గ్రంథాల్ని పఠిస్తూ ఉంటాడు. అలా నాలుగు రోజులు గడిచిపోతాయి. ఐదో రోజు కోడి కూసే సమయానికి ఆ అగంతకుడు కనిపించబోయే సరికి అందరూ తొందరపడతారు. ఇంతలో ఆ ఇంటి చాకలి స్వాములోరు లేరనే విషయం ఊరంత పాకుతుంది. ఆ విషయం

తెలుసుకున్న నూకాలు అతను నడిచి వెళ్తుండగా చూస్తుంది. ఈ సంగతి తెలియగానే ఆయన వెళ్ళిన దారి గుండా కొంతదూరం వెళ్తుంది. వెళ్తుండగా కొంతదూరానికి తాండవనది సమీపంలో ఆ ప్రాంతం అంతా చాలా విశాలంగా, నిశ్శబ్ధంగా ఉంటుంది. ఆ నది పాయలో ఓ ఆకారం నీళ్ళలో తేలుతుండడం కనిపిస్తుంది. భయపడుతూనే ముందుకెళ్తుంది నూకాలు ఆమెకు–

"మనిషే వెల్లకిలా పడుకుని... సందేహం లేదు. తూర్పు దిక్కుగా ఉంది తల. దీర్ఘ కేశాలు విడవడిపోయి ప్రవాహానికి అనుగుణంగా చెల్లాచెదురై సుతారంగా కదులుతున్నాయి. పద్మాసనంలో ఉన్నట్టు పెనవేసి ఉన్నాయి కాళ్ళు. కలసిన అరచేతులు బొడ్డు దగ్గర కనిపిస్తున్నాయి. నీళ్ళ మీదే శవాసనంలో నిశ్చలంగా మనిషే అవును అతడే ఆ ఆగంతుకుడే"[9] అని తెలుసుకుని ఆ విషయాన్ని భాస్కరనాయుడు తెల్పిన తీరుని కవి తెలియజేశారు. ఆ తర్వాత రామరాజు ఇంటికి తిరిగి రావడం, భాస్కరనాయుడు గ్రామప్రజలకు చెబుతున్న రామయణ, భారత గాథల్ని ఆ ఊరి ప్రజలకు, సవివరంగా బోధిస్తాడు. రామరాజు అనంతరం భాస్కరనాయుడు సీతారామరాజు చదువుతున్న గ్రంథాన్ని ఇమ్మని అడగడం లాంటి సంభాషణ పూరిత విషయాల్ని చక్కగా వర్ణించారు ఆ సందర్భంలో–

"వేదాంత పంచదశి చదువుతున్నట్టున్నారు. ఒక్కసారి ఇస్తే సాయంత్రమే మీ చేతికిస్తాను అన్నారాయన. సంతోషంగా తీసుకువెళ్ళండి అన్నయ్యగారు అన్నాడు. ఆగంతకుడు ఆ సంబోధన ఇప్పుడు చాలా ఆనందం, ఇంకాస్త ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. తన సంచిలో నుంచి రెండు గ్రంథాలను వెలికి తీశాడతడు. ఒకటి వేదాంత పంచదశి ఇంకొకటి శ్రీమద్భగవద్గీత అందులో వేదాంత పంచదశి – శ్రీ విద్యారణ్య ప్రణీతమని అందుకుని కళ్ళకద్దుకుని మెరిసే కళ్ళలో తెరిచారు భాస్కరుడు. వ్యాఖ్యాత బ్రహ్మశ్రీ మంత్రి లక్ష్మీనారాయణ శాస్త్రి. 1895లో ముద్రించిన గ్రంథం దాని కింద కుడి ప్రక్కనే ఆ పేరు కనిపించింది. ముచ్చటైన ఐదు అక్షరాలు ఈ పేరు... ఉత్సుకతతో అడిగారు భాస్కరుడు నాదే! చెప్పాడతడు ప్రశాంతంగా తమరి పూర్వాశ్ర... కనుబొమలు ముడిపడుతుండగా అడిగారు భాస్కరుడు. నాకు పూర్వాశ్రమం, వర్తమానం వేర్వేరు కావు నేను సన్యాసిని కాదు మరి! యాత్రికుడిని, అన్వేషిని దేనికోసం ఈ యాత్ర? అన్వేషణ? తపోభూమి కోసం నన్ను నేను తెలుసుకోవడం కోసం! అంటే... తమరు ...!? ఒక నిగూడమైన ప్రశ్నను నిక్షిప్తం చేసికొని వెలువడిందామాట అందులోని ధ్వనిని ఆకళింపు చేసుకుని

వెంటనే అన్నాడా యువకుడు ఔను క్షత్రీయులం! మళ్ళీ అతడే చెప్పాడు. ఇంటి పేరు అల్లూరి వారు అల్లూరి శ్రీరామరాజు"[10] అని అంటూ సమాధానమిస్తాడు. రామరాజు దీనిని బట్టి రామరాజుని నిగూఢ విద్యావిధానం, ఆయన వేదాంత పఠనం, యోగా స్ఫూర్తి, ఆయన దర్శించిన పర్యాటక విషయాల్ని వారి పుట్టు పూర్వోత్తరాలే భాస్కరుడు ప్రశ్నించిన విధానాన్ని సంభాషణ రూపంలో చక్కగా చిత్రీకరించారు రచయిత. అలాగే మొదటి అధ్యాయంలోని రెండో భాగంలో కొండ ప్రాంతానికి చెందిన ఎర్రేసును గూర్చి ఆయన చేసే వృత్తిని గూర్చి తెల్పారు. అంతేకాకుండా విలువిద్యలో గిరిపుత్రులకు లేదని తెలియజేసిన విధానాన్ని వ్యక్తపరిచారు. ఆ కోణంలో సంతలో జరిగే ధనుర్విద్య పోటీలో పాల్గొని తన స్నేహితుడైన మోదిగాడి తలమీద కోడిగుడ్డును పెట్టి తన ధనుర్విద్యా నైపుణ్యాన్ని చాటకుంటాడు. ఆ సందర్భంలో అక్కడ గుమిగూడిన వ్యాపారులకి తనకి మధ్య జరిగిన సంభాషణని చక్కగా తెల్పుతూ

"క్రితం జన్మలో నువ్వు అర్జునిడివై ఉంటావురా! నువ్వు నా ప్రశంసని కాదనలేవు సుమా అన్నట్టు మెచ్చుకోలుగా అన్నాడు బండి తోలే అబ్బాయి జేబులో నుంచి ఒక అర్ధణా తీసి అతడి చేతిలో వేస్తూ దానిని వెంటనే మొలలో చుట్టిబెడుతూ అన్నాడు ఎర్రేసు. ఇదిగో కాపుగారు! అడవిలో పుట్టినోడెవడైనా అర్జునుడే. ఓ చేతిలో బుల్లి బాణం, ఇంకో చేతిలో బుల్లి విల్లు పట్టుకునే అమ్మ కడుపులో నుంచి బయటికొస్తాం మేం"[11] అని సమాధానం చెప్పడంలో గిరిజనులకు బాణవిద్య వంశపర్యంగా వచ్చినదనే విషయాన్ని ద్యోతకం చేశారు. అదే విధంగా అమాయక ప్రజలైన గిరినునుల్ని వ్యాపారస్తులు ఏ విధంగా మోసపూరిత విధానాలలో దోచుకుంటున్నారో ఈ విభాగంలో చక్కగా తెలియజేశారు.

అలాగే ఈ అధ్యాయంలో మహాత్మ గాంధీ ప్రస్తావన స్వాతంత్ర్యం వీరులైన తిలక్, గోఖలే, మాలవ్య, మోతీలాల్ లాంటి ప్రముఖుల్ని కూడా ప్రస్తుతించారు. అనంతరం భాస్కరనాయుడు తల్లి సోమమ్మ రామరాజు యొక్క తల్లిదండ్రులు యొక్క విశేషాల్ని తెలిసకోవడంలో ఈ అధ్యాయం ముగుస్తుంది. ఈ అధ్యాయంలో రామరాజు కృష్ణదేవిపేట గ్రామానికి వెళ్ళడం అక్కడ ప్రజలలో సాన్నిహిత్యం పెంచుకోడం, వారికి ఆధ్యాత్మిక గ్రంథాల సారాన్నే తెల్పడంలాంటి మరెన్నో విషయాల్ని విశదీకరించారు రచయిత.

రామరాజు యొక్క కుటింబికుల గూర్చి తెలుసుకున్న భాస్కరరాయుడు ఆయన తల్లి సూర్యనారాయణమ్మకు తన కుమారుని గూర్చి లేఖ రాస్తాడు. అదే సమయంలో

అల్లూరి కూడా తన క్షేమ సమాచారాన్ని కృష్ణదేవిపేట భాస్కర నాయుడు కుటుంబం తనని ఆదరించిన తీరుని లేఖ రూపంలో తల్లికి పంపడం, వార్త తెలుసుకున్న తల్లి హడావిడి హడావిడిగా అక్క తన పిల్లలతో పయనమవడం లాంటి విషయాల్ని చర్చించారు. రామరాజు తన తల్లికి రాసిన ఉత్తరంలోని సమాచారాన్ని గూర్చి తెల్పుతూ.

"అమ్మా మీ పాద పద్మములకు నమస్కరించి మీ కుమారుడు రామరాజు వ్రాయునది. నేను క్షేమం, నీవూ, చెల్లీ, తమ్ముడూ, మన బంధువులు అంతా క్షేమమని తలుస్తున్నాను. కృష్ణదేవిపేటలో సోదర సమానుల భాస్కరుడు గారు వారి తల్లి, మాతృ సమానురాలు సోమమ్మగారి ఆపేక్ష, ఆప్యాయతల మధ్య నేను క్షేమంగా ఉన్నాను. చెల్లీ తమ్ముడుతో కలసి మీరు కృష్ణదేవిపేట రావలసింది. ఈ నెలాఖరుకు తునిలో మన మిత్రులు పేరిచర్ల సూర్యనారాయణ రాజు, పేకేటి చిన సుబ్బరాజు గారి ఇంటికి వచ్చి ఉండవలసింది. అక్కడన ఉండి భాస్కరుడి గారి రెండెడ్ల బండి వచ్చి మిమ్ములను ఈ గ్రామానికి చేర్చగలదు.. మరి సెలవు... రామరాజు"[12] అని అంటూ తన తల్లి ఉత్తరం రాయడంలో అల్లూరిపై భాస్కరనాయుడు కుటుంబం చూపుతున్న ప్రేమాభిమానాలు తన తల్లికి లేఖ రాసేంతగా రామరాజుకి ప్రేరేపించింది అనే విషయం వెల్లడవుతుంది.

అదే విధంగా తునిలో ఉండగా ఉద్యోగం సంపాదిస్తానని చెప్పి వెళ్ళిపోయిన కుమారుడ్ని చూసి రెండు సంవత్సరాలవుతుంది. నాటి నుండి నేటి వరకూ ఎలాంటి జాడ లేని కుమారుడి ఆచూకి ఆ లేఖ ద్వారా తెలియడంతో ఆ తల్లి ఆనందానికి అంతం లేకుండా పోతుంది. వెంటనే కుమారుడ్ని చూడాలని తన కూతురు, కుమారుడ్ని వెంటబెట్టుకుని బయల్దేరుతుంది. ఆ రోజు సాయంత్రం ఐదు గంటల సమయానికి తల్లి రాకను గమనించిన రామరాజు బండి దిగడానికి నూకాలు వేసిన ముక్కాలిపేట దగ్గరగా వెళ్తాడు. రామరాజుని చూసిన తల్లి కళ్ళల్లో ఆనందానికి అంతులేకుండాపోతుంది. తర్వాత రామరాజు చిన్ననాటి జ్ఞాపకాల్ని భాస్కరనాయుడి కుటుంబంతో పంచుకోడం లాంటి అనేక విషయాల్ని చర్చించారు. ఆ తర్వాత రామరాజు తాను ఇంటి నుండి బయటకి వచ్చి సాగించిన అనేక యాత్రల్ని, విశేషాల్ని గూర్చి ఆయన కలసిన బెనర్జి, మోతీలాల్ నెహ్రూలాంటి అనేక మంది మహోన్నత వ్యక్తుల్ని మననం చేసుకున్న తీరుని వ్యక్తం చేశారు. ఎన్నో జ్ఞాపకాల్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ అందులో ఎవరెవరిని కలిసాడో వారి మధ్య జరిగిన అనేక సంభాషణల్ని ఈ అధ్యాయంలో అనువనువునా ప్రస్ఫుటించారు రచయిత. ఆ కోణంలోనే రామరాజుకి, సురేంద్రనాథ్ బెనర్జీల మధ్య సంభాషణలో

రామరాజు యొక్క ఆగమనానికి కారణమడగగా దానికి ఆయన ఈ దేశమంతా తిరిగి రావలన్నదే తన కోరికని సమాధానమిస్తాడు దానికి.

"గొప్ప గొప్ప మతాలకు జన్మనిచ్చిన ఈ మహోన్నత దేశాన్ని దర్శించాలనుకున్నావు. సంతోషం బాబూ! ఇది పవిత్ర భూమి. వాల్మీకి, వ్యాసుడు, బుద్ధుడు, శంకరాచార్యులు, పాణిని, పతంజలి వంటి వారిని కన్న నేల ఇది. ఈ వయస్సులోనే హిమాలయాలలో తపస్సు చేయాలన్నంత ఆకర్షణను పెంచుకున్నందుకు నిన్ను చూస్తుంటే అబ్బురంగా ఉంది బాబూ! ఇక బ్రిటీష్ వాళ్ళ మీద పోరాటం చేయాలన్న కాంక్ష ఈ కాలంలో పుట్టిన వాళ్ళ గుండెల్లో ఒక జ్వాలలా మండక పోతేనే తప్పు. మండితే కాదు సుమా? ఒక్కటి గుర్తుంచుకో! ఒక జాతి చైతన్యవంతమవుతున్న దశలో అందులో పుట్టిన ప్రతి మనిషి అగ్రకులాలు, నిమ్నకులాలు అన్న భేదభావం లేకుండా అన్ని ప్రాంతాలవారు స్త్రీ పురుష భేదం లేకుండా తమ వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించవలసిన సందర్భం ఎదురవుతుంది. అదే వాళ్ళ జీవితంలో గొప్ప చారిత్రక సందర్భం. అలాంటి చారిత్రక బాధ్యతను నీవు నిర్వర్తిస్తున్నావని నాకు అనిపిస్తుంది. ఇంకొక్క విషయం ఇప్పుడు కనిపిస్తున్న చైతన్యం ఉద్దేశం స్వేచ్ఛ. ఆ స్వేచ్ఛ జాతీయ సమైక్యత ద్వారానే సాధ్యమవుతుంది"[13] అని అంటూ హితబోధ చేస్తారు. దానిలో రామరాజులో నూతన ఉత్తేజం ఉవ్విళ్ళూరుతుందనే విషయాన్ని కూడా వివరించారు. తర్వాత రామరాజు కలకత్తాను విడిచి వారణాసి చేరడం అక్కడ గల అనేక పుణ్య నదుల్ని, క్షేత్రాల్ని దర్శించుకుంటాడు. మరలా తిరిగి ఐదు నదుల నేల పంజాబ్‌ని దర్శించుకుంటాడు. తదుపరి మరల గోదావరి పరివాహక ప్రాంతాలకి నడక సాగిస్తాడు. ఆ సందర్భంలోనే కృష్ణదేవిపేటకు చేరుకుంటాడు. అంతేకాకుండా భాస్కరనాయుడి ఆతిధ్యాన్ని స్వీకరిస్తాడు కూడా. తల్లి, చెల్లి తమ్ముళ్ళను ఆ ఊరికి రప్పించుకుంటాడు కూడా అలాగే భాస్కరనాయుడిని తనకొక గృహాన్ని కట్టించి ఇవ్వమంటాడు. దానికి ఆ వూరి వారంతా ఎంతో సంతోషిస్తారు. ఆ గ్రామం చివర్లో రామరాజు కోరుకున్న పడాల దిబ్బల మీద రెండు పాకలు నిర్మిస్తారు. ఒకటి వారు నివసించడానికి, రెండోది గ్రంథాలయం మరియు సభలు సమావేశాలు జరుపుకోవడానికి. భాస్కరనాయుడిగారి కుటుంబం అండదండలతో ఎంతో సంతోషంగా జీవనం సాగిస్తుంటారు.

1918వ సంవత్సరం జూన్ నెలలో కృష్ణా తీరంలో గల పరిస్థితుల గూర్చి దిన పత్రికలో వచ్చిన కథనానికి ఆ గ్రామంలో గంభీర వాతావరణం నెలకొంటుంది. ఆ

సందర్భంలో రామరాజు–

"మహాభూకంపం వస్తే ఏమవుతుంది? ఈ మూర్ఖపు ప్రాశ్చాత్యుల మహాయుద్ధం పేరుతో పుడమి తల్లికి చేస్తున్న చేటు అంతకంటే తక్కువేమీ కాదు. ప్రపంచానికి నాగరికత నేర్పామని డంబాలు పలికేవాళ్ళు సాంకేతిక పరిజ్ఞానంలో ఎంతో పురోగతి సాధించామని చెప్పుకునే వాళ్ళు ఈ యుద్ధం పేరుతో మానవాళికి చేస్తున్న హాని మాటలకందదు. మూడేళ్ళ నుంచి ఒక్క రోజు కూడా విరామం లేకుండా తుపాకులు కాల్చుకుంటూనే ఉన్నారు. ఫిరంగులు, మందుగుండూ మండుతూనే ఉన్నాయి. ఒక ఖండం అక్షరాల నెత్తురులో తడిసిపోయింది. అయినా వాళ్ళ యుద్ధకండూతి చావడం లేదు. అక్కడెక్కడో వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు చంపుకోవడం ఏమిటి? మన కృష్ణాతీరం విలవిలలాడడమేమిటి?"[14] అని పలకడంలో సీతారామరాజులో అప్పటి వరకూ ఉన్న శాంతిపరత్వం ఏమైంది అనే అనుమానం కలుగుతుంది. ఒక్కసారిగా తనలో దాగి ఉన్న కోపాన్నంతా బహిర్గతం చేసిన విధానాన్ని వ్యక్తంజేశారు. నాలుగో అధ్యాయంలో ఆగస్ట్ 1, 1920న లోకమాన్య బాలగంగాధర్ తిలక్ మరణవార్త విన్న బొంబాయినగరం దిగ్భ్రాంతికి గురికావడం, ఆ సంగతిని తెలుసుకున్న గాంధీ ఉన్నపాటుగానే ఎంతగానో కుమిలిపోడంలాంటి విషయాల్ని చర్చించారు. ఆ సమయంలో గాంధీజీ తన కార్యదర్శి అయిన మహదేవ్ దేశాయ్‌తో–

"స్వాతంత్ర్యోద్యమం ముందుకు వెళ్ళడానికి నేనెవరి సలహా తీసుకోగలను? మనకాలపు మహోన్నతుడు కూలిపోయాడు. ఆ సింహగర్జన మూగబోయింది. రేపటి తరం కూడా ఆయనను ఆధునిక భారత నిర్మాతగా గుర్తుంచుకుంటుంది. ఆయన వలె స్వరాజ్యం అన్నమాట ఉచ్చరించి ఉండకపోవచ్చు. నేను పని చేసింది మాత్రం దాని కోసమే. ఇప్పుడు దానికి తిలక్ మహారాజ్ నినాదంగా జీవింపజేయాలి"[15] అని అంటూ పలికిన గాంధీజీ మాటల్లోని రాబోయే రోజుల్లో తిలక్‌ని నేటి తరానికి ఆదర్శంగా నిలపడమే తన ధ్యేయమని ప్రతిన పూనుతారు.

ఈ నవల్లో ఒక పక్క గాంధీజీ స్వాతంత్ర్యోద్యమం మరో పక్క అల్లూరి సీతారామరాజు జీవిత పర్యాంతం జరిపిన ఉద్యమ ఘట్టాల్ని వివరించిన తీరు ద్యోతకమౌతుంది.

అలాగే నాలుగో అధ్యాయం మూడో భాగంలో అడవి జాతిబిడ్డలు పడాలు, గంతన్న, మల్లు, రామయ్య, బాలయ్య, ఎర్రేసు, మోదిగాడులాంటి వారు రామరాజు దగ్గరకొచ్చి

"బాస్టిన్ దొర గిరిపుత్రులపై జరుపుతున్న అరచకాల్ని రామరాజుకి విన్నవించడానికి వస్తారు. బాస్టియన్ దొర దురాగతాల్ని అణచడానికి గవర్నరుకు పిర్యాదు చేయమంటారు. ఆ సందర్భంలో వారు పడుతున్న అగచాట్లని, బ్రిటీష్ అధికార్లు తమను హింసిస్తున్న తీరుని వివరిస్తారు. ఆ సందర్భంలో మల్లుదొర లేచి వారి అగచాట్లని గూర్చి చెబుతూ–

"సామీ! ఆ బేస్టిన్ మనిషి కాదు. నేను చిన్నోణ్ణీ, కానీ నేను చెప్పేదంతా నిజం ఆడు ఒళ్ళంతా రక్తాలొచ్చేటట్టు దెబ్బలు కొట్టి, నూరిన పచ్చి మిరపకాయల ముద్ద మొగోళ్ళయితే ముడ్డిలో కుక్కిస్తాడు. ఆడోళ్ళకి కొంగులూడదీసి గుండెలమీద కూడా రాశాడు.. ఏ ఆడదైనా దీనిని భరించగలదా స్వామీ! ఎందు పడాలుగారు పెద్దవలస ముఠాదారు. పరువూ మర్యాద ఉన్నోడు. ఆయన రెండు చేతులూ ఎనక్కి ఇరిచి స్తంబానికి కట్టేశాడు. ఈడు మా అన్న గంతన్న ఊరు మునసబు ఈణ్ణి బూటు కాలితో తన్నాడు. గుండెల మీద తన్నాడాడు. కాయితాల మీద గీతలు గీసే కర్రతో నన్ను మోకాళ్ళ మీద కొట్టాడు. పాతిక దెబ్బలైనా ఉంటాయవి. ఇలాంటి బతుక్కంటే కొర్రు దిగి సచ్చిపోవడం మంచిదనిపించింది సామీ! మోదకొండమ్మ మీద ప్రమాణం"[16] అని అంటూ వారు అనుభవించే ఘోరాతిఘోరమైన హింసాత్మక చర్యల్ని రామరాజుకి చెప్పుకున్న తీరుని వివరించారు.

ఒక్క ప్రక్క గాంధీగారి సహాయ నిరాకరణోద్యమ సదస్సుల్ని జరుపుకుంటున్న గాంధేయవాదుల్ని కూడా బ్రిటీష్ నిరంకుశత్వానికి బలౌతునే ఉన్నారనే విషయాన్ని కూడా వెల్లడించారు.

అదే విధంగా మన్యంలో రామరాజు పితూరీ జరపబోతున్నాడనే వార్త కూడా కృష్ణదేవిపేట ప్రజల్ని భయందోళనకు గురి చేస్తుంది. అదంతా వదంతూ మాత్రమేనని తెలుసుకోవడంతో కుదుటపడతారు.

కాని ఫిబ్రవరి 3వ తేది 1922న బాస్టియన్ వచ్చి గ్రామస్తుల్ని రామరాజుని పిలిచి ఒక పత్రం చూపుతారు. అది కృష్ణదేవిపేటలో 144 సెక్షన్ విధించడం జరుగుతుంది. ఆ సంగతి విన్న భాస్కరనాయుడు ఎందుకని ప్రశ్నించగా–

"అప్పుడు ఆ కానిస్టేబుల్ చెప్పాడు కృష్ణదేవిపేట గ్రామంలో పితూరీ జరుగుతుందని వదంతులు వ్యాపించాయి. దీనికి జాతీయ కాంగ్రెస్ వారి సహాయ నిరాకరణ ఆందోళనలు, ఖిలాఫత్ ఉద్యమ నినాదాలు ఎక్కువయ్యాయి. కాబట్టి ఇక్కడ మీటింగ్‌లు, బహిరంగ ప్రదేశాలలో గుమిగూడడం ఈ ఆదేశం ప్రకారం ఈ క్షణం నుంచి నిషిద్ధం అందుచేత

ఇప్పుడే మీరంతా ఈ చోటు విడిచిపోవాలి. ఒక్క శ్రీరామరాజు తప్ప"[17] అని చెబుతాడు. దానితో అక్కడి ప్రజలంతా అక్కడ నుండి వెళ్ళిపోతారు. రామరాజు మునసబు మాత్రమే మిగులుతారు. ఆ సందర్భంలో శ్రీరామరాజుతో–

"రామరాజుగారు! మిమ్మల్ని నిర్బంధంలోకి తీసుకుంటున్నాం. అయితే ఇది అరెస్టు కాదు. ఇంటర్న్‌మెంట్ పొలిటికల్ సస్పెక్ట్‌గా తీసుకురమ్మని ఆదేశం. కాబట్టి ఇచ్చిన మాట ప్రకారం మీరు మాతో నర్సీపట్నం రావాలి!"[18] అని అంటాడు ఫజులుల్లాఖాన్. దీనిని బట్టి బ్రిటీష్‌వారు రామరాజుని అరెస్ట్ చేయడానికి నిశ్చయించుకున్నారనే సంగతి తెలుస్తుంది.

ఐదో అధ్యాయంలో రామరాజు కారాగారంలో ఉండగా ఆయన్ని చూడ్డానికి నారాయణమూర్తి, భాస్కరనాయుడులు వస్తారు. ఆ సందర్భంలో వారికి సీతారామరాజుకి మధ్య జరిగిన సంభాషణలో భాస్కరనాయుడు రామరాజుతో చౌరిచౌరా సంఘటన వల్ల గాంధీగారి సహాయనిరాకరణోద్యమం నీరుగారిపోయిందంటారు. ఆ వార్త విన్న రామరాజు గుండెల్లో అశాంతితో నిండిపోతుంది. ఆ సమయంలో జైలు గోడల్ని సైతం బద్దలుకొట్టాలనేంత కోపం రామరాజుకు వచ్చిందంటారు. సెల్‌లో ఉన్న రామరాజు దగ్గరకి మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో సెంట్రీ వచ్చి తమర్ని పోలవరం డిప్యూటి తహశీల్దార్ పిలుస్తున్నారంటాడు. ఆ సమయంలో తమశీల్దారయిన ఫజులుల్లాఖాన్‌కి – రామరాజుకి మధ్య జరిగిన మాటల్లో రామరాజుతో కూర్చోమంటూ తన దగ్గరున్న కాగితాల బొత్తిని ఇస్తూ ఇదొక సారి చదవండి మీ తరుపున నేనే రాయించానంటాడు. అదో దరఖాస్తు అందులో–

"తాను పేదవాడిననీ, సేద్యం చేసుకుని ప్రశాంతంగా బతకదలిచాననీ, అందుకు కొంత భూమి కేటాయించవలసిందనీ"[19] అని రామరాజు ఏజెన్సీ కమీషనర్‌కి అర్జి పెట్టుకున్నట్టుగా రాసి ఉంటుంది. అది చదివిన రామరాజు వాటి మడతలు ఏవిధంగా ఉన్నాయో అదే రీతిలో మరిచి తిరిగి ఇచ్చేస్తాడు. దానికి మరల ఫజులుల్లాఖాన్–

"ఇది మీకు రుచించేది కాదని నాకు తెలుసు, అయినా నేను ఈ విషయంలో మిమ్మల్ని వదిలిపెట్టను నిజమే. మీ మీద నాన్‌కోఆపరేటర్ అంటూ ఆరోపణలు వచ్చాయి. కానీ ఒక్క రుజువు కూడా దొరకలేదు. అయినా మిమ్మల్ని బ్రిటీష్ ప్రభుత్వం ఊరికే వదిలేస్తుందని అనుకోకండి. దాని స్వభావం నాకు తెలుసు మిమ్మల్ని ఇంక వదలకుండా

నిఘా వేసి ఉంచే బాధ్యత ప్రభుత్వం ఎవరికి అప్పగించిందో తెలుసా? నాకే పైడిపుట్ట అని వినే ఉంటారు మీరు. అడ్డతీగలకి మూడు మైళ్ళు. అక్కడ మీకు మంచి భూమి ఇప్పిస్తున్నాను. రోజూ అడ్డతీగల పోలీసుస్టేషన్‌లో సంతకం చేయడం. సేద్యం చేసుకోవడం. ఇది మీ భవిష్యత్ చిత్రం. ఈ లక్ష్మణరేఖ తప్పితే మీరు ఇబ్బందులు ఎదుర్కొనక తప్పదు. దీనిని బెదిరింపుగా తీసుకోకుండా మీ మేలుకోరి. నేను చేస్తున్న పని"[20] అని అంటాడు. దానికి అల్లూరి తనకు తెలియకుండానే వేదన అనుభవిస్తాడు మరియు తదుపరి పరిణామం గూర్చి ఆలోచిస్తూనే ఉంటాడు. అంతేకాకుండా రామరాజుని గాంధీజీ అడుగుజాడల్లో నడవమని హితవు పలుకుతాడు. అంటే బ్రిటీష్ ప్రభుత్వ ఆజ్ఞకు తలొగ్గితే బ్రతుకుతావు లేకపోతే జీవితాంతం నరకం అనుభవిస్తావని హెచ్చరిక చేయడం కూడా ఇక్కడ మనకు ద్యోతకమౌతుంది. అన్నట్టుగానే పోలీసులు రామరాజుని తీసుకెళ్ళి దుబ్బెర్తిలో లింగన్న దొరకి అప్పగిస్తారు. మనసుకి బాధ కలిగినప్పటికీ రామరాజు మాత్రం మౌనం వహిస్తాడు. తన తల్లి తమ్ముడు దుచ్చెర్తి రమ్మని లేఖ రాస్తాడు. వారు అక్కడికి వస్తారు. తర్వాత రామరాజుని తమ్ముడు చదువుకోసం, తుని లేదా మోగల్లుకి వెళ్దాం అంటుంది. దానికి రామరాజు–

"అక్కడికి నేనెలా రాగలనమ్మా ఇది చూడు నిన్న ప్రవహించిన నది జాడ కదా! ప్రవాహం లేకపోయినా కంటికి కనిపిస్తూనే ఉంది నది. అలాగే నిన్నటి ప్రవాహం అలికిడి చెవులలో మిగిలే ఉంటుంది. నా జీవితమూ అంతే దద్దాకీ, చుట్టాలకీ ఇప్పుడు నామీద ఎలాంటి అభిప్రాయం ఉంటుందో నేను ఊహించగలను తమ్ముడు చదువు ముఖ్యం నువ్వు వెళ్ళు నేను నేపాలయాత్రకి వెళ్ళాలని అనుకుంటున్నాను అని చెప్పి వారికి నచ్చజెప్పి వారిని సగం దూరం వరకూ వెంట ఉండి తీసుకెళ్ళి వదిలి వస్తూ, తనకు పుష్పం మీద వేసిన సెగగడ్డ పగిలి పోవడంతో దాని వల్ల తన దుస్తులన్ని రక్తంలో నిండిపోడంలో కిన్నెరల వాగు దగ్గర శుభ్రం చేసుకుంటాడు. అది గమనించిన పడాలు దగ్గరగా వచ్చి ఎవరని ప్రశ్నిస్తాడు. దానికి రామరాజు కుశల ప్రశ్నలు వేసుకుంటూ ఒకరినొకరు పలకరించుకుంటారు. తర్వాత తనకిచ్చిన భూమిని తిరిగి ఇచ్చేస్తున్నానని చెబుతూ లింగందొరకి లేఖ రాస్తాడు రామరాజు. దీన్ని బట్టి రామరాజులో ఏదో ఒక ఆలోచనాశక్తి కదిలిస్తుందనే భావన మనకు కలుగుతుంది. ఇలాంటి సంఘటనల్ని చక్కగా చిత్రీకరించిన తీరు వ్యక్తమౌతోంది.

అలాగే ఆరో అధ్యాయంలో ఉద్యమబాట పట్టిన రామరాజు పోరాటం ప్రజల్ని

పోరాటం వైపు మరల్చిన తీరుని తెల్పారు. ఆయన వ్యూహాల్ని, 1922 ఆగష్టు 19వ తేదీన ప్రజల్ని బ్రిటీష్ వారిపై తిరగబడడానికి సిద్ధం చేయడం లాంటి విషయాల్ని చక్కగా వివరించారు. రచయిత ఆ సందర్భంలో రామరాజు ప్రజలకు ఉద్యమస్ఫూర్తిని కలిగించే విధానాన్ని తెల్పుతూ. ఆకలితో భయంతో చచ్చిపోవడం ఎందుకు? ధైర్యంగా ఉద్యమమే చేద్దాం! మన ఉనికిని కాపాడుతుందాం. ఉద్యమం అంటే భవ్యమైన భవిష్యత్తును గర్భంలో మోస్తున్న సంక్షుభిత వర్తమానమే. ఎంతో రక్తపాతం తరువాత మళ్ళా సాహసించి ఇంకో పోరుకు సిద్ధమవుతున్న మన్యం చాలా విషయాలు గమనించాలి. నిన్నటిలాగా రాయి అలజడి సమయంలో ఏం జరిగిందో, చివరికి ఏమైందో కూడా తెలుసు. అది గుర్తుకు తెచ్చుకుంటూ రేపు మనం ఎలా అడుగువేయాలో నేర్చుకుందాం. అంతా కలిసి అడుగులో అడుగువేయాలి. అంతా కలిసి గొంతు విప్పాలి. అందుకేమీ గొంతులు గంధకప్ప గనులు కావాలి. మీ గుండెల్లో, గొంతుల్లో తరతరాల నుంచి గూడు కట్టుకుని ఉన్న మౌనాన్ని కొండలలో వదిలి, కొండగాలో మీ ఊపిరితిత్తులను నింపుకోండి. మనందరి ఉమ్మడి శ్వాసే ఉద్యమ రూపం దాల్చాలి"[21] అని అంటూ బ్రిటీష్ వారు కొండ ప్రజలకి చేసిన అన్యాయాల్ని గుర్తు చేస్తూ వారిపై ఏ విధంగా ఒకటిగా తిరుగుబాటు చేయాలో తెలియచెప్పిన విధానాన్ని వెల్లడి చేశారు రచయిత.

అలాగే శ్రీరామరాజు తాను అనుకున్నట్టుగానే ముందుగా చింతపల్లి పోలీస్‌స్టేషన్ కొల్లగొడతాడు. అనంతరం కృష్ణదేవిపేటకు చేరడం అక్కడి ప్రజల్ని పలకరించడంలాంటి విషయాల్ని గూర్చి వివరించారు. అంతేకాకుండా గిరిజనుడైన ఎర్రేసు సంతలో చేసే విన్యాసాల్ని కూడా ఈ ఏడో అధ్యాయంలో కళ్ళకు కట్టినట్లు చూపించారు. ఆ కోణంలోనే రామరాజు గ్రామ చారికకు కబురును పంపి, గ్రామస్తులందరిని చూడాలని, గ్రామ ప్రజలందర్నీ సమావేశపరచమని ఆదేశాలు జారీ చేస్తాడు. అక్కడికి వచ్చి ప్రజలందరితో రామరాజు–

"మీ ముందు నిలబడి ఉన్న మీ శ్రీరామరాజే. మేం మొదలుపెట్టినది పితూరీ కాదు. ఇది ఉద్యమం ఇప్పుడు హిందూదేశం మొత్తం తెల్లవాడి మీద ఆగ్రహంతో ఉంది. ఊరూ వాడా ఉద్యమిస్తోంది. ఇదో కురుక్షేత్ర సంగ్రామం నాడు పాండవులు తమ వైపు నిలబడే వారి కోసం ఎలా అన్వేషించారో ఇప్పుడు మేము అంతే. మామూలు భారతీయుడు మాకు శత్రువు కాదు. మాకు కావలసింది ఆయుధాలు. నిన్న చింతపల్లి వెళ్ళినా, ఇవాళ ఈ ఊరు వచ్చినా వాటి కోసమే అవి తెల్లవాడిమీద ఎక్కుపెట్టడానికే కానీ సాటి భారతీయుడిని

బాధించడానికి కాదు. ఇళ్ళ మీద పడడం, వెండి, బంగారం దోచుకోవడం కలలో కూడా జరగదు. ఈ మన్యంలో ఏ ఇల్లూ ఏగడపా దోపిడీకి గురికాదు. పితూరీల కాలంలో కొందరు తొందరపాటుతో చేసిన పని అది. అది మరిచిపోదాం. మేం ఎక్కడికి వెళ్ళినా కోరేది ఒక్కటే. ఒకటి రెండు పూటలకు సరిపోయే భోజన సాంచారాలు. అది కూడా మీరు సంతోషంగా ఇస్తేనే తీసుకుంటాం సత్యం వద ధర్మం చెర"[22] అని అంటూ తాము చేసేది న్యాయపోరాటమని దీని వల్ల ఇక్కడి ప్రజలకెలాంటి నష్టం వాటిల్లదని ధైర్యం చెప్పిన గొప్ప పుణ్యమూర్తిగా అల్లూరిని వర్ణించారు రచయిత. అలాగే రామరాజు కృష్ణదేవిపేటలో ఉన్న పుణ్యస్థలాల్ని దర్శించడమే ఆయనలో గల దైవభక్తి, దేశభక్తి, ఆధ్యాత్మికలో వ్యక్తమయ్యే విధంగా రచన సాగించారు రచయిత.

అలాగే తొమ్మిదో అధ్యాయంలో బ్రిటీష్ ప్రభుత్వం నియమించిన కల్నల్ నాప్ అనే అధికారిక రామరాజు ఆగష్టు 22,23,24 తేదీల్లో చింతపల్లి, కృష్ణదేవిపేట, రాజవొమ్మంగి పోలీస్‌స్టేషన్లలో జరిగిన తిరుగుబాటుని గూర్చి వివరించడం. అంతేకాకుండా నాప్ తన క్రింది అధికారులలో ప్రస్తుత పరిస్థితులేంటని తెలుసుకునే సందర్భంలో చింతపల్లి, కృష్ణదేవి, రాజవొమ్మంగి పోలీస్‌స్టేషన్లని దోచుకున్న విషయాన్ని మద్రాస్ మెయిల్ పత్రిక ప్రచురిస్తుంది. ఆ పత్రికని నాప్ క్లిపింగ్ స్టువర్ట్‌కు అందిస్తూ నువ్వే చదువు అందరికీ వినిపించేలా అంటాడు. ఆ వార్త కథనంలో–

"ఎవరీ యువకుడు విశాఖమన్యం, రంప ప్రాంతంలో తిరగుబాట్లు చేస్తున్నా ఈక్షత్రియ యువకుడు గోదావరి ప్రాంతం వాడు. ఇతడికి తుపాకీ కాల్చడం వచ్చు, ఒక రిటైర్డ్ పోలీసు దగ్గర నేర్చుకున్నాడని తెలుస్తోంది. గ్రేట్ వార్ కాలంలో ఇతడు ఎక్కడ ఉన్నది ఇప్పటికీ అంతుపట్టని విషయమే. జర్మనీ కుట్రలతో ఇండియాలో తిరుగుబాట్లు పరపడానికి జరిగిన కార్యకలాపల గురించి, ప్రయత్నిల గురించీ ఆతడికి తెలుసు జర్మనీ సాయంతో ఇంగ్లాండ్ ఆధిపత్యాన్ని కూలదోయవచ్చునని గట్టిగా నమ్మే సంస్థలలో ఇతడికి సంబంధాలు ఉన్నాయి. ప్రపంచ యుద్ధంలో పాల్గొనే ఉద్దేశంలో పోరాడేందుకు తర్ఫీదు పొందాడని చెప్పి కొన్ని ఆధారాలు కూడా దొరుకుతున్నాయి"[23] అని అంటూ రామరాజుకి జర్మనీ దేశంలో సత్సంబంధాలు ఉన్నాయని అతని శక్తి సామర్థ్యాలు గూర్చి తెలిసిన తీరుని వ్యక్తం చేశారు. రామరాజు బ్రిటీష్ ప్రభుత్వంపై ఏ విధంగా విరుచుకు పడ్డాడో ఈ అధ్యాయంలో క్షుణ్ణంగా వివరించారు రచయిత. అడ్డతీగల, పోలీస్‌స్టేషన్ విరుచుకుపడ్డ రామరాజు తర్వాత అనేక ప్రాంతాల్లోని బ్రిటీష్ సైన్యాలపై తన వ్యూహవిన్యాసాల్ని ప్రదర్శిస్తాడు. అలాంటి విషయాల్ని హృదయానికి తాకట్టుగా చిత్రించారు రచయిత.

అదే విధంగా ఏదో అధ్యాయంలో బ్రిటీష్ ప్రభుత& పార్లమెంటులో నావ్ ప్రభుత్వ తరుపున సభలో ప్రసంగిస్తూ–

“గౌరవనీయ సభ్యులకు పితూరీ నాయకుడు శ్రీరామరాజు గూఢాచారి వ్యవస్థను ఏర్పాటు చేసుకోవడంలో నిపుణుడు. మైదానప్రాంతంలో సంబంధం కలిగి ఉన్నాడు. చింతపల్లి, మరో రెండు పోలీసుస్టేషన్ల మీద దాడులతో విశాఖ మన్యం తిరుగుబాటు ఆరంభమైంది. పోలీసులు ప్రతిఘటించలేకపోయారు. తిరుగుబాటుదారులు కార్బయిన్లు, మందుగుండు తీసుకుపోయారు. స్థానికంగా ఉన్నా కృష్ణా, కాకినాడ, రిజర్వుదళాలను వెంటనే అలజడి జరుగుతున్న ప్రాంతాలకు తరలించారు. అలజడి మొదలైన తొలిదినాలలో తిరుగుబాటు దారులు చేసిన ఆకస్మిక దాడిలో ఒక పోలీసు చనిపోయాడు. మొన్న సెప్టెంబర్ 3న దామనపల్లిలో కూడా తిరుగుబాటుదారుల పోలీసుల మీద విజయవంతంగా ఆకస్మికదాడి చేశారు. మద్రాసు జిల్లా పోలీసుయంత్రాంగంతో చర్చించి, మలబారు దళాలను పంపించాం. అవసరమైతే సైనిక వ్యవస్థ సేవలు తీసుకోవడానికి కూడా సంప్రదించాం”[24] అని ప్రసంగిస్తాడు. రామరాజు చేస్తున్న తిరుగుబాటుకు అడ్డుకట్ట వేయడానికి ఏఏ యంత్రాగాలు సిద్ధం చేసారూ ఈ అధ్యాయ రూపంలో తెలియపరిచారు.

అదే విధంగా మలబారుదళాల్ని రప్పించడం అంతేకాకుండా ప్రపంచ యుద్ధంలో ఉపయోగించిన బలమైన ఆయుధమైన లూయిస్‌గన్ లాంటి సామగ్రిలో రామరాజుని అంతమొందించడానికి కాపు కాసుకుని చూస్తుంటారు. బ్రిటీష్ పోలీసులు ఎంతగా పడిగాపులు కాసేవారో తెలుస్తుంది.

అదే విధంగా పెద్దగడ్డపాలెంలో మలబార్ బలగానికి రామరాజు దళానికి మధ్య జరిగిన కాల్పుల్లో బ్రిటీష్‌వారి పోలీసు బలగం ఎదుట రామరాజు సైన్యం నిలువలేకపోతుంది. జాన్, చార్లెస్, బృందాలు ఎలాగైన రామరాజుని అంతమొందించాలనే దకృధంతో ఎదురుచూస్తుంటారు. కొండదళాన్ని వెతుక్కుంటూ వెళ్తున్న స్వెయిన్‌కి రామరాజు సైన్యం ఎక్కడుందో తెలుస్తుంది. ఒక్క సారి వారిపై విరుచుకుపడతారు ఆ సందర్భాన్ని వర్ణిస్తూ–

“తెల్లవారింది
అలాంటి వేకువని మన్యం ఏనాడూ చూడలేదు
అడవి బిడ్డల నెత్తురులోని ఎరుపును కూడా రంగరించుకుని మరింత

ఎర్రబడ్డాడు సూర్యుడు.

లింగాపురం నుంచి శరభన్నపాలెం వైపు నడుస్తున్నాయి పోలీసు బలగాలు

మూడు పటాలాలు

ఒక పటాలం ముందు నడుస్తోంది, రెండు పటాలాలు వెనుక నడుస్తున్నాయి.

వాటి మధ్యనే పదమూడు నులకమంచాలు

ఒక్కొక్క దాని మీద ఒక్కొక్క శవం. పొట్ట చీలి పేగులు బయటకు కనిపిస్తున్న శవం ఒకటి తలలో తూటా దిగిన శం ఒకటి గుండె చీలినది ఒకటి.. ఇలా నిన్నటి పోరులో కన్ను మూసిన అడవి బిడ్డల శవాలే అన్నీ."[25] అని అంటూ

యుద్ధంలో అమరవీరుల అసువులు బాసిన తీరుని, వారి ఆర్తనాదాల్ని మృతదేహాల్ని మోసుకొస్తున్న విధానాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించారు. ఆ సంగ్రామంలో రామరాజు పట్టుబడలేదన్న వార్త మాత్రం ప్రజల్లో కొంత ఊపిరిని నింపిందనడంలో అతిశయోక్తి లేదనడంలో గిరిప్రజలకి, రామరాజు ప్రగల ఆధరాభిమానాలు వ్యక్తమౌతున్నాయి. అంతేకాకుండా బ్రిటీష్ ప్రభుత్వం కృష్ణదేవిపేటలో ఎవరు కూడా ఆయుధాల్ని ధరించకూడదనే జి.వోను జారీ చేయడంలో రామరాజు విప్లవం నీరుకారిపోయిందనుకున్న విధానాన్ని కూడా వివరించారు.

పన్నెండో అధ్యాయంలో నర్సీపట్నం రోడ్డు రైల్వేస్టేషన్ నిండా ఉత్కంఠభరిత వాతావరణం మరియు రామరాజు అనుచరుల్ని పట్టించినందుకు మునసబు, ఎర్రేసు ఏ విధంగా పట్టుకుని దండించారో చక్కగా తెలియజేశారు. రామరాజు రాజవొమ్మంగి ప్రాంతంలో ఉన్నాడని తెలుసుకున్న పోలీసులు అక్కడ ప్రజల్ని బెదిరిస్తూ–

"రామరాజుని పట్టివ్వలసిని బాధ్యత మీదే. ఎందుకంటే అతడిని ఇంత పెద్దవాడిని చేసింది మీరే ఘనత వహించిన బ్రిటీష్ ప్రభుత్వం ఆ రాజద్రోహిని ఏమాత్రం సహించదు. అతడిని ఎంత తొందరగా పట్టిస్తే అంతమంచిది. మీరే పట్టిస్తే నష్టం తగ్గుతుంది. మేమే పట్టుకోవాల్సి వస్తే ఆ పద్ధతే వేరుగా ఉంటుంది. మా ప్రయత్నాల్లో ఈ అడవి మొత్తం తగలబడినా ఆశ్చర్యం లేదు"[26] అని బ్రిటీష్ అధికారైన రూధర్‌ఫర్డ్ గ్రామ పెద్దల సమక్షంలో, నిర్మొహమాటంగా వెల్లడిస్తాడు.

ఆ తర్వాత కొండపల్లి ప్రాంతంలో రామరాజు ఉన్నాడని తెలుసుకున్న పట్నాయక్ అక్కడ ప్రజల్ని హింసంచడం మొదలుపెడతాడు ఆ సందర్భంలో–

"గాలిస్తూనే కిర్రాబు గ్రామంలో ప్రవేశించారంతా నడుస్తుంటే ఒక చోట ఒక సమూహం వెళ్ళినట్టు అడుగులు కనిపించాయి. బ్యాటరీ లైటు వెలుగులో వాటిని అనుసరించి కొంతదూరం వెళ్ళేసరికి ఆ దృశ్యం కనిపిస్తుంది. వాగు దగ్గర కొండదళం ఉంది. గెడ్డాలు, మీసాలు ఉన్న మనిషి నీళ్ళలో నిలబడి ఉన్నాడు. బహుశా ముఖం కడుక్కుంటూ ఉండవచ్చు. అప్పుడే సబ్ఇన్స్‌పెక్టర్ ఆళ్వార్ నాయుడు తన బలంతో అక్కడికి చేరిపోయాడు అంతాకలిసి హఠాత్తుగా కొండదళం మీద దాడి చేశారు పట్నాయక్ నిలబడి ఉన్న గెడ్డాల మనిషికి గురి పెట్టి రైఫిల్ పేల్చాడు. కొద్దిలో తప్పినా, కాలిమీద గాయం చేసింది. నీళ్ళలోనే తూలిపోతున్నాడు. అత్యంత సాహసంతో పరుగున వెళ్ళి వాటేసు పట్టుకున్నాడు. శ్రీరామరాజు దొరికిపోయాడు... దొరికిపోయాడు... శ్రీరామరాజుని పట్టేశాను"[27] అని అంటూ అరవడంతో మిగిలిన కొండదళం వారిని వదిలేసి ఆ గెడ్డాల మనిషి చుట్టూ కాపుకాసి లాఘకుండా కిందపడేసి కొట్టేయడం జరుగుతుంది. దొరికిన మనిషి రామరాజు అనుకొని పట్నాయక్ అరుస్తు కృష్ణదేవిపేట తీసుకొస్తాడు, చివరికి సబ్ఇన్స్‌పెక్టర్ ఇతడు రామరాజు కాదు అగ్గిరాజు అని చెప్పడంతో అతని బాధకి అంతులేకుండా పోతుంది.

పదమూడో అధ్యాయంలో కురిజమేనాన్, ఆళ్వారుడు నాయుడుల సమక్షంలో మంప గ్రామ చివర్లో రామరాజు పట్టుబడటం ఆయన్ని ఒక మంచానికి కట్టి తీసుకురావడం మధ్యలో మేజర్ గుడాల్ వారి దగ్గరనుండి రామరాజుని తన కూడా తీసుకెళ్లడం లాంటి సంఘటనల్ని చిత్రించారు. రామరాజును తన వెంటనే బందీగా తీసుకెళ్ళిన గుడాల్ నీ సమస్య ఏంటని ప్రశ్నించగా దానికి ఆయన బ్రిటీష్ పాలన నాకు సమస్యని, అది నాఒక్కరి సమస్య మాత్రమే కాదని యావత్తు భారతీయుల సమస్యని సమాధానమిస్తాడు. ఆ సమయంలో గుడాల్‌కి రామరాజుకి మధ్య సంఘటనని తెలుపుతూ–

"ఇండియన్ కుక్కా! బ్రిటీష్ జాతి పాలన సమస్య కాదు. అది ఎవరైకైనా భగవదనుగ్రహం. దీనిపేరే వైట్‌మ్యాన్ బర్డెన్! వినలేదా? నా దేశ ఖజానాకి చేరిన ప్రతి సెంట్ చెబుతుంది. మీ పాలన భాగవదనుగ్రహమో, రాక్షస పాలనో ఆ రాక్షస పాలన మీదే మా పోరాటం అన్నాడు రామరాజు. అంతే తీవ్రంగా ఈ అలజడంతా అందుకేనా? మళ్ళీ అన్నాడు గూడాల్ వ్యంగ్యంగా. నామాతృభూమి స్వాతంత్ర్యం కోసమే మా పోరాటం! ఇది అరాచకం కాదు. ఈ కొండ జంతువులతో నీకు పనేమిటి? భారతభూమి మాదే, భారతీయతకు తాత్వికతని ఇచ్చిన ఈ అడవీ మాదే, రెండూ వేర్వేరుకాదు. అడవిలో

పుట్టిన, మైదానంలో పుట్టిన అంతా భారతీయులే. భారతీయతా? అదేమిటి? మాదైన జీవనం మాదైన ధనం, మాదైన జ్ఞానం, మాదైన ఆరోగ్యం. ఇవన్నీ ఎవరు చెప్పారు? ఎక్కడ రాశారు? మా వేదాలు, మా ఉపనిషత్తులు, పురాణాలు ఇక చెప్పాయి"[28] అని రామరాజు సమాధానమిస్తాడు. జమేదార్ కుంజమీనన్ దగ్గర నుండి రామరాజుని తీసుకువచ్చిన గుడాల్ రామరాజుని ఒక చెట్టుకు కట్టి రామరాజుని ప్రశ్నిస్తూ సంఘర్షనాత్మకంగా వీరిద్దరి సంభాషణను, వాదోపవాదాలలో జరిగిన తీరుని స్పష్టం చేశారు.

తర్వాత గూడాల్ రామరాజుకి తన పిస్టల్‌తో కాల్చి చంపడం ఆ విషయాన్ని తెలుసుకున్న కుంజమీనన్, రూథర్ ఫర్డ్‌లు వచ్చేసరికి రామరాజు అసువులు బాస్తాడు. రామరాజుని సజీవుడిగా తీసుకురమ్మంటే శవంలా తీసుకొచ్చినందుకు రూథర్‌ఫర్డ్ గూడాల్‌పై ఎంత కోపాన్ని చూపినా ప్రయోజనం నీరుకారిపోయింది. రామరాజు పార్థివ దేహాన్ని కృష్ణదేవిపేటలో ఊరేగింపుగా తీసుకురావడం అది తెలుసుకున్న ప్రజలు నిర్ఘాంతపోవడం లాంటి అనేక విషయాల్ని ఈ అధ్యయంలో చర్చించారు.

ఆఖరిదైన పద్నాల్గో అధ్యాయంలో రామరాజు అనుచరుల్ని బ్రిటీష్ ప్రభుత్వం ఒక్కొక్కరిగా అరెస్టు చేయడంతో రామరాజు శకం ముగుస్తుంది.

ఈ విధంగా ఈ నవల్లో ఆద్యంతం రామరాజు ఆధ్యాత్మిక చింతన నుండి బ్రిటీష్ ప్రభుత్వంపై విరగబడిన తీరుని ఆయన వారి అనుచరులు బ్రిటీష్ ప్రభుత్వంపై జరిపిన ధర్మపోరాటాన్ని కళ్ళకు కట్టినట్టు చిత్రించారు రచయిత. ఆ మన్యవీరుని జీవిత పర్యాంతం జరిగిన ఆధ్యాత్మిక, విప్లవ పరమైన ఉద్యమాన్ని చక్కగా శైలి విన్యాసాలలో పాఠకలోకానికందించారు గోపరాజు నారాయణరాజు.

### 4.2.2 పాత్రచిత్రణ:

సందర్భానుసారంగా పాత్రచిత్రణ గావించడంలో గోపరాజు నారాయణరావు గారి అందెవేసిన చేయి. 14 అధ్యాయాలు గల ఈ ఆకుపచ్చ సూర్యోదయం' నవల్లో పాత్ర చిత్రణ మరియు సంభాషణల్ని చక్కగా చిత్రించారు రచయిత. ఒక్కో అధ్యాయాన్ని అనేక విభాగాలుగా చేసుకొని సందర్భానుచితంగా పాటించడం ఈ నవల్లోని ప్రత్యేకతగా చెప్పొచ్చు.

ఈ చారిత్రక నవలలో గ్రామ పెద్ద మరియు అతిథి మర్యాదపరుడైన చిటికెల

భాస్కరనాయుడు, గ్రామ మునసబు లగుడు సత్యన్నారాయణ, చింతల నారాయణమూర్తి, చింతల అచ్చయ్యనాయుడు భాస్కరనాయుడిగారి తల్లి అనుబంధాలకి, ఆత్మీయతలకు నిలువెత్తు నిదర్శనంగా నిలిచే సోమమ్మ, భాస్కరుడిగారి ఇంటి చాకలి గంజేటి నూకాలమ్మ భాస్కరుడి గారి మొదటి సంతానమైన దమయంతి ఆగంతుకుడైన రామరాజు, ధనుర్విద్యలో గొప్ప ప్రావీణ్యం గల అటవీపుత్రుడు ఎర్రేసు, అతని మిత్రుడు మోదిగాడు, డిప్యూటీ తహాశీల్దారు ఆల్ఫ్ బాస్టియన్, తమ్మనదొర ద్వార బందాల చంద్రయ్య మొదలైన పాత్రలతో కృష్ణదేవిపేట ప్రజల ఆచార సంప్రదాయాల్ని ఊరికట్టుబాట్లను, అక్కడ జరిగే వ్యాపార పద్ధతుల్ని, సాంస్కృతిక కళల్నీ, ఆదరాభిమానాన్ని, స్నేహపూరిత వాతావరణాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించారు రచయిత.

అలాగే గిరిజనులపై జరుగుతున్న దాడుల్ని ఎర్రెసు పాత్ర ద్వారా స్పష్టం చేశారు. రూధర్‌ఫర్డ్, మేజర్ గూడాల్ అనే ఆంగ్లేయ పాత్రలను మరియు రామరాజుకు వారి మధ్య జరిగిన సంభాషణల్ని చక్కగా వ్యక్తీకరించారు. మొదలైన పాత్రల ద్వారా ఈ నవలను పండిత పామరసైతం అర్థమయ్యేరీతిలో పాఠకలోకానికందించారు. గోపరాజు నారాయణరావు. ఈ నవల ఆది నుండి అంతం వరకు కూడా విప్లవపూరిత సంఘటనలతో చిత్రీకరించడం జోతకమౌతుంది.

## 4.2.3 రచనా వైశిష్ట్యం:

డా॥ గోపరాజు నారాయణరావు "ఆకుపచ్చ సూర్యోదయం" నవలని ఆది నుండి అంతం వరకూ ఎక్కడా కూడా కథాభంగం జరగకుండా రచన సాగించారు. అటు జీవిచరిత్రని, ఇటు ఉద్యమ స్ఫూర్తిని వర్ణనా వైశిష్ట్యంతో చక్కని చారిత్రక నవలగా ఆవిష్కరింపజేశారు. ఇందలి వస్తువు ఆద్యాంతం, ప్రజాచైతన్యం, ఆర్తనాదాలు, భయాందోళనలతో, హఠత్పరిణామాలతో సాగుతుంది. ఈ రచనా నడవడిక పదాల్లో, వాక్యాల్లో అర్థవంతంగా, సుభగ్రాహ్యంగా, ఆకర్షణీయంగా, గోదావరి మాండలికంలో సాగుతుంది. ఇది వారి రచనా నైపుణ్యానికి తార్కాణం. వకుణభరణం రామకృష్ణగారు చెప్పినట్లు కథాంశాన్ని పత్రికా రచన విధానంలో నడిపించడం వాస్తవాల్ని, వాటి ఆధారాల్ని కూడా నిక్షిప్తం చేసిన నవలగా దీన్ని పేర్కొన్నారు. దేశ స్వాతంత్ర్యం కోసం, ఆదివాసీల అగచాట్లను తుడిచివేయడం కోసం కృషి చేసిన రామరాజు ధైర్య సాహసాల్ని విప్లవ జీవితాన్ని చక్కగా ప్రస్ఫుటించారు.

జీవిత చరిత్రగా, ఒక ధార్మిక ప్రవచనంగా, ఒక చైతన్య స్రవంతిగా, విప్లవోద్యమ కావ్యంగా ఈ నవలని చిత్రీకరించారు. అదే విధంగా ఈ నవల్లో ప్రకృతి వర్ణన, నగర వర్ణన, పుణ్యక్షేత్రాలు, ఆధ్యాత్మిక స్థలాల వర్ణనల్ని కడురమ్యంగా స్పష్టీకరించారు. రచయిత. అంతేకాకుండా ఈ నవల్లో పాత్రల మధ్య సంభాషణల్ని, స్వప్న వృత్తాంతాన్ని, దేశం కోసం జరిపే యోధుల పోరాట పటిమల్ని ఉద్భృతి కలిగించే అనేక సంఘటనల్ని ఈ నవల్లో అనువనువునా వెల్లడి చేశారు.

రెండో అధ్యాయంలో భాస్కరనాయుడిగారింట్లో బస చేస్తుండగా రామరాజు గారి తల్లి, చెల్లి, తమ్ముడు వచ్చిన సందర్భంలో వారు ఆరోజు భోజనాలు చేసిన తర్వాత వాళ్ళంతా ఒక నులక మంచం మీద కూర్చుంటారు. ఆ సమయంలో వారి గృహ పరిసర ప్రాంతాల్ని వర్ణిస్తూ– “అందమైన పెరడు, మధ్యలో తులసికోట, ఒక పక్క గుండ్రటి ధాన్యపురాశి. దాని మీద పచ్చటి గొడుగు వేసినట్టు దట్టమైన ఆకులతో బాదం చెట్టు ప్రహరీ గోడని ఆనుకొని రెండు వేపచెట్లు ఒక మామిడి చెట్టు, రెండు కొబ్బరి చెట్లతో ఆహ్లాదకరంగా ఉంది”[29] అని అంటూ ఆ ప్రదేశంలో గల ప్రకృతి వర్ణనను చక్కగా చిత్రించారు రచయిత.

అలాగే రామరాజు కలకత్తా నుండి వారణాశిని చేరుకుంటాడు. అక్కడ గల ప్రదేశాల్ని, వివిధ ప్రకృతి సిద్ధ వాతావరనాన్ని వరిస్తూ–

“గంగ–అసి నదుల సంగమం దగ్గర ఉండే అనేఘాట్, భాన్సలే ఘాట్, గోవిందఘాట్ నుంచి బదరీనాథ్‌కు వెళ్ళే దారిలో బదరీనాధ్.... పురాణాలలో చెప్పే బదరికాశ్రమం. అలకనంద తీరంలోని గొప్ప వైష్ణవ క్షేత్రం. ఉపనిషత్తులకీ, బ్రహ్మ సూత్రాలకీ భాష్యాలు అవతరించిన నేల. బదరీ నాధుడి ఆలయం – శంకర భగవత్పాదుల నిర్మించినది. అందులోనే జలం విష్ణుపాదాల నుంచి వచ్చినదని నమ్ముతారు. దారు ఆలయం తెరిస్తే మంచుకి లోపల నుంచి ఆవిరులు వచ్చాయి. నల్లటి విష్ణుమూర్తి ప్రతిమ”[30] అని చెప్పడంలో యాత్ర విశేష వర్ణనలో కూడా రచయిత దైవ దృష్టి, దూరదృష్టి ప్రస్ఫుటమవుతున్నాయి.

అదే విధంగా గిరిజనులు వారు చేసే పనుల్లో అలసట పోడానికి పాడుకునే జానపద గేయాల్ని వరిస్తూ–

“ఒడ్డు ఒడ్డు కొండల కాడ... జంబియాజో జోదులంగరు
లోపలి లంకలనట్టి నడము... జంబియాజో జోదులంగరు

పాలుపట్టి వత్తునయ్యా... జంబియాజో జోదులంగరు
ననింబడి అగ్గిభాసలు... జంబియాజో జోదులంగరు
నీటిని నిలబడి నీటి బాసలు... జంబియాజో జోదులంగరు
ఇందే ఉండవో వాయుమొకం... జంబియాజో జోదులంగరు
తల్లిలేని చాలవు కొడక... జంబియాజో జోదులంగరు
గంగవొడ్డున గొడ్డమేయు తల్లిలేని బాలవు కాడకా... జంబియాజో జోదులంగరు
కొండ కింద కొనలే మేయు తల్లిలేని బాలవు కొడకా.. జంబియాజో జోదులంగరు[31]

అంటూ చక్కని శైలీ విన్యాసాలతో అలతి అలతి పదాలతో ఆనందదాయకంగా సాగే రచనలో కూడా గోపరాజు గారు నైపుణ్య ఛాతుర్యం వెల్లడౌతుంది.

ఈ విధంగా ఈ నవల్లోని రచనా వైశిష్ట్యం పండిత పామర జనరంజకంగా, పాఠకలోకానికందించారు రచయిత.

**ముగింపు:**

ఈ విధంగా నవలా రచనల్లో ఆయా రచయితలు ప్రదర్శించిన నైపుణ్యం, వర్ణనలు పాత్రచిత్రణ సంభాషణలు లాంటి విషయాల్ని వివరించాను.

# పాదసూచికలు

| | | | |
|---|---|---|---|
| 1. | అల్లూరి సీతారామరాజు | – పడాల రామారావు | పుట 11 |
| 2. | " | " | పుట 14 |
| 3. | " | " | పుట 22 |
| 4. | " | " | పుట 24 |
| 5. | " | " | పుట 27 |
| 6. | " | " | పుట 32 |
| 7. | " | " | పుట 33 |
| 8. | ఆకుపచ్చ సూర్యోదయం | – గోపరాజు నారాయణరావు | పుట **V** |
| 9. | " | " | పుట 13,14 |
| 10. | " | " | పుట 16 |
| 11. | " | " | పుట 25 |
| 12. | " | " | పుట 40 |
| 13. | " | " | పుట 46 |
| 14. | " | " | పుట 67 |
| 15. | " | " | పుట 74,75 |
| 16. | " | " | పుట 92 |
| 17. | " | " | పుట 92 |
| 18. | " | " | పుట 101 |
| 19. | " | " | పుట 101,102 |
| 20. | " | " | పుట 105 |
| 21. | " | " | పుట 111 |
| 22. | " | " | పుట 138,139 |
| 23. | " | " | పుట 153 |
| 24. | " | " | పుట 179 |
| 25. | " | " | పుట 189 |
| 26. | " | " | పుట 264 |
| 27. | " | " | పుట 265 |

| | | | |
|---|---|---|---|
| 28. | ,, | ,, | పుట 277 |
| 29. ఆకుపచ్చ సూర్యోదయం | – గోపరాజు నారాయణరావు | | పుట 30 |
| 30. | ,, | ,, | పుట 42,43 |
| 31. | ,, | ,, | పుట 122,123 |

# 5) బుర్ర కథలు - సంవీక్షణ

## 5.0:

బుర్రకథ ప్రక్రియ కూడా సమాహార కళగానే ప్రాచుర్యం పొందింది. పౌరాణికం, జానపదం, చారిత్రకం, సాంఘీకం, విప్లవం, అభ్యుదయంలాంటి అన్ని అంశాలకు ఇది అనువైన ప్రక్రియ. అందుకే అల్లూరి వారి జీవితం బుర్రకథల రూపంలో కూడా ప్రాచుర్యం పొంది ప్రజాధారణకు పాత్రమైంది. వీరిపై వచ్చిన సుంకర సత్యనారాయణ, పడాల రామారావు, షేక్ నాజర్, బి.వి.ఎన్. శాస్త్రి లాంటి వారు రాసిన బుర్రకథల్ని ఈ అధ్యాయంలో పరిశీలించాను.

## 5.1 సుంకర సత్యనారాయణ:

శ్రీ సుంకర సత్యనారాయణ "సీతారామరాజు"అనే బుర్రకథను 1945వ సంవత్సరంలో రాసిరి. దీని మొదట ముద్రణ జూలై 1953 నుండి ఎనిమిదవ ముద్రణ మే 1984 వరకు ప్రచురణ చేశారు.

ఈ బుర్రకథకు ముందుమాటలు "మద్దూరి చంద్రశేఖరరావు" చెబుతూ........

మన ఆంధ్రదేవంలో పల్నాడులో రైతులు పన్నుల నిరాకరణం చేవారు. వీర హనుమంతు ప్రాణాలను బ్రిటిష్ ప్రభుత్వం బలిగొంది. కానీ నాయకులు విప్లవ పద్ధతితో నడవకపోవడం వల్ల ప్రజా ఉద్యమాన్ని ప్రభుత్వం అణచి వేసింది.

అల్లూరి సీతారామరాజు టెర్రరిస్టు ఉద్యమాన్నుంచి, సహాయ నిరాకరణోద్యమాన్నుంచి కూడా అనుభావాలను గ్రహించాడు. టెర్రరిస్టుల వలె నిరంకుశ ప్రభుత్వోద్యోగులను హతమార్చడానికి ఆత్మార్పణ మొనరించి నంత మాత్రాన ఉపయోగం లేదని గ్రహించాడు. గాంధీజీలా ప్రజా ఉద్యమానికి "అహింస" అనే పేరుతో పరిమితులు ఏర్పరచకూడదని తెలుసుకున్నారు. అందుకే రెండింటికి విభిన్నంగా మన్య ప్రాంతంలో ప్రజా విప్లవాన్ని నడిపాడు.

మాతృదేశ విముక్తికి ధైర్యసాహసాలతో మన్య ప్రజలను ఆయత్తం చేశాడు. ప్రజా

సహకారంతో విప్లవాన్ని నడిపాడు. బ్రిటిష ప్రభుత్వాన్ని రెండేళ్ళకు పైగా గడ గడ లాడించాడు. ఈ యీ విప్లవాన్ని దేశమంతా వ్యాపింపచేయడానికి ఆంధ్ర నాయకులు గాని ఇతర నాయకులుగాని తోడ్పడలేదు. మన్య ప్రాంతం ప్రజలు, వారి నాయకుడు రామరాజు బ్రహ్మాండమైన బ్రిటిష్ సేవలను ఎంతకాలం ఎదిరించగలరు? ఈ లోపం వల్లనే మన్య వీరులు ఆహుతి కావలసివచ్చింది.

సీతారామరాజు చరిత్ర నిజంగా ఆంధ్ర ప్రజల స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన దివ్యమైన ఘట్టం. దీనిని బుర్రకథగా రాసిన రచయిత అభినందనీయులు. మన్య వీరుల చరిత్ర నుండి ఆంధ్ర ప్రజలందరి ఉత్సాహం పొందుదాం. భారత స్వాతంత్ర్యాన్ని సాధించడానికి, విశాలాంధ్రలో ప్రజా రాజ్యాన్ని నిర్మించడానికి ప్రతిన బూనుదాం" అని చంద్రశేఖర రావు వివరించిరి.

విప్లవ సింహం అల్లూరి సీతారామరాజు చరిత్రను చెప్పే కథ కాబట్టి అందరి లాగే సుంకర సత్యనారాయణ కూడా కథను మాతృదేశ గొప్పతనంతో వీరుల త్యాగ ఫలితల ప్రార్థనతో మొదలు పెడుతూ..........

"మాతృదేశము కొరకు - మరణించు భక్తుల
పూలతో పూజింప రావ - భక్తుల - పూలతో పూజింపరావ ॥మాతృ॥
స్వాతంత్ర్య పోరాటమును - చావో బ్రతుకో తేల్చుకొనెడి
వీర దేవ సేవకులకు - వేగరావ పూజ సేయ ॥మాతృ॥
బానిసలై యిల బ్రతికేకన్న - ప్రజలకు నరకము వేరే లేదని
ప్రజా రాజ్య స్థాపనయే మా
పరమావధియాని పోరు సల్పుచు..."[1] ॥మాతృ॥

అని భారతమాత కోసం మరణించిన వీర భక్తులకు ఘన నివాళులు, పువ్వులతో పూజింపవలయునని, స్వాతంత్ర్య సమరంలో ప్రాణాత్యాగం చేసిన వారిని మనం ఎప్పుడు గుర్తుంచుకోవాలని కవి వివరించాడు. బానిస బ్రుతుకులతో జీవించడం కన్న మరణమే మేలు అని, ప్రజారాజ్య స్థాపనమే మనందరికి కర్తవ్యబోధనగా కవి బోధించాడు. గాం సోదరుల వీరత్వాన్ని ప్రదర్శించడం కొరకు వారు ఎటువంటి వీరులో తెలియపరుస్తూ

(పరిచం చేస్తూ)........

కూడి చరించెడు జోడు పులులుర తందాన తందాన తందాన
గంటం దొర యన కవియు గార్జునుండు ॥
గాము మల్లుదొర భీమ బలుడర ॥
విల్లునంబుతో మల్లు కదలెనా ॥
వైరుల గుండెలు రెండగ పగిలీ – పరుగులెత్త వెర ॥
న్యాయ ప్రియుల న్యాయ మెరుంగరు ॥
గ్రామ పెద్దలీ భీమ బలాఢ్యులు ॥
మాన్యు లిద్దరీ మన్య ప్రజలను ॥
ప్రాణతుల్యముగ ప్రేమించెదరు ॥
ప్రజలున్నూ యీ వీరులకొరకై – ప్రాణము లిచ్చెదరు"[2] ॥

మన్య ప్రాంతమునకు ఈ ఇద్దరు సోదరుల యొక్క గొప్పతనాన్ని వారి వీరత్వాన్ని చక్కగా వర్ణించాడు. గ్రామ పెద్దలుగా, న్యాయం కోసం పోరాడే వారుగా, చిత్రీకరించాడు. మన్యం కొరకు వారి ప్రాణాలు త్యాగం చేయగల గొప్పవీరులు. ఈ వీరుల కొరకు ప్రజలు కూడా ప్రాణాలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారని కవి వర్ణించడం గొప్ప విశేషం.

ఈ బుర్రకథలో నాలుగు మూడు వంతల్ని వాడారు. అందులో గాం సోదరుల పరిచయంలో ఒక వంత వాడారు. వీరు పెద్ద పులులుగా ఉండేవారని, మంచి శక్తి సామర్థ్యంతో భీముని వంటి బలము కలవారు. శత్రువులు చూస్తే భయంతో పరుగులెడు తున్నట్టుగా, న్యాయాన్ని, ధర్మాన్ని అనుసరిస్తూ వాటితో బ్రతుకుతూ ఉండేవారు. గ్రామ పెద్దలుగా మన్య ప్రజలను ప్రాణంతో సమానంగా చూస్తూ ఆ ప్రజల కోసం ప్రాణం ఇవ్వడానికి సిద్ధపడిన వారిగా కీర్తించాడు.

ఇందులో ఒక వంతల్ని పాడారు. తందాన తందాన తందాన అనే వంతల్ని వాడారు. గాంసోదరులకు బాస్టియన్ సంభాషణలతో కాకుండా ఒక కీర్తనను కూడా రాయడం విశేషం. ఆ కీర్తనలో కూలీ జనుల కూలీ డబ్బు యివ్వమని వారికి అన్యాయం చేయవద్దని కీర్తనలో చక్కగా వర్ణించారు.

అదే సంభాషణలో గాంసోదరుల బాస్టియన్ పై కోపం ప్రకటించిన సందర్భంలో భళా భళానోయ్ తమ్ముడా ॥సై॥ భాయి భళానోయ్ తందానా అనే వంతలతో ప్రారంభమైనది.

పిచ్చి పిచ్చిగా వాగకు ॥సై॥
పిలిచి తిట్టుచున్నావుగ ॥సై॥
పైసకు గడ్డిని మేసెడి ॥సై॥
పశువు జన్మమే మెత్తల ॥సై॥
చావుకు వేరవము తెలుసున ॥సై॥
జాగ్రత్తగా మాట్లాడాలి ॥సై॥"[3]

రెండవ వంతులితో సాగిన ఈ వర్ణన పాఠకులకు చైతన్యాన్ని యిస్తుంది. దేశభక్తిపై ఉప్పొంగి పోయిన ధైర్యం వచ్చుటకు ఈ బుర్రకథ ప్రేరణ కలిగిస్తుంది.

3వ వంత కూడా జన ఆకర్షగా ఉంటుందని వంతులు మార్చడం జరిగింది. రామరాజు ఇంగ్లీషు చదువును బానిస చదువులుగా భావించి భవిష్యత్ ప్రణాళికను చెప్పడం.........

"3వ వంత తంతాదా భాయీ దేవ నందనా తందాన తాన
బిర బిర శాస్త్రాల్ చదువదలిచినాడు ॥
వేదాంత వైద్య గ్రంధముల జూచి కొన్ని ॥
జ్యోతిష శాస్త్రపు చవిని జూచి తుదకు ॥
రాజకీయ రహదారి వెదక సాగె ॥
పెద్దల కోసం లడిలో కూర్చింది ॥
తన శాస్త్రంబుల తలచి జపము చేయు ॥
తన పాఠము పై శ్రద్ధ తప్పియున్న ॥
బాలుని వద్దకు పంతులు నడిచాడు ॥
చదువులెందుకు రా రాజూ! నీకింక ॥
సన్యసించి హిమగిరులకు పోపొమ్ము ॥
చిత్తమదే యాలోచనయనె రాజు ॥
తందాన దేవ నందనాన తందానతాన"[4]

శాస్త్రాలు చదివాడు. వేదాంతాలు వర్ణించాడు. జ్యోతిష్యాన్ని జోడించి రాజకీయ మార్గాలను స్వాతంత్ర్య దీక్ష కోసం మార్గాన్ని వెదుకుచుండెను. ఇంటిల్లోవాళ్ళ గురించి పాఠాలు కోసం బడికి వెళ్ళుతున్నాడు. కానీ అతనికి చదువుపై శ్రద్ధ లేదు. సరికదా! పంతులుచే రామరాజు మనసులో కోరికను చెప్పించాడు. సన్యాసం పుచ్చుకొని హిమాలయాలు ఉత్తర భారత దేశయాత్ర, దేశంలో విషయాన్ని గ్రహించుమని ముందుగా పాఠకులకు అర్ధమైన రీతిలో కవి వర్ణించాడు.

సుంకర సత్యనారాయణ బుర్రకథలో కల్పితాలు

అల్లూరి సీతారామరాజును, అతని వేషధారణను తెలుపుతూ.......

"కరుణా రసభర భరిత స్వాంతుడు – కాషాయాంబరుడు

కొండ కొనల దొంటిగ తిరుగుచు – కోదండము బూని" అది కేవలం నవల, నాటిక, కథారచయితల కల్పితం మాత్రమే తెల్లని పంచెను మొలకు కట్టుకొని ఒక అంగవస్త్రాన్ని కప్పుకునే వారని దాలినాయుడు (కృష్ణదేవిపేట) తన డైరీలో రాసుకున్నాడు. రామరాజును చూసి కృష్ణదేవిపేట గ్రాస్థులు కూడా ఇదే విషయాన్ని తెలియపరిచారు. ఈ చరిత్ర చెబుతున్న నిజం.

అలాగే ఏజన్సీ ప్రజలను బాస్టియన్ బంధించే సమయంలో ఒక యువకుడు వచ్చి అదుష్ట కార్యాన్ని ఖండించారని అతడే రామరాజు అని సుంకర తెలిపారు పైగా రాజు ఆ ప్రాంతానికి రావడం మొదటి సారి అని అభిప్రాయపడ్డారు. అలా వచ్చిన బాస్టియన్‌తో మన్యం ప్రజల తరపున వాదించిన రాజును, ఎక్కడికీ వెళ్ళనీయకుండా కృష్ణదేవిపేటలో ఉండమంటూ గంటం దొర అపాడని కూడా సుంకర బుర్రకథలో విన్నవించారు.

కానీ ఇది వాస్తవం. తపస్సుకు అనువైన చోటుగా కృష్ణదేవిపేటకు రామరాజు రావడం మొదట చిటికెల భాస్కర నాయుడుతో పరిచయమై ధారకాండలో నివాస మేర్పరచుకొన్నాడనేది వాస్తవం.

అట్లాగే రామరాజు జననం విశాఖపట్టణం జిల్లా పాండ్రగి గ్రామంలో అమ్మమ్మ గారింటి వద్ద 4-7-1897 పుట్టినట్లు చరిత్ర చెబుతుంది. ఇది వాస్తవం కాని సుంకర ఈ బుర్రకథలో రామరాజు పశ్చిమ గోదావరి జిల్లాలోని మోగల్లు గ్రామంలో జన్మించినట్లు

చెబుతున్నారు. పుట్టకను కూడ జనరంజకముగా బుర్రకథను చెప్పుటకు వాస్తవాలను మరచి కట్టుకథలతో కథను రక్తి కట్టించుటకు చరిత్రను మరిచిపోయారు.

ఈ విషయాలు చిటికెల దాలినాయుడు డైరీ, అల్లూరి సీతారామరాజు మేనల్లుడు దంతూలూరి వేంకట రామరాజు పుస్తకం రామరాజు చరిత్రలో ఉన్నాయి.

అట్లాగే బొజ్జన్న పడాలు, గంటందొరలు మరణించిన తర్వాత అగ్గిరాజు జైలు పాలైన తర్వాత ఉద్రేకంతో రామరాజు స్వయంగా ఆంగ్లేయులతో యుద్ధం చేశాడని వివరించారు. కానీ రామరాజు బ్రిటిష్ అధికారులకు పట్టబడడం చరిత్ర కారులు అంగీకరించిన విషయం అని మనందరికి తెలిసిన విషయం.

సుంకర సత్యనారాయణ బుర్రకథలో కథా కథనాలు విశేషాలు

ఈ బుర్రకథలో పద్య గేయాత్మకంగా స్థానిక వర్ణనలతో రసవంతంగా చెప్పారు. ప్రకృతితోపాటు కోయలు, చెంచులు మొదలైనవారు గూర్చి మన్యంలో దొరికే కాయలు పండ్లు, దుంపలు, వెదురు బియ్యం స్వేచ్ఛగా తింటూ జీవించేవారు ఇంకా.......

"కనబడు అలనేరేడు ఫలంబులు – కటికినలుపెకాని
వనదేవి ముఖ విషాద చిహ్నాము – లను గూడదు వాని
వెలగపండ్ల విబూది పండ్లవలె – తెల తెల్లగ నుండు
తెలుపునను వన బలహీనతనా – ఫలములు తెలుపువుగ
పైరంగేదైనను లోపలి మధు – పదార్థమది మెరుపె
పౌరుషమును క్రాంతిని శాంతిని – ఆవనము పూముచుండ"[5] అని

మన్య ప్రాంతంలో ఉన్న ప్రజలు కల్లాకపటం ఎరుగని వారని! నేరేడు పండ్లు చూచుటకు నల్లగా ఉంటాయి గానీ అది ఆరోగ్యానికి ఔషదగుణం యిచ్చెను. అడవిలో చెట్లు కూడా భగవంతునికి అర్పించిన విభూది పండ్ల వలె వర్ణించారు. తెల్లగ వున్న, నల్లగ ఉన్న మధుర ఫలములు ఇచ్చును. అక్కడ ప్రజలేకాదు ప్రకృతి కూడా పౌరుషముతో బ్రతుకును కాంతివంతంగా, శాంతివంతంగా ఉంటూ నిత్యం పచ్చగా ఉండేది. ఎల్లప్పుడు పువ్వులు, కాయలతో విరజిల్లతూ ఉండేదని సుంకర ప్రకృతిని వివరిస్తూ......

"మండుటాకలికి యోర్వలేనియే – మన్యవాసియైన
పండుగోసి తినెనా, యిక వానిని – చెండెదమన్నారు
జలగల వలె మన రక్తము బీల్చెడి – జమిందార్ల నిచట
నిలిపిన రీతిగ మఠాదార్లనట – నెలకొల్పిరి వారు
లంచగొండ్లకుద్యోగ మిచ్చెయా – కంచరగాడిదెల
దించిరిపై వారికి జతకొపలు – తీయ మన్యమందు"[6]

ఆకలి బాధను తట్టుకోలేని మన్య ప్రజలు అడవిలో కాసిన పండును కోసుకొని తింటే వాడిని బ్రిటిష్ అధికారులు అటవి చట్టం పేరుతో శిక్షలు విదించేవారు. అడవితల్లి బిడ్డలను బ్రిటిష్ చట్టం జలగల వలె తమ రక్తాన్ని, కష్టాన్ని పీల్చుకుని తినే వారు.

వర్ణబేధం లేని మన్యాన్ని చీల్చి, ముఠాదార్లు, కూలీలు, రైతులు, మనసుబులు కులాల వారిగా, వర్గాలవారిగా విభజించి వారిలో వారికి కలహాలతో ముడిపెట్టించేవారు. లంచగొండ్ల అధికారులు ప్రజల సంపదలను దోచుకుపోయేవారు. ఇటువంటి అరాచకాలను, అటువంటి ప్రకృతి వర్ణనలను వివరించి పాఠకులకు వినోదము, చైతన్యమును కలిగించుటకు సుంకర కృషి అభినందనీయము.

ఈ బుర్రకథలో చింతపల్లి పోలీస్‌స్టేషన్ విజయాన్ని మాత్రమే వర్ణించారు. ప్రజలకు అండదండలు ఉండటం, బ్రిటిష్ వారిని ఎదిరించడం పోలీసుస్టేషన్‌లో కొల్లగొట్టిన తుపాకులు, కత్తులు మొదలైన ఆయుధాలు తూటాలు, డబ్బు, తెచ్చి రాజు ఎదుట పడవేశారు, ఆ వీరుడి ధనాన్ని, ఆయుధాలని ప్రజలకు పంచియిచ్చారని కవి తెలిపారు. మిగిలిన చరిత్రలో ఎక్కడ ధనాన్ని తీసుకొని ప్రజల కిచ్చినట్లు ఎక్కడ లేదు. ఈ కవిచతురతకు నిదర్శనం.

రామరాజు సైన్యాన్ని, విప్లవాన్ని అణుచుటకు బాస్టియన్ వివిధ దళములను కవర్ట్, హైటర్ అను ఆంగ్లేయ సైనికులకు యుద్ధ నిపుణులను విప్లవ వీరులను అణచుటకు బయలుదేరి ఇరుకు దారిలో వస్తుండగా…

"భారతీయ సిరిసంపద తిని తెగ – బలిసిన పందులన
మోరలెత్తుకొని కదిలిరి అరుగో – బోరలు పెంచుకొని

కనుల నగ్ని కణంబుల గురియుచు – గంటం దొర బలికె
చిన్నప్పటి దొండాకు పసరు ఈ – దున్నలు కక్కాలి
వీడ నాకు బలి వాడ నీకు బలి – విడవర యన్నాడ
జోడు తుపాకీలు గురిపెట్టిరి యా – శూరశిఖామణులు"[7]

మన భారతదేశ సిరిసంపదలను పందుల్లా మెక్కి శరీరాన్ని పెంచుకొని గుండెలు విరుచుకుంటూ వస్తున్నారని కవర్టు, హైటర్లును చూస్తే గాంసోదరులు పలికిరి. మన సైన్యం ప్రతాపాలను చూపించి వాడు చిన్నప్పుడు తాగిన ఉగ్గుపాలను కక్కించాలి. అని గాంసోదరులిద్దరు ఒక్కొక్కరి పై గురిపెట్టి తుపాకీతో ఆ ఇద్దరిని చంపివేసిరి. ఆ ఇద్దరు లోయలోకి పడి చచ్చిపోతారు. చరిత్రలో మొత్తం విప్లవ సైన్యం మార్గమధ్యలో రాళ్ళతో, బాణాలతో కదలకుండా చేసి లోయలో పడి చచ్చిపోయినట్టున్నది. ఇది వాస్తవం. కానీ బుర్రకథలో గాంసోదరులు చంపినట్లు చెప్పడం వారి వీరత్వానికి కవి ఎక్కువ ప్రాధాన్యత కనిపిస్తుంది.

బ్రిటిష్ ప్రభుత్వానికి గట్టి దెబ్బ తగిలింది. తీరని పరాభవాన్ని అంగీకరిస్తున్నా సమయంలో రామరాజు హెచ్చరించిన విధానము...

"దొరల గాల్చి శవము నిల్పుటమా – పరమావధిగాదు
దొరతనాన్ని నాశనము జేయుటేమా – పరమాధర్మమోయి
మీరు గాదు మీ తలలను దన్నిన – వీరులె వచ్చినను
గోరిలను కట్టించెద మిచ్చట – నోరోరీ మేము
యుద్ధానికి నే వేళకైనా సం–సిద్ధమే చేయు
ఆంధ్రపుత్రులము మమ గెల్చుట – మీ యబ్బతరముగాదు
ఆంధ్రప్రజా రాజ్యస్థాపన మా యాశము మది తీరు"[8] అని పలికెను.

ఆంగ్లేయులను చంపుట వారి శవాలను దాచటం మా పనికాదు. "బ్రిటిష్ అధికారాన్ని నిర్మూలించుట, ఆంగ్లేయుల సామ్రాజ్యాన్ని నేలమట్టం చేయటమే మా ప్రధానలక్ష్యం." మీరు కాదు మీకంటే వందరెట్లు ఉన్న బ్రిటిష్ సైన్యం వచ్చిన మీ సమాధులు కట్టించడం ఖాయం. మీవాళ్ళు యుద్ధానికి వచ్చారు, చచ్చారు. ఏ వేళనైన యుద్ధానికి

మేము సిద్ధం. ఆంధ్ర వీరులును గెలుచుట మీ అబ్బ తరం కాదు! ఆంధ్ర ప్రజా రాజ్యస్థాపనే మా విధి, కోరిక అని మిరపకాయ టపాసుతో ఆంగ్లేయులకు పంపినారు. అంతటితో భయపడిన ఆంగ్ల అధికారులు ఫిరంగి దళంతో కూడిన మలబారు అస్సాం వంటి తెల్లసేనల్ని రంగంలోకి దింపింది.

అప్పుడు రామరాజు కూడ శత్రువుల బేద్యవ్యూహంబుగా దళాన్ని సమకూర్చినాడు. తన విప్పవసైన్యాన్ని తీర్చిన తీరు..........

మెరుపు తీగవలె నంతట దానై తిరుగుచును గ్రుండై
పరౌకాల్చుచు తనవారి రంగమున కురి పంచెను తెగువ
సింహ నాదములు సేయుచు వీరులు చెంచులు కోయలుర
సింహపు పిల్లల యేన్గుల పుర్రెలు – భేదించిన రీతి
కీ కారణ్యంబున దావానల కీలలచందమున
యే కలవ్య వంశస్థుల గురి మీరిచే చూడదునుచు[9] అంటూ

ఆకాశంపై మెరుపు వలె వేగవంతంగా అడవి నంతటిని తిరుగుచున్నారు. చైతన్యంను, సైన్యంనకు రంగరించి విప్లవంతో సింహనాదము చేయుచూ వీరులు కొండజాతి, కోయాలు, చెంచులు మొదలైన గిరిజన జనులు సింహపు పిల్లలుగా, మధపుటేనుగులుగా శక్తి సామర్థ్యాలతో యుద్ధానికి సిద్ధం చేసెను.

అంతే కాకుండా........

వందలు వేలు గెరిల్లాలను భ్రమ – వైరికి కలిగింప
క్రిందికి పై కెగబ్రాచుచు వైరు క్రిందు మీదు జేసి
నిలుచుచు, నక్కుచు, ఉరుకుచు, దుకుచు తపడిపారుకును
కలత పరిచె పగలంతా సేనల నిలిపిలేసిరాండి[10] అని

విప్లవసైన్యం గెరిల్లా యుద్ధ నిపుణతతో అక్కడ సైన్యం ఉన్నట్టు లేనట్టు భ్రమను బ్రిటిష్ అధికారులకు కలిగించిరి. నిలబడి, నక్కిపోయి, ఉరుకుచు, దుకుతూ అనేక విధములుగా యుద్ధ నిపుణతను ప్రదర్శించడానికి సిద్ధంచేశారు. ఈ విధంగా పోరాడి

శత్రుసైన్యల్లో గందరగోళాన్ని సృష్టించాయి. ఆంగ్ల పాలకులు అంతటితో ఆగక “మార్షల్”ను ఉపయోగించి పల్లెల్ని కాల్చుతూ, పసిబిడ్డల్ని చంపుతూ, స్త్రీలను అవమాన పరుస్తూ స్వైర విహారం చేసిరి. ఈ హింసల్ని చూసి భరించలేక గాంసోదరులు నల్గురు గెరిల్లాను తీసుకుకొనిపోయి శత్రువులతో పోరాటాన్ని సాగించారు.

“జాతర కాడ బలిదున్నల నరికిన రీతి”లో గందర గండడు గంటం దొర పోరాటం చేసి, వీరమరణం పొందాడు. అగ్నిరాజు, మల్లుదొర పట్టుబడ్డారు. పడాలు మరణించాడు. చివరకు రామరాజు పోరుకు సిద్ధమై... (చివరగా రామరాజు పోరుచేయడం చరిత్రలో లేదు)

దిగజారగ ముచ్చమటలు వీరుడు  తందాన తందాన తందాన
ఖడ్గదారియై కారదు వినిబడి  ॥
కన్నుల నిప్పులు గ్రక్కుచు పోయెడి  ॥
ప్రజారక్షకుని రామరాజు నా  ॥
దారులు గా చెడ దమజులు నీచులు – వైరుల చూచారు  ॥
అరిభేకరుడు రాజును గన్గోని – యదిరి గుండె చెదిరి  ॥
బిర బిర తుపాకులెత్తి కాల్చిరా – పిరికి పందలంత  ॥
క్రూరగాల్చెడి గుండ్ల దెబ్బలకు – వీరుడు తట్టుకొని  ॥
వీరా కేశంబున నిట్ల నియా – శూరాగ్రణి పలికె  ॥
ఆంధ్రదేశము వందన మిదిగో – అందుకో గదమ్మా  ॥
ఆంధ్రులారా గైకొనుడు నా విప్లవాభివందనములు”[11] అని అంటూ

కన్నభూమి ఒడిలోని వెళ్ళిపోయాడు తనసైన్యంలో వీరులు కొందరు బందిలైపోయారు. మరికొందరు మరణించారు. దానితో రామరాజు కోపంతోపాటు వీరత్వంతో కత్తిపట్టుకొని అడవి అంత గాలించాడు. కన్నుల నుండి కోపాగ్ని రగిలిస్తూ శత్రువులను వెదకడం ప్రారంభించాడు. రామరాజు కొరకు అన్నిదారులను వెతికిన బ్రిటిష్ వాళ్ళు గురిచూసి రామరాజుపై తుపాకి గుళ్ళ వర్ష కురిపించారు. ఆంధ్రదేశమా వందనాలు సమర్పించినట్టు, ఆంధ్రులకు చివరి విప్లవాభివందనాలు చెప్పినట్టు కవి పేర్కొన్నారు.

**5.1.1 బుర్రకథలో భాషావిశేషాలు:**

బుర్రకథ లిఖితరూపంలో ఎలా ఉన్న ప్రదర్శనలో రూపాంతరాలు చెందుతుంది. స్థల కాలాలను బట్టి మారుతుంది. పెరుగుతుంది, తరుగుతుంది. మూల రచనను మించి కళాకారుని ప్రతిభను చాటుతుంది. సామాజకుల్ని బట్టి భాషా మారుతుంది. సూక్తులు మారతాయి, జోకులు మారతాయి.

దళాలను బట్టి వేసాలు మారుతాయి. కథాగాన సమాయాల్లో పల్లెప్రాంతాల్లోని పామరుల హృదయాల్లోకి చొచ్చుకొని పోయే రీతిలో సామెతల్ని జనుల నోళ్ళల్లో నానుడుల్ని, ప్రయోగించటం పరిపాటి. ప్రస్తుతం అల్లూరి సీతారామరాజు బుర్రకథలో రచయిత ఏవిధంగా తమ పలుకుబళ్ళను పలికారో పరిశీలిద్ధాం.........

జలగల వలె రక్తము పీల్చెడి (పుట:9)
పోత విగ్రహము లంచగొండి యొక పాతకముల పుట్ట (పుట:9)
అంగడిలో అన్నీ వున్నాయ్, అల్లుడి నోట్లో శని ఉంది (పుట:10)
నిప్పుదొక్కిఎచన కోతి (పుట:14)
సలసల నెత్తురు కాగెను (పుట:18)
కామెర్తరోగికి ప్రపంచమంతయూ కనబడ పచ్చగానే (పుట:21)
నిలువు గుడ్డ పడిపోయెర (పుట:22)
బతికియుంటే బలుసాకులన్ని తిని బ్రతక వచ్చునోయి (పుట 32)
ఆవులిస్తే పేగులు లెక్కించే (పుట:33)
గద్ద తన్నిన కోడి పిల్లవలె (పుట:42)
అమ్మకడుపు చెరువై విలపించు (పుట:42)
పోవీ పోవీయని (పుట:43)
జాతర కడ బలిదున్నలు నరికిన (పుట:43)
రతనాలు పండించినాడు (పుట:50)
జీవచ్ఛవంబులన యిట్లు (పుట:51)

## 5.2 శ్రీరామరాజు యుద్ధం – షేక్ నాజర్:

కవి, కళాకారుడుగా సేవ చేస్తున్న బుర్రకథ పితామహుడు నాజర్. భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదుతో సత్కరించింది. ఈయన బుర్రకథలలో రంగ ప్రవేశం చేసే నాటికి దేశంలోని దేశభక్తి ప్రబోధం, ఐక్యతా వాదంపై అనేక కవితలు, నాటకాలు. కళారూపాలు వెలువడుతున్నాయి. నాజర్ కూడా ఈ నేపధ్యంలోనే శ్రీరామరాజు యుద్ధం అనే బుర్రకథను రాసినట్లు తెలుస్తుంది. ఎన్.టి.రామారావు, భానుమతి నటించిన అగ్గిరాముడు సినిమాలో వారి సమక్షంలో శ్రీరామరాజుయుద్ధం బుర్రకథను పాడి వినిపించడం విశేషం.

నాజర్ దళం వారు గత 20 సంవత్సరాలలో కొన్ని వేల సార్లు ప్రదర్శనలిచ్చారు. ఈ బుర్రకథలో ఐదు రకాలైన వంతల్ని ప్రవేశపెట్టారు.

“బాలరాజై బాణ మందెరా సై
బాలుడా విల్లెక్కు బెట్టిరా సై
కనులకే గంతలు గట్టిరా సై
గగనానా డెగల్ని గొట్లాడా భళానంటి తమ్ముడా”[12] అని అంటూ

చిన్ననాటి నుండి విల్లుతో బాణాలను ఎక్కుపెట్టివాడ. కనులకు గంతలు కట్టి శబ్ధమును బట్టి బాణాలతో ఆకాశంమీద వెళ్ళే పక్షుల్ని, చెట్లపైన ఉన్న పండ్లను గురిచూసి కొట్టేవాడు. ఈ బుర్రకథలో “సై” అనే వంతల్ని ప్రవేశపెట్టి జనరంజకంగా పాడేవారు.

2వ వంతల్ని ప్రవేశపెడుతూ....... బ్రిటిష్ వారి దుష్టచర్యలు వివరిస్తూ....

“మందిసోమ్ముతిని మరిగిన దొరలు          తందానా తాన దందాన దేవనందానానా”
వందల కొందలు చందా దారులు          ॥
బ్రాందీ విస్కీ– బాష్టీనుకు దెచ్చిరి          ॥
పందివారు బహుమతిగా నిచ్చెరి[13] అని పలుకుతూ.......

ప్రజల సోమ్ము, మన్యంలో సంపదను తిని బలిసిపోయిన బ్రిటిష్ దొరలు మందులతో, మత్తులతో అనేక కానుకలు మఠాదార్లు, మనసబులు బాస్టియన్ బహుమతులుగా ఇచ్చేవారు. బ్రిటిష్ అధికారుల వద్ద గొప్ప పొందుటకు ఈ విధంగా చేసిరి. ఈ కథలో

'తందాన తన తందానా దేవనందనానా' అనే వంతల్ని ప్రవేశపెట్టారు.

"రామా రామ రామా... కోదండ రామ పాహి
హరి రామ చంద్రపాహి... పట్టాభిరామ పాహి..."[14] అని కొలస్తూ

భద్రచలం సీతారాముడుగా ప్రజల కష్టాలను, దీర్చుటకు వచ్చిన వాడుగా రామరాజును భావించేవారు. అక్కడ ప్రజల యొక్క మన్ననలను, అభిమానాన్ని పొందే విధానాన్ని మరొక వంతలతో ఈ బుర్రకథలో అలపించారు.

పోలీసుస్టేషన్ దాడికి వెళ్ళే సమయంలో.......

"రాజకు జయమని పల్కెరా....... తతక్కధోం
కల్ల రికార్డుల కాల్చరా....... తతక్కధో"[15] అని

బీభత్సంతో నిండిన వంతల్ని పాడారు. సైన్యంతో కాళిక దేవి పూజ చేసి జైజై నినాదాలతో రామరాజుకు విజయం కలిగినని సైన్యం వీరావేశంతో పలికెను. పోలీసుస్టేషన్ దాడిలో రికార్డులను తగలబెట్టి, ఆయుధాలను స్వాధీనం పరచుకొనేవారని కవి వర్ణించారు. ఈ నాల్గవ వంతను తతక్కధోం అని ప్రయోగించి పాఠకులను రంజింపజేశారు.

రామరాజు ఆయుధాలతోపాటు యుద్ధవీరులు విడించిన తీరు...
ఖైదులో వీరయ్య నోదిలారా... భళానం
తుపాకి గుండల్ని ఏప్పారా... ॥
తూటల్ దలు వేశారు"[16] అని పలుకుతూ

పోలీసుస్టేషన్ కొల్లగొట్టి అందులో ఆయుధాలను స్వాధీనం చేసుకొనిరి చెఱసాలలో ఉన్న యుద్ధ వీరులను విడిపించి వారి మరింత విప్లవ చైతన్యాన్ని, ధైర్యాన్ని ఇచ్చి స్వాతంత్రోద్యోమంలో పోరాటయోధులుగా పిలిచితిరి. తుపాకి తూటాల గుండ మొడలో దండలుగా వేశారని కవి వర్ణించారు. ఈ వంతలో "భళానాం" అనే పదాన్ని వాడారు. బుర్రకథ సామ్రాజ్యానికి మకుటం లేని మహారాజుగా వెలుగొందిన ఈ పద్మశ్రీ షేక్ నాజర్ వినిపించే కథలను బట్టి వంతల్ని మారుస్తూవుంటారు.

## శ్రీరామరాజు యుద్ధం బుర్రకథలో కల్పితాలు

బుర్రకతలో నాయకుల వారి నైజానికి అనుగుణంగా ప్రతి కథను మలుచుకుంటారు. అందుచే నాయకుని కన్నా విద్యార్హతలన్ని అతని బాల్యంలో పాఠశాలలో నేర్చుకున్నాడు. అంటూ అతిశయోక్తిగా చెప్పడం నాజర్ లక్షణం. అదేవిధంగా కల్పితాలను చూద్దాం.

మేటి ఉస్తాదుల్నిడా శరా..... సై
పెన్నుతోనే గన్ను బట్టిరా..... సై
పచ్చిపులి నోషనే గొట్టిరా.... భళానంటూ[17] అని వర్ణిస్తూ

రామరాజు బాల్యంలోని సాహస కార్యాలు చేసినట్లు కవి వర్ణించాడు. కోటలన్ని కత్తులతో ఎదిరించినట్టు అనగా కత్తిసాములో ప్రవీణుడుగా పేరుపొందాడు. వస్తాదులను కుస్తీలతో పొట్లాడుట అనగా మల్లయుద్ధంలో వీరునిగా ఖ్యాతి వహించాడు. పెన్ను పట్టకొనే చేతిలో గన్ను పట్టుకున్నారు. తుపాకి కాల్చుటలో నేర్పిరిగా తెలిపాడు. పులిని సహకరించిన శౌర్యం ఉన్నట్లు ఈవన్నీ చిన్నతనంలో ఉన్నట్టు కవి చెప్పాడు. ఈ విధంగా నాజర్ అల్లూరి సీతారామరాజు బాల్య చేష్టల్ని చాలా రసవంతంగాను, ఆదర్శప్రాయంగాను వివరించాడు. పైన చెప్పిన విద్యలన్నీ రామరాజు పాఠశాలల్లో నేర్చుకున్నట్లు నిరూపించే ఆధారాలు లేవు. ఇవి చరిత్రలో ఎక్కడ చెప్పలేదు.

పై విధంగా విల్లువిద్యల్లో ఆరితేరిన రామరాజు పెద్దలతో, విద్యార్థులతో కలసి గాంధీ గారి వెంట స్వరాజ్య ఉద్యమంలో చేరిపోయాడు. శ్రీరామ రాజు అని కథకుడు చెప్పాడు...

నిజానికి అల్లూరి సీతారామరాజు రౌలత్ చట్టం, జనియన్‌వాలాబాగ్ ఉప్పుసత్యాగ్రహం, బార్డోలీ ఉద్యమం మొదలగు ఉద్యమాలతోపాటు ఏజన్సీ ప్రాంతపు ప్రజల హీన స్థితికి పరివర్తనం చెంది విప్లవ కారుడుగా మారాడు. అంతేగానీ గాంధీతోపాటు ఉద్యమం వెంట తిరగలేదు.

“రామరాజు సాయుధ పోరాటాన్ని గూర్చి.... “శ్రీరామరాజు సాహసం, దీక్ష, త్యాగం, ఏకాగ్రత శీలము మనమందరం నేర్చుకో తగినవే కానీ అతని సాయుధ పోరాటాన్ని

బలపరలేను" అని షేక్ నాజర్ పేర్కొనటం గమనార్హం."[18]

ఎందుకంటే ఈ విప్లవ పోరాటాన్ని అప్పటి ఆంధ్ర, ఆల్ ఇండియా కాంగ్రెస్‌లు వ్యతిరేకించింది. అంటూ మన్య వీరుల్ని దోపిడి దొంగలని ఆ మన్య విప్లవకారులకు ఏ సహాయం చేయవద్దనీ పెద్దాపురం కాంగ్రెస్‌కు ప్రకాశం పంతులు టెలిగ్రాం ఇచ్చినట్లు కూడా నాజర్ పేర్కొన్నారు.

ఏది ఏమైనా తనకు ఎవరి మద్ధతు లేకపోయినా మన్య వీరుల్ని వెంటబెట్టుకొని తిరుగలేని సాయుధ పోరాటాన్ని రామరాజు చేయడం అపూర్వ సాహసం ఇది చరిత్ర మరువలేని నిజం.

షేక్ నాజర్ శ్రీ శ్రీరామరాజుయుద్ధం బుర్రకథలోని కథాకథన విశేషాలు

పూర్వం జాతీయోధ్యమంతోపాటు అనేక రాజకీయ, సామాజికోద్యమాలకు జంగం కథ సాధనం అయింది. పార్టీ ప్రచారాలు జంగం కథల్లోనే మొదలయ్యాయి.

సుంకర సత్యనారాయణ, కాకుమాని సుబ్బారావులతో బుర్రకథ రూపం తీసుకు వచ్చారు. పద్మశ్రీ షేక్ నాజర్ ఆ బుర్రకథ రూపాన్ని విస్తరించి, విస్తృతమైన ప్రజా కళారూపంగా ప్రచారం చేశారు. బుర్రకథ పితామహుడు షేక్ నాజర్ రాసిన శ్రీరామారాజు యుద్ధం లోకోత్తరంగా నడిచిన జన రంజకమైన రచన. ఇందులో కథకునితోపాటున్న వంతలు ప్రదర్శించిన సమయస్ఫూర్తి, హస్యం, రాజకీయ చతురత, రచయిత వ్యూహ రచన నిరూపమానం.

"శ్రీ గల ఆంధ్రవీరుల్లారా తందానా
ధీరుల గన్న మాతల్లారా"[19] ॥ అనే ప్రార్థనా గీతంతో కథ మొదలవుతుంది. ఈ బుర్రకథలో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా రంప పితూరీ, లాగరాయి పితూరీ మొదలైన పితూరీలకు నాయకత్వం వహించిన ద్వాబందాల చంద్రయ్య, పులిచింత సాంబయ్య, రేఖపల్లి అంబుల్ రెడ్డి మొదలైన వీరుల్ని ప్రభుత్వం దారుణంగా కాల్చి చంపింది. మన్యం పోలీసు బలగాలను దింపి కంపెనీ ప్రభుత్వం అలజడి సృష్టించింది.

ఇంకా ఇలా మన్యం ప్రజలను, వారి మంచిని కవి వర్ణిస్తూ..........

"మంచి పక్షుల పశుల ప్రేమించు ప్రజలు
ఎంచి ఫలముల రుచులు పేక్షించు ప్రజలు
పెంచి జగతిని సిరుల నండించు ప్రజలు
మించి కష్టము లన్నియు వరించెనకట"[20] అంటూ...

మన్యం వాసుల మనసుల్ని మన కళ్ళ ముందుంచాడు. వారు పాలుఇచ్చె పశువులను ప్రేమించే వారని చెప్పి. విషమిచ్చె బ్రిటిష్ వారిని ద్వేషించేవారని, మంచి ఫలము ఎంతటి మధురాన్ని యిస్తాయో వారి మనస్తత్వం కూడ అంత సుమధురంగా ఉంటారని కవి భావన.

ఈ బుర్రకథలో ఎండిన పుల్లలకు, కొంద గడ్డికి, లొట్టెడు కల్లుకు, పుట్టినా, చచ్చినా, కడుకు చుట్ట మొచ్చినా పన్ను వేస్తూ వారిని బాధలకు గురిచేసేవారు. అదే సమానికి రామరాజు వచ్చాడని, అతని పుట్టుకను చెప్పాడు. తర్వాత అతని బాల్యాన్ని వివరిస్తూ ఆకాశంలో డేగల్ని కొట్టాడని, తుపాకితో పులితలను కొట్టాడని, పల్టీలు కొట్టాడని బాల్య చేష్ట వివరించాడు. ఇవి చరిత్రలో లేవు. విద్యాబ్యాసం తర్వాత గాంధీ సహాయ నిరాకరణోద్యమంలో రాజు చేరిపోయాడని చెప్పారు. ఇది కూడా చరిత్రలో లేని అంశం.

దారిద్ర్యంలో బాధపడుతున్న గిరిజనుల్ని బాగుచేయాలని తపనతో.........

| | |
|---|---|
| పెద్దలకు తాము బ్రతుకు బాటా | భళాబళి |
| పిన్నలకు చదువు ప్రతి పూటా | ॥ |
| జనం మంచికే దేవులాటా | ॥ |
| తన సుఖం మరిచాడే ప్రతిపూటా | ॥ |
| మీసాలు గడ్డాలు పెరిగి చెరిగిన జట్టు | ॥ |
| హర యోగిగా మారినాడా | ॥ |
| ఓ రామ రాఘవా శ్రీరామరాజు రా | ॥ |
| రావయ్య వేగ రావయ్య | ॥...[21] అని పలుకుతూ |

పెద్దవాళ్ళకు బ్రతుకుమార్గం, పిల్లలకు చదువు నేర్పే పాఠశాలను, గ్రంథాలయాలను, గ్రామ పంచాయితీలను ఏర్పాటు చేసి జనం మంచి కొరకు బ్రతకు సాగెను. రామరాజు

గిరిజనుల్లో తాను ఒకడై వారితో కలిసి జీవిస్తూ ఒక యోగిలా మారిపోయాడు.

ఇంతలో బాస్టియన్ ఆరు అణాలకు బదులు మూడు అణాలను కూలీలకు ఇచ్చాడు. దానికి కూలీలు బాస్టియన్‌పై తిరగబడ్డారు. వీరికి రామరాజే సారథ్యం వహించాడు. బాస్టియన్ రెచ్చిపోయి తన జులం చూపించాడు. అయినా జనం ఊరుకోలేదు. క్రితం కర్రతో కొడితే కాళ్ళు పట్టిన జనం రాళ్ళు పట్టారు. గుడ్లురిమితే గుడిసెల్లో కూరికిన జనం గుండ్ల వర్షం కురిపించారు. సవర, చెంచు, కోయలు, కొండజాతి మొదలైన గిరిజన ప్రాంత వాసులు సమిష్టిగా పోరుకు నిల్చారు. దాంతో గుబులు పుట్టిన బాస్టియన్...

"గిర్జినులందునా జాతి కక్షలను గెలకండన్నాడా
కల్లుబోసి కులమత పిచ్చోళ్ళను గిలండన్నాడు
గుండా, రౌడీ మామూళ్ళనీ దువ&ండాన్నాడా.
రవిగ్రంక్‌ని సామ్రాజ్యంపైనా -రామరాజు యుద్ధం"[22] అని ఆక్రోసిస్తూ

గిరిజనులలో బేధభావాలను లేవదీవాడు. మత్తమందులతో మతం, కులాల్ని రెచ్చకొట్టించాడు. గుండా, రౌడి, దాదాగిరి లాంటి వాళ్ళను పోషించి ప్రజలపై ప్రతీకారం తీర్చుకున్నాడు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంపై రామరాజు యుద్ధమా! అని బాస్టియన్ పలికెను. కాని ఇక్కడ "హిందు గూండా-ముస్లింగా, ముస్లిం గూండా-హిందువుగా వేషాలెయ్యండి కత్తి దుయ్యండి" అని అనడంలో హైదరాబాద్ అల్లర్లు, బొంబాయి మత కల్లోలాలు గుర్తొస్తాయి.

శ్రీరామరాజుకి పైడిపెట్టలో 30ఎకరాల భూమిని బ్రిటిష్ అధికారులు ఇస్తారు. అప్పుడు తల్లి తన కుమారుడుతో...

"బ్రహ్మచారిగ తిరగకయ్యా
కడుపుశోకం పెట్టకయ్య
నీతమ్ము చదువు ఆగిందా
నీచెల్లి పెండ్లి కెదిగిందా
కష్టఫల మొచ్చింది."[23] కాలతన్నోర్థయ్యా..... అని బ్రతిమలాడుతూ

సూర్యనారాయణమ్మ కుటుంబ బాధ్యతలను గుర్తు చేస్తుంది. తల్లి చెప్పిన మాటలను

పట్టించుకోకుండా రామరాజు దేశక్షమము గూర్చి ఆంగ్ల ప్రభుత్వాన్ని ఎదిరించి మన్యం ప్రజల్ని ఆంగ్ల అధికారుల పెట్టే బాధల్ని చూసి ఓర్వలేక, మన్యాన్ని మేల్కొలిపి తిరుగుబాటు చేస్తాడు. అయితే చరిత్రలో తన తల్లి పైడిపుట్టలో భూమిని తీసుకొని, చక్కని సంసారాన్ని, కుటుంబ బాధ్యతలు చెప్పినట్లు చేసుకుంటూ సామాన్య జీవితాన్ని గడపమని ఎక్కడాలేదు. ఈ విషయం కథకుడు నాజర్ కల్పన చాతుర్యం.

కథ ముగింపులో గంటం, మల్లు, అగ్గిరాజు, ఎఱ్ఱేసు, పడాలు మొదలైన వీర సైన్యం పోరు చేస్తుండగా, రామరాజును ఆంగ్లేయులు తుపాకితో పేల్చిన గుండ్లకు బలౌతాడు అని పేర్కొన్నారు. కాని చరిత్రలో యిదిలేదు.

శ్రీశ్రీ రామరాజు యుద్ధం బుర్రకథలో నాజర్ గిరిజనుల జీవితాన్ని ఆంధ్రప్రదేశ్ వాతావరణాన్ని కథకు అనుకూలంగా పాడారు. అంతేగాక వంతల చేత చక్కటి హాస్యాన్ని పుట్టించి వంతల చేత కథను చెప్పిస్తూ కథకుని చేత పాడిస్తూ జనాన్ని అలరింపజేయడంలో తిరుగేలని కథకుడుగా, రచయితగా నాజర్ సవ్యసాచి.

బుర్రకథ పితామహుడు పద్మశ్రీ నాజర్ శ్రీశ్రీ రామరాజుయుద్ధం బుర్రకథలో

### 5.2.1 భాషా విశేషాలు:

1.గుడ్డికూట్లో మట్టి బడిందన్నమాట (పుట:8)
2.విద్యలేనివాడు వింత పక్షి (పుట:9)
3.తడిసి గుడిసె కప్పడం – తగిల్నాక తడవుకోవటం (పుట:12)
4.ఆకాశమే అందాలమేడ (పుట:12)
5.చచ్చి నోడిమాట, బతికినోడి తమ్ము పట్టింపు లేదురా (పుట:14)
6............. రాచి రంపాన బెట్టు (పుట:14)
7.కుక్కకాటుకి చెప్పుదెబ్బ (పుట:15)
8.తల్లిచ్చే పాలకన్నా... ధరణిచ్చే పాలమిన్న (పుట:16)
9.ఆశదోస మొరగదు – పూటకూలి పెద్దమ్మ పున్నె మెరుగదు (పుట:19)
10.చుక్కపండగ (పుట:18)
11.యేలోంక బెట్టంది వెన్నపూస రాదురా (పుట:19)

12.పట్టగలలు తలుపు తట్టిందెవడ్రా అంటే పెళ్ళాం లేనోడన్నట్లుంది (పుట:20)
13.కరిసే కుక్కకి కండ ఉరిస్తే, పశువుకు బండా ఉండాల్రా (పుట:23)
14.పాత చింతకాయ పచ్చడి (పుట:24)
15.చేతిలో డిగ్రీ పట్టా నిత్యం ఆకటిపొట్ట (పుట:24)
16.పెద్దల మాట సద్దిమూట (పుట:25)
17.మన తాతలు నేతులు తాగితే ఈనాటి నేతలు మూతులు నాకుతున్నారు (పుట:27)
18.అమ్మపెట్టదూ అడక్కు తిన్నయ్యదు (పుట:30)

**5.3 బి.వి.యస్ శాస్త్రి:**

1922-24 సంవత్సరాల మధ్య రామరాజు నడిపిన ఉద్యమాన్ని తీసుకోని బి.వి.యన్.శాస్త్రిగారు 1981లో బుర్రకథగా రాశారు. కథను, సయయాన్ని బట్టి వంతలు మారూతూ ఉంటాయి.

"ఈ బుర్రకథలో నర్సీపట్నం రామరాజును జైల్లో బంధించారని తెలుసుకున్న మన్యం ప్రజలు రామరాజును విడిపించాలని బయలుదేరుతారు. ఈ విధంగా పొంగి ఉప్పెన సాగుతున్న ఆ మన్యం జన ప్రవాహం నర్సీపట్నం చేరేసరికి తెల్లవారింది. అదే సమయానికి ఇక్కడ దేవాలయం దగ్గర హరిజనులకు పూజారి బ్రహ్మణులకు మధ్య ఘర్షణ జరగుతుంది"[24]

పవిత్ర దేవాలయంలోకి హరిజన జాతి వారడగు పెట్టడం పాపమంటారు. పూజారులు, లోనికి వెళ్ళాలంటారు హరిజనులు. అది చూశారు మన్యం వీరులు అదే అదనుగా అందులో చేరదల్చుకున్నారు. ఘర్షణ పడైనా సరే ముందు దేవాలయంలోకి చేరాలకున్నారు. సరిగ్గా అదే సమాయానికి అక్కడకి రామరాజు ప్రత్యక్షమైనాడని కవి వివరించాడు.

అయితే రామరాజు మన్యం ప్రజలతో కలసి హరిజనుల్ని దేవాలయ ప్రవేశం చేయించారనడం నిరాధారం అసలు రామరాజు ఉద్యమం సాగించిన 2 సంవత్సరాలలో హరిజనుల ప్రస్తావన ఎక్కడాలేదు. కానీ ఈ బుర్రకథలో కవి ప్రత్యక్షంగా కల్పితంగా చేర్చుడు ఈ విషయం చరిత్రలో లేదు.

1920 సంవత్సరంలో పంచమ కులోద్దరణ సంఘాలు గాంధీజీ హరిజనోద్ధర ణోద్యమం ప్రారంభమైనది. బహుశా గాంధీజీ ఉద్యమ ప్రభావం వల్ల బి.వి.యన్.శాస్త్రి తన బుర్రకథలో హరిజనలు ఆలయ ప్రవేశం ప్రవేశపెట్టదనిపిస్తుంది. అంతేగాక రామరాజును ఒక సంఘ సంస్కర్తగా నిలబెట్టాలనే దృక్పథం రచయితకు ఉన్నట్లు వ్యక్తమౌతుంది.

రామరాజును పట్టుకోవడం ఆంగ్లేయులకు ఒక సమస్యగా మారింది. రామరాజును ఇలాగే వదిలేస్తే ఏజెన్సీ తిరుగుబాటు దేశమంతా పాకుతుందేమోనన్న భయం కూడా వారిని వెంటాడింది. ఆ సమయంలో అగ్గిరాజు, ఎఱ్ఱేసు మల్లు దొరలు పట్టుబడి పోయారని రాజుకు తెలిసింది. అయినా రాజు గుండె నిబ్బరంతో కడసారి పోరుకు సిద్ధమౌతుండగా తల్లి సూర్యనారాయణమ్మ, తన మిత్రుడు బాస్కరావు పలికిన మాటలు...

వినరా... భారత సోదరాంధ్రుడా రామరాజు గాథా
అమాయకుడు ఆ బాస్కఅవు అడ్డ నిలిచాడు వినరా
శాంతి పురుషులే మన్య ప్రజలలో విప్లవమే లేపి ॥
రక్తపాతమును సృజియించిన దినావని అన్నారు ॥
దేశక్షేమము, ప్రజాక్షేమము కోరినట్లయితే ॥
తెల్లవారితో, చల్లగాను యిక సందికి దిగమనిరి ॥
తల్లిమాట, బాస్కరావు మాటలు విని రామరాజు ॥
క్షణకాలం తన భృకుటి ముడిచి ఏదో యోచన చేశాడు. వినరా...[25] అని పలుకుతూ

తన తల్లి సూర్యనారాయణమ్మ సీతారామరాజుకు సంధి చేసుకోమని బ్రిటిష్‌వారితో సఖ్యత కలిగి ఉండమని చెప్పినట్లు కవి వర్ణించాడు. కానీ నిజచరిత్రలో ఈ విధంగా లేదు. రామరాజు బ్రిటిష్ వారికి తనకు తానుగా వెళ్ళి లొంగిపోతారు. ఇది చరిత్ర. మరియు చిటికెల బాస్కరావు సంధి చేయమని చెప్పె ఉండదు. అంతేకాక రామరాజు చివరి పోరాటంలోనే కాక అతను చనిపోయినప్పుడు కూడా నారాయణమ్మ రామరాజును చూడలేదని దంతులూరి వెంకట రామరాజు గ్రంథంలో వివరించారు. (సీతారామరాజు మేనల్లుడు)

### 5.3.1 బి.వి.ఎన్.శాస్త్రిగారి సీతారామరాజు బుర్రకథలో కథాకథన విశేషాలు:

బి.వి.యన్.శాస్త్రి కథా ప్రారంభంలో దేశభక్తి గీతమైన ఆంధ్రమాతా, నమో తెలుగుమాతా అనే ఆంధ్రదేవ ప్రశక్తితో కథ ప్రారంభమౌతుంది. శ్రీరామరాజు బాల్యం, తెల్లవారి పిల్లల్ని రాజు తన్ని పంపేవాడని, తెల్లవారిపట్ల ద్వేషంతో ఉండేవాడనీ (ఇది చరిత్రలోలేదు) కవి వర్ణించాడు.

రామరాజు తండ్రి దేశం గురించి ఆలోచిస్తున్న తనయుణ్ణి చూసి ఎంతో సంతోషించాడని వివరించాడు. (ఇది చరిత్రలో లేదు) కానీ తండ్రి మరణించిన తర్వాత ఎన్నో కష్టాలు పడ్డాడు. రామరాజు చదువుపై దృష్టి నిలపకపోవడం, స్వాతంత్ర్యం గురించి దేశ బానిస పరిస్థితి గురించి ఆలోచించేవాడు.

ఈ బుర్రకథలో హరిజనుల్ని గుడిలోకి రానివ్వకుండా నిరోధిస్తున్న సమయంలో రామరాజు, వీరి సైన్యం అక్కడికి వెళ్ళి వారిని గుడిలోకి పంపమని చెబుతూ వ్యాసుడు, వాల్మీకి, అరుంధతి కడజాతి వారేనని నచ్చచెప్పి వారితోపాటు ఆలయంలోనికి ప్రవేశించి సి.ఐ.డి నిఘా నుండి తప్పించుకుంటాడు. దేవాలయంలో ప్రవేశం చరిత్రలోనే అంశం, దీనిని కవి కల్పితంగా వివరించాడు.

గాముకొండలో దేవి విగ్రహం ముందు భారతమాత దాస్య విముక్తికి ప్రాణాలర్పిస్తామని వీరులందరూ స్వాతంత్ర్యపోరాటం కొరకు ప్రమాణం చేస్తారు. రామరాజు ఆధ్వర్యంలో మన్యం వీరులు పోలీసుస్టేషన్లపై దాడి చేసిన తీరు...

“చిచ్చెర పిడుగులు మన్యం వీరులు – చింతలపూడిని చేరారు బాబూ
అరేరే వినరా సోదర వీర ఆంధ్రుడా రామరాజు బాటే ॥
జలుం సాగించు పోలీసులపై దాడి చేసినారు వినరా
తుపాకి గుండ్లు మందు గుండ్లను వశం చేసుకోనిరి వినరా
మన్నెం పితూరీ ఆంగ్లుల గుండె నిదుర కనిరీ ॥
కృష్ణదేవిపేట పోలీస్‌స్టేషన్ మర్నాటికే చేరి ॥
కానిస్టేబుల్ కళ్ళలోపల కారం జల్లారు ॥
కళ్ళువాచి కొవ్వెక్కిన వారి తీట దీర్చినారు ॥
పట్టపగలు నీస్టేషన్ కోద్దుమని టపాసు పంపారు ॥”[26]

ఆకాశంలో మెరుపులాగ వేగవంతముగ మన్యవీరులు చింతపల్లి చేరారు. పోలీసులపై దాడి చేవారు. తుపాకులు, మందుగుండ్లను తమ ఆధీనం చేసుకున్నారు. మన్యవిప్లవం ఆంగ్లేయుల గుండెల్లో నిదురుపోయేవారు. తర్వాత కృష్ణదేవిపేట పోలీసుస్టేషన్‌కి పోలీసులకు మిరపకాయ టపాతో ముందుగా సమాచారం చెప్పి పట్టపగలు పోలీసు స్టేషన్లపై దాడి జరిపే వారని కవి వివరించాడు.

అంతే గాక రాజును బంధించుటకు బ్రిటిష్ వాళ్ళు ఎత్తులు...
చెప్పిన వేళకు రాజవొమ్మంగి దోచుకు పోయారా — వినరా
రోజూ లూటీ రాజు చేయగా దోచుకోనిరి దోరలు — ॥
బాస్టియన్‌కు తన కడపులోనే బయబాగ్నులు రగిలాయా — ॥
ప్రేణంతోరో ప్రేతంగానో రాజును బంధిస్తే — వినరా
వేల వేలు ప్రయిజు యిస్తామంటూ చాటింపేశారు — ॥
వినరా సోదరా ఆంధ్రవీరుడా రామరాజు లూటీ — ॥[27] అని పాడుతూ

మూడవ పోలీసుస్టేషన్‌లోని యుద్ధ సామాగ్రిని ధైర్యంగా తీసుకుకొని విప్లవ సైన్యం బ్రిటిష్ వాళ్ళ కడపుల్లో మంటలను రగిలించారు. రామరాజును ప్రాణంతోను గాని లేక ప్రాణం లేకుండా పట్టుకున్న వారికి నగదు బహుమతులు యిస్తామని ప్రకటించారు. అయితే రామరాజును పట్టుకున్నాల లేక విప్లవ సైన్యంలో సహచరుల ఆచూకీ చెప్పిన బహుమతులు బ్రిటిస్‌వాళ్ళ ఏర్పాటు చేయుట సత్యం.

ఈ విధంగా "తెల్లవారి అక్రమాలకి అడ్డతగులుతున్న రామరాజును పట్టుకోవాలని సైన్యాన్ని రప్పించాడు. రామరాజుకు ఆశ్రయమిచ్చిన చిటికెల బాస్కరరావుని అధికారులు మాయ మాటలతో నమ్మించి రాజును సంధికి పిలిపించమన్నాడు. కానీ కంపెనీ అధికారులు రాజును సంధికి పిలవడం చరిత్రలో లేని అంశం మరియు మల్లుదొర అవివాహితుడు. అతడి బార్యను వివస్త్రను చేసి డొక్కలో తన్ని మల్లుదొర, గూర్చి విప్లవ సైన్యాన్ని గూర్చి ఆచూకీ చెప్పమని భయపెట్టి ఇంట్లో ఉన్న మల్లుదొరను బ్రిటిష్‌వారు తీసుకుపోతారు. అని కవి వివరించాడు. అయితే చరిత్రలో మల్లుదొరకు ప్రియురాలు ఉండేదని ఆపేరు సంకుబుల్లి ఆమె ఇంట్లో మల్లుదొర ఉండగా ఇలా జరిగిందని చరిత్రలో ఉంది.

ఆంగ్ల సైనికుల్లో ప్రఖ్యాతి వహించిన కవర్టు, హైటర్లను రామరాజు చంపాడని ఈ బుర్రకథలో కథకుడు చెప్పాడు. కానీ చరిత్రలో కవర్టు, హైటర్లను చంపింది కోకిరి ఎట్టేసు చంపాడు. అలాగే ఒక లోయ ప్రాంతంలో ప్రయాణం చేస్తున్న బ్రిటిష్ వారిపై రాళ్ళతో దాడి జరిగింది. ఆ దాడిలో వారు మరణిస్తారు.

అదేవిధంగా రామరాజు ఆచూకీ గూర్చి సింగన్నను రెండుగా చీల్చడం, దొరికిన బంధీలను సూదులతో గుచ్చడం, చర్మం వలవడం వంటి హింసలు చేస్తున్న వారికి జాడ చెప్పలేదు. చరిత్రలో ప్రజలను కష్టాలు పెట్టారు. చిన్న పిల్లలు, స్త్రీలు, వృద్ధులు అనే బేధం లేకుండా హింసించే వారని చెప్పరుగానీ వంతలు, కథకుడు కథను ఆకట్టుకునేందుకు కల్పితలు చెప్పాడు.

మరియు రామరాజు తల్లి, స్నేహితుడు ప్రజల క్షేమం కోరి ఆంగ్లేయులతో సంధి చేసుకోమంటారు. ఇది చరిత్రలో లేని అంశం. అంతకన్నా కావలసింది ఏమి లేదని రామరాజు సంధికై వెళతాడు. అప్పుడు అతనిని బంధిస్తారు. బ్రిటిష్ వారిపై రామరాజు న్యాయంగా మాట్లాడి పరుష పదజాలంతో దూషిస్తాడు. కోపించిన గుడాల్ రాజును కాల్చి చంపుతారు.

రామరాజు మరణించినప్పుడు..........

"అమరజీవి వోయి రామరాజా
అందుకో జోహారు రామరాజా
అల్లూరి సీతారామరాజు"[28] అనే పాటతో కథ ముగుస్తుంది.

కథకుడు కథ చెబుతుంటే రాజకీయ వంత దానిని అనుసరిస్తుంటారు. హాస్యవంతలు సందర్భానుసారంగా హాస్యాన్ని పుట్టించి ప్రేక్షకుల్లో విసుగును పోగొడుతుంటారు. ఈ విధంగా వి.వి.ఎన్.శాస్త్రి రామరాజును విప్లవ కథను అనువైన రీతిలో ప్రేక్షకులకు వినోదంతోపాటు, రాజకీయ చైతన్యంను కలిగించిన కథగా రక్తికట్టించారు.

**5.3.2 బి.వి.ఎన్.శాస్త్రి గారి బుర్రకథలో భాషావిశేషాలు:-**

1.ఆదిలోనే హంసపాదు (పుట:3)

2.ఆరంభశూరులు (పుట:7)

3.పువ్వపుట్టగానే పరిమళిస్తుందన్నట్లు (పుట:9)

4.ఊచకోత (పుట:12)

5.మోచేతి క్రింద నీళ్ళు తాగే (పుట:14)

6.......... తలలోని నాలుకై (పుట:16)

7.నోటి ముందర కూడ రాల్చేసి (పుటం17)

8.కళ్ళ వాచి కొవ్వెక్కిన వారితోట (పుట:23)

9.రొట్టె విరిగి నేతిలో పడెనని (పుట:27)

10.దిటవు లేని గుండెలు (పుట:32)

11.మన్నెం వన్నె తరగి కన్నరే కార్చింది (పుట:35)

**5.4 పడాల రామారావు - అల్లూరి సీతారామరాజు బుర్రకథ:**

సాహిత్య ప్రక్రియల్లో రామరాజుకు అనేక విధాలుగా ఆవిష్కరించిన రచయిత పడాల రామారావు. అల్లూరి సీతారామరాజును నాటకం, నవల, బుర్రకథ, ఏకాంకిక పాత్రక మొదలైన అనేక రూపాల్లో చెప్పడమే కాకుండా, అనేక విద్యాతరగతులకు పాఠ్యాంశములుగా నిర్ణయించిరి. రామరాజు బుర్రకథ మొదట ముద్రణ 1960వ సంవత్సరంలో అచ్చుయింది.

విప్లవ వీర చరిత్రను తెలిపే కథ కాబట్టి దేశభక్తి గీతంతో కథను ప్రారంభిస్తూ ....

"వందేమాతరం- మంటే భారతం
శ్రమైక జీవన సుజన విలసితం
సస్య శ్యామలాం- భారతం ॥వందే॥
స్వతంత్రయోధుల మధిర తర్పణం
పావన చరితం - భారతం"[29] ॥వందే॥

భారతదేశ గొప్పతనం, భారతీయుల త్యాగ ఫలాన్ని వర్ణించి కీర్తించిన గీతంతో కథ ప్రారంభమౌతుంది. ఈ గీతాన్ని ఒక వంత పాడగా కథకుడు రక్తి కట్టించాడు.

తర్వాత రెండు వంతతో ఆంధ్ర దేశాన్ని స్తుతిస్తూ...

సోదర ఆంధ్రా వీరుల్లారా ॥తందానా॥
వీరమాతవే తల్లుల్లారా ॥
మనలగన్న ఆంధ్రమాతను తలచి ॥
జోడ గుమ్మెటలు తధిమితనగా ॥
తోడగ వంతలు కూడి పాడగా ॥
రాగ తాళ గీతాది నృత్యముల తంబుర కథ వినుడి"[30] అనే ప్రార్ధన

గీతంలో ఆంధ్ర శౌర్యాన్ని, ఆ వీరులకన్న తల్లులను కీర్తిస్తూ తెలుగు తేజమును వర్ణించాడు. కేవలం ప్రార్థనా గీతంలోనే రెండవ వంత పాడిరి.

రామరాజును ప్రేక్షకులకు పరిచయం చేస్తూ కథానాయకుడు ఘనతలను చెప్పుచూ......

3వ వంతతో.... వినరా ఆంధ్రుడా! రామరాజు ఘనవీర చరిత్ర నేడే!

మొక్కవోని మొనగాడ క్షత్రియుడు సీతరామరాజే "వినరా॥
చిన్నవాడే తానన్ని విద్యాలందారి తేరినాడే ॥
దేశభక్తి యందందరి కన్నా చెన్ను మినునాడా ॥
తెలుగు తేజము దిశల నింపగా ఊరు విడిచినాడా ॥
విడిచి, విడిచి తనవారిరి మరిచి తాపిసియై రాజే ॥
అరయగల్గెనె తిరుగుచు దేశము తీరు రామరాజే ॥
క్రిష్ణదేవుపేటన్న పల్లికా మాన్యుడు వచ్చారా ॥
కోయజనులు పడు బాధలు గాధలు అన్నీ విన్నాడా ॥
పట్టుబట్టి మీరంతా ఒకటై కదలాలన్నాడు ॥
వన్యమృగములే సీమ దొరలను వధించాలన్నాడు ॥
మన్యప్రాంతమున కోయదొరల సైన్యాల గూర్చినాడా॥ వినరా..."[31]
అంటూ ఒక్కగీతంలో రామరాజు జీవితాన్ని ప్రేక్షకుల ముందు ఆవిష్కరించాడు.

చిన్నతనంలోనే విద్యలన్నింటిని అభ్యసించాడు. దేశభక్తి, స్వాతంత్ర్య దీక్ష మెండుగా

ఉన్నాయని తెలిపాడు. తన కుటుంబాన్ని విడిచి, అందరిని మరచి, తపస్విగా తిరుగుచు దేవ పరిస్థితులను అర్థం చేసుకున్నాడు. గిరిజనుల బాధలను, వారి కష్టాలను విన్నాడు. దేవ ప్రజలను పీడిస్తున్న బ్రిటిష్ వాళ్ళపై మన్యవాసులందరిని సైన్యంగా తయారుచేస్తాడు. కథను బట్టి, సమయాన్ని బట్టి కథకుడు వంతల్ని మార్చుతూ ఉంటాడు.

నాల్గవ వంతలో రామరాజు పుట్టిన సమయంలో వర్ణిస్తూ......

"జాబిల్లి పుట్టిరా మింట ॥భళ॥
బాలుడే పుట్టె నాయింట ॥
తెలుగు తల్లీ నోము పంట ॥
భారత స్వాతంత్ర్య గంట ॥
గణగణా మ్రోగిన దంట భళాభళానోయ్"[32] అని అంటూ

ఆకాంశంలో జాబిల్లి పుట్టి వెలుగునునింపింది. బాలుడు పుట్టి ఆ తల్లి సూర్యనారాయణమ్మ ఇంట వెలుగులు తీసుకువచ్చాడు. అతడు పుట్టిన వెంటనే గణగణామని స్వాతంత్ర్యపు గంట మ్రోగింది అని కవి వర్ణించాడు. గీతంలో అంత్యానుప్రాస అలంకారంతోపాటు, అక్కడకక్కడ అతివయోక్తి అలంకార లక్షణాలు కనబడుతున్నాయి. అయితే బుర్రకథ ప్రక్రియలో పాఠకులని రంజింపచేయుట అనే తపనతో కథకుడు ఎక్కువగా ఊహించి వర్ణనలు చేస్తూవుంటారు.

మరి యొక్క వంతల్ని పాడుతూ రామరాజు సాహసాల్ని వివరిస్తూ..........

"ఆ, చిన్ననాడే విల్లుపట్టిరా ॥సై॥
నింగిలో పిట్టను గొట్టెరా ॥సై॥
నీటిలో చేపను కొట్టెరా ॥సై॥
ఆ చిన్నానాడే కత్తి దూసెరా ॥సై॥
గుఱ్ఱమెక్కి కత్తిబట్టితె ॥సై॥
గుర్రమైన భీతిల్లురా ॥సై॥
పరవళ్ళు త్రొక్కును గుర్రమా ॥సై॥

పైపైకి లేచును గుర్రమూ ॥సై॥
గగనాన్నే తాకు గడియలో భళాభళానోయ్"[33] అంటూ

చిన్నప్పుడే అన్ని విద్యలు నేర్చుకున్నాడు. ఆకాశంలో పిట్టను కొట్టాడు. నీటిలో చేపను కొట్టాడు. తన లక్ష్యాన్ని గురిచూసి కొట్టాడని ప్రేక్షకులకు అర్థమైన రీతిలో చెప్పడం. గుర్రాన్ని నడుపుతూ కత్తి తిప్పుతూ ఉండేవాడు. అతివేగవంతంగా సాహసవంతంగా అన్ని విద్యలను నేర్చుకున్నాడు. ఎప్పటికప్పుడు వంతలు మార్చుతూ పాఠకులను ఉత్తేజ పరిచేవాడు కథకుడు.

జానపద గీతాలలో కొన్ని కొన్ని వంతల్ని పాడేవారు. అక్కడక్కడ కల్పితలు చెప్పిన అవి కథలో ఇమిడిపోయే విధంగా ఉంటూ కథను రక్తి కట్టించే వారు "రామరాజు రాజమండ్రి నుండి నరసాపురం వెళ్తున్న సమయంలో రచయిత పడవ ప్రయాణంలో వెళ్ళినట్టు చెప్పుచున్నాడు. కాని చరిత్రలో లేదు. కాని చరిత్రలో లేదు. కాని బుర్రకథలో జానపదాలతో కలిని జీవితానికి, పడవ ప్రయాణానికి ఉన్న అనుబంధాన్ని వివరించారు.

జానపద గీతాలే కాకుండా పాటల రూపంలో కూడా ఈ బుర్రకథలో వినిపించాడు. కథానాయకుడికి నరసాపురంలో ఒక కల వచ్చింది. దానిలోనుండి ఒక గీతాన్ని కవి వినిపిస్తూ భారతమాత దుస్థితిని తెలియపరుస్తూ...........

"ఎవరివమ్మా నీవు?
ఎవరెవరివో తల్లీ?
పాపాలు పుడమిపై
దోకాలు, శోకాలు
ఘోరమై, భారమై
భూదేవివా, తల్లి?.. ఎవరి"[34] అని పలుకుతూ

భారతమాత కథానాయకుడి కలలో కనిపించి ఎంతో బాధతో వ్యధతో తన అనుభావిస్తున్న అవమానాలను, అరాచకాలను, దుస్థితిని వెల్లబుచ్చినట్లు కవి వివరించిన వెంటనే రామరాజు స్పందిస్తూ........ భారతమాత గొప్పతనాన్ని కీర్తిని వర్ణిస్తూ......

"దేశమును పెంచి, పోషించు దేవి వయ్య

భారత గడ్డను భాషించు భవితవయ్య

దిక్కుమాలిన గతి యేల దేవి నీకు?"[35] అని భారతమాతకై ధైర్యాన్ని, భరోసా యిస్తున్నట్టు రచయిత పలికించాడు. అమ్మా! భారతమాత ఈ దేశాన్ని ఈ ప్రజల్ని కంటికి రెప్పల కాపాడి రక్షించు దేవి నీవు! భారత భూమిలో అందరి మంచి చెడ్డలను వారి భవితను నిర్ణయించే నీకు ఇలాంటి దుస్థితి ఎందుకు దేవి? అని మనసులో పలుకుతూ భారతమాత దాస్య విముక్తికి కంకణం కట్టుకున్నాడు. ఆ వెంటనే రామరాజు స్వాతంత్ర్య పోరాటంలోకి వచ్చినట్లు కథకుడు దేశభక్తి కలిగే ప్రేరణతో వంతలు పలుకుతాడు.

బ్రిటిష్‌వారు నమ్మించి, భారతీయులను మోసం చేసిన విధానము......

"అరెరె! దుష్టులౌ దొరలానాడు ॥భళభళి॥
ఆశ లెన్నో చూపినారు ॥
స్వతంత్ర మిస్తనన్నారు ॥
సంపదంతా దోచినారు ॥
భారతీయుల యుద్ధమందు ॥
పశువులుగ బలి పెట్టినారు ॥
యుద్ధ మైనంతనే నీచుల్ ॥
అన్న మడిగితె సున్న మిచ్చెదంటూ
మొండి చేయే చూపినారు" ॥వినరా॥[36] అని అంటూ

మొదటి ప్రపంచ యుద్ధంలో తమకు భారతీయులు సాయం చేసే యెడల యుద్ధమయ్యాక స్వతంత్ర మిస్తానన్నారు తెల్లదొరలు, ఆ యుద్ధంలో భారతీయులు కొన్ని వేలమంది నేలకొరిగి, దొరలకు విజయం చేకూర్చారు. మన భారతీయులకి ఇస్తానన్న స్వతంత్ర్య యిమ్మనికోరిరి. వారు నిరాకరించి మొండి చేయి చూపారు. ఇది రామరాజు చరిత్రలో లేని అంశం.

## 5.4.1 సీతారామరాజు బుర్రకథలో కల్పితాలు:

రామరాజు ప్రేమ వ్యవహారం గూర్చి, సీత అనే ప్రేమికురాలు రామరాజును, అతని ఆత్మశక్తిని, స్వాతంత్ర్య దీక్షకు పరీక్ష పెడుతూ........

| | |
|---|---|
| "వయ్యారమంతా ఒలకేబోసిందా | ॥తందానా॥ |
| ఘల్లున అందెల కాలే కదిపిందా | ॥ |
| ఛణ ఛణ ఛణ ఛణ గజ్జెలు మ్రోగాయా | ॥ |
| హే! యౌనములో నున్న రాజూ | భళా భళి |
| త్రుళ్ళి పడి సీతను గాంచీ | ॥ |
| ఏమిటి విపరీతమంటూ | ॥ |
| వీరు నుదుట శృంగారమా | ॥ |
| కామతృష్ణతో వంఛనా | ॥ |
| మదునుని చూచిన శివునినా | ॥ |
| మూడో నేత్రమే తెరిచాడా | భళా భళానోయి"[37] |

అంటూ సీత ప్రవచించిన విధానము శృంగారముతో రాజుపైకి వచ్చిన వెంటనే యౌనంలో ఉన్న రాజు ఏమిటీ వ్యవహారం? ఎంత నీచురాలివి అని నీ చీచపు పనులు నా దగ్గర కాదు అని సీతను మందలించినట్టు కవి పేర్కొన్నాడు. ఈ విషయం చరిత్రలో లేని అంశం.

"ఆ వెంటనే సీత క్షమించురాజా! ఇది నిజంగా నటనే నీ ఆత్మశక్తిని పరీక్షించడానికి ఇలా ప్రవర్తించాను. నీవు సత్యవ్రతుడవు. స్వాతంత్ర్యదీక్ష పరుడవు. నా మనోరథం యీడేంటి ధన్యురాలను అయితిని" అని సీత పలికెను. రామరాజు నిజాయితీని, దేవభక్తిని నిరూపించుటకు రచయిత విశేషంగా వర్ణించాడు.

రామరాజు విప్లవ సైన్యం సమకూర్చిన ఆయుధాల గూర్చి వివరణ.......

| | |
|---|---|
| "గోడ నవ్వెడలనూ చూచెరా | భళా భళి |
| ఆయూల ఒక విచ్చుకత్తి | ॥ |

ఈ మూల ఒక డాలు కత్తి ॥
గంర్రుగోడ్డలి ఒక్కచోట ॥
యీటె బల్లెము లొక్కిచోట ॥
అది కాదు ఇదికాదు కాదు ॥
అవి గవిగో ధనుర్భాణములు ॥
దవ్వుదవ్వున లాగినాడూ ॥
విదళించె సింహముల జూలూ ॥
చెవికంట ఆనారిలాగే ॥
రివ్వునే వొదిలాడ బాణం ॥

పటపటిళ్ళున పగిలి నేల రాలెను తల్లి భారతదేవి సంకెళ్ళు"[38] అని వర్ణిస్తూ ఓ భారతీయుడా, ఓ ఆంధ్రవీరుడా వినవయ్యా మన రాజు గాధ అని వంతలు పలుకుతారు.

రామరాజు పరిసరప్రాంతాల్లో యుద్ధ సామాగ్రి, విచ్చుకత్తి రాలు కత్తి గంద్రగొడ్డలి, బల్లెము, ధనుర్భాణములు మొదలైన ప్రాచీన ఆయుధములతో విన్యాసములు, యుద్ధ నైపుణ్య చేసి సింహంలా పోరాటం చేసి బాణాలను బ్రిటిష్ వారిపై విడిచిపెట్టినాడు కథకుడు. ఓ భారతీయుడా! ఆంధ్రవీరుడా! అని సంబోధించడం కూడా విశేషం.

నడింపాలెంలో వుంటున్న పెద్దలైన గంటం దొర, మల్లుదొరల వీరత్వం గూర్చి.......

"పిడికిలి పడితే కొండలదురును తందానా
హుంకరించినా భువి కంపించును ॥
గంటం దొరయన భీష్ముండంటారు ॥
గాము మల్లుకా కాలుడు చెదరును ॥
విల్లునంబులతో వీది కెక్కిరా ॥
వైరుల శిరములు, పుచ్చకాయలై త్రుళ్ళి పోవుగదరా... అని"[39]

విశ్లేషించినాడు. గాంసోదరులు. పిడికిలి బిగిస్తే కొండలు అదురును, హుంకరించిన భూమి కంపించెను అని అతివయోక్తిగా కవి వర్ణించారు. గంటందొరను భీష్మడతో

పోల్చాడు. మల్లుదొరను భీముడుతో పోల్చి ఇద్దరు బాణములు ప్రయోగించుటలో మంచి ప్రవీణులుగా కీర్తించాడు. వారి వీరత్వమును చూపించారు. ఈ వీరకథలో వంతలు, జానపదాలు, పాటలతో సంభాషణల చాతుర్యంతో పాఠకులను రసవంతంగా (వినిపించాడు) ప్రదర్శించారు.

దుర్మార్గుడైన బాస్టియన్‌తో, మల్లుదొర, గంటందొర సంభాషనలను పాఠకులకు చైతన్యాన్ని, విప్లవాన్ని కల్గిస్తాయి. కూలీరేటు సక్రమంగా ఇవ్వడంలేదు. ప్రజలను నానా హింసలు బాధలు పెడుతున్నారు. అని ముగ్గిరికి సంభాషణ జరుగుతున్న సమయంలో రామరాజు పిడుగులా వచ్చారని కథకుడు చెబుతాడు. ఇది చరిత్రలో లేని అంశం.

1922 ఆగస్టువ తేదీన చింతపల్లి పోలీసుస్టేషన్‌పై దాడి జరిగిందని ఆ వెంటనే విజయంతో ఆకాశం కూడా సూచన ప్రాయంగా తొలకరి వర్షం కురిసిందని రైతు జనం సంతోషం పొందారని కవి వర్ణించాడు.

విజయ సూచకంగా అవని కూడా సహకరించిందని కవి చాతుర్యాన్ని ప్రదర్శించారు. ఈ బుర్రకథలో ఏకైక స్త్రీ పాత్ర రత్తి. గోవిందుని భార్యను బాస్టియన్ హింసిస్తున్నప్పుడూ..........

| | |
|---|---|
| చెళ్ళున కొరడా విసిరెను | ॥భళా భళి॥ |
| తూలి రత్తి పడిపోయెను | ॥ |
| ఒడిలో బిడ్డను లాగెను | ॥ |
| చెప్పు కెక్కడ రాజని | ॥ |
| చెళ్ళు చెళ్ళునా బాదాడా? | ॥ |
| బిడ్డను కాల్చేవేవాడా? | ॥ [40] అని |

అకృత్యాలన్ని వర్ణించాడు. రామరాజు ఆచూకీ చెప్పమని రత్తిని కొరడాతో కొట్టెను ఆమె బిడ్డను తీసుకొని, రామరాజు, మన్య సైన్యం గూర్చి ఆచూకీ చెప్పమని లేని పక్షం చిన్న బాలుడైన రత్తి కొడుకును చంపివేశాడు. అయినా రత్తి వారి ఆచూకీ చెప్పలేదు. అప్పుడు ఆమెకు తుపాకి గురిపెట్టి చంపుట సిద్ధపడెను. రత్తికి బదులుగా సీతకు ఆ తుపాకి గుళ్ళు తగిలి చనిపోయెను. ఈ బుర్రకథలో సీతను త్యాగిగా, స్వాతంత్ర్యోద్యమంలో

పాల్గొంటున్నట్టు కవి వర్ణించాడు. ఇది చరిత్రలో లేని అంశం. అసలు రామరాజు స్వాతంత్ర్యస్ఫూర్తి తీసుకువచ్చినది సీత అని కవి భావన. చరిత్రలో లేని అంశాలను జోడించి ప్రేక్షకులకు కథ రక్తి కట్టిచడానికి కథకుడు కడు రమ్యంగా వంతలతో వర్ణించాడు.

ఎప్పుడైతే సీత ప్రాణాలు త్యాగం చేసిందో అప్పటి నుండి తన పేరులో సీతారామరాజుగా తన పేరులో కలుపుకొనెను అని కవి వివరించాడు. ఇది చరిత్రలో లేని అంశం.

ఈ బుర్రకథలో బాస్కర్రావు రామరాజు లొంగిపొమ్మని చెబుతారు. నీవు లొంగుబాటు కాకపోతే మన్యం ప్రజలు చిత్రహింసలు పెడుతున్నాడు అని చెబుతాడు.ర దానికి రామరాజు మన్యం బాధలు చూడలేక బాస్టియన్‌కు లొంగిపోతాడు. చివరి ఘట్టంలో సంభాషణలతో రక్తి కట్టించారు కథకుడు.

**5.4.2 పడాల రామారావు బుర్రకథలో కథాకథన విశేషాలు:**

ఇది విప్లవాత్మక బుర్రకథ. దేశభక్తి, దేశమాతను స్తుతిస్తూ ప్రార్థనతో ప్రారంభమౌతుంది. చిన్నతనంలో అన్ని విద్యలను అభ్యసించెను. శివాజీ, అక్బరు వంటి చక్రవర్తుల సాహసాలతో రామరాజును పోల్చి చెప్పిరి.

"పుట్టగానే పాలకోసం ఏడ్చాడనుకొని పాలను ఇవ్వగా అతని తండ్రి పాలకోసం ఏడ్వలేదని దేశభక్తినే ఉగ్గుపాలతో రంగరించి, పోసి, చంకనెత్తుకొని తన స్టూడియోలో వీరుల, దేశభక్తుల బొమ్మలను చూపించాడు. కవి కొంత అతిశయోక్తిని ప్రదర్శించాడు.

రామరాజు పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాల కామోగల్లు గ్రామంలో జన్మించాడని చెబుతున్నారు. కానీ ఇది చరిత్రలో లేదు. అతను పుట్టినది అమ్మమ్మ గారింటిలోనే విశాఖపట్నం జిల్లా భీమిలి తాలుకా పాండ్రాంకి గ్రామంలో జన్మించారు.

కథలో కల్పితాలు ఎక్కువగా ఉన్న పాఠకుని దృష్టిలో పెట్టుకొని కడురమ్యంగా వర్ణించాడు. రామరాజు చిన్నతనంలో కల వచ్చినట్లు అందులో భారతమాత సంకెళ్ళతో ఉన్నట్టు దాస్య విముక్తికి పోరాడినట్లు వర్ణించాడు. రామరాజు భావాలను తెలుసుకొని పినతండ్రి మందలించినట్లుగా చెప్పాడు.ర అక్కడ నుండి పారిపోయాను. ఇది చరిత్రలో లేని అంశం.

ఎ.వి.యన్ కళాశాలలో "ఐదవ ఫారం" చదువుతూ సీత అనే అమ్మాయిని ప్రేమించును. సీత కూడా రాజును ప్రాణంగా భావించేది. రామరాజు చరిత్రలో సీత ప్రేమాయణం అద్భుత కల్పన. చరిత్రలో లేనిది. అంతేకాకుండా తాను ప్రేమించిన యువకుడ్ని పరీక్షించడం కూడా చరిత్రలో లేని అంశం.

రామరాజును సంధి కని పిలిచి బంధించి రూధర్ ఫర్డ్‌తో సంభాషణలతో చెప్పడం మంచి రక్తి కట్టినది సన్నివేశం. రూధర్‌ఫర్డ్‌తో నీవు ధీరుడవైతే శక్తి ఉంటే కాల్చమని రామరాజు పౌరుష మాటలతో రెచ్చగొట్టెను. రూధర్ తుపాకీతో రామరాజు శరీరాన్ని తూట్లుతూట్లుగా కాల్చివేసెను.

అప్పుడు రామరాజు "నేను చావలేదు! నా అంతరాత్మ నిరాకరామై మీ అంతాన్ని ప్రబోధిస్తూనే తిరుగుతుంది. రేపు ముక్కోటి సీతారామరాజులు ప్రభలిస్తారు. నలబైకోట్ల అన్నలతో మీపై పగసాధిస్తారు. మిమ్ములనీ భారత గడ్డనుండి సమూలంగా తుడిచి వేస్తారు. అప్పుడు నాదేశం స్వతంత్రమవుతుంది. అని అంటూ కన్నుమూస్తాడు.

### 5.4.3 భాషావిశేషాలు:

ఈ బుర్రకథలో వంతల్ని, జానపదల్ని, పాటల్ని, సంభాషణలతో పాఠకుల్ని ఆకర్షించాడు. భాషావిశేషాలు కొన్ని ప్రయోగించబడినవి.

1. దేశభక్తినే ఉగ్గుపాలతో రంగరించి (పుట:7)
2. భారతావని బ్రతుకు మంగలంలోని పేలాలవలె ప్రేలిపోతుంది (పుట:14)
3. ఏరుదాటి తెప్పు తగలేసే దొరలు (పుట:15)
4. కంచు కాగడ వేసి గాలించినా వాడిలో కనికరమంటూ కనబడదు (పుట:20)
5. నూరుగోడ్లను తిన్నరాబందు ఒక దెబ్బకే సఫా (పుట:40)

### ముగింపు:

ఈ విధంగా ఆయా బుర్రకథల్లో చోటు చేసుకున్న పాటల్ని, వంతలు పాడిన విధానాన్ని రసభరితంగా హాస్యాన్ని పండించడం, చైతన్యాన్ని మేల్కొల్పడం లాంటి విషయాలు చోటు చేసుకున్నాయి.

# పాదసూచికలు

| | | | |
|---|---|---|---|
| 1. | సుంకర సత్యనారాయణ | – బుర్రకథ | పుట 6 |
| 2. | ॥ | ॥ | పుట 11 |
| 3. | ॥ | ॥ | పుట 13 |
| 4. | ॥ | ॥ | పుట 18 |
| 5. | ॥ | ॥ | పుట 8 |
| 6. | ॥ | ॥ | పుట 9 |
| 7. | ॥ | ॥ | పుట 36 |
| 8. | ॥ | ॥ | పుట 37 |
| 9. | ॥ | ॥ | పుట 38 |
| 10. | ॥ | ॥ | పుట 40 |
| 11. | ॥ | ॥ | పుట 40 |
| 12. | షేక్ నాజర్ | – శ్రీరామరాజు యుద్ధం బుర్రకథ | పుట 8 |
| 13. | ॥ | ॥ | పుట 23 |
| 14. | ॥ | ॥ | పుట 26 |
| 15. | ॥ | ॥ | పుట 32 |
| 16. | ॥ | ॥ | పుట 28 |
| 17. | ॥ | ॥ | పుట 9 |
| 18. | ॥ | ॥ | పుట 31 |
| 19. | ॥ | ॥ | పుట 3 |
| 20. | ॥ | ॥ | పుట 7 |
| 21. | ॥ | ॥ | పుట 13 |
| 22. | ॥ | ॥ | పుట 21 |
| 23. | ॥ | ॥ | పుట 24 |
| 24. | బి.ఎన్.వి.ఎన్. శాస్త్రి | – బుర్రకథ | పుట 17 |
| 25. | ॥ | ॥ | పుట 31 |
| 26. | ॥ | ॥ | పుట 24 |
| 27. | ॥ | ॥ | పుట 24 |

| | | | |
|---|---|---|---|
| 28. | " | " | పుట 48 |
| 29. పడాల రామారావు | – బుర్రకథ | | పుట 4 |
| 30. | " | " | పుట 5 |
| 31. | " | " | పుట 6 |
| 32. | " | " | పుట 6 |
| 33. | " | " | పుట 8 |
| 34. | " | " | పుట 11 |
| 35. | " | " | పుట 13 |
| 36. | " | " | పుట 14 |
| 37. | " | " | పుట 17 |
| 38. | " | " | పుట 19 |
| 39. | " | " | పుట 23 |
| 40. | " | " | పుట 39 |

# 6) వ్యాసాలు - సమీక్ష

## 6.0:

వ్యాస ప్రక్రియ ఒక భావజాలాన్ని సంగ్రహంగా అందించడానికి మిక్కిలి ఉపకరిస్తుంది. అందుకే ఆధునిక సాహిత్యంలో వ్యాసానికి సముచిత స్థానం ఉంది. తెలుగు సాహిత్యాన్నే కాక భారతీయ సాహిత్యాల్లో ఎంతగానో ప్రభావితం చేసిన వ్యక్తుల్లో గాంధీ, అంబేద్కర్, మార్క్స్ లాంటి వారి వర్ధంతులకు, జయంతులకు ఎన్నో వ్యాసాలు వివిధ పత్రికల్లో వస్తూ వుంటాయి. అలాగే జాతీయోద్యమంలో ప్రముఖుడైన అల్లూరి సీతారామరాజుపై కూడా ఆయా సంధర్భాల్లో లెక్కకు మించి వ్యాసాలు వచ్చాయి. అయితే వాటిలో ప్రధానమైన వ్యాసాల్ని పత్రికా వ్యాసాల్ని, శతజయంతి సంచిక వ్యాసాల్ని, పీఠికా వ్యాసాల్ని, పరిశోధన వ్యాసాల్ని ఈ అధ్యాయంలో సమీక్షించాను.

## 6.1 పత్రికల్లో వ్యాసం:

వ్యాసంలో చారిత్రక ప్రదానమైన అంశాలలో అల్లూరి సీతారామరాజు మన్యం పోరుబాట. ఆంధ్రవీరుడు భారతదేశ బానిసత్వ సంకెళ్ళను తెంచుటకు పోరాడిన విప్లవబాట. అనేక మంది సాహిత్యకారులు అల్లూరిపై వ్రాసిన వ్యాసావళిలు వ్రాసారు. వ్యాసకర్తలు ఆయా వ్యాసాల్లో అల్లూరి జీవిత చరిత్రను వారి వారి దృక్కోణాల్లో దర్శించిన తీరును పరిశీలిద్దాం.

అల్లూరిపై వచ్చిన వ్యాసాల్లో అతి ప్రముఖ్యమైనది, ప్రధానమైన వ్యాసం దీనిని 18.07.1929న యంగ్ ఇండియా పత్రికలో ప్రచురించారు. ఈ వ్యాసం చదివిన జాతీయ నాయకులు ఆశ్చర్యపోయారు. అప్పటి వరకు ఆంధ్రప్రదేశ్‌కు తెలిసిన అల్లూరి జాతీయస్థాయిలో స్వాతంత్ర్య ఉద్యమ నాయకుడుగా కొంత వెలుగు వచ్చింది. అంటే ఈ వ్యాసానికి ఎంతటి ప్రభావం ఉందో మనం అర్థం చేసుకోవచ్చు.

ఈ వ్యాసం చదివిన గాంధీజీ, నెహ్రూ... సుభాష్ చంద్రబోస్, యస్.యస్. హార్డికరు (హిందుస్థాన్ సేవాదళ్ కార్యదర్శి) మొదలైన వారు విప్లవవీరుడుగా, జాతీయ స్వాతంత్ర్య సమర యోధుడుగా గుర్తింపు వచ్చుటకు ఈ వ్యాసం కారణం. ఈ వ్యాసం రాసి అల్లూరిని తెలుగులోకి తెచ్చింది మద్దూరి అన్నపూర్ణయ్య గారు.

అన్నపూర్ణయ్య గారు అల్లూరికి బాల్య మిత్రుడు. ఒకే పాఠశాలలో చదువుకున్నారు. అల్లూరి చదువుపై నిర్లక్ష్యం చేయటం చూసి గట్టిగా మందలించినపుడు నిజమయిన విద్య అంటే ఏమిటో వివరిస్తూ గొప్పగా చర్చించేవారు. విద్య అనే పెద్ద పేరుతో వ్యవహరింపబడుతున్న ప్రస్తుత విద్యావిధానాల గురించి తీవ్రంగా విమర్శించేవారు.

"నేను సన్యాసినవుతాను' 'నా దేశీయులను ఉద్ధరిస్తాను' అని నిత్యము నా చెవులు చిల్లులు పడేటట్లు చెబుతుండేవాడు. దురదృష్టవశాత్తు ఆ మాటల అర్థం నాకిప్పుడేమి తెలియలేదు అని అన్నపూర్ణయ్య రాశారు.

"సహాయ నిరాకరణోద్యమ కార్యకలాపాలను సహనంతో గమనిస్తూ ఫలితాలకు లేచి ఉన్నాడు. గాంధీజీ కార్యక్రమ మంతటిలో మద్యపాన నిషేధం, కోర్టుల బహిష్కారము ఈ రెండు సీతారామరాజుకు నచ్చాయి. అయితే శ్రీ రామరాజుకు కాంగ్రెసు అన్న, జాతీయ నాయకులన్న ఎనలేని గౌరవం. పోలీసుస్టేషన్ ముట్టడిలో గాంధీజీకి జై అని సహాయ నిరాకరణోద్యమంలో భాగం అని, స్వాతంత్ర్యం మా జన్మహక్కు అని నినాదంతో పోలీసుస్టేషనులో దద్దరిల్లినట్లు వెలిగెత్తి చాటారు. విప్లవ మార్గంలో వెళ్ళిన స్వాతంత్ర్యం రావడం ముఖ్యమని శ్రీ రామరాజు అభిప్రాయం."[1]

శ్రీ రామరాజు పవిత్రత, భక్తి మొదలైన వాటి వలన జనులకు చక్కగా ఆకర్షించగలిగినాడు. ఏజెన్సీలో ప్రజలకు ఆయన మాటే శాసనమయింది. వారు అమాయక ప్రజలు. ఆయన ఉపన్యాస ధోరణి వారి హృదయాలకు బాగా నాటింది. కోర్టుల చుట్టూ తిరగకండి, తాగకండి అన్న రెండు మాటలే గ్రామస్తులకు ఆయన ఇచ్చిన సందేశాలు.

శ్రీరామరాజు ప్రసంగాలు వినేటప్పుడు ప్రజలు ఉప్పొంగి పోయే వారని తెలిసింది. ఆయన ప్రతిదినం ఆద్యాత్మిక ప్రసంగాలు చేసేవారు. కాని ఆ ఆధ్యాత్మిక తత్వంలో దేశభక్తి కూడా పాలలో పంచదార వలె మిళితమై ఉండేది. ప్రజలు వారి ఆధాత్మిక క్షీరం ఎంతో ఆసక్తితో త్రాగేవారు. ఇరవై ఐదేండ్లు యువ సన్యాసి విద్యా విహీనులయిన కోయలకు విప్లవ బోధ చేయడమే ఆ ప్రసంగాల సారాంశము.

ఇక్కడ విప్లవం ప్రారంభమవుతున్నది అన్న సంగతి ప్రభుత్వంవారు తక్షణం పసికట్టినారు. 1922 జనవరిలో రాజు తిరుగుబాటును లేవదీయనున్నాడనే ఒక వదంతి వ్యాపించినది. రాజును సహాయ నిరాకరణవాది అన్నారు. తూర్పు గోదావరి జిల్లా పోలీసు సూపరింటెండెంట్ ఏజన్సీ ప్రాంతాలకు పరుగెత్తినాడు. అక్కడ అతనికేమి కనిపించలేదు.

రాజు తపస్సులో మునిగి ఉన్నాడు. అతనిని నర్సీపట్నానికి తీసుకుపోయి తరువాత విడిచిపెట్టినారు. కానీ పోలీసులు అతనిని వెంటాడి బాధించడం మాన్పించమని విజ్ఞప్తి చేసుకున్నారు.

అప్పటి డిప్యూటి కలెక్టర్ (ముస్లిం)ని తరువాత కలుసుకొన్నట్లు తెలిసింది. కాని వారేమి మాట్లాడుకొన్నారో ఎవరికీ తెలియదు. ఫలితమేమంటే రాజుకు 30 ఎకరాల భూమి వ్యవసాయం చేసుకొనేటందుకు తగిన సౌకర్యాలతో మంజూరు చేయవలసిందని ప్రభుత్వం వారికి డిప్యూటి కలెక్టర్ సిఫార్సు చేసినాడు. ఆ ప్రకారం మంజూరు అయింది కూడా. ఈ విధంగా దేశభక్తుణ్ణి వ్యవసాయకునిగా మార్చవలెననే ప్రయత్నం జరిగింది.

దేశభక్తుడు దేశభక్తుడుగానే ఉండిపోయినాడు. ఆయన 30 ఎకరాలతో సంతృప్తిపడి ఊరుకుంటే మనిషి కాడు. నిరంకుశ విదేశీ ప్రభుత్వపు చేతుల నుండి యావద్భారత దేశాన్ని విముక్తి చేయవలెనని ఆయన కోరిక. అదే ఆయన జీవితాశయము. ఆయన భగవద్గీత పఠించి స్వధారాన్ని గుర్తించినాడు. స్వతంత్ర భారత దృశ్యం ఆయన మనసుకు నాటింది. ఇలా తన పని నెమ్మదిగా 1922 జూన్‌లో ప్రారంభించాడు.

ఆ ఆటవిక ప్రదేశంలోని పరిస్థితి ఆయనకు చాలా సహకారి అయింది. దానిని ఆయన తన మాతృదేశం కోసం ఉపయోగించుకొన్నారు. గూడెం తాలూకాలోని ఏజెన్సీ ప్రాంతము. అక్కడ ఇతర ప్రదేశాలలో మామూలు చట్టం వర్తించదు. అక్కడిది నిరంకుశ చట్టము. అక్కడ తహశీలుదారు, రోడ్డు కాంట్రక్టరు క్రూరుడయిన దయ్యరు". దీనికి తోడు ప్రభుత్వం వారి రిజర్వ్ ఫారెస్టుల విధానం కూడా అక్కడ అమలు ఉన్నది. కోయలకు ప్రాథమిక హక్కులు కూడా లేవు. అన్నం వండుకోవడానికి అడవిలోని కట్టె పుల్ల కొట్టుకునే హక్కు కూడా కోయలకు లేదు. వాళ్ళ ఆవులు అడవులలో మేయటానికి ప్రాప్తిలేదు. కొంతకాలం క్రితం వరకు ఈ హక్కు గిరిజనులకు ఉండేది. వాటిని ప్రభుత్వం తీసివేసినారు. కాబట్టి ఏజన్సీ ప్రాంతమంతా అసంతృప్తితో అట్టుడికినట్టు ఉన్నది.

ఈ కారణాల వల్ల రాజు కార్యరంగానికి మంచి అవకాశాలేర్పడినాయి. కాని ఇంతమాత్రంలో ఆయన సంతృప్తి పడలేదు. బలిష్టులయిన కార్యకర్తలను కూడగట్టుకొన్నాడు. ప్రజలలో ప్రజ్వలించిన స్వరాజ్య వాంఛను ఈ స్థానిక బాధలు ద్విగుణీకృతంగా పెంపొందించినాయి.

ఏజన్సీలోని ఈ స్థానిక బాధలను స్వాతంత్ర్య పోరాటం కోసం రామరాజు

సంపూర్ణంగా వినియోగించుకొన్నాడు. ఏజన్సీ ప్రజలకు రామరాజు మీద అత్యంతమయిన ప్రేమ అందువల్ల వారిని ఎంత బాధించినా వారు రామరాజు జాడలు ఎంతమాత్రం బయట పెట్టలేదు.

"ప్రభుత్వం వారు పెద్ద పెద్ద బహుమానాలు ఇస్తామని ఆశపెట్టినప్పటికి రామరాజును గురించిన ఆచూకీ ఎంతమాత్రం ఎవరూ ఇవ్వలేదని మద్రాస్ పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఒప్పుకోక తప్పిందికాదు. కానీ ప్రభుత్వం వారు మాత్రం రాజు గూడెంలో ఒక చిన్న 'కెయిజర్' వలె అధికారం చలియించవలెననుకొంటున్నాడని ఆయనకు దురుద్దేశాలు ఆపాదించడంలో ఎంతమాత్రము సందేహించలేదు. ఒక ఉత్తమ దేశభక్తుడని గురించిన ఇటువంటి అపనిందలు ప్రజల అసహ్యానికి గురి అయినాయి.

ఇరవై అయిదేండ్లు వయసు గల యువకుడు అత్యంత శక్తివంతమయిన బ్రిటిష్ సామ్రాజ్యానికి ఎదురు నిలిచి ముందుగా పోరాటానికి స్థల కాల నిర్ణయం చేసి బ్రిటిష్ సింహాన్ని ఆహ్వానించడం అది తన గుహ నుండి బయటకు రాకపోవడం ఆశ్చర్యకరమయిన విషయం.

"ఈ దేశ భక్తుని ఆయుధాలు, విల్లంబులు అంతే, ఆయన సైన్యం. అక్షరాలు రాని గిరిజనులు. ఆయన యుద్ధరంగం కొండ, ఆయన నివాస స్థలం కొండగుహ. ఆయన సైనికులకు ఆహార పదార్థాలు, శత్రువుల నుండి బలాత్కారంగా లాక్కున్నవి. ఆయన అనుచరులు గ్రామస్థుల నుండి అడిగి తెచ్చినవి. అటువంటి మనిషిని, అటువంటి స్థితిలో బలిష్ఠమయిన బ్రిటిష్ ప్రభుత్వం ఎదుర్కొన్నది. కాని రాజుకు మాత్రం కొన్ని ప్రకృతి సిద్ధాలయిన సదుపాయాలు లభించినాయి."[2]

కొండ అతనికి మంచి కీలక స్థానము. మెలికలు తిరిగిన తోవలు, ఇతరులకు తెలియని కొండ గుహలు ఆయనకు చక్కగా ఉపకరించినాయి. అక్కడి శీతోష్ణస్థితికి శత్రువులు అలవాటు పడనందున వారు చలి జ్వరాలతో బాధపడవలసిన అవస్థ పట్టింది. అందువల్ల శత్రువులకు ప్రతికూలంగాను, రాజుకు అనుకూలంగాను పరణమించింది.

శక్తి వంతమయిన శత్రువులతో పోరాడవలసిన ఆ సమ సంగ్రామంలో తెలివిగల సేవానాయకుడు తన యుద్ధరంగం జాగ్రత్తగా నిర్ణయించుకొని తనది పై చేయి అయ్యేటట్లుగా చూసుకోవలసి ఉంటుంది. సరిగ్గా రామరాజు చేసిన పని అదే. మొత్తం మీద ఉభయులు

ఆరు పర్యాయాలు శత్రువులుగా తారసిల్లినారు. మొదటి ఐదు పర్యాయాలు రాజుకే సంపూర్ణ విజయం కలిగింది.

బ్రిటిష్ ప్రభుత్వం మలబారు నుండి పోలీసువారిని, అస్సాం నుండి సైనిక దళాలను రప్పించినారు. సంకుల సమరం జరిగింది. పెద్దవలస అనే గ్రామం దగ్గర స్కాట్ కవర్ట్, హైటర్ అనే ఇద్దరు యూరోపియన్ ఉద్యోగస్తులను శ్రీరామరాజు కాల్చి చంపివేసినారు. ఇంకా అనేక మందిని గాయపరిచారు.

శ్రీరామరాజు అనేక పోలీసుస్టేషన్‌లను స్వాదీనపరుచుకొని తుపాకులను, మందుగుండు సామానులను వశపరుచుకొన్నాడు.

ఒక పర్యాయం రాజు ఆయన సైనికులు నిద్రిస్తుండగా పోలీసువారు ఆకస్మికంగా వారిని ముట్టడించారు. రాజు వీరోచితంగా పోరాడి, ఎట్లాగో తప్పించుకోగలిగినాడు. తుదకు ఆకస్మిక పోరాటంలో రాజు, సైనికులు అతి సాహసంగా పోరాడి అపజయం పొందడం తటస్థించింది. అదే రాజు సాగించిన స్వాతంత్ర్య పోరాటానికి తుది ఘట్టము.

ప్రభుత్వం వారు ఏజన్సీ ప్రజలపైన పన్నులు వేసి, నిర్బంధంగా సప్లయ్‌లు తీసుకొని, ఇంకా అనేక విధాల బాధపెట్టినందువల్ల వారి బాధలను చూసి, ఓర్చుకోలేక రాజు నిస్పృహతో క్రుంగిపోవడం వలన, ఆయన ఓడిపోయి వుండవలె, లేక లొంగిపోయినా ఉండవలె అనేక రకాల వదంతులు పుట్టినాయి.

ఏమయినప్పటికీ దాదాపు రెండు సంవత్సరాలు (1922 ఆగష్టు నుండి 1924 మే వరకు) సాగిన స్వాతంత్ర్య మహాసంగ్రామంలో శ్రీరామరాజు పోరాటం అంతటితో ముగిసింది. బ్రిటిష్ ప్రభుత్వం వారికి ఈ పోరాటం వల్ల 15 లక్షలు ఖర్చయింది. అయితే శ్రీ రామరాజు ఏమయినాడు? పట్టుబడినాడు! తుపాకి గుండుకు ఎరయై చనిపోయాడు?

ఇంతకు ఆయన ఇప్పుడు బ్రతికి ఉన్నాడా! చనిపోయాడా! గవర్నమెంట్ వారి ప్రకటనలు అస్పష్టంగాను, చికాకుగాను ఉన్నాయి. ఆయన చనిపోయినాడన్న విషయం ఇప్పటిని నిగూఢంగానే ఉన్నది.

1985 జూన్ భారతి మాస పత్రికలో ప్రచురితమైనది. ఇది వ్యాస ప్రక్రియ. కవిత ప్రక్రియలకు చెందుతుంది. ఈ వ్యాసంలో సీతారామరాజు పుట్టుక నుండి హింస, అహింస, విప్లవ విషయాలతో బాటు మరణం వరకు ప్రస్తావించారు.

1924 జనవరి నెలలో దేశోద్దారక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారిచే ఆంధ్రసాహిత్య సరస్వతీ సమారాధన కోసం భారతి మాస పత్రిక ప్రారంభించబడింది. 1984 జనవరిలో 'భారతి' సాహిత్య షష్టిపూర్తి చేసుకొంది.

భారతి పుట్టిన నాలుగు నెలల తర్వాత రక్తాక్షి – వైశాఖ మాసంలో అనగా 1924 మే నెల, 7వ తేదిన మహాయోగి పుంగవుడు, శ్రీరాజరాజేశ్వరీ మంత్రోపాసకుడు, మన్య విప్లవ వీరుడు, భారత స్వాతంత్ర్య సేచ్ఛా సమరయోధుడు శ్రీ అల్లూరి సీతారామరాజును 'గుడాల్' అనే తెల్లదొర చెట్టుకు కట్టించి దారుణంగా కాల్చి చంపాడు. దేశ స్వాతంత్ర్యం కోసం రాజు తన రక్తాన్ని తర్పణం చేసింది, ఈ రక్తాక్షి సంవత్సరంలోనే ఈ రక్తాక్షి మే నెల 7 తేదికి రాజు మరణించి 60 సంవత్సరాలు పూర్తి అయిన సందర్భంలో ఈ వ్యాసం రాయడం జరిగింది.

1957లో మనం ప్రధమ స్వాతంత్ర్య సంగ్రామమని చెప్పుకొన్న సిపాయి పితూరి ప్రారంభింపబడింది. ఇది 1857 నుండి 1859 వరకు రెండేండ్లు నడిచింది. సరిగ్గా 65 సంవత్సరాల తర్వాత 1922లో అల్లూరి సీతారామరాజు మన్య విప్లవం లేవదీసాడు. ఇది రెండేండ్లు 1922 నుండి 1924 వరకు సరిగ్గా 60 సంవత్సరాల తరువాత నేడు అనగా 1984 రక్తాక్షి సంవత్సరం స్థితి ఎలా ఉంది. ఆనాడు సీతారామరాజు సాంఘిక న్యాయం కోసం స్వాతంత్ర్య సమరాన్ని సాయుధంగా నిర్వహించాడు. నేడు కూడా మనకా పరిస్థితి తప్పటం లేదంటే స్వాతంత్ర్యం వచ్చి (1984 నాటికి) 37 సంవత్సరాలైనప్పటికి ఈ నాటికి కూడా మన దేశ ప్రజలకింకా సాంఘిక న్యాయం చేకూరలేదంటే మనకు లభించింది. రాజకీయ స్వాతంత్ర్యమా? ఆర్థిక స్వాతంత్ర్యమా? లేక వట్టి వాక్ స్వాతంత్ర్యమా? అనే సందేహం కలగకమానదు. వాక్ స్వాతంత్ర్యం కోసమే అయితే అది మనకు బ్రిటిష్ మహాయుగంలోనే వుందని జ్ఞప్తి చేసుకోవటం మంచిది.

"ఇంతకూ ఎవరీ అల్లూరి సీతారామరాజు? అరవై సంవత్సరాల క్రితం దేశం కోసం ఆసువులు కోల్పోయిన దానిని, తెలుగు వారు ఎప్పుడో మరచిపోయిన వానిని ఒక సారి జ్ఞాపకం చేసుకుందాం! అది మనందరిని ఒక్కసారి చైతన్యం వైపునకు, స్వేచ్ఛ

స్వాతంత్ర్యము, విప్లవ మార్గాల వైపు నడిపించడానికి ప్రయత్నం చేశారని వివరించారు."[3]

– భారతి పత్రిక, 1985

సీతారామరాజు క్షత్రియుడు. కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోని అల్లూరి యింటి పేరు. 04.07.1897లో విశాఖజిల్లాలోని 'పాండ్రంకి'లో జన్మించారు. వేంకటరామరాజు, సూర్యనారాయణమ్మల ప్రథమ పుత్రుడు ఆయన కాక చెల్లెలు సీతమ్మ (1901), తమ్ముడు సత్యనారాయణరాజు (1906)లోని పుట్టిరి. తండ్రి ఫొటొగ్రాఫర్, 1908లోనే ఆగష్టులో కలరా సోకి మరణించాడు.

04.07.1902లో అక్షరాభ్యాసం అయినప్పటి నుండి రాజు ఒక్కొక్క తరగతి ఒక్కొక్క ఊరిలో చదువుతూ 02.09.1913లో 4వ ఫారంతో చదువు నిలిపివేశాడు. పాఠశాలలో యితని ప్రాణ స్నేహితుడు మద్దూరి అన్నపూర్ణయ్య. అతనితో రాజు యిట్లనెడివాడట.

"ఇది విద్యయా? మన దేశ విద్యయే నిజమగు విద్య నేను సన్యాసినయ్యెదను లోకోద్ధరణకుపకరించు విద్యయే విద్య"

– ఆంధ్రభారతి, శ్రీరామరాజు ప్రశంస – మద్దూరి అన్నపూర్ణయ్య
(జూన్ 1928, పుట 58)

ఇటువంటి స్వతంత్ర భావన కలవానికి ఆంగ్ల విద్యాభ్యాసం ఎలా రుచిస్తుంది? 1913 నుండి 1915 వరకు సంస్కృతాన్నీ, జ్యోతిషాది అనేక శాస్త్రాలనీ కవిరాజు వత్సవాయి నీలాద్రిరాజు గారి వద్ద, సూరి సుబ్బయ్య శాస్త్రి గారి వద్ద అభ్యసించారు.

26.04.1916లో గురువు గారి అనజ్ఞ పొంది ఉత్తర భారతదేశ యాత్ర చేసి వచ్చాడు. యత్రంతా కాలినడకనే సాగించాడు. 1918లో మరలా రెండవసారి ఉత్తర దేశాన్ని చుట్టి వచ్చాడు. బ్రహ్మచర్య వ్రతాన్ని అమరణాంతరం పాటించిన ఉత్తమ యువకుడు రాజు. ఇతడు శ్రీ రాజరాజేశ్వరీ మంత్రోపాసకుడనే సంగతి చాలా మందికి తెలియకపోవచ్చు. కాని యిది యదార్థము.

"ఓం ఐం హ్రీం శ్రీం క్లీం మమ జనని
పార్వత విద్యాం దేహి దేహీ స్వాహా" అన్నది 21 అక్షరాలు కలది.

ఈ మంత్రాన్ని రాజు లక్షసార్లు జపించేవాడు. యోగి వలె సాత్వికాహారం తీసుకొని బ్రహ్మచర్య వ్రతం పాటిస్తూ ఇతర దుర్వ్యసనాలేవీ లేకుండా యుండిన నిష్ఠాపరుడు. ఇట్లున్న వాడికి దేవి ప్రత్యక్షమై యిష్టార్థ మనుగ్రహిస్తుంది. ఈ జపం పూర్తయిన తర్వాత రాజుకు అంతర్వాణీ ప్రబోధం కల్గింది.

అక్టోబరు 1918లో కృష్ణదేవిపేటలోని "కోంగశింగి" వద్ద గల మోదుగు చెట్టు కింద మండల దీక్ష పూర్తి చేశాడు రాజు 1919 మార్చిలో తాండవ నది దానిలో కలయు ఉపనది సంగమ స్థానంలో ఆశ్రమ స్థాపన చేసి దానికి "శ్రీరామ రాజేంద్ర విజయనగర"మని నామకరణం చేశాడు.

**కాంగ్రెసులో అతివాదిగా – విప్లవ వీరుడుగా:**

ఇటువంటి యోగి విప్లవ వీరుడెలా అయ్యాడు? అదే అదే ఆశ్చర్యం రాజు జన్మతః క్షత్రియుడు. కర్మణా బ్రహ్మణుని వలె సాత్వికుడైనవాడు. స్వామి రామ తీర్థవలె "స్వరాజ్య మిందు లేదా మరణ మొసంగుడు" (గిల్ మిలిబర్టీ ఆర్ గిల్మి డెత్) అన్న రాజు కూడా మొదట ఆత్మస్వరాజ్య సంపాదనకై పాట పడిన వాడే కాని ఏజన్సీ వాసుల కష్టాలను కళ్ళారా చూచి విప్లవానికి నాయకత్వం వహించాడు.

బాల్యంలోనే 1906లో "వందేమాతరం" ఉద్యమంలో పాల్గొన్న తండ్రి తనను ప్రోత్సహించాడు. తిలక్, లజపతిరాయ్, అరవింద ఘోష్, సుభాష్ చంద్రబోస్ వంటి వారి వ్రాతలు, ఉపన్యాసాలు రాజును అతివాదిగా చేసాయి. విప్లవ భావాలు, దేశభక్తి, జాతీయోద్యమం యివన్నీ చిన్ననాటనే తండ్రి మూలంగా రామరాజు హృదయంలో హత్తుకున్నాయి. రాజకీయంగా రాజు కాంగ్రెసులోని అతివాద వర్గానికి చెందినవాడు.

1919లో గాంధీగారు రాజకీయరంగ ప్రవేశం చేయటంతో అతివాదుల బలం క్రమంగా తగ్గుతూ అహింసా సిద్ధాంత వాదుల సంఖ్య పెరిగింది. దీనితో భగత్‌సింగ్ వంటి యువకులు, బోస్ వంటి నాయకులు రామరాజు వంటి స్వతంత్ర భావన కలవారు వేర్వేరుగా స్వేచ్ఛ సమరం సాగించవలసిన పరిస్థితి ఏర్పడింది. 1913–1918 ప్రాంతాలలోనే రాజు మన్యం ప్రజల స్థితిగతులు తెలుసుకున్నాడు.

**ఏజన్సీ పరిస్థితులు:**

1920లో విశాఖ జిల్లా ఏజన్సీలోని గూడెం తహశీల్దారుగా బాస్టియన్ అనే

క్రైస్తవుడుండేవాడు. ఒకరు పేరు 'సంతాన పిళ్ళ' అనే తమిళుడు. వీరిద్దరి దౌర్జన్యాలకు, దుండగాలకు అంతులేదు. రాజు స్వయంగా పంచాయితీ స్థాపన చేసి న్యాయ విచారణ చేస్తూ మద్యపాన నిషేధం, జరిమానా విధిస్తూ వచ్చారు. ప్రజల వైపు నిలబడి రాజు కలెక్టరుకు బాస్టియన్ అన్యాయాలను తెలుపుతూ పిటిషన్ పంపారు. దానితో రామరాజుకు బాస్టియన్ ఆగర్భ శత్రువై కూర్చున్నాడు. రాజుకు భూమిని యినాంగా యిచ్చి హోలికుడుగా చేయాలని ప్రభుత్వం చేసిన ప్రయత్నం విఫలమైంది.

**సమరసైన్యం – యుద్ధ వాతావరణం:**

"సీతారామరాజు కాషాయ వస్త్రం, తుమాలా వేసికొని తిరిగేవాడు. రొమ్ము వరకు గడ్డం, చేతిలో ఒకటిన్నర గజాల పొడవైన వెండి తాపడం చేసిన మోదుగ బెత్తం వుండేది. వ్యక్తి 5 అడుగుల, 4 అంగుళాల ఎత్తు. గెరిల్లా యుద్ధాన్ని శివాజీ వలె నడుపగల సమర్థుడు."

రామరాజు ఉద్యమాన్ని సమర్థిస్తూ 150 మంది పితూర్‌దార్లు ఉండేవారు. వారిలో గాం గంటందొర, గాం మల్లుదొర అనే సోదరులు కంకిపాటి ఎండు పడాలు, సంకాజి ముక్కడు, గోకిం ఎర్రెశు, మట్టడపు వీరయ్యదొర, బొంకుల మోదిగాడు, అగ్గిరాజు మున్నగువారు ముఖ్యులు. వేంకట కృష్ణం రాజు, పేంచర్ల సూర్యనారాయణ రాజు అనే వారు ప్రచారకులు, పితూరిదార్లకు పెదమపురం, శరభన్నపాలెం, లింగాపురం ముఖ్య కేంద్రాలుగా వుండేవి.

"పితూరీ ప్రారంభించడానికి ముందు రాజు తన అనుచరులతో కలసి సభ చేసి వారిని ఉద్బోధించిన తర్వాత "శాంబరి" పర్వతంపై రాజరాజేశ్వరిని సందర్శించి మండల దీక్ష తీసుకున్నాడు. దాదాపు 3 నెలలు గూడెం కొండలలో దాగి తపోశక్తిని సంపాదించి 1922 ఆగష్టు 15 ప్రాంతంలో బయటకు వచ్చాడు. 19.08.1922న మహారుద్రాభిషేకం శివజాగరణ చేశాడు."

**విప్లవ పోరాటం – ఐదు విజయాలు:**

22.08.1922న మొట్టమొదటి ముట్టడి. చింతపల్లి పోలీస్‌స్టేషన్‌పై దాడి 'మేము పట్టపగలు పోలీసుస్టేషను దోపిడి చేయనున్నాము. మీకు ధైర్యమున్నచో మమ్ము ఎదుర్కొనుడు"... సీతారామరాజు అని ముందుగానే హెచ్చరించాడు. అనుకున్న ప్రకారం ఆయుధ సామాగ్రి అంతా దోచుకుని పోలీసుల డైరీలో సీతారామరాజు అని సంతకం

చేశారు. (కానీ పరిశీలించిన మీదట శ్రీరామరాజు సంతకం ఉంది).

23.08.1922 కృష్ణదేవి పేట పోలీస్‌స్టేషను, మరునాడు రాజ కొమ్మంగి స్టేషనుపై దాడి ట్రైమన్ హాల్ డి.యస్.పి. నాయకత్వంలో ప్రభుత్వ సైనికుల ఓటమి. ఇది రెండవ ముట్టడి.

మూడవ ముట్టడిలో 19.07.1922 ఆంగ్ల సేనాని జాన్ ఓడిపోయి కాలికి బుద్ధి చెప్పాడు. 21.09.1922న మహాకాళి పూజ చేయచుండగా టాల్బార్టు, సాండర్సు దాడి జరపడం విప్లవకారులు వీరోచితంగా పోరాడడం. సాండర్సు పలాయన మంత్రం పఠించడం జరిగాయి. కాళీ పూజ నిర్విఘ్నంగా జరిగిపోయింది.

24.09.1922న స్కాట్ కవర్టు, హైటర్ అనే ఆంగ్ల, సేనానులు జర్మనీ యుద్ధంలో పాల్గొన్నవారు. రమనవల్లి ఘాట్ చేరారు. రాజు 10 మందిని మాత్రమే వీరిపై పంపాడు. ఆంగ్ల సైనికులు 50 మంది వున్నారు. పెద్ద బండరాయికి చాటుగా ఒక పితూరీ దారుడు దాగి యిరుకైన త్రోవలో వస్తున్న ఇద్దరు సేనానుల రాక తెల్పగా కంకిపాటి ఎండుపడాలు కాల్పులకు ఇద్దరూ క్రింద పెద్ద కాల్వలోపడి మరణించారు. ఈ ఘట్టం పితూరీ చరిత్రలోనే కాదు. ఆంధ్రప్రదేశ్ చరిత్రలోనే అతి ముఖ్యమైంది. ఇది నాల్గవ ముట్టడి.

15.10.1922 నాఫ్ అనే హోంసభ్యుడు గొరిల్లా యుద్ధం ఆపడానికి వచ్చాడు. విఫలుడై వెళ్ళాడు. రాజు గోదావరి కలెక్టరు బ్రేక్‌నును తనతో పోరుకైనా మాటాడుటకైనా రమ్మన్నారు. కాని ఆయన రాలేదు. రంపచోడవరంలో జనరల్ జాన్ ఓడిపోయి వెనుతిరిగారు. రామవరం ప్రాంతంలో 'సాండర్సు' మరలా విఫలుడై తిరోగమించాడు.

**ఆరవసారి ముట్టడి - అపజయం:**

ఇంతవరకు శ్రీరామరాజుకు 5 సార్లు ఘన విజయాలు కల్గాయి. ఆరవసారి ముట్టడితో అపజయం కల్గడం ప్రారంభించింది. కొండపల్లిని ప్రభుత్వం పితూరీదార్ల ఆచూకీ యివ్వలేదని దగ్ధం చేసింది. 06.12.1922 ఉదయం జాన్ సేనాని పెద్దగడ్డపాలెం కాల్పులలో 4 గురు విప్లవకారులు చనిపోవడం. ఒకరు లొంగిపోవటం జరిగింది. రాజు వద్ద గల మందుగుండు సామాగ్రి ప్రభుత్వం వశమైంది. అదే రోజు సాయంత్రం 'హోఫెల్' 'స్వీన్' అనే ఆంగ్ల సేనాను లిద్దరూ రెండు వేల గుండ్లు గల మెషిన్ గన్‌తో కాల్పులు జరిపించారు. 8 మంది పితూరీదార్లు చనిపోయారు. నలుగురు పట్టుబడ్డారు. రాజు,

అతని అనుచరులు ముగ్గురు తప్పించుకున్నారు. 1923 జూన్ నెలలో రాజు సైన్య సమీకరణ చేశాడు. ప్రభుత్వం పితూరీ అణచడానికి గట్టి చర్యలు తీసుకొంది. కఠిన ప్రాణ హృదయుడైన గుడాల్‌ను అస్సాం నుండి రప్పించడం. ఒకప్పుడు పల్నాటి తాలూకాలో 'కన్నెగంటి హనుమంతు' తిరుగుబాటు అణచిన రూథర్‌ఫర్డును, గోదావరి జిల్లా కలెక్టరుగా వేయడం – రాజును అతని అనుచరుల్ని పట్టి యిచ్చిన వారికి పెద్ద మొత్తంలో బహుమతులు ప్రకటించడం ప్రధానమైనవి.

పితూరీదార్లు పలచబడ్డారు. గాంమల్లు దొర పట్టుబడ్డాడు. అగ్గిరాజు (అండమాన్) ద్వీపాంతర శిక్ష పొందాడు.

**రామరాజు మరణం – అనాగరిక కృత్యం:**

"1924 మేనెల 7వ తేది ఉదయం ఆరు గంటలకు రాజు 'మంప' మన్సబుతో తన్ను పట్టి యిచ్చి బహుమతి తీసుకొమ్మన్నాడు. కాని ఆయన నిరాకరించాడు. కొయ్యూరులోని సైనిక శిబిరానికి తానక్కడ వున్న విషయం ఒక పశువుల కాపరి ద్వారా తెల్పగా హుటాహుటిని సైనికులు జమేదారుతో వచ్చి రాజును బంధించి తీసుకువెళ్ళారు."

మేజర్ గుడాల్ వారిని మందలించి కట్లు విప్పించి రాజుతో కొంతసేపు మాటాడాడు. భారతీయ రాజ్యస్థాపనమే తన ధ్యేయమని రాజు నొక్కి చెప్పాడు. దమనపల్లి ఘాటులో ఆంగ్లేయులనెలా చంపావని 'గుడాల్' అడుగగా అది తన అనుచరుల వీరకృత్యమని రాజు ప్రశంసించాడు. అయితే తానూ కాల్చడానికే నిశ్చయించానని గుడాల్ నవ్వగా, రాజు తనను న్యాయస్థానంలో ఎందుకు పెట్టవని ప్రశ్నించాడు.

గుడాల్ అది పెడచెవిని పెట్టి రాజును చెట్టుకు కట్టించి జమేదారుతో కాల్చమన్నాడు. ఆగుండు గురి తప్పటతో గుడాల్ ఆగ్రహావేశ పరవశుడై రివాల్వర్‌తో రాజుగుండెను గురిచూచి కాల్చి చంపాడు. వరుసగా నాల్గయిదు గుండ్లు రాజు గుండెలో దూసుకుపోయాయి. రాజు స్వయంగా పట్టుబడ్డాడు. కాని ఆయన్ను పట్టి బంధించడం ఎవరి తరంకాదు.[5]

విచారణ లేకుండా ఒక మహాయోగి పుంగవుని కాల్చి చంపడం అనాగరిక కృత్యం. బ్రిటిష్ సామ్రాజ్యానికిది తీరని కళంకం. ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటి ఎన్‌కౌంటర్ 8వ తేది ప్రజలు రాజు శవాన్ని గుర్తించి దహనం చేయించి చితాభస్మాన్ని తాండవనదిలో కలిపారు. హత్య జరిగిన సాయంత్రం రూథర్‌ఫర్డు, స్పీన్ వచ్చి 'గుడాల్'ను మందలించాడు.

గాని అంతరాంతరాల్లో సంతోషించారు. తరువాత అందరూ కలసి తప్పించుకోవడానికి ఒక ఎత్తు వేశారు.

తాము రాజును పట్టుకొనగా అతడు పారిపోవుటకు ప్రయత్నించాడని అలా పారిపోతుండగా కాల్చి చంపామని కథను అల్లి ఎందుకైనా మంచిదని దీర్ఘకాలం సెలవు మీద వెళ్ళిపోయారు. 13.04.1919లో జలియన్ వాలాబాగ్ సామూహిక హత్యలలో కాల్పులు జరపడానికి జనరల్ డయర్‌కు ఎవరు అనుమతి యిచ్చారు? 'హు ఆస్క్‌డ్ యు టు ఒపెన్ ఫైర్"? అని గవర్నర్ జనరల్ అడిగిన ప్రశ్నకు డయర్ నిరుత్తరుడైనారు. కాని తర్వాత ప్రభుత్వంచే గొప్ప బహుమతే అందుకున్నాడు. ఆ విధంగా ఆంధ్రప్రదేశ్‌లో విచారణ లేకనే గుడాల్ రాజును కాల్చి చంపాడు.

## స్మృతి చిహ్నం - పవిత్ర క్షేత్రం:

కృష్ణదేవి పేటలో శరభన్న పాలెం పోయే మార్గంలో రాజుగారి స్మృతి చిహ్నం దహనం జరిగిన ప్రదేశంలోనే ఏర్పరచబడింది. "ఆంధ్రవీర శ్రీ అల్లూరి శ్రీ రామరాజుగారి బౌతిక దేహదహన పవిత్ర క్షేత్రం" అని దానిపై వ్రాయబడింది. రామరాజు పితూరీ నణచడానికి బ్రిటిష్ ప్రభుత్వానికి 53 లక్షలు ఖర్చయింది. అనేక ఉద్యోగులు, సైనికులు, ఆయుధ సామాగ్రి నష్టంమయింది. హత్య కావింపబడినప్పుడు రాజు వయస్సు 27 సంవత్సరాలు.

## శ్రీ రామరాజుపై విమర్శ:

"అప్పటి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు ప్రెసిడెంటు శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు 30.08.1922లో పెద్దాపురం కాంగ్రెసు సంఘానికి పంపిన తంతీ వార్తలో తెలిపాడు. ఎవరు దోపిడీ కాండ్రు? వ్యాపార మిషతో దేశాన్ని దోచుకున్న ఆంగ్లేయులా? లేక స్వాతంత్ర్యం సంపాదించామని దేశం దోచుకుంటున్న నేటి నాయకులా? రామరాజు ప్రకాశానికే మాత్రం తీసిపోని దేశభక్తుడు".[6]

యంగ్ ఇండియాలో 'ఆంధ్రహీరో' అని ప్రశంసించిన గాంధీ మహాత్ముని వాక్యాలు చూడండి.

## శ్రీరామరాజుకు నాయకుల ప్రశంసించడం:

"శ్రీరామరాజు యొక్క దౌర్జన్య పద్ధతులతో నేనేకీభవించజాలకపోయిననూ ఆయన

అకుంఠిత సాహసము, త్యాగదీక్ష, ఏకాగ్రత, ఉత్తమ శీలమూ, నిరాడంబరమగు కష్ట జీవనము మన మందరము నేర్వదగినవి"

"రాజు వజ్ నాట్ ఎఫితూరీ బట్ ఎ గ్రేట్ హీరో"

(మహాత్మగాంధీ - యంగ్ ఇండియా 18.07.1929)

రామరాజు చనిపోయిన తర్వాతనే ఆయన గొప్పతనం మన దేశ నాయకులకు తెలిసి వచ్చింది.

"నా దురదృష్టవశాత్తు శ్రీరామరాజు గూర్చి నాకు విశేషంగా తెలియదుగాని, కాని నేను తెలుసుకున్నంతవరకు అతడు వేళ్ళపై లెక్కింపదగిన స్వల్ప సంఖ్యాకులగు అనుచరుల సహాయముతో బ్రిటిషు ప్రభుత్వమునే గడగడలాడించిన ధైర్యసాహసోపేతడగు వీరుడని స్పష్టపడినది. అట్టి ధైర్య సాహసములు ప్రకటించి ప్రశంసాపాత్రులగు వీరులరుదు"

- జవహర్‌లాల్ నెహ్రూ

"జాతీయోద్యమమునకు శ్రీరామరాజొనర్చిన సేవను ప్రసంశించు భాగ్యము కలిగినందుకు నేను సంతసించుచున్నాను. ఈ మహానుభావుడు స్వాతంత్ర్యము అనుభవించుచున్న ఏ దేశమునందైననూ జన్మించినచో అతని సాహస కార్యములకెక్కువ అవకాశములుండి ఇంతకన్నా ఎక్కువగా తన దేశ ప్రజల ప్రశంసకు పాత్రుడయ్యేవాడు. అతని ధైర్యసాహసము, దేశభక్తి, పట్టుదల, పౌరుషము అతని ఖ్యాతినల్దిశల వ్యాపింపజేసినవి.

అతని విధానాలు అంగీకరింపజాలనివారు కూడా ఆయన విశాల భావాలను ప్రశంసించక తప్పదు. భారతీయ యువకులు, భారతీయ వీరులను ఆరాదించుట మరువ కూడదు."

- సుభాస్ చంద్రోబోసు

"పరదేశ పాలితుల చేతుల నుండి స్వాతంత్ర్యమును సంపాదించుటకు నేడు భారతభూమికి శ్రీరామరాజు వంటి వీరులు కావలయును. భారతదేశమును బంధముల నుండి విముక్తి జేసి వీరుల వలె ప్రపంచమున ప్రకాశింపవలెనని భారతీయ యువజనులను నేను హెచ్చరించుచున్నాను.

- యస్.యస్. హార్డుకరు (హిందుస్థానీ సేవాదళ్ కార్యదర్శి)

ఒకసారి అతివాద వర్గానికి చెందిన వారిని ఉద్దేశిస్తూ చాలా మాట్లాడారు గాంధీ. కాని శ్రీరామరాజు సాయుధ పోరాటాన్ని నిరసించిన అహింసా సిద్ధాంత కర్త గాంధీ 1947లో స్వాతంత్ర్యమైతే సాధించారు గాని ఆయన కళ్ళ ఎదుటి ఎంత రక్తపాతం జరిగింది? చివరికి తాను 1948లో ఏమయ్యాడు? విప్లవవీరుడని చెప్పి రామరాజును ఒక విదేశీయుడు కాల్చగా, గాంధీని ఒక స్వదేశీయుడే కాల్చి చంపాడు.

చూసారా! న్యాయానికీ, ధర్మానికీ, అతివాదమైనా – మితవాదమైనా దక్కే ఫలితం! రాజే గనుక అహింసా మార్గంలో వెళ్ళివుంటే మరో గాంధీ మహత్ముడయ్యేవాడ! యోగ మార్గంలో వెళ్ళి వుంటే మరో అరవిందఘోష్ అయ్యేవాడు. అరవిందుడు కూడా మొదట విప్లవవాదియే. ఇప్పుడు మనం గాంధీని విస్మరించాం. రామరాజును అంతకుముందే మరిచిపోయాం. రెండింటికి చెడిన రేవళ్ళయ్యాం.

రామరాజు వందేమాతరం ఉద్యమానికి చెందిన వీరుడు. ఆయన నినాదం. 'వందేమాతరం మనదే రాజ్యం'. ఆత్మ స్వాతంత్ర్యం కంటే దేశ స్వాతంత్ర్యం ధ్యేయంగా పోరాడిన స్వాతంత్ర్య సమర వీరుడు. భారతమాత భక్తుడు ఆయన మార్గంలో, ఆయన ఆశయాలతో మనందరం ప్రయాణించాలని రచయిత బోధించారు.

### 6.2 శతజయంతి సంచికలో:

అల్లూరి సీతారామరాజు శతజయంతి (1897–1997) సందర్భంగా విశాఖపట్టణంలో 08.05.1997 జరిగిన జనసాహితి ఉత్తర కోస్తా జిల్లాల సాహిత్య సదస్సులో 'మన్యం వీరుని పోరుదారి' అనే వ్యాస సంకలనాల పుస్తకాన్ని ప్రముఖ బెంగాలీ ప్రజా రచయిత్రి మహాశ్వేతాదేవి ఆవిష్కరించినారు. 10 మంది రచయితలు సుదీర్ఘమైన వ్యాసాలు, బుర్ర కథలు, కవితలు, అనుబంధాలు మొదలైన విషయాలు శ్రీరామరాజు గురించి వివరించబడ్డాయి. ఇంక రామరాజును గూర్చి సమాజానికి తెలియని చారిత్రక సత్యాలను వెల్లడించారు.

ఇందులో మొదటి వ్యాసం. 'విప్లవ జ్యోతి అల్లూరి సీతారామరాజు' అనే వ్యాసాన్ని గోపరాజు నారాయణరావు రాసిరి. ఈ వ్యాసంలో రామరాజుకు యోగిగా, సంఘ సంస్కర్తగా స్వాతంత్ర్య దీక్షపరులుగా, విప్లవవీరుడుగా కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించారు. ఇందులో గత పోరాటాలను ప్రస్తావిస్తూ...

"బ్రిటిష్ పాలనకి నిరసనగా జరిగిన పోరులో భారత జాతీయ కాంగ్రెసు మితవాద ధోరణితో అగ్రస్థానంలో నిలిచింది. దీని అనుబంధంగా రైతాంగ పోరాటాలు జరిగాయి. భారత స్వాతంత్ర్య సంగ్రామానికి సమాంతరముగా మన దేశంలో గిరిజన పోరాటాలు జరిగాయి. దుర్గమారణ్యాలలో సాయుధ పథంలో సాగిన ఈ పోరులన్నీ విప్లవగాధలే. వంగభూమిలో 1768లో జరిగిన "చౌర్స్" తిరుగుబాటు ఇలాంటి వాటిలో దాదాపు మొట్టమొదటది. అస్సాం వనభూములలో జరిగిన ఖాసి తిరుగుబాటు 1835. గుజరాత్, మహారాష్ట్రాలలో 'కాలి' తిరుగుబాటు (1824-48). ఒరిస్సాలో ఖోండ్ తిరుగుబాటు, బీహార్‌లో సంధాల్ తిరుగుబాటు (1855) ముండా (బీరా) నాయకత్వంలో తిరుగుబాటు (1889-90). రాజస్థాన్‌లో భిల్లు తిరుగుబాటు (1913) రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంలో అగ్ని శిఖల ఊరేగింపులా భాసిల్లాయి. ఒక దాని వెంట ఒకటిగా, ఆ మూల-మణిపూర్‌లో కుకీ తిరుగుబాటు 1919 ఇక్కడి నల్లమల కొండలలో జరిగిన చెంచు తిరుగుబాటు 1921 అందులో ఇంకొన్ని మాత్రమే ఈ క్రమంలో దాదాపు అంతిమ ఘట్టంగా 1922-1924 మధ్య తూర్పుగోదావరి, విశాఖజిల్లాలోని మన్యసీమలలో సాగిన "రంప" విప్లవం ఎంతో విశిష్టమైనది. అవమానకరమైన, అటవీ చట్టాలూ, అణచివేత సహించలేక మర్మస్థానాల్లో కారాలు కొట్టి హింసించే శ్వేత పైశాచిక ప్రవృత్తిని భరించలేక అక్కడి కోయ తెగలే లేవదీసిన ఈ తిరుగుబాటుకే మైదాన ప్రాంతాలకి చెందిన అల్లూరి సీతారామరాజు అగ్రభాగాన నిలిచాడు అని గత పోరాటాలతో కలిసి బ్రిటిష్ వారిపై చివర పోరాటంగా అభివర్ణించారు."

రంప ఉద్యమానికి ముందున్న భూమిక సైతం చారిత్రాత్మకమైనది. గుణాత్మకమైనదీను. దేశంలో అటు అతివాదుల ప్రభావం ఇటు హోమ్‌రూల్ ఉద్యమం. భారత రాజకీయాల్లో గాంధీజీ రంగ ప్రవేశం వెను వెంటనే సహాయ నిరాకరణం జలియన్‌వాలాబాగ్ గాయాలతో జాతి వేదన చెందడం. అప్పుడే జరిగిన చౌరీ-చౌరా సంఘటన ఫలితంగా గాంధీజీ చేత సహాయ నిరాకరణోద్యమం నిలిపివేత ఆ స్థితిలో నెలకొన్ని రాజకీయపరమైన శూన్యంలో ఈ దేశ యువతరం గాంధేయవాదుల నుండి రష్యా విప్లవ ప్రభావానికి లోను కావడం విప్లవోద్యమం ఉధృతం కావడము, వెంట వెంటనే జరిగిపోయాయి. మరోకోణంలో చేరాలని పేరాల ఉద్యమం. పలనాటి సీమలో పుల్లరి సత్యాగ్రహంలో కన్నెగంటి హనుమంతు రక్త తర్పణాన్ని ఇవన్నీ సమాజాన్ని సంఘర్షణకు గురి చేశాయి. ఎన్నో విశిష్టతలకు పట్టుగొమ్మయిన 19వ శతాబ్దపు

చింతనాధారతో, చారిత్రక అనుభవంలో 20వ శతాబ్ద స్వేచ్ఛా ప్రియులనీ, ఉదారవాదులనీ, ప్రజాస్వామ్య ప్రగతిశీలవాదాలనూ, ఆవిష్కరించుకున్న అద్భుత ఘట్టం. నిస్సందేహంగా మన విప్లవ జ్యోతి రామరాజు కూడా ఆ ప్రభావంలోకి వచ్చేసారని రచయిత నిరూపించారు.

**విప్లవానికి అనువైన చోటు:**

విప్లవించడానికి అనువైన చోటు కొండలా? మైదానాలా? పర్వత సానువులయితే సిద్ధం చేసిన రణభూమిలా ఉంటాయి. విప్లవ శక్తులకు స్థావరాలను కన్పిస్తాయి. కాని, నగరాలలో వెన్నుపోటు పొడిచే వారుంటారు. సమ్మెలకయితే మైదానాలు చాలు. విప్లవానికి సరైన మార్గాన్ని ఎంచుకొన్నారు. ఆనాటి భారత జాతీయ కాంగ్రెసుకు ఇది వర్తించకపోయినా, కాంగ్రెసుతో విభేదించిన రామరాజు విప్లవ గమనానికి ఇది సరిగ్గా సరిపోతుంది.

మన్య వాసులతో ముందుగా రామరాజు సాన్నిహిత్యం పెంచుకున్నారు. ఆ తర్వాత సంస్కరణలు ప్రారంభించారు. గిరిజనుల దుర్వ్యసనాలు మానిపించేందుకు కృషి చేశాడు. ఆ పరిస్థితులలో మన్యంలో మరో తిరుగుబాటు జరగబోతోందని గుసగుసలు బయలు దేరాయి. రామరాజుపై నిఘా మొదలయింది. మన్యంలో వాతావరణం వేడెక్కిన తరుణంలో రామరాజు, నేపాలు యాత్ర మిషతో పైడిపుట్టను వదలిపెట్టి బయటపడ్డారు. తిరుగుబాటును మన్యవాసులకు సమీకరించే పనిని ముమ్మరం చేశారు. ఈ సమయంలోనే షేక్‌మదీనా అనే కానిస్టేబుల్‌ను మంచి చేసుకొని, అతని వద్ద తుపాకీ కాల్చడం నేర్చుకున్నారు. 1921లో చిట్టగాంగ్ వెళ్ళి అక్కడి విప్లవకారులతో చర్యలు జరిపి వచ్చినట్లు తెలుస్తోంది. చివరకు 1922 ఆగష్టులో మన్యం సమరభేరి మోగించింది" అని కవి వివరించారు.

1922-1924 వరకు బ్రిటిష్ వాళ్ళను ముప్పతిప్పలు పెట్టిన విప్లవ సైన్య బలగంను పట్టుకొనుటకు విశ్వప్రయత్నం చేసిరి. ఎట్టకేలకు 1924 మే 7న రామరాజు పట్టుబడ్డాడు. అయితే మన్యంలో బాగా అమలు జరుగుతున్న కిరాతకమైన దమనకాండనూ అణచివేతను చూడలేక ఆయనే స్వయంగా చిక్కిపోయారన్న బలమైన వాదన వుంది. మలబార్ దళానికి చెందిన జమీందార్ "కుంచ మీనన్" ఆధ్వర్యంలో పోలీసులు రామరాజును బంధించి, మంప సమీపంలో వున్న గుడాల్ దగ్గరకు తీసుకువచ్చారు. అదే రోజున కొయ్యూరు దగ్గర ఒక చెట్టుకు కట్టివేసి, రామరాజును కాల్చి చంపివేశారు.

ఆ తర్వాత రామరాజు మృతదేహాన్ని ఒక నులక మంచానికి కట్టివేసి బండి మీద

ఊరేగింపుగా కృష్ణదేవి పేట తీసుకువెళ్ళి అంత్యక్రియలు జరిపారు. ఈ పనికి ముందు ఫొటో తీయించడం గమనార్హం. అయితే పట్టుబడిన రామరాజు తప్పించుకుపోతుంటేనే కాల్చవలసి వచ్చిందని ప్రభుత్వం విచారణ ఇచ్చుకున్నది అని తప్పుడు సమాచారాన్ని ఇచ్చారని కవి వ్యాసంలో తెలిపారు.

## రంప ఉద్యమం పతనం – ఉద్యమం చివర దశ:

రామరాజు దళానికి, పోలీసులకి మధ్య ఎన్నోసార్లు యుద్ధం జరిగింది. రెండువైపులా నష్టాలు జరిగాయి. 1923 సెప్టెంబరు 18న మల్లుదొర పట్టుబడిపోయాడు. నడింపాలెంలో ఉంపుడుగత్తె ఇంట అరెస్టు చేసిన మల్లును విశాఖ సెంట్రల్ జైల్‌కీ అక్కడ నుండి అండమాన్ సెల్యూలర్ జైలుకీ తరలించారు. 1923 మే 1న వీరయ్యదొర దొరికిపోయాడుల. రామరాజు చనిపోవడానికి ఒక్కరోజు ముందు అంటే 1924 మే 6న అగ్గిరాజును బంధించారు. ఎండు పడాల్‌ను పెద్దచెరువు అనే గ్రామంలో గిరిజనులే కొట్టి చంపారు. అంత క్రితం అతడి కుమారుడిని వారే పోలీసులకు పట్టించారు. ఇక 1924 జూన్ 7న గంటందొర నాయకత్వంలో కొండలలో సాగిపోతున్న దళాలపై కాల్పులు జరపగా రంప ఉద్యమం అసలు వ్యూహకర్త గంటందొర కూలిపోయాడు. ఆ తర్వాత ఎందరో ఉద్యమకారులు ప్రాణాలు విడిచిపెట్టిరి. 1922 ఆగష్టులో మొదలయిన రామరాజు ఉద్యమం 1924 జూన్ వరకు కొనసాగింది.

## విప్లవబాటలో స్వాతంత్రపోరాటం:

''రాజంటే ఒక మండే జ్వాల, కాని అంతర్ముఖుడు. అయితే అడవిలో విప్లవోన్ముఖుడయ్యాడు. రంప ఉద్యమ నిర్వహణలో రాజుకు స్పష్టమైన ఆలోచన యోజన ఉన్నాయి. దార్శనికత వుంది. ఆయన, ఆయన సహచరుల మాటలతో, చేతలతో ఇది స్పష్టమయ్యేదని రామరాజు బాల్యమిత్రుడు మద్దూరి అన్నపూర్ణయ్య చెప్పారు. 17.04.1923న రామరాజు అన్నవరం వెళ్ళాడు. అప్పుడు నరసింహమూర్తి అనే ఒక కాంగ్రెసు కార్యకర్తకు ఆయన యిచ్చిన ఇంటర్వ్యూలో పితూరు లక్ష్యం ఏమిటంటే "ప్రజలకు స్వాతంత్ర్యం" అని రామరాజు సమాధానం. ఏ మార్గంలో అని అడిగితే "హింసాయుత విధానంలో" అన్నదే ఆయన ప్రత్యుత్తరం. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, స్వరాజ్యం సమరంతోనే సాధ్యమన్న విశ్వాసాన్ని కూడా రామరాజు వ్యక్తం చేశాడు. రెండేళ్ళలో స్వాతంత్ర్య తద్యమని 'తన వెంట జనం బలం వున్నదని ఆయుధాలు సేకరిస్తానని ప్రకటించారు.

గెరిల్లా పద్ధతిలో సాగిన రాజు సమరం లక్ష్యం నూటికి నూరుపాళ్ళు తెల్లజాతీయులే, భుక్తికై తెల్లవాళ్ళ దగ్గర చేరిన భారతీయులను హెచ్చరించి, విడిచేసే వారుననడానికి ఎన్నో ఉదాహరణలు వున్నాయి. 1921లో చిట్టగాంగ్ యాత్ర చేయడం. కృష్ణదేవి పేట స్టేషన్ కొల్లగొట్టినపుడు గాంధీకి అనుకూలంగా నినదించడం 1923లో కాకినాడ కాంగ్రెసుకు హాజరుకావడం రామరాజు దృక్పథం ఏమిటో వెల్లడిస్తాయి. మల్కనగిరి అనే చోట తనకు పంజాబ్ నుండి అప్పటి విప్లవ కారుల సహాయం లభిస్తుందని కూడా చెప్పాడని తెలియ వస్తున్నది. కాకినాడలో కాంగ్రెసు సభలో తన సందేశాన్ని చదవడానికి అధ్యక్షుడు మహ్మదాలీ తిరస్కరించినా, తుని, కశింకోట, అనకాపల్లి కాంగ్రెసు నాయకులతో నిరంతరం సంబంధాలు నెరిపారు. స్వాతంత్ర్య కాంక్షతో, దేశభక్తితో విప్లవ పోరాటాన్ని సాగించాడని రచయిత వర్ణించారు.

## మన్యం విప్లవంలో స్త్రీలు వున్నారు – రామరాజు మనసులో ఏ స్త్రీ లేదు:

మన్యంలో ఎందరో కోయ స్త్రీలు విప్లవ ఉద్యమంలో, స్వాతంత్ర్య పోరాటంలో రామరాజుతో పాల్గొన్నారు. అయితే స్త్రీలతో మాట్లాడే అలవాటు ఆయనకు చాలా తక్కువ అని తెలుస్తుంది. పోలీసుల కదలికలూ, ఉద్యమకారులకు అవసరమైన వంట సామాగ్రి, బట్టల ఏర్పాట్లు ఇవన్నీ స్త్రీలే నిర్వహించేవారు. గంటం, మల్లుల భార్యలు పెద్దబ్బి అనే మరో ఉద్యమకారుడి కూతురు ఉద్యమంలో పాల్గొన్నారు. సుద్దగుంట అనే చోట వీరయ్యదొర భార్య దొరికిపోయింది. పోలీసుల బెదిరింపులతో కొన్ని ఆయుధాలకు సంబంధించిన సమాచారం వెల్లడి చేసింది. ఈ ఉద్యమంలో మన్యం స్త్రీలు ప్రాణాన్ని, జీవితాన్ని తమ సర్వస్వాన్ని త్యాగం చేశారు.

కాని రామరాజు జీవితంలో “సీత” అనే స్త్రీ లేదు. ప్రతి విప్లవ వీరుడు చుట్టూ ఎన్నో కల్పిత కథలు అల్లబడ్డాయి. అలాంటిది ఈ సీత కథ కూడా చిన్ననాడే సన్యసించిన మనసులో ఏకాంతా లేదనీ, అసలు మహిళలతో తక్కువగా మాట్లాడేవాడని అగ్గిరాజు కథనం. సీతారామరాజుగా ప్రజల హృదయాలలో సుస్థిర స్థానం పొందిన ఆ నాయకుడు ఎప్పుడు శ్రీరామరాజు అని మాత్రమే సంతకం చేసేవాడు.

అల్లూరి సీతారామరాజు నడిపిన రంప ఉద్యమం ఒక జ్వాలలా ఎగసి ఆరిపోయింది. గదర్ పార్టీవలె, హిందుస్థాన్ రిపబ్లికన్ ఆర్మీ వలె, ఐ.ఎన్.ఎ. వలె విషాదాంతమై వుండచ్చు. కాని ఆ ఉద్యమం ఒక స్ఫూర్తిని మిగిల్చిపోయింది. అమ్ములపొదికి, అణ్వాయుధాలకీ

మధ్య జరిగిన యుద్ధంలో ఎవరు గెలుస్తారో చెప్పడం కష్టం కాదు. అయినా ఎందుకు పోరాటమంటే కొండలలో కొత్త సూర్యోదయం కోసమే అని జవాబు వస్తుందని రచయిత వివరించారు.

ఈ వ్యాసం 1997లో వ్రాస్తే, సరిగ్గా 21 సం॥ల తర్వాత 2018లో 'ఆకు పచ్చ సూర్యోదయం" అనే చారిత్రక నవలను రామరాజు విప్లవ జీవితాన్ని గురించి గోపరాజు నారాయణరావుగారు రాయడం విశేషం.

"మన్యం వీరుని పోరుదారి" అనే అల్లూరి సీతారామరాజు శతజయంతి (1897-1997) సంచికలో ప్రముఖ రచయిత సుంకర సత్యనారాయణ "సీతారామరాజు చరిత్రను వెలికి తీయడానికి జరిగిన కృషి" అనే వ్యాసంలో ఎన్నో విషయాన్ని, చారిత్రక సత్యలను వివరించారు. ఆ మహావీరుడి త్యాగభరితమైన జీవితాన్ని సమాజానికి తెలియపరచాలనే ఉద్దేశ్యంతో ఈ వ్యాసం రాశారు.

"1930లో ప్రారంభమయిన ఉప్పు సత్యాగ్రహంలో నేనూ, పొన్నలూరి రాధాకృష్ణమూర్తి పాల్గొన్నాము. గాంధీ, ఇర్విన్ ఒడంబడిక తర్వాత మేము బయటికి వచ్చాము. తిరిగి 1932లో ఒకేసారి తిరిగి జైలుకు వెళ్ళాము. రాజమండ్రి జైలు క్వారంటీన్‌కు వెళ్ళాము. గోదావరి ఒడ్డున ఒక సన్యాసిని పట్టుకొని జైలుకు తెచ్చారు. అతడు సీతారామరాజని వాళ్ళ ఉద్దేశం. అతన్ని పలు విధాల హింసించి చివరకు విడిచిపెట్టారు. 1923-1924లో సీతారామరాజును చంపివేశామని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. కానీ 1932లో సీతారామరాజుని ఒక సన్యాసిని పట్టుకుంది. దీని అర్థమేమిటి? రాజు ఎంతటివాడు కానిదే ప్రభుత్వం ఇలా హడలిపోతుంది? ఈ మహావీరుని చరిత్ర ఎలాగయినా సరే తెలుగు ప్రజలకందించాలనే సంకల్పం మాకు కల్గింది. జైలు నుండి విడుదలై రాగానే రాధా కృష్ణమూర్తి అందుకు ఉద్యమించాడు.

**రామరాజు చరిత్రకు తన జీవితాన్ని త్యాగం చేసిన పొన్నలూరి:**

"పొన్నలూరి రాధాకృష్ణమూర్తి గారి అన్నకు అప్పటికి నలుగురో, ముగ్గురో పిల్లలుండేవారు. రాధాకృష్ణమూర్తి పెండ్లి మానుకొని తన వాటా అన్నగారికి వదిలివేశారు. అన్నగారి దగ్గర ఒక్క వెయ్యి రూపాయలు మాత్రమే మొదట తీసుకున్నారు. మరుగునపడిన సీతారామరాజు జీవితచరిత్ర వెలికి తీయడానికి ఉపక్రమించాడు. ఆనాటి సీతారామరాజు చరిత్రను మొట్టమొదటిగా పుస్తక రూపంలో తీసుకువచ్చినది రాధాకృష్ణమూర్తి గారిది.

అప్పటికి రామరాజు తల్లి, పినతండ్రి రామకృష్ణరాజుగారు కూడా బ్రతికే వున్నారు. రామరాజుకు పరిచయం ఉన్న మిత్రుడు మద్దూరి అన్నపూర్ణయ్యగారు కూడా ఉన్నారు. రాధాకృష్ణమూర్తి వీరందరిని కలుసుకొని రామరాజు బాల్య జీవిత చరిత్ర సేకరించగలిగారు. గవర్నమెంటు రికార్డుల నుండి కూడా కొంత చరిత్ర సేకరించారు. పోరాటం ప్రారంభమయింది. మొదలు అంతమయ్యేవరకు ఆంధ్రపత్రికలో ఆ పోరాటానికి సంబంధించిన వార్తలు వెలువడుతుండేవి. ఆ కాలంలో ఆంధ్రులకున్న దిన పత్రిక అది ఒక్కటే. ఆ పత్రికలలో ప్రచురమైన వార్తలను సంపాదించగలిగారు. అప్పటికి రాధాకృష్ణమూర్తి తన అన్నగారు దగ్గర తీసుకున్న వెయ్యిరూపాయలు అయిపోయినవి. ప్రజల నుండి మేము డబ్బు వసూలు చేసి పొన్నలూరిని మన్యంలోకి పంపాము."[7]

బ్రిటిష్ ప్రభుత్వం హింసాకాండకు భయపడిపోయిన ప్రజలు రాధాకృష్ణమూర్తిని ప్రభుత్వ సి.ఐ.డి.గా భావించి ఏ క్షణాన్నయినా చంపివేసే ప్రమాదం కూడా ఉంది. అయినా అతడు వెనుకడుగు వేయలేదు. అక్కడి వాళ్ళు రాధాకృష్ణమూర్తిని నమ్మటానికి రెండు మూడు మాసాలు పట్టింది. నమ్మిన తర్వాత వాళ్ళు రాధాకృష్ణమూర్తిని పోరాటం జరిగిన ప్రతి స్థలానికి తీసుకువెళ్ళారు. ఆ పోరాటం జరిగిన తీరుతెన్నులు వివరించి చెప్పారు.

### రామరాజు చరిత్ర కథను – నిషేధించిన రాజాజీ ప్రభుత్వం:

"ఈ చరిత్ర అంతా ఎంతో శ్రమటోర్చి అల్లూరి సీతారామరాజు జీవిత కథను రాశారు. 1937లో జస్టిస్ పార్టీని పడగొట్టి మద్రాస్ రాష్ట్రంలో కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది. ఇదే సమయమని ఈ గ్రంథాన్ని ప్రచురించారు. కాని రాజాగోపాలచారి ప్రభుత్వం 1938 మే 1 తేది నుండి ఈ చరిత్రను నిషేదించింది. మరల 1947 డిసెంబరు నుండి నిసేధం ఎత్తి వేయబడినది."[8]

### పొన్నలూరి పుస్తకం ఆధారంగా – రామరాజు చరిత్రకు అనేక రూపాలు:

"1946లో సుంకర సత్యనారాయణ ఈ గ్రంధాన్ని ఆధారంగా చేసుకొని బుర్రకథను రాశారు. ఆంధ్ర ప్రజానాట్యమండలి బుర్రకథ దళాలు ఆ కథను చెప్పడానికి పూనుకున్నాయి. ఆ కథ వినడానికి ప్రజలు తండోపతండాలుగా వస్తుండేవారు. ఇది చూచి కన్ను కుట్టిన ప్రభుత్వం పొన్నలూరి రచన మీద నిషేదం తొలగించి, బుర్రకథను నిషేదించింది. సీతారామరాజు చరిత్రను మొదట తవ్వి తీసిన ఘనత పొన్నలూరి రాధాకృష్ణమూర్తికి

దక్కుతుంది. తర్వాత దాని ఆధారంగా అనేక నాటకాలు, నవలలు, ఏకపాత్రాభినయం, సినిమా వంటి ప్రక్రియల్లో ఆవిర్భవించి ఆంధ్రుని ఘనకీర్తిని వ్యాపింపచేశారు. ఈ వ్యాసాన్ని అప్పటి 'చలన చిత్ర' పత్రికలో 16 ఫిబ్రవరి 1947 వారి సౌజన్యంతో రాసిరి."[9]

'మన్యం వీరుని పోరుదారి'లో సీతారామరాజు పోరులో రైతాంగకోణం - 19 శతాబ్ధం ఆర్థిక దృశ్యం - అటూ ఇటూ' అనే వ్యాసాన్ని గోపరాజు నారాయణరావు రాశారు. ఈ వ్యాసంలో భూమి గురించి, రైతులు పోరాటాలు, గిరిజన సమస్యలను క్లుప్తంగా వివరించారు.

గిరిజన పోరాటాలుగాని, రైతాంగ పోరాటాలు గాని, రెండింటి ప్రదాన సమస్య భూమి, అయితే మైదాన ప్రాంతంలో జరిగిన రైతాంగ పోరాటాలలో ప్రధానంగా కనిపించేది ఫలసాయంతో న్యాయమైన హక్కు గురించి మిగిలిన అంశాలు కూడా లేకపోలేదు. కాని గిరిజన పోరాటాలలో ప్రధానాంశం అసలు గిరిజనుల ఉనికే. మైదానంలో జరిగిన రైతు పోరాటాల లక్ష్యం - పెంచిన శిస్తు, వడ్డీ వ్యాపారి ఆగడాలు, తెల్ల జాతి భూస్వాముల దోపిడినే ముఖ్యం. గిరిజన పోరాటాల గురి - భూమి సెటిల్‌మెంట్, అడవుల మీద ప్రభుత్వం ఆధిపత్యం, తమ నివాసాలలో తమనే అక్రమణదారులుగా చిత్రించే అటవీ చట్టాలు కలప మీద, పశువుల మీద పెరిగిపోయిన సుంకాలు, అన్నింటికీ మించి పోడు వ్యవసాయం మీద ఆంక్షలు. వీటికితోడు వారి సంస్కృతిని దెబ్బతీస్తూ క్రైస్తవ మిషనరీలు సాగించిన ప్రచారం కూడా గిరిజన పోరాటలకు కారణమైంది. అంటే కొన్ని కొన్ని అంశాలు మినహా రైతాంగ పోరాటాలకి, గిరిజనోద్యమాలకి మౌలికంగా కనిపించే ప్రధాన సమస్య భూమి, శ్వేతజాతి పాలనలేనన్నది వాస్తవమని కవి వివరించారు.

**రామరాజు ప్రవేశం:**

"ఈ అంశాలను దృష్టిలో ఉంచుకొని ఆంధ్రప్రదేశ్‌లో 1922-24 సంవత్సరాలలో అల్లూరి శ్రీరామరాజు నిర్వహించిన రంప ఉద్యమాన్ని పరిశీలిస్తే గిరిజనుల సమస్య ప్రధానంగా తలెత్తిన ఆ ఉద్యమంలో కొన్ని రైతాంగ సమస్యలు కూడా ఇమిడి ఉన్న సంగతి అవగతమవుతుంది."

"అటు చట్టాలలో పరోక్షంగా గిరిజనులు సాంఘీక జీవితం కాక, కుటుంబ జీవితం కూడా ఏకకాలంలో విఛ్చిన్నం కావడానికి బీజం పడింది. అసలీ వర్షాధార సాగు, వర్షాలు కురిసినా సాగు చేసేది. సజ్జ, కొర్ల, గంట్లు, సామలు చివరగా జొన్న వంటి

పంటలే. ఈ చట్టంతో ఆ కాస్త ఆధారం కూడా పోయింది. ఈ మెట్ట పంటలకు అనుసానంగా అడవీ సంపద గిరిజనులకు సహజ వరంగా ఉండేది. తేనే, పళ్ళు, కాయలు, కలప వంటివి పుష్కలంగా లభించేవి. సంతలలో వీటిని వినిమయం చేసి తమకు కావలసిన ఉప్పు, బట్టలు వంటి సరుకులు తెచ్చుకునేవారు. ఇంకొన్ని ప్రాంతాలలో కేవలం అడవిలో దొరికే ఫలాలతో జీవిస్తూ జంతువుల మాంసం కాల్చుకు తింటూ జీవనం వెళ్ళదీసి తెగలు వుండేవి. మొత్తం మీద కేవలం తాము జీవించడానికి కావలసిన వనరులు పొందడానికి కూడా అటవీ చట్టాలు ఆటంకాలు కల్పించాయి. ఇలాంటి స్థితిలో శ్రీరామరాజు మన్యంలో ప్రవేశించాడు."[10]

## రంప ఉద్యమానికి కారణాలు:

"మన్యంలో ఉద్యమం తలెత్తడానికి కారణం మన అధికారులు, మన చట్టాలు, మన అణచివేతేనని, రంప ఉద్యమం మీద 1923లో నివేదిక సమర్పించిన అప్పటి ఏజన్సీ కమీషనర్ హెపెల్" పేర్కొన్నాడు. అడవిలో ఒక చిన్న కొమ్మ నరికినందుకు రామయ్య అనే గిరిజనుడి మీద 15 రూపాయలు జరిమానా విధించారు. ఇది సాక్షాత్తు ఉద్యమం అణచివేతకు స్పెషల్ కమీషనర్‌గా వచ్చిన రూథర్‌ఫర్డ్ వ్రాసుకున్న మాటలు. ఒక చిన్న పశువు అడవిలో మేయాలంటే ఆరు అణాలు సుంకం చెల్లించాలి. నిత్యవసర వస్తువులను కూడా వస్తు మార్పిడితో సమకూర్చుకునే సాధారణ గిరిజనుడు ఇలాంటి భారం ఎలా మోయగలడు? అందుకే తిరగబడక తప్పలేదు అని ఇదంతా సాధారణ గిరిజనుల దుస్థితిగా కవి వివరించారు.

ఇక అధికార కోవలో వున్న గిరిజనుల పరిస్థితి మరో రూపంలో దుర్భరమైపోయింది. ముఠాదారులు, మునసబులు తెల్లదొరల తబేదారులుగా మారిపోయే పద్ధతి తయారయింది. దీనిని వ్యతిరేకించినవారు పదవులు కోల్పోయారు. దీనికి గొప్ప ఉదాహరణ బట్ట పనుకుల మునసబు గాం గంటందొర అధికారులు లంచాలు మరిగి ముఠాలను, మునసబులను తస్మదీయులకు కట్టబెట్టేవారు. ఈ విధంగా సామాన్య, అసామాన్య గిరిజనులు బాధలు అనుభవించేవారని కవి తెలిపారు.

## రామరాజుకు కనిపించిన మన్యం లోపాలు:

రామరాజు విప్లవం తొలిదశ సహాయ నిరాకరణతోనే మొదలయింది. పన్నులు కట్టకపోవడం ఇందులో ఒకటి. రామరాజు సంస్కరణోద్యమం మన్యంలో అబ్కారీ

ఆదాయాల్ని దెబ్బతీసింది. అటవీ చట్టాల ప్రకారం కల్లు గీయడం కూడా నేరమే. ప్రతి తాటి చెట్టుకు సుంకం విధించారు. తెలిసో, తెలియకో కల్లుగీస్తూ పట్టుబడితే పెద్ద మొత్తంలో జరిమానాలు వేసేవారు. అయితే మరో ప్రక్క మద్యం, కల్లు పాటదారుల పర్మిట్‌కు మించి దొంగచాటుగా వాటిని గిరిజనులకు విక్రయించేవారు.

కడుపు నిండా తాగడానికి కల్లులేదు. తినడానికి తిండి లేదు. సుంకర వారి బుర్రకథలో చెప్పినట్టు

"అడవి పండ్లు వేలున్నవి ॥సై॥
అంటుకుంటే యమ బాధరా ॥సై॥
ఎదురు బియ్యమై మనవి ॥సై॥
పిడికెడు నమిలిన శిక్షరా ॥సై॥ అన్నట్టు వున్నది పరిస్థితి

ఇలాంటి పరిస్థితులలో ఉద్యమించక తప్పలేదు. ఆ ఉద్యమానికి ముందుండి నడిపించడానికి వారికి శ్రీరామరాజు దొరికాడు అని ఈ వ్యాసాన్ని ముగిస్తారు రచయిత గోవరాజు నారాయణరావు.

"మన్యం వీరుని పోరుదారిలో "అల్లూరి స్మారక చిహ్నం దుర్దశ" అనే వ్యాసాన్ని కల్హణ రాశారు. ఈ వ్యాసంలో అల్లూరి మరణం తర్వాత ఆ విప్లవ వీరునికి ఘనమైన నివాళులు అర్పించామా! అని రచయిత సమాజాన్ని ప్రశ్నిస్తున్నాడు.

"భారతీయ గిరిజన పోరాటాల చరిత్రలోనూ, రైతాంగ పోరాటంలో చరిత్రలోను రామరాజు నడిపిన విప్లవానికి సముచిత స్థానమే కనిపిస్తుంది. అయితే ఈ పోరాటానికి ఆయన రంగభూమిగా ఎంచుకున్న మన మన్య ప్రాంతంలో ఆయన స్మృతి చిహ్నాలు మాత్రం హీన స్థితిలో వున్నాయి. ఎవరో, ఏదో రూపంలో రామరాజు పట్ల ఆయన త్యాగం పట్ల అభిమానం చూపించి కొన్ని స్మారక చిహ్నాలు నిర్మించి పెట్టారు. శతజయంతి సంవత్సరం సందర్భంగానయినా వాటికేసి చూసే నాయకుడు ఎవరు లేకపోయినా పోనీ ప్రజల విషయం చూస్తేనో! యధారాజా! అన్నట్టుగానే ఉన్నారు అని కవి ఆవేదన వ్యక్తం చేశారు."[11]

## **రామరాజు స్మారక ప్రదేశాల దుస్థితిని వివరిస్తూ...:**

1924 మే 7న రామరాజు ప్రస్తుతం కొయ్యూరు మండలంలో మంప గ్రామంలో తెల్ల పోలీసులకి పట్టుబడిపోయారు. మంప గ్రామానికి ఉత్తర దిశలో ఆయన పట్టుబడిన

ప్రదేశం ఉంది. పెద్ద పెద్ద చింత చెట్ల మధ్య నుండి దాదాపు అరకిలో మీటరు లోపలికి వెళ్ళితే ఆ స్థలం కనిపిస్తుంది. అక్కడ నీటి కుండంలో స్నానం చేసి వస్తుండగా ఆయన పట్టుబడ్డారు. అయితే నేడు అక్కడ నీటి కుండం లేదు. కొన్నేళ్ళ క్రితం వరకు గ్రామస్థులకి ఎంతో స్పష్టంగా తెలిసిన ఈ కుండం ప్రాంతంలో ఇప్పుడు వరి సాగు జరుగుతుంది. కాని రామరాజు పట్టుబడినట్టు చెప్పుకునే ప్రాంతంలో మాత్రం మంప గ్రామంలో ప్రజలు ఒక స్థూపం నిర్మించకున్నారు. ఆ స్థూపం చుట్టు ఒక 50 అడుగుల విస్తీర్ణంలో ప్రహరీ నిర్మించారు. కాస్త ఇవతల చిన్న ధ్యాన మందిరం కూడా నిర్మాణమై వుంది. సిమెంటు బెంచీలు కూడా నిర్మించారు. కాని ఇప్పుడు దీనిని ఎవరూ పట్టించుకొనకపోవడంతో అప్పుడే శిథిలావస్థకు చేరింది. మందిరానికి అమర్చిన గ్రిల్స్ స్థానభ్రంశం చెందాయి. ప్రహరీ తలుపులకు కూడా కాళ్ళొచ్చాయి.

## కొయ్యూరులో స్మారక చిహ్నం పరిస్థితి చెబుతూ...:

"మంపలో పట్టుబడిన రామరాజును మంచానికి కట్టి కొయ్యూరు తీసుకువచ్చారు. కొయ్యూరులో ఇప్పుడు అద్దవీధి అని పిలిచే చోట ఆయనను ఒక చెట్టుకు కట్టి కాల్చి చంపారు. ఇక్కడ సువిశాలమైన స్థలంలో రామరాజు స్మారక మందిరం నిర్మించారు. రామరాజును కాల్చి చంపిన చోట ఒక మండపం నిర్మించి అందులో ఒక బస్ట్ సైజు విగ్రహం అమర్చారు. దాని ఎదురుగానే ఆ చెట్టు వుండేదట. అది కూలిపోయింది. దాని మొదలు మాత్రం సిమెంటు కట్టడంతో మిగిలి వుంది. ఈ ప్రాంగణంలో ఒక ద్యాన మందిరం, ఒక కమ్యూనిటీ హాలు నిర్మించారు. ద్యాన మందిరంలో చిత్రించిన ఊహచిత్రాలు వాస్తవికంగా వున్నాయి. కొండ వేష భాషలు, రామరాజు అసలు రూపం చిత్రీకరించడానికి మంచి ప్రయత్నం జరిగింది. కమ్యూనిటి హాలును ప్రస్తుతం గ్రంథాలయంగా వినియోగించుకుంటున్నారు. ఇక్కడ కొంతకాలం మన్యం ప్రాంతంలో సర్పంచ్‌లంతా కలసి రామరాజు వర్ధంతికి ఉత్సవాలు చేసేవారని తర్వాత గిరిజన, గిరిజనేతర సమస్య తలెత్తి కార్యక్రమ నిర్వహణ కమిటి నీరు కారిపోయిందని తెలిసింది. సరిగ్గా మంపలో స్మారక మందిరం అభివృద్ధి కూడా ఆ సమస్య దగ్గరే ఆగిపోవడం విచారకరం. వందల ఏళ్ళ నాటి చింతతోపుల మధ్య, ఎత్తయిన గుట్టల మధ్య ఈ ప్రదేశం ఉంది. మంపలో స్థూపం నిర్మించిన స్థలంగాని, కొయ్యూరులోని స్మారక మందిరం స్థలం కాని ఇటీవల వరకు జనసంచారం లేనివే. ఇప్పుడిప్పుడు ఇళ్ళు ఏర్పడుతున్నాయక్కడ. కొయ్యూరులో స్మారక మందిరం ప్రాంతాన్ని ఇప్పుడు రాజేంద్రపాలెం"[12] అంటున్నారు.

## కె.డి. పేటలో స్మారక చిహ్న పరిస్థితి గురించి...:

రాజేంద్రపాలెంలో కాల్చి వేసిన రామరాజు భౌతిక కాయాన్ని నులక మంచానికి కట్టి కృష్ణదేవిపేట తీసుకువచ్చారు. అక్కడ పాత పరిచయస్థులను తీసుకువెళ్ళి ఆ శవం రామరాజుదేనని నిర్ధారణ చేయించిన తర్వాత ఊరికి చివర శరభన్న పాలెం వెళ్ళే దారిలో తాండవ తీరాన దహనం చేశారు. అక్కడే ఇప్పుడు ఒక మంచి స్మారక స్థలం వుంది. నిజానికి అదొక పెద్ద గుట్ట, రామరాజును దహనం చేసినట్టు చెప్పే స్థలంలో ఒక సమాధిని నిర్మించారు. మాజీమంత్రి పాశి సూర్యనారాయణ రాజు హయాంలో ఈ పని జరిగింది. రామరాజు సమాధి ప్రక్కనే గంటం సమాధి నిర్మించారు. దీనికి ఐ.టి.డి.లు ఒక షెడ్డు (బంగాళా పెంకులతో) నిర్మించింది. దీనికి కాస్త దూరంలో ఆ గ్రామంలోని యువజన సంఘం ఒక మండపం నిర్మించి బస్ట్ సైజులో ఒక విగ్రహాన్ని ఏర్పాటు చేసింది. దీని ప్రక్కనే ఒక కమ్యూనిటీ హాలు నిర్మించారు. అయితే అది కూడా శిధిలావస్థకు చేరిపోయింది. ఈ ప్రదేశాన్ని ఒక చక్కని స్మారక స్థలంగా అభివృద్ధి చేయాలని సి. అర్జున్‌రావు జిల్లా కలెక్టరుగా వుండగా జరిగిన మంచి ప్రయత్నం ఫలితమే ఈ కాస్తయినా జరిగింది. కాని ఇక్కడ సమస్య పోషణే, దీనికి కాపలాదారుగా వున్న ఆయనకి గత మూడేళ్ళ నుండి జీతభత్యాలు లేవు అని కవి విచారం వ్యక్తం చేశారు.

"కృష్ణదేవి పేటకి రామరాజుకి గొప్ప అనుబంధం వుంది. ఆయన మొదటసరాగి ఇక్కడ చిటికెల భాస్కర నాయుడిని కలుసుకున్న రామకోవెల స్థానంలో ఇప్పుడు కొత్త ఆలయం వెలసింది. ఊరికి సుదూరంగా తాండవ తీరంలో రామరాజు జపం చేసిన నీలకంఠేశ్వరాలయ ప్రాంతం, లింగం, నంది ఇప్పటికీ వున్నాయి. ఎలాంటి ఆచ్ఛాదన వీటికి లేదు. ఇవి దాటి నది ఒడ్డునే కొంచెం దూరం వెళితే రాజు లంకలుగా పిలిచే భూములు కనిపిస్తాయి. ఇదే ఆనాడు 'శ్రీరామ విజయనగరం' పిలవబడేదని రచయిత వివరిస్తున్నారు.

## ప్రకృతి సౌందర్యం – దారామఠం ప్రాంతం:

"రామరాజు ఎంచుకున్న రెండో తపోస్థలి ధారా పర్వతం. ఇక్కడ ధారమల్లేశుడు పేరుతో ఒక శివాలయం వున్నది. ఇది కూడా నాలుగు మట్టిగోడలు, తాటాకు కప్పు కలిగిన చిన్న ఆలయమే. దీనినే ధారామఠంగా అని ఇప్పుడు పిలుస్తున్నారు. ఈ ప్రాంతం నిజంగా ప్రకృతి అందానికి ఆలయం. దట్టమైన చెట్లు కొండలలోంచి జారే జలపాతం

అద్భుతంగా వుంటుంది. కృష్ణదేవిపేట సమీపంలోని జోగంపేట నుండి ఐదు కిలోమీటర్లు లోపలికి వెళితే ధారమఠం కనిపిస్తుంది. ఈ మఠం మీద తర్వాత దాడి జరిగింది. విగ్రహాలు ధ్వంసమయ్యాయి. అదే ఈనాడు ఆలయం చుట్టు పెట్టి వుంచారు.

విశాఖ, అన్నవరం, రాజమండ్రి, కాకినాడ రామచంద్రాపురం, అడ్డతీగెల, రంపచోడవరం, తుని, మోగల్లు, నరసాపురం వంటి ప్రాంతాల్లో రామరాజుకు అనుబంధం ఉంది. ఆయా ప్రాంతాల్లో ఆయన శతజయంతి పురష్కరించుకొని స్మారక చిహ్నాలు ఆవిష్కరించాలి. అలాగే ఆయన వెంట నడిచిన గిరిజన వీరుల గాథలను కనీసం మన్యప్రాంత కాసులకయినా అందిస్తే మేలని రచయిత అభిప్రాయపడ్డారు. అల్లూరి సీతారామరాజు శతజయంతి (1867-1997) మన్యం వీరుని పోరుదారిలో అనుబంధం-2లో "అల్లూరి లేఖలు - రాతలూ" ప్రచురించారు. మొదటిగా చింతపల్లి పోలీసుస్టేషన్ ముట్టడిలో ఉత్తరంలో "ధైర్యం" కనిపిస్తుంది. రెండవ ఉత్తరంలో మిరపకాయ టపాతో సాహసాన్ని వెల్లడించారు. మూడవ ఉత్తరం వేదాంతాన్ని, కర్తవ్యాన్ని బోధిస్తుంది. నాల్గవ ఉత్తరంలో రామరాజు ఇచ్చిన ప్రభుత్వ సొత్తును తిరిగి ఇచ్చివేసే విధానాన్ని తెలిపారు. ఉత్తరాల పరిశీలనలో ఒక్కొక్క ఉత్తరంలో ఒక్కొక్క విషయం అభిమతంగా రామరాజు వ్యక్తిత్వాన్ని ఈ ఉత్తరాల ద్వారా గ్రహించవచ్చని రచయిత పేర్కొన్నాడు.

అల్లూరి శ్రీరామరాజు 1922 ఆగష్టు 22వ తేదిన చింతపల్లి పోలీసుస్టేషనుపై దాడి చేసి మొత్తం 12 తుపాకులు, 1595 తుపాకి గుండ్లు, 5 కత్తులు, 14 టాయోనేట్లు వశపర్చుకొని పోలీసుస్టేషను డైరిలో ఇలా రాసి సంతకం చేశారు.

**"అల్లూరి శ్రీరామరాజు అను నేను నా సహచరులతో ఈ పోలీసుస్టేషను ముట్టడించి సెంట్రీని ఆయుధగారపు గది తాళము అడిగితిని, అతడు తాళములు ఇచ్చుటకు అంగీకరించలేదు. స్టేషన్ స్తంభమునకు సెంట్రీని కట్టివేసి, అతని నుండి తాళములు తీసుకున్నాను. ఆయుధములు సేకరింపబడినవి..."[13]**

**ఇట్లు**
**అల్లూరి శ్రీరామరాజు**

రెండవ లేఖ 1922 సెప్టెంబరు 24వ తేదీన 'మిరపకాయ టపా'లో అల్లూరి శ్రీ రామరాజు బ్రిటిష్ సైనికాధికారి క్రిష్టోఫర్డు విలియం స్కాట్ కవర్టుకి రాసిన లేఖ...

ప్రియమైన స్కాట్ కవర్టు

**"మీరు నా కోసం గాలిస్తున్నట్లు, నాకు దగ్గరలో నున్నట్టు తెలియచున్నది. ఇక్కడకు వచ్చి మాతో పోరుతారా? లేక మమ్ములను మీవద్దకు రమ్మంటారా? పుట్టుకతో ఇంగ్లీషు వాడివి గనుక న్యాయమును, వాస్తవమును తెలుపుము"[14]**

**ఇట్లు**

**అల్లూరి శ్రీరామరాజు**

మూడవ ఉత్తరం అల్లూరి శ్రీరామరాజు మిత్రుడు పేరిచర్ల సూర్యనారాయణరాజుకి 1922 సెప్టెంబరు 13న రాసిన ఉత్తరం బ్రిటిష్ అధికారులకు పట్టుబడింది. అడ్డాకుల ప్రాంతంలో... ఉద్యమంలో చేరిన తర్వాత అగ్గిరాజుగా ప్రసిద్ధుడైన మిత్రుడుకి....

మిత్రమా!

"నేను యుద్ధమును ప్రారంభించితిని. ఇంతవరకు నాలుగు ప్రదేశములలో మన సైన్యము బ్రిటిష్ సైన్యమును ఓడించినది. ప్రతి పోరాటముననను భగవానుని దయ వలన జయము మన పక్షమునకే లభించినది. మన పూర్వ స్నేహమును జ్ఞప్తికి తెచ్చుకొని నీవు బయలుదేరి రావలెను! మృత్యువు జననమును వెన్నెంటియే వుండును. ప్రతి మానవుడును వాని వంతు వచ్చినపుడు మరణింపవలసినదే! కర్మ పరిపక్వమై, కాలము సమీపించిన ఎక్కడ నున్నను ఏ మానవుడు మరణించరు? ఎంత శ్రద్ధతో ఈ శరీరమును పెంచి పోషించినను ఒక రోజున అది నాశనము కావలసినదే? మానవ శరీరములు శాశ్వతము గావు. కాని కీర్తి అపకీర్తి శాశ్వతములు మంచి, చెడ్డలు, చిరకాలము నిలుస్తాయి. క్షత్రియులకు యుద్ధము సహజము.

ఎవరైతే జయాపజయములను, కష్టసుఖములను చీకటి వెలుగులను సమభావముతో చూడగలరో వారే ఆత్మ సాక్షాత్కారము పొందగలరని భగవద్గీత బోధిచుచున్నది. మనకు యుద్ధంలో విజయము లభించిన యెడల, బౌతికానందమును పొందగలము. ఆ యుద్ధములో మనము మరణించిన యెడల మనసు వీర స్వర్గము నలంకరించి ఆనందించగలము. అందువలన ఈ విషయములన్నిటిని నేను జాగ్రత్తగా ఆలోచించి, దేశ క్షేమము కొరకు యుద్ధము అనివార్యమని పూర్తిగా విశ్వసించి ఈ సమరమును ప్రారంభించినాను.

ఈ ఉత్తరము చేరిన వెంటనే నీవు తప్పక బయలుదేరి వస్తావని పూర్తిగా నమ్ముచున్నాను. ఇంకను ఎవరైనను వస్తే నీతో తీసుకొని రావలెను. ఒకసారి నీవు

బయలుదేరి వచ్చి ఇచ్చట నేను పోరాటమును సాగించుటకు చేసిన ఏర్పాట్లు చూడవలెను. అవి నీకు నచ్చకపోయిన యెడల తిరిగి వెళ్ళిపోవచ్చును. మన పూర్వ స్నేహమును జ్ఞప్తికి తెచ్చుకొనవలెను. అక్కడ పేకేటి వారి అబ్బాయి ఉంటే తప్పక నీతో తీసుకొని రావలెను. మిత్రులకు నా అభినందనలు.

ఇట్లు
అల్లూరి శ్రీరామరాజు

నాల్గొవ ఉత్తరం ఉత్తర భారతదేశ యాత్రకు వెళ్ళిన సందర్భంలో...

మహారాజశ్రీ దుబ్బర్తి ముఠాదారు శ్రీ చెక్కా లింగం దొర గారికి...

"శ్రీ అల్లూరి శ్రీరామరాజు వ్రాయు లేఖార్థములు. నేను నేపాళము వెళ్ళ నిశ్చయించితిని. మీరు ఈ సంవత్సరం నాకు పైడి పుట్టలో 50 ఎకరములు ఇప్పించిన విశ్వతపు పట్టా మాయమ్మ గారు వెళ్ళేటప్పుడు నాపుస్తకములతో పట్టుకు వెళ్ళిపోయినారు. నాకా భూమితో ఏ జోక్యమును లేదు. మీ ఇష్టం వచ్చిన వారికి ఈయవచ్చును. ముందు ఎప్పుడు మీకు నేనా భూమి విషయమై ఏ తగాదాయున్నూ చేయను. మీరు నాకిప్పించిన పట్టా నా వద్ద ప్రస్తుతం లేనందున ఈ ఉత్తరం వ్రాయడమైనది."[15]

చిత్తగించవలెను
అల్లూరి శ్రీరామరాజు

అల్లూరి శతజయంతి (1897-1997) ప్రచురణలో మన్యం వీరుని పోరుదారిలో అనుబంధం-3లో "మన్యం పోరాటంలో అమరులైన వీరులు" అనే వ్యాసంలో విప్లవవీరులు వివరాలను పొందుపరిచారు.

**అల్లూరి శ్రీరామరాజు:**

పశ్చిమగోదావరి జిల్లా (అప్పటి కృష్ణాజిల్లా) మోగల్లు గ్రామంలో 1897 జులై 4న తేది జన్మించాడు. తండ్రి వెంకట్రామరాజు, తల్లి సూర్యనారాయణమ్మ, మన్యం పోరాట అగ్రనాయకుడు. 1924 మే నెల 7వ తేదిన బంధించి కాల్చి చంపారు. అయితే 1897 జులై 4వ తేదిన అమ్మమ్మగారింట, విశాఖపట్టణం పాండ్రంగి గ్రామంలో జన్మించినాడని చరిత్ర చెబుతుంది.

**గాం గంటం దొర:**

విశాఖజిల్లా భట్టపణకుల గ్రామ మునసబుగా ఉన్న గంటందొర మన్య పోరాటంలో ప్రముఖ దళనాయకుడు. 1924 జూన్ 7వ తేదిన వెదురు ముడి వద్ద బ్రిటిషు రిజర్వుతో జరిగిన సాయుధ సంఘర్షణలో మరణించారు.

**వేగిరాజు సత్యనారాయణరాజు (అగ్గిరాజు):**

పశ్చిమగోదావరి జిల్లా కుముదవల్లి గ్రామ వాస్తవ్యులు. అల్లూరి అన్నవరం వచ్చి వెళ్ళిన తర్వాత దళాల్లో చేరి నాయకత్వం వహించాడు. 1924 మే 6వ తేదీన కృష్ణాపురం సమీపాన రిజర్వు పోలీసు దాడిలో పట్టుబడినాడు. యావజ్జీవ ద్వీపాంతరావాస శిక్ష విధించారు. అండమాన్ దీవుల్లో మరణించాడు.

**కొన కన్నయ్య:**

చిట్టంపాడు గ్రామ వాస్తవ్యులు. 1922 డిసెంబరు అనపెద్దగెడ్డపాలెం వద్ద జరిగిన సాయుధ సంఘర్షణలో మరణించారు.

**కోమిజి చింతాలు:**

రాజన్న పేట గ్రామం 1924 మే 6న కిర్రాబు వద్ద జరిగిన సాయుధ పోరాటంలో మరణించారు.

**పనసలమల్లు పడాల్ (మల్లయ్య):**

కంపరేగుల గ్రామం, చితుకుల పడాల్ కుమారుడు. సైనికులు పట్టుకొని కేసు పెట్టగా మూడేండ్లు కఠిన కారాగార శిక్ష విధించారు. 1924 మార్చి 5న రాజమండ్రి సెంట్రల్ జైలులో మరణించారు.

**పొడి చిన్నప్ప:**

తోటలూరు గ్రామం 1922 డిసెంబరు 6న లింగాపురం వద్ద జరిగిన పోరాటంలో మరణించాడు.

**బుడ్డయదొర:**

కొయ్యూరు గ్రామ వాస్తవ్యుడు ఉపాధ్యాయుడు. మలబారు రిజర్వు పోలీసుతో జరిగిన ఘర్షణలో మరణించారు.

**మంచాల బోడేసు (బోడెయ్య):**

గన్నెర్లపాలెం గ్రామం 1922 డిసెంబరు 6న లింగాపురం వద్ద జరిగిన సాయుధ సంఘర్షణలో తీవ్రంగా గాయపడి ఆ తర్వాత మరణించారు.

**మోసా చిన్నప్ప:**

రామన్న పాలెం గ్రామం 1922 డిసెంబర్ 6న రిజర్వు దళంతో జరిగిన ఘర్షణలో మరణించారు.

**రెడ్డి వెంకయ్య:**

గన్నెర్లపాలెం గ్రామ వాస్తవ్యుడు. రిజర్వు దళానికి చిక్కి మూడేండ్లు శిక్ష అనుభవిస్తూ రాజమండ్రి సెంట్రల్ జైలులో 1924 మే 12న మరణించారు.

**వారాలచ్చుడు:**

"లక్ష్మీపురం గ్రామ వాస్తవ్యుడు. లింగాపురం వద్ద జరిగిన పోరాటంలో మరణించారు.

ఇంకా ఎంతో మంది అనామక వీరులు వీరమరణం పొందారు. ప్రభుత్వ దళాల చిత్రహింసలకు గురయ్యారు. అనేక మందిని బూటకపు విచారణ జరిపి ఖైదు చేశారు. ప్రవాస శిక్ష విధించారు అని కవి తెలిపారు."[16]

మన్యం వీరుని పోరు దారిలో శతజయంతి సంచికలో "ఒక యోధుడి గురించి" అనే వ్యాసాన్ని గో.రా. రాసిరి. ఇందులో రామరాజు నిజాయితీని, వీరత్వాన్ని, సాహసాన్ని బ్రిటిష్ అధికారులు తన నివేదికలో యిచ్చిన విషయాన్ని గోపరాజు రామచంద్రరావు స్పష్టం చేశారు.

బ్రిటిష్ అదికారి హెప్పెల్ నివేదికలో రామరాజు గురించి చెబుతూ... "అల్లూరి

సీతారామరాజే లేకుంటే మన్యం పితూరీ లేదంటాడు" ఎ.జె. హప్పెల్. రామరాజు ఉద్యమం ప్రజ్వరిల్లిన తర్వాత ఏజెన్సీకి కమాండింగ్ ఆఫీసర్ హోదాలో వచ్చిన వ్యక్తి హప్పెల్. మద్రాసు ప్రెసిడెన్సీ ఆదేశం మేరకు 1922 ఆగష్టు నుండి 1923 ఏప్రిల్ మాసం వరకు రాజు ఉద్యమంలోని వివిధ అంశాలను, పూర్వాపరాలను సేకరించి ఒక నివేదికను హప్పెల్ రూపొందించాడు.

1923 సెప్టెంబరు నెలలో గవర్నమెంటువారు పితూరి కారణాలు కనుక్కోమని నియమించిన హప్పెల్ దొరగారి రిపోర్టు ప్రచురణమైనది. పితూరికి ముఖ్యకారణములు బాస్టియన్ క్రూర చర్యలు, భూములు రిజర్వేనని రాశారు.[17]

మన్యం ఉద్యమానికి కారణం బాస్టియన్ అని హప్పెల్ ప్రత్యక్షంగా మాత్రం ఆరోపించలేదు. అడవుల రిజిస్ట్రేషన్, పోడే నిషేదం, బాస్టియన్ దోపిడి, కూలీ సరిగ్గా చెల్లించకపోవడం, పెద్దవలస మనసబు ఎండపడాలని బాస్టియన్ మోసగించడం వంటి కారణాలు కొందరు ఖైదులు, స్థానికులు చెప్పిన దానిని బట్టి తెలుస్తున్నది అని మాత్రమే హప్పెల్ అంటారు. అయితే ఆ ఆరోపణల్లో, ఫిర్యాదుల్లో చాలావరకు సత్యమేనని మరోచోట పేర్కొన్నాడు.

నిజానికి బాస్టియన్, అతడి ఓవర్సీయర్ సంతానం పిళ్ళే చేసిన అకృత్యాలను పరిశీలించి ఈ వ్యాఖ్యను పరిశీలిస్తే ఒక బ్రిటిష్ అధికారిని రక్షించడానికి హప్పెల్ ఎంత ప్రయత్నం చేశాడో అర్థమవుతుంది. రిపోర్టులో ఉద్యమాన్ని అణచడానికి ప్రభుత్వం ఎన్ని చర్యలు తీసుకున్నాడో, సేనలను, పోలీసులను ఎక్కడ నుండి ఎక్కడికి ఎలా మప్పిందో చాలా వివరంగా తెలియజేశారు. కాని మధ్యలో రామరాజు యుద్ధనైపుణ్యం, వ్యక్తిత్వం గురించి కొన్ని కొన్ని వాఖ్యలు చేయడం విశేషం.

1922 అక్టోబరు ప్రాంతంలో కామయ్య అనే ఇంటెలిజెన్స్ ఎస్.ఐ.ని రామరాజు అనుచరులు బంధించారు. తురుమామిడి, లక్కవరపుకోట అనే ప్రాంతాల్లో ఉద్యమంకారుల కదలికల గురించి కూపీ లాగుతున్న సందర్భంలో అతడిని పట్టుకొని సాపరాతిపాలెం సమీపంలో రామరాజు ఎదుట హాజరుపరిచారు. అయితే కేవలం కొన్ని హెచ్చరికలు చేసి విడిచిపెట్టించాడాయన. ఈ సందర్భంలో హప్పెల్ అంటాడు. "తన చేతికి చిక్కిన అధికారులను రామరాజు ఏనాడు అవమానకరంగా చూసిన దాఖలాలు లేవు" అని నివేదికలో చెప్పాడు.

ఇంకా రామరాజు లక్ష్యం కోసం గూఢచారి వ్యవస్థను గురించి హప్పెల్ చెబుతూ... "రాజు గూఢచారి వ్యవస్థ చాలా సమర్ధవంతమైనది. బ్రిటిష్ బలగాల కదలికలను గురించి ఎప్పటికప్పుడు సమగ్ర సమాచారం తన ఎదుటికి తెప్పించుకోవటమే కాక, ఉద్యమం గురించి, ఉద్యమకారుల గురించి బ్రిటిష్ శిభిరాలలో తప్పుడు సమాచారం చేరేటట్టు జాగ్రత్తలు తీసుకుంటారు. ఫలితంగా సమాచారాన్ని కోడ్‌లో పంపించే పనిని మొదలు పెట్టవలసి వచ్చింది. రామరాజు సేన ఒక ప్రాంతం నుండి నిష్క్రమించే తీరు అద్భుతంగా వుండేది. రామరాజు శిబిరాలు కూడా ఎవరు చొరబడడానికి వీలులేని ప్రాంతాలలో పకడ్బందీ బందోబస్తుతో వుండేవి. ఒక వేళ శత్రువు దాడి చేస్తే వెంటనే తప్పించుకొనడానికి అనువైన చోట్ల ఆ శిభిరాలను నిర్మించేవారు. తన ప్రవర్తనతో, ఆధ్యాత్మిక జీవితం గడుపుతూ గిరిజనుల హృదయాలను రామరాజు గెలిచారని హప్పెల్ రాసారు.

ఈ వ్యాసంలో హప్పెల్ కాకుండా ఇతర అధికారులు కూడా కొన్ని కొన్ని సందర్భాల్లో రామరాజు గురించి రాసిన వ్యాఖ్యలు పరిశీలిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. స్టీవర్డ్ అనే అధికారి 1922 అక్టోబరు 8న ఒక నివేదికను వివరిస్తూ...

రామరాజు గూడెం ముఠాపై గొప్ప పలుకుబడిగలదు. రామరాజును దైవ సమానంగా భావింతురు. 26 జిల్లాలకు (మద్రాసు రాష్ట్రం) గవర్నర్ కావలెనని రామరాజు తాను పితూరీ ప్రారంభించినట్లు, తాను అజేయుడనని చెప్పుకొన్నాడని తన నివేదికలో చెప్పాడు.[18]

ఇంకా 1922-23 ప్రాంతంలో "ఇండియా" అనే గ్రంధంలో ప్రొఫెసర్ రూష్‌బ్రూడ్ విలియమ్స్ అనే ఆంగ్లేయుడు మన్యం ఉద్యమం గురించి ప్రస్తావించాడని శ్రీ అల్లూరి సీతారామరాజు చరిత్రలో యర్రమల్లె నరసింహరావు వ్రాశారు. ఈ వ్యాఖ్య గమనింపదగిన విషయంగా చిత్రీకరించారు.

**రామరాజు మన్యపోరాటాలపై వివరణలు:**

"రామరాజు పోరాటంలో పాల్గొన్న ఆరోపణపై 276 మందికి శిక్షలు పడ్డాయి. ఇందులో పదకొండు మందికి జీవితఖైదు పడింది. మొత్తం 186 గ్రామాలు పాల్గొన్నాయి. ఉద్యమం అణచడానికి ప్రభుత్వం చేసిన వ్యయం 40 లక్షలు. 1918లో పునర్వ్యవస్థీకరించిన ముఠాల ప్రకారం గూడెం, లోతుగెడ్డ, లమ్మసింగ, పెద్దవలస, మాకవరం అనే ముఠాలు వుండేవి. పైడిపుట్ట ప్రాంతాన్ని కలుపుకుని దుబ్బెర్తి ముఠా

వుండేది. ఉద్యమంలో దుబ్బేర్తి ముఠాదారు చెక్కా లింగన్న దొర మినహా మిగిలిన వారంతా సమైక్యంగా రామరాజు వెంట నడిచారు. రెవెన్యూ విభజన ప్రకారం రాజు ఉద్యమం చింతపల్లి, గొలుగొండ, తాలుకా ప్రాంతాల్లో జరిగింది. ఉద్యమంలో బగతలు, కొండదొరలు, మాలలు ప్రధాన పాత్ర వహించారు. చాలా పుస్తకాల్లో వ్రాసినట్టు కోయదొరలు ప్రమేయం (విశాఖ జిల్లా మన్యం వరకు) లేదు అని చెప్పడం ఈ వ్యాసంలో కొసమెరుపు కావడం విశేషం."[19]

జన సాహితి ఉత్తర కోస్తా జిల్లాల ప్రాంతీయ సరస్సులో విశాఖలో 1997మే 8న అల్లూరి శత జయంతి సందర్భంగా మన్యం వీరుని పోరుదారిలో "రంప తిరుగుబాటుపై వార్తాపత్రికల కథనం" అనే వ్యాసంలో విప్లవ సైన్యంపై వచ్చిన అనే పత్రికలు నిజాలను తెలియజేస్తూ సమాజానికి రంప తిరుగుబాటు గూర్చి వారి విప్లవ చైతన్యం గూర్చి వివరించారు.

"అల్లూరి నాయకత్వంలో సాగిన రంప తిరుగుబాటుపై ఆనాటి మద్రాసు ప్రెసిడెన్సీలోని తెలుగు, ఆంగ్ల పత్రికలు నిశితంగా నిషేదించాయి. మద్రాసు నుండి వెలువడే ఆంధ్రపత్రిక, గోదావరి జిల్లాలోని అనేక పత్రికలు తిరుగుబాటుపై వార్తలందించాయి".

ఏజెన్సీ ప్రాంతాన్ని అటవీ చట్టం కిందకి తేవడం 1910లోనే విమర్శకు గురైంది "ది ఇండియన్ పేట్రియట్" పత్రిక ఇలా రాసింది....

ఆటవీ సంపద పరిరక్షణ పథకాల పట్ల ప్రజలు వెంటనే త్యాగం చూపకపోవడానికి కారణం అనాదిగా అటవీ సంపదను సామాజికంగా అనుభవించడానికి అలవాటుపడిన ప్రజలపై అటవీ చట్టాల్ని నిర్దయంగా అమలుపరచడమే. గ్రామాలు దరిదాపుల్లో వున్న అడవి అనడానికి వీలులేని ప్రాంతాన్ని కూడా పశుగ్రాస భూములుగా వినియోగించ నివ్వకుండా రక్షిత అడవులుగా ప్రకటించడం వంటచెరుకు, ఎరువుగా వుపయోగితమయే ఆకు అలము సేకరణపై ఆంక్షలు విధించడమే. నాగలి వంటి వ్యవసాయక పనిముట్లను తయారు చేసుకోవడానికి, సాదాగా వున్న గుడిసె వేసుకోవడానికి అవసరమైన వస్తువుల్ని సేకరించు కోవడం రైతులకు అంతకంతకు కష్టమయి పోవడం మొదలగు పరిస్థితుల మూలంగా అటవీ అధికారులను వారి కింద ఉద్యోగులను ప్రజలు తమ స్నేహితులుగా, అటవీ సంపదను పరిరక్షించే వారుగా గుర్తించక నిరాకరిస్తున్నారు" అని ఈ పత్రిక రాయడం జరిగింది.

రాజమండ్రి నుండి వెలువడే 'కాంగ్రెస్' పత్రికలో 1922 ఆగష్టు 28 సంచికలో.... ఆగష్టు 22న జరిగిన తిరుగుబాటుదారుల దాడిని మొట్టమొదటగా ప్రచురించింది. కొన్ని కారణాల మూలంగా ఏజెన్సీ గ్రామాలు తిరుగుబాటును చేపట్టాయని ప్రజలు తలా ఒక రకంగా చెప్పుకుంటున్నారు. నాలుగైదు పోలీసుస్టేషనులపై దాడి చేసి ఆయుధాలను మందుగుండు సామాగ్రిని దొంగలించి పోలీసు కానిస్టేబుళ్ళను ఇబ్బంది పాలు చేశారని ఎదుర్కోవడానికి గోదావరి, క్రిష్ణాజిల్లాల నుండి రిజర్వు బలగాలను తరలిస్తున్నారు అని ప్రచురించారు".

ఆంధ్రపత్రిక 1922 ఆగష్టు సంచికలో...

తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురం విలేఖరి తిరుగుబాటు ప్రారంభాన్ని గురించి రాసిన స్పష్టమైన కథనం వెలువడింది. "ఒక క్షత్రియుని నాయకత్వంలో వందలాది గిరిజనులు ఏకమై చింతపల్లి, క్రిష్ణదేవిపేట, రాజమండ్రి పోలీసుస్టేషనులపై దాడిచేసి ఆయుధాలను, మందుగుండు సామాగ్రిని ఎత్తుకుపోయారని నివేదించారు. పెద్దాపురం తాలూకాలోని అడ్డతీగల వరకు వచ్చినా ప్రజలకు ఎట్టి ఇబ్బందులకు కలిగించలేదని రాశారు. పోలీసులను లారీలో తరలిస్తున్నారని, సైన్యాన్ని కూడా దించుతారని తెలిసిందని రాశారు".

మచిలీపట్నం నుండి క్రిష్ణా పత్రిక 1922 సెప్టెంబరు 2 సంచికలో...

"ఒక యువ క్షత్రియ నాయకుడు కోయ తెగ ప్రజల్లో సహకార నిరాకరణ సూత్రాన్ని వ్యాప్తి చేస్తున్నాడని రాసింది".

1922 సెప్టెంబరు 3 సంచికలో తన రెండవ నివేదికలో ఆంధ్ర పత్రిక రాస్తూ...

"వేలాది ఏజన్సీ ప్రజలు బృందాలుగా ఏర్పడుతున్నారని తిరుగుబాటు లేవదీస్తున్నారని ఇరవై ఐదేళ్ళ యువకుడైన రాజు సాత్వికాహారము తీసుకుంటాడు. అహింసను బోధిస్తారు. అతను అద్భుత శక్తులు కలిగి వున్నారనీ, తుపాకీ, తూటాలు అతనిని ఏమీ చేయలేవని నమ్ముతున్నారు" అని ఈ పత్రిక రాసింది. తిరుగుబాటు ఆరంభమైన వారం లోపలే ఏడు పోలీసుస్టేషన్‌లను దోపిడి చేశారని ఆ పత్రిక కాకినాడ విలేఖరి రాశారు.

మద్రాసు నుండి వెలువడే న్యాయదీపిక పత్రిక 1922 సెప్టెంబరు 4 సంచికలో...

"తిరుగుబాటును రంప తిరుగుబాటు అని పేర్కొంది. బయట వాళ్ళు మన్యం ప్రాంతంలోకి పోయి తిరుగుబాటు నడుపుతున్నారని, సన్యాసి వేషంలో వున్న అల్లూరి సీతరామరాజు నాయకత్వం వహిస్తున్నారని రాశారు. గిరిజనులను విద్యావంతుల్ని చేసి పౌర విధులను నేర్పించాలని, ఏజెన్సీ ప్రాంతాలను ప్రత్యేక ప్రాంతంగా వుంచకూడదని రాసారు".

రాజమండ్రి నుండి వెలువడే గోదావరి పత్రిక 1922 సెప్టెంబరు 5 సంచికలో... "గిరిజన హక్కులను నిరోదించడాన్ని అధికారుల చర్యలను ప్రస్తావించింది." నెల్లూరూ నుండి వెలువడే 'ఆర్యావర్తనము' పత్రిక సెప్టెంబరు 10 సంచికలో పితూరిని ప్రస్తావిస్తూ పితూరీదారులు విశాఖపట్నం ఏజెన్సీ గుండా ఒరిస్సాలోని జైపూర్ ఏజెన్సీలోకి తరలినారని రాసింది.

న్యాయదీపిక అక్టోబరు 10 సంచికలో తిరుగుబాటుదారులకు అడవి లోతట్టు ప్రాంతాల్లోకి కాకుండా చింతపల్లి వైపు నుండి మైదనం వైపు తరలినారని రాసింది. తిరుగుబాటు ఆరంభాన్ని దాదాపు అన్ని తెలుగు పత్రికలు వార్తాలుగా తెచ్చాయి. ఆ తర్వాత కాలంలో కాకినాడ నుండి వెలువడే ఆర్యప్రభ వంటి కొన్ని పత్రికలు మాత్రమే తిరుగుబాటును నివేదిస్తూ వచ్చాయి.

1922 నవంబర్ సంచికలో ఆర్య ప్రభ తిరుగుబాటుదారులు తరచు తిరిగి ప్రాంతాలను తెలిపింది. ఈ పత్రిక పితూరికి నాలుగు కారణాలు తెలిపింది.

1. సీతారామరాజు క్రిష్ణదేవిపేట దరిదాపుల్లో ఐదు గ్రామల్లో పంచాయితీ న్యాయ స్థానాలను ఏర్పరచారు. అధికారులు వాటిని నిర్మూలించారు. రాజును అరెస్టు చేసి తగిన సాక్షాధారాలు లేవని వదిలేశారు. అతడు ఏజెన్సీలోకి వెళ్ళి పితూరి ప్రారంభించారు.

2. లాగరాయి తిరుగుబాటులో పాల్గొన్న ముత్తాడం వీరయ్యదొరను రాజ ఒమ్మంగి పోలీసుస్టేషన్‌లో నిర్బంధించారు. అతన్ని విడిపించుకోవడానికి రామరాజు దాడి చేశాడు.

3. డౌనూరు, లమ్మసింగి మధ్య రోడ్డు నిర్మాణం పనిని పర్యవేక్షించిన అధికారులు గిరిజన కూలీలను వేదించారు.

4. రామరాజు ఏజెన్సీ స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పాటు చేయదలిచాడు అని రాసింది.

న్యాయదీపిక పత్రిక “1922 జులై 5 సంచికలో తిరుగుబాటుకు ప్రధాన కారణం క్రూర అటవీ చట్టాలు, బాస్టియన్ వంటి రెవెన్యూ అధికారులు ప్రవర్తన” అని రాసింది.

ఆంధ్రపత్రిక 1923 ఆగష్టు 28 సంచికలో... “పోడు వ్యవసాయం కోసం అడవి ప్రాంతాన్ని తగలబట్టే విధానాన్ని నిరోధించాలనే ప్రయత్నంలో ప్రభుత్వం తీవ్రమైన చర్యలు చేపట్టింది. ఇది గిరిజనుల్లో తీవ్ర అసంతృప్తిని పెంచింది. బాస్టియన్ అతని వద్ద పని చేసే ఓవర్ సేమర్ విధానాల పట్ల గిరిజనులు వ్యతిరేకత నేర్పరచుకున్నారని తెలిసింది.

స్వరాజ్య పత్రిక 1923 సెప్టెంబరు 2 సంచికలో “... బాస్టియన్ చర్యలకు కళ్ళెం వేయకుండా అతని దుర్నీతిని ప్రభుత్వం ఆమోదం వున్నదను విషయం అందరికి తెలిసిన రహస్యమే” అని రాసింది.

ఆంధ్రవాణి నవంబర్ 5 సంచికలో పితూరి ముందుకుపోయే సూచనలు కనిపిస్తున్నాయని అభిప్రాయం వ్యక్తమైంది. బియ్యము, నువ్వులనూనె, మిరపకాయలు, ఉప్పు తదితరాలను ప్రజలు తీసుకుపోవడాన్ని నిరోధించారు. పెద్దాపురం, నర్సీపట్నం వద్ద బండ్లను తనిఖీ చేయసాగారు. వస్తువులు తిరుగుబాటుదారులకు అందించబడుతున్నాయని ప్రభుత్వం భావించింది అని వార్తలు రాశారు.

రాజమండ్రి పత్రిక ‘కాంగ్రెస్’ 1922 డిసెంబరు 14 సంచికలో.... “పితూరీకి కారణాలు కనుక్కొని పరిష్కరించలేకపోవడాన్ని విమర్శించింది. ప్రధాన పత్రికలన్ని బ్రిటిష్ ప్రభుత్వాన్ని విమర్శించాయి”.

ఆంధ్ర పత్రిక 1923 జూలై 19 సంచికలో... “రామరాజు ఒరియా ప్రాంత పర్యటన అనంతరం ఏజెన్సీకి తిరిగి వచ్చాడని, యెల్లవరం తాలూకాలో యేలేశ్వరం దరిదాపుల్లో 200 మంది సాయుధ అనుచరులతో తిరుగుచున్నాడని నివేదించింది. తిరుగుబాటు ప్రాంతంలోకి పత్రికల వాళ్ళను వెళ్ళకుండా ప్రభుత్వం నిషేదం విధించింది.

న్యాయదీపిక పత్రికలో 1923 ఏప్రిల్ 9 సంచికలో... “తిరుగుబాటు దారులనందరినీ శిక్షించాలని రాసింది. అయితే సానుభూతిపరులపై అపరాదపన్నును విధించడాన్ని వ్యతిరేకించింది. క్రిష్ణాపత్రిక కూడా అపరాధ పన్నును వ్యతిరేకించింది. తిరుగుబాటుదారులు ఎత్తుకుపోతారన్న భయంతో పోలీసుస్టేషనుల నుండి ఆయుధాలను తొలగించడాన్ని విమర్శించింది. గ్రామస్తులందరిని నిరాయుధుల్ని చేయాలని తద్వారా సాయుధ తిరుగుబాటు దారులను గుర్తించడం సులువుగా వుంటుందని రాసింది.

ఆర్యప్రభ 1923 మే 29 సంచికలో "దోషుల్ని శిక్షించవలసినదేననీ, అయితే కొండ ప్రాంతాల్లో స్త్రీలను హింసించడం, పొలాలను ధ్వంసం చేయడం, గ్రామాలను తగులబెట్టడం ఘోరమైన విషయమనీ ఆగ్రహించింది. ప్రభుత్వం దీనిపై విచారణ జరిపించాలని కోరింది" అంతేకాకుండా....

న్యాయదీపిక పత్రికలో "1923 ఏప్రిల్‌లో రామరాజు అన్నవరం పోలీసుస్టేషన్‌కు వచ్చి అరగంటసేపు ఉండి, చరిత్రలో రెండుగంటల పాటు గడిచిపోయిన ప్రభుత్వం అతన్ని బంధించలేకపోయిందనీ, ప్రజల విశ్వాసాన్ని పొందలేక పోయిందనీ రాసింది. అడ్డాకుల నుండి రాజ ఒమ్మంగికి వెళుతున్నప్పుడు జెడ్డంగి వద్ద పోలీసులు కాల్పులు జరిపారని అయినా రాజు బృందం తప్పించుకున్నారని ఇదంతా పోలీసుల అసమర్ధతను నిరూపిస్తుందని" న్యాయదీపిక రాసింది.

గుంటూరు పత్రికలో 1923లో పితూరి దారి తీసిన సమస్యలను పరిష్కరించడం ప్రధానమైన విషయం అని రాసింది. అపరాధ పన్ను విధింపును, గిరిజనులను నిరాయుధం చేయడాన్ని ఆ పత్రిక వ్యతిరేకించింది. రామరాజు మరణాన్ని తెలియపరుస్తూ 1924 మే 8 సంచికలో.... ఉపేంద్ర పాట్నాయక్ బలగంతో జరిపిన సాయుధ ఘర్షణలో రామరాజు సైన్యంలో 20 మంది మరణించారని, రామరాజు దొరికాడని, అయినా తప్పించుకుపోయాడు అని రాసింది.

ఆంధ్రపత్రిక మే 17 సంచికలో రామరాజు అనుసరించిన హింసాయుత మార్గం నిరుపయోగమనీ, గాంధీ పాటిస్తున్న అహింసాయుత సహకార నిరాకరణ మార్గాన్ని అందరు అనుసరించాలని రాసింది. రామరాజును చంపబడిన మరుసటి రోజే అంటే మే 8న మద్రాస్ మెయిల్ అల్లూరి మరణవార్తను ప్రకటించకుండా ప్రభుత్వం ఆలస్యం చేస్తున్నదనీ ఇది ఆశ్చర్యంగా ఉందనీ తెలిపింది. రాజును బందిగా తీసుకొని కాల్చి చంపారన్నదే వాస్తవమని అభిప్రాయపడింది.

పై పత్రికల సమాచారాన్ని వ్యాసాలును డా॥ బి. సూర్యసాగర్ సేకరణలో ఈ సమాచారాన్ని మన్యం వీరుని పోరుదారిలో అల్లూరి శత జయంతి సంచికలో ప్రచురించబడ్డాయి.

## 6.3 పీఠికా వ్యాసాలు:

అల్లూరి సీతారామరాజు జీవితచరిత్రను మొట్టమొదటిసారి పుస్తక రూపంలో

తీసుకువచ్చినది పొన్నలూరి రాధాకృష్ణమూర్తి. ఈ పుస్తకములో 202 పుటల్లో రామరాజు జననం ప్రథమ ప్రకరణతో ప్రారంభించి మరణం వరకు ఇరువది తొమ్మిదవ ప్రకరణం వరకు జీవితచరిత్రను రాసారు. ఈ గ్రంథం ఆధారంతో సీతారామరాజుపై అనేక ప్రక్రియల్లో నాటకం, నవల, బుర్ర కథ వంటి రూపాల్లో పుస్తకాలు తెలుపడానికి ఆధారమైనది. పొన్నలూరి రాధాకృష్ణమూర్తి ఈ గ్రంథంలో పీఠికా వ్యాసాన్ని "మరువరానిమాట" రాస్తూ....

**ఆనాటి ప్రభుత్వ నిరంకుశత్వం:**

"6 రోజుల్లో మన్యం జీవితం మీద ఒక నౌఖాలీ విస్తృత తాండవ మాడుతోంది. మత దౌష్ట్యాలను నివారించే యత్నంతో నౌఖాలీ గ్రామ సీమలలో శాంతి సంఘాలను స్థాపించిన మహాత్ముని పోకడలే ఆనాడు తెలుగునాటి అడవి పల్లెల్లో పంచాయితీలను రామరాజు పాదాలు ధ్వనించినవి. తుదకు నవభావీ మతముఖంలో వికటాట్టహాసాలను తుడిచి పెట్టి మధుర హాసాలను మహాత్ముడు చిత్రించగలిగినాడు. కాని మన్యజాతి ముఖాన అమృత హాసాలు వెలిగించేందుకు నాటి ప్రభుత్వం ఒప్పుకోలేదు.

ఉద్యోగులు, కలప వ్యాపారులు, ముఠాదారులు, వీరే అరణ్య సీమలలో పీడించే దుండగులు ప్రభుత్వ అర్థిక విధానమే యీ దుండగులను సృష్టించింది. యీ వున్నత వర్గాల దౌర్జన్యాలను పంచాయితీ స్థాపన ద్వారా యెదరించే యత్నాలను బ్రిటీషు ప్రభుత్వం అరికట్టింది. స్థాపించబడిన పంచాయితీ రాజ్యాలను అది భగ్నపరిచింది. రామరాజు ఆగ్రహించినాడు. తక్షణమే అతని యందున్న క్షాత్ర ధర్మం మన్యవాసులలో ఉద్దీపించింది.

**రంపవిప్లవం – రామరాజు పాత్ర:**

1922లో బ్రిటిష్ ప్రభుత్వం మీద ఆరంభమైన ఈ తిరుగుబాటు రెండేండ్లు సాగిపోయి 1924లో అంతమయింది. అనంతరం రామరాజు ఏమైనాడు?

నిజంగా మరణించినట్లు ఒక యోగి రూపాన్ని ప్రభుత్వం ప్రకటించింది. త్యాగధనుల వక్షం మీద వ్రాసి పెట్టే రక్తపు చారలనే ఈ సీతారామరాజు రొమ్ముల మీద కూడా తుపాకి గుండ్లు వ్రాసి పెట్టినాయి. ఆ బొమ్మను వోళ్ళో పెట్టుకొని చూస్తూవుంటే చనిపోయిన మహాత్మాజీ బొమ్మంత ప్రీతిగా కనిపిస్తుంది. ఆ గాయపడిన వ్యక్తి రామరాజే కాకపోతే యింతటి గొప్ప వీర మరణం మరియెవరికి సంభవిస్తుంది? అని హృదయం ప్రశ్నించుకుంటుంది అయితే...

రామరాజు మరణించినాడనేందుకు మనసొప్పదు. ఉన్నాడని ప్రజలు విశ్వసిస్తున్నట్లే మొన్న మొన్నటి వరకు బ్రిటీషు ప్రభుత్వం కూడా అనుమానిస్తూ ఉండేది. చాలాసార్లు చాలామంది సాధువులను పోలీసులు నిర్భంధించేవారు, పట్టుబడిన వారు శ్రీరామరాజు వారు కారని విడిచిపెట్టేవారు. ఇదే రీతిగా ప్రజలు సాధువులలో కొందరు యందు రామరాజు రూపురేఖలను పోల్చుకొనుటకు ప్రయత్నిస్తూ ఉంటాము. ఎక్కడ నిరంకుశ ప్రభుత్వాల మీద ప్రజలు తిరుగుబాటు సంభవమౌతుందో దాని నాయకత్వంలో రామరాజును కలలు కంటూ ఉంటారు. తెలుగు భూమికి అతడు కావాలనే వాంఛే ఆ విధంగా అనిపిస్తుంది.

**రామరాజు స్మరణతో – తెలుగుతేజం పులకింత:**

1931లో బర్మాలో నాలుగు రోజుల పాటు ఒక పితూరీ జరిగింది. దాని నాయకత్వం రామరాజుదేనని యీ భూమి గుసగుసలాడింది.

1935లో వజీరు స్థానంలో అటవికుల తిరుగుబాటు ఆశ్చర్యపరిచింది. దాని నాయకుడైన 'ఇపీఫకీరు' కూడ రామరాజే అని చాలాకాలం భ్రమించేవారు.

1942లో ఆగష్టు విప్లవం విజృంభించిన ఆరంభ దినాలలో 'అదుగో రామరాజు ప్రత్యక్షమౌతున్నారు. రాజమండ్రిలో అని ఆశపడ్డారు. ఈ రీతిగా పోరాటాలు నీ లోకంలో మేమూ పొంగినా, దానిని రామరాజమూర్తిగా భావించటం ఓ సహజమై పోయింది. ఏమంటే... విప్లవం అతని జన్మ రహస్యం అది ఆంధ్రుల జన్మ లక్షణం.

"ఈ పీఠికా రాసే నాటికి రామరాజు వయస్సు యాభై యేండ్లు మరి నూరేండ్లు, పది నూరేండ్లేగాదు, యీ కాలం సాగిపోయేంత వరకూ అతని ఆయువు క్రాంతిస్తున్నట్లు ఆ విప్లవ కాంక్షే నమ్మిస్తుంది. మరి ఈలోగా ఎక్కడ శత్రువుల మీద ధర్మఖడ్గం ....... కనిపించినా దాని మెరపులే శౌర్యధనుడైన శ్రీరామరాజుగా, ఎక్కడ శతఘ్నులు మోగితే వాటి జ్వాలలే అతని భేషణ తప్పస్సుగా ఆంధ్రులకు దర్శనమౌతు ఉంటుంది. చిరస్థాయియైన విప్లవం రామరాజును చిరంజీవి అనేస్తుంది."[20]

ఆ విప్లవాలు ధనించని విరామ సమయంలో యీ భూమి మీద యేదోవొక మూలలో, శాంతి సౌభాగ్య ప్రధానమైన మానవ సేవలెచట– ప్రకాశించునో, అట్టి నిర్మాన పథంలో అతని అడుగుజాడులు గుర్తిస్తూ ఉంటారు.

గోదావరీ నదీ తీరాన పాపికొండల్లో 'పేరంటాల పల్లి' ఒక తపోవనంగా అప్పుడే గుర్తించబడింది. అచట రూపొందిన నిర్మాణశక్తితో మ్రొక్కులంచుకొనే తపోనిష్ఠ, త్యాగశీలత రామరాజును తలపిస్తున్నాయి. తామే రామరాజుమని అంటున్నాయి.

ఇందుకు విరుద్ధంగా వాణ్ణి యెముకల గూడు మీద యెఱ్ఱని చర్మంలో రాజు రూపురేఖలను పోల్చుకునేందుకు ఆంధ్రజాతి అంగీకరించదు. అట్టి నిర్జీవ ప్రతిమలో రామరాజు ధర్మ నిరతుడు అని తన మనసులో మాటను పొన్నలూరి రాధాకృష్ణమూర్తి వ్యక్తపరిచారు.

బూరరాజు రాధాకృష్ణ అశ్రుధారలు అనే పద్యకావ్యాన్ని 1950లో రాసారు. అశ్రు దారలులో అల్లూరి సీతారామరాజు చరిత్రను, సాహసాన్ని విప్లవాన్ని పద్యకావ్యాల్లోని రాసారు. ఈ గ్రంథం 90 పుటలలో చరిత్రను వివరించారు. బూదరాజు ముందుగా 'మొదటిమాట'ను రాస్తూ...

"తెలుగునాట జరిగిన వీరగాధ అది" ఆర్థిక సూత్రముల మీద ఆధారపడి అఱ్ఱాకలెత్తెన ఆంధ్ర ప్రజానీక గర్భకుహరాంతరాములలో పుట్టినింటి గౌరవమును చవిచూచినది. ఆ 'మన్యవిప్లవము' పోయినది. కాని వీరగాధ మరపునకు రాలేదు. వీరులు గతించారు. కాని వీరవంశమున చిరంజీవులే పుట్టినారు! ఆంధ్ర పతాకము ఆకాశవీధుల్లో వెల్లివిరిసినది. వీరమాతకు నిరంతర నీరాజన సేవకల్గినది. అఖండ గోదావరీ సైకతములలో ప్రభవించిన జాతీయత స్వాతంత్ర్య పిపాస, భారత భూమిలో సమరగాధయైనది.

"భారతభూమికి ఇక్కట్లు తప్పి సర్వతంత్ర స్వతంత్ర వచ్చినది. కాని ఏరుదాటిన భారతీయులు తెప్పను తగులబెట్టినారు. జాతీయ వీరులను విస్మరించినారు. నిద్రాణమైన జాతిలో నిప్పుతునక పెట్టినాడు. సీతారామరాజు 04.07.1897న జన్మించిన ధైర్యనీరధి 22.08.1922న విజయసారధియైనాడు. విప్లవ ధర్మనిర్వహణము చేత శివాజీవలె పోరాడి రాణా ప్రతాప్సింగు వలె ఓడినాడు. రామరాజు "ఇఫీ ఫకీరు" వలె గడగడలాడించిన దిట్ట, "గోసాయి హరిదాసు"ని వలె తెల్లవారి కసాయి కత్తికి బలియైనాడు. ఇరువదేడేండ్లు వయసులో నిరువది కోట్ల ఆంగ్లేయులకు తెనుగు కత్తుల వాదర పసందు జూపినవాడు రామరాజు జర్మను చక్రవర్తి కెయిజరువలె' తుదకు మరణించాడు."[21]

రామరాజు దీక్షాబద్ధుడు, జన్మత: శూరుడు మాటనోక పోటును ప్రతిక్రియగా నెరవేర్చువాడు. పిరికి కండలేని మాతెలుగు బిడ్డ నేటికిని యశ:కాయుడే! అహింసావాదమే

పరమ ధర్మము కావచ్చును. ఉత్తమోత్తములకు గాని తన్నిర్వహణము కుదురు కాదు. సంస్కృతాంధ్ర సారస్వతములలో అజ్ఞాత యుగము నుండి నేటిదనుక "ధీరోదాత్త లక్షణములు" గల నాయకులు కేవలం అహింసా వాదులు కానేకాదు.

జాతిపిత "మహాత్మ గాంధీ" వంటి అహింసావాది కాదనలేకపోయారు. రామరాజు కదరకౌశలమును కార్యదీక్షను అందునకు 18.07.1929 నాటి యంగిండియా మనకు సాక్షి, ఆంగ్ల సామ్రాజ్యానికి భయం పుట్టించినా 'సుభాసు చంద్రబోసునకు విరుద్ధుడు కాదు. అల్లూరి సీతారామరాజు పటములలోని నారాయణ రాజు వంటి వీర కిశోరములు కాకినాడ పట్టణ కాంగ్రెసు వ్యవహారములను సరిచూచిన నిదర్శనములున్నవి. అందుచేతనే రాజు మన కారాద్యుడు. వాని విప్లవము మనకు జాతీయ వీరగాధ కాదని నాకనుమానమైన లేదు కాని ఆ విప్లవకారులను "దోపిడి మూక" లనిన వారి కొఱకే యీ ఉపోద్ఘాతము అని రచయిత వివరించాడు.

ఆనాటి మన్యవిప్లవ స్వరూపమును, దానికి మూలకందమైన బ్రిటీషు ప్రభుత్వ నిరవకుశత్వమును నిష్పాక్షిక దృష్టితో తొలకించి చర్చించిన కాంగ్రెసు చరిత్రకారులైన డా॥ బోగరాజు పట్టాభి సీతారామయ్యగారికి అభినందనలు అని గ్రంధకర్త కృతజ్ఞతలు తెలిపారు.

## 6.4 పరిశోధనాత్మక వ్యాసాలు:

అల్లూరి సీతారామరాజు మన్యవిప్లవం 1922-24 డా॥ అట్లూరి మురళి (పరిశోధనా వ్యాసం) రాశారు. దీనిని 2010లో ప్రధమ ముద్రణ జరిగింది. ఈ పుస్తకంలో పరిశోధన వ్యాసాలతో పాటు, మన్యవిప్లవం ముఖ్య ఘట్టాలు, బాల్యంలోని శౌర్యం, లేఖలు, వ్యాఖ్యాలు అధికారుల నివేదికలను మొదలైనవి ప్రచురించారు. అందులో 'తిరుగుబాటులోని రాజకీయ సిద్ధాంతం' అనే వ్యాసం వివరిస్తూ...

"మైదాన ప్రాంతాల్లో కొందరు వ్యక్తులు మినహా కాంగ్రెసు ప్రతిస్పందన విరుద్ధంగా ఉండటం. ఇతర రాజకీయ శక్తుల స్పందన సాత్వికంగా లేక వ్యతిరేకంగా ఉండటంతో రాజుకు తీవ్ర నిరాశ ఎదురైంది. ఉదాహరణకు కొండ గిరిజనుల సమస్యలపై తక్షణం విచారణ జరిపించాలని ప్రముఖ జాతీయవాద పత్రిక డిమాండ్ చేసిందనడం నిస్సందేహం. అయితే మైదాన ప్రాంతాల్లోని గాంధీ నేతృత్వం కింద ఉన్న సహాయ నిరాకరణోద్యమంతో రాజుకు ఎలాంటి సంబంధాలు లేవని చెప్పిన తొలి పత్రిక కూడా ఇదే.

రాజు మరణానంతరం అదే పత్రిక తన సంపాదకీయంలో ఇలా పేర్కొంది. "రాజు నిర్వహించిన పితూరి మరోసారి హింస అనేది నిరూపయోగమైన ఆయుధమని రుజుచేసింది. అందువల్ల గాంధీ బోధించిన అద్భుతమైన అహింసాయుత సహాయ నిరాకరణను అనుసరించి విప్లవాలు, పితూరీలు వంటి హింసాయుత పద్ధతులను అనుసరించడం వల్ల స్వయం వినాశనమే గాక ప్రజలకు దేశానికి నష్టదాయకమని వివరించేందుకు రంప పితూరీ చక్కటి ఉదాహరణ" అని ఆంధ్రపత్రిక రాసింది.

మరో మిలిటెంట్ పత్రికగా చెప్పుకున్న 'ది కాంగ్రెస్ పత్రిక' 'రంప పితూరీ'ని పూర్తిగా ఆపేస్తే తాను కృతజ్ఞురాల్ని అని రాసింది. అలాగే కృష్ణాపత్రిక కూడ అందుకు మినహాయింపేమి కాదు. అది మన్యం తిరుగుబాటును ఖండించింది. అంతేగాక మరో అడుగు ముందుకేసి విప్లవ కారులపై పోరాడేందుకు ప్రజలకు "పోలీసు స్టేషన్లకు మరిన్ని ఆయుధాలు సరఫరా చేయడంలో ప్రభుత్వ వైఫల్యాన్ని విమర్శించింది. తిరుగుబాటును దారుణంగా అణచివేయడాన్ని అది సమర్ధించింది. రాజును కాల్చి చంపే వరకు అది చాలా అసహనంతో ఉంది. అదే విధంగా ఆంధ్రాలోని ఇతర పత్రికలన్ని కూడా రామరాజు తిరుగుబాటుకు వ్యతిరేకంగా స్పందించడం కనిపిస్తుంది.

ఒక్కసారి రామరాజును కాల్చి చంపి, తిరుగుబాటును పూర్తిగా అణచి వేసిన అనంతరం ఆంధ్రలోని అనేక జాతీయవాద పత్రికలు, జర్నల్స్ వెంటనే రామరాజును గొప్ప జాతీయవీరునిగా చూపేందుకు ముందుకొచ్చాయి. అవి ఆయన్ను ఎక్కిడికి తీసుకెళ్ళాయంటే శివాజీ, రాణాప్రతాప్‌తోనూ ఒక సందర్భంలో 'లెనిన్' అంటూ కూడా ప్రశంసిచాయి. ఆంధ్రపత్రిక ఆయనకు వీరస్వర్గం లభిస్తుందని ఆశించింది. సామాగ్రాహి రామరాజును జార్జివాషింగ్టన్‌తో పోల్చింది.

1924 అక్టోబర్ 20 ఆంధ్ర కాంగ్రెసు సదస్సులో ఈ మేరకు అయ్యదేవర కాళేశ్వరరావు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. "పితూరీ నేత దివంగత అల్లూరి సీతారామరాజు హింసను ఖండిస్తూనే ఆ సదస్సు ఆయన దేశభక్తిని, ధైర్యాన్ని ఆత్మత్యాగాన్ని ప్రశంసించింది. ఆయన ఆత్మకు శాంతి కలగాలని ప్రార్ధించింది. అయితే రాజు సజీవంగానే ఉన్నట్లు పుకార్లు ఉన్న నేపధ్యంలో ఆ తీర్మానంపై చర్యను వాయిదా వేస్తూ ఒక సవరణను ప్రతిపాదించి ఆమోదించారు.

ఆ తీర్మానాన్ని రాజు మరణానికి సంబంధించిన అనుమానాల మూలంగా

కాకుండా ఇతర కాంగ్రెస్‌వాదుల నుండి వచ్చిన వ్యతిరేకత మూలంగా వాయిదా వేశారు. ఉదాహరణకు కృష్ణా పత్రిక సంచికలో వ్యక్తమైన కొన్ని వ్యాఖ్యాల్లో ఆ వ్యతిరేకత ప్రతిబింబించింది. బెంగాల్‌లో అరాచకవాది 'సాహా' ప్రవర్తనను ప్రశంసిస్తూ చేసిన తీర్మానంలో కన్పించిన విధంగా ఈ తీర్మానాల్లో కూడా అదే రకమైన మానసిక విపరీతత్వం వ్యక్తమయింది.

"మద్రాసు శాసనమండలిలో కూడా ఇదే రకమైన వ్యతిరేక ప్రతిస్పందన వ్యక్తమయింది. ఈ తిరుగుబాటుకు తర్వితంగా ముగింపునిచ్చేందుకు మెజారిటీ సభ్యులు ప్రభుత్వానికి మద్దతు ఇచ్చారు అని పేర్కొంది."[22]

బ్రిటీషు వారికి వ్యతిరేకంగా విప్లవకారులు దీర్ఘకాలికంగా గెరిల్లా యుద్ధాన్ని సాగించినప్పుడు "ప్రజలకు, దేశానికి కూడా చాలా హానికరమైందిగా చూబడిన" ఈ తిరుగుబాటు ప్రజాయుద్ధంగా ముగించిన అనంతరం దాని నాయకుని శివాజీ, రాణాప్రతాప్, లెనిన్, జార్జి వాషింగ్టన్ కంటే గొప్పవారు కావడం నిజంగా హాస్యాస్పదం.

ఈ తిరుగుబాటుకు వచ్చిన వ్యతిరేక వైఖరి గురించి డేవిడ్ ఆర్నాల్డ్ మాట్లాడుతూ... 'ఆంధ్రా కాంగ్రెస్ వాదులు ప్రదానంగా ప్రాతినిద్యం వహిస్తున్న వ్యాపారులు, వడ్డీ వ్యాపారులు, కాంట్రాక్టర్లు, వలస వచ్చిన సాగుదారులు, లాయర్ల కూలదోసేందుకు పితూరిదార్లు పోరాడటమే దీని పట్ల వారి వ్యతిరేకతకు ప్రదాన కారణం. ఇక్కడ ఆర్నాల్డ్ మళ్ళీ పొరపాటు పడ్డారు. ఈ తిరుగుబాటు ప్రారంభంలోగాని, ముగింపులో గాని మైదాన ప్రాంత ప్రజల ప్రయోజనాలను కూలదోసేందుకు ఉద్దేశించింది. కాదని ముందుగా మనం గుర్తించాలి. ప్రాథమిక వలస వ్యతిరేక యుద్ధంలో మైదాన ప్రాంత ప్రజలతో ఉన్న అన్ని వైరుద్యాలను అదుపులో ఉంచడంలో రాజు చివరి వరకూ చక్కగా విజయం సాధించారు. మనం పైన చూపిన విధంగా విప్లవ కారుల ఆశయం పట్ల పలువురు మైదాన ప్రాంత ప్రజలు సానుభూతి చూపారు. అయితే దానికి మద్ధతుగా బహిరంగంగా రాలేకపోయారు. దీనికి కారణం మైదాన ప్రాంత ప్రజలపై గాంధీయవాద జాతీయవాద సిద్ధాంత పెత్తనం, గాంధీవాద ప్రభావం బలంగా ఉండటమే. ఇక రెండో విషయమేమంటే కాంగ్రెసు కేవలం కొద్దిపాటి సంపన్న గ్రూపులకు మాత్రమే ప్రాతినిద్యం వహిస్తోందని సూత్రీకరించడం పొరపాటు. కనుక ఈ సూత్రీకరణలను వారి వ్యతిరేకతను ప్రదాన ఉదాహరణంగా తీసుకోవడం సరికాదు. అందువల్ల ఆంధ్రాలో కాంగ్రెసు వర్గ పునాది ఆర్నాల్డ్ పేర్కొన్న దానికంటే చాలా విస్తృతంగా ఉంది.

వాస్తవానికి కాంగ్రెస్ వ్యతిరేక స్పందన దాని బూర్జువా జాతీయవాద సిద్ధాంతం. అది చెపేట్టిన పోరాట ప్రాధమిక రూపాల స్వభావం అనుగుణంగానే ఉంది. 1929లో ఆంధ్ర పర్యటన సందర్భంగా మహాత్మాగాంధీకి రాజు చిత్రపటాన్ని బహుకరించారు. దీనిపై తర్వాత స్పందిస్తూ గాంధీ రామరాజుపై ప్రశంసలు కురిపిస్తూ...

''నాకు దీని పట్ల సానుభూతి లేనప్పటికి సాయుధ తిరుగుబాటును ప్రశంసించినప్పటికి శ్రీరామరాజు వంటి ఎంతో ధైర్యం, ఎంతో త్యాగం, ఎంతో నిరాడంబరత, ఎంతో ఉత్తమ యువకునికి శ్రద్ధాంజలి ఘటించకుండా ఉండజాలను, (రామరాజు నిజంగా మరణించి ఉంటే) ఒక పితూరీ కాదు, గొప్పవీరుడు కచ్చితంగా అహింసాయుత మార్గాల ద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించేందుకు దేశ యువకులు సీతారామరాజు ధైర్యం, సాహసం, ఆత్మార్పణ, ఉపయుక్తత, అంకితభావాన్ని అలవరచుకోవాలి. మనం మద్యతరగతిగా భావిస్తున్న అణచివేతకు గురవుతున్న లక్షలాది ప్రజలను అహింస, సత్యం ద్వారా రక్షించాలంటే వారిని మచ్చిక చేసుకోవడం మినహా మరోమార్గం లేదనే ఆలోచనలో నానాటికి పెరిగిపోతుంది. లక్షలాది ప్రజలున్న దేశానికి మరో మార్గం అవసరం లేదు" అని రాజు తన ప్రతిస్పందనను వెలిబుచ్చారు.

**జాతీయ సదస్సుల్లో సమర్పించిన పరిశోధన పత్రాలు:**

ఆంధ్ర విశ్వవిద్యాలయం, తెలుగు శాఖలో యు.జి.సి. వారి సహకారంతో 26,27 సెప్టెంబరు 2015న "తెలుగు సాహిత్యం – సాంగికోద్యమ రూపకాలు" అనే జాతీయ సదస్సు జరిగింది. ఆ సదస్సులో 'అల్లూరి సీతారామరాజు నాటకం – విప్లవ దృక్పధం' పత్రిక సమర్పణలో...

**"తెలుగు సాహిత్యం – సాంఘీకోద్యమ రూపకాలు" అల్లూరి సీతారామరాజు నాటకం – విప్లవ దృక్పధం:**

నాటకం
జగన్నాటకం
సామాజిక చైతన్యానికి ఆరాటం
మానవ వికాశానికి పోరాటం
అదే మనందరి తెలుగు నాటకం

మానవ జీవితాన్ని నవలతో గాని, కథతో గాని, కథానికతో గాని, ఏ ప్రక్రియతోను పోల్చలేదు. జీవితాన్ని నాటకంతో పోల్చారు. జీవితమే ఒక నాటకం అంటారు. సాహిత్య ప్రక్రియలలో కల్లా నాటకం శక్తివంతమైనది. ఎందుకంటే ఒక కథలాగా చదివి మర్చిపోవటానికి వీలులేనిదే, నవలలాగ ఒక పట్టున చదివి మూసివేయటానికి వీల్లేనిదే, సినిమా క్షణికోద్రేశాన్ని ఆనందాన్ని యిచ్చెటటువంటిదే కాదు. నాటకం మహానదీ ప్రవాహం లాంటి పరిపూర్ణ జాతి జీవనం లాంటిది. నాటకం.

నాటకానికీ ప్రత్యేకత యాధృచ్ఛికంగా లభించింది కాదు. నాటకాన్ని ఒక వైపు చదువుకోవచ్చు, చూడవచ్చు, వినవచ్చు ఆలోచింపచేసేది. ఆనందాన్నిచేదీ. జాతి జీవన విధానాన్ని మార్చివేసేది నాటకమే.

వివిధ మార్గాల ద్వారా చదువురులను, ప్రేక్షకులను, మేధావులను అలరించేది కనుకనే విశ్వసాహిత్యంలో నాటకానికో విలక్షణ స్థానం లబించింది.

భారత స్వాతంత్ర్య సమరంలో ఝాన్సీలక్ష్మీభాయ్ (1835–1858) కేవలం 23 సంవత్సరాలు. చంద్రశేఖర్ ఆజాద్ (1906–1931) 25 సంవత్సరాలు, భగత్‌సింగ్ (1907–1931) 24 సంవత్సరాలు భారతమాత దాస్యశృంఖాలను తెంచడానికి చిన్న వయస్సులో ప్రాణాలు అర్పించిన త్యాగధనులు. దక్షిణ భారతదేశంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అల్లూరి సీతారామరాజు కథ (1897–1924) రవి అస్తమించలేని బ్రిటీష సామ్రాజ్యశక్తుల నెదిరించి అసహయశురముగా ఆధునిక కాలమున సాగించిన ఆంధ్రవీరగాధ.

గాంధీ బోధలచే ప్రభావితుడైనను తలో భిన్నరీతిని, క్షాత్ర స్వభావ ప్రేరితుడై స్వరాజ్య లక్ష్యసిద్ధికి అతడు తన పాత్ర నిర్వహించెను. స్వదేశీయులే తన పద్ధతులను నిరూపించుచు బందిపోటుగా భావించి సహకరించకపోయినను, అంతిమ విజయమును సాధించుటలో విఫలమైనను. అతని అకుంత దేశాభిమానము, అమేయ త్యాగనిరతి, అచంచల దీక్ష, అద్భుత కృత్యములు ఆంధ్రుల హృదయ ఫలకములపై గాఢ ముద్ర వేసినవి.

విజయమో వీరస్వర్గమో గాని మధ్యేమార్గమెఱుగనట్టియు, తాను చేయబోవు ముట్టడలను శత్రువులకు ముందే తెలిపి కార్యాన్ని చేసి శత్రువుల మన్ననల గూడ చూరగొనిన మహా సాహసి శ్రీ సీతారామరాజు.

నిరక్షరాస్యులను, భయపూరితులను అగు గిరిజనులను ఆటవిక జాతులవారిని సహచరులుగా చేసుకొని వారియందు చైతన్యమును పూరించి రాజయోగియై, గంటం దొర, మల్లుదొర మొదలైన వారు సహాయకులుగా సమరమును సాగించిన ధీరుడు.

మన్య ప్రజల బాధలను చూచి మనసు కరిగి విప్లవమును ప్రారంభించినను తుదకు తన మూలమున వారు అనుభవించు ప్రభుత్వ క్రూరహింసలకు హృదయము ద్రవించి శత్రువునకు ఆత్మార్పణము గావంచు కానిన మహత్యాగి శ్రీసీతారామరాజు.

ఈయన జీవితం (1897-1924) 26 సంవత్సరములు మాత్రమే. ఉద్యమ జీవిత కాలం (1922-1924) రెండు సంవత్సరములు.

1924లోనే సీతారామరాజును చంపేశారని బ్రిటీష్ ప్రభుత్వం ప్రకటించింది. కానీ 1932లో ఆయన ఇంకా బతికున్నాడేమోననే అనుమానంతో ఒక సన్యాసిని పట్టుకొని హింసించింది. దాన్ని బట్టి సీతారామరాజు ఎంతటి శక్తిమంతుడో అతని పేరు చెబితేనే బ్రిటీష్ ప్రభుత్వం వణికిపోతోందని చరిత్ర చెబుతుంది. అటువంటి చరిత్ర గల నాటకం అల్లూరి సీతారామరాజు.

"తెలుగువీర లేవరా - దీక్షబూని సాగరా
దేశమాత స్వేచ్ఛ కోరి - తిరుగుబాటు చేయరా
దారుణ మరణ కాండకు - తల్లిడిల్ల వద్దురా
నీతిలేని శాసనాలు - నేటి నుండి రద్దురా
నిదుర వద్దు బెదరవద్దు - నింగి నాకు హద్దురా.... శ్రీశ్రీ"[23]

అంటూ స్వాతంత్ర్య సమరంలో ప్రాణాలర్పించిన వీరుడు, త్యాగజీవుడు, ఆత్మజవుడు, మహా విప్లవయోధుడు... భారతమాత ముద్దుబిడ్డ అల్లూరి. అల్లూరి సీతారామరాజుపై ఖండవల్లి రాజారావు, ఆకుల సుబ్రహ్మణ్యం, పడాల రామారావు, మధురశ్రీ, శంకరశెట్టి, విజయకృష్ణ వంటి ఎందరో మహానుభావుల ఈ చరిత్రకి నాటకాన్ని వ్రాసి ఆంధ్రదేశాన్ని కాకుండా యావత్తు భారతదేశానికి స్వాతంత్ర్య సమరయోధుడుగా, తెలుగు వారి ముద్దుబిడ్డగా, విప్లవవీరుడుగా చరిత్రపుటలలో నిలిపివేసే బాధ్యత తీసుకున్నారు.

వీరిలో పడాల రామారావుగారు వ్రాసిన అల్లూరి సీతారామరాజు నాటకం చాలా

గొప్పది. ఎందుకంటే అల్లూరి చరిత్రను సంపూర్ణంగా అధ్యయనం చేసిన వారిలో పడాల రామారావు ముఖ్యులు. వీరి పరిశోధన తరువాత రచయితలకు మార్గదర్శకమైందనటంలో సందేహం లేదు. అల్లూరి సంప్రదాయపాత్రోచిత్ర నాటకాలను ఇతడు ఆద్యుడని కూడా చెప్పవచ్చు. (1950లో వీరి నాటకం ప్రథమ ముద్రణలో ప్రారంబమై 1989 వరకు పంతొమ్మిది ముద్రణలను నోచుకున్న విశిష్ఠ నాటకం).

అల్లూరి సీతారామరాజు నాటకం జాతీయోద్యమ ప్రభావంతో 1925–1930 మధ్యకాలంలో వచ్చింది. ఈ నాటకం 21 ముద్రణలు పొందింది. ఆంధ్రప్రదేశ్‌లో అన్ని మూలాలా ప్రదర్శించబడి స్వర్ణ, రజక పతకాలను సాధించి, పాఠకుడి గుండెలలో అమరవాణిగా, విప్లవ వేణిగా నిలిచిపోయింది.

తెలుగు పత్రికల్ని దేనిని ఉత్తమ నాటకంగా ప్రశంసించాయి. అప్పటి భారత రాష్ట్రపతి వి.వి. గిరిగారు ఎంతో సంతోషిస్తున్నాను అని ఈ నాటకాన్ని కీర్తించారు.

40 సంవత్సరములు అనుభవమున్న నటుణ్ణయ్య నాకే ఈ నాటకం చివరి ఘట్టాల్లో ఎంతో భయందోళలను కల్గించిందని, ప్రేక్షకులు కరుణరసాన్ని ఎక్కువగా పొంది అల్లూరి సీతారామరాజు ఆత్మత్యాగానికి కళ్ళ నీరు కార్పించేంతగా బాగా రచన చేశారని పద్మశ్రీ స్థానం నరసింహారావుగారు (16 ముద్రణ – 1963) తన అభిప్రాయాన్ని తెలియజేశారు.

ఈ నాటకం ఐదు రంగాల నాటకం. సీతారామరాజు గాం సోదరులు వీరన్నపడాలు, సింగన్న, గోవిందు, రత్తి, బాస్టియన్ పిళ్ళై, మేజర్ గుడాల్ ఇందులో ప్రధాన పాత్రలు. ఇందులో రత్తి, గోవిందులు పాత్రలు చరిత్రలో లేవు. ఇవి కల్పితమైన పాత్రలు.

ఈ నాటకంలో ఏకైక స్త్రీ పాత్ర రత్తి. ఈమె చెంచులోళ్ళ కులం పిల్ల, గోవిందు కోమోళ్ల కులం పిల్లవారు. వారిద్దరు పెద్దలను ఎదిరించి ప్రేమ వివాహము చేసుకుంటారు. కులాంతర వివాహాలను ప్రోత్సహించడం ఈ నాటకంలో కనిపిస్తుంది మరియు దాంపత్య జీవితం, తెలుగు జానపదల అనురాగం కనిపిస్తాయి. ఈ నాటకంలో మొదట బ్రిటీష్ వారిని ఎదిరించినవారు. గోవిందు అటవీ చట్టం గురించి తిరుగుబాటు చేస్తాడు. ఈ పాత్రల ద్వారా సామాజిక, విప్లవ త్యాగుల జీవితాలను ఊహించి చెప్పడం నాటకానికి ఉన్న ప్రత్యేక గుణం. మొదటి రంగంలోనే మన్నెంలో తిరుగుబాటుకు ప్రధాన హేతువు అటవి చట్టమని, అది గిరిజనులకు అడవితో అనుబంధం తెగిపోతుందని, ముందు జరగబోయే ఉద్యమాన్ని ఎంతో అర్థవంతముగా, ఎత్తుగడలను చూపించడం రచయిత ప్రతిభకు నిదర్శనం.

నాటకంలోని ఇతివృత్తం చరిత్రకు చాలా దగ్గరగా ఉంది. సీతారామరాజు ఏజెన్సీ ప్రాంతానికి రావడం. గాం సోదరులు, పడాలు సింగన్నలతో పరిచయం పెంచుకోవడం తన ఉద్యమ లక్ష్యాన్ని వారితో చర్చించి వారిని ఉద్యమానికి ఒప్పిస్తాడు. రోజు అనుచర వర్గంతో ఆంగ్లేయులపై దాడి ప్రారంభిస్తారు.

ఈ దాడిలో కవర్టు, హైటర్‌లు మరణిస్తారు. వీరి మరణంతో మేజర్ గూడల్ బ్రిటీష్ బలగాన్ని అప్రమత్తం చేసి, రాజు అనుచరుల్ని ఒక్కొక్కరిని దెబ్బవేస్తూ చివరికి రాజును కట్టి చంపుతారు.

ఈ నాటకంలో 5వ రంగంలో అల్లూరి సీతారామరాజు. తనంతట తానుగా మేజర్ గూడల్ దగ్గరికి పోయి పోరుకు సిద్ధమవ్వడం చరిత్రకు దూరంగా ఉంది. ఎలాగంటే మంప ప్రాంతంలో సీతారామరాజు స్నానం చేస్తుండగా ఆంగ్లేయులు పట్టి బంధించారనటం చారిత్రక సత్యం. అంతేకాక అక్కడ స్థానికుల కథనం కూడాను.

చరిత్ర తెలిపిన రచయిత రామరాజే స్వయంగా గూడల్ దగ్గరికి ఖడ్గదారియై పోవడం. అతను అదే అదునుగా తలచుకుని కాల్చిచంపడంతోనే విషయాన్ని గమనిస్తే బహుశా ఈ రచయిత అల్లూరి సీతారామరాజు పాత్రను, ధీరోదత్తమైన పాత్రగా మలచాలనే ఉద్దేశ్యంతో ఇలాంటి సంఘటనలను చెప్పించి ఉండవచ్చు.

అల్లూరి సీతారామరాజు అంతటి మహాధీరున్ని, త్యాగిని తేజోబలసంపన్నుని ఆంగ్లేయులచేత బంధింపనీయకుండా తనకు తానుగా పట్టుబడే విధంగా చిత్రించి రాజు పాత్రకు వన్నె తెచ్చారని భావించుకోవాలి.

ఈ నాటకం ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, కేరళ రాష్ట్రంలో 5 కేంద్రాల్లో, మైసూరులో 5 కేంద్రాల్లో, మహారాష్ట్రంలో 3 కేంద్రాల్లో, పశ్చిమబెంగాల్‌లో 6 కేంద్రాల్లో, ఒరిస్సాలోని 2 కేంద్రాల్లో, బర్మాదేశంలో 2 కేంద్రాల్లో ప్రదర్శించడం. ఎన్నో బహుమతులను గెలుచుకున్న పాఠకుల, హృదయాల్లో తెలుగువీరుడు ఖ్యాతిని, కీర్తిని వ్యాపింపజేస్తాయి.

అల్లూరి సీతారామరాజు జీవితం ప్రాథమిక పాఠశాలల నందు, ఉన్నత విద్యాసంస్థలలో పాఠ్యాంశాలుగా బోధిస్తున్నారు. ఈ కథను ఎం.ఫిల్, పిహెచ్.డి. గ్రంథాలకు కూడా విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరుగుతున్నాయి. సాహిత్య ప్రక్రియల్లో నవల, నాటకం, బుర్రకథ, కవిత్వం వంటి ఆధునిక రూపాల్లో అనువైన చారిత్రక, సామాజిక

విప్లవాత్మక జీవితం అల్లూరి సీతారామరాజు.

పడలు రామారావు గారి పర్యవేక్షణలో ఎన్టీఆర్‌తో సినిమా ప్రక్రియలో అల్లూరి చరిత్రను చూపించుటకు కె.డి. పేటలో ఇప్పుడున్న అల్లూరి స్మారక ప్రాంతంలో ఎన్టీఆర్, పడాలు, మల్లుదొర, త్రివిక్రమరావు తదితరులు సమావేశమై చర్చించిన సందర్భంలో మల్లుదొర కన్నీరు పెట్టుకొని చరిత్రలో తనని తాగుబోతుగా, స్త్రీ వ్యసనపరుడుగా పేర్కొనడం సమంజసంగా లేదని, అలాగే శ్రీరామరాజుకు ప్రేమికురాలు లేదని స్త్రీపాత్ర కల్పితమని ఆవేశం వ్యక్తం చేశారు. ఎన్టీఆర్, మల్లుదొర పాత్ర సరిచేసి, సీతపాత్ర పూర్తిగా తీసివేసి సినిమా చేస్తానని హామీ ఇచ్చాడు. ఎన్.టి.ఆర్ సినిమా మధ్యలో ఆగిపోయి, కృష్ణ హీరోగా అల్లూరి సీతారామరాజు సినిమా తీయడం, ఆ సినిమా శ్రీశ్రీ గారికి 'తెలుగువీర లేవరా' ఉత్తమ జాతీయ గీత రచయిత అవార్డు వచ్చింది. జాతీయస్థాయిలో తెలుగు సినిమాకి తెలుగు కవికి పట్టాభిషేకం చేసిన మహత్తర సినిమా.

చారిత్రక పురుషులు, వారి జీవితాలు, సమాజానికి సామాజిక చైతన్యాన్ని, విప్లవతేజాన్ని స్వేచ్ఛ స్వాతంత్ర్యంలో పాఠకుల గుండెల్లో నింపుతూ ఈనాటికి, ఏనాటికి అమృతబిందువుగా, చిరస్మరణీయంగా వెలుగొందుతూ విప్లవ జ్యోతులను వెలశిస్తాయి.

రాజమండ్రిలో 2 జులై 2016లో రాష్ట్ర అల్లూరి సీతారామరాజు యువజన సంఘం మరియు ఆదికవి నన్నయ విశ్వవిద్యాలయం సంయుక్త ఆధ్వర్యంలో జాతీయ సదస్సు జరిగింది. "భారత స్వాతంత్రోద్యమంలో – అల్లూరి పాత్ర" అనే అంశంపై పత్ర సమర్పణ ఏర్పాటు చేశారు. ఈ జాతీయ సదస్సు కమిటీలో కో–కన్వీనర్‌గా పేకేటి శ్రీనివాసరావు (ఆంధ్రవిశ్వవిద్యాలయం, తెలుగుశాఖ, పరిశోధక విద్యార్థి) వ్యవహరించారు. ముఖ్య అతిధులు గౌ॥ జస్టిస్ ఆశపు రామలింగేశ్వరరావు గారు న్యాయమూర్తి ఉమ్మడి హైకోర్టు (ఆంధ్ర, తెలంగాణా రాష్ట్రాలు) మరియు గౌ॥ ఆచార్య ముర్రుముత్యాలునాయుడు గారు ఉపకులపతి, ఆదికవి నన్నయ విశ్వవిద్యాలయం, రాజమండ్రి.

అల్లూరి శ్రీరామరాజు జీవితంలో – ఇవే నిజాలు అనే పత్ర సమర్పణలో...

**అల్లూరి శ్రీరామరాజు జీవితంలో... ఇవే నిజాలు:**

బ్రిటీష్ వాళ్ళపై గురి    సామాన్యులకు రాజు
గెరిల్లా యుద్ధంలో చేరి    మన్య ప్రజలకు మహారాజు

| | |
|---|---|
| విప్లవ పోరాట విజయగిరి | అస్త్రశాస్త్ర విద్యలో రారాజు |
| స్వాతంత్ర్య సమరభేరి | బ్రిటీష్ వాళ్ళకు యమరాజు |
| మన అల్లూరి | మన సీతారామరాజు |

**పేరులో ప్రసిద్ధి:**

అల్లూరి సీతారామరాజు అసలు పేరు అల్లూరి శ్రీరామరాజు. ఎలా... జరిగిందో? ఎందుకు జరిగిందో? కాని సీతారామరాజుగా మారిపోయాడు. అతడు ఎప్పుడు తన పేరును సీతారామరాజుగా చెప్పుకోలేదు... రాయలేదు.

1922లో దసరా సందర్భంగా మంత్రం ఉపదేశంలో

1922లో జూన్‌లో గూడెం డిప్యూటి తహశీల్దారుకు వ్రాసిన లేఖలో

1922లో ఏజెన్సీ డిప్యూటి పోలీసు సూపరిండెంట్‌తో ఇంటర్వ్యూలో

1922 జూన్‌లో బిక్కా లింగయ్య కొరకు రాసిన లేఖలో

1922 మల్కనగిరి డిప్యూటీ తహశీల్దారుకు, ఏజెన్సీ కమీషనర్‌కు పంపిన రిపోర్టులో

1924 మే 6న ఉపేంద్ర పట్నాయక్ పంపిన రిపోర్టులో శ్రీరామరాజుగానే ఉంది. అతని బాల్యం నుండి ఎరిగిన మద్దూరి అన్నపూర్ణయ్యగారు కూడా అనే సందర్భంలో శ్రీరామరాజుగానే పేర్కొన్నారు. అయితే 1923లో మార్చి 24వ తేదీన మన్యం పోరాటం గురించి ప్రభుత్వ సమీక్షలో ప్రథమంగా సీతారామరాజుగా రాయబడింది.

**సీతారామరాజుకు కారణాలు:**

1) శ్రీరామరాజు – సీతారామరాజు కావడానికి కారణం – సీత అనే అమ్మాయితో అతనికున్న ఆత్మీయత, ప్రేమ కారణం. ఇది కేవలం కల్పితం. శ్రీరామరాజు కఠోర బ్రహ్మచర్యం పాటించిన మహాతపస్వీ. రచయితలు కథానాయకుడికి, ఒక కథనాయకి ఉండాలి అని ఆ పాత్రను సృష్టించారు. కాని ఆయన నిత్యజీవితంలో, ఆయన చరిత్రలో సీతా అనే అమ్మాయి, వారి ప్రేమ కేవలం అభూత కల్పన. ఆమె ప్రేమకు త్యాగంగా ఆమె పేరుతో పిలుస్తున్నారని కొంతమంది వారి ప్రయోజనం కొరకు (సినిమావాళ్ళు, నాటకాలవాళ్ళు) సీతారామరాజుగా సృష్టించారని ఒక వాదన.

2) ఆంగ్లేయులు అచ్చుతప్పులు వల్ల శ్రీకి బదులుగా సీతగా మారిందని అక్షరదోషాల వల్ల ఇలా జరిగిందని శ్రీరామరాజును పలుకలేక సీతారామరాజుగా పలికారని ఈ ఆంగ్లేయులు పలుకుటలో ఉచ్ఛరణదోషాల వల్ల శ్రీరామరాజుకు బదులుగా సీతారామరాజుగా మారిపోయిందని ఒక వాదన.

3) మన్యం ప్రజలు బ్రిటీషు వారిని దుష్ట రావణాసుడుగా పోల్చి చెడను అంతం చేయుటకు ధర్మాన్ని నిలిపి ప్రజలకు మేలు చేయుటకు రాముడు అవతరించాడని భద్రాచల సీతారాముడే ఈ శ్రీరామరాజని మా పాలిట సీతారాముడని మా మన్యానికి రాజు అని మా సీతారామరాజని మన్యం ప్రజల అభిమానానికి ఈ పేరు వచ్చిందని ఒక వాదన.

4) తండ్రి మరణించిన తర్వాత కుటుంబాన్ని నడిపించవలసిన శ్రీరామరాజు దేశసంచారం చేస్తూ దేశ రాజకీయాల పరిస్థితులు, ప్రజల దుస్థితి చూసి చలించిపోయారు. ఎంతో అల్లూరు ముద్దుగా చూసిన ఒక్కగానొక్క చెల్లెలు సీతమ్మ పెండ్లికి రాకుండా, ఆమె ఆలనాపాలనా చూడక అచ్చటా ముచ్చటా తీర్చక, ప్రాణానికి ప్రాణమైన చెల్లెలకు ఎటువంటి రుణం తీర్చుకోకపోవడం ఒక కారణంగా భావిస్తున్నారు. అందుకే చెల్లెలపై ఉన్న మమకారంతో, ఆమె అనురాగానికి, గౌరవ చిహ్నంగా చెల్లెలు పేరున సీతగా చేర్చుకుని సీతారామరాజుగా మార్పు జరిగిందని ఒక వాదన.[24]

ఏది ఏమైనా అసలు పేరు శ్రీరామరాజు అన్నది యదార్థం. కానీ ఇంతకాలం సీతారామరాజుగా జగద్విఖ్యాతమైనాడు.

**వీరత్వానికి నిదర్శనం – ఆంధ్రుడి పౌరుషాగ్ని:**

మహారాష్ట్రకు చెందిన ఝాన్సీ లక్ష్మీబాయి ఆమె (16.11.1835, 18.06.1858) కేవలం 23 సంవత్సరాలు జీవించి యుద్ధంలో మరణించింది.

మధ్యప్రదేశ్‌కు చెందిన చంద్రశేఖర్ ఆజాద్ (23.07.1906, 27.02.1931) కేవలం 25 సంవత్సరాలు జీవించి మరణశిక్ష విధించారు.

పంజాబుకు చెందిన భగత్‌సింగ్ (02.07.1907, 24.03.1931) కేవలం 23 సంవత్సరాలు జీవించి ఉరిశిక్ష విధించారు. అయితే వీరందరూ స్వతంత్ర్యోదయమ జాతీయ నాయకులు.

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన అల్లూరి శ్రీరామరాజు (04.07.1897, 07.05.1924) రెవెన్యూ ఫారెస్ట్ అధికారులు పెట్టు బాధలను అరికట్టుటకు గాను మన్య ప్రాంతాలకెళ్లి అక్కడ ప్రజలను సంఘటితపరిచి వారందరినీ ఒకే త్రాటిపై నడిపించి తెల్లదొరల పాలన అంతమొందించుటకు అనేక బాధలను భరించి రెండేళ్ళు (1922-1924) పాటు బ్రిటీష్ ప్రభుత్వమునకు సింహస్వప్నంగా నిలిచి ఎదిరించాడు. అటువంటి శ్రీరామరాజుకు గుర్తింపు ఏది?

ఒక రోజు యుద్ధం చేసిన వారిని, ఒక్కొక్కరిని (బ్రిటీష్‌వాడ్ని) చంపిన వారిని దేశభక్తులుగా, జాతీయ నాయకులుగా, స్వాతంత్ర్య సమరయోధులుగా గుర్తిస్తే.... మరి...

ఆరు పోలీస్‌స్టేషన్లు కొల్లగొట్టి, ముగ్గురు తెల్లదొరలను కాల్చి, ముఠాదారుల దౌర్జన్యములను అరికట్టించి, ప్రభుత్వ ధనము 13 లక్షలు, 150 తుపాకులు, 1700 తూటాలు, 40 పట్టాకత్తులు నష్టపరిచి బ్రిటీష్ వారికి కునుకు లేకుండా చేసి అతిక్రూరుడైన మేజర్ గూడాల్ రివాల్వర్ గుండె దెబ్బలతో కాల్చి చంపబడిన శ్రీరామారాజు దేశభక్తుడు కాదా! జాతీయ నాయకుడా కాదా! స్వాతంత్ర సమరయోధుడు కాదా!

శ్రీరామరాజు నడిపిన విప్లవము ప్రదర్శించిన సాహసోపేతమైన కార్యములు ఆయన త్యాగశీలము యువకులను ఎంతగానో ఉత్తేజపరిచి రాబోవు స్వతంత్ర్య సంగ్రామానికి సన్నద్ధులను చేస్తే అటువంటి శ్రీరామరాజుకు గౌరవం ఏది? చిన్న చిన్న కార్యక్రమాలు చేసినా కొందరి పెద్దలకు ఎంతో ఘనకీర్తి ఇస్తే! ఇంత పెద్ద సాహసం చేసి, భరతమాతకు విప్లవ తిలకం దిద్ది ఆత్మార్పణం చేసిన ఆ మహానుబావుడికి మనం ఇచ్చే విలువ ఏది? అందరి మన్ననలు పొందలేకపోయారు ఎందుకు?

ఆనాటి జాతీయ నాయకుల చిన్నచూపు వల్లో, కాంగ్రెస్ ప్రతికూలత ప్రచ్ఛన్న ప్రభావం వల్లో, దక్షిణాదిత్యుల అందునా, తెలుగువాడి గొప్పతనాన్ని అంగీకరించడానిఇయిక మనసొప్పని ఉత్తరాది వారి సహజ లక్షణం వల్లో, తెల్లదొరలు తరతరాలుగా చేసిన బుద్ధిశుద్ధి దష్ప్రభావం నుండి బయట పడలేని భారతీయ చరిత్రకారుల దౌర్భాగ్యం వల్లో జాతీయోద్యమ చరిత్రలో శ్రీరామరాజుకు దక్కవలసిన స్థానం దక్కకుండా పోయింది.

మేధావులారా! సరస్వతీ పుత్రులారా! ఒక్కమాట... స్వాతంత్ర్యసమర సేనులు, విప్లవ వీరులు దేశచరిత్రలో ఎందరో ఉన్న అల్లూరి శ్రీరామరాజు తనకుతానే సాటి. రాణా ప్రతాప్, శివాజీల తర్వాత అల్లూరి వంటి మహాయోధుడు, గెరిల్లా రణతంత్ర

నిపుణుడు, ధర్మవీరుడు ఇంకొకరు కానరారు. యావద్భారత జాతి సగర్వంగా చెప్పుకోవలసిన మహావ్యక్తి – మహాశక్తి.

**విప్లవవీరుడుగా రెండేళ్ళు మాత్రమే:**

సహాయ నిరాకరణోద్యమం (1917–1922)లో పాల్గొని స్వతంత్ర పోరాటంలో శాంతి మార్గంలో ప్రయాణించాడు. సహాయనిరాకరణోద్యమం రెండు రకాలు.

1) సహాయనిరాకరణోద్యమం (రాజకీయ రంగానికి సంబంధించినది)
2) నిర్మాణాత్మక కార్యక్రమం (సామాజిక రంగానికి సంబంధించినది)

నిర్మాణాత్మక కార్యక్రమానికి అల్లూరి శ్రీరామరాజు మన్యప్రాంతాలలో గ్రామ స్వరాజ్యం, అక్షర జ్ఞానాన్ని వెలిగిస్తూ తాగుడు మానివేయమని, గ్రామ పంచాయితీల నిర్వహణ విదేశీ వస్తువుల బహిస్కరణ వంటి కార్యక్రమాలలో పాల్గొని ప్రజలలో చైతన్యం కలిగించారు.

1922 సహాయ నిరాకరణోద్యమం నిలిచిపోవడం, గాంధీజీకి 6 సంవత్సరాలు శిక్ష విధించి జైల్లో బంధించడం, గాంధీ అహింసా పద్ధతులు యువకుల్లో కొందరికి నచ్చకపోవడం, 1917లో రష్యాలో విప్లవం విజయవంతం కావడం, సమరశీల జాతీయోద్యమం మరిసారి తలెత్తడానికి కారణాలయ్యాయి, బెంగాల్ టెర్రరిస్ట్ విప్లవకారుల్లో చిట్టగాంగ్ దళం అంటే బ్రిటీష్ ప్రభుత్వానికి గుండెదడ.

సూర్యసేన్, అనంతసింగ్, గణేష్‌ఘోష్, అంబికా చక్రవర్తి మొదలైనవారి నాయకత్వాన మాతృదేశ విముక్తికై ఆత్మవిశ్వాసంతో గెరిల్లా పోరాటం నడిపించారు. చిట్టగాంగ్ విప్లవకారుల సమావేశానికి హాజరైన శ్రీరామరాజు అదే స్ఫూర్తితో మన్యంలో పోరాటానికి పునాది వేసారు. ఆంధ్రాలో 19.08.1922 నుండి 07.05.1924 వరకు బాటలో నడిచి స్వతంత్ర్య సమరవీరుడుగా, విప్లవవీరుడుగా ఖ్యాతి వహించారు.

గాంధీజీ అంటే రాజుకు ఎంతో గౌరవం ఆయన నిర్దేశించినట్టు మద్యపాన నిషేధం, కోర్టుల బహిస్కరణ, పంచాయితీల నిర్వహణకు గట్టిగా కృషి చేశాడు. చింతపల్లి ముట్టడి వార్తను ఏజెన్సీ కమీషనర్ స్టీవార్డ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి వెంటనే నివేదించాడు. స్టేషన్ ముట్టడిలో తిరుగుబాటుదారులు "గాంధీజీకి జై" అని నినాదాలు చేసారని ఆ ఉద్యమం ప్రభావం చేత తిరుగుబాటు జరిగిందని అభిప్రాయం వచ్చింది.

అహింసా మార్గంలో గాందీని స్మరించి, హింసామార్గంలో గాంధీని స్మరించిన అల్లూరిని మన పెద్దలు గాంధీగారి ఆశీర్వాదం అల్లూరికి లేకపోయిన కారణంగా అతడిది బందిపోటు తనమని ప్రకాశం లాంటి పెద్దలు ఈసడించిన మూలంగా 'రంప పితూరీ' అని పగవారు పెట్టిన అన్యాయపు పేరు ప్రభావం వల్ల, మనవాళ్లలో కూడా రామరాజును కీర్తిస్తే ఎవరేమనుకుంటారో నన్న సంశయం నాటుకుంది. అందువల్ల శ్రీరామరాజు కు దక్కవలసిన గౌరవం దక్కలేదు.

రాజుకి మాయలు, మంత్రాలు తెలిసిన మహాశక్తి సంపన్నుడుగా కొందరు భావిస్తే, అవతార పురుషుడుగా, మరికొందరు పూజించారు. దైవభక్తిపరుడుగా పాలు, పండ్లు తింటూ మన్యం ప్రాంతంలో సంచరించిన సన్యాసిగా కొందరు గుర్తించారు. అతడు నడిపిన విప్లవం కేవలం అతని వ్యక్తిత్వం, చాతురత, క్షత్రియ శౌర్యం, కారణంతోనే జరిగిందని, అవతార పురుషుడుగా ఉద్యమం సాగించి, అమరత్వం పొందాడని వీరగాధలు రాయబడ్డాయి.

మరోవైపు అతన్నొక అరాచకవాదిగా, హింసావాదిగా ఆ ఉద్యమం స్వాతంత్ర్యోద్యమ లక్ష్యాలను వ్యర్ధమైనదిగా గాంధేయవాదులు విమర్శించారు. ఆయన జీవితంలో (1897-1921) ఆధ్యాత్మిక, ధర్మ, నీతి, అహింసా మార్గాలలో నడిచి విసగి (1922-24) దేశపరిస్థితులను చూచి శాంతియుత ఉద్యమంలో ఆ తరువాత సాయుధ విప్లవ మార్గాన్ని ఎదర్కోవడానికి నాటి పరిస్థితులు ప్రబావం రాజకీయ మార్పులు ప్రదాన కారణం. విప్లవ పోరాట 2 సం॥ల్లో విప్లవ వీరుడుగా యుద్ధనైపుణ్యాన్ని ప్రదర్శించారు. మెరుపుదాడులు, గెరిల్లా యుద్ధ పరిస్థితుల్లో బ్రిటీష్ ప్రభుత్వాన్ని గజగజలాడించారు.

ఆయన జీవితం కేవలం 27 సం॥లు. విప్లవజీవితం 2 ఏండ్లు స్వాతంత్ర్య సంగ్రామంలో శ్రీరామరాజు జాతీయ ప్రాముఖ్యాన్ని సరిగా గుర్తించి, చారిత్రాత్మక పోరాటాన్ని భారత ప్రభుత్వం గుర్తించాలి. ఉత్తరప్రదేశ్‌లో మార్చి 23ను స్వతంత్ర యోధుల దినముగా గుర్తించిందిగాని, ఆంధ్రప్రదేశ్‌లో మే 7వతేదిన స్వాతంత్ర్య విప్లవ వీరుల దినంగా గుర్తించి జాతీయ శెలవుగా ప్రకటించాలి.

అల్లూరి జాతీయస్థాయి నాయకుడుగా, స్వాతంత్ర్య సమరయోధుడుగా విప్లవవీరుడుగా, మొట్టమొదటి ఆంధ్రలో ఎన్‌కౌంటర్‌తో తన శరీరం తూటాలతో భారతమాతకు రక్తాభిషేకం చేసిన ఘనుడు. ధైర్యశీలి, ధీరోదత్తుడు, ఆంధ్రుడు. భారతీయుడు.

భారతస్వాతంత్ర్యోద్యమంలో – అల్లూరి పాలై జాతీయ సదస్సులో ఆకాశవాణీ, విశాఖపట్టణం ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ (రిటైర్డ్) రామవరపు వేంకట రమణమూర్తి “భారతావనికి తెలియవలసిన రామరాజు” అనే పత్రిక సమర్పణలో...

సీతారామరాజు అంటే అల్లూరి సీతారామరాజు. అల్లూరి సీతారామరాజు అంటే “రామరాజు”గా బ్రిటీష్ వారి గుండెల్లో నిద్రపోయిన “విప్లవ సింహం”. కలలో కూడా “రామరాజు” పేరు విన్నా, “రామరాజు రూపం” కన్నా (చూసినా) బ్రిటీష్ వారు గడగడలాడేవారు.

అసలు “రామరాజు” అన్న పేరే చరిత్రపుటల్లో చిరస్థాయిగా నిల్చిపోయిన పేరు. తళ్ళికోట యుద్ధం జ్ఞాపకం రాగానే వెంటనే స్ఫురించే పేరు అళియ “రామరాజు” లేదా “రామరాయలు”. అలాగే బొబ్బిలి యుద్ధం పేరు వింటే (తక్కున) జ్ఞాపకం వచ్చే పేరు విజయ “రామరాజు”. ఒక తమ స్థానం ఉత్తరాంధ్రలో చెక్కుచెదరకుండా ఉండాలంటే తాము పూర్తిగా నాశనం చేయాలని బ్రిటీష్ వారు భావించిన వ్యక్తే చిన విజయ “రామరాజు”. ఇతడే చరిత్ర పుటల్లో “పద్మనాభ యుద్ధ వీరుని”గా ప్రసిద్ధి చెందిన విజయనగర సంస్థాన పూసపాటి చిన విజయ “రామరాజు” ఇక చివరిగా చరిత్ర పుటల్లో ప్రధానంగా పేర్కొనదగినటువంటి “రామరాజే” ఆనాటి, ఈనాటి, నేటి మన సీతా “రామరాజు”.

బ్రిటిష్ వారి టెలిఫోన్ తీగల వార్తల కన్నా వేగంగా స్పందించిన “మిరపకాయ టపా” లను వార్తలుగా పంపినవాడే సీతా “రామరాజు”. జాతీయస్థాయిలోనే కాకుండా, అంతర్జాతీయ స్థాయిలో నేతాజీతో పాటుగా, భగత్‌సింగ్‌కు సాటిగా, ప్రకాశం పంతులకు ధీటుగా గుర్తింపు పొందవలసిన వ్యక్తే సీతారామరాజు లేదా “రామరాజు” లేదా అల్లూరి సీతారామరాజు. భారతావనికి తెలియవలసిన “రామరాజు”కు తగిన ప్రచారం ఇవ్వవలసిన బాధ్యత మనందరిపైనా ఉంది. ఎందుకంటే చాలా చిన్న సంఘటనలు లేదా చాలా స్వల్ప సాహసచర్యలు చేసిన ఉత్తర భారతీయులకు ఎంతో ప్రచారం వచ్చినా దాదాపు రెండు సంవత్సరాలపాటు విద్యావంతులు కానివారు. ఆధునిక ఆయుధ సంపత్తి లేని కొండ ప్రాంత సహకారంతో బ్రిటీష్ వారిని ఎదిరించిన వీరకిశోరం “రామరాజు”కు భారతదేశ ఖ్యాతి రాకపోవడం బాధాకరమైన విషయం.

“పాండవులు వనవాసంలో ఉండగా కుంతీదేవి నెలకొల్పిన ఐదు (5) కృష్ణ

ఆలయాల్లో ఒకటి నేటి విశాఖపట్నం జిల్లాలోని పద్మనాభం వద్ద ఉంది. దీనిని కుంతీ మాధవస్వామి ఆలయం అంటారు. కొండపైన అనంత పద్మనాభస్వామి ఆలయం ఉంది. కొండ ప్రక్కగా పవిత్ర గోస్తనీ నది ప్రవహిస్తూ ఉంటుంది.

ఇటువంటి పవిత్ర ప్రదేశంలో 1794 జూలై 10న (పదిన) ఆంగ్లేయులతో విజయనగర సంస్థానాధీశుడు చిన విజయ "రామరాజు" యుద్ధం చేసి అమరుడయ్యాడు. రాజు చుట్టూ దాదాపు మూడు వందల మంది వీరులు వలయంగా చుట్టి రాజుకోసం ప్రాణాలు అర్పించేరు. ఇంగ్లాండులోని స్కాట్‌లాండ్‌లో జరిగిన ఫ్లోడెన్ యుద్ధం (**Flodden War**)లో కూడా ఇలాగే జరిగింది. అందుకే ఈ పద్మనాభ యుద్ధాన్ని "ఫ్లోడెన్ వార్ ఇండియా" (**Flodden War of India**) అని బ్రిటీష్ చరిత్రకారులే పేర్కొన్నారు. ఇటువంటి పవిత్ర భూమికి దగ్గరగా ఉన్న పాండ్రంకి గ్రామంలో మాతామహుల ఇంట్లో ఉద్భవించిన విప్లవ అంకురమే అల్లూరి సీతారామరాజు."[25]

ప్లాసీ యుద్ధం జరిగిన (1757) వందేళ్ళ తరువాత ప్రధమ భారత స్వాతంత్ర్య సమరం (1857) జరిగినట్లే పద్మనాభ క్షేత్రంలో ఇలాంటి సంఘటనే జరిగింది. పద్మనాభ యుద్ధం (1794) జరిగిన వందేళ్ళ తరువాత అంటే నూటమూడు సంవత్సరాల తరువాత 1897 జూలై 4న అల్లూరి సీతా "రామరాజు" అనే వీర సైనికుడు రాబోయే మన్యం విప్లవం కోసం జన్మించేడు. జన్మభూమి మట్టి వాసన, జన్మకాల సందర్భం చాలా గొప్పవి కావడంతో ఇటువంటి వీరుడు జన్మించడం సహజం కాదంటారా చెప్పండి?

ఈ రోజున నేను సీతా "రామరాజు"కు కొంతమంది గొప్ప దేశ భక్తులకు ఉన్న పోలికలు వివరిస్తాను. బ్రిటీష్ వారి పాలనకు వ్యతిరేకంగా పార్లమెంట్ భవనంపై బాంబులదాడి చేసిన భగత్‌సింగ్‌కు రాజగురు, సుఖదేవ్ వంటి ఇద్దరు వీరులు అండగా ఉంటే, రామరాజుకు గాంగంటందొర, గాం మల్లుదొరలు అండగా నిల్చేరు. గాంధీజి నుండి ప్రశంసలు పొందినా, భగత్‌సింగ్ ఎంచుకున్న మార్గాన్ని గాంధీజీ నిరసించడం జరిగింది. అలాగే ఆంధ్రదేశంలో మద్దూరి అన్నపూర్ణయ్య వంటి కాంగ్రెస్ నాయకులచే గౌరవించబడినా రామరాజు ప్రకాశం పంతులచే నిందింపబడ్డాడు. నేతాజీ సుభాష్ చంద్రబోస్ 1897 జనవరిలో జన్మిస్తే, అదే సంవత్సరం అంటే 1897 జూలై నెలలో రామరాజు జన్మించేడు. విదేశాలకు వెళ్ళి నేతాజీ ఆంగ్లేయులపై సైనిక దాడి చేస్తే, పట్టణ ప్రాంతాలు వదలి కొండల్లోకి వెళ్ళి ఆంగ్లేయులపై సాయుధదాడిని సాగించాడు రామరాజు.

నేతాజీ ఐ.సి.ఎస్. (ఇండియన్ సివిల్ సర్వీస్) పాసైనా దేశం కోసం మంచి ఉద్యోగాలు వదులుకున్నాడు. రామరాజుకు ప్రభుత్వం పైడిపుట్టలో 30 ఎకరాల భూమి ఇస్తే మూడు నెలల స్వల్ప కాలంలో దానిని వదులుకొని నేపాల్ వెళ్ళడానికి అనుమతి పొంది మన్యంలోని గూడెం కొండల్లోకి వెళ్ళిపోయాడు. బిర్సాముండా, కొమరం భీంలా గిరిపుత్రుల కోసం, భూమి పుత్రుల కోసం రక్తం ధారపోసాడు రామరాజు.

నేతాజీని గౌరవిస్తూ, ఆయన సాగించిన స్వాతంత్ర్య సంగ్రామ విధానాలకు గౌరవ అభినందనం చేస్తూ ఇక్కడ నేను ఒక మాటను చెప్పదలిచేను. సీతా "రామరాజు"కు సరియైన ప్రచారం లభించి ఉంటే నేడు నేతాజీతో సరిసమానమైన గౌరవంకు అర్హుడుగా ఉండేవాడు అని అంటూ నేతాజీ. రామరాజుల మధ్య గల తారతమ్యాలను వివరిస్తాను.

రామరాజు జన్మించిన పాండ్రంకి గ్రామం ఆంధ్రరాష్ట్రంలో ఒక మారు మూల కుగ్రామం. నేతాజీ జన్మించినది ఒరిస్సా రాష్ట్రంలోని అతిపెద్ద పట్టణమైన కటక్ (లేదా కటకం). రామరాజు తండ్రి సాధారణమైన వ్యక్తి. ఒక ఫొటోగ్రాఫర్‌గా జీవితం కొనసాగించేడు. నేతాజీ తండ్రి జానకీనాథ్ ధనికుడు, విద్యావంతుడు, ప్రముఖ న్యాయవాది. రామరాజు తండ్రి అల్లూరి వెంకట రామరాజు సీతారామరాజు చిన్నతనంలోనే అంటే రామరాజు పదకొండు సం॥ల వయస్సులో ఉండగానే చనిపోయాడు. నేతాజీ తండ్రి జానకీనాథ్ బోస్ నేతాజీకి దాదాపు 37 (ముప్పైఏడు) సంవత్సరాల వయస్సు వచ్చే వరకు ఉండి కుమారునికి దిశా నిర్దేశం చేసాడు.

రామరాజు కాకినాడలోను, నర్సాపురంలోను, విశాఖపట్నం ఎ.వి.ఎన్. పాఠశాలలోనూ చదువుకున్నాడు. కాని కాలేజీ (కళాశాల)లలో ఉన్నతస్థాయి విద్యను పొందలేదు. సుభాష్ చంద్రబోస్ కటక్‌లో చదివిన తరువాత కలకత్తా విశ్వవిద్యాలయంలోను, తరువాత ఇంగ్లాండ్‌లోని కేంబ్రిడ్జి యూనివర్శిటీలోను చదివి ఇండియన్ సివిల్ సర్వీసు (ఐ.సి.ఎస్.) పరీక్షలో విజయం సాధించేడు.

రామరాజుకు నేతాజీ వలే స్వగృహంలోను, కుటుంబపరంగాను గొప్ప గొప్ప వారిని కలిసే అవకాశం లేకపోయింది. తానే స్వయంగా దేశ సంచారం చేసి కొంత మంది నాయకులను కలుసుకోవడం జరిగింది. నేతాజీ తండ్రి న్యాయవాది కావడం, జాతీయ కాంగ్రెస్ నాయకులతో పరిచయాలు ఉండడం. తండ్రి కూడా స్వయంగా దేశాభిమాని కావడం, నేతాజీ స్వయంగా జాతీయ కాంగ్రెస్‌కు (అధ్యక్షునిగా) ఉండడం

జరిగింది. అంటే రామరాజు నేతాజీలు పెరిగిన వాతావరణం మనకు తెలుస్తోంది. నేతాజీ కలకత్తా నగర మేయర్‌గా కూడా పని చేసిన రాజకీయ అనుభవం ఉంది.

స్వాతంత్ర్య సమర సన్నాహ విషయంకు వద్దాం. రామరాజు కొండల్లోకి వెళ్ళిన తరువాత తగిన సహకారం అందించిన వారిలో ప్రథములు గాం గంటందొర, గాం మల్లుదొరలనే సోదర మన్యవీరులు. ఆ తరువాత ఎండుపడాల్, అగ్గిరాజు (వేగిరాజు సత్యనారాయణ రాజు, ప॥గో॥ జిల్లా) గోకిరి ఎర్రేసు, మెట్టడం వీరయ్యదొర (1916 "లాగరాయి" పితూరీతో సంబంధం ఉన్న వ్యక్తి) వంటి వారు కలిసేరు. అయితే వీరందరూ మన్యం వీరులే. ధన సంపత్తి గాని, మైదనా ప్రాంత ఆధునిక రాజకీయాలతో సంబంధం ఉన్నవారు కాదు.

ఇక నేతాజీ విషయానికి వస్తే జర్మనీ, జపాన్ వంటి విదేశాల అగ్రనేతలైన హిట్లర్, టోజో (జపాన్ ప్రధాని)ల వంటి వారితో ప్రత్యక్ష సంబంధం ఉన్న వ్యక్తి నేతాజీ.

నేతాజీకి జర్మనీలో ఆదేశ నిధులతో బెర్లిన్ నగరంలో "ఫ్రీ ఇండియా సొసైటీ" (**Free India Society**) ఏర్పడి తగిన సహకారం అందింది. అలాగే జర్మనీ వారి సహకారంతో నేతాజీ ఏర్పరచుకొన్న ప్రచార సాధనమే "ఆజాద్ రేడియో" (**Azad Radio**) కేంద్రం. రామరాజు విషయానికి వస్తే శాంతిపథంలో స్వాతంత్ర్య సమరం పంతుల గార్కి రామరాజు విప్లవం గూర్చి తెలియజేస్తే ప్రకాశం గారు "పెద్దాపురం కాంగ్రెస్ వారు పోలీసు స్టేషన్లు దోచుకునే దోపిడ గాండ్ర వద్దకు, బందిపోటుల వద్దకు ఎవరూ పోరాదని" బ్రహ్మజోస్యుల సీతారామయ్య పేర తంతి పంపేరని "కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో" పేర్కొనడం జరిగింది.

ఇక రామరాజు, సుభాష్ చంద్రబోసులకు విప్లవానికి కావలసిన వనరులు ఎలా అందాయో చూద్దాం. అల్లూరి సీతారామరాజు విషయానికి వస్తే స్వదేశాయుల నుండి చెప్పుకోదగిన ఆర్థిక సహాయం అందలేదు. అంతేకాకుండా రామరాజు కొండ ప్రాంతం వారిని జాగృతం చేయడం వలన పల్లపు ప్రాంత వ్యాపారులు సరుకులు కొనే విషయంలో కొండ వారిని మోసం చేసే అవకాశం తగ్గిపోయింది. దీని వల్ల ఈ మైదాన ప్రాంత వ్యాపారులు కూడా రామరాజుపై కినుక వహించేరు. నేతాజీకి జర్మనీ, జపాన్ దేశాల సహకారం అందింది. వారి ద్వారా అనేక వనరులు అందేయి. రామరాజు కార్యస్థానం మన్యం ప్రాంతం అంటే తూర్పుగోదావరి, విశాఖపట్నం, బస్తర్ ప్రాంతాల మధ్యనున్న

కొండ ప్రాంతం. సైనికులు ఎవరంటే మన్యంలో నివసించేవారే. వీరికి ఆధునిక ఆయుధ శిక్షణ లేదు. సంప్రదాయ విధానాలు, దోపిడీ చేసిన పోలీసు స్టేషన్‌లలోని ఆయుధాలు మాత్రమే ఉండేవి.

నేతాజీ విషయంకు వస్తే ఇండియన్ నేషనల్ ఆర్మీ (**Indian National Army**) అంటే **I.N.A.** అన్నది ఏర్పడడానికి జపాన్‌కు చెందిన మేజర్ ఇవాజీ పుజివరా ఆలోచనే కారణం. ప్రముఖ విప్లవ వీరుడు అయిన రాస్ జహారీ బోస్ నాయకత్వంలో జపాన్‌లోని ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ శాఖ, ప్రీతంసింగ్ థిల్లాన్ నాయకత్వంలోని బ్యాంకాక్ (థాయ్‌లాండ్)లోని ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ శాఖ, ఇంకా జపాన్ వార్కి లొంగిపోయిన మలయా ప్రాంతంలోని బ్రిటీష్ ఆర్మీ కెప్టెన్ మోహన్‌సింగ్ నాయకత్వంలోని సైన్యాల సమాహారంతో ఇండియన్ నేషనల్ ఆర్మీ (**I.N.A.**) తయారైంది. సింగపూర్‌లో 1943 జూలై నెలలో నిర్వహించిన సమావేశంలో రాస్ బిహారి బోస్ ఈ. ఐ.ఎన్.ఎ. (**I.N.A.**) నాయకత్వాన్ని నేతాజీకి అందజేసారు. అంటే జపాన్‌కు లొంగిపోయిన బ్రిటీష్ సైనికుల (ప్రిజనర్స్ ఆఫ్ వార్) లోని భారతీయ సైనికులు ఎన్నో వేల మంది ఇందులో ఉన్నారు. రామరాజు సైన్యంలా కాకుండా ఇలా సుశిక్షితమైన సైన్యం నేతాజీకి లభించింది.

రామరాజు మిరపకాయ టపాలు, మనుషుల ద్వారా వార్తలు పంపడం చేసేవాడు. నేతాజీ జన్మనీ సహకారంతో ఏర్పాటు చేసుకొన్న “అజాద్ రేడియో” కేంద్రాన్ని తన విప్లవ ప్రచారానికి ఉపయోగించేడు. వివిధ భారతీయ భాషలు ఇంకా ఆంగ్లభాష ద్వారా తన సందేశాలను ప్రపంచ ప్రజలకు తెలియజేసేవాడు. నేతాజీ బారతదేశం వెలుపల ఉంటూ మాతృదేశ కోసం అంకితమైతే రామరాజు బ్రిటీష్ వారు పాలిస్తున్న భూభాగంలోపలే ఉంటూ ఆంగ్లేయుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించేడు.

నేతాజీ తనకు లభించిన సైనిక శక్తికి మాతృదేశ భక్తిని నూరిపోస్తూ, వారిలో దేశ స్వాతంత్ర్య సంపాదనా కాంక్షను రగిలిస్తూ రెండో ప్రపంచ యుద్ధ కాలంలో మలయా, బర్మా ప్రాంతాలతో కదం త్రొక్కుతూ ముందుకు సాగేడు. అండమాన్‌లోని పోర్టు బ్లెయిర్ (**Port Blair**)లో (31.12.1943) 1943 డిసెంబర్ 3న జాతీయ జెండాను ఎగురవేసి తొలిసారిగా అండమాన్‌కు బ్రిటీష్ నుండి విముక్తి కల్పించేడు. నేతాజీ సైన్యంలోని ఒక విభాగం కల్నల్. ఎస్.ఎ. మాలిక్ (**Col. S.A. Mallick**) బారత భూభాగంలోనికి చొచ్చుకొని 14 ఏప్రిల్ 1944న మణిపూర్‌లోని మొయిరంగ్ (**Moirang**) (ఈశాన్య భారత భూభాగం)లో భారత జాతీయ పతాకంను సగర్వంగా ఎగురవేసాడు. అంతకుముందే

1944 మార్చి 18న ఐ.ఎన్.ఎ. (**I.N.A.**) సైన్యం బర్మా సరిహద్దు దాటి భారత భూభాగంలోకి వచ్చిన సందర్భంగా నేతాజీ 1944 మార్చి 21న పత్రికా సమావేశం నిర్వహించేడు.

ఇక రాజ రాజ విషయానికి వస్తే రాజు విప్లవ సేన 1922 ఆగష్టు 22న తొలిసారిగా దాదాపు 150 మన్యం వీరులతో కలసి చింతపల్లి పోలీస్ స్టేషన్‌పై దాడి చేసి విజయుడయ్యాడు. ఇలా కృష్ణదేవిపేటపై దాడి జరిగింది. రాజవొమ్మంగి దాడిలో (1922 ఆగష్టు 24) జైలులో ఉన్న గూడెం ముఠాదారుడు మెట్టడం వీరయ్య దొరను (1916 లాగరాయి పితూరీ వీరుడు) విడుదల చేసేడు. రామరాజు సైన్యం 1922 సెప్టెంబర్ 24న మొగిలి దొడ్డి ఘాట్ వద్ద (ధారకొండ – గాలికొండల మధ్యలోయ) బ్రిటీష్ సైనిక అధికార్ల స్కాట్ కవర్డ్ (**Scot Coward**) హైటర్ (**Heightes**)లను కాల్చివేసారు.

బ్రిటీష్ వారి అపార సైనికశక్తి, ఆధునిక యుద్ధ పరికరాలు, మన్యం ప్రాంత ప్రజలపై బ్రిటీష్ వారి దమననీతి, అందరూ ప్రజల నుండి సరియైన సహకారం లభించకపోవడంతో రామరాజు విప్లవ సైన్యం ముందుకు సాగలేకపోయింది. ఇలా మలుపులు తిరిగిన విప్లవం 1924 మే నెల 7వ (**Seven**) తేదీన కంచుమీనన్ ఆధ్వర్యంలో పోలీసులు రామరాజును బంధించడం, ఆ తరువాత రామరాజును కాల్చివేయడంతో విప్లవం అణగారిపోయింది. చిట్టచివరి వీరుడు గాం గంటం దొర 1924 జూన్ 7న జరిగిన యుద్ధంలో అసువులు బావడంతో రామరాజు విప్లవం వేడి సంపూర్ణంగా చల్లారిపోయింది. రెండో ప్రపంచయుద్ధంలో తొలిరోజుల్లో విజయ పథాన నడిచిన జర్మనీ–జపాన్ సైన్యాలు తరువాతి కాలంలో వెనుకంజ వేయడం, తత్ఫలితంగా నేతాజీకి వారి సహకారం అందకపోవడం ఇంకా ఇతర కారణాల వలన నేతాజీ విప్లవం కూడా అణగారిపోయింది.

అయితే ఈ రెండు విప్లవాలు అణగారిపోయినా అవి భారతజాతి వీరుల్లో ప్రేరేపించిన స్వాతంత్ర్య కాంక్ష మాత్రం విత్తనం స్థాయి నుండి మహావృక్షం స్థాయికి పెరిగి రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్య సౌధాన్ని కూకటి వేళ్ళతో పీకివేసింది.

సీతారామరాజు, సుభాష్ చంద్రబోస్‌ల విషయంలో మాత్రం ఒక విషయం మనం గుర్తించాలి. అటు విదేశీయుల దృష్టిని భారత స్వాతంత్ర్య సమరం వైపు మరలించడంలో నేతాజీ ఎలా కృతకృత్యుడయ్యాడో అలాగే దేశీయులలో ముఖ్యంగా నిరక్షరాస్యులైన మన్యం

వారి దృష్టిని బ్రిటీష్ వారిని ఎదుర్కోవడంపై కేంద్రీకరింపజేయడంలో సీతారామరాజు అలా సఫలీకృతుడయ్యాడు.

ఇంతవరకు నేను చేసిన "నేతాజీ రామరాజుల" తులనాత్మక పరిశీలన కేవలం రామరాజు ఎన్ని పరిమితులకు లోబడి బ్రిటీష్ వారిని ఎదిరించేడో చెప్పడానికే గాని, నేతాజీని తక్కువ చేసి చెప్పడానికి కాదు. మచ్చలేని ఇద్దరు శూరులైన ఇటువంటి పుత్రులను కన్న భారతమాత ఎంతటి అదృష్టమూర్తో కదా! అని ముగించారు.

అల్లూరి అనుసరించిన మార్గాలు అనే పరిశోధనా పత్రంలో...

## అల్లూరి సీతారామరాజు అనుసరించి మార్గాలు:

అల్లూరి సీతారామరాజు రెండు విభిన్న కోణాలు కలిగిన దేశభక్తుడు. ఒకటి యోగిగా, రెండు యుద్ధ వీరుడుగా. యోగిలాంటి ఒక వ్యక్తి యుద్ధవీరుడు అవడం ప్రపంచ చరిత్రలో ఎక్కడా లేదు. యోగి ఎప్పుడూ యుద్ధవీరుడు కాడు. యుద్ధవీరుడు యోగిగా మారాడు. ఇవి రెండు ఒకే మనిషిలోనే ఉండటం చాలా అరుదైన విషయం. అలాంటి వ్యక్తి దేశభక్తుడు కావడం అరుదు.

అల్లూరిని ఎక్కువ విప్లవకారుడుగా చూస్తారు. కాని విప్లవ వీరుడు కాలం (1922-1924) చాలా తక్కువ. మిగిలిన జీవితం యోగిగా, దేశభక్తుడుగా, యుద్ధవీరుడుగా విభిన్న మార్గాలు అనుసరించారు.

## భారతదేశంపై అవగాహన - రాజకీయాలపై చర్చ:

"1916 ఏప్రిల్ 26వ తేదీన శ్రీరామరాజు కాలినడకతో ఉత్తర భారత దేశ యాత్ర ప్రారంభించాడు. ఆనాడు కలకత్తా రాజకాయిలకు ముఖ్యకేంద్రము. అక్కడ ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు. ఆజన్మ బ్రహ్మచారి సురేంద్రనాద్ బెనర్జీ అనుకోకుండా పరిచయం, అప్పటికి శ్రీరామరాజుకు 19 సంవత్సరాలు వయసు. 1916 లక్నోలో జరిగిన జాతీయ కాంగ్రెసు మహాసభకు హాజరయ్యాడు. ఆ సమయంలో సురేంద్రనాద్ దగ్గరకు మోతిలాల్ నెహ్రూ, మదన్ మోహన్ మాలవ్యా, చిత్రరంజన్ రామ్ మొదలైన కాంగ్రెసు నాయకులు వచ్చి నాటి రాజకీయ పరిస్థితులు చర్చిస్తుండేవారు. శ్రీరామరాజు వారి చర్చల్లో పాల్గొనేవారు. పరిస్థితులను స్థితిగతులను అవగాహన చేసుకునేవారు.

శ్రీరామరాజు ఉత్తరప్రదేశ్‌లో గల అన్ని పుణ్యక్షేత్రములను కాలినడకనే దర్శించి, మతములలోనున్న పద్ధతులు, ఆచారములు, సంప్రదాయములు పరిశీలించాడు. మానవత్వమునకు, హేతువాదమునకు, భక్తితత్వములకు ఉన్న భిన్నమైన సంబంధమును జీర్ణించుకున్నాడు. కులవ్యవస్థను, అస్పృశ్యతను రూపుమాపుటకై కంకణం కట్టుకున్నాడు. భారతదేశాన్ని, దేశపరిస్థితులను దేశ ప్రజల స్థితిగతులు పూర్తిగా తెలుసుకొని పరిపూర్ణుడుగా తిరిగి వచ్చాడు."[26]

## 1. సత్యమార్గం – తపస్వీగా అల్లూరి:

1917వ సంవత్సరం జూలై 24 తారీఖు విశాఖ జిల్లా గొలుగొండ తాలూకా (మండలం) గల కృష్ణదేవి పేట నుండి కాస్త దూరంగానున్న దట్టమైన ఏజెన్సీలోకి అడుగులేస్తున్న శ్రీరామరాజు ప్రచండమైన సూర్యుని తేజస్సులో నూనూగు మీసాలు, పెరిగిన గెడ్డం, పసిమిచ్ఛాయ శరీరంతో విశాలమైన నుదురు ఆజానుబాహుడైన ఆ యువకుడు 5 అడుగుల 4 అంగుళాలు ఎత్తులో వెళ్తున్న శ్రీరామరాజును గ్రామస్తులతో బాటు గ్రామ పెద్ద చిటికెల భాస్కరనాయుడు ఆసక్తిగా చూచాడు.

శ్రీరామరాజు మొహంలో కనిపిస్తున్న తేజస్సుకు కళ్ళలో కనిపిస్తున్న కాంతిని చూచిన భాస్కరనాయుడు ఆయనకు భక్తితో నమస్కరించి, భోజనానికి ఏర్పాటు చేయడానికి సిద్ధమైనాడు. అయితే తనకు పండ్లు, పాలు తప్ప మరేమి వద్దని శ్రీరామరాజు చెప్పడంతో భాస్కరనాయుడు ఏర్పాటుచేశారు. తాను తపస్సు చేసుకోవడానికి ఇక్కడకు వచ్చానని సత్యమే దైవానికి సరియైన పేరు, సత్యమున్నచోట జ్ఞానముంటుంది. సత్యమును శోధించి కనుగొనడమనేది అంత సులభమైన పనికాదు. దానికి తపస్సు అవసరము.

తపస్సు అనగా కష్టములను సహించుట, ఇతరులకు కష్టములు కలిగించకుండుట, స్వార్థత్యాగము, స్వయంగా కష్టనిష్టురాలకు తలమొగ్గడం, చివరకు ప్రాణాలు అర్పించడానికి సిద్ధమవడం.

సత్యమనే ధర్మమును మనం మనస్ఫూర్తిగా అనుసరిస్తే ఇతర ధర్మములు ఏవి అనుసరించకపోయిన అందువల్ల హాని యేమి కలగదు అని శ్రీరామరాజు చెప్పడంతో దానికి భాస్కరనాయుడు ఆర్యా! అదిగో ఆ కనిపించేది "ధార" పర్వతం, అది తపోవనం, అక్కడ మీ తపమునకు ఏ ఆటంకము రాదు అని చెప్పాడు.

అందుకు శ్రీరామరాజు ధార పర్వతమునకు వెళ్ళి తపమాచారించసాగాడు. అప్పుడప్పుడు గ్రామంలో ప్రజలు వస్తుండేవారు. రామాయణ, భారత, భగవద్గీతాదులు పఠించుచు అందులో నీతి, ధర్మ, శాంతి సూత్రాలను ప్రజలకు బోధించుటకు, పేదవారియందు, అభాగ్యులందు, దయ, కరుణ వాత్సల్యము చూపించేవాడు.

## 2. శాంతి – అహింస మార్గంలో అల్లూరి శ్రీరామరాజు:

తూరుపు కొండల నడుమ కృష్ణాదేవి పేట నీలకంఠేశ్వరాలయంలో జమగంట మోగించాడు. అతని దివ్యకాంతులను వెదజల్లుతున్న ధర్మదేవతలాగే భావిస్తున్నాడు. తన తేజస్సుతో పారాయణం పూర్తికాగానే గీతాధృక్పథంపై నూరు వరహాల పూవు ఒకటి ఉంచివేశాడు.

పలు కష్టములలో నున్న ప్రజలు శ్రీరామరాజుని దర్శించినప్పుడు, ధర్మకార్యములు, నీతి, జ్ఞానము మొదలైన శాస్త్రముల గూర్చి మరియు సూర్యోపాసన కూడా బోధించేవారు. సూర్యోపాసనమును ఆచరించు విధానమును అందరికి సులువుగా చేసిచూపెను.

ప్రతి రోజు సూర్యునికి నమస్కరింపవలయును అయితే తాగుడు మాననప్పుడే యీ వ్రతము ఫలితమగునని హెచ్చరించిరి. ప్రజల తాగుడు మాని, దాస్య విముక్తికి ఉపాసన సంఘాలను తమ పల్లెల్లో స్థాపించిరి.

శ్రీరామరాజు బోధనలు మన్యప్రజల్లో ఐక్యతను తెచ్చాయి. ఏ ప్రాణినైనా హింసించకపోవడం మాత్రమే అహింసకాదు. చెడుపని, తొందరపాటు, అబద్ధమాడుట, ద్వేషం, అపకారం వీటన్నింటి వలన అహింసా సిద్ధాంతం దెబ్బతింటుంది.

అహింస లేకుండా సత్యాన్వేషణ కుదరదు. అహింసకు మూలం ప్రేమ. అహింసాదారి, సత్యము గమ్యము దారి తప్పక ముందుకు నడిస్తే ఏదో ఒకనాటికి మంచి గమ్యము చేరుతాం. ఒక్క ధర్మమునకు మాత్రమే ప్రేమ ఆధారమని తెలియని వాళ్ళు అంటారు. కాని ధర్మబద్ధం కాని పనులకు కూడా ప్రేమ ఆధారం. దానిని అర్థం చేసుకుంటే అంతిమ విజయం మనదే. నీతి, న్యాయము కలిగి, ఇతరులకు ఉపకారం చేస్తూ, జీవించేవారిని లోకం ఎప్పుడు స్మరిస్తూ ఉంటుంది అని అక్కడ ప్రజలకు హితబోధ చేసేవాడు.

### 3. బ్రహ్మచర్యము అవలంభించుటలో శ్రీరామరాజు:

స్వాతంత్ర్య పోరాటంలో మనకు కావలసిన స్వేచ్ఛ కొరకు కొన్ని చర్యలు అవలంభించాలని, అందులో బ్రహ్మచర్యము ఒకటి. బ్రహ్మచర్యము అనే మాటకు 'చర్య' అనగా పని చేయుట. బ్రహ్మము లేక సత్యాన్ని వెదుకుటకు బ్రహ్మచర్యం అవసరం. అన్ని ఇంద్రియావయములను సంపూర్ణముగా మన వశము చేసుకోవడమే బ్రహ్మచర్య అనే మాటకు నిజమైన సరియైన అర్థము. శరీరాన్ని అదుపులో ఉన్న మనస్సు ఉండదన్న అందరిభావన.

కనుక ఎల్లప్పుడు శరీరాన్ని వంచి ఉంచి, మనస్సును ఎగురనీయరాదు. బ్రహ్మచర్యం అంటే ఎల్లప్పుడు శరీరాన్ని అదుపులో ఉంచి, పాసవిక వాసనను తరిమికొట్టడం మాత్రమే కాదు. ఇది అన్ని ఇంద్రియాలకు అరికట్టడం, శృంగార దృశ్యాలు చూడడం, అట్టి వర్ణనలు వినడం, వాసనను పెంచే తిండి తినడం, ఉద్రేక పరిచే స్పర్శలు ఇటువంటివి నిప్పులో చెయ్యి పెట్టి కాలదు అనుకోవడం వంటిది. అన్నిటి నియంత్రణ అత్యవసరం. అన్ని పద్ధతులలో బ్రహ్మచర్య మార్గాన్ని అనుసరిస్తే అది విజయం, ఆరోగ్యం, సిద్ధి కలిగిస్తుంది అని బోధించేవాడు.

శ్రీరామరాజు బోధనలు మన్యప్రజల్లో ఐక్యతను తెచ్చాయి. ఆయన మాటలు వేదవాక్కుగా అందరూ భావించారు. శ్రీరామరాజు ఉండే ప్రాంతం ఓమని ఆశ్రమమంతా వినిపించేది. ఎందుకంటే వాళ్ళతో బాటు మరికొంతమంది చుట్టుప్రక్కల గ్రామస్తులు ప్రతీరోజూ శ్రీరామరాజు దర్శనానికి వస్తుండటం చేత శ్రీరామరాజు ఆధ్యాత్మికతతో పాటు దేశ రాజకీయాలు గురించి, పరాయిపాలన గురించి కూడా వాళ్ళకు చెబుతుండేవాడు.

### 4. యోగా ప్రక్రియలో అల్లూరి శ్రీరామరాజు:

అల్లూరి శ్రీరామరాజు శరీరాన్ని ఆధీనంలో ఉంచుటకు అనేక యోగా ప్రక్రియలను అనుసరించేవాడు. ప్రతిరోజు తెల్లవారుజామున మూడు గంటలకు నిద్రలేచి కోనేటిలో స్నానం చేసి, కాషాయ వస్త్రాలు ధరించి, కోదండము, కమండలము ధరించి అక్కడే వున్న పెద్దరాతిపై తూర్పు దిక్కున ముఖం పెట్టి పద్మాసనంలో కూర్చునేవాడు. మధ్యాహ్నం 12 గంటలకు తపస్సు, జ్ఞాన సమాధి నుండి లేచి తిరిగి స్నానమాచరించి యింటికి వచ్చి ఒక పండు భుజించి, ఒక గ్లాసు పాలు తాగిన తరువాత పంచాయితీకి వెళ్ళేవాడు.

మితంగా భుజించడం, యోగా, తపస్సు. జ్ఞానము చేసి శరీరాన్ని మనస్సును, తన ఆధీనంలో పెట్టుకొని ఒక మహాఋషిగా, యోగిగా, శాంతిమార్గాలలో స్వాతంత్ర్య పోరాటాన్ని ఉత్తేజపరిచేవాడు.

పంచాయితీలో ప్రజలకు అనేక ఉపన్యాసాలు చేసేవాడు. వాళ్ళను చైతన్యవంతులు చేయడానికి కృషి చేసేవారు. ఆయన ఉపన్యాసాలతో చౌర్యమంటే ఇతర వస్తువు సంగ్రహించడమే కాదు. పిల్లలకు తెలియకుండా తండ్రి దాచిపెట్టడం కూడా దొంగతనమే. ఇతరుల ఆస్థిని వారి అనుజ్ఞతో తీసుకొనుట దేనినైనా తగు అవసరం లేకుండా సంగ్రహించుట దొంగతనమే, తెలియకచేసినా ఇది తప్పే? సరిగా ఆలోచిస్తే, మనకు కావలసినది ఎంత? అంతకు మించి ఉంచడం తప్పే కదా? నిజమైన బుద్ధితో గట్టిగా దొంగతనాన్ని పరిహరించడం, ఆవశ్యకతలను తగ్గిస్తుంది. లోకంలో గల దు:ఖాకరం దారిద్ర్య అంతమవుతుంది.

బతకడానికి తినాలి కాని తినడానికి బ్రతక కూడదు. బ్రహ్మచర్య పాలనకు జిహ్వారచనల రుచి గ్రహణ విషయాల గురించి అదుపు అవసరం. మనసులో చాలా మంది భోగవిలాలసాలతో ఇంద్రియాలకు బానిసలు అవుతాము. ఆరోగ్యవంతులు ఒక్కరు కూడా కనిపించరు. ఎక్కువైన తిండి వలన కలిగే అసౌకర్యం ఉపవాసాలతో సర్దుకుంటుంది.

ధర్మాన్ని నమ్మి మనసారా అనుసరించుట నిలుపుకోవడం పురుషార్థం. అట్టి పూర్ణ మానవుడు భగవానుడు యోగి అనిపించుకుంటాడు. బలహీనమైన మనం నిరంతరం అద్భుతమైన వస్తు జ్ఞానం వల్ల అసహజమైన జిహ్వాగుణాలను మాయం చేద్దాం అని ఆటవిక జాతులను, మన్యం ప్రజలలో ప్రబోధించేవాడు.

## 5. ఆత్మ ప్రబోధనలలో అల్లూరి:

ఒకనాడు అడవికి సంబంధించిన అధికారి ఒకరు రామరాజు దర్శనమునకు రావడం జరిగింది. అతను శ్రీరామరాజుతో అయ్యా! ఈ మధ్య మన్యం ప్రజలు మా మాట లెక్కచెయ్యడం లేదు! దీనికి కారణం... అని అనుమానంగా ప్రశ్నించారు.

గౌరవంగా మహాశయా! ఈ ప్రజలు ఈ నేలపై పుట్టారు, వారు అడవి తల్లి బిడ్డలు ఆ తల్లిని విడిచిపెట్టి ఎక్కడకు పోగలరు. వారు అడవిలో కలపకొట్టిన యెడల మీరు చర్య తీసుకోండి. కాని మీరు వాళ్ళ కోళ్ళను, మేకలను దొంగలించడం వారిపై

దౌర్జన్యము చేయడం, వారి ఆడకూతుళ్ళను అమర్యాద చేయడం, అత్యాచారం చేయడం సహించరాని విషయాలు. అడవిలో పుట్టినంత మాత్రంలో వాళ్ళు మనుషులు కారా? చెప్పండి.

ధనం, శరీరం, బంధుప్రీతి లేనివాడు మనసుకి భయం ఉండదు. భౌతికాన్ని త్యజించి ఆస్వాదించు అను సిద్ధాంతంలో దీనాదుల అస్తిత్వాన్ని స్వీకరిస్తూనే అవి భగవంతునికి చెందినవి మనవి కావు అని అనుకుంటే చాలు. నేను కూడా ఆ పరమాత్ముని ఆస్థిని అని భావించాలి. మనం ధర్మకర్తలం మాత్రమే. స్వంతదారులం కాము. మనకు దైవం వాటిని రక్షించే శక్తి యిస్తారు. యజమాని సేవకుడై కాలి క్రింద ధూళిగా మారినవాడు భయములన్ని మంచులా కరిగి పటాపంచలైపోతాయి.

ఇతరుల నుండి ఏమి ఆశించరాదు. అవసరం లేనప్పుడు దేనికైనా స్వంతం చేసుకుంటూ ఆ స్థితిని తస్కరించబడినదని అనాలి. రేపటికి ప్రోగుచేయడం తప్పు. భగవంతుని నమ్మితే మనకు ఏలోటు లేకుండా చేస్తాడు.

పూర్వీకులు అతి దానాన్ని నమ్మి వర్ణించారు. దైవశాసనమిది. ఇది గ్రహించక అసమానత కొని తెచ్చుకుంటున్నారు. శరీరం ఉన్నప్పుడు సేవచేస్తాం. సంపాదన కోసం ఆర్తి చెందడం, తింటాం, తాగుతాం, విశ్రమిస్తాం, మేల్కొంటాం అని మానవసేవ కొరకే ఇది నిత్య ఆనందదాయకమైన అనుభూతి. సాత్విక భావంతో సేవాదృష్టితో క్షణం తీరిక లేకుండా విచక్షణాయుత సుకార్య నిర్వహణ నిరంతర ఏకాగ్రతతో చేస్తుండాలి.

శ్రమతో జీవించిన జీవనమే మంచిది. సత్యాన్వేషి, అహింసా వారికి శరీర కష్టం ఒక వరమై బ్రహ్మచర్య పాలన సహజంగా సుకరమవుతుంది. వ్యవసాయానికి చెందినదే శరీరకష్టం. దీనిని ఆదర్శంగా తీసుకొని చేతివృత్తులను అవలంభించి సుఖపడాలి. మనచుట్టు ప్రక్కల మన అవసరాలను తీర్చగలిగినవారు ఎవరున్నారో గుర్తించి వారికి మన అవసరాలు ఏవిధంగా తీర్చాలో తెలియపోతే తెలియపర్చడం మన కర్తవ్యం అని బోధించాడు.

ఒక రోజున కృష్ణదేవిపేట పోలీసుస్టేషన్ సమీపంలో కొంతమంది జూదమాడు చుండగా రామరాజు అటు వెళ్ళడం జరిగింది. శ్రీరామరాజును చూచిన వారందరూ గౌరవంతో పారిపోయారు. అక్కడే ఉన్న కానిస్టేబుల్ ఆయనకు నమస్కరించాడు. నువ్వు శాంతి భద్రతలు కాపాడవలసిన వాడవని చాలా గొప్పలు చెప్పుకొందువు. మరి ఈ

జూదమేమిటని రామరాజు నిలదీయటంతో ఆ పోలీసు అక్కడ నుండి సిగ్గుతో వెళ్ళిపోవుటకు ప్రయత్నించారు.

అప్పుడు శ్రీరామరాజు ప్రజలతో సత్సంబంధాలు పెట్టకుంటే మీకు మంచిది. ప్రజలెల్లప్పుడు ఒకే విధంగా వుంటారనుకొవడం పొరపాటు అది ప్రశాంతంగా కనిపించే అగ్నిపర్వతం వున్నట్లుండి ఒకేసారిగా బ్రద్దలై మిమ్మల్ని మీ ప్రభుత్వాన్ని లావాతో మాడ్చి మసి చేయక తప్పదు అని శాంతంగా హెచ్చరించాడు.

## 6. మత్తుకు దూరం, మన్యం శాంతి సమరంలో అల్లూరి:

శ్రీరామరాజు కోటనందూరులో చదువుకున్నప్పుడు చూసిన పీడిత జనబాధలు మన్యానికి సంబంధించి వచ్చాయి. కనుకనే అక్కడ శ్రీరామరాజు బాలయోగిగా వెలిశాడు. ఊరి శివార్లలోని కోనేటిలో స్నానం చేసి, కాషాయ వస్త్రాలు ధరించి, కోదండము కమండలము తీసుకొని ధ్యానం చేయుటకు ఉపక్రమిస్తున్నాడు. అప్పటికి అతని చుట్టూ సాష్టాంగపడి వున్న జనం వారిలోంచి ఒక అవ్వ, రామరాజు దగ్గరకు వెళ్ళి "స్వామి! ఆ వేళ మీరు ఆశీర్వదించారే... దాన్ని మొగ్గు కొట్టేసిండు, సావు బతుకుల్లో వుందని" అంటూ లబోదిబోమంటూ ఏడుస్తూ చెప్పింది.

గుండెల మీద పడుతున్న గెడ్డం, వెనుక వేలాడుతున్న ఉంగరాల జుట్టు, నుదుట సింధూర తిలకం, కాషాయ వస్త్రాలు, వెలిగిపోతున్న వదనంతో ఆ అవ్వ వెంట శ్రీరామరాజు వెళ్ళి అస్త్రీ, ముఖం మీద కమండలంలోని నీళ్ళు జల్లాడు. ఆమె తెప్పరిల్లింది. అంతవరకు మైకంలో ఉన్న ఆమె మొగుడు మల్లుదొర మైకం దిగిపోయి శ్రీరామరాజు అంతటి మహాపురుషుడు తన యింటికి వచ్చి తన భార్యను బ్రతికించి తనకు కనువిప్పు చేసినందుకు బాధపడి తన తప్పు తెలుసుకున్నాడు.

"చేసిన పాపానికి, దానినన్న మాటలకి నాలుక కోసేసుకుంటానని కత్తి తీశాడు" మల్లుదొర. నాలిక కోసుకున్నంత మాత్రాన పాపం పోదు అని శ్రీరామరాజు చెప్పాడు. "మరెలా పోతది" అని మల్లుదొర ప్రశ్నించాడు. "ఈ తప్పుకి కారణమైన తాగుడు మానాలి" నువ్వు ఒక్కడివే మానడం కాదు. అందరిచేత మానిపించాలి.

తాగుడికి బానిస బ్రతుకుల నుండి మన్యాన్ని, బ్రిటీష్ వారి బానిస బ్రతుకుల నుండి దేశాన్ని కాపాడవలసిన బాధ్యత మనందరిపై ఉందని ప్రబోధం చేశాడు. అప్పుడు

అలాగే బాలయోగి సామి అని అందరూ ప్రమాణం చేశారు. 'బాలయోగికి జై' అనే నినాదాలు చేశారు. తాగుడు మానాలన్న అతని సందేశం మారుమూలకి కూడా పాకిపోయింది. గాంధీజీ ఆశ్రమంలో ఒకటైన మద్యం, మత్తు నిషేధం అమలుపరుచుటలో శ్రీరామరాజు విజయం సాధించారు.

ఆనాటి నుండి పల్లెల్లో తాడిచెట్లకి, ఈతచెట్లకి ఉన్న కుండలన్నీ పగులగొట్టబడ్డాయి. శ్రీరామరాజు మన్యం ప్రజలతో త్రాగుడు మానిపించాడు. మొదలైన దురలవాటుల నుండి దూరం చేసి, వారిని ఆధ్యాత్మిక, సేవారంగాల వైపు మరియు స్వాతంత్ర్య పోరాట దీక్షకు నిమగ్నం చేశాడు.

## 7) గ్రామ స్వరాజ్యంలో శ్రీరామరాజు:

గాంధీజీ ఆశయాలలో గ్రామ స్వరాజ్యం ఒకటి. ఒక రోజు మాటల సందర్భంలో చిటికెల భాస్కర నాయుడుతో గ్రామీణ వ్యవస్థ గురించి చర్చిస్తూ దీనికాక పంచాయితీ ఏర్పరిస్తే మనం, మన చుట్టూ ప్రక్కల గ్రామాలలో నున్న ప్రజలకు చదువు, సంధ్యలు ఏర్పాటు చేయవచ్చుననడం జరిగింది.

దీనితో గ్రామాల్లో జరిగే చిన్న చిన్న తగాదాలు గురించి, ఇతరుల వ్యవహారాల గురించి ఎవరు కోర్టులు ఆశ్రయించరాదు. దీని వలన డబ్బు, అమూల్యమైన కాలం ఎంతో వృధాకావడమే కాకుండా మానసిక ఆందోళనతో పాటు మనుషుల మధ్య వైరుధ్యాలు పెరుగుతాయని అందరికి చెప్పి గ్రామీణ వ్యవస్థకు పునాది వేశారు.

చెడు అలవాట్ల నుండి త్రాగుడు నుండి, మనల్ని రక్షించాడు. అక్కడ తపస్సు చేస్తూనే 'మానవ సేవయే మాధవ సేవ' అన్న సత్య దృష్టితో రోగులకు వనమూలికా వైద్యం మొదలుపెట్టారు. పాఠశాల పెట్టి చదువులు చెప్పడం.

గ్రంథాలయ స్థాపన వంటివి చేపట్టి అపరదన్వంతరిగా, జ్ఞాన బోధకుడుగా అక్కడి వారి మనసుల్లో సుస్థిర స్థానాన్ని సంపాదించుకోగలిగారు. శ్రీరామరాజు బోధనలతో మన్య ప్రజలు చైతన్యవంతులై అడుగడుగునా తమను పీడించే ప్రభుత్వోద్యోగులను ఎదిరించి, వాళ్ళలో ఆత్మస్థైర్యాన్ని, జ్ఞాన బోధకుడుగా అక్కడి వారి మనసుల్లో సుస్థిర స్థానాన్ని సంపాదించుకోగలిగారు. శ్రీరామరాజు బోధనలతో మన్య ప్రజలు చైతన్యవంతులై అడుగడుగునా తమను పీడించే ప్రభుతోద్యోగులను ఎదిరించి, వాళ్ళతో ఆత్మస్థైర్యాన్ని,

జ్ఞానాన్ని, నాగరికతను పెంపొదించుటకు ఆయన ఎన్నో కార్యక్రమాలు చేపట్టారు.

వైద్యం అంటే విముఖత చూపించే కొండ ప్రజలను మూఢనమ్మకాల నుండి విముక్తి చేసి వాళ్ళ రోగాలకు మందులిచ్చి నయం చేసేవాడు. అనేకమందిని దురలవాట్ల నుండి మానిపించేవాడు.

శ్రీరామరాజు గొప్ప యోగీశ్వరుడని ఆయన వద్ద అనేక మహిమలున్నాయని ఆయన చేయిపడితే ఎంతటి రోగమైనా ఇట్టే మాయమవుతుందని ఆయన కాళీమాత వరసంపన్నుడనీ, మంత్రశాస్త్రవేత్త అని మన్యం ప్రజల్లో నమ్మకం ఉండేది.

కాలగమనంలో సత్వర న్యాయం, సామాజికాభివృద్ధి కోసం రాజు స్థాపించిన గ్రామ పంచాయితీలు ప్రజల పాలిట వరప్రసాదాలయ్యాయి. అదే సమయంలో మానవసేవకుగాను తెల్లదొరలు కన్నెర్రకు గురై కోర్టులో దోషిగా నిలబడవలసి వచ్చినా... చెక్కుచెదరని ఆత్మవిశ్వాసంతో వ్యక్తిత్వంతో స్వాతంత్ర్య పోరాటం చేశాడు.

కఠోరమైన బ్రహ్మచర్యము చేసి, సత్యనిష్ఠతో అస్పృశ్యతను నిర్మూలించడము ముఖ్య కార్యక్రమమైంది. గాంధీజీ ఆదేశాల మేరకు సత్యాగ్రహాలు, నిమ్నవర్ణాల వాడలకు వెళ్ళి వారితో కలగలిశారు. నాగరిక ప్రపంచం తెలియని, అమాయక గిరిజనులతో కలిసిపోయారు. త్రాగుడు మాన్పించడం ద్వారా ప్రజల శారీరక, మానసిక, ఆరోగ్య పరిరక్షణకు కూడా ప్రయత్నం చేశారు.

అయితే అల్లూరి శ్రీరామరాజు 1917 నుండి 1922 వరకు గాంధీ మార్గంలో శాంతి సామరస్యలతో సామాన్య తరగతి ప్రజలపై కాకుండా అట్టడుగు వర్ణాలను, అడవి పుత్రులలో నవచైతన్యము, స్వాతంత్ర్య స్ఫూర్తి తీసుకువచ్చిన మహా దేశభక్తుడు.

సత్యంతో కూడిన జ్ఞానమును బోధిస్తూ ఆత్మక్షోభ, నిస్వార్థత, ప్రేమ, దయ, కరుణగుణాలతో సాటివారిని ఆరాధిస్తూ తప్పు మార్గంలో ప్రయాణించే వారిని మంచి మార్గంలో నడిపిస్తూ సమిష్టి శ్రేయోవాదంను ఆచరిస్తూ గ్రామ స్వరాజ్యను పాటిస్తూ ఆర్థిక అసమానతలను తొలగిస్తూ (1922-1924) కాలంలో విప్లవ మార్గాన్ని అనుసరించాడు.

**ముగింపు:**

ఈ విధంగా వ్యాస ప్రక్రియల్లో వ్యాసకర్తలు అల్లూరి వారి వ్యక్తిత్వాన్ని వివరించిన తీరు, వారు అనుసరించిన విధానాలను తేటతెల్లంజేశారు.

# పాదసూచికలు

1. ది ఆంధ్ర హీరో (18.07.1929)
   ది యంగ్ ఇండియా పత్రిక – మద్దూరి అన్నపూర్ణయ్య పుట 2
2. విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు – ఎం.వి.ఆర్. శాస్త్రి పుట 42
3. రక్తాక్ష రారాజు (భారతి పత్రిక 1985) – మొదిలేరి ప్రభాకర్‌రావు పుట 4
4. ॥ ॥ పుట 6
5. ॥ ॥ పుట 7
6. విప్లవ జ్యోతి అల్లూరి సీతారామరాజు – గోపరాజు నారాయణ పుట 1
7. సీతారామరాజు చరిత్రను వెలికి తీయడానికి జరిగిన కృషి
   – సుంకర సత్యనారాయణ పుట 14
8. ॥ ॥ పుట 14
9. ॥ ॥ పుట 15
10. సీతారామరాజు పోరులో రైతాంగ కోణం– గోపరాజు నారాయణరావు
    19 శతాబ్దం ఆర్థిక దృశ్యం – అటు ఇటూ పుట 25
11. అల్లూరి స్మారక చిహ్నాల దుర్దశ – కల్వణ పుట 63
12. ॥ ॥ పుట 64
13. అల్లూరి లేఖలు – రాతలు – నిర్మలనంద పుట 77
14. ॥ ॥ పుట 78
15. ॥ ॥ పుట 78
16. మన్యం పోరాటంలో అమరులైన వారు – ॥ పుట 79
17. ॥ ॥ పుట 80
18. ఒక యోధుడి గురించి – గో.రా. పుట 82
19. ॥ ॥ పుట 83
20. అల్లూరి సీతారామరాజు చరిత్ర – పొన్నలూరి రాధాకృష్ణమూర్తి పుట **I**
21. అల్లూరి సీతారామరాజు – బూదరాజు రాధాకృష్ణ పుట **I, II**
22. అల్లూరి సీతారామరాజు – డా॥ అట్లూరి మురళి పుట 39
23. అల్లూరి సీతారామరాజు నాటకం – పేకేటి శ్రీనివాసరావు పుట 72
    విప్లవ దృక్పథం

# 7. సినిమా - సంగ్రహ పరిచయం

## 7.0:

ఆధునిక కాలంలో సినిమా మాధ్యమనేది అత్యంత శక్తివంతమైంది. ప్రజలపై దీని ప్రభావం ఎక్కువగా ఉంటుంది. అల్లూరి ప్రభావం సమాజానికి అవసరంగా భావించి సినిమాను నిర్మించారు. ఇంకా అనేక సినిమాల్లో, పాటల్లో, సన్నివేశాల్లో ప్రస్తావించి ప్రశంసించడం కనిపిస్తుంది. అలాగే యు. వినాయకరావు రాసిన అల్లూరి సీతారామరాజు అనే సినిమా చరిత్రను, ఆనాటిఆనవాళ్ళు పున్నగం చిన్ననారాయణరావు రాసిన 75 ఏళ్ళ సినిమా చరిత్రకు సంబంధించిన అంశాల్ని ఇందులో పొందుపర్చాను.

## 7.1 సినిమా:

"విప్లవజ్యోతి అల్లూరి సీతారామరాజు చరిత్ర – సినిమా" అనే సినిమా సంచికను యు. వినాయకరావు రాశారు. ఈ సంచికలో అల్లూరి సీతారామరాజు చిత్ర నిర్మాణ విశేషాలే కాకుండా అల్లూరి సీతారామరాజు చరిత్రకు సంబంధించిన వివరాల్ని పొందుపరిచారు. దీని మొదట ముద్రణ మేనెల 2014లో జరిగింది. మొత్తం 80 పుటలు గల ఈ సినిమా సంచిక అల్లూరి సీతారామరాజు సినిమాలోని కీలక సన్నివేశాల్ని, ఫొటోల్ని భద్రపరిచారు.

అంతేకాకుండా "ఆనాటి ఆనవాళ్ళు" అనే ప్రేక్షకాదరణ పొందిన సినిమాల చరిత్రను, సినిమా పరిశ్రమలో చరిత్ర సృష్టించిన సినిమాలు గురించి ఒక ప్రత్యేక సంచికను పులగం చిన్నా నారాయణ రాశారు. ఈ సంచికలో 1931–1985 సంవత్సరాల మధ్య విడుదలైన 75 ఆణిముత్యాల్లాంటి తెలుగు సినిమాల కథా కమామీషుల్ని వివరించారు. ప్రధమ ముద్రణ 2009 ఏప్రిల్‌లో చేశారు. ఈ పుస్తకాన్ని బి. నాగిరెడ్డి, చక్రపాణిల దివ్యస్మృతికి అంకితమిచ్చారు. మొదటి చిత్రం భక్త ప్రహ్లాద మూకీ సినిమా నుండి మొదలుకొని 1985లో విడుదలైన ప్రతిఘటన చిత్రం వరకు 75 ఏళ్ళ సినిమా చరిత్రల్ని వివరించారు.

ఈ గ్రంథం 529 పుటల్లో ఉంది. అల్లూరి సీతారామరాజు చిత్రం గూర్చి 383వ నుండి 392 పుట వరకు అల్లూరి సినిమా చరిత్ర, నిర్మాణాన్ని, నిర్మాణ వ్యయాన్ని గూర్చి, అలాగే పాత్రదారులు, అటవి ప్రాంతం, సినిమాస్కోప్... మొదలైన విషయాల్ని వెల్లడించారు.

## 7.1.1 మొదటిసారి తెలుగు తెరపై చూపిన చిత్రం:

అల్లూరి సీతారామరాజుని తొలిసారిగా తెరపై చూపించిన చిత్రం గూర్చి తెల్పుతూ ఎం.ఎ.వి. పిక్చర్స్ వారి "ఆలుమగలు" (1953). ఇందులో సీతారామరాజు కథని అంతర్నాటకంగా చూపించారు. కొంగర జగ్గయ్య సీతారామరాజు పాత్రని పోషించారు. వెయ్యి అడుగుల నిడివి కలిగిన ఈ అంతర్నాటకం అప్పట్లో ప్రేక్షకుల ప్రశంసల్ని పొంది, ఆ తరువాత 1959లో ఓ గ్రామఫోన్ కంపెనీ సీతారామరాజు చరిత్రను 'ఆరు' భాగాల రికార్డులుగా విడుదల చేసింది. అందులో సీతారామరాజుగా జగ్గయ్య, రూథర్‌ఫర్డ్‌గా గుమ్మడి నటించారు.

ఈ గ్రామఫోన్ రికార్డు సంచలనం సృష్టించాయి. ఎక్కడ విన్నా ఈ రికార్డులే, వాటిని విన్న ఆంధ్రదేశంలోని ప్రతి యువకుని రక్తం ఉద్రేకంతో మరిగేదనే విషయాన్ని తెలియజేశారు.[1]

## 7.1.2 ఎన్టీఆర్ – అల్లూరిపై మక్కువ:

తెల్లదొరలను వణికించిన స్వాతంత్ర్య సమరయోధుడు అల్లూరి సీతారామరాజు. ఆయన చరిత్రని సెల్యులాయిడ్ కావ్యంగా మలచాలని ఎన్టీఆర్ ఎంతో ఉవ్విళ్ళూరుతాడు.

ఆయన నటించిన 'అగ్గిరాముడు' (1954) చిత్రంలో నాజర్ (బుర్రకథదళం) తన బృంద సభ్యులు లక్ష్మీనరసయ్య, రామకోటితో కలసి చెప్పిన సీతారామరాజు బుర్రకథ సన్నివేశం ఉంది.

'శ్రీ విలసిల్లెడి తెలుగుదేశమున జననమంది నాడు ...ఓహోదేవా!'

వినరా ఆంధ్రుడ మన్య సోదరులు వీరగాధ నేడు... అంటూ పదిహేను నిముషాల సేపు సాగే ఆ బుర్రకథలోని సీతారామరాజు పాత్ర ఎన్టీఆర్‌ని ఎంతో ఆకట్టుకుంటుంది. ఆ పాత్ర పోషించాలని అల్లూరి సీతారామరాజు చిత్రాన్ని నిర్మించాలని ఆ క్షణానే అనిపిస్తుందాయనకి.

తన తమ్ముడు త్రివిక్రమరావుతో ఆ చిత్ర నిర్మాణం గురించి చర్చిస్తారు. ఆయన కూడా మద్దతు పలకడంతో 1955లో ఈ సినిమా నిర్మాణానికి సంబంధించిన పనులు మొదలౌతాయి.

అల్లూరి సీతారామరాజు గురించి విస్తృతంగా పరిశోధనలు చేసిన పడాల రామారావుకి చిత్ర బాధ్యతల్ని అప్పగిస్తారు. తర్వాత కళాదర్శకుడు మాదవపెద్ది గోఖలేతో చర్చించి గెటప్ స్కెచ్ తయారు చేయిస్తారు. ఆ ప్రకారం మేకప్ చేయించుకొని స్టిల్స్‌కి దిగుతారు ఎన్టీఆర్. అందరు బాగుందని చెప్పడంతో "జయసింహ" సినిమా తర్వాత విప్లవజ్యోతి అల్లూరి సీతారామరాజు చిత్రం తీయాలని రామారావు నిర్ణయించుకుంటారు.

"1957 జనవరి 17 వాహినీ స్టూడియోలో పడాల రామారావు రాసిన పాటను టి.వి. రాజు సంగీత దర్శకత్వంలో రికార్డు చేశారు. "హరహరహర మహా... ఓంకార నాదాన పొంగరా ఉప్పొంగి ఓ తెలుగు బిడ్డా స్వాతంత్ర్య విప్లవ సమరాంగణాన... అంటూ సాగే ఈ పాటని ఘంటసాల, మాదవపెద్ది సత్యం, పిఠాపురం నాగేశ్వరరావు, ఎమ్మెస్ రామారావు పాడారు."[2]

ఈ సందర్భంగా జరిగిన పాత్రికేయుల సమావేశంలో త్వరలో చిత్ర నిర్మాణం ప్రారంభిస్తానని ఎన్టీఆర్ ప్రకటిస్తారు. ఈ వార్త నందమూరి అభిమానుల్లో ఆనందం కలిగిస్తుంది. మన్నెం వీరుని పాత్రలో తమ అభిమాన కథనాయకుడ్ని ఎప్పుడెప్పుడు చూస్తామా అని ఆసక్తిగా ఎదురు చూసిన వారిలో కృష్ణ కూడా ఉండటం గమనార్హం.

అయితే అప్పటి నుండి ఏదో అవాంతరాలు, అడ్డంకులు వచ్చి ఎప్పటికప్పుడు విప్లవ జ్యోతి అల్లూరి సీతారామరాజు చిత్ర నిర్మాణం వాయిదా పడేది.

తాను అనుకున్నది సాధించే మనస్తత్వం ఎన్టీఆర్‌ది. అయినా ఈ చిత్ర నిర్మాణం విషయంలో మాత్రం ఆయన అనుకున్నది నెరవేరలేకపోతుంది. "విప్లవ జ్యోతి అల్లూరి సీతారామరాజు" చిత్ర నిర్మాణం నెరవేరని కలగానే మిగిలిపోతుంది.

అయితే ఆ పాత్రపై తనకున్న మక్కువ తీర్చుకునేందుకు ఆయన "సర్ధార్ పాపారాయుడు", "మేజర్ చంద్రకాంత్" చిత్రాల్లో కాసేపు ఆ గెటప్‌లో కనిపిస్తాడు.

**కృష్ణ మనసులో కోరిక:**

తొలిసారిగా తెరపై సీతారామరాజుగా కృష్ణ కనిపించిన సినిమా "అసాధ్యుడు". పది సినిమాలు చేశాక కృష్ణ నటించిన పదకొండో చిత్రం అసాధ్యుడు. ఇందులో నృత్య నాటికగా సీతారామరాజు కథని వెయ్యి అడుగుల్లో రూపొందించారు.

ఆయన్ని ఆ గెటప్‌లో చూసి పరవశులైన ప్రేక్షకులెందరో తను విద్యార్థిగా ఉన్నప్పటి నుండి సీతారామరాజు గురించి చేసిన ఆలోచనలకు ఒక రూపంగా "అసాధ్యుడు" చిత్రంలో కృష్ణ పోషించిన ఆ పాత్రని పేర్కొనవచ్చు. పూర్తి స్థాయిలో సినిమా తీయాలనే ఆయన ఆలోచన కార్యరూపం దాల్చడానికి సరిగ్గా ఎనిమిదేళ్ళు పడుతుంది. అసాధ్యుడు చిత్రంలో నటించిన దగ్గర నుండి సీతారామరాజు కథని సినిమాగా తీయాలనే కోరిక కృష్ణలో రోజురోజుకీ పెరగసాగింది.

అయితే ఆయన హీరోగా నిలదొక్కుకుంటున్న తొలిరోజులు కనుక తన మనసులోని భావాల్ని బయట పెట్టేవారు కాదు. బాగా సన్నిహితులైన వారి దగ్గర మాత్రమే ఆ సినిమా గురించే ప్రస్తావించేవారు. తను ఎంత బిజీగా ఉన్నా ఆ సబ్జెక్ట్ గురించి రోజుకొక గంటైనా ఆలోచిస్తుండేవారు.

"మంచి వాళ్ళకు మంచివాడు" చిత్రం షూటింగ్ రాజస్థాన్‌లో జరిగే రోజుల్లో ఓ ఉదయం ఉదయపూర్ నుండి భేల్‌వాడ లొకేషన్‌కి కృష్ణ కారులో వెళుతున్నారు. ఆయనతో పాటు నటుడు ప్రభాకరరెడ్డి, జర్నలిస్ట్ మోహనకుమార్ కూడా ఉన్నారు. మాటల మధ్యలో సీతారామరాజు టాపిక్ తెచ్చారు కృష్ణ. "త్వరలో ఆ సినిమా షూటింగ్ మొదలుపెడదాం. మనం చెప్పుకోదగ్గ తెలుగు వీరుల్లో ఒకరైన ఆయన కథని సినిమాగా తీయాల్సిందే" అని ఆయన గట్టిగా చెప్పడంతో మిగిలిన ఇద్దరు ఆ మాటల్ని సమర్థించారు".[3]

**ఇతర నిర్మాతల అభిప్రాయాలు:**

ఇది జరిగిన కొన్ని రోజులకు సీనియర్ నిర్మాత, దేవదాసుని తెలుగు వారికి దగ్గర చేసిన డి.ఎల్. నారాయణరావుగారు శోభన్‌బాబుని హీరోగా అల్లూరి సీతారామరాజు చిత్రం తీయనున్నట్టు ప్రకటిస్తారు. తన దర్శకత్వంలోనే ఆ సినిమా తీయాలని సుంకర సత్యనారాయణతో స్క్రిప్ట్ తయారు చేయించుకుంటారు.

సరే... ఎవరో ఒకరు తీస్తున్నారు కదా! ఎవరు తీసినా ఆ మహావీరుని చరిత్రను ముందు తరాల వాళ్లు కూడా మననం చేసుకునేటట్లు ఉంటే చాలు అన్నారు కృష్ణ. ఆయన చిత్తశుద్ధికి సీతారామరాజు అంటే ఆయనకు ఉన్న భక్తి ప్రవత్తులకు ఈ సంఘటన చిన్న ఉదాహరణ మాత్రమే. అయితే అనివార్య కారణాల వల్ల డి.ఎల్. నారాయణ ఆ సినిమా తీయలేకపోయారు.

"ఆ తర్వాత జ్యోతి పిక్చర్స్ అధినేత కె.సి. శేఖర్‌బాబు అల్లూరి సీతారామరాజు చిత్రం తీయడానికి ముందుకు వచ్చారు. శేఖర్‌బాబుగారు.. మీరు తీయకపోతే చెప్పండి. నేను తీస్తా అనే వారు వాణీ ఆర్ట్ కంబైన్డ్ అధినేత ఎన్.వి. సుబ్బరాజు. ఇంతమంది నిర్మాతలు ఆ సినిమా తీయడానికి ముందుకు వచ్చినా కథలో కమర్షియల్ అంశాలు లేకపోవడంతో ఆర్థికంగా నష్టపోతామనే భయంతో ఆ సాహసం చేయలేకపోయారు"[4] అనే విషయాన్ని స్పష్టం చేశారు.

## 7.1.3 కృష్ణ సాహసం – అల్లూరితో ముందడుగు:

ఇదంతా గమనించిన కృష్ణ "అల్లూరి సీతరామరాజు" చిత్రాన్ని పద్మాలయ బ్యానర్‌పై నిర్మించాలనే నిర్ణయాన్ని తీసుకుంటారు. ఈ సినిమా వల్ల ఆర్థికంగా, లాభాలు పొందుతామా లేక నష్టపోతామా! అన్నది సమస్య కాదని–

'తెలుగు జాతి పౌరుషాన్ని బ్రిటిషు పాలకులకు చలి చూపించిన ఆ విప్లవ వీరుడు జీవిత కథను చిత్రంగా నిర్మించి మన జాతి గొప్పతనాన్ని ప్రపంచ దేశాలకు చాటాలనేది నా లక్ష్యం' అందుకే ఈ కథని మనమే తీద్దాం అని తన సోదరులు హనుమంతరావు, ఆది శేషగిరిరావుకు చెప్పేశారు. కృష్ణ ఒక నిర్ణయం తీసుకుంటే ఇక దానికి తిరుగుండదు. దానిని అమలు చేసే వరకు విశ్రమించరు. ఆయనకు తగినవారే సోదరులిద్దరూ.

'దేవుడు చేసిన మనుషులు' చిత్రం విడుదల కాగానే అల్లూరి సీతారామరాజు చిత్ర నిర్మాణానికి శ్రీకారం చుట్టారు. ఆరుగురు సభ్యులతో ఒక టీమ్ ఏర్పాటు చేసి సీతారామరాజు తిరిగిన ప్రదేశాలు, మన్యం అడవుల్లో ఎక్కడక్కడ యుద్ధం జరిగిందో ఆ వివరాలన్నీ సేకరించుకు రమ్మని కృష్ణ చెప్పారు.

## 7.1.4 సీతారామరాజుపై పుస్తక సేకరణ:

సీతారామరాజు చరిత్రని చాలామంది రకరకాల పేర్లతో పుస్తకాలుగా రాశారు. అయితే సీతారామరాజు గురించి ఎంతో పరిశోధన చేసి ఎన్నో విషయాల్ని వెలికి తీసి 1922 "మన్యంలో రైతుల తిరుగుబాటు" పేరుతో రాసిన పుస్తకంలో అవన్నీ పొందుపరిచారు పొన్నలూరి రాధాకృష్ణమూర్తిగారు.

అల్లూరి సీతారామరాజు సోదరుడు అల్లూరి సత్యనారాయణ రాజు పి.డబ్ల్యు.డి. శాఖమంత్రిగా ఉన్నప్పుడు ప్రభుత్వం తరుపున ఎర్రమిల్లి నరసింహరావుతో పరిశోధన

చేయించి సీతారామరాజు పేరుతో సమగ్ర గ్రంథం తయారుచేయించారు. ఈ పుస్తకాలన్నీ చదివి కథ తయారు చేసే బాధ్యతని త్రిపురనేని మహారధికి అప్పగిస్తారు కృష్ణ.

సీతారామరాజు కథని సినిమాగా తీసున్నారనే వార్త పరిశ్రమంతా పాకింది. కృష్ణ సాహసానికి పరిశ్రమ నివ్వెరపోతుంది. ఈ విషయమై చర్చలు మొదలౌతాయి. ఇదిలా ఉంటే ఒక రోజు సీనియర్ నిర్మాత డి.ఎల్. నారాయణ కృష్ణ దగ్గరకు వచ్చి తాను తయారు చేయించిన అల్లూరి సీతారామరాజు స్క్రిప్ట్ ఫైలు కృష్ణ చేతిలో పెట్టి తన దర్శకత్వంలో ఈ సినిమా తీస్తానని ఎప్పటి నుండో అంటున్నారు. కానీ ఆ విషయాన్ని ఆయన ఫైనలైజ్ చేయలేదని, ఇప్పుడు మీరు "అల్లూరి సీతారామరాజు" చిత్రాన్ని తీసే ఆలోచనలో ఉన్నారని విని వచ్చాను. ఇంత గొప్ప సినిమా తీయడానికి నా దగ్గర డబ్బు, ఓపిక రెండు లేవు. ఈ స్క్రిప్ట్ మీకు పనికొస్తుందేమో చూడండి" అని చెప్పి వెళ్ళిపోయారు డి.ఎల్.

"హనుమంతరావు దానిని తీసుకొని రచయిత మహారధికి ఆ ఫైలు యిచ్చి పరిశీలించమన్నారు. అందులో ఒకే ఒక్క సన్నివేశం తప్ప మహారధికి మరేదీ నచ్చలేదు. చాలాకాలం నుండి అల్లూరి సీతారామరాజు కథ ఆయన మదిలో మెదులుతోంది. హనుమంతరావు ఆ దేశంపై మహాబలిపురంలోని సీవ్యూ హోటల్‌లో కూర్చొని వన్‌లైన్ ఆర్డర్ తయారు చేశారు మహారధి"[5] అని తెల్పారు.

## 7.1.5 అల్లూరి వేషంపై ఎన్టీఆర్ గెటప్ అనుసరించిన కృష్ణ:

ఒరిజనల్‌గా అల్లూరి సీతారామరాజు ఎప్పుడు కాకీ నిక్కరు, మోచేతుల వరకూ ఉండే ఖద్దరు చొక్కా, భుజాన తుపాకితో ఉండేవాడని, పోలీసు రికార్డులో సమాచారం. అయితే ఎన్టీఆర్ కళాదర్శకుడు మాధవపెద్ది గోఖలే తయారు చేసి గెటప్ వేరే విధంగా ఉంటుంది.

జనం కోసం అన్నీ త్యజించి, సన్యాసిగా మారాడన్న అంశాన్ని దృష్టిలో పెట్టుకొని, రావి పంచె, ఒంటి మీద ఒక అంగ వస్త్రం, మెడలో రుద్రాక్షమాల, చేతిలో విల్లు, భుజాన అంబుల పోది... ఇలా సీతారామరాజు గెటప్ స్కెచ్ తయారు చేస్తారు గోఖలే.

"అసాధ్యుడులో కృష్ణ సీతారామరాజు పాత్ర ధరించినపుడు ఎన్టీఆర్ గెటప్‌నే ఫాలో అయ్యారు. అల్లూరి సీతారామారాజు సినిమాకి దాన్నే అనుసరించారు."[6]

### 7.1.6 సీతారామరాజు షటింగ్ ప్రారంభం:

"అల్లూరి సీతారామరాజు" చిత్రం కృష్ణ 100వ చిత్రం. అందుకే ఈ చిత్రానికి చాలా ప్రత్యేకతలు సంతరించుకున్నాయి.

సీతారామరాజు స్క్రిప్ట్ అంతా పరిశీలించి 45 రోజులు ఏకదాటిగా షూటింగ్ చేస్తేనే సినిమా పూర్తవుతుందనే విషయాన్ని పద్మాలయ వారి చిత్రాలకు ప్రొడక్షన్ ప్లానింగ్ చేసే కృష్ణ రెండో సోదరడు ఆదిశేషగిరిరావు చెప్తారు. దాంతో డిసెంబరు 15 నుండి షూటింగ్ ప్రారంభమవుతుందని 1973 సెప్టెంబరు 22న అధికారికంగా ప్రకటిస్తారు హనుమంతరావు. ఏయే పాత్రలకు ఆర్టిస్టుల ఎవరనుకుంటున్నారో ఒక లిస్టు తయారు చేసి, 75 రోజులు ముందుగానే వాళ్ళ దగ్గర కాల్షీట్లు తీసుకున్నారు.

### 7.1.7 పూర్తిస్థాయిలో సినిమా స్కోప్‌లో మొట్టమొదటి తెలుగు చిత్రం:

తెలుగులో పూర్తిస్థాయిలో అప్పటి వరకు సినిమా స్కోప్ ఏ చిత్రానికీ లేదు. తను తీసే ప్రతి చిత్రానికీ ఏదో ఒక ప్రత్యేకత ఉండాలని ఆశించే వ్యక్తి కృష్ణ. అందుకే అల్లూరి సీతారామరాజు చిత్రాన్ని సినిమా స్కోప్‌లో, కలర్‌లో నిర్మించాలని ఆయన నిర్ణయించుకుంటారు అంతేకాకుండా–

"అంతకుముందు రవిచిత్ర అధినేత వై.వి.రావు తను నిర్మించిన 'ఒకనారి – వంద తుపాకులు' చిత్రంలో పతాక సన్నివేశాలను స్కోప్ కలర్‌లో తీసారు. అయితే తెలుగులో పూర్తిస్థాయిలో సినిమా స్కోప్‌లో కలర్‌లో తయారైన తొలిచిత్రం "అల్లూరి సీతారామరాజు"[7] అనేది స్పష్టం చేశారు.

### 7.1.8 మొదటిషాట్ పాతాళభైరవి ఫ్లోర్‌లో:

వాహిని స్టూడియో ప్రారంభోత్సవానికి వేదిక అవుతుంది. తన శ్రేయోభిలాషి చక్రపాణిని కలిసి ఓపెనింగ్‌కి వచ్చి క్లాప్ కొట్టమని కోరారు కృష్ణ. షూటింగ్ వివరాలు అడిగి తెలుసుకొని స్టూడియోలోని నాలుగో ఫ్లోర్‌లో షూటింగ్ ప్రారంభించు "పాతాళ భైరవి" షూటింగ్ ఆ ఫ్లోర్‌లోనే మొదలు పెట్టాం అని చక్రపాణి చెప్పడమే కాకుండా అందుకోసం అవసరమైన ఏర్పాట్లు కూడా చేస్తారు.

1973 డిసెంబరు 12న అల్లూరి సీతారామరాజు చిత్రం షూటింగ్ మొదలౌతుంది.

వాహినీ స్టూడియోలోని నాలుగోఫ్లోర్‌లో వేసిన సెట్‌లో కాళికాదేవి విగ్రహం ముందు నిల్చున్న కృష్ణపై తొలిషాట్ చిత్రీకరిస్తారు దర్శకుడు వి. రామచంద్రరావు.

అది విప్లవోద్యమానికి తీసుకోవాల్సిన జాగ్రత్తల్ని గూర్చి గిరిజన నాయకులకు సీతారామరాజు వివరించే షాట్. సుదీర్ఘమైన సంభాషణలతో భావోద్వేగాలు కలిగిన 360 డిగ్రీల షాట్ అది. సింగిల్ టేక్‌లో ఓ.కె. చేశారు కృష్ణ ఆ సన్నివేశాన్ని గూర్చి చెబుతూ.

"విజయా" నాగిరెడ్డి కెమెరా స్విచాన్ చేయగా, చక్రపాణి క్లాప్ ఇచ్చారు. ఆ తరువాత కోసరాజు రాసిన "కొండ దేవతా నిన్ను కొలిచేమమ్మా... కోటి కోటి దండాలు ఓలమ్మా" పాట చిత్రీకరణ మొదలైంది. కృష్ణ, చంద్రమోహన్, మంజుల, కాంతారావు, రాజశ్రీ, వందలాది జూనియర్ ఆర్టిస్టులు పాల్గొన్నారు"[8] అనే విషయాన్ని తెలియజేశారు.

### 7.1.9 రచయిత మహారథి తపోదీక్ష:

ఈ చిత్ర రచనకి శ్రీకారం చుడుతున్న తరుణంలోనే రామానాయుడు మహారథిని పిలిచి 'శాంతినికేతన్' నవలతో పాటు మరో నవల యిచ్చి స్క్రిప్ట్ తయారు చేయమని చెప్పారు. అదే సమయంలో అక్కినేని నటించిన 'దొరబాబు' చిత్రానికి కూడా మహారథి మాటలు రాస్తున్నారు. అలాగే ఎన్టీఆర్ నటించే చిత్రాలకు స్క్రిప్ట్ తయారు చేస్తున్నారు.

ఇలా ఒకే సమయంలో ఇన్ని సినిమాలకు వర్క్ చేస్తుండడంతో అల్లూరి సీతారామరాజు చిత్రానికి పూర్తి ఏకాగ్రతతో మాటలు రాయడం కష్టమనిపించింది. ఒకే సారి రెండు పనులు చేస్తే దేనికీ న్యాయం జరగదని భావించి "అల్లూరి సీతారామరాజు నా పేరుని చిరస్థాయిగా నిలిపే చిత్రమవుతుంది. అందుకే ఆ సినిమాకే రచన చేస్తానని గట్టిగా తీర్మానించుకొని మిగిలిన సినిమాలు వదిలేశారు."[9]

ఈ కారణంగా అక్కినేని, ఎన్టీఆర్, రామానాయుడు కూడా సీరియస్ అవుతారు. అప్పటి నుండి మిగిలిన నిర్మాతలకు మహారథికి మధ్య దూరం పెరుగుతూ వచ్చింది. తదేక దీక్షతో పట్టుదలతో ఆయన రాసిన మాటలు ఈ చిత్రానికి ప్రాణంగా నిలిచాయనడంతో ఎలాంటి సందేహం లేదు.

## 7.1.10 సినిమా ముగింపుపై చర్చ:

కథాచర్చల సమయంలో ముగింపు ఎలా ఉండాలన్న విషయం మీద సుదీర్ఘ చర్చ జరుగుతుంది. ఎందుకంటే రామరాజు ఎలా చనిపోయాడన్న దాని గురించి విభిన్న కథనాలు ఉన్నాయి. సుప్రభాత వేళ సంధ్యావందనం చేసుకుంటున్న రామరాజుని బ్రిటిషు సైనికులు చుట్టిముట్టి కాల్చి చంపారన్నది ఒకటైతే, సందికి పిలిచి చంపారన్నది మరో కథనం. అంత ఉద్యమం నడిపిన వ్యక్తి సంధ్యా వందనం చేసుకుంటూ పోలీసులకు దొరికిపోయాడంటే సబబుగా లేదంటారు అలాగే–

"పొన్నాలూరి రాధాకృష్ణమూర్తి సీతారామరాజు గురించి రాసిన పరిశోధన గ్రంథంలో కూడా ఆయన్ని క్యాంప్ ఆఫీసుకి తీసుకెళ్ళి చంపారని ఉండటంతో దాన్నే ప్రామాణికంగా తీసుకున్నారు."[10] అనేది కూడా వ్యక్తమౌతుంది.

## 7.1.11 సంభాషణలో నవీనం – నూతన ఉత్తేజం:

సంభాషణలన్నీ మహారథి ముందే రాయలేదని, షెడ్యూల్‌కి, సీన్లకి అనుగుణంగా రాశారంటారు. స్క్రిప్ట్ అంతా సునాయాసంగానే రాశారు కానీ పతాక సన్నివేశంలో మాత్రం సీతారామరాజుని మేజర్ గూడాల్ కాల్చి చంపే సన్నివేశంలో పలికే డైలాగులు రాయడానికి ఆయనకి రెండు రోజులు పట్టిందంటారు.

'సీతారామరాజు రెండు విభిన్న కోణాలు కలిగిన హీరో. యోగిలాంటి ఒక వ్యక్తి యుద్ధవీరుడు అవడం ప్రపంచ చరిత్రలో ఎక్కడా లేదు. యోగి ఎప్పుడు యుద్ధవీరుడు కాదు. యుద్ధవీరుడు యోగిగా మారడు. ఇవి రెండు ఒక మనిషిలోనే ఉండటం చాలా అరుదైన విషయం'. అటువంటి వ్యక్తి చనిపోయే చివరి క్షణాల్లో ఎలా మాట్లాడతాడన్నది కీలకాంశం. యోగిగా ఏం మాట్లాడతాడు? యుద్ధవీరునిలా ఎలా మాట్లాడతాడు? ఈ రెండూ కలిపి చెప్పడం ఎలా? మరియు దేశభక్తుడు అని మదనపడ్డారు మహారథి.

పొద్దున్నే అడవిలోకి వెళ్ళి కూర్చుంటే సాయంత్రం నాలుగు గంటలకు కాని ఫ్లాష్ వెలగలేదు. అప్పటి వరకు తిండి తిప్పలు లేవు. మహారథి ఎక్కడున్నాడన్న విషయం కూడా ప్రొడక్షన్ వాళ్ళకి తెలీదు. అప్పుడే పుట్టిన డైలాగు...

"ఈ మట్టిలో మట్టినై

ఈ నీటిలో నీటినై
నా ప్రజల ఊపిరిలో ఊపిరినై
మనసుల్లోని భావాన్నై
హృదయాల జ్వాలనై
నా జాతిజనం పాడుకునే సమరగీతాన్నై
సామ్రాజ్యవాద శక్తుల్ని గెలుస్తాను
స్వతంత్ర భారత జయకేతనంగా నిలుస్తాను"[11]

ఈ డైలాగు రాయడానికి మహారధికి రెండు రోజులు పట్టిందనే విషయాన్ని తెల్పారు.

### 7.1.12 ఏజెన్సీ ప్రాంతంలో 38 రోజులు ఏకదాటిగా షూటింగ్:

1973 డిసెంబరు 25 నుండి 1974 జనవరి 31 వరకు ఏకదాటిగా చింతపల్లి, లోతుగడ్డ, వశంపాడు, అన్నవరం (దేవస్థానం కాదు ఏజెన్సీలోనిది) కృష్ణదేవిపేట, బలిమెల ప్రాంతాల్లో షూటింగ్ జరుగుతుంది. కృష్ణ ఒక సినిమా కోసం ఔట్‌డోర్‌లో ఉండి పని చేసిన తొలి సినిమా ఇదే కావడం విశేషం.

పతాక సన్నివేశాల చిత్రీకరణ సమయంలో 400 మంది పోలీసులు అవసరమవుతారు. అప్పట్లో వైజాగ్ ఎస్.పి.గా ఉన్న సత్యనారాయణ రెడ్డి అంతమందిని పంపించడం సాధ్యం కాదని చెప్పడంతో నాటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావుతో మాట్లాడి పోలీసుఫోర్స్ పిలిపించుకున్నారు. కృష్ణ సాహసానికి ఇదొక నిదర్శనం.

### 7.1.13 ఆంగ్లంలో క్రిస్మస్ సాంగ్:

రూథర్‌ఫర్డ్ మీద ఒక పాట ఉంటే బాగుంటుందని ఆలోచించి సంగీత దర్శకుడు శ్రీ ఆదినారాయణరావుతో ఆంగ్లంలో ఒక పాట రాయించారు కృష్ణ.

"హ్యాపీ హ్యాపీ క్రిస్టమస్
మెర్రీ మెర్రీ క్రిస్టమస్..."[12] అంటూ సాగే ఈ పాటని

ఆలిండియా రేడియో పాప్ సింగర్‌గా పేరొందిన "రీటా"తో పాడించారు. 1974 జనవరి 1న విజయగార్డెన్స్‌లో రికార్డు చేసిన ఈ పాటని జగ్గయ్య, బెంగాలీనటి నందితా బోస్‌పై చిత్రీకరిస్తారు.

## 7.1.14 తొలిసారిగా తెలుగుపాటకు జాతీయ అవార్డు:

ఈ సినిమాలో మన్యం ప్రజల తిరుగుబాటుని ప్రేరేపిస్తూ రామరాజు పాడే మార్చింగ్ సాంగ్‌ని శ్రీశ్రీతో రాయించారు. ఈ పాటను ఘంటసాల, రామకృష్ణ పాడారు.

"పల్లవి: తెలుగు వీర లేవరా – దీక్షబూని సాగరా
దేశమాత స్వేచ్ఛ కోరి – తిరుగుబాటు చేయరా! ॥తెలుగు॥

చరణం: దారుణ మరణకాండకు తల్లడిల్లవద్దురా
నీతి లేని శాసనాలు నేటి నుండి రద్దురా
నిదుర వద్దు బెదరవద్దు – నింగి నీకు హద్దురా ॥తెలుగు॥

చరణం–2 ఎవడువాడు, ఎచటివాడు – యిటు వచ్చిన తెల్లవాడు
కండబలం, కొండఫలం – కబళించే దుండగీడు
మానధనం, ప్రాణధనం – దోచుకునే దొంగవాడు
తగినశాస్తి చెయ్యారా – తరిమి తరిమి కొట్టరా ॥తెలుగు॥

చరణం 3: ఈ దేశం – ఈ రాజ్యం – నాకే అని చాటించి
ప్రతి మనిషి తొడలగొట్టి – శృంఖలాలు పగులగొట్టి
చురకత్తులు పదును పట్టి – తుది సమరం మొదలుపెట్టి
సింహంలా గర్జించాలే – సంహారం సాగించాలి
వందేమాతరం – వందేమాతరం

ఓ... స్వాతంత్ర్య వీరుడా – స్వరాజ్యభానుడా
అల్లూరి సీతారామరాజా
అందుకో మాపూజలందుకో రాజా – అల్లూరి సీతారామరాజా!
తెల్లవాడి గుండెల్లో నిదురించిన వాడా!
మా నిదురించిన పౌరుషాగ్ని రగిలించినవాడా!
త్యాగాలే వరిస్తాం – కష్టాలే భరిస్తాం
నిశ్చయముగ, నిర్భయముగా నీవెంటనే నడుస్తాం"[13]

అంటూ సాగే పాటని ఘంటసాలతో పాడించాలని కృష్ణ ముందే నిర్ణయించుకున్నారు.

అప్పటికే ఘంటసాల ఆరోగ్యం బాగా క్షీణిస్తుంది. పాటలు పాడటం తగ్గించారు. ఆయన ఇంటికి వెళ్ళి "ఆ పాట మీరే పాడాలి" అందుకోసం ఎన్ని నెలలు ఆగమన్నా ఆగుతాము" అని కృష్ణ చెప్తారు. ఆ మాట విని ఘంటసాల ఎంతో సంతోషిస్తారు.

కాస్త స్వస్థత తగ్గగానే 1973 నవంబరు 15న ఘంటసాల విజయాగార్డెన్స్‌కు వచ్చి ఆ పాటని అద్భుతంగా పాడారు. ఆ పాటకి జాతీయ అవార్డు కూడా లభించింది. ఒక తెలుగు సినిమా పాటకి జాతీయ స్థాయిలో అవార్డు రావడం ఇదే ప్రథమం. నాటి రాష్ట్రపతి "జాకీర్ హుస్సేన్" చేతులు మీదుగా అవార్డు అందుకున్నారు శ్రీశ్రీ. కృష్ణకు "తెలుగువీరలేవరా' పాట ఎంత ఇష్టమంటే తన 300వ చిత్రానికి అదే టైటిల్ పెట్టారు.

## 7.1.15 జర్మనీ యూనివర్శిటీలో సీతారామరాజు పాట:

జర్మనీలోని హోంబాల్ద్ యూనివర్శిటికి 1983–1984 ప్రాంతంలో తెలుగు విద్యార్థులు కొంతమంది వెళ్లారు. ఆంధ్రప్రదేశ్ ప్రాంతానికి సంబంధించి ఏదన్నా దేశభక్తి గీతాన్ని సూచించమని యూనివర్శిటి అధికారులు కోరినపుడు అల్లూరి సీతారామరాజు సినిమాలోని–

"రగిలిందీ విప్లవాగ్ని ఈ రోజు
ఆ అగ్నిపేరు అల్లూరి సీతారామరాజు
తనువులోన అణువణువూ తరతరాల పోరాటం
తన రూపే దాల్చిందీ, ఝూన్సీ రాణీ తరవాలం
జిలియన్ వాలాబాగున జరిగిన మారణకాండ
తలచి ఎగురవేశాడు తిరుగుబాటు జెండా ॥రగిలింది॥

కన్నెంగటి హనుమంతు వెన్నులోని బాకు
కత్తిగట్టి సాగమంది కడవిజయం వరకు
ఎలుగెత్తెను ఆ కంఠం మనదే రాజ్యం
జపియించెను ఆ వదనం 'వందేమాతరం'
వందేమాతరమంటూ నినదించిన బంగాళం
స్వరాజ్యమ్ము జన్మహక్కని చాటిన మహారాష్ట్రం
హింసకు ప్రతిహింస అన్న వీరభూమి పాంబాలం

అన్నిటికీ నెలవాయెను ఆంధ్రవీర హృదయం
రామరాజు హృదయం..."14

అనే పాటని ప్రతిపాదించారు ఆ విద్యార్థులు, యూనివర్శిటీ అధికారులు ఆ పాట రికార్డ్‌ని సేకరించి యూనివర్శిటీ లైబ్రరిలో భద్రపరిచిన సంగతిని కూడా తెలియజేశారు.

**7.1.16 హిందీలో డబ్బింగ్:**

"ఇంక్విలాబ్ జిందాబాద్" పేరుతో ఈ చిత్రాన్ని హిందీలోకి డబ్బింగ్ చేయించారు. అక్కడ కూడా ప్రేక్షకాదరణ పొందుతుంది. రాష్ట్ర ప్రభుత్వంనుండి బంగారు నందిని కూడా పొందిన ఈ చిత్రం కృష్ణ కెరీర్‌లో ఒక సువర్ణ అధ్యాయంగా నిలిచింది. ఇప్పటికి ఆగష్టు 15, జనవరి 26 వస్తే ఏదో ఒక ఛానల్‌లో అల్లూరి సీతారామరాజు సినిమా తప్పనిసరిగా ప్రదర్శిస్తారనేది అక్షరసత్యం.

# పాదసూచికలు

| | | | |
|---|---|---|---|
| 1. | విప్లవజ్యోతి అల్లూరి సీతారామరాజు చరిత్ర – సినిమా | – యు. వినాయక్ రావు | పుట 28 |
| 2. | " | " | పుట 29 |
| 3. | " | " | పుట 30 |
| 4. | " | " | పుట 30 |
| 5. | " | " | పుట 31 |
| 6. | " | " | పుట 31 |
| 7. | " | " | పుట 33 |
| 8. | " | " | పుట 35 |
| 9. | " | " | పుట 40 |
| 10. | " | " | పుట 42 |
| 11. | " | " | పుట 42 |
| 12. | " | " | పుట 44 |
| 13. | " | " | పుట 46 |
| 14. | " | " | పుట 48 |

# ముగింపు

ఒక్క అల్లూరి సీతారామరాజుపైనే ఏడు ప్రక్రియల్లో 25కు పైగా వచ్చిన రచనల్ని ఈ పరిశోధనలో చోటు చేసుకున్నాయి. వీటన్నింటని నిశితంగా పరిశీలించిన తర్వాత అనేక విషయాలు మనకు తేటతెల్లమౌతాయి.

1. సీతారామరాజుగా ప్రాచుర్యం పొందినా, ఆయన అసలు పేరు శ్రీరామరాజుగా తెలుస్తుంది.
2. శ్రీరామరాజు జీవితంలో సీత అనే ప్రేమికురాలు లేదు.
3. శ్రీరామరాజు అచంచలమైన దేశభక్తుడు. పరాయిపాలనా పీడను వదిలించడానికి కంకణం కట్టుకున్నాడు.
4. ఆయన ఉద్యమానికి ఆదివాసీలు అందించిన అండదండలు అమోఘం.
5. సామాజిక అసమానతలు నేటికి కొనసాగుతున్న ఈ సమాజానికి అల్లూరి భావజాలం అత్యంత అవసరం.
6. అల్లూరి ఇతివృత్తాన్నే ఇంతమంది రచయితలు స్వీకరించి సాహిత్యాన్ని సృష్టించడం వారి యొక్క సామాజిక నిబద్ధతకు తార్కాణం.
7. తెలుగువారి సాహసానికి నిలువెత్తు నిదర్శనం శ్రీరామరాజు.

ఈ విధంగా ఆయా కవులు వ్యక్తీకరించిన ప్రధానమైన భావాలు, వాటి ఆవశ్యకత నేటితరం వారిని స్ఫూర్తిదాయకంగా తీసుకోవాలనే భావన వ్యక్తమౌతుంది.

# ఉపయుక్త గ్రంథ సూచి


| | | | |
|---|---|---|---|
| 1. అల్లూరి సీతారామరాజు నాటకం | మధురశ్రీ (కె. వీర్రాజు) | ప్రజా ప్రచురణలు, ఏలూరు | 1967 |
| 2. ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు | కె.కె. రంగనాధాచార్యులు | ఆంధ్ర సారస్వత పరిషత్ హైదరాబాద్ | 1982 |
| 3. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం | మద్దూరి సుబ్బారెడ్డి | రాగసుధ ప్రచురణలు, తిరుపతి | 1982 |
| 4. తెలుగులో చిత్రకవిత్వం | డా॥ ధర్మేశ్వరరావు | శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజస్, గవర్నర్‌పేట, విజయవాడ-2. | |
| 5. తెలుగు సాహిత్య చరిత్ర | ప్రొ॥ వెలమల సిమ్మన్న | దళిత సాహిత్య పీఠం విశాఖపట్నం | 2011 |
| 6. తెలుగు వ్యాస పరిణామం | కొలకలూరి ఇనాక్ | విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్. | 2001 |
| 7. తెలుగు సాహిత్య విమర్శ సిద్ధాంతాలు | ప్రొ॥ వెలమల సిమ్మన్న | దళిత సాహిత్యపేట, విశాఖపట్నం. | 2005 |
| 8. తెలుగు వాక్యం | చేకూరి రామారావు | కావ్య ప్రచురణ, సికింద్రాబాద్ | 1975 |
| 9. తెలుగులో కవిత్వోద్యమాలు | ఆచార్య కె. యాదగిరి | తెలుగు అకాడమీ, హైదరాబాద్ | 2003 |
| 10. తెలుగులో సాహిత్య విమర్శ - అవతరణ - వికాశము | ఎస్.వి. రామారావు | స్వయం ప్రభ పబ్లికేషన్స్, హైదరాబాద్ | 2014 |
| 11. దళిత సాహిత్య వ్యాసావళి | ఆచార్య కొండపల్లి సుదర్శనరాజు | దళిత సాహిత్య పీఠం, విశాఖపట్నం | 2016 |

| | | | |
|---|---|---|---|
| 12. భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర | కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం | విజయవాడ-2 | 1984 |
| 13. భారతదేశ స్వాతంత్రోద్యమ చరిత్ర (1958-47) | డా॥ అల్లాడి వైదేహి | 3-6-6ఎ బషీరాబాద్, హైదరాబాద్ | |
| 14. మన్య విప్లవం | పినపోతు ఆదిమూర్తివర్మ | ఆంధ్రవీర పబ్లికేషన్స్, రవీంద్రనగర్ తురంగ పోస్ట్, కాకినాడ-2 | 1982 |
| 15. విప్లవ జ్యోతి (నాటకం) | విజయకృష్ణ | నవయుగ పబ్లికేషన్స్ విజయవాడ-2 | 1988 |
| 16. వీరరసం | గూడ వెంకట సుబ్రహ్మణ్యం | అజంతా ప్రింటర్స్, సికింద్రాబాద్ | 1961 |
| 17. శ్రీ అల్లూరి సీతారామరాజు గారి జీవిత చరిత్ర | దాలినాయుడు | కృష్ణదేవిపేట, విశాఖజిల్లా. | |
| 18. సుహితాక్షరం, సాహిత్య వ్యాసాలు | ఆచార్య కొండపల్లి సుదర్శనరాజు | దళిత సాహిత్య పీఠం, విశాఖపట్నం | 2015 |
| 19. స్వాతంత్ర్య యోధుడు అల్లూరి సీతారామరాజు | బూరెల సత్యన్నారాయణ రాజు | లక్ష్మీనారాయణ బుక్‌డిపో, రాజమండ్రి | 1984 |

**వ్యాసాలు:**

| | | | |
|---|---|---|---|
| 20. అల్లూరి సీతారామరాజుతో ఇంటర్వ్యూ (1923 ఏప్రిల్ 17న అన్నవరంలో) | | ప్రజాసహిత పత్రిక | 1985 |
| 21. అల్లూరి సీతారామరాజు | యర్రమిల్లి నరసింహరావు | స్వాతిసపరివార పత్రిక | 1990 |
| 22. అల్లూరికి వారసుడు | అరుణతారలలోని సంపాదకీయం | | 1988 |
| 23. అల్లూరి సీతారామరాజు | డా॥ బోగరాజు పట్టాభిసీతారామయ్య | ఆంధ్రభారతి పత్రిక | 1928 |
| 24. శ్రీరామరాజు ప్రశంస | డా॥ మద్దూరి అన్నపూర్ణయ్య | ఆంధ్రభారతి పత్రిక | 1928 |

| | | | |
|---|---|---|---|
| 25. శ్రీ అల్లూరి సీతారామరాజు | కలగూర గంప | భారతి పత్రిక | 1968 |
| 26. శ్రీ అల్లూరి సీతారామరాజు | కొడాలి లక్ష్మీనారాయణ | ఆంధ్రజ్యోతి | 1965 |
| 27. మాగ్రొమొక్కు | బమిటిపాటి సత్యనారాయణ | శారదా ప్రెస్ | 1922 |
| 28. జాతి జ్యోతి రామరాజు ఎందరో మహానుభావులు | కొండవీటి శ్రీనాధ్ | ఆంధ్రపత్రిక | 1987 |
| 29. తెలుగుదేశంలో స్వాతంత్ర్య యోధులు | గుడివాడ జయరాం | ఆంధ్రనగారా పక్షపత్రిక | 1985 |
| 30. ప్రప్రధమ స్వాతంత్ర్య సంగ్రామం ఒక సమీక్ష | డా॥ కె.ఎన్. పనిక్కర్ | తెలుగు విద్యార్థి పత్రిక | 1989 |
| 31. విశాఖ మన్యం ప్రాంతలో ప్రజల పరిస్థితి | శ్రీ పతంగి శంకర్ | విశాలాంధ్ర పత్రిక | 1990 |

# తెలుగు సాహిత్యంలో అల్లూరి సీతారామరాజు


పరిశోధన

**పేకేటి శ్రీనివాసరావు**

ఎం.ఏ., టి.పి.టి.






ఉప పర్యవేక్షణ

**ఆచార్య జర్రా అప్పారావు**

ఎం.కామ్., ఎం.ఎ., ఎం.ఫిల్., పిహెచ్.డి.

తెలుగుశాఖ

ఆంధ్ర విశ్వవిద్యాలయం

విశాఖపట్నం - 530 003

పర్యవేక్షణ

**ఆచార్య కొండపల్లి సుదర్శనరాజు**

ఎం.ఏ., ఎమ్.ఫిల్., పిహెచ్.డి.

తెలుగుశాఖ

ఆంధ్ర విశ్వవిద్యాలయం

విశాఖపట్నం - 530 003



**పిహెచ్.డి. పట్టా కోసం ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు**

**సమర్పించిన సిద్ధాంత గ్రంథం**

**ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, విశాఖపట్నం**

**2018**

# విషయ సూచిక

# ఉపయుక్త గ్రంథ సూచి


| | | | |
|---|---|---|---|
| 1. అల్లూరి సీతారామరాజు నాటకం | మధురశ్రీ (కె. వీర్రాజు) | ప్రజా ప్రచురణలు, ఏలూరు | 1967 |
| 2. ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు | కె.కె. రంగనాథాచార్యులు | ఆంధ్ర సారస్వత పరిషత్ హైదరాబాద్ | 1982 |
| 3. తెలుగులో జాతీయోధ్యమ కవిత్వం | మద్దూరి సుబ్బారెడ్డి | రాగసుధ ప్రచురణలు, తిరుపతి | 1982 |
| 4. తెలుగులో చిత్రకవిత్వం | డా॥ ధర్మేశ్వరరావు | శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజస్, గవర్నర్‌పేట, విజయవాడ-2. | |
| 5. తెలుగు సాహిత్య చరిత్ర | ప్రొ॥ వెలమల సిమ్మన్న | దళిత సాహిత్య పీఠం విశాఖపట్నం | 2011 |
| 6. తెలుగు వ్యాస పరిణామం | కొలకలూరి ఇనాక్ | విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్. | 2001 |
| 7. తెలుగు సాహిత్య విమర్శ సిద్ధాంతాలు | ప్రొ॥ వెలమల సిమ్మన్న | దళిత సాహిత్యపేట, విశాఖపట్నం. | 2005 |
| 8. తెలుగు వాక్యం | చేకూరి రామారావు | కావ్య ప్రచురణ, సికింద్రాబాద్ | 1975 |
| 9. తెలుగులో కవిత్వోద్యమాలు | ఆచార్య కె. యాదగిరి | తెలుగు అకాడమీ, హైదరాబాద్ | 2003 |
| 10. తెలుగులో సాహిత్య విమర్శ – అవతరణ – వికాశము | ఎస్.వి. రామారావు | స్వయం ప్రభ పబ్లికేషన్స్, హైదరాబాద్ | 2014 |
| 11. దళిత సాహిత్య వ్యాసావళి | ఆచార్య కొండపల్లి సుదర్శనరాజు | దళిత సాహిత్య పీఠం, విశాఖపట్నం | 2016 |

| | | | |
|---|---|---|---|
| 12. భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర | కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం | విజయవాడ-2 | 1984 |
| 13. భారతదేశ స్వాతంత్రోద్యమ చరిత్ర (1958-47) | డా॥ అల్లాడి వైదేహి | 3-6-6ఎ బషీరాబాద్, హైదరాబాద్ | |
| 14. మన్య విప్లవం | పినపోతు ఆదిమూర్తివర్మ | ఆంధ్రవీర పబ్లికేషన్స్, రవీంద్రనగర్ తురంగ పోస్ట్, కాకినాడ-2 | 1982 |
| 15. విప్లవ జ్యోతి (నాటకం) | విజయకృష్ణ | నవయుగ పబ్లికేషన్స్ విజయవాడ-2 | 1988 |
| 16. వీరరసం | గూడ వెంకట సుబ్రహ్మణ్యం | అజంతా ప్రింటర్స్, సికింద్రాబాద్ | 1961 |
| 17. శ్రీ అల్లూరి సీతారామరాజు గారి జీవిత చరిత్ర | దాలినాయుడు | కృష్ణదేవిపేట, విశాఖజిల్లా. | |
| 18. సుహితాక్షరం, సాహిత్య వ్యాసాలు | ఆచార్య కొండపల్లి సుదర్శనరాజు | దళిత సాహిత్య పీఠం, విశాఖపట్నం | 2015 |
| 19. స్వాతంత్ర్య యోధుడు అల్లూరి సీతారామరాజు | బూరెల సత్యన్నారాయణ రాజు | లక్ష్మీనారాయణ బుక్‌డిపో, రాజమండ్రి | 1984 |

**వ్యాసాలు:**

| | | | |
|---|---|---|---|
| 20. అల్లూరి సీతారామరాజుతో ఇంటర్వ్యూ (1923 ఏప్రిల్ 17న అన్నవరంలో) | | ప్రజాసహిత పత్రిక | 1985 |
| 21. అల్లూరి సీతారామరాజు | యర్రమిల్లి నరసింహరావు | స్వాతిసపరివార పత్రిక | 1990 |
| 22. అల్లూరికి వారసుడు | అరుణతారలలోని సంపాదకీయం | | 1988 |
| 23. అల్లూరి సీతారామరాజు | డా॥ బోగరాజు పట్టాభిసీతారామయ్య | ఆంధ్రభారతి పత్రిక | 1928 |
| 24. శ్రీరామరాజు ప్రశంస | డా॥ మద్దూరి అన్నపూర్ణయ్య | ఆంధ్రభారతి పత్రిక | 1928 |

| | | | |
|---|---|---|---|
| 25. శ్రీ అల్లూరి సీతారామరాజు | కలగూర గంప | భారతి పత్రిక | 1968 |
| 26. శ్రీ అల్లూరి సీతారామరాజు | కొడాలి లక్ష్మీనారాయణ | ఆంధ్రజ్యోతి | 1965 |
| 27. మాద్రొమెక్కు | బమిటిపాటి సత్యనారాయణ | శారదా ప్రెస్ | 1922 |
| 28. జాతి జ్యోతి రామరాజు ఎందరో మహానుభావులు | కొండవీటి శ్రీనాధ్ | ఆంధ్రపత్రిక | 1987 |
| 29. తెలుగుదేశంలో స్వాతంత్ర్య యోధులు | గుడివాడ జయరాం | ఆంధ్రనగారా పక్షపత్రిక | 1985 |
| 30. ప్రప్రధమ స్వాతంత్ర్య సంగ్రామం ఒక సమీక్ష | డా॥ కె.ఎన్. పనిక్కర్ | తెలుగు విద్యార్థి పత్రిక | 1989 |
| 31. విశాఖ మన్యం ప్రాంతలో ప్రజల పరిస్థితి | శ్రీ పతంగి శంకర్ | విశాలాంధ్ర పత్రిక | 1990 |